# సారస్వత వ్యాసములు

## ప్రథమ సంపుటము



సంకలన కర్త

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం, ఎం. ఏ., పి హెచ్. డి.,

రీడర్, తెలుగు డిపార్ట్ మెంట్, హైదరాబాదు యూనివర్సిటీ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు,

హైదరాబాదు-4

SARASWATHA VYASAMULU — First Volume
(A Collection of Literary Essays)
Edited by Dr. G. V. Subrahmanyam, M. A., Ph. D.
Reader, Telugu Department, Hyderabad University, Hyd-1 A P.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004.

ప్రచురణ : 308

ప్రథమ ముద్రణ : 1969
ద్వితీయ ముద్రణ : 1981



ప్రతులు : 1000

వెల : రూ 12-50

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

ముద్రణ :
ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్,
అబిడ్ సర్కిల్, హైదరాబాదు-500 001.

Paper used partly for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# ద్వితీయ ముద్రణకు తొలిపలుకు

1969లో డా. జి.వి. సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వంలో అకాడమీ ప్రచురించిన 'సారస్వత వ్యాసములు' మొదటి సంపుటి ప్రతులన్నిటినీ పఠితృలోకం సమాదరించి సొంతం చేసుకున్నది. డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారు కడు జాగరూకతతో, విమర్శనాదృక్పథంతో, సాహిత్య సమీక్షా పరిజ్ఞానంతో, సగసహృదయంతో సేకరించి అందించిన ఈ వ్యాసాలు పాఠకులకు, పరిశోధకులకు, పండితులకు, జిజ్ఞాసువులకు ఎంతో ఉపకరించినవి. వీటిని తిరిగి ముద్రించవలసిన అవసరం ఉందని అకాడమీ కార్యవర్గంవారు నిర్ణయించినారు. ఆ నిర్ణయానికి ఫలితమే ఈ సంపుటి.

తొలిముద్రణకు వ్రాసిన పీఠికలో డా. సుబ్రహ్మణ్యంగారు వ్యాసంఅనే ప్రక్రియను పలుకోణాలతో పరిశీలించడమే కాకుండా తెలుగు సాహిత్యంలో వెలసిన విమర్శా సాహిత్యలక్షణాలతో పరిచయం కలిగించినారు. ఈ మలి ముద్రణప్రారంభంలో డా. సుబ్రహ్మణ్యంగారు నమంతకు తామే మరొక పీఠికను సమకూర్చి ఈ సంపుటి విలువను అధికం చేసినారు. ఈ పీఠిక భాగంలో తెలుగు కవులసాహిత్య ప్రస్థానాలను గూర్చి మౌలికమైన చర్చచేసి ఒక కొత్త వ్యాసాన్ని అందించి, ఒక కొత్త ఆలోచనా ఫణితిని ప్రదర్శించినారు.

ప్రాచీన కవుల మర్యాదలనూ, ప్రబంధ కవుల ప్రయోగాలనూ సాహిత్య శాస్త్రాలోచనంతో చూసి వ్రాసిన వ్యాసమిది. ప్రాచీనాంధ్ర సాహిత్యం సాధించిన సిద్ధులను, వికాస దశలను అలంకారిక దృక్పథంతో విశ్లేషించినారు.

ఈ సంపుటిని ఇంత సఫలంగా సిద్ధంచేసి, రసదృష్టినీ, పరిశోధనా పాటవాన్నీ పరిమళిస్తున్న రెండు పీఠికలను సంతరించి అందించిన డా. జి.వి. సుబ్రహ్మణ్యంగారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కృతజ్ఞతలను తెలుపుకుంటున్నది.

హైదరాబాదు
16-7-1981

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి.

# తొలిపలుకు

19వ శతాబ్ది చరమభాగమున ఆంగ్లభాషా సాహిత్య ప్రభావ మొకవైపు నుండియు, ముద్రణ యంత్ర సౌకర్య మొకవైపునుండియు నాంధ్రదేశ సాహిత్య జీవితమున కొక నూతన చైతన్యమును కలిగించినవి. నూత్న సాహిత్యశాఖలు క్రొత్తచిగుళ్ళు తొడుగుచున్న తరుణమునసే స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానము, భాషాభిమానము మొదలగు ఉజ్జ్వల సాంఘిక భావములు సారస్వత రంగమున కాలుపెట్టినవి. వానిని సత్వరముగా సాహిత్యపరులలోను, సామాజికులలోను వ్యాప్తి చెందించుటకై పత్రికలు పుట్టి నడుముకట్టినవి. సాహిత్యము జీవితాంతర్భాగ మను చైతన్యమును ముక్కోటి తెలుగువారిలో నుత్పాదించినవి సాహిత్య పత్రికలు. పత్రికల చలువ పందిళ్ళలో ఆంధ్రభారతి నిత్య నూతన శోభా విలాసములు వెలార్చి తెలుగుబిడ్డలమన్ననలందుకొనినది.

పత్రికలలో దినపత్రికలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాస పత్రికలు, త్రైమాసిక పత్రికలు, ఉగాది సంచికలు — ఇట్లు ఎన్నియో భేదములు కలవు. వీనిలో సాహిత్య పత్రికల కొక ప్రత్యేకత కలదు. అందులో కొన్ని వెలుగుచూడని సాహిత్య గ్రంథములను వెలికిదెచ్చినవి; కొన్ని పూడిపోయిన శిలాశాసనములకు పునర్జన్మ కల్పించినవి; కొన్ని క్రొత్తగా గొంతెత్తి కావ్యగీతము లాలపించెడి కవికోకిలలకు నూత్న వసంతము కల్పించినవి; కొన్ని ప్రాచీన భాషా సాహిత్య మర్యాదలకు ప్రాణముపోసినవి; కొన్ని అభ్యుదయ మార్గమున శంఖము లూరించినవి; ఇవి యన్నియు వాదములకు రంగస్థలములైనను సత్యాన్వేషణమునకు కూడ నాందీ వాక్యము పలికినవి. ఆ యా పత్రికల వెనుక పరిషత్తుల వంటి వ్యక్తులు, పారావారములవంటి మేధావులు, దిగ్దంతులవంటి పండితులు నిలువఁబడి నవ్యాంధ్ర సారస్వత సౌధ నిర్మాణమునకు పునాదులు కట్టినారు. రూపురేఖలు దిద్దినారు. అట్టి మహోజ్జ్వల అధ్యాయములకు ప్రతిబింబములైన పత్రికల ప్రాతసంపుటము లిప్పుడు మనకందుబాటులో లేవు. వానిలోని విజ్ఞాన నిధులు విద్యార్థులకే కాక విద్వాంసులకుకూడ ఉపకారకములు కాగలవు.

ఇట్టి యభిప్రాయముతో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ గత సంవత్సరము ఆంధ్ర సాహిత్య పత్రికల సంపుటములలో ప్రచురితములైన ప్రఖ్యాత సాహిత్యవేత్తల వ్యాసములను విషయ ప్రధాన దృష్టితో నెన్నిక చేయించి 'సారస్వత వ్యాసము' లను పేర రెండు సంపుటములుగా ప్రచురింపవలెనని నిర్ణయము కావించినది. ఈ సంపుటముల వలన 19వ శతాబ్ద్యుత్తరార్ధము నందును, ఇరువదియవ శతాబ్ది పూర్వార్ధమునందును జరిగిన తెలుఁగు సారస్వత విమర్శ స్వరూప స్వభావములు, భావ పరిణామము మొ॥ నంశములు స్థాలీ పులాకన్యాయముగనైనను తెలిసికొనుటకు వీలుండునని అకాడమీ వారి భావము.

ఈ కార్యక్రమము క్రింద 'సారస్వత వ్యాసములు' ప్రథమ సంపుటములో — 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ), శారద, ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు, భారతి' — అను సాహిత్య పత్రికలనుండి వ్యాసముల నెన్నికచేసి సంపాదకత్వము నిర్వహింప వలసినదిగా డా. జి. వి. సుబ్రహ్మణ్యముగారిని. దానిపై పర్యవేక్షణము సల్పుటకు డా. దివాకర్ల వేంకటావధానిగారిని కోరుటయైనది. అట్లే ద్వితీయ సంపుటములో 'అముద్రిత గ్రంథ చింతామణి', 'గ్రంథాలయ సర్వస్వము', 'తెలుఁగు', 'సారస్వత సర్వస్వము', 'ప్రతిభ', 'సుజాత', 'కిన్నెర' - పత్రికలనుండి వ్యాసముల నెన్నికచేసి సంపాదకత్వము నిర్వహింప వలసినదిగా శ్రీ పురిపండ అప్పలస్వామిగారిని. వారికీ కార్యమున తోడ్పడుటకై డా. తూమాటి దోణప్పగారిని కోరుటయైనది

పైని పేర్కొనబడిన సాహిత్య పత్రికల సంపాదకులకు, ప్రచురణ కర్తలకు, పై సంపుటములలో ప్రచురింపబడు వ్యాసముల రచయితలకు కృతజ్ఞతలు చెప్పుట అకాడమీ ప్రథమ కర్తవ్యము. సకాలమున ఈ సంపుటమును సిద్ధముచేసి యిచ్చిన డాక్టరు జి. వి. సుబ్రహ్మణ్యముగారికిని, పర్యవేక్షణము చేసిన డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారికిని, మా ధన్యవాదములు. ఆంధ్ర పాఠక జనులు మా ప్రయత్నమును సహృదయముతో గ్రహింపగలరని విశ్వసించు చున్నాను.

హైదరాబాదు
15-4-1969

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పీఠిక

## 1

సుమదామ సంగ్రథన శిల్పము వంటిది సంకలన గ్రంథ సంపాదకత్వము. కంటి కింపయిన రంగుల నేర్చి కూర్చి సౌగంధ్య సంవాసితమైన మనోహరా కృతిని మలచుటయే యా కళలోని కౌశల్యము. సర్వభాషా సాహిత్యములయందు వైవిధ్యముగాని వైశిష్ట్యముగాని గల సాహిత్య ప్రక్రియలలో సంకలన గ్రంథములు వెలయుట పరిపాటియే. వెలసి సహృదయుల చిత్తముల నలరించుటయే కాక నూత్న సాహిత్యోద్యమ చైతన్యముల వంటి సారస్వత ప్రయోజనములు సాధించుటయు కలదు।

ఇది కవితా సంకలనము కాదు. సారస్వత వ్యాస సంకలనము. సద్యః పర నిర్వృతిని గలిగించు కావ్యకదంబము ద్రాక్షా గుళుచ్ఛమువలె రస ప్రస్రవమై స్వాదువై రాణించును. వ్యాసములు కావ్యముల వంటివి కావు. వానిలో నెడద పాలెంత యుండునో మెదడు పాలంత యుండును. బుద్ధిని వికసింపఁ జేయు వివేకమును మనసును కదలించునట్లు చెప్పునవి సాహిత్య వ్యాసములు. అట్టివాని సంపుటి కదళీ గుళుచ్ఛము వంటిది. విమర్శయను మేలిముసుఁగు తొలగించినచోఁ బ్రత్యక్షమగునది సరసమైన సాహిత్య తాత్పర్యము. పఠిత మనోరసన కది మకరంద తుల్యము.

సాహిత్య విమర్శన మెంత శాస్త్రమో అంత కళ। "....Criticism is at once a science and an art. As a science, it involves examination of particular works, observation of their faults and excellences, and (insofar as may be) the induction of general principles. As an art, it engages in the production of stimulating works-" అని విమర్శయొక్క ద్వంద్వ రూప సార్థక్యమును సంభావించినాఁడు జోసఫ్ టి. షిప్లే.

విమర్శ చేయువాఁడు విమర్శకుఁడు. విమర్శ శబ్దము 'వి' యను నుపసర్గతోఁ గూడిన 'మృశ్' ధాతువు నుండి యేర్పడినది. ఆ ధాతువునకు పరా

మర్శించుట, ఆలోచించుట, పరిశీలించుట, చర్చించుట మొదలగు నర్థములు గలవు. కావున నట్టి క్రియల యొక్క సమాహార రూపము విమర్శ యగును. దీనిని బట్టి విమర్శకుఁడన కావ్య కళాఖండాదులను దర్శించి, పరీక్షించి, చర్చించి, వివేకించి, విలువ కట్టి, సమన్వయించి మనోహరముగా వాని తత్త్వముల నావిష్కరించు వాఁడని యేర్పడుచున్నది. "To set up as a critic is to set up as a judge of values" అనిన ఐ. ఏ. రిచర్డ్స వాక్యము విమర్శక స్వభావమును జెప్పెడి సూత్రప్రాయమైన సూక్తి.

మహాకవుల కావ్యము లెన్నియో మహామహుల విమర్శల వలననే మానవ హృదయముల కెక్కి కలకాలము వసింపఁగల స్థితిని సంపాదించు కొనినవి. కవి తాను పొందిన రసానుభూతిని కావ్యరూపమున జాలువార్చి దాని కమరత్వము కల్పించుకొనును. అమరమైన యతని కావ్యములోని రస సిద్ధిని, తాను సాధించి, లోకమునకు దాని నందించుటకై విమర్శకుఁడు రచ నను వెలయించును. కవికిని సహృదయునకును నడుమ వెలసిన వాఙ్మయ వారధి విమర్శకుఁడు. సరసమైన యొక విమర్శనము కవి హృదయమున కొక యాదర్శము. అది యెంత నిర్మలముగ నున్న నంత స్వచ్ఛమైన సాహిత్య దర్శనము సాధ్యమగును.

ప్రాచీనులు సంగీత సాహిత్యముల తారతమ్యము నిరూపించుచు "ఏక మాపాత మధుర మన్య దాలోచనామృత" మని పేర్కొని యుండిరి. సంగీతము వినినంతసేపు నవ్యక్త మాధుర్యము మనస్సున స్ఫురించును. సాహిత్య మాలోచించిన కొలఁది యమృత రుచుల వర్షించును. ఇందు గమ నింపఁ దగిన యంశము సాహిత్య రససిద్ధి కాలోచన బీజమని. ఆ యాలోచ నయే విమర్శకు మూలకంద మని.

"కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతి కవిః తస్య కర్మ కావ్య"మ్మను భట్టగోపాలుని వాక్యమును బట్టి రసభావములను విమర్శించు వాఁడు కవి యనియు, నతని కర్మ కావ్యమనియు నేర్పడుచున్నది. కావున, కవనమందే విమర్శన మంతర్భవించి యున్నది. కవి లోక వృత్తము నుండి రసభావనములను గ్రహించి, మనమున మథించి, కావ్యమున లోకోత్తర ముగ నిబంధించును. సహృదయుఁడు తత్కావ్యార్థములను తన్మయుఁడై

చర్వణ మొనర్చును. "యేషాం కావ్యాను శీలనాభ్యాస వశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా తే స్వహృదయ సంవాద భాజః సహృదయాః" అను నభినవగుప్తుని నిర్వచనము సహృదయులు కూడ రసభావ విమర్శన మొనర్చెదరని సూచించుచున్నది. నన్నయ భట్టారకుఁడు కవి- సహృదయులకు రసము సాధ్యమని "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అని పేర్కొనెను. రసము సాధ్య మనఁగా రసభావ విమర్శ వలన సాధింపఁదగినదనియే భావము! మఱియు కావ్యాత్మ యగు రసము కావ్యమున వ్యంగ్య మగునుగదా: తద్వ్యంగ్యార్థ భావనమున నాలోచనము తప్పక యుండును. ఆనందవర్ధనాదులు మహాభాగతాదుల యందు పరమ వ్యంగ్యమగు రసమును విమర్శించి నిరూపించుట వలన తచ్చర్వణానుభవములు సహృదయులకు సులభ సాధ్యములగుచుండుట ప్రసిద్ధము కదా! తత్త్వదృష్టిగల సాహిత్య విమర్శకులు ఆత్మదర్శనముచేయు విద్య యాధ్యాత్మిక విద్య యనియు, రసదర్శనము చేయు విద్య సాహిత్య విద్య యనియు వివేకించుకొని, రసదర్శన మాత్మదర్శనము వంటి దనియే భావించి 'రసో వై సః' యను శ్రుతిని సాహిత్య పరముగ నన్వయించిరి. పరాదేవిని "విమర్శ రూపిణీ విద్యా" అని విమర్శ రూపిణియైన విద్యగా భావించిరి. కావున కవి సహృదయులు పొందు కావ్యరసానందము రసభావ విమర్శ ప్రభవమనుటలో విప్రతిపత్తి లేదు.

ఇట్టియెడ విమర్శకుఁడు కవి సహృదయుల నడుమ నిలువఁబడి విమర్శించునది యేమి? యను ప్రశ్న యుదయించును. విమర్శ కాలంబన మగునది కవి నిర్మితమైన కావ్యము. ఆ కావ్యమున కావల స్రష్టయున్నాఁడు. ఈవల సహృదయుఁడున్నాఁడు. విమర్శకుఁడు మొదట కావ్యమును నిర్మించిన కవిని గూర్చి విమర్శించును. అతఁడు ప్రతిపాదింపఁ దలఁచిన వస్తువేది? దానిని ప్రపంచించుటలో నాతఁడెట్లు కృతకృత్యుఁ డయ్యెను? కవి వ్యక్తిగత జీవిత విశేషములుగాని, సమకాలీన సాంఘిక వృత్తములుగాని యతని కావ్య రచన కుపపోషకములై యందుఁ బ్రతిబింబించినవా? అవ లది కావ్య మగునా కాదా? ఇత్యాది అంశములను విమర్శించును. ఆపైని సహృదయ పరమైన యంశములను చేపట్టును. రసము సామాజిక నిష్ఠమగుటచే తదనుభూతికి సహృదయుఁడే ప్రమాణము. కవిలో తాదాత్మ్యము పొంది కావ్య సృజన

వ్యాపార శీలమును బరిశీలించిన యీ విమర్శకుఁడే సామాజిక స్థానీయుఁడై యున్నాఁడు. అతనికి కావ్యరసానుభూతి కలిగినప్పుడు, తదనుభూతికి కారణములైన కావ్యద్రవ్యములను గూర్చి యోచించును. కవి వాని నేయే విధముల సంయోజించి ప్రపంచించుటచే నేయే రసభావాదులు కల్గుచున్నవో విమర్శించి, గుణదోషాదులను వివేకించును. సామాజికుఁడు సామాన్యముగా కావ్యరసాస్వాదనమును పాడబాది రసాస్వాదనము వలెనే గ్రహించి యానందించును గాని యీ యనుభూతికి హేతువులైన ద్రవ్యముల సంయోజన శిల్పము నెఱుఁగక పోవచ్చును. విమర్శకుఁడా రహస్యము విప్పి చెప్పును. అట్లని యతఁడు కవివలెఁ గావ్యము నిర్మింపఁ జాలక పోవచ్చును. కాని కావ్యనిర్మాణ మర్మము లెఱిఁగిన కుశలుఁడై యుండును.

కవిసామాజికులతో నెంత సహానుభూతి నొందినను విమర్శకుఁడు నొక వ్యక్తియే. అతని కుండెడి యభిరుచు లాతని కుండును. అవి నిష్పక్షపాతమైన విమర్శనమున కడ్డము కావచ్చును. అప్పుడు సాహిత్య ప్రయోజనమే భగ్నమగును. కాని బహుశాస్త్ర విజ్ఞాననిధియై సాహిత్యము నాపోశన పట్టి దానినొక తాత్త్విక దృష్టితో సమన్వయము చేయగల మనీషి యెవ్వఁడో సమర్థుఁడై నూతన దృక్పథముతో సాహిత్య విమర్శ సిద్ధాంతములు వెలయింప వచ్చును. ఆనందవర్ధనాభినవ గుప్తాదు లట్టివారు. కాని అట్టివారు లెక్కకు కొద్దిమంది మాత్రమే యుందురు. అట్టివారు స్థిరపరచిన సాహిత్య సిద్ధాంతముల నాదరువుగాఁ జేసికొని విమర్శించువారు సంప్రదాయానుసారులు. ఇందులో మొదటి వర్గము వారిని సాహిత్య శాస్త్రకారులనియు! రెండవ వర్గము వారిని సాంప్రదాయిక విమర్శకు లనియుఁ బేర్కొనవచ్చును.

సాహిత్యము ప్రవాహ తుల్యమైనది కావున స్థిరమై యుండునది కాదు. కాలానుగుణముగా గతిని మార్చుచు, రూపమును మార్చుచు, క్రొంగ్రొత్త శోభలతో ముందుకు సాగిపోవుచుండును. దానిలో నుపనదులు పెక్కు చేరుచుండ వచ్చును. ఆయా భాషాస్రవంతులతో సంబంధ బాంధవములు కలిగిన కొలది సాహిత్య దృక్పథములోను, అట్లే యభిరుచులలోను, విమర్శ, పద్ధతులలోను మార్పు లేర్పడుచుండుట సహజము. అట్టి తరుణము

నందు ప్రఖ్యాత ప్రాచీన సాహిత్య సిద్ధాంతములే విమర్శకులకుఁ బ్రమాణములుగా నిలువక నూతన కావ్య ప్రక్రియలతోపాటు, నూతన విమర్శన పద్ధతులు కూడ వెలయుచుండును. అవి రెండు మూఁడు విధములుగా కానగును. ఒకటి :- పరంపరాగతమైన శాస్త్రీయ దృక్పథము నవలంబించుచుఁ గొన్ని యెడల నూతన దృక్పథములను, సిద్ధాంతములను వెలయించుట. రెండు :- పరంపరాగతమైన సాహిత్య సిద్ధాంతములను పూర్తిగా త్రోసిరాజని యన్య సాహిత్య సంప్రదాయములలోని సిద్ధాంతములను గైకొని వానిని స్వీయ సాహిత్యమున సమన్వయింప యత్నించుట. మూఁడు :- సంప్రదాయ బద్ధమైన సిద్ధాంతములను, నూతన దృక్పథములను యథావకాశముగా సమన్వయించి యొక మధ్యేమార్గమున విమర్శనము సాగించుట, నాల్గు :- లక్షణమునకు లొంగక స్వాతంత్ర్యముతో రచింపఁబడు కావ్యమును విమర్శించునెడ దాని స్వభావమును బట్టి సాహిత్య ప్రమాణములను క్రొత్తగా గల్పించుకొని విమర్శించుట. ఐదు :- కేవల దోషైక నిరూపణ దృష్టితోడనో లేక యభిమాన ప్రేరితమైన దృక్పథము తోడనో విమర్శనము సాగించుట. ఈ మార్గ భేదము లన్నియు విమర్శకుఁడు పాటించు నాయా ప్రమాణములను బట్టి యేర్పడు చుండును. ప్రతిభా ప్రధానమైన సాహిత్య క్షేత్రమున సామాన్యముగా శాశ్వత నిరంకుశ ప్రమాణములకంటె (Absolute standards) సాపేక్ష ప్రమాణములే (Relative standards) యపేక్షణీయములు.

ఎట్టి ప్రమాణముల నుపయోగించు విమర్శకుఁడైనను సారస్వతమునకును విమర్శనమునకును, సాహిత్యమునకును జీవితమునకును, కావ్యమున (కళ)కును రసానుభూతినికి గల సంబంధములఁ గూర్చి విశ్వజనీనములైన కొన్ని ప్రాథమిక సాహిత్య సూత్రములను విస్మరింపఁ జాలడు. కావ్యము యొక్క ఆకృతిని గూర్చి పెక్కు విధముల నుల్లేఖింప వచ్చునుగాని యాత్మను గూర్చి యన్యముగా విమర్శించుట పొసఁగదు. సర్వసాహిత్య ప్రయోజనము రసానంద మైనప్పుడు, తల్లక్ష్య శుద్ధి యందు చెదరుపాటులేక విమర్శనము సాధించుట విశ్వజనీనమైన పద్ధతి. కావ్యమునకు రసము ప్రాణమైనచో విమర్శనకు తన్నిరూపణమే పరమార్థమగును.

# 2

తెలుఁగులో సాహిత్య విమర్శ నూఁటేళ్ళ నుండి విస్తరిల్లుట యారంభించినది. అంతకుఁ బూర్వమున్న విమర్శనము చాలవఱకు లక్షణ గ్రంథ రచన రూపమునను, వ్యాఖ్యాన రూపమునను వెలసియున్నది. ఆంగ్ల సాహిత్య ప్రభావము పడిన యాంధ్ర సాహిత్యమున నూతన సాహిత్య ప్రక్రియలు పల్లవించినవి. వానికి నారుపోసి పైరు చేసిన పితామహుఁడు కందుకూరి వీరేశలింగము పంతులు. ఆయన పెట్టిన మొక్కలలో పెద్దదై శాఖోపశాఖలై విస్తరిల్లి, విరివైన కాపును కాచి, వ్యాస విస్తారమును పెంచుకొనినది విమర్శవిటపి. కావున వీరేశలింగమునకు పూర్వము వెలసిన విమర్శ యంతయు నొక కోవకుఁ జెందును; వీరేశలింగము మొదలుగా వెలసిన విమర్శ యొక కోవకుఁ జెందును. పూర్వభాగమున విమర్శ ప్రధానముగా ననువాదరూపమైనది; ఉత్తర భాగమున వెలసిన విమర్శ ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంత సమన్వయ రూపమైనది. కావున ఆంధ్ర విమర్శ చరిత్రను స్థూలముగా ప్రాచీన యుగమనియు, నవీనయుగమనియు విభాగము చేయవచ్చును.

ప్రాచీన యుగమునందలి యాంధ్ర విమర్శను రెండు ప్రధాన శాఖలుగా విభజింపవచ్చును. అవి ;

1. కవులు స్వీయకావ్యములయం దొనర్చిన కావ్య విమర్శ.
2. లక్షణ గ్రంథకర్తలు వెలయించిన సాహిత్య విమర్శ.

1. కవి కావ్యవిమర్శ :— సామాన్యముగా సాహిత్య నిర్మాణము వెంట విమర్శ విధానమును రూపొందుచుండును. కావ్య నిర్మాత యైన కవి తన్నిర్మాణ మర్మ మెఱిఁగిన శిల్పియు నై కావ్యస్వరూప స్వభావముల కనుగుణమైన లక్షణములనందు పొందుపఱచును. అట్టియెడ కవి తన కావ్య వైశిష్ట్యము వెలుఁగుపఱుచు ప్రత్యేక గుణములను కావ్యముఖమున సూచించును. అట్టి సూచనలవలన తత్కావ్య రచనా విధానమును విమర్శింపఁదగిన మార్గములు తేటతెల్లమగును.

ఆంధ్ర సాహిత్యమున నాదికవియైన నన్నయభట్టారకుఁడే యిట్టి పద్ధతిని తన కావ్యమునఁ బ్రవేశపెట్టినాడు. నన్నయ తన కవితా లక్షణములను గూర్చి చెప్పుకొనిన యీ పద్యము మూడుడు :

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థ యుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్."

నన్నయ కృతిని బరిశీలించిట కీ పద్యమునఁ జేర్కొనబడిన కవిత్వ శిల్ప ధర్మము లెంతయో తోడ్పడఁగలవు. ఇట్టివి సూచనా మాత్రము లైనను కావ్యనిర్మాణ విధానమును దర్శించుట కేర్పఱిచిన వాతాయనముల వంటివి. తెలుఁగు కవు లిట్టి సూచనలను తమ కావ్యములందు నిబంధించి తమ కావ్య సృష్టియందుఁ దా మవలంబించిన విధానములను వెలువరించిరి. అవి తరువాతి సాహిత్య విమర్శకు బీజప్రాయములై పరిఢవిల్లినవి.

నన్నయాది కవులు తమ కావ్యములం దిట్టి సూచనలు ప్రధానముగా నాల్గు మార్గములందు వెలువరించుట యైనది అవి :

1. స్వీయకావ్య వైశిష్ట్య నిరూపణము.
2. పూర్వ కవి స్తుతులు,
3. కుకవి నిందలు.
4. కథా సందర్భములయం దొనర్చిన పరోక్ష విమర్శలు.

1. తెలుఁగు కవులు స్వీయ కావ్య లక్షణములను ప్రాయికముగా వారి కావ్యావతారికలలోఁ జేర్కొనుటఁ గాంచెదము. నన్నయ వలెనే, తిక్కనయు. నెఱ్ఱాప్రెగ్గడయు, నన్నిచోడ, సోమనాథ, శ్రీనాథాదులును, ప్రబంధ కవులు నిట్టి మర్యాదను పాటించినట్లు పరిశీలకులు గుర్తింపవచ్చును.

ప్రాచీన కావ్య మర్యాదలలోఁ బ్రధానముగాఁ గనవచ్చు మార్గదేశీ పద్ధతులును, ఆ యా మార్గముల ననుసరించిన కవుల కావ్యరచనా పద్ధతు

లలోఁ గాననగు భేద సాదృశ్యములను కవుల సూచనల వలననే గ్రహించు టకు వీలగుచున్నది.

తెలుఁగు కవులు నూత్న కావ్య ప్రక్రియలను జేపట్టి నిర్వహించిన విధమును, వాని వైశిష్ట్యముల నెఱుంగుటకుఁ గూడ కావ్యావతారికలలో వారొనర్చిన యిట్టి సూచనలే తోడ్పడుచున్నవి. ఉదాహరణమునకు : పింగళి సూరన ద్వ్యర్థికావ్య ప్రక్రియ నాశ్రయించి రాఘవ పాండవీయమును రచించుచు—

"రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే యోహో యనం జేయదే
పాండిత్యంబున; నందునుం దెలుఁగు కబ్బం బద్భుతం బంద్రు ద
త్తుం డెవ్వాఁ డిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్"

ఇత్యాది పద్యములలో నాతఁ డనుసరించిన ద్వ్యర్థికావ్య రచనా విధానమును వివరించుట ప్రసిద్ధమై యున్నది.

సమకాలీన కావ్యరచనా పద్ధతులపై విమర్శనముచేసి స్వీయకావ్య వైశిష్ట్యము నెఱిఁగించిన కవుల వాక్యములు తులనాత్మక పరిశీలనమునకు గీటురాళ్లై వెలయు చుండుట గమనించుచున్నాము. ఉదాహరణమునకు— అపూర్వ కల్పనా మహనీయమై కల్పిత కావ్యముల కొజ్జబంతి యగునట్లు కళాపూర్ణోదయమును రచించిన పింగళి సూరన పద్ధతిని విమర్శించి మిశ్రేతి వృత్తము గల కావ్యము యొక్క వైశిష్ట్యమును బ్రతిపాదించిన రామరాజ భూషణుని యీ క్రింది వాక్యము లందులకుఁ దార్కాణములు.

"కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్
వావిరి పుట్టురత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలు దీరిన జాతిరత్నముల్."

ఇట్లే తెలుఁగు భాషయొక్క మాధుర్యమును, దేశభాషలలో దాని కున్న విశిష్ట స్థానమును, సంస్కృతాంధ్ర భాషల కున్న సంబంధమును దెల్పు శ్రీనాథ, శ్రీకృష్ణదేవరాయాదుల వాక్యములు తెలుగువారి మన్ననల నందుకొని యున్నవి.

2. తెలుఁగు కవులు కావ్యావతారికలలోఁ బూర్వ కవిస్తుతి చేయు సత్సంప్రదాయమును బాటించియుండిరి. దానివలనఁ గవికాల నిర్ణయమునకే గాక పూర్వ కవులపట్ల నాయా కవులకున్న యభిప్రాయములను దెలియుటకును. ప్రాచీన కవుల కావ్యములందలి యేయే విశిష్ట గుణములను గ్రహించి యాయా కవులెట్లు వారి కావ్యములందు నిబంధించిరో పరిశీలించుటకును, కవుల దృక్పథములలో నున్న సాదృశ్య భేదముల తులనాత్మక విమర్శనము కును వీలు కలుగుచున్నది. ఉదాహరణమునకు ఈ క్రింది పద్యములను గమనింపఁ దగును, (1) ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కన కావ్యకళా వైభవమును స్తుతించిన విధము.

"తన కావించిన సృష్టి తక్కొక్కరుల చేతంగాదు నా నేర్పుముం
బున దాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందు నా వాణిభ
ర్తను నీతం డొకరుండనాఁ జను మహత్త్వవ్యాప్తిం గవి బ్రహ్మ నా
వినుతింతుం గవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్యర్చితున్."

2. శ్రీనాథుఁడు కాశీఖండమున ప్రాచీన కవుల కవిత్వ గుణములు తనయందెట్లు మేళవింపఁబడినవో వేమారెడ్డి ముఖమున వెల్లడించిన విధమును గాంచుడు ;

"వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాటు;
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు;
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు;
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని త్రోవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు;

(3) సాహిత్య ప్రగతిని సమీక్షింపఁగల కవి తత్పురోభివృద్ధికి మూల కారకులైన ప్రాచీన కవుల సేహావైభవమును స్తుతించు పద్యముల వలన సాహిత్య చరిత్ర స్మరింపఁ బడుచుండును.

ఉదా:— ''మహిముఁ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త న్మహనీయస్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహా మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపఁ సొంపువాటించు నీ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

(4). కృతికర్తలే కాక కృతిభర్తలైన ప్రాచీన కవులు కొందఱు కలరు. వారు కృతి నందుకొనిన కావ్యములలోని కృత్యవతారికల వలననే కాక యాశ్వాసాద్యంత పద్యముల వలనఁగూడ వారి కవితా వైభవము స్పష్టమగుచుండును. ఉదా :— కేతన దశకుమార చరిత్రమును తిక్కన కంకితమొనర్చి యందా మనీషి మహనీయ కావ్యగుణములను స్తుతించి యుండుట ప్రసిద్ధము. 'ఉభయ కవిత్వ తత్త్వ విభవోజ్జ్వలుఁ' డైన తిక్కన సంస్కృతాంధ్ర కవిత్వములు వెలయించి ఉభయకవి మిత్ర బిరుదము దాల్చె నని యా కావ్యము వలనఁ దెలియనగుచున్నది.

కవు లిట్లు వెలువరించిన భావములు సూత్రప్రాయములై యుండుట వలన వాని స్వరూప స్వభావముల నిదమిద్ధముగాఁ దెలిసికొనుట కొన్ని యెడల క్లిష్టతరమై యున్నను దమతమ దృక్కోణముల నెఱిగించి భావితర ముల వారికి విమర్శ మార్గములు నావిష్కరించిన ప్రాచీన కవు లభినంద నీయులగుచున్నారు.

3. కావ్యదోషములను కుకవి కవిత్వములం దారోపించి, వారిని నిందించుట తెలుఁగు కవుల సంప్రదాయము. వాని వలన కవులు తమ కావ్య రచనలను నిర్దుష్టము లుగాఁ దీర్చి దిద్దుటయందు గర్హించిన కావ్యదోషము లను దెలియుటకు వీలగుచున్నది.

4. కొందఱు కవులు తమ కావ్యములందుఁ గథాకథన సందర్భము లలోఁ గావ్యగుణ ప్రసక్తులు వచ్చినప్పుడు పాత్రల ముఖమున స్వీయకావ్య రచనా వైభవమును వర్ణించి చెప్పుకొనుటఁ గాంచెదము. అట్టి ఘట్టము లాయా కవుల సాహిత్య సిద్ధాంతములను, కవితాభిరుచులను బట్టి యిచ్చు చుండును.

ఉదాహరణమునకు — పింగళి సూరన పూర్ణోదయమునఁ గల భాషిణీ పాత్ర ముఖమున బలికించిన పద్యము :

"చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను
సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువ యునయుం గో

మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు
మలయ పవనంపు గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కల దనఁగ వచ్చుఁ గడు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్,"

ప్రభావతీ ప్రద్యుమ్నమున నింద్రుని ముఖమున శుచిముఖి చాతుర్య మును ప్రశంసించిన పద్యము :

'శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యా కాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకో నడుచుచు
నుపపత్తి యొందు నత్యూర్జితముగ

నొకటఁ బూర్వోత్తర విరోధ మొంద కుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట మహా తపః ఫలము గాదె!

5. కావ్యనిబద్ధములు కాక ప్రసిద్ధ కవులు వెలువరించిన కావ్యలక్షణ విమర్శలు చాటువులుగాఁ గొన్ని లభించుచున్నవి. చాటు పద్యముల కర్తృత్వ వాదము లెట్లున్నను ప్రాచీన కవుల విమర్శ దృక్పథముల నవి ఛందోమయ వాక్కులలోఁ జాటుచున్నవి. ఉదా :— అల్లసాని పెద్దన

కవిత్వ లక్షణములు పేర్కొనిన 'ఉత్పలమాలిక' ప్రసిద్ధము. మఱియు నాతని ....

"ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ గూఢనుగాక ద్రావిడీ
స్తనగతి తేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవ లీల గూఢతయు జాటుతనంబును లేకయుండ జె
ప్పినయదె పో కవిత్వ మనిపించు నగిం చటు గాక యుండినన్''

అను పద్యము రసికుల జిహ్వాగ్రముల యందు చిరకాలముగా వసించు చున్నది.

**ఆంధ్ర లక్షణ గ్రంథములు :**

ఆంధ్ర సాహిత్యము ప్రభవించు నాటికే సంస్కృతమున సాహిత్య సిద్ధాంత చర్చ పరిపక్వదశ నందుకొని యున్నది. సంస్కృత భాషా సాహిత్యముల యందు నిష్ణాతులైన ప్రాచీనాంధ్ర కవుల కావ్యనిర్మాణము లందును, సాహిత్య విమర్శ యందును సంస్కృత గ్రంథములనే ప్రమాణములుగా గ్రహించి యుండిరి. అట్లగుటచే దేశి మర్యాదల కంత ప్రామాణికత్వము సిద్ధింపక పోయెను.

ఆంధ్రకవు లొకవైపు సంస్కృతేతిహాస పురాణ మహాకావ్యముల నను వదించి యాంధ్రసాహిత్యమును సమృద్ధ మొనర్చుచుండగాఁ గొందఱు కవులు తెనుఁగున లక్షణగ్రంథములను నిర్మించు నుద్యమము గూడ సాగించిరి. ఈ సరణిలో విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి, అనంతామాత్యుని రసాభరణము, గౌరన లక్షణదీపిక, భట్టుమూర్తి నరసభూపాలీయ మను పేరుగల కావ్యాలంకార సంగ్రహము, చిత్రకవి పెద్దన లక్షణ సారసంగ్రహము, గణపవరపు వేంకటకవి సర్వలక్షణ శిరోమణి మొదలగు నాంధ్ర లక్షణ గ్రంథములు ప్రసిద్ధములు.

ఇవి ప్రధానముగా సంస్కృత లక్షణ గ్రంథములలోని సిద్ధాంతముల కనువాద ప్రాయములే. పై లక్షణ కర్తలలో, గొంద ఱెడనెడ స్వీయ భావములను జోడించి కొంత స్వాతంత్ర్యము వహించినను సంస్కృత లక్షణ

గ్రంథముల కున్న ప్రామాణ్య బుద్ధి తెలుఁగు కవులకు వీనిపై నున్నట్లు కాన రాదు. అట్లని వాని విశిష్ట వ్యక్తిత్వములను విస్మరించుటకు వీలులేదు. వీరం దఱును పఠన పాఠనాదుల కనువైన పద్ధతిలో లక్షణములను ఛందోమయ ముగా నిర్మింప యత్నించినారు. ఉదాహరణములుగా స్వీయకవిత్వమును, కొన్ని యెడల ప్రాచీన సంస్కృత కవుల పద్యముల భంగ్యంతరానువాదము లను, కొన్ని యెడల ప్రసిద్ధాంధ్ర కవుల పద్యములను గైకొనుటయుఁ గలిగి నది. వారిలో ఛందోవ్యాకరణ రూపకాది లక్షణములను జోడించి గ్రంథ సమగ్రతకుఁ బాటుపడినవా రున్నారు.

ఒకసాహిత్యములో సాహిత్యవిమర్శకుఁ బ్రమాణభూతములైన లక్షణ గ్రంథములు వెలసిన వనఁగా నాభాషలో సాహిత్య విమర్శ పుష్కలముగా వెల్లివిరిసినదని తాత్పర్యము. కావున ఆంధ్ర కవులు తమ కావ్యములలో వెలువరించిన విమర్శాత్మకమైన యభిప్రాయములును, ఆంధ్ర లక్షణ గ్రంథ కర్తలు వెలయించిన లక్షణ శాస్త్ర వాఙ్మయమును ప్రాచీనాంధ్ర సాహిత్య ముని సుసంపన్నమై యున్న విమర్శను జాటి చెప్పుచున్న వనుటలో విప్రతి పత్తి లేదు.

ప్రాచీన తెలుఁగు సాహిత్యమునఁ బెక్కు సాహిత్య ప్రక్రియలు వెలసి నవి. పెక్కు మహాకావ్యము లవతరించినవి. వాని పర్యాలోచనము పండిత పరిషత్తులలో జరుగక యుండి యుండునా? గురుకులములలో నాచార్యులు శిష్యులకు బోధింపక యుండి యుందురా? రాజసభలలో షట్ఛాస్త్ర పండితులు తత్కావ్యముల నిగ్గుతేల్చక యుండి యుందురా? సాహిత్యోపాసనము జరి గెడి యే సభ్య సమాజములో సాహిత్య పర్యాలోచనము, పరిశీలనము, సవిమ ర్శనముగా జరిగి యుండదు? ప్రాచీన మహాకవు లందరు విద్వజ్జన సభలలో దమ కావ్యముల నుంచి వారి మన్ననల నందుకున్న వారు కారా? అట్టి పరి స్థితు లన్నియు శాస్త్రీయవిమర్శ సాహిత్యము సంపన్నమై యున్న దనుటకు సజీవ తార్కాణములు కావా?

కాని వారు హిమవన్నగ సన్నిభులైన సంస్కృత లాక్షణికుల సాహిత్య సిద్ధాంతములను బరమ ప్రమాణములుగా నమ్మినవారు. తత్సంస్కారముతో కావ్యరచనను, విమర్శను వెలయించినవారు. వారి కావ్య విమర్శలు వాగ్రూ

పములై పరిషద్వేదికల నలంకరించి యుండవచ్చును. వ్యాఖ్యాన రూపములై శిష్యుల ముఖ పేటికలలో వాఙ్మయ గ్రంథములుగాఁ బదిల పఱుపఁబడి యుండ వచ్చును. వానినిఁ బ్రచురించుట కిప్పటివలె ముద్రణ యంత్రము లేవి? అట్టి ప్రచార సాధనములేవి? అట్టి సౌకర్యములున్నచో సోమకవి వసుచరిత్రకు రచించిన విద్వజ్జన రంజనీ వ్యాఖ్య (క్రీ. శ. 1750) వంటి వ్యాఖ్యలెన్ని లభించి యుండెడివో. ఉపలక్ష్య మగుచున్న ప్రాచీన విమర్శ పద్ధతులలో వ్యాఖ్యాన మొకటి. మఱెన్ని పద్ధతులు వారనుసరించి యుండిరో! పదెనిమిది శతాబ్దముల కాలమెంత సాహిత్య విమర్శ లేనిదే యుత్తమ సాహిత్యము తన మనుగడ సాగించినది? యుత్తమ సాహిత్య సంస్కారము జాతిలో సజీవ ముగా నిలచియున్నది?

సాహిత్య ప్రమాణము లున్న యెడ విమర్శనము నిష్పాక్షికముగను, నిర్దుష్టముగను, జరుగుట కవకాశ మున్నది. లక్షణ గ్రంథములు ప్రతిభా వంతుఁడైన కవికి ప్రతిబంధకములు కావు. కవుల నూత్న కల్పనలు, నవ్య ప్రయోగములు సాహిత్య శాస్త్రమునకు సరిక్రొత్త కానుకలు. ప్రాచీన సాహిత్యమునందు తెలుఁగు కవులు స్వతంత్రించిన సందర్భములు కలవు! వాని విలువలను బరిశీలించి ప్రమాణ బుద్ధితోఁ గౌరవించిన విమర్శక లోకము కలదు!

## 3

ఆంగ్ల భాషా సాహిత్య ప్రభావ మాంధ్ర సాహిత్యముపైఁ బాగుగాఁ బడిన కాలము నుండి – అనఁగా క్రీ శ. 19వ శతాబ్దపు టుత్తరార్థము నుండి – తెలుఁగు విమర్శలో నూతనాధ్యాయము ప్రారంభమైనది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు భారతీయ భాషా సాహిత్యములలో వలెనే తెలుఁగు నందును గ్రొంగ్రొత్త చైతన్యమును గలిగించినవి. పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతముల నభ్యసించిన పండితులు తత్సంస్కారముతో మాతృభాషా సాహిత్యమును బరిశీలింప మొదలిడిరి: సాహిత్య ప్రక్రియలలో వైవిధ్యముతోఁ గూడిన నూతన ప్రయోగములు జరుప మొదలిడిరి: దానితో వాని పర్యాలో చనము మొదలైనది. ప్రక్రియా విస్తృతి విమర్శ క్షేత్రమును విశాల మొనర్చినది.

ఆంగ్ల సాహిత్య మాధునికులలో నూత్న సాహిత్య చైతన్యముతో పాటు, వ్యక్తి స్వాతంత్ర్యము, దేశస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, ఆర్థికస్వాతంత్ర్యము మొదలగు నుజ్జ్వల సాంఘిక భావములను రేకెత్తించినది. ఆంగ్ల భాషా సాహిత్యముపై వ్యామోహమెంత బలిసినదో దేశభాషలపై నంత భక్తిప్రపత్తులు వెలసినవి. ప్రాత కట్టుబాట్లపై తిరుగుబాటుతో బాటు సరపాలనపై తిరుగుబాటు జరిగినది. విశ్వసవరాజ దృష్టితోపాటు స్వరాష్ట్రాభ్యుదయ దృష్టి పొటమరించినది. సృజనాత్మక చైతన్యముతోపాటు విమర్శాత్మకమైన దృక్పథము విస్తరిల్లినది.

బహుముఖములుగాఁ బెల్లుబికిన యీ జాతి చైతన్యమును ప్రకటించుటకు ముద్రణయంత్రము లవతరించినవి. క్రి. శ. 1831వ సంవత్సరములో తెలుఁగు పత్రికను వెలువరించు యత్నము జరిగినది. 1833లో మొదటి తెలుఁగు దినపత్రిక ప్రచురింపఁబడినది. 1838లో మండిగల వెంకటరాయ శాస్త్రిగారి సంపాదకత్వమున 'వృత్తాంతిని' అను తెలుఁగు వారపత్రిక వెలసినది. 1842లో పుట్టి 8 సంవత్సరములు జీవించిన 'వర్తమాన తరంగిణి' ఆంధ్ర మహాభారతమును, కొన్ని ప్రబంధములను, శతకములను ప్రచురించినది. ఆపైన 1861లో దిన వార్తామణి, 1862లో హితవాది యను వార్తా పత్రికలు వెలువడినవి. మొట్టమొదటి ఆంధ్ర సాహిత్య పత్రిక 'సుజనరంజని'. వింజమూరి కృష్ణమాచార్య, బహుజనపల్లి సీతారామాచార్యుల - సంపాదకత్వమున నది 1862లో మొదలయి 1867 వఱకు ప్రచురింపఁబడినది, చిన్నయసూరి రచనలందు ప్రకటితములైనవి. ఆపైన శ్రీ యక్షిణి (1863-1865) యను సాహిత్య పత్రిక ; తత్త్వబోధిని (1864-70) యను బ్రహ్మసమాజమువారి పత్రిక, వెలువడి సాహిత్య సేవయు, సాంఘికసంస్కార ప్రచారమును నెరపినవి.

మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారి సంపాదకత్వమున 1871లో వెలసిన ఆంధ్రభాషా సంజీవని యను మాసపత్రిక సార్థకనామయను కీర్తిని గడించినది. ఆ పత్రిక సాహిత్య సాంఘిక రాజకీయ నైతిక విషయములపై నమూల్యములైన వ్యాసములను ప్రకటించినది. కందు

కూరి వీరేశలింగము పంతులుగారి శుద్ధాంధ్ర భారత సంగ్రహములోని సభ పర్వము మొదటిసారి యీ పత్రికలోఁ బ్రచురితమైనది. వడ్డాది సుబ్బారాయ కవి రచించిన 'భక్త చింతామణి' యిందే ప్రకటింపఁబడినది. ఆపైన 1872లో మచిలీపట్టణము నుండి వెలువడిన పురుషార్థప్రదాయిని (1872-78) వీరేశ లింగము పంతులుగారి సంఘసంస్కరణ వ్యాసములకాలవాలమైనది. స్వధర్మ ప్రకాశిని (1873-76): సుధీరంజని (1873-1889), సకలవిద్యావర్ధని (1873-79) బ్రహ్మానందరంజని, (1874) లోకరంజని (1874), విద్వన్మనోహారిణి (1874) మొదలగు పత్రికలా కాలమున సముచితపాత్ర నిర్వహించినవి. 1874లో కందుకూరి వీరేశలింగము పంతులుగారు వివేకవర్ధని యను పత్రికను ప్రారంభించిరి. దానినే 1876లో పక్షపత్రికగాఁ బరివర్తించిరి. ఇది 1885 వఱకు బహుముఖ సాహిత్య సాంఘిక సేవ నొనర్చినది.

తెలుఁగు దేశమున తెలుఁగువారు సొంత ముద్రాక్షర శాలలు నెలకొల్పిరి. సాహిత్యవేత్తలు తెలుఁగు సాహిత్య పత్రికలు స్థాపించి సారస్వత చైతన్యము నినుమడింపఁ జేసిరి. అది యొక యుద్యమము. సాహిత్య పురోభివృద్ధికి పత్రికలు ప్రచార సాధనములే కాక ప్రబోధ శంఖములై ప్రభవిల్లినవి. ఆ సారస్వత సత్రయాగములో జనవినోదిని (1875-1885), ప్రబంధ కల్పవల్లి (1880-1882), యథార్థవాది (1881-1885), నీతి దర్పణము (1885-1887), సుజన మనోల్లాసిని (1885). హిందూజన సంస్కారిణి (1885), అముద్రిత గ్రంథ చింతామణి (1885-1904), చింతామణి (1890-1904), వైజయంతి (1894-1899), రత్నాకరము(1899-1902) సరస్వతి (1898-1912) మంజువాణి (1898-1904); వాగ్వల్లి (1899-1903), కళావతి (1900-1903) సత్యసాధని (1899-1905) శశిలేఖ (1893-1900) ఆంధ్ర ప్రకాశిక (1888-1928), కల్పలత (1908 1905& 1921) మనోరమ (1906-1910): దేశమాత (1910-13), ఆంధ్ర భారతి (1910-15) అభినవ సరస్వతి (1918,1930), ఆంధ్రభాషా విలాసిని (1920-1930) తెలుగు (1920) త్రిలింగ (1915-55), సారస్వత సర్వస్వము (1923-24) శారద (1923-24), కళ (1924-27), సుజన (1927-40), గ్రంథాలయ సర్వస్వము (1918-28), సరస్వతి (1923-28) ప్రబుద్ధాంధ్ర (1924-30), ఆంధ్ర సర్వస్వము (1924-1926) రెడ్డిరాణి (1924-

1932) శక్తి, సాహితి, సుభాషిణి, జయంతి (1927) కల్యాణి (1930-38) ప్రతిభ (1936-40), ఉదయిని (1936) కిన్నెర (1948,1955). అభినవ భారతి (1953) పరిశోధన (1954-56) సాహితి (1961-1964) (తెలంగాణము నుండి నీలగిరి, గోలుకొండ పత్రిక, ఆంధ్ర (1940-43) సంస్కృతి (1953 57) విభూతి (1940-45) సుజాత మొదలగు సాహిత్య పత్రికలు ప్రశంసనీయమగు పాత్రల నిర్వహించినవి. అంతియకాదు. ఇవి యన్నియు చేసిన సాహిత్యసేవ యొక్క యెత్తుగడ ఈక్రింది సజీవ సాహిత్య పత్రికలు సాహిత్యమున నిర్వహించుచున్న పాత్ర మఱియొక యెత్తుగడ గణింపఁ దగినది. అవి : కృష్ణాపత్రిక (1902-), ఆంధ్రపత్రిక సంవత్సరాది (ఉగాది) సంచికలు (1910-), ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ) (1912-), ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము (1921-) భారతి (1924-), ఆంధ్రప్రభ సారస్వతానుబంధములు (1931-), స్రవంతి (1951-)[1]. ఇంకను ఇటీవలి యొక దశాబ్దమునందు వెలువడుచున్న దిన, వార, మాస, త్రైమాసిక పత్రికలు గుర్తింపఁదగినవి. ఆంధ్రదేశము నలుమూలల వెలసిన యీ పత్రికా బాహుళ్యమును గమనించినచో నవ్యాంధ్ర సాహిత్య విమర్శకు రంగస్థల మెంత విశాలమైనదో తేటపడఁగలదు.

ముద్రణ యంత్ర సౌకర్యము పత్రికా ప్రకటనమున కెంత తోడ్పడినదో అంత గ్రంథ ప్రకటనమునకును దోహదకారియైనది. ప్రాచీన యుగమునందు విమర్శ ప్రకటన కుండిన పెద్ద యడ్డంకు తీరిపోయినది. సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథములు కోకొల్లలుగాఁ బ్రచురితములైనవి. తెలుగు జమీందారుల ఆస్థానములు పండిత సన్మానములనేగాక పండితసభలను, సదస్సులను, కవితా మహోత్సవములను, నెరపి చర్చాత్మక సాహిత్య విమర్శనమును బోషించుటయే కాక, బహు కావ్యములను. శాస్త్ర విమర్శలను బ్రకటించి సాహిత్య సేవ చేసినవి. ఆయా కాలములందు కొన్ని ప్రత్యేక సార

1. వివరములకు చూడుడు : Studies in the History of Telugu Journalism Edited by Sri K. R, Seshagiri Rao, Essays : Beginnings of Telugu Journalism by Sri Arudra & Literary Journalism by Sri N. Venkata Rao.

స్వత లక్ష్యములతో స్థాపింపఁబడిన ప్రజా సాహిత్య సంస్థలు, పరిశోధన మండలులు, విశ్వవిద్యాలయములు, సాహిత్యమాలా ప్రచురణ సంస్థలు సంస్మరణ సంచికా ప్రచురణ సమితులు, మఱియు గ్రంథకర్తలు, వాణిజ్య ప్రచురణ సంస్థలును ఈ గ్రంథ ప్రచురణకుఁ బూనుకొనినవి.

ప్రచురణావకాశ మున్నప్పుడు వ్రాయుట జరుగును. వ్రాయుటవలన రచయితభావము లతని పరోక్షమునఁగూడ లోకమున వ్యాప్తిచెందు నవకాశ మేర్పడును. సాహిత్య చైతన్యము జాతిలో వేగవంత మగును.

శాస్త్రాభివృద్ధియు, యంత్ర సౌకర్యమును ప్రపంచ పరిస్థితులలోనే మార్పుల నతివేగ వంతముగాఁ దెచ్చిపెట్టుచున్నవి. వాని ప్రభావము మానవ జీవితము మీదను, సాహిత్యము మీదను బలముగాఁ బడుచున్నది. ఇప్పుడు సాహిత్యములో నుదయించు ప్రక్రియా వైవిధ్య వేగమును విమర్శ విద్యుద్వేగముతో నందుకొనుచున్నది. విమర్శ యీనాఁడు శక్తివంతమైన సాహిత్య ప్రక్రియ. అది స్పృశింపని సాహిత్య ప్రక్రియలేదు; అది యుత్తేజ పఱుపని సాంఘిక వ్యవస్థ లేదు :

## 4

కందుకూరి వీరేశలింగము పంతులుగారితో నారంభమైన నవీన సాహిత్య విమర్శ యెనిమిది ప్రధాన శాఖలుగా విస్తరిల్లినది. అవి :

1. వ్యాఖ్యానములు
2. సాహిత్యలక్షణ గ్రంథానువాదములు
3. సమన్వయ రచనలు
4. విమర్శగ్రంథములు
5. పీఠికలు
6. వ్యాసములు
7. చర్చలు – సమీక్షలు
8. పరిశోధనలు (సిద్ధాంత వ్యాసములు).

వీనిస్వరూప సమగ్రపర్యాలోచన మిచ్చుట సాధ్యముకాదు కావున స్వభావవిశేషములను దిఙ్మాత్రముగాఁ బరామర్శించుట యగుచున్నది.

*1*. వ్యాఖ్యానములు :— సంస్కృత వాఙ్మయము నుండి తెలుఁగు వారు గ్రహించి, పోషించుకొనిన విమర్శన పద్ధతి వ్యాఖ్యానము. అభినవ గుప్తుని అభినవ భారతి, లోచనము, మల్లినాథసూరి కాళిదాస కావ్య వ్యాఖ్యలు - ప్రపంచమునందలి యుత్తమస్థాయి విమర్శలకెందును దీసిపోవు. వ్యాఖ్యానమును విమర్శ యఁదురేమి ? యనవచ్చును. ఆ రెండు పేర్లాయా కాలములలో నాయాయర్థములలో రూఢికెక్కియుండుటచే భేదము స్ఫురించుచున్నది కాని మౌలికముగా వాని తాత్పర్యమొక్కటియే. తెనుఁగున కావ్య ప్రబంధ శబ్దములు నేఁడు భిన్నార్థములలో స్ఫురించినను వానిని బ్రయోగించిన ప్రాచీన కవులకా భేదదృష్టిలేదు. అంతవఱకెందులకు ? వ్యాస వాఙ్మయ పితామహులైన వీరేశలింగము పంతులుగారే వ్యాసపదమును రూఢిగా నాసాహిత్య ప్రక్రియకు వాడియుండలేదు. కావున విమర్శ పదము వ్యాఖ్యానమునకు లేకపోయినను దానికి విమర్శస్వభావము సహజమగుటచే నదివిమర్శ కాకపోదు.

వ్యాఖ్యానరచనము చిన్నవిషయము కాదు. అది కావ్యమును బరిచ్ఛిన్నముగను, బాహికముగను విమర్శించుట కాదు; కావ్య మహాతాత్పర్యమునకుఁ బ్రతిపద్యము నన్వయింపవలెను ; అందలి రసభావ సంపత్తితోపాటు శాస్త్రార్థసమృద్ధిని నిరూపింపవలసి యుండును. పాశ్చాత్యుల **Poetic appreciation, Literary criticism** లను అంతర్భవించుకొనిన విమర్శకళ వ్యాఖ్యానము. పదప్రత్యయాదులయందలి వ్యంగ్యమును సైతము ప్రపంచింపవలసిన ప్రాచీన విమర్శకుని ప్రతిభను బ్రతిబింబించుకొనఁగల విమర్శ ప్రక్రియ యది. కావ్యమునకు వ్యాఖ్యానము సంజీవని యను ప్రఖ్యాతిని తెచ్చినవారు మన పండితులు,

ప్రాచీనులు ప్రౌఢములైన కావ్యములకే వ్యాఖ్యానములు వ్రాసిరి. నవ్యులామార్గము ననుసరించిరి. మహాభారతమునుండి శతకముల వఱకు ప్రసిద్ధ వ్యాఖ్యానములు వెలయింపఁబడినవి. లఘుటిప్పణులు విమర్శలుకావు. విశేషాంశములు విపులముగా వివరించిన వ్యాఖ్యలే విమర్శలు. తెలుఁగున నొక్కటికంటె నెక్కువ వ్యాఖ్యానములుగల కావ్యములున్నవి - వసుచరిత్రాదులు. పెక్కు వ్యాఖ్యానముల నొక్కగంటముతో సాగించిన ప్రౌఢులున్నారు

వారందఱిలో విరాణ్మూర్తులు వేదము వారు - తెలుఁగున వ్రాసిన మల్లినాథులు.

2. సాహిత్య లక్షణ గ్రంథానువాదము — ఆంగ్లభాషాభ్యాసము దేశమున వ్యాప్తిఁ జెందినకొలఁది గీర్వాణభాషాభ్యసనము సన్నగిల్లినది. దానివలన సంస్కృత శాస్త్రములను బఠించి యన్వయించుకొనువారు తగ్గిరి. దానితో సంస్కృత సాహిత్య శాస్త్రప్రమాణబద్ధమైన విమర్శ పలుచబారినది. అట్టియెడ సమర్థులైన పండితులు సంస్కృత లక్షణ గ్రంథములను దెలుఁగు చేసిరి.* ఈ యుద్యమ ఫలితముగా పఠన పాఠనాదులలో నున్న సంస్కృత సాహిత్యశాస్త్రమంతయు నాంధ్ర భారతి నలంకరించినది. ఈ యనువాదము లలో విశేష మొకటి కలదు. వీనిలో మూలమును మాత్రమే యనువదించినవి కొన్నికలవు. మూలసూత్రములనట్లే యుంచి, సంస్కృత వ్యాఖ్యల నాధారముగాఁగొని వ్యాఖ్యానములు వ్రాసినవి కొన్ని కలవు; ఇట్లే మూలమును వ్యాఖ్యానమును గూడ ననువదించినవి; అనువాదకులు సొంతముగా వ్యాఖ్యానములు వ్రాసినవి; ఉదాహరణముగాఁ దెలుఁగు కవుల పద్యములను గైకొనినవి - ఇట్లెన్నో విధముల రచింపఁబడినవి కలవు. ఇట్టి గ్రంథములకు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి సాహిత్యదర్పణము, శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారి 'ధ్వన్యాలోకము' మొదలగునవి చక్కని యుదాహరణములు.

తెలుఁగువారు తెలుఁగు లక్షణ గ్రంథములకుఁ గూడ వ్యాఖ్యానములు వెలయించిరి. అందులో శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య సుప్రసిద్ధమైనది. సాహిత్యశాస్త్రమునందలి ప్రసిద్ధ సిద్ధాంతముల పర్యాలోచన మీ గ్రంథమునందు కలదు.

ఆధునిక సాహిత్య ప్రక్రియకు లక్షణము చెప్పెడి ఛందోబద్ధమైన సాహిత్య సూత్రగ్రంథము శ్రీ రాయప్రోలువారి 'రమ్యాలోకము'. తెలుఁగున నట్టిగ్రంథమది యొక్కటియే.

---

*వివరములకు : ఆంధ్ర విమర్శ వాఙ్మయము - (వ్యాసము) డా. దివాకర్ల వేంకటావధానిగారు.

ఇవి కాక పాశ్చాత్య శాస్త్రములైన అరిస్టోటిల్ పొయెటిక్సు, ప్లేటో రిపబ్లిక్ తెలుఁగునకు వచ్చినవి

పై వానియందన్నింటను గానవచ్చు లక్ష్య మొక్కటియే. అవి తెలుఁగు వారి కొఱకు, తెలుఁగులో బోధించుటకొఱకు, తెలుఁగులో భావించుట కొఱకు, తెలుఁగు కావ్యవిమర్శ లక్షణబద్ధముగాఁ జేసి ప్రామాణిక విమర్శ వెలయించుట కొఱకు వెలువడినవి.

3. *సమన్వయ రచనలు* :- ఆంగ్ల సాహిత్య మర్యాద లెఱిఁగిన పండితు లొకవైపు పాశ్చాత్య సాహిత్య లక్షణములను ప్రమాణములుగా నమ్మి ప్రాచీన ప్రబంధములను విమర్శించుట యారంభమైనది. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వ విచార మట్టిది. తిక్కన రచనలో, పింగళి సూరన కల్పనలో విశేష ప్రతిభను శ్రీ రెడ్డిగారు గుర్తించి పాశ్చాత్య సాహిత్య ప్రమాణములతో వానిని క్రొత్త పద్ధతిలో విమర్శించి వానియౌన్న త్యము నొకవైపు చాటియు, నా కావ్యకర్తలు నమ్మిన ప్రమాణముల నా కావ్య విమర్శయందు దుయ్యఁబట్టిరి. క్రొత్తఁదనము నభిలషించు యువ విమర్శకుల కిది వెలుఁగుబాట యైనది. కాని యది ప్రాచీన సాహిత్య విమర్శ సంప్రదాయములపై పెద్దతిరుగుబాటైనది. సంప్రదాయ బద్ధులైన విమర్శకులా తిరుగుబాటును తీవ్రముగ నెదుర్కొనిరి. వారు ప్రాచీన ప్రమాణ బద్ధమైన విమర్శను వెలయించిరి. ఇట్లు తెలుఁగుల మధ్య సంఘర్షణము సాగినది. విమర్శన మాయొత్తిడిలో వత్తియైపోకుండ సంస్కృతాంధ్రాంగ్ల భాషాసాహిత్య వేత్తలు రంగమునకు వచ్చి ప్రాచ్యపాశ్చాత్య విమర్శలలోని మేలిమిని గ్రహించి, ప్రాత క్రొత్తల మేలికలయికలతో నొక సమన్వయ మార్గమును ప్రచారమునకుఁ దెచ్చిరి. వీరి రచనలలో దోషైక దృష్టియు, తర్కవితర్క ములతోఁ గూడిన శాస్త్రచర్చలును దక్కువ. కావ్య సౌందర్యావిష్కారము నకు దోహదమగు లక్షణ దృష్టియు, చారిత్రక, విచక్షణాత్మక, ప్రయో గాత్మక, సమన్వయాత్మక విమర్శన దృష్టియు, (**Historical, Analytical, Applied and interpretative criticism**), నూతనాంశముల ప్రతిపాదించు నుత్సాహవృత్తియు నెక్కువ.

కందుకూరివారి కావ్యలక్షణము, రాఘవయ్యంగారి కావ్యాత్మ, పోణంగివారి భరతనాట్య వ్యాఖ్యా విశేషములు, జి. వి. కృష్ణరావుగారి కావ్యజగత్తు, పింగళివారి సాహిత్య శిల్ప సమీక్ష యిట్టి సమన్వయ సాహిత్య మార్గమున వెలసిన కొన్ని మైలురాళ్ళు.

శృంగారాది రసము లాంధ్ర సాహిత్యమునఁ బోషింపఁబడిన విధమును నిరూపించుటలో నొక్కొక్క రసముపైఁ బ్రత్యేకించి పర్యాలోచనము గావించిన గ్రంథములు కొన్ని వచ్చినవి. అందు ఈ పీఠికాకర్తచే రచింపఁబడిన 'వీర రసము' తెలుఁగు సాహిత్యమున వీరరసపోషణమును వివరించు నేకైక గ్రంథము. అందు గ్రంథకర్త వీరరస స్వరూపము నిరూపించుటయే కాక, సంస్కృత లాక్షణికులు చేసిన వీరరస భేదములకంటెఁ గొన్ని నూతన భేదములను విశ్లేషించి చూపి, తెలుఁగు సాహిత్య ప్రక్రియ లన్నింటి యందును వానిని సమన్వయించి, వాని ప్రయోగ పోషణ విధానములను వివరించి చెప్పుట యైనది. హాస్యరసముపై నిటీవల కొన్ని గ్రంథములు వెలువడినవి. వానిలో తెలుఁగులోని హాస్యరస భేదములను విశ్లేషించి, ప్రాచ్యపాశ్చాత్య శాస్త్ర సమన్వయ దృష్టితో స్వతంత్ర ప్రతిభతో నిరూపించిన శ్రీ ముని మాణిక్యము నరసింహారావుగారి గ్రంథము 'మనహాస్యము' ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగినది. ఇట్టి సమన్వయ విమర్శ లన్ని రసము లందును విరివిగా జరుగవలసి యున్నది.

4. విమర్శ గ్రంథములు :- ప్రధానముగాఁ దెలుఁగు కావ్యముల విమర్శకు సంబంధించిన దీ శాఖ. పుష్టిమంతమైన యీ శాఖయే సాహిత్య విటపికి శిరోలంకారము. తెలుఁగు దేశమున విజ్ఞాన సర్వస్వముల వంటి పండితులు, విద్యాపరిషత్తుల వంటి విమర్శకులు, రససముద్రులవంటి కవి శేఖరులు, హిమనగ సన్నిభులైన శాస్త్రవేత్తలు, ఈ గ్రంథరచనను జేఁబట్టి నిర్వహించిరి. వారి నిధివలె విస్తృతి చెందిన యీ శాఖ యీ వ్యాస శుక్తియం దిముడుట కష్టము.

కావ్య విమర్శలు తొలుదొల్త కవి చరిత్రలుగా కళ్ళు తెరిచినవి. వీరేశ లింగము పంతులుగారి కవుల చరిత్ర యీ శాఖకు మేలుకొల్పులు పాడినది.

ఆంగ్లమున వాఙ్మయ చరిత్ర రచనయున్నది. దానివలెఁ దెలుఁగునవాఙ్మయ చరిత్రలు వెలయుట కీ పంతులుగారి యత్నము శ్రీకారము చుట్టినది. ఆ యత్న మాకాలమున సులభ సాధ్యమైనది కాదు. దేశమున నున్న తాళపత్ర గ్రంథములను సేకరించి, వానిని శోధించి, కవికాల నిర్ణయాదులను, కావ్య స్వరూప స్వభావాదుల నేర్పఱచి, ప్రమాణబద్ధమైన చరిత్ర దృష్టితో ప్రథమ కవుల చరిత్ర రచించుట యైనది. చారిత్రిక విమర్శయు సాహిత్యమున నిట్టి పరిశ్రమ గట్టి పునాదులు వైచినది. ఈ విమర్శను తరువాత సర్వతోముఖముగఁ బోషించినవారు చాగంటి శేషయ్యగారు. వారి ఆంధ్ర కవి తరంగిణి సంపుటములు సప్రమాణమైన వాద నైపుణ్యమునకును, తూకము తప్పని నిర్ధారణములకును ప్రసిద్ధి గాంచినవి. కవి చరిత్రలను గొన్నింటిని కథన నైపుణ్యముతో గురజాడ వారును, మధుర వాక్కులతో మధునాపంతుల వారును వినిపించినారు.

కవుల చరిత్రలు వాఙ్మయ చరిత్రలకు బాటలు వైచినవి. ఆంధ్ర సాహిత్య స్వరూప స్వభావ నిరూపణము, యుగవిభజనము, వాని లక్షణ సమన్వయము, క్రమ వికాస పరిణామ పరిశీలనము, మొదలగు నంశములు వాఙ్మయచరిత్ర రచనలో నంతర్లీనమైయున్న విమర్శాంగములు. వాఙ్మయ చరిత్రలు ప్రత్యేక విమర్శలుకావు. కావున వీనిని విమర్శ కుపాంగములైన చరిత్ర గ్రంథరచనములని పరిగణించుట యుచితము. కవిత్వవేది, బసవరాజు, చెకుమళ్ళ శిష్టా, నేలటూరి, కురుగంటి, ఖండవల్లి, దివాకర్ల, ఆరుద్ర - ఇట్లెందరో ఈ శాఖలో కృషిచేసినారు. సాంఘిక చరిత్ర రచనలో సురవరము ప్రతాపరెడ్డిగారి కృషి ప్రశంసనీయము.

అచ్చు యంత్రముల యడుగుల సవ్వడికి కాలపురుషుని చీకటికొట్లలో సొమ్మసిల్లి పడియున్న తాళపత్ర గ్రంథములు వరుసగా నిద్దుర లేచి వెలుఁగును జూడ మొదలు పెట్టినవి. ముచ్చటైన ముద్రాక్షరములు చదువరులకు సాహిత్యముమీద ముచ్చట గల్పించినవి. తొలియూపులో మహాభారతము గ్రంథ రూపమున సాక్షాత్కరించినది. ఆంధ్రు లా యభిమాన గ్రంథము నధిక సంఖ్యలలోఁ జదివినారు. ఆ కావ్యరుచులను అక్షరబద్ధముగా వెలయించుకొనుటకు విమర్శకులు ముందుకు వచ్చినారు. ఆనాఁడు మొదలినాఁటి వఱకు

తెలుఁగు సాహిత్య విమర్శలో మూఁడింట నొక్కవంతుగా నీ మహాకావ్య విమర్శనము ధారావాహికముగా వచ్చుచునే యున్నది. అది యొక రస జగత్తు. త్రాఁగిన కొలఁది తరుగనిది దాని మహత్తు.

మహాభారతమును చారిత్రక దృష్టితోడను, పాత్రపోషణాద్యౌచిత్య దృష్టితోడను విమర్శించిన వారిలో ముఖ్యులు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. సంస్కృత భారత సమర్థనమునకు శిష్టా సూర్యనారాయణశాస్త్రిగారు, వస్తుతత్త్వ కథనమునకును, సంప్రదాయ సమర్థనమునకును వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తి నిరూపణమునకు విశ్వనాథ సత్యనారాయణగారు, తిక్కన కావ్యనిర్మాణ మర్మవివేచనమునకు కోరాడ రామకృష్ణయ్యగారు, తులనాత్మక పరిశీలనమునకు కాశూరి వ్యాసమూర్తిగారు, కవిత్రయ రచనల సమీక్షకు నండూరి రామకృష్ణాచార్య, గుఱ్ఱం వెంకట సుబ్బరామయ్యగారలు రచించిన గ్రంథములు ప్రశంసనీయములు. కవిత్రయములో నెఱ్ఱనపై మంచి విమర్శ గ్రంథ మింకను రావలసియే యున్నది.

కొందఱు తెలుఁగు కవులపైఁ గొందఱు విమర్శకులకు ప్రత్యేకమైన యభిమానము గలదు. ఆ యభిమానమే వారిచే నాయాకవుల కావ్యములను గూర్చి విశేష విమర్శచేయుటకు దోహదకారియైనది. పాల్కురికి సోమనాథునిపై బండారు తమ్మయ్య గారు, నాచనసోమునిపై నడకుదుటి వీరరాజు పంతులుగారు, వేమనపై రాళ్ళపల్లి వారు, శ్రీనాథునిపై చిలుకూరి వీరభద్రరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, గడియారం వేంకటశేషశాస్త్రి, చిలుకూరి పాపయశాస్త్రి, కుందూరి ఈశ్వరదత్తుగారలు, పింగళి సూరనపై కట్టమంచి రామలింగారెడ్డిగారు, శైవసాహిత్యముపై నిడుదవోలు వెంకటరావు, శిష్టా రామకృష్ణశాస్త్రిగారలు, పెద్దనపై జనమంచి శేషాద్రిశర్మ, విశ్వనాథగారలు, దక్షిణాంధ్ర వాఙ్మయ కవులపై వేటూరి ప్రభాకరశాస్త్రి, నిడుదవోలు వేంకటరావు, నేలటూరి వెంకట రమణయ్యగారలు, ఉదాహరణ వచన వాఙ్మయములపై విశేషించి నిడుదవోలు వారును, శతకవాఙ్మయముపై వంగూరి సుబ్బారావుగారును, తాళ్ళపాక వారిపై వేటూరి, రాళ్ళపల్లి వారును రచించిన గ్రంథములు ప్రసిద్ధములు.

తెలుఁగున మహాభారత కవుల తరువాత నత్యంత విస్తృత గ్రంథ విమర్శకు నోచుకొనిన కవివరులు శ్రీనాథుఁడు, నాచన సోమన, సోమనాథుఁడు, పింగళి సూరన, పెద్దన, మొదలగువారు. సాహిత్యచరిత్రలోని శైవ, ప్రబంధ, దక్షిణాంధ్రాధునిక యుగములు పలువురి విమర్శకుల గాఢ పరిశీలనకు క్షేత్రములైనవి. ఎందఱో మహానుభావులెన్నియో గ్రంథములు వ్రాసిరి. వానినేకరువు పెట్టుట కిది యదను కాదు.

పై విమర్శకులందఱును తెలుఁగు కవుల స్వతంత్ర ప్రతిభను వెల్లడించుటకుఁ దమ గ్రంథరచనలు చేపట్టిరి. అనువాద కావ్యములలోని యనువాద పద్ధతులు వివేకింపఁబడి భారత కవుల కథానువాద పద్ధతి తెలుఁగు కవుల సాధారణానువాద పద్ధతిగాఁ బరిగణింపఁబడినది. శ్రీనాథాదులభావానువాదమా కవుల ప్రత్యేకతను జాటుచు విమర్శకుఁ గొంత వైలక్షణ్యమును సంతరించినది. శబ్దానువాదమును మన విమర్శకులు గౌరవింపలేదు. తెలుఁగు విమర్శ గ్రంథములలోఁ గావ్యరచనా విమర్శయందు ప్రధానముగాఁ గథాకథన విధానము, వస్తుసంవిధానము, రసానుగుణమైన పద్యగద్య రచనాశిల్ప పరిశీలనము, పాత్రపోషణము, శబ్దార్థాలంకార ప్రయోగ సార్థక్యము, కవి వాడిన పదజాలములు, ఛందసులు, వ్యాకరణాది విశేషములు మొదలగు వాని నిరూపణము, కావ్యము వెలసిననాటి చారిత్రక, సాంఘిక, మత పరిస్థితులను దృష్టిలో నుంచుకొని దానిపుట్టుటకుఁగల ప్రయోజనము నఱయు నన్వేషణము, కవియొక్క వ్యక్తిత్వపు విలువను తూకము కట్టుట, అతని కవిత్వ తత్త్వమును, అతఁడు వర్ణించిన యాలంకారిక సిద్ధాంతములను నిగ్గుతేల్చి నిరూపించుట, పూర్వాపర కావ్యప్రభావ సమీక్షణము - అనునవి సోదాహరణముగా వివరింపఁబడు నంశములు. దేశిసాహిత్య ప్రక్రియల ప్రత్యేకతను నిరూపింప యత్నించిన గ్రంథములలో వాని లక్షణములను చారిత్రాత్మక దృష్టితోఁ బరిశీలించి పరామర్శించుట కానఁబడును.

లాక్షణికులలో కావ్యస్వరూపమును గుఱించి విమర్శించుచు తచ్ఛరీరమైన శబ్దార్థ-వస్తువిచారముల వఱకే ఆగినవారును, అపై నాత్మవిచారము నారంభించిన వారును, చివఱకు కావ్యాత్మజ్ఞానము సాధించిన వారును గానఁబడుచున్నట్లే తెలుఁగు విమర్శ గ్రంథకర్తలలోఁ గూడ పై మూఁడు తెఱఁగుల వారును గానఁబడుచున్నారు. వస్త్వలంకార రసధ్వనులలో దన

ధ్వనికిఁ బ్రాధాన్య మిచ్చిన యభినవ గుప్తపాదులవలె విజ్ఞులెప్పుడును రసజ్ఞులైన విమర్శకుల గ్రంథముల కధిక గౌరవము నిచ్చెదరు. తెలుఁగువారిలో కవులై, విమర్శకులై రాణించినవారు పెక్కుమంది కలరు. వారి రచనలు శుద్ధవిమర్శకుల రచనలకన్న కళామయములై పఠితల నాకర్షించుచున్నవి. "To judge of poets is only the faculty of poets" అన్న జాన్సన్ వాక్య తాత్పర్యమున కా రచనలు చక్కని యుదాహరణములు.

తెలుఁగు విమర్శలో ఛందోవ్యాకరణాది శాస్త్రగ్రంథ విమర్శలు, భాషావిమర్శలు, ప్రత్యేకస్థానము నాక్రమించి యున్నవి. మార్గచ్ఛందో విమర్శయందు లక్షణ సమన్వయ విమర్శయే అధికముగా వెలువడినది. దేశీచ్ఛందముల స్వరూపనిరూపణయందు మంచి కృషి జరిగినది. కాని ఛందము రసవ్యంజకముగా సాహిత్యమున దాని సార్థక్యమును జెప్పు సంప్రదాయ మెక్కువ కానరాదు. అది కొంత కావ్యవిమర్శయందే కానఁబడుచున్నది. కాగా, నాంధ్రచ్ఛందముల గతియందును వృత్తనిర్మాణము నందును గొన్ని విశేషాంశములు ప్రతిపాదించిన వారు లేకపోలేదు. ఇట్టి పద్ధతికి శ్రీ గిడుగు సీతాపతిగారి 'తెలుగు ఛందోరీతులు' చక్కని యుదాహరణము. శాస్త్ర దృష్టితోఁ బ్రాచీనుల యభిప్రాయములను గ్రోడీకరించి సమన్వయదృష్టితో సాగించిన ఛందోవిమర్శకు నవ్యులలో శ్రీ రావూరి దొరస్వామిశర్మగారి 'తెలుఁగుభాషలో ఛందోరీతు'లను గ్రంథ ముదాహరణము.

వ్యాకరణ విమర్శలో ప్రధానముగా సంస్కృతాంధ్ర వ్యాకరణ మర్యాదల పై జరిగిన చర్చలు, ప్రయోగ ప్రమాణవాదములు, సూత్రార్థ సమన్వయ వ్యాఖ్యలు, వాకరణ రచనా పరిణామ విమర్శలు మొదలగునవి ముఖ్యములు. ఇట్టివి పెక్కులు వ్యాఖ్యలలోను, వ్యాసములలోను నిమిడి యున్నను వానిని గ్రంథరూపమున రూపొందించిన వారందఱిలోను శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగా రగ్రగణ్యులు.

భాషావిమర్శను గ్రాంథిక వ్యావహారిక భాషావిమర్శ యనియు, భాషా శాస్త్ర విమర్శ యనియు ద్వివిధాకరింపవచ్చును. మొదటి విభాగమున జయంతి రామయ్యపంతులుగారు మొదలగు పండితులు గ్రాంథిక భాషను, గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలగు పండితుల వ్యావహారిక భాషను సమ

ర్ధించుచు చేసిన వాదోపవాదములు, వ్రాసిన గ్రంథములు గణింపఁ దగినవి. ఈ వాద మిప్పటికిని సజీవముగనే యున్నది. ఇఁక తెలుఁగు భాష సంస్కృత జన్య మనియు, ద్రావిడ భాషాజన్యమనియుఁ జెప్పు సిద్ధాంతములపై నాధారపడి వెలసినది భాషాశాస్త్రవిమర్శ. చిలుకూరి నారాయణరావుగారు సంస్కృత భాషాజన్య వాదమునకుఁ బ్రసిద్ధులు. ద్రావిడ భాషాజన్య వాదమున నకు కాల్డ్వెల్ సిద్ధాంతానుయాయులు ముఖ్యులు. పంగిలో కోరాడ రామ కృష్ణయ్యగారు, వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు, గంటి జోగి సోమ యాజులు గారు రచించిన రచనలు ప్రామాణికములు. ఆధునిక భాషా శాస్త్రము తెలుఁగున నిప్పుడిప్పుడే కాలూనుచున్నది. ఈ శాస్త్ర విమర్శలో నగ్రగణ్యులు డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు.

ఆంధ్రు లాంధ్రసారస్వతము పైనేగాక సంస్కృత వాఙ్మయమున వేదముల నుండి విభక్తుల వఱకు పెక్కు విషయములమీద విమర్శ గ్రంథము లను వెలయించినారు; సంస్కృత భాషోచ్చరణము నందే కాక సాహిత్య సమాలోచనము నందును ఉత్తమ ప్రమాణములను పాటించినారు. వాల్మీకి, వ్యాస, కాళిదాస, భాస, హర్ష, దండి, భవభూతుల కావ్యములు తెలుఁగు విమర్శకుల వాఙ్మయార్చనల నందుకొన్నవి. సాహిత్య, శాస్త్ర, భాషా విషయములలో సంస్కృత గ్రంథము లాంధ్రులకు ప్రమాణ మూలములై పూజల నందుకొనుచున్నవి.

*5. పీఠికలు :—* మొదటిసారి ముద్రితములైన గ్రంథములు, పునః పరిష్కృతములైన ప్రచురణములు విమర్శాత్మకమైన పీఠికలతో వెలువడినవి. గ్రంథపరిష్కారమును శాస్త్రబద్ధముగా నిర్వహించిన పండిత ప్రకాండుల చేతులలో నవి భావి విమర్శకు ప్రమాణములైన విజ్ఞాన పీఠికలుగా వెలసినవి. ప్రామాణికమైన పీఠికా వాఙ్మయమును వెలయించిన వారిలో వీరేశలింగము పంతులుగారు, తం. శేష ప్పెరుమాళ్ళయ్యగారు, పూండ్ల రామకృష్ణయ్య గారు, బహుజనపల్లి సీతారామాచార్యులుగారు, వేదము వెంకట్రాయ శాస్త్రి గారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు, మానవల్లి రామకృష్ణ కవిగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు, బండారు తమ్మయ్యగారు, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, కోరాడ రామ

కృష్ణయ్యగారు, నిడుదవోలు వెంకటరావుగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. ఈ యూణ్ణి వీరరాఘవాచార్యులుగారు, దివాకర్ల వేంకటావధానిగారు. ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు, ఇట్లు ఎందఱో మహానుభావులున్నారు. ఆధునిక కాలమున వెలసిన కావ్యముల పీఠికలు పరిచయాత్మకములైనవే, కాని వానిలో విశ్వనాథ. రాళ్ళపల్లి. కట్టమంచి. మల్లంపల్లి, శ్రీశ్రీ మొ॥ వారు రచించిన కావ్యపీఠికలు నవ్యవిమర్శకులలో ప్రామాణికభావమును సంపాదించుకొని యున్నవి.

*6.* వ్యాసములు :— ఆంగ్లభాషలోని **Essay** ను మనము వ్యాసమను చున్నాము. ఒక యంశమును గూర్చి సంగ్రహముగా, సారవంతముగా, సరళమైన శైలిలో, శిల్పసుందరముగా, రసవత్తరముగాఁ జెప్పునది వ్యాసము. విషయము మనోజ్ఞముగా వ్యక్తీకరింపఁబడుటయే వ్యాసమునకు శక్తి. వ్యాసకర్త ఉక్తివైచిత్రి దానిని రక్తికట్టించును. వ్యాసము చిన్నకథవలె, భావగీతమువలెఁ బఠితకు మధురానుభూతి నందింపవలెను. నేఁ డీ వ్యాస రచనాప్రక్రియ విశ్వసాహిత్య వ్యాప్తమై సహృదయులను సమ్మోహ పఱచు చున్నది.

పత్రికలు వ్యాసములకుఁ బెంపుడు తల్లులు. వాని వాత్సల్య రస ముతో వ్యాసములు వాహినులవలె పొంగి సారస్వత క్షేత్రమును సారవంతము చేయుచున్నవి. తెలుఁగున క్రీ.శ. 1850 ప్రాంతమున వ్యాసము పుట్టినది. కందుకూరి వీరేశలింగము పంతులుగారు దాని కుగ్గుపెట్టి లాలించుటతోపాటు నిగ్గుపెట్టి నీటుతనము నేర్పినారు ; పానుగంటివారు మాటలవస నూరిపోసి నారు ; వేదమువారు లక్షణము చెప్పినారు ; గిడుగువారు వ్యావహారిక షాడ్గుణ్యము నలవఱిచినారు ; చెళ్ళపిళ్ళవారు చలాకీతనము నేర్పినారు; ముట్నూరివారు భావగాంభీర్యము పట్టువఱిచినారు ; కట్టమంచివారు కట్టు బొట్టులలోఁ గ్రొత్తదనము తెచ్చినారు ; రాళ్ళపల్లివారు సరాగముల పరాగములు మాటలలో నింపినారు ; విశ్వనాథవారు విద్యయు. వివేకమును బోధించినారు. పింగళివారు ప్రియమితభాషిత్వ మలవఱిచినారు. వేటూరి వారు సూటిదనమును, దేఁటదనమును సూచించినారు ; దువ్వూరివారు

నెయ్యపు తియ్యఁదనము నేర్పినారు. ఇట్లు వ్యాసము పెరిగి, పుట్టెడు బుద్ధులతో పెద్దదై తెలుఁగు భాషామతల్లి నలరించుచున్నది.

తెలుఁగున వ్యాసము విషయవైవిధ్యమునుబట్టి బహువిధములుగాఁ గానఁబడుచున్నది. అందు సాహిత్య విమర్శ కాలవాలమగు 'సాహిత్య వ్యాస' మిచ్చుట ప్రస్తుతము. తెలుఁగున సాహిత్య వ్యాసము మొదట ఉపదేశమునకై పుట్టినది: తరువాత చారిత్రక విమర్శకుఁ బూనుకొనినది: ఆ పైన నధిక్షేపము సాగించినది: వాదోపవాదములకు రంగస్థలమైనది: శబ్దార్థ చర్చలకు రచ్చబండ యైనది: అట్లైనను తెలుఁగు కవుల కవిత్వ మరందమును, సాహిత్య సుగంధ చర్చలను రసికుల కందించి యానందింపఁ జేసినది. శాస్త్ర సాహిత్యమును సగౌరవముగా మన్నించినది: తులనాత్మక పరిశీలనమును, విశ్లేషణ విన్యాసమును గావించినది: ప్రాత నెంతయో పైకి తీసినది: క్రొత్త నెంతయో గొప్పగా చెప్పినది. సాహిత్యవేత్త యొక్క శాబ్దపు విజ్ఞానఫలసమృద్ధియు, హృదయ రససిద్ధియు వ్యాసముకురమునఁ బ్రతిబింబించినవి.

స్వభావమునుబట్టి వ్యాసము విషయ ప్రధాన మనియు, శిల్పప్రధాన మనియు వేఱుపఱుపవచ్చును. సాధారణముగా విషయ ప్రధాన వ్యాసమున నేదో యొక సంప్రదాయానుసరణము, పరాశ్రయత్వము (**Objectivity**), విశేషాంశప్రతిపాదనమువలన మానసిక వికాసము కల్గించు లక్షణము కానన గును. శిల్పప్రధాన వ్యాసమున సంప్రదాయ స్వాతంత్ర్యమును, ఆత్మాశ్రయత్వమును (**Subjectivity**), భావనామయ మైన యాత్మానుభూతిఁగలిగించు లక్షణమును దెలియవచ్చును. మొదటి విభాగమున గ్రంథ ప్రాయములైన వ్యాసములును, చారిత్రాత్మక, విమర్శనాత్మక, వివరణాత్మక వ్యాసములును ఉండును. రెండవ భాగమున ఒక సాహిత్యాంశమును సంగ్రహముగాఁ జిత్రించునట్టి చిన్న వ్యాసములు, పాత్రచిత్రీకరణములు. శైలీ గమ్యములు, భావగమ్యములు హృదయ స్పందకములు, నైన కళాత్మక రచనలు నుండును. పాశ్చాత్యులలో వచన పద్యములను శిల్పవ్యాసములలోఁ జేర్చిన వారు కొందఱున్నారు. మొత్తమునకు సమాచార మందించుట, సహానుభూతి కలిగించుట–యను లక్షణములు వ్యాసమునకు సహజము లైనను ప్రాధాన్య వివక్షతోఁబై పరిగణనము చేయఁబడినది. తెలుఁగున వెలసిన వ్యాస వాఙ్మయములో విషయ ప్రధాన వ్యాసమువకే పై చేయి కలదు, కళాఖండముగాఁ

దీర్చిదిద్దిన వ్యాసము ఖండకావ్యముపలె శక్తిమంత మైన సృజనాత్మక పరిణామములను సాహిత్యమునఁ దీసికొని రాఁగలదు. తెలుఁగు వ్యాసమున కట్టి శక్తి యింకను బెంపొందవలసి యున్నది.

కవిగ్రంథ పరిచయములు, కావ్య ప్రశంసలు, కవితారహస్యములు, కథాకథన శిల్పములు, పాత్రచిత్రణ విధానములు, రసపోషణ రంగములు, ఔచిత్య విచార చర్చలు, కావ్యార్థ సమస్యలు, శబ్దార్థ చర్చలు, శాస్త్ర సమన్వయములు, చరిత్ర కథనములు, భాషావాదములు, జీవితచిత్రణములు, స్వీయకథా శిల్పములు, సమకాలీన సాహిత్య ప్రక్రియా పరామర్శలు, కావ్యగుణదోష చర్చలు, గ్రంథ సమీక్షలు, విమర్శ ప్రతివిమర్శలు, విమర్శ చరిత్రలు పాఠభేద శబ్దప్రయోగాదుల సాధుత్వాసాధుత్వ విచారములు— ఇట్టి యంశముల కెన్నింటికో నేటివ్యాసము ప్రకటన సాధన మైనది. పరిశోధన కీవ్యాసము ముఖ్యమైన ముడిసరుకు.

తెలుఁగు వ్యాసకర్తల నందఱ నెన్నుట యిచ్చట సాధ్యమగు పని కాదు. నూఱేండ్ల వ్యాసచరిత్రలో తెలుఁగువారి హృదయముల నెక్కిన వ్యాసకర్తలు నూఱుమంది నికరముగా గలరని చెప్పుకొనుట గర్వకారణమే కాఁగలదు: వారి విమర్శ స్వభావమును బట్టి సమీక్షకులనియు, విచక్షణు లనియు, పరిశీలకు లనియు, తత్త్వాన్వేషకు లనియు వారిని వింగడింప వచ్చును. సాహిత్యప్రచారమున కుపయోగపడు పరిచయాత్మక వ్యాసములు వ్రాయువారు సమీక్షకులు : సాహిత్య స్వరూపమును విషయ వివేచనాత్మక మైన దృష్టితోఁ బ్రదర్శింపఁ గలవారు విచక్షణులు ; సాహిత్యస్వభావము నెఱింగి సమన్వయదృష్టితో మూతనాంశములను బ్రదర్శించువారు పరిశీలకులు ; సాహిత్య పరమార్థము నెఱిఁగి వాఙ్మయ జగత్తులను తత్త్వాన్వేషణ దృష్టితో సమీక్షించి కావ్యాదుల మహాతాత్పర్యము నుపన్యసించు వారు తత్త్వాన్వేషకులు.

గ్రథరచనలో కంటె వ్యాసరచనలో వ్యాసకర్తల వ్యక్తిత్వముల ముద్ర సులభముగాఁ గానవచ్చును. వారివారి యభిరుచుల రంగుటద్దములలో నాయా యంశములు రమణీయముగాఁ బ్రతిబింబించుచుండును. తెలుఁగు వ్యాసకర్తలలో సంప్రదాయవాదు లున్నారు. వారిలో ధ్వనిమార్గము ననుసరించి శిల్పదృష్టితో విమర్శించు విశ్వనాథవంటి రసవాదు లున్నారు ;

లక్షణబద్ధమైన సాహిత్య విమర్శ సాగించిన వేదము, మల్లాదులవంటి ఆలంకారిక వాదులున్నారు; ఆడంబరమైన శైలిని, చమత్కృతమైన రచనను వరించు నడకుదుటి వారివంటి రీతివాదులున్నారు; రసప్రసన్నమైన కవితా పాకమును గోరి మేలిక్షైతను మెచ్చుకొను రాళ్ళపల్లి వారివంటి ఔచిత్య వాదులున్నారు. సాహిత్యపు తత్త్వమును వడియగట్టగల చిక్కని రచనచేయు ముట్నూరివారివంటి తత్త్వవాదు లున్నారు.

తెలుగులో స్వాతంత్ర్యవాదు లొకవర్గము. వారిలో పాశ్చాత్య ప్రమాణములను వరించిన కట్టమంచి ప్రతిభావాదు లున్నారు; ఆత్మాశ్రయ విమర్శ విధానము వెలయించిన గురజాడ, బసవరాజువంటి కాల్పనికోద్యమ వాదులున్నారు; సంప్రదాయమును, కట్టుబాట్లను త్రెంచి యుగమును ఊపించి బుజముతట్టెడి శ్రీశ్రీ వంటి విప్లవవాదు లున్నారు.

మూడవవారు చారిత్రకవాదులు - సాహిత్యచరిత్రకు సంబంధించిన సామగ్రిని సేకరించి, వానిని చారిత్రక దృష్టితోఁ బ్రదర్శించి, వివిధ సాహిత్య విషయములను వివరింపఁగలుగు నిడుదవోలు వారి వంటి చారిత్రక విమర్శకులును; కొమర్రాజు, మల్లంపల్లి గార్ల వంటి చరిత్ర విమర్శకులును, శాసన పరిష్కర్తలును, ఇందున్నారు.

నాల్గవ తెగవారు పండితులు, వివిధ సాహిత్యాంశముల పై వాదోపవాదములు నెరపిన వ్యాసకర్త లీశాఖకుఁ జెందుదురు. కాశీభట్ల, చెళ్ళపిళ్ళ, గిడుగు, జయంతి వంటి వారీత్రోవలో నుద్దండులు. పాఠభేద ప్రయోగవాదములకు దీపాలవారిది సిద్ధహస్తము. ఇట్లు విశ్లేషణముచేయుచు పరిశీలించినచో వ్యాస వాఙ్మయ విస్తృతినిఁ గొంతవఱకు వివేకింప వీలగును.

7. చర్చలు - సమీక్షలు — పత్రికలలో గ్రంథసమీక్షలు; చర్చావేదికలు వెలువడి సాహిత్య వ్యాసంగమును సజీవ మొనర్చుట కెంతయో తోడ్పడుచుండును, తెలుఁగున నీశాఖలో సాధారణముగా వ్యక్తిగత దూషణభూషణలు చోటుచేసికొనుటచే నది యెదుగవలసినంత యెత్తు యెదుగ లేక పోయినది.

8. పరిశోధనము :— తెలుఁగున పరిశోధనను వెలయించి శాస్త్రబద్ధముగా దానినిఁ బోషించిన మహామహులు పై గ్రంథకర్తలలో నున్నారు, సాహిత్యపరిషత్తుల ద్వారమునను, పరిశోధక మండలుల ద్వారమునను బరిశోధన కొంత యభివృద్ధి చెందినది. కొమఱ్ఱాజు, మల్లంపల్లి, వేటూరి, గిడుగు, మానవల్లి, జయంతి- మొ॥ విద్వన్మణు లీశాఖకు పోషకులు.

పరిశోధనము విశ్వవిద్యాలయములలో నడుగుపెట్టుటతో నొకనవ్యగత నందగించుకొనినది. పింగళి, ఖండవల్లి, దివాకర్ల, గంటి.నిడుదవోలు మొదలగు నాచార్యులు ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా, మద్రాసు, విశ్వవిద్యాలయములలోఁ దెలుఁగున బరిశోధన లారంభింపఁజేసి, పట్టభద్రులైన విద్యాంసులను బ్రోత్సహించి, సిద్ధాంత వ్యాసములు వెలయు నవకాశము కల్పించిరి. మైసూరు బెంగుళూరుల కీయుద్యమము వ్యాపించినది.

తెలుఁగు సారస్వతమున సంస్కృత సంప్రదాయ విమర్శకును, పాశ్చాత్య సంప్రదాయ విమర్శకును సంఘర్షణ మేర్పడిన తరుణమున సమన్వయ విమర్శ సమర్థముగా రూపుకట్టుటకు విశ్వవిద్యాలయములు ప్రశంసావహమైన కృషిచేసినవి. నేఁటి పరిశోధనలలో సందర్భమునుబట్టి యీమూఁడు విమర్శపద్ధతులు వాడఁబడుచున్నను సమన్వయ విమర్శకు విశేషస్థాన మీయఁబడు చున్నది.

విశ్వవిద్యాలయములు - భాషకును, సాహిత్య ప్రక్రియలకును; వ్యాకరణ చ్ఛందోలంకార శాస్త్రములకును, ప్రసిద్ధ కవులకును ప్రాధాన్య మిచ్చి వానిపైఁ బరిశోధనలు సాగింపఁ జేసినవి. నన్నయకు పూర్వ మున్న భాషపైని, ఆదికవి నన్నయపైని డా. దివాకర్ల వేంకటావధానిగారి పరిశోధనము ప్రశంసనీయము. సాహిత్యప్రక్రియలలో, ప్రబంధములపై డా. కె. వి. ఆర్. నరసింహము, డా. పల్లాదుర్గయ్యగార్లు, యక్షగానములపై డా. యస్. వి. జోగారావుగారు; ద్విపదవాఙ్మయము పై డా. నాగయ్య గారును, జానపదవాఙ్మయము పై డా. బి. రామరాజుగారును, వచనవాఙ్మయము పై డా. కులశేఖరరావుగారును. నవలలపై డా. బొడ్డపాటి కుటుంబరావుగారును, నాటకములపై డా. పి. యస్. ఆర్. అప్పారావుగారును, ఆధునికాంధ్ర

సాహిత్య ప్రక్రియలపై డా. సి. నారాయణరెడ్డిగారును చేసిన పరిశోధనలు గణింపఁదగినవి. ఆంధ్ర భాషలోని ధాతువులపై డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు, వ్యాకరణములపై డా. బొడ్డుపల్లి పురుషోత్తముగారు, ఛందస్సుపై డా. పాటిబండ మాధవశర్మగారు చక్కని సిద్ధాంత వ్యాసములను వెలయించిరి. ఇఁక ప్రసిద్ధకవులలో తిక్కనపై డా. కేతవరపు రామకోటి శాస్త్రిగారు, మారనపై డా. జి. వి. సుబ్రహ్మణ్యము. శ్రీనాథునిపై డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, నాచనసోమునిపై డా. యశోదారెడ్డిగారు, రామరాజభూషణునిపై డా. సుప్రసన్నాచార్యులుగారు రచించిన సిద్ధాంత వ్యాసము లీ శాఖకు కొన్ని యుదాహరణములు. ఆంధ్రసాహిత్యముపై ఆంగ్లసాహిత్య ప్రభావమును గూర్చి డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి పరిశోధనయు. కళాపూర్ణోదయముపై డా. జి. వి. కృష్ణరావుగారాంగ్లమున వ్రాసిన సిద్ధాంత వ్యాసమును ప్రత్యేకముగా పేర్కొనఁదగినవి. ఈ పట్టిక దిఙ్మాత్రోదాహరణము మాత్రమే.

శాస్త్రబద్ధమైన విమర్శ కీ సిద్ధాంత వ్యాసములు చక్కని రాచబాటలు వేసినవి. వీనిలో నూతనాంశముల ప్రతిపాదనము, నూతనదృక్పథముల ప్రసారము, నూతన సమన్వయముల విధానము విశిష్టముగాఁ గానవచ్చును. విమర్శయొక్క సమగ్ర రూపము వీనివలన నేర్పడును. తత్పరిశోధన ఫలితముల పర్యాలోచనము సాహిత్య సమాలోచనమున నూతన సమన్వయ మార్గముల నావిష్కరించును. అది విమర్శ లక్ష్యమువైపు వైచిన యొక ముందడుగు కాఁగలదు!

తెలుఁగులో సమన్వయ విమర్శ విస్తరించుచున్నదని సంతృప్తిపడిన చాలదు. ఆధునిక సాహిత్యము వచ్చుచున్నది. దానిపై విమర్శ వచ్చుచున్నది. కాని అది పరిచయ ప్రశంసల స్థాయిని మించి యెదుగుటలేదు. తెలుఁగున సృజనాత్మక చైతన్యమునకు లక్ష్యశుద్ధి లేకపోవుట యేదానికి ప్రధాన కారణము: విశ్వజనీనములైన సాహిత్య ప్రమాణములను పాటింపక వ్యక్తిగత ప్రమాణములనే నవ్యులు పాటించుట మఱియొక కారణము. లక్ష్యశుద్ధి కల కవితయు, ప్రమాణబద్ధమైన విమర్శయు, కవితావ్యాదయముగల విమర్శకుఁడును తెలుఁగు దేశమున నెల్లకాలములయందును మూడుపూవ్వు లాఱుకాయలుగా వర్ధిల్లుదురు గాక!

## 5

ఈ సంకలన సంపుటిలోని వ్యాసములు సాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ), భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక - అను సాహిత్య పత్రికల నుండి యెన్నిక చేయఁబడినవి. ఇందు సాహిత్య పరిషత్పత్రిక సంప్రదాయ విమర్శకును, గ్రాంథిక భాషా వాదమునకును ప్రసిద్ధి. భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు తెలుఁగున వెలసిన సాహిత్య ప్రక్రియల కన్నింటికిని సమప్రాధాన్య మిచ్చి పోషించిన సాహిత్య పత్రికలు. భారతి నలుబది యైదేండ్ల సాహిత్య పరిణామమునకు సాక్షి—అన్నను సత్యదూరము కాదు. పై పత్రికల ప్రాతసంపుటులను గమనించినచో శతాధిక ప్రసిద్ధాంధ్ర విమర్శకులు మన కన్నులముందు ప్రత్యక్షము కాఁగలరు. ఎంతటి సజీవ చిత్రమది! వారిలో ముప్పది మంది విమర్శకులు రచించిన ముచ్చటైన వ్యాసముల నేర్చి కూర్చిన సంపుటి యిది!

వ్యాసముల నెన్నిక చేయుటలో ముప్విధమైన లక్ష్య ముపలక్షింపఁ బడినది. 1. వ్యాసములు సాహిత్య చరిత్ర యొక్క స్థూలస్వరూపమును వ్యక్తము చేయవలెను. 2. సాధ్యమగు నంతవఱకు కాయారచయితల కభిమాన పాత్రములైన యంశముల పైగల వ్యాసములను గ్రహింపవలెను. 3. శైలిలో భేదము, సంవిధానములో వైవిధ్యము, విషయ వివేచనతోపాటు హృదయః ప్రమోదము గల్గించు లక్షణము, సాహిత్య చారిత్రక ప్రాధాన్యము మొదలగు నంశములను సంకలనమున పాటింపవలెను. ఈ ప్రయోజనము లెంతవఱకు సాధింపఁబడినవో నిర్ణయింపవలసినవారు సహృదయులు!

నన్నయ్యకుఁ బూర్వమున నున్న భాషాస్థితి నుండి నేఁటి సాహిత్య స్థితివఱకు వ్యాసముల పరిధి వ్యాపించి యున్నది. అందు ప్రధానముగాఁ తెలుఁగు కవిత్వపు తీరుతెన్నులు సమీక్ష చేయఁబడినవి. తెలుఁగు కవులను కూర్చిన కొన్ని వాదములు స్పృశింపఁబడినవి : సాహిత్య యుగము లన్నియు నిదర్శింపఁబడినవి !

చిమ్మచీకటులు క్రమ్ముకొని యున్న ప్రాఙ్నన్నయ యుగము నందలి శాసనములలోని తెలుఁగును, దాని రూపురేఖలను దివిటీపట్టి చూపించినవారు

శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు. చరిత్రయు, భాషాశాస్త్రము, వారి వ్యాసపుటమున రసార్ద్రముగాఁ జాలువారినవి :

వివాదగ్రస్తమైన మార్గదేశికవిత్వములను విశిష్ట సమన్వయ దృష్టితో పరిశీలించి నిరూపించినవారు డా. దివాకర్ల వేంకటావధానిగారు. వారి వ్యాసము వెలయింపని సాహిత్యాంశము లేదు. సమన్వయింపని సాహిత్య సమస్య లేదు. విషయ వివేచనము, ప్రసన్న గంభీరమైన శైలి వారి వ్యాసరచనకు వన్నె దెచ్చిన గుణములు.

ఒక కవి స్వయముగాఁ జెప్పుకొని ప్రత్యేక కావ్యలక్షణముపై సూక్ష్మ దృష్టితో విశేష విమర్శనము చేయుట తెలుఁగులో నరుదు. అట్టి అపూర్వ మార్గమున నన్నయ పెద్దన, నాచన సోములమీద విమర్శ వెలయించినవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. నన్నయ యన్నను, అతని కవిత్వ మన్నను విశ్వనాథవారి కభినివేశము మెండు. వారివ్యాసము శిల్పమార్గమున వెలసిన యొక మణిమందిరము.

నన్నిచోడుని కాల నిర్ణయ సమస్య వివాదగ్రస్తమైనది. ఆ కవి నన్నయకు ముందని కొందఱు తిక్కనకు ముందు వెనుకల నుండెనని మఱి కొందఱు తీవ్రముగా వాదించుకొనిరి. ఆ కవి కాల నిర్ణయమునకుఁ బరమ ప్రమాణమైన చెఱుకూరు శాసనమును బ్రకటించి నన్నిచోడుని తిక్కనకు ముందు నిలిపిన మనీషి శ్రీ జయంతి రామయ్య పంతులుగారు. సప్రమాణముగాఁ జేయు కాల నిర్ణయ విమర్శకు వారి వ్యాసము ప్రమాణము.

తిక్కన కావ్య నిర్మాణకళ యతని కవితాబంధమువలెనే యనన్య సాధ్యము. అతనిపై తెలుఁగున పెక్కుమంది బహుముఖముగా విమర్శ వెలయించిరి. కాని యతని కవిత్వాంశమును సాధించి కావ్యనిర్మాతలైన శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగా రొనర్చిన విమర్శకొక సార్థక్యముకలదు. కవి హృదయమును కవియే వివరించిన వ్యాస మది.

వాల్మీకి వ్యాస కవితామార్గముల నభిమానించి, నన్నయ తిక్కన లొనర్చిన రసపోషణ విధానములను దనలో రసయోగముగా సాధించుకొనిన మహాయోగి, మహాకవి ఎఱ్ఱయ్య. అతని కావ్యఘట్టములలో గుభాళించు

నానంస్కార పుష్ప పరాగమును ప్రోవుచేపిన వ్యాసము శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి రచన.

విపులమైన వీరశైవ వాఙ్మయ రంగమున వివేకముతో విహరించి, విశేషముల నేరి తెచ్చి, వినూత్న సాహిత్య ప్రక్రియలను వివరించుచు, నంద ముగా నలంకరించిన వస్తు ప్రదర్శనశాల శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి వ్యాసము.

సోముని సమగ్ర హరివంశ మున్నదని బల్లగుద్ది చెప్పుచు, అతని నవీన గుణ సనాథత్వమును నాణెమైన వాదబలముతో నిరూపించు నడకుదుటి వీరరాజు పంతులుగారి వ్యాసము వారి యభిమాన కవిచంద్రున కిచ్చిన యొక నూలుపోగు.

శ్రీనాథుఁడు శృంగార పురుషుఁడని యతని మొగమున మచ్చపెట్టు మనీషుల ముందు భక్తిభావ ముద్రతో శృంగార నైషధము నిర్వహించిన యా కవిరాజు నిష్కళంక మూర్తికి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగా రెత్తిన అక్షర నీరాజనము వారి వ్యాసము.

కాళిదాస శాకుంతల నాటకమును శృంగార రసస్యందముగాఁ దెలుఁగునోట ప్రబంధముగా వినిపించిన పిన వీరభద్రుని కవిత్వ లక్షణమును గుణదోష విచార చర్చతో గుర్తించినది శ్రీ ఏకుమళ్ళ అచ్యుతరావుగారి వ్యాసము.

తెలుఁగునఁ గథా కావ్యములలో విశిష్ట వ్యక్తిత్వము గలది సింహాసన ద్వాత్రింశిక. దాని ప్రథమ ప్రచురణమునకు వ్రాయఁబడిన బరిచయాత్మక మైన పీఠికా రచనము శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాసము.

పోతన నివాసము ఓరుగల్లు—ఒంటిమిట్టల మధ్య కొన్నాళ్ళూగిన లాడి నది. ఒకసారి ఒంటిమెట్ట యని భ్రమించి, యాపై నభిప్రాయము మార్చుకొని విజ్ఞుఁడైన విమర్శకుని పద్ధతి ననుసరించిన వీరేశలింగము పంతులుగారిని వెక్కి రించిన విమర్శకులకు సప్రమాణముగా పంతులుగా రిచ్చిన సమాధానమే వారి 'బమ్మెర పోతరాజు' వ్యాసము. పంతులుగారి జీవిత చరమ సంవత్స రమునందు రచించినదగుట చేతను, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో వెల

సిన వారి యేకైక వ్యాసమగుట చేతను దానికి సాహిత్య చరిత్రలోను, ఈ సంకలన సంపుటిలోను ప్రత్యేక ప్రాధాన్యమున్నది

రాయలు వ్రాసిన ఆముక్తమాల్యద నాతఁడు వ్రాయలేదు పొమ్మని నారు కొందఱు. పెద్దన కా యెంగిలి గౌరవ మంటగట్టినారు. అంతటి యన్యాయమును జూచి సహింపలేక రొమ్ము విరుచుకొని యురవడిగా రంగము లోనికి దూకి ప్రత్యర్థులను బారద్రోలి గ్రంథకర్తృత్వమును రాయల కొప్పఁ జెప్పిన సాహిత్య వీరుఁడు శ్రీ చిలుకూరి నారాయణరావుగా రాలపించిన విజయగీతము వారి వ్యాసము.

పెద్దన కావ్యరచనా శిల్పములోఁ జంద్రునిలోని మచ్చవలెఁ గుఱుపు కాల ప్రశంస కొంత వెగటును గల్పించినను, అది యా రవిచంద్రుని కాంతి కెట్టి కళంకము నాపాదింప దని కంఠోక్తిగా నయమున భయమున నచ్చ జెప్పు శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి వాద కౌశల్యమునకు మచ్చుతునక వారి వ్యాసము.

పెద్దన స్త్రీపైఁ బురుషుని విజయమును జిత్రింప, తిమ్మన పురుషునిపై స్త్రీ విజయమును రూపించి ప్రతి ద్వంద్వులై నిలిచిన విధమును మనోహర ముగా నిరూపించి మనోభావ విశ్లేషణాత్మకపాత్ర చిత్రణ పరిశీలన శిల్ప మును జాటించినది డా. కె. వి. ఆర్. నరసింహముగారి వ్యాసము.

శైవభక్తి సముద్రుడైన ధూర్జటియొక్క యాధ్యాత్మిక భావసంపత్తిని శైవభక్తి సాహిత్య నిధులను విలువకట్టి, లెక్కించిన విజ్ఞాననిధి శ్రీ బండారు తమ్మయ్యగారు పరిశీలించినారు. వారు పట్టినది బంగారమగు ననుటకు వారి వ్యాసము సాక్ష్యము.

రామకృష్ణుని పరిహాసమునకు మొక్కవోయిన యొక సజీవ శిల్పమును వెలికి తీసి. వెలుఁగు పొడి మాటలతో మెఱుఁగుపెట్టి, జిలుగు శిల్పమును సంతరించి. తెలుఁగు దనమును బూతపూసి, బంగరు గద్దెపై నలంకరించి తెలుఁగువారి పెద్దక్కగా తీర్చిదిద్దినది శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి వ్యాసము.

సంప్రదాయమును గౌరవించుచు, సమర్థులైన పూర్వకవులు స్వాతంత్ర్యముతో సాధించిన ప్రయోగములను ప్రమాణ బుద్ధితో గ్రహింపవలెనని చాటి చెప్పుచు, తెలుఁగున కున్న వ్యాకరణ దీపము చిన్నదని అయ్యలరాజు కవిత్వపు కాగడాతో చూపించిన వ్యాసము శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి రచనము. వారి శక్తిమంతమైన వ్యావహారిక భాషకును, సముద్రమును వంటి కావ్య పరిజ్ఞానమునకును, సహృదయ విమర్శకు నిది యొక మచ్చుతునక :

కల్పనా మహనీయమైన కళా పూర్ణోదయమునఁ గాంచిన కొలఁది కాంతి రేఖలు కనుల పండుగ చేయుచుండును. కావ్యరచనా శిల్ప మర్మజ్ఞులైన శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు కావ్యములోని కథావధాన కౌశలమును విశేష ప్రజ్ఞతో వారి వ్యాసమున వివరించినారు.

సంగీత సాహిత్యములను శ్లేష కవిత్వమున సాంశ్లేష మొనర్చి నాదతంత్రులతోపాటు రసతరంగముల నవలీలలగా జాలువారించిన రామరాజభూషణుని కవిత్వములోని వైచిత్రిని సంగీత సాహిత్యశాస్త్ర మర్మజ్ఞుఁడైన విమర్శకుఁడు విప్పి చెప్పినది శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి వ్యాసము.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు విశేషముగా విహరించిన సారస్వత క్షేత్రము దక్షిణాంధ్ర వాఙ్మయము. దానిలోని లోగుట్టులను, లోతుపాతులను, వెలుగు నీడలను వారి కలముతోనే చిత్రించిన వ్యాస మిందలి వారి రచన. స్పష్టమైన విషయ ప్రతిపాదనము. విశేషాంశములను వెలుఁగున కీడ్చెడి విపులమైన ప్రమాణములు వారి విమర్శ ప్రత్యేకత.

ప్రతిపద్య చమత్కృతిని వెలయించిన విజయ విలాసకారుని పద్యముల పైని వ్యాఖ్యా విశేషములను వివేకించి శ్లేషలను విశ్లేషించి వినూత్నార్థములను వెలికిదీయు వ్యాసము శ్రీ తాపీ ధర్మారావుగారి రచన.

క్షేత్రయ్యపై నేర్పడిన కళంక పంకమును కడిగి పదకవిత్వ వైభవమును ప్రదర్శించిన వ్యాసము శ్రీ గణపతిశాస్త్రిగారి రచన. భవభూతి కరుణరసమును గుండెలో నింపికొని, కవిత్వమునందు జాలువార్చిన కంకంటి పాపరాజు–సీతమ్మను శోకమూర్తిగాఁ జిత్రించిన ప్రతిభను తులనాత్మక పరిశీలన దృష్టితో నిగ్గుదేల్చి నిరూపించినది శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి గారి వ్యాసము.

స్వీయ సాహిత్య జీవిత చరిత్రయే యొక సాహిత్య చరిత్రాధ్యాయమైనట్లు, సమకాలీన సాహిత్యముపై సాదరము, సజీవము, సరసము నైన సమీక్ష గావించిన లిరికల్ వ్యాసము శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి రచన. పద్యమువలె వారి గద్యము జిలుగు శిల్పముల భావచిత్రము.

తెలుఁగు పాటల యెంకి గాలిదుమారములోఁ జిక్కు-బడ్డ వార్త విని, నాయుడు బావను సారామగ్నించి, యీ విపరీతమునకుఁ గారణము ఇల్లాలెంకికి జరిగిన యన్యాయమని దివ్యదృష్టితోఁ జూచి చెప్పిన సాహిత్య తపస్వి శ్రీ బసవరాజు వేంకటప్పారావుగారు. భావావేశము, శక్తిమంతము నైన వారి రచన గుండెలో నుండి పొంగి వచ్చినది.

ప్రపంచములో జరుగుచున్న మార్పులను, మరోప్రపంచము కొఱకు జరుగు యాత్రలను జూచి విప్లవశంఖము పూరించిన శ్రీ శ్రీ తనకొత్త పోకడకు కారణము చెప్పి, గతములో కూరుకొని పోయిన వారిని కేకవైచి, తన యనుయాయులకు కనుసన్నలు చేయుచు ముందుకు నడిపించిన వ్యాసము 'నేటి తెనుగు కవిత : కొత్తపోకడలు'.

ప్రభుత్వ పాదముల క్రింద నగిలి, తెలంగాణమునఁ గొనయూపిరితో నున్న తెలుఁగు బాసకు కొండంత సత్తువ నిచ్చి, ముక్కోటి యాంధ్రుల నడుమ ముచ్చటలు తీర్చునట్లుగా తెఱవులు గల్పించిన సాహిత్యోద్యమమును సాకల్యముగా సమీక్షించినది శ్రీ దేవులపల్లి రామనుజరావుగారి వ్యాసము. సరళమైన శైలిలో సంగ్రహముగను సమగ్రముగను జేసిన ప్రాంతీయ సారస్వత సమీక్ష యది.

వచన కవిత్వ స్వరూపస్వభావములను గూర్చి చెప్పిన శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారి వ్యాసము సహృదయుల హృదయముల నలరించు సమాలోచనము. కవులును, సామాజికులును ఉత్తమ సాహిత్య ప్రమాణములను సాధించినప్పుడే సాహిత్య భవితవ్యము సముజ్జ్వలముగా నుండు నని సాధవంతముగను, శాస్త్రబద్ధము నైన విమర్శ వెలయించినది డా. జి. వి. కృష్ణరావు గారి వ్యాసము. ఇది యీ వ్యాస సంపుటమునకు సముచిత మైన భరత వాక్యము!

నాకీ సంకలన గ్రంథ సంపాదకత్వమున కవకాశము గలిగించిన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ వారికిని. ప్రత్యేకముగా తత్కార్యదర్శులు, సహృదయులు, సాహిత్య సేవాధురంధరులు నైన శ్రీ దేవులపల్లి రామనుజ రావుగారికిని నా కృతజ్ఞతలు. ఈ సంకలన గ్రంథ పర్యవేక్షణను శిష్యవాత్సల్యముతో నిర్వహించిన మా గురువర్యులు, విద్వన్మణులు డా. దివాకర్ల వేంకటావధాని గారికిని, పత్రికల ప్రాత సంపుటములను నా కందుబాటులో నుంచి సహకరించిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ అధిపతులకును, నన్నెడ నెడ సాదరముగ ప్రోత్సహించిన ఆప్తులు, విద్వన్మణులు డా. పాటిబండ మాధవశర్మగారికిని నా ధన్యవాదములు. శుద్ధప్రతులను సిద్ధము చేయుటలో సాయ మొనర్చిన శ్రీమణి చి॥ సుశీలకు నా ఆశీస్సులు.

ఈ సంకలన గ్రంథము సహృదయుల చిత్తముల కెక్కినచో నాకృషి ధన్యము :

హైదరాబాదు.                                        గూడ వేంకట సుబ్రహ్మణ్యం.

15-4-1969.

—: o :—

ద్వితీయ ముద్రణ పీఠిక

# తెలుగు కవిత్వపు తీరు తెన్నులు

తెలుగు కవిత్వపు తీరుతెన్నులను సమీక్షించే ఈ సారస్వత వ్యాస సంపుటం ద్వితీయముద్రణకు నోచుకొన్న దంటే సహృదయామోదముద్ర దీనికి లభించిం దన్నమాట; దీనిని పురస్కరించుకొని ఈ ముద్రణకు కూడ మరో పీఠిక వ్రాస్తే బాగుంటుం దని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు భావించటం ముదావహం.

కావ్యం, కవిత్వం- అనే పదాలను విమర్శకులు సమానార్థంలోనే సంభావించటం సంస్కృతసంప్రదాయం. వాటి స్వరూప స్వభావాలనుబట్టి ప్రత్యేకప్రతిపత్తితో పరిగణనం చేయటం పాశ్చాత్య సంప్రదాయం. తత్త్వతః రెండు దృక్పథాలకూ పరమార్థం ఒకటే అయినా అనుశీలనంలో అంతరం కనపడుతుంది. నేటివిమర్శకులలో పాశ్చాత్యపరిశీలనవిధానం ప్రామాణికంగా ప్రవర్తిల్లుతున్నది. అట్లని సాహిత్యలక్షణవివేచనం ప్రాచ్యపద్ధతిని పరిత్యాగం చేయలేదు; క్రొత్తపాతల మేలుకలయిక కవితానుశీలనంలో నవత్వంగా నిలిచింది.

కావ్యం ఫలం వంటిది. కవిత్వం రుచి వంటిది. ఫలానికి ప్రయోజనం ఆస్వాదనం. ఆస్వాదయోగ్యమైన ఫలానికి రుచి గుణం. రుచి ఫలాన్నంతా వ్యాపించి ఉంటుంది. ఫలంలో తినదగిన పదార్థం ఉంటుంది, ఆస్వాదింప దగిన రసం ఉంటుంది. రసం పదార్థగర్భితంగా ఉంటుంది పదార్థరూప మైన ఫలాన్ని తింటే పర్యవసానంగా ఆస్వాద్యమాన మయ్యేది రసం. రుచి రసాన్ని ఆశ్రయించుకొని ప్రధానంగా ఉన్నా పదార్థాన్నికూడ పట్టుకొని ఉంటుంది. రసాన్ని పిండిన ఫలపదార్థం పిప్పి. లోకంలో ఫలాన్ని భక్షించేవా రున్నారు; రసాన్ని పిండుకొని త్రాగేవా రున్నారు. ఉభయులకూ రస సిద్ధియే ఫలసిద్ధి. ఈ లోకానుభవాన్నే కావ్యాస్వాదనకు సమన్వయించు

కోవాలి. కావ్యం వస్తువుచేత నిస్తులం; వర్ణనామయం. దానికి రుచి నిచ్చే గుణం కవిత్వం. సహృదయుడు పొందే అనుభవం రసం. కావ్యాన్ని అనుభవంగా మార్చే సాధనం కవిత్వం. అంటే కావ్యరుచి కవిత్వం. వస్తువర్ణనామయ మైన కావ్యం రుచివలననే ఆస్వాదనీయ మౌతుంది; ఆస్వాదిత మైన రసం రుచిరూపంగానే చిరస్మరణీయ మౌతుంది. కావ్యమూ రసమూ-సహృదయునిచేత ఆస్వాదింపబడి అంతర్ధాన మొందుతాయి. రుచిమాత్రం ఆస్వాదమధురానుభూతికి స్మృతిగా మిగిలిపోతుంది. అదే కావ్యంలోని కవిత. ఫలాలలో రసాలలో వైవిధ్యం సర్వసాధారణం. వైవిధ్యంలోకూడా వాచవిని కలిగించే రుచిభేదం గుర్తింపబడుతుంది. రుచిభేదంగా నిలిచేది ఆస్వాదనీయత్వం. స్వాదుత్వం రుచినుండి విడదీయలేని లక్షణం. అచ్చమైన కవిత స్వాదుత్వవిశిష్టమైన రుచి. పక్వత దానికి పోషకం. కవితలో పక్వత కవివాక్పరిపాకం. దానివలన కవితకు శీల మేర్పడుతుంది. శీలం స్వాదుత్వ పోషకద్రవ్యం. కవితలో స్వాదుత్వం సౌందర్యం. శీలం సౌందర్యవర్ధకం. సౌందర్యం రుచిసమర్పకం. అందువల్ల - కావ్యంలో అస్వాదనీయ మైన సౌందర్యాభివ్యక్తి కవిత. కావ్యశబ్దం ప్రధానంగా స్వరూపవాచి, రసశబ్దం అనుభవవాచి, కవితాశబ్దం రుచివాచి. ఈ మూడూ కలిసి ముద్దగా భాసించినా వివేచనకు వేరువేరుగా గోచరిస్తాయి. లోకంలో ఇది అనుభవ సత్యం. ఎంతటి మహాకావ్య మైనా అందులో రుచ్యమైన పద్యాలు కొన్నే ఉంటాయి. వాటినే లోకులు నాలుకలమీది రుచివిశేషాలుగా నిలుపుకొని నిత్యారాధనం చేస్తారు. రుచి రోచిస్సులా వ్యాపించేది. సూర్యరశ్మి లోకాలను వెలిగించినట్లు కవిత కావ్యలోకాన్ని రుచిమయం చేస్తుంది. కవిత కావ్యానికి ప్రాణచైతన్యం. కవిత లేనిది కావ్యం లేదు. ఉంటే అది జీవం లేని శవం !

నన్నయనుండి నేటిదాకా తెలుగులో ఎన్నో కావ్యాలు వెలువడినాయి. ఎన్నో రుచుల నందించాయి. ఆ రుచుల తీరుతెన్నులను ఆంధ్ర సహృదయ లోకం ఆస్వాదిస్తూనే ఉంది. వాటిని వివేచించుకొంటే కవితాసౌందర్య సమాలోచన మౌతుంది. యుగయుగాలుగా తెలుగుకవులు సౌందర్యాభివ్యక్తిని కవితామయంగా సృజన కావించిన చైతన్యస్రవంతిని సమీక్షించు కొంటే సహృదయామోదం లభిస్తుంది. ఆమార్గంలో ఒక ప్రస్థానం చేయటం ఈముందుమాటకు ప్రయోజనం.

# కవిత్రయ కవితాప్రస్థానం

ఆదియుగంలో ఆంధ్రకవిత్వానికి అజరామరమైన ఆస్వాద మాధుర్యాన్ని కల్పించిన శాఖలు రెండు. ఒకటి– దేశికవిత్వం, రెండు–మార్గ కవిత్వం. దేశికవిత్వశాఖలో జాలువారింది జానపదసాహిత్యం. దీనినే అవస్థా భేదాలలో మౌఖికకవిత్వ మనీ, ప్రజాకవిత్వ మనీ, సామాన్యసాహిత్య మనీ ఎన్నో పేర్లతో పిలుస్తున్నాం. ఇది నన్నయకు పూర్వం నుండీ ఉంది. అను భూతిని ఆటగా, పాటగా అందంగా అలవోకగా ఆవిష్కరించుకోవటం దాని లక్షణం. సుఖదుఃఖాలను సూటిగా, సూక్ష్మంగా చెప్పినా సామాన్యునికి అందుబాటులో ఉండే సారళ్యం సహజమాధుర్యం దాని సుగుణాలు. నిత్య జీవితంలో నిబ్బరంగా పారే అంతర్వాహిని దేశికవిత. బ్రతుకుబంగారమే దాని వైభోగం. పలుకుసింగారమే దాని సౌందర్యం. అది ఆడుతూ పాడుతూనే అందరినడుమా తిరిగింది; అందలా లెక్కకపోయినా మందిలో పడి మనుగడ సాగించింది. దేశికవిత దారిప్రక్కన కాసిన [illegible] వంటిది. అప్రయత్నంగా అందుబాటులో ఉండేది. తింటే ఆపాతమధురంగా ఉండేది. అక్కడక్కడా విత్తులుంటే ఉంటాయి. వాటిని వదిలేస్తే రుచికి ఎక్కడా ఆటంకం లేదు. ఆరుచికి గుణవిచారం లేదు. గణప్రస్తారం లేదు. మనసుకు పసందైన మాత్రలే దాని ప్రస్థానసూత్రాలు.

దేశిమార్గ కవితాశాఖలలో ఒక భేదం కనపడుతుంది. దేశికవిత నేలలో ఇంకిన నీరు లాంటిది; మార్గకవిత తరంగసుందరంగా ప్రవహించే జీవనది లాంటిది. ఈరెండింటికీ జీవననీరదాలు వర్షించిన అనుభవధారలే మూలాధారాలు. చెలమల్లో, దిగుడుబావుల్లో ఊటగా సాగి త్రవ్వుకొన్నచోట్లల్లో తలయెత్తేగుణం దేశికవిత్వానిది. ప్రవాహప్రాంతాలను నిర్దేశించుకొని, ఉభయతటాలచే సీమితమైన వాహికలను నియతమార్గాలుగా సంతరించుకొని సజీవనదిగా పారుతూ, సమీపించిన సహృదయులకు మజ్జనోన్మజ్జనసుఖాన్ని అందించటానికే కాక యానపాత్రలపై విహారయాత్రలు సాగించటానికి వీలుగా గంభీరమై, సాగరోన్ముఖంగా సాగే రసతరంగిణి మార్గకవిత. జీవ నదులు రసపానానికే కాక, వ్యవసాయానికి, ఫలసాయానికి కూడా పనికి వస్తాయి. వనాలూ, కేదారాలూ నదీజలాలతో విలాసాలను వెలయిస్తాయి.

దేశికవిత దేశంలోని భూగర్భజలసంపదవంటిది. మార్గకవిత నదీనదభాగ్య రమ వంటిది. దేశికవులు బ్రతుకుపాటల్లో జీవనస్థితిని చిత్రించారు. మార్గ కవులు కావ్యస్రవంతులలో జీవనరసాన్ని పొంగించారు. మార్గకవుల్లో నన్నయభట్టు భగీరథకల్పుడు. ఆంధ్ర కవితా భాగీరథిని మార్గఫణితిలో ముందుకు ప్రవహింప చేశాడు.

దిగుడు బావులలోని నీటితియ్యందనం వేరు, జీవ నదిలోని నీటి రుచిపాకం వేరు. పెరటిలోని బావి నిత్యకృత్యాలకు జీవనాధార మైనా, జీవనదిలో మునిగి తీర్థసేవచేయాలని జీవుడు తాపత్రయపడటం సహజం. సాహిత్యజీవితంలో కూడా దేశికవిత పెరటిలో నిలిచిన తీర్థంలాంటిది. మార్గ కవిత పుణ్యతీర్థపుష్కరం లాంటిది. ప్రవాహ మున్నచోట బావి పరిగణనకు రాదు. ఎన్నిబావుల నీరు త్రాగినా జీవనదిలో మునగనిది జీవితానికి చరితార్థత లేదు. బావిచుట్టూ బ్రతుకులోని తాపత్రయం కనపడుతుంది; ప్రవాహం వెంట బ్రతుకు చేసే ప్రయాణం గోచరిస్తుంది. అలాగే దేశి కవితలోని పాట జీవనరాగాన్ని వినిపిస్తుంది. మార్గకవితాప్రగతి సంస్కృతి వైభవాన్ని వెలారుస్తుంది. జాతిజీవితంలో దేనిపాత్ర దానిది. ఒకటి భావ విన్యాసం, మరొకటి రసోల్లాసం !

ఆంధ్రకవితారంగంలో మార్గకవితాప్రస్థానభేరి మ్రోయించిన వాడు నన్నయభట్టారకుడు మార్గశబ్దాన్ని రీతికి పర్యాయవాచిగా దండ్యాదులు పేర్కొన్నారు భోజాదులు ఆమాటకు ప్రాచుర్యాన్ని తెచ్చిపెట్టారు.

"వైదర్భాదికృతః పంథాః కావ్యే "మార్గ" ఇతి స్మృతః
'రీఙ్ గతౌ' వితి ధాతోః సా వ్యుత్పత్త్యా రీతి రుచ్యతే" (2-27)

అని భోజుడు సరస్వతీకంఠాభరణంలో పేర్కొన్నాడు. గత్యర్థక మైన రీఙ్ ధాతువునుండి రీతిశబ్దం వ్యుత్పన్నమయింది. వైదర్భ్యాదిరీతులకు మార్గాలని పేరు. 'రియంతే పరంపరయా గచ్ఛంతి అనయా' అని కేశవమిత్రుడు పేర్కొన్నాడు. పఠితలు రీతి నాశ్రయించి పరంపరగా రసస్థానాన్ని పొందు తారు కాబట్టి దాని కాపేరు వచ్చింది. కావ్యాలంకార సూత్రవృత్తికి 'కామధేను' వ్యాఖ్య వ్రాస్తూ గోపేంద్ర త్రిపురహరభూపాలుడు 'రిణంతి గచ్ఛంతి అస్యాం గుణాః ఇతి; రీయతే క్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతి వా రీతిః' అని రీతికి రెండువిధాలుగా వ్యుత్పత్తి చెప్పాడు. గుణాలు

దేనియందు ప్రవర్తిల్లుతాయో అది రీతి; దేనియందు వాగ్రూపమైన రసధార ప్రవహిస్తుందో అది రీతి. అదే మార్గం. రసానుభూతి నందించే వాగ్రూపమధు ధార గల కవిత మార్గకవిత. నన్నయ అట్టికవితను హృద్యమైన పద్య ఫణితిలో పరితృలోకానికి అందించాడు.

నన్నయ కవిత తెలుగువారికి క్రొత్తదైన కావ్యకవితారుచిని అందించింది. అది ఆంధ్రజాతి ఆత్మలక్షణానికి అనువైన రుచిగా సంభవిల్లింది. యుగయుగాలనుండి తెలుగుకవు లారుచిమత్వాన్ని సుగుచిరంగా తమ వాక్కులలో మధుధారగా నిండించుకొంటున్నారు.

కవితకు రుచి గుణసంయోజనంవల్ల కలుగుతుంది. గుణసంవిధానం వలన రీతి-లేక-మార్గం రూపుకట్టుతుంది. గుణవర్ధితమైన రీతి కవితకు రస వ్యంజకమైన వృత్తిని ప్రసాదిస్తుంది. వృత్తి అభినయ సదృశమైనది. అభిన యానికి ఆకృతి, అభివ్యక్తి అవసరం. సుందరమైన ఆకృతి మనోజ్ఞంగా భావాభివ్యక్తి చేయటమే వృత్తి. అట్టి వృత్తిని కవివాక్కు వ్యక్తీకరిస్తుంది. ఆ వ్యక్తీకరణలో రుచి ఆస్వాదసుందరంగా అవిష్కృత మౌతుంది. అది కవి తగా రాణిస్తుంది.

ఉక్తి అంటే సుందరమైన వాగ్వైఖరి. వైఖరిలోని వైవిధ్యమే కవిత్వపురుచిలోని వైలక్షణ్యం. నన్నయఉక్తి కొక వైఖరి ఉంది; తిక్కన ఉక్తికి మరోవైఖరి ఉంది. ఎఱ్ఱనఉక్తికి ఇంకొకవైఖరి ఉంది. మహాకవి అయిన ప్రతివాని ఉక్తికీ ఒక ప్రత్యేకవైఖరి ఉంటుంది. ఆవైఖరికూడా సిద్ధమనీ, సాధ్యమనీ రెండువిధాలు. కవికి సంస్కారజన్యమైనది సిద్ధవైఖరి; సాధన జన్యమైనది సాధ్యవైఖరి. సిద్ధవైఖరిలో సృజనాత్మకత ప్రసిద్ధంగా ప్రపంచిత మౌతుంది! సాధ్యవైఖరిలో పూర్వప్రవర్తితమార్గాలలో కవి చేసే ప్రయోగ వైచిత్రి లాస్యం చేస్తుంది. ఏకవివాగ్వృత్తి కవితాస్వాదనకు కమనీయ వినూత్నరుచులను సృష్టింపగలదో ఆతనికవిత మార్గకవితలో నవ్యమార్గనిర్దేశ. నన్నయ అట్టిమార్గాన్ని చూపించాడు. తిక్కనాదులు ఆమార్గంలో వినూత్న మార్గాలను ప్రయోగించి ప్రపంచించారు. ఆంధ్రమహాకవుల కవితా మార్గాలను విశ్లేషించేటప్పుడు మొట్టమొదట కవిత్రయ కవితాస్వరూప వివేచనం చేయటం సమంజసం.

నన్నయకవితలో తత్సమపదాలు అధికంగా ఉంటాయనీ, తిక్కన కవితలో తెలుగుమాటలు ఎక్కువగా ఉంటాయనీ వారివారి కవితా స్వరూపాలను వివేచించే పద్ధతి తత్త్వదర్శనానికి సమర్థవంతం కాదు. కవితా తత్త్వవిచారంలో శబ్దవివేచనం ఉండరాదని కాదు. కాని, ఉండవలసిన విధంగా ఉండాలి. నాట్యానికి వస్తువు శరీరం, కావ్యానికి శబ్దార్థములు శరీరం. శరీరాన్ని ఆశ్రయించే సౌందర్యం ఉంటుంది. అయితే అది భౌతికం కావచ్చు, భావరూపం కావచ్చు. కవితకు భౌతికసౌందర్యాన్ని ఇచ్చేది శబ్దం భావసౌందర్యాన్ని ఇచ్చేది అర్థం భావం ఆకృతి నాశ్రయించి అభివ్యక్తం అవుతుంది. వాసన పుష్పాదిద్రవ్యాల నాశ్రయించే ఉండటం లోకప్రసిద్ధం. అలాగే కవితలో రమణీయార్థం శబ్దాన్ని ఆశ్రయించే ప్రతీయమానమౌతుంది. అర్థమే ఉపాదేయమైనా శబ్దం దానికి ఉపాధి. సౌందర్యం శబ్దంచేత స్పృష్టమై అర్థరూపంగా ఆస్వాదనీయమౌతుంది కవితకు అందమైన ఆకృతి నిచ్చేది శబ్దం; అందమైన అభివ్యక్తి నిచ్చేది అర్థం. ఆకృతి అభివ్యక్తికి పోషకమైతే సౌందర్యం హృదయతర్పణం చేస్తుంది నన్నయ తెలుగుకవితకు శబ్దంచేత ఆకృతివైభవాన్నీ, అర్థంచేత అభివ్యక్తిసౌందర్యాన్నీ సాధించి, ఆస్వాదనీయమైన ఒకరుచిని తెలుగువారికి కల్పించి ఇచ్చాడు.

నన్నయ ప్రధానంగా గుణవాది. శబ్దగుణసంయోజనశిల్పంతో కవితలో సౌందర్యాన్నీ, ఆస్వాదనీయతనూ కల్పించటంలో ఆయన సిద్ధహస్తుడు. ఆతనికవితలోని రుచిసర్వస్వమూ కవితాసామగ్రిని గుణపోషకంగా సంవదించుకోవటంలో నిక్షిప్తమై ఉంది. నన్నయవాగ్వృత్తికి ప్రసాదగుణం ప్రాణభూతం. ప్రసాదం సర్వగుణసంయోజనానికి సమర్థవంతమైంది. ఓజోగుణయుక్తమైన శిథిలబంధం శబ్దప్రసాదగుణలక్షణం. నన్నయవాక్యానికి ఇటువంటి ప్రవృత్తి నైజం. ప్రసాదగుణంచేత వైదర్భీరీతి రూపుకట్టుతుంది.

"అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్రగుణ గుంఫితా
విపంచీస్వరసౌభాగ్యా వైదర్భీరీతి రిష్యతే"

అని వామనుడు వక్కాణించాడు. నన్నయ కవితలో పదరచన విపంచీస్వర సౌభాగ్యాన్ని వెలారుస్తుంది. రీతి గతిని సూచిస్తుంది. కాబట్టి నన్నయపద్యం కుంటుపడకుండా మొదటినుండి చివరివరకూ ప్రవాహగతిని భజిస్తుంది. హృద్యమైన గతిని పద్యానికి నేర్పిన ఆచార్యుడు నన్నయభట్టు.

గుణవ్యంజకాలైనవి వర్ణాలు. ప్రసాదగుణవ్యంజకాలైన వర్ణాలను– అక్షరాలను - రచనలో కూర్చి రమ్యతను కల్పించటం నన్నయ కవితాశిల్పం. రమ్యత అంటే రమింపదగిన భావం- అంటే ఆస్వాదనీయత్వం. కవితలో ఆస్వాదనీయత్వం సర్వసాధారణంగా సహృదయహృదయాలకు అందేగుణం. "ఇతరులు అక్షర రమ్యత నాదరింపన్"-అని నన్నయ అనటంలోని తాత్పర్య మదే. 'నానారుచిరార్థసూక్తి నిధిత్వం' ఆయన వాగ్వ్యుత్పత్తి లక్షణం. రస ధర్మాలైన గుణాలచేత విశిష్టాలైన పదాలను పరమసార్థక్యంగా వాడటంలో ఆ లక్షణం విశ్వరూపం తాలుస్తుంది. ఇక కథ నాటకశరీరం, రమణీయార్థప్రతిపా దకశబ్దం కావ్యశరీరం. నన్నయ దృశ్యశ్రవ్యకావ్యశరీర విభాగ వివేచనానికి ఒక సమన్వయశీలం నేర్పాడు. అదే ఆయన పేర్కొన్న 'ప్రసన్నకథాకలితార్థ యుక్తి'. ప్రసాదగుణప్రధానంగా కావ్యవస్తువు వ్యంగ్యసుందరంగా ప్రతీయ మానం కావటం, అలా కావటానికి రమణీయార్థాన్ని పోషకంగానిల పే సంయో జనశిల్పం నన్నయకవితలో ప్రత్యక్ష మౌతున్నాయి. ఈ అభివ్యక్తి ఆంధ్రకవిత కొక అపూర్వశక్తిని ప్రసాదించింది. తరువాతి కవులు ఎన్ని ప్రయోగాలు చేసినా నన్నయ కవితారుచి వాటికి పాదుగా నిలిచింది. ఉదాహరణకు చెప్పు కుంటే నన్నయ శబ్దగుణాలకు ప్రాధాన్య మిస్తే, తిక్కన అర్థగుణాలకు ప్రాధాన్యమిచ్చాడు. శ్రీనాథుడు రీతిని రూపుకట్టించాడు. ఎఱ్ఱన గుణాలకు అలంకారాలతో శోభాతిశయత్వాన్ని కల్పించటం ప్రారంభిస్తే, ప్రబంధ కవులు అలంకార శిల్పాన్ని ఆమూలాగ్రం చిత్రించటం మొదలుపెట్టారు. తెలుగులో మార్గకవులు పోయిన కవితాప్రస్థానా లన్నింటికీ నన్నయ చూపిన వన్నెచిన్నెలే తీరుతెన్నులను తీర్చిదిద్దాయి.

గుణాలు ఎన్నిఉన్నా గుణత్రయానికే (మాధుర్యోజః ప్రసాదాలకే) కావ్యానుశీలనంలో గౌరవం వచ్చింది. మాధుర్యం చిత్తద్రుతిని కలిగిస్తుంది; ఓజస్సు దీప్తిని భావింపచేస్తుంది; ప్రసాదం చిత్త వికాసాన్ని కలిగిస్తుంది. ఈ మూడువిధాలైన రుచిభేదాలూ గుణప్రధానకవిత్వంవల్ల సహృదయుడు పొందుతాడు తెలుగులో నన్నయ ప్రసాదగుణంతో చిత్తవికాసం కలిగిస్తాడు. తిక్కన మాధుర్యంతో చిత్తద్రుతిని కలిగిస్తాడు. ఎఱ్ఱయ ఓజస్సుతో చిత్త

దీప్తిని కలిగిస్తాడు. వీరు ముగ్గురూ గుణప్రధానవాదులే. అయినా, వారి కవితల రుచులు వేరు. రుచులు వేరైనా వారికవితలు ఆస్వాదస్వాదువులు.

రుచిరూపమైన కవితాస్వభావాన్ని వివేచించటం క్లిష్టమైనపని. పాచకుడు వంట వండి విందుగా వడ్డిస్తాడు. అందులో వివిధద్రవ్య సంయోజన ప్రావీణ్యంతో రుచులను కల్పిస్తాడు. ఆ రుచులను విశ్లేషించుకొంటే వాటి స్వభావం తేటపడుతుంది. ఈ దృష్టితో కవిత్రయంవారి రచనల్లో ఆస్వాదనీయంగా ఉండే కవితారుచిలోని ద్రవ్య సంయోజన విధానాన్ని విశ్లేషిస్తే సహృదయ వివేచనానికి ఈ క్రింది విధంగా భాసిస్తుంది.

| కవి | కవితాద్రవ్యసంయోజనం | కావ్యలక్షణం | సాహితీప్రస్థానం |
|---|---|---|---|
| నన్నయ | శబ్దగుణం (ప్రసాదం)<br>శబ్దం - రీతి<br>అర్థం - రసం<br>అలంకారాలు | కథాకథనరీతి<br>ఇతిహాసఫణితి | వస్తుధ్వనిప్రధానమైన కావ్యప్రస్థానం |
| తిక్కన | అర్థగుణం (మాధుర్యం)<br>అర్థం - రసవృత్తి<br>శబ్దం - వర్ణనం<br>అలంకారాలు | రసవృత్తిరీతి<br>నాటకీయఫణితి | రసధ్వనిప్రధానమైన కావ్యప్రస్థానం. |
| ఎఱ్ఱన | శబ్దార్థగుణాలు(ఓజస్సు)<br>అర్థాలంకారాలు - రీతి<br>శబ్దం - అర్థం<br>రసం | అలంకృతోక్తి<br>వర్ణనాత్మకఫణితి | అలంకారధ్వనిప్రధానమైన కావ్యప్రస్థానం |

కవిత్రయంవారు ప్రధానంగా ధ్వనిప్రస్థానాన్ని ఆదరించినవారు. ఇతిహాసాన్ని కావ్యస్వరూపంగా తీర్చిదిద్దినవారు. అయితే, నన్నయరచనలో వస్తుధ్వని, తిక్కన రచనలో రసధ్వని, ఎఱ్ఱయ రచనలో అలంకారధ్వని అధికంగా కనపడతాయి. కావ్యనిర్వహణంలో నన్నయ కథాకథనరీతిని ప్రపంచిస్తే తిక్కన రసవృత్తి నిర్వహణాన్ని నాటకీయ ఫణితిలో సాగించాడు.

ఎఱ్ఱయఆంధ్రప్రబంధరచనాప్రవృత్తికి ప్రస్తావననిర్వహించినట్లు అలంకృతోక్తిని కవితలో వెలార్చి వర్ణనాత్మకఫణితికి బాటలు వేశాడు. ఈముగ్గురిప్రస్థానాలూ, కావ్యరచనాస్వభావాలూ కవితకు రుచిని కల్పించటంలో సమతమ ప్రభావాన్ని చూపాయి.

నన్నయకవితలోని ఆస్వాదనీయమైన సౌందర్యం శబ్దగుణసంయోజనం వల్ల ఏర్పడింది. గుణవర్ధకమైన శబ్దం ఆతనిరచనకు ప్రాణం. దానివలన రచనకు నాదమాధుర్యం ఏర్పడింది. సహజశోభాహేతువులైన గుణాలను రచనలో కల్పించినా ప్రకృష్టమైన రీతిని నన్నయ నిర్మిస్తున్నట్లు కనపడదు. ప్రసాద గుణంవల్ల వైదర్భి రూపుకట్టుతుంది. కాని, దానికోసం నన్నయ ప్రత్యేకించి ప్రయత్నం చేయడు. అయత్న కృత వైదర్భీరీతి మాధుర్యం కవితలో రుచిగా కల్పించేది నన్నయవాక్పాకం. ఆయనపద్యం అందువల్లనే హృద్యంగా ఉంటుంది. రమణీయార్థప్రతిపాదకశబ్దాన్ని నన్నయ ఎన్నుకొని ప్రయోగిస్తాడు. కాని, శబ్దం అర్థసమర్పణం చేసి అంతర్హితం కాదు. అర్థాన్ని సమర్పిస్తూ తానూ ఉన్నానని అనిపిస్తుంది. సహజశోభను అలంకృతం చేసి అతిశయింపచేయాలన్నయత్నం నన్నయలో ఎక్కువగా కనపడదు. గుణంతోనే ఆయనకవితకు రుచిగౌరవం వచ్చింది. ప్రాణచైతన్యంతోపాటు రూపవైభవంకూడా ఉన్న ఆకృతిమాధుర్యాన్ని నన్నయ తెలుగుకవితకు ప్రసాదించాడు.

తిక్కనసోమయాజి శబ్దగుణాలకంటె అర్థగుణాలసంయోజనంవల్ల కవితకు రుచిని కల్పించాడు. నన్నయకవితలో ఫణితి ప్రవృత్తిని వ్యంజింపచేస్తే, తిక్కనకవితలో ప్రవృత్తి ఫణితిని ఆలంబనంగా గ్రహించి రసవృత్తిని వ్యంజింపచేస్తుంది. ప్రవృత్తి అర్థగుణాలవల్ల ప్రతీయమానం అవుతుంది. అందువల్లనే తిక్కన తనరచనలో పాత్రలఆకృతులకంటె ప్రవృత్తులను చిత్రించే మార్గాన్ని ఎక్కువగా ఆదరిస్తాడు. ఆకృతి ప్రవృత్తిచేత అవస్థాచైతన్యాన్ని భజిస్తుంది. అవస్థలను దీపింపచేసేవి అనుభావసాత్త్వికభావాలు. అనుభావాదులు రసభావవ్యంజకాలు. అనుభావాదుల వ్యక్తీకరణంవల్ల శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్యచిత్రణవిస్ఫూర్తి వెల్లివిరుస్తుంది. దానికి భావవ్యంజకాలైన సంభాషణాదులు రసవద్వృత్తిని అనుసంధింపచేస్తాయి. దానివల్ల కవితకు రూపరామ

ణీయకత్వంతోపాటు రసజీవితప్రవృత్తి అలవడుతుంది. తిక్కనకవితలో రసాభ్యుదయోల్లాసం రక్తికట్టే గుణసూత్రం ఇది.

తిక్కనకు శబ్దబంధంకంటె భావశబలత ముఖ్యం శబ్దగుణప్రధానమైన రచన చక్కగా అల్లినపూలదండలా ఉంటుంది. దానిలోని అర్థం సుగంధంలా పరిమళిస్తుంది. అర్థగుణప్రధానమైన రచనలోని శబ్దం పానకంలోని చక్కెరలా ఉంటుంది. చక్కెరపలుకులు నీటిలో కరిగి పానకానికి తమగుణాన్ని సమర్పించి తమ ఆకృతిని కోల్పోతాయి. అలాగే, తిక్కనకవితలోని శబ్దాలు అర్థసమర్పణం చేసి, తమబంధప్రాముఖ్యాన్ని రసంకోసం త్యాగంచేస్తాయి. తిక్కనరచనలోని శబ్దం పానకంలో రుచిగా పరిణమించే చక్కెరవంటిది ఒకవిధంగా చూస్తే నన్నయరచనలోని కవిత చెరకుగడను నమిలితే వచ్చే రసం లాంటిది; తిక్కనరచనలోనికవిత చెరకురసం త్రాగితే కలిగే రుచి లాంటిది; శబ్దార్థగుణప్రాధాన్యంగల ఆయారచనల్లో రసికహృదయాలు ఈభేదాన్ని గ్రహించటం సులభం.

ఎఱ్ఱన తనకు ముందున్న నన్నయతిక్కనల శబ్దార్థగుణప్రధాన రచనా పద్ధతిని గమనించి, యథావకాశంగా ఆరెండింటినీ తనకవితలో సంగమింప చేశాడు. అయితే ఆయన వాక్కుకు గుణాలను అలంకారాలతో అతిశయింప చేయాలన్న ప్రవృత్తి సహజాలంకారంలా సమకూరింది. దానితో శబ్దాలంకార ప్రయోగంతో రీతికి వన్నెపెట్టటానికి ప్రయత్నం చేశాడు. ఎఱ్ఱనకవితకు ఓజస్సు సహజగుణం. దానివలన రచనకు దీప్తి కలిగింది. శబ్దగుణమైన ఓజస్సు గాఢబంధత్వాన్ని కోరుతుంది; అర్థగుణమైన ఓజస్సు అర్థప్రౌఢిని అభిలషిస్తుంది. ఈరెండిటికీ ప్రాధాన్యం కల్పించిన ఎఱ్ఱయరచన అతనికి ప్రబంధ పరమేశ్వర బిరుదాన్ని కల్పించింది. శబ్దార్థాలను అలంకృతంచేసి, అర్థాలంకారమండితమైన గుణవద్రచనను కవితకు అలవరచినవాడు ఎఱ్ఱన. అలంకారశక్తిని గుణప్రధానమైనరచనలో మొదటిసారి తెలుగువాణికి రుచి చూపించినాడాయన. ఎఱ్ఱయకు రసంకంటె రచనయే ముఖ్యం. అలంకార ధ్వనితో కథార్థాలను కాంతిమంతం చేయటం ఆయనకవితకు జీవితం. రుచ్యమైన వంటకాన్ని రుచిని హెచ్చించే వ్యంజనంతో నంజుకొని తిన్నప్పుడు కలిగే రుచివంటిది ఎఱ్ఱయకవిత్వపురుచి.

మూలభారతంలోని కథ వ్యాసునిదైనా తెలుగులో తీర్చిదిద్దిన పద్యాలూ, అందులోని గుణాలూ కవిత్రయప్రతిభాజన్యాలే. అందులో శబ్దాన్ని శిల్పీకరించి గుణవృద్ధిని సాధించే తారకమంత్రం నన్నయ తెలుగు కవితకు ఉపదేశిస్తే, తిక్కన అర్థాన్ని ఆవిష్కరించే అనల్పగుణసిద్ధిని బ్రహ్మసూత్రంలా తెలుగు కవితకు ప్రబోధించాడు. ఎఱ్ఱయ అలంకృత శబ్దార్థ గుణాలతో శోభాతిశయత్వాన్ని అలవరచుకునే ఆర్జవం కవితకు ఆగమ సూత్రంలా నేర్పాడు. నన్నయగారి శబ్దగుణమార్గం రథాలు నడిచే రాజమార్గంలా తెలుగుకవితలో సాగింది; తిక్కనగారి అర్థగుణమార్గం ఓడలు సాగే జలమార్గంగా మిగిలిపోయింది. రాజమార్గం నలుగురూ నడవటానికి, వింతలూ వినోదాలూ, సాములూ గరిడీలూ ప్రదర్శింటానికి వీలైనట్లోవ. అందువల్లనే ఎఱ్ఱయ నన్నయమార్గాన్ని అలంకరించి ఉత్సవయాత్ర సాగించాడు. తిక్కనమార్గం 'తను కానించినసృష్టిపక్కొ రుల చేగంగాదు నాన్' సాగిందని కీర్తించాడు. జలమార్గం రసలోకంలో విహరింపనేర్చినవారు మాత్రం నిపుణంగా పయనించటానికి వీలైనత్రోవ. పాదయాత్రతో బాటను తరింపవచ్చు; యానపాత్ర ముంటేనే దీనిని తరించేది. శబ్దగుణం రచనకు పాదయాత్ర; అర్థగుణం కవితకు యానపాత్ర. తెలుగులో శబ్దగుణప్రస్థానానికి మహారథి నన్నయభట్టారకుడు; అర్థగుణప్రస్థానానికి కర్ణధారి తిక్కన సోమయాజి; ఉభయగుణాలను ఉజ్జ్వలంగా పండించుకొన్నా అలంకార కవచాన్ని తొడుక్కొన్న అర్ధరథి ఎఱ్ఱయ.

## దేశికవుల ద్విపాత్రాభినయం

ఆంధ్రసాహిత్యంలో దేశకవితోద్యమానికి ఒకప్రత్యేకప్రతిపత్తి ఉంది. దేశికవిత్వాన్ని ఉద్యమంగా సాగించినవారు వీరశైవకవులు. వారి ఉద్యమ ప్రభావంతో రచనలు చేసినవారు మరికొందరున్నారు.

వీరశైవకవిత్వయుగంలోని కవులస్వభావాన్ని గమనిస్తే దేశికవులను రెండు తెగలుగా విభజించవచ్చు ననిపిస్తుంది. మొదటితెగవారు వెన్నెలపదాలూ, గొబ్బిపదాలూ మొదలైన జానపదగీతాలను రచించేకవులు. వీరు వ్యక్తులు కావచ్చు, సంఘాలు కావచ్చు, పరంపరగా మౌఖికసంప్రదాయాన్ని పోషించే సాధకులు కావచ్చు. ఇక రెండవతెగవారు దేశయులు పాడుకోవటానికిఅనుగుణ

మైన ఛందస్సుల్లో వివిధసాహితీప్రక్రియలను నిర్మించినవారు వీరు శుద్ధ దేశిగీతాలు రచించేవారు కారు, మార్గకవుల మార్గాలలో కావ్యరచన చేసిన వారు కారు. వీరికి మార్గకవుల్లాగా సాహిత్యప్రస్థానం ముఖ్యం కాదు, మత ప్రస్థానం ముఖ్యం; కవితాతత్త్వం ముఖ్యం కాదు, వస్తు ప్రపంచనం ముఖ్యం.

మార్గకవిత్వంలోని రుచిభేదాన్ని తెలిసి ఆనందించటానికి సహృదయాధికారం ముఖ్యం. శైవకవుల దేశికవిత్వాన్ని ఆస్వాదించడానికి సహృదయులకు ప్రత్యేకాధికారం అవసరంలేదనే అభిప్రాయం కలుగుతుంది కాని, అది సరికాదు. దేశిగీతాలు సామాన్యప్రజలచేత సృష్టింపబడిన సాహిత్యం; దేశికవిత్వం సామాన్యప్రజలకోసం పండితకవులచేత సృష్టింపబడిన సాహిత్యం. అందువలన శైవకవులు ఒకవిధంగా మిశ్రకవులు. వీరు మత ప్రచారంకోసం కావ్యకళాశిల్పాన్ని సైతం కాలదన్ని కవిత్వంతో ప్రజలను త్తేజపరచాలని కంకణం కట్టుకున్నవారు. సాహసోపేతంగా సాహిత్య ప్రయోగాలు చేశారు. అయితే, సామాన్యప్రజ వారివస్తువులో జీవించినంతగా కవిత్వంలో జీవించలేదు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. మార్గ-దేశిసాహిత్యాలను ఆస్వాదించటానికి సహృదయ- సామాన్య భేదంతో రసికలోకాన్ని విభాగం చేస్తున్నామని తెలుసుకొనే ముందు వారివారిస్వభావాలనుకూడా గమనించటం ముఖ్యం. మనదేశంలో భారత భాగవత రామాయణాలు ప్రజాపరిషత్తుల్లో చదవబడుతున్నాయి అందులో కథాతాత్పర్యాన్ని మాత్రం గ్రహించి, రమించి, కవిత్వకళాంశను గౌణంగా భావించేవారు సామాన్యులనవచ్చు. కథాంశాభివ్యక్తిలో భాసించే కవితాసౌందర్యాన్ని గ్రహించి రమించి పరవశించేవారు సహృదయు లనవచ్చు. కథ వింటే ఇద్దరికీ కన్నీళ్ళు వస్తాయి. అయితే ఒకరికి కథార్థసహానుభూతితో, మరొకరికి కథార్థ సహానుభూతితోపాటు కవితాసౌందర్యాస్వాదనతో కన్నీళ్ళువస్తాయి. ఆకలి తీరటానికి అందరికీ అన్నం ప్రధానంగా కావాలి. ఆకలి రుచి యెరుగ దన్న సామెతకూడా ఉంది. అయితే, రసికుడు అన్నంతోపాటు రుచికూడా కావా లంటాడు. శైవకవులది కవితాకళను ఖాతరు చేయని వస్తుదృష్టి. అదే దేశికవితాప్రస్థా

నంగా ప్రసిద్ధిగాంచింది. మార్గకవులది వస్తుసమృద్ధికంటె రుచిప్రవృద్ధిని కోరే ప్రవృత్తి. సామాన్యజనులకోసం సాహిత్యసృష్టిచేసేవారు ప్రతిపాద్యాంశానికి ప్రాధాన్య మిస్తారు; సహృదయజగత్తును రంజింపచేసే సాహిత్యసృష్టి చేసేవారు ప్రతిపాద్యాంశాన్ని ప్రతిపాదించే కళాసౌందర్యమార్గానికి ప్రాధాన్య మిస్తారు. దేశి మార్గ కవితా ప్రస్థానాల్లో కొట్టవచ్చినట్లు కానబడే ఈభేదమే ఆయాసాహిత్య సమాలోచనం చేసేవారికి ప్రమాణాలను ఏర్పరచుకొనటంలో ప్రాతిపదికగా నిలుస్తోంది.

శైవకవుల్లో శిఖరప్రాయులైనవారుగా విమర్శకులచే గుర్తింపబడిన వారు- నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు. వీరిలో నన్నెచోడుడు దేశికవితా ప్రవక్త, సోమనాథుడు ప్రయోక్త. నన్నెచోడుడు వ్రాసింది కుమారసంభవకావ్యం. వర్ణనాప్రధానమైన వస్తుకవిత అతనిధ్యేయం. వస్తువులో, అలంకృతిలో, భావంలో, భాషలో దేశీయత ఉట్టిపడాలని ఆయన ఆశయం. అయితే, సామాన్యప్రజలు పాడుకోవటానికి తనకావ్యం వ్రాయలేదు, అతనిరచన సహృదయులకే ఉపాదేయం. నన్నెచోడుడు తెలుగులో కావ్యరచనాప్రస్థానాన్ని సాగించినవాడని విమర్శకుల మెప్పును పొందాడు. తిక్కనకు ముందున్నా, తరువాత నున్నా ఆయనది కావ్యప్రస్థానం. కాని, ఆయన మార్గకవిత్వం వ్రాశాడా? దేశికవిత్వం వ్రాశాడా? అన్నఅంశంలో మీమాంస ఉంది. ఆయన ద్విపాత్రాభినయం చేశాడు. కావ్యవస్తుద్రవ్యాలన్నీ దేశీయములై ఉండా లన్నాడు. కవితాభివ్యక్తి కళాసుందరంగా ఉండాలని అభిలషించాడు. నన్నయాదుల గుణప్రధానరచన ఇతని కవితకు అందని ద్రాక్షపండై పోయింది. వక్రతామూలమైన అలంకృతోక్తి నాశ్రయించి వస్తువర్ణనలను చేశాడు. వర్ణనంలో చేసేభావనం రసాభిముఖంగా సాగి రస వ్యంజకత్వాన్ని సాధించే శక్తి అతని కవితకు అంతగా లేదు. అందువల్ల వస్తు చమత్కృతికే అతని వర్ణనాప్రవృత్తి వెచ్చించబడింది. వస్తువును రసాభిముఖం చేసే నిష్ఠ, గాఢమైనభావనం ఈతని కృతిలో కొరవడి పోయాయి. నన్నయ లాగా గుణాలను సంపదించే నేర్పు చాలక చాలచోట్ల గుణసాంకర్యాన్ని గుర్తరింపచేశాడు. దేశిపదా లెన్ని వాడాడు? దేశీయమైన ఉపమానా లెన్ని ఎన్నుకొన్నాడు? దేశీయాచారాలను ఎన్నిటిని కథలో నిబంధించాడు? అనేవి కవితారుచిని పట్టియిచ్చే లక్షణాలు కావు. అవి అన్నీకలిసి ఎటువంటిరుచిని అతని కవితకు కల్పిస్తున్నా యన్నదే ప్రమాణం.

నన్నెచోడుడు వస్తుతః అలంకారప్రస్థానానికి సంబంధించిన వాడు అలంకారవాదియై ఎప్పుడూ రసానికి మూడుమెట్లు దిగువన నున్న వాడే. అలంకారధ్వనిని వస్తుపోషకంగానే నిర్వహించగలిగిన వాడు. ఎట్టినలా అలంకార ధ్వనిని వస్తురసధ్వనులకు ఉపపోషకంగా సంవదించే శిల్పం తెలిసినవాడు కాడు. అందువల్ల నన్నెచోడునికవితలో సామగ్రి దేశీయమైనా, అభివ్యక్తి మార్గాన్ని అనుసరించినా కవిత వక్రతాచమత్కారాన్ని వెలార్చింది కాని గుణాభివ్యక్తినీ, రీతిమయంత్రినీ ప్రత్యక్షీకరింపలేక పోయింది నన్నెచోడుని కవితలో వర్ణ్యవస్తువులోని అలంకారచమత్కృతియే రుచి.

భక్తికీ, ఉద్యమానికీ, తిరుగుబాటుకూ, విప్లవానికీ ఆవేశం అలంకారం. ఆయా ప్రయోజనాలను సాధించే కవితకూ ఆవేశం ముఖ్యగుణ మౌతుంది. ఆవేశప్రధానమైన కవితను భక్తికీ, మతోద్యమానికీ సాధనంగా వాడిచూపించిన మొదటికవి పాల్కురికి సోమనాథుడు. సమాజంలో మతం ప్రచారం కావాలంటే ఎన్నిరకాల సాహిత్యప్రక్రియలనుసృష్టించాలో బాగా తెలిసినవాడాయన. ప్రజలను సామాన్యులనీ, మేధావులనీ రెండువర్గాలుగా భావించా డాయన, సామాన్యులలో వీరశైవం ప్రచారం కావటానికి బసవపురాణం వ్రాశాడు పండితులలో మతవిజ్ఞానం వ్యాప్తి కావటానికి పండితారాధ్యచరిత్రా, శతకాలూ భాష్యాలూ స్తుతులూ మొదలైనని వెలయించాడు. అందులో బసవపురాణ పండితారాధ్యచరిత్రలు ద్విపద కృతులు; ప్రజలకు పాడివినిపించటాని కవి ఉద్దేశింపబడినాయి. బసవనిభక్తి అంటే ఆయనకు ఒడలెల్ల కాళ్ళే. పరవశ్య స్తోత్రద్విపదలు ఆయన కృతులు. అందంగా చెప్పాలన్న స్పృహకన్న, అభివ్యక్తిని కళామయం చేయాలన్న శిల్ప దృష్టికన్న, చెప్పేది వినేవారి హృదయాల్లో ఆవేశాన్ని కలిగించాలన్న ప్రవృత్తి ఆయనకవితకు బసవపురాణంలో కనపడుతుంది. భక్తులభక్తిభావాలను పుంఖానుపుంఖంగా విస్తరిస్తాడు, వెల్లువలా వివరిస్తాడు. ఆవేశాన్ని కలిగించే పదబంధమే ఆయనకవితకు ఆయువు సంస్కృత భూయిష్ఠమైన రచనను మన్నింపకపోయినా సమాసరచన భక్తిభావోద్రేకానికి అవసరమైతే నిస్సంశయంగా వాడుకుంటాడు. అవసరమైనచోట అలతిఅలతిపదాలతోనే రచనను సాగిస్తాడు. ఒక్కొకచోట పాదాంత్యప్రాసలను పరుగులుతీయిస్తాడు ఆయన కవితను 'శ్లేష' అనే గుణం పాలిస్తుంది. బహుపదాలు ఏకపద్భావంగా భాసించే

శబ్దగుణమైన శ్లేష, మనోహరమైన అర్థాలసన్నివేశాన్ని కల్పించే ఘటనా రూపమైన అర్థశ్లేష ఆయనకవితలో ఆస్వాద మాధుర్యాన్ని కలిగిస్తాయి. ఈలక్షణం పండితారాధ్యచరిత్రలో ప్రౌఢంగా కనబడుతుంది బసవపురాణం, బసవేశ్వరశతకాదుల్లో మసృణంగా భాసిస్తుంది. కథల్లో పాత్రల అవస్థలను వర్ణించటం ఆయనకు ప్రీతి దానివలన భావోల్లేఖం ఏర్పడి భక్త్యావేశం కల్పింపబడుతుంది వీరశైవకవుల్లో రసదృష్టితో రచనచేయగల ప్రజ్ఞ పాల్కురికికే దక్కింది కాని, ఆయన ప్రయోగించింది, ప్రచారకుడు కావటంచేత వివిధసాహిత్య ప్రక్రియలకు వెలయించాడు అన్నిట్లోనూ ఈభక్త్యావేశం లేదు బసవపురాణంలో భావావేశాన్ని పోషించాడు, ఇతరకృతుల్లో వస్తువును వివరించాడు. శతకాలూ, ఉదాహరణాలూ, రగడలూ, దండకాలూ స్తుతులూ భక్తిభావంలో అవస్థలను చిత్రించే లఘుకృతులు. పోతన భాగవతం వచ్చేంతవరకూ సోమనాథుని బసవపురాణం భక్తికవితకు వెలుగురేకగా ఉండేది. భాగవతం భక్తికవితకు పరిపూర్ణాకృతి నిచ్చింది. శ్లేషగుణాన్వితమైన రచనకంటె శబ్దాలంకారమండితమైన భావోల్లాసం ఆవేశాన్ని అనుభూతిగా మార్చగల దన్న తెలివిడి తెలుగుకవులకు పోతన నేర్పాడు. పదాలలో ప్రజ్వలనశీలాన్ని కల్పించే భావవాహిని సోమనాథునికవితలోని గుచ్చికున్నగుణమైతే, శబ్దపునరావృత్తితో రచనాసౌందర్యాన్ని సృష్టించి భక్తి పారవశ్యాన్ని కల్పించే శిల్పం పోతన కవితాగుణం భక్తకవితానటేశుని అర్ధనారీశ్వరనృత్యంలో సోమనాథునికవిత తాండవహేల! పోతనామాత్యుని కవిత లాస్య లీల.

## నాచనసోముని నవీనగుణసనాథత్వం

నాచనసోముడు చమత్కారప్రస్థానాన్ని ఆంధ్రసాహిత్యరంగంలో ప్రవేశపెట్టి తాను నవీనగుణసనాథుడనని చెప్పుకున్నాడు.

"శబ్దార్థరూపం యదిదం కావ్యం శబ్దార్థకోవిదైః
త్రైవిధ్యేన చమత్కారి చమత్కారితరం యథా
చమత్కారితమం చేతి ప్రవివిచ్య నిదర్శితమ్
శబ్దచారుత్వతాత్పర్యే చమత్కారీతి కథ్యతే
వాచ్యచారుత్వతాత్పర్యే చమత్కారితరం మతమ్
వ్యంగ్యస్య చ గుణీభావే యదేవాహు ర్మనీషిణః

ప్రత్యేయార్థస్య చారుత్వే చమత్కారితమం మతమ్" (3. 36-40)
అని చమత్కార చంద్రికాకర్త విశ్వేశ్వరుడు పేర్కొన్నాడు. ఈమూడు విధాలచమత్కారాలను తనకావ్యంలో ప్రదర్శించి చూపాడు నాచన సోముడు. చమత్కారాన్ని అర్థవైచిత్రితో కంటె శబ్దసౌందర్యంతో కల్పించటంలోనూ, వ్యంగ్యవైభవంతోకంటె వాచ్యచారుత్వంతో సంభాషణలు నడపటంలోనూ, రచనలో అర్థం కంటె శబ్దాలకు అధికప్రాముఖ్యం ఇవ్వడంలోనూ ఆయన వాగ్వృత్తి ప్రసరించింది. కవికంఠాభరణకర్త చెప్పిన పది విలధాచమత్కారాలూ-1. అవిచారతర రమణీయం. 2. విచార్యమాణ రమణీయం, 3.సమస్తసూక్తవ్యాపి, 4. సూక్తైకదేశదృశ్యం, 5. శబ్దగతం 6. అర్థగతం 7. శబ్దార్థగతం 8. అలంకారగతం 9. రసగతం 10. ప్రఖ్యాతవృత్తిగతం, ఆయనకవితలో కనపడతాయి. అందులో శబ్దగత చమత్కారానికి అగ్రతాంబూలం. రాళ్ళపల్లి వారనినటు ప్రాచీనుల్లో భావానికి అర్థరచన బంటు; తరువాతివారిలో అర్థరచనకు భావము బంటు, అర్థమునందునలెశబ్దమునందును భావమును బాటుగా చేసినవాడు సోముడు. 'చెప్పవలసినమాట లెల్ల సాధ్యమైనంతవరకు ఏదోచమత్కారముగా చెప్పుట' ఇతని శైలిలో ముఖ్యలక్షణం, ఇది తెలుగుకవిత్వానికి అప్పటికి నవీనగుణం. దానికి సోముడు ప్రారంభకుడు. ఈదృష్టితో ఇతని కవితాద్రవ్యసం యోజనం ఇలా ఉంటుంది.

| చమత్కారం | | |
|---|---|---|
| శబ్దం - రీతి | ఉక్తివైచిత్రి | చమత్కారప్రధానమైన |
| అర్థం - అలంకారం | మాగధీరీతి | కావ్యప్రస్థానం. |
| రసం | | |

సోముడు శబ్దార్థాలతో చమత్కారాన్ని కల్పించటంలో లాగా రీతినిర్వహణంలో శ్రద్ధ వహించినట్లు కానరాదు. పెక్కుచోట్ల ఆరంభించినరీతి మధ్యలో ఆగి మరొకరీతి తలఎత్తుతుంది. అందువల్ల సమత లోపిస్తుంది. ఇటువంటి రచనను మాగధీరీతి అంటారు. రచనలోని చమత్కారచర్వణమే సోముడు కవితకు కల్పించిన క్రొత్తరుచి.

## శ్రీనాథునిరీతిప్రస్థానం

శ్రీనాథుడు తెలుగుకవితను చమత్కారమార్గంనుండి రీతిప్రస్థానానికి మళ్ళించాడు. సోముని శబ్దప్రధాన రచనతగుణ శబ్దార్థోభయప్రధాన రచనను తెలుగుకు రుచిచూపించాడు. కవిత్రయంవారి రచనలో అర్థానికి శబ్దం సేవ చేస్తుంది, నాచనసోమాదుల్లో శబ్దానికి అర్థం గౌణంగా నిలుస్తుంది; శ్రీనాథునిరచనంలో శబ్దార్థాలు రెండూ చెట్టాపట్టి నడుస్తాయి. అది ఆనాటికి తెలుగులో క్రొత్తవింత. శబ్దం స్త్రైణం; అర్థం పౌరుషం. అందుకనే కాళిదాసు శబ్దార్థాలను పార్వతీపరమేశ్వరుల్గా భావించాడు. శబ్దం ఆకృతిసౌష్ఠవాన్ని కల్పిస్తే, అర్థం ఆత్మసౌందర్యాన్ని ప్రసాదిస్తుంది. శబ్దగుణాలు యౌవనాదుల వంటివి. అర్థగుణాలు ఔదార్యాదులవంటివి రసవాదులు ఆకృతిగుణంకంటె ఆత్మగుణాన్ని ఆదరిస్తారు. ఆనందవర్ధనాదులు ఆకృతి ఆత్మను ధ్వనింపజేస్తే కావ్యానికి గుణంగానే భావించారు శ్రీనాథుడు శబ్దంచేత ఆకృతి శిల్పాన్ని రూపిస్తాడు; ఆకృతితోపాటు ఆత్మనుకూడా ఆరాధిస్తాడు. ఆకృతివిలాసాన్ని ఆత్మతేజానికి అండగా నిల్పటమే శ్రీనాథుని రీతితత్త్వం.

శ్రీనాథునికవిత్వం ప్రాచీనాంధ్రమకవులకవుల విశిష్టకవితాగుణాలకు సంగమతీర్థమని కీర్తించాడు వేమారెడ్డి కాశీఖండంలో వేములవాడ భీమకవిలాగా శ్రీనాథుడొక్కొక్కసారి ఉద్దండంగా కవిత్వం చెపుతాడట. అంటే మిక్కుటంగా, దీర్ఘంగా చెపుతాడనిభావం. భావాన్ని దీర్ఘసమాసాల్లో సాగగొట్టి ప్రగల్భంగా చెప్పేపద్ధతి ఇందులో ఉంది. నన్నయభట్టులాగా ఒక్కొక్కసారి సంస్కృతాంధ్రశబ్ద ప్రయోగప్రౌఢిని ప్రదర్శిస్తాడట. గీర్వాణాంధ్రశబ్దసంఘటనసామర్థ్యం దీనివలన వ్యక్తమౌతుంది. సమాసఘటనం శబ్దశక్తివిజ్ఞానం ఉన్నా కవికి రసాభివ్యక్తి ముఖ్యం. రసాభివ్యంజకమైన కావ్యబంధాన్ని తిక్కన సాధించాడు శ్రీనాథుడా సోమయాజి వాక్పాకాన్ని పుక్కిటపడతాడు ఒక్కొక్కసారి. ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడు. ఉక్తిని అలంకృతం చేయటంలో సహజత్వాన్ని వీడని ఒకవైచిత్రి ఆయనరచనలో రాణిస్తుంది. దాన్ని చేపట్టి శ్రీనాథుడొక్కొక్కసారి రక్తికట్టిస్తాడు. పూర్వకవుల ప్రసిద్ధ ఫణుతులను అదనెరిగి కవితలో కదను త్రొక్కించినా తనదైన ఒకఅపూర్వమార్గాన్ని దుర్గమంగా నిర్మించుకొని భావితరాలకు బాటలు

చూపించిన ప్రతిభాశాలి శ్రీనాథుడు. గుణాలంకార విశిష్టమైన రీతినిరూపు కట్టించే రచనను రసోపస్కారకంగా చేపట్టిన కవివతంసుడు శ్రీనాథుడు. రీతి ఆయనమార్గం; రసం ఆయన ధ్యేయం 'రీతి రాత్మా కావ్యస్య' అన్నది ఆయన అభిమతంకాదు 'వాగ్వైదగ్ధ్యప్రధానేపి రస ఏవాత్ర జీవితం' అని ఆయనమతం.

తెలుగుసాహిత్యంలో కావ్యస్పృహ నన్నయలో బీజరూపంగానూ, తిక్కనలో అంకురరూపంగానూ, ఎఱ్ఱయలో కుట్మల రూపంగానూ, నాచన సోమనాథునిలో పుష్పరూపంగానూ, శ్రీనాథునిలో ఫలరూపంగానూ పరిణమించింది. శ్రీనాథయుగాన్ని కావ్యయుగ మంటారు. ఆంధ్రకావ్య స్పృహకు శ్రీనాథుడు కళాపూర్ణుడు; శృంగారనైషధకావ్య రచనం శరద్రాత్రి!

శ్రీనాథుని కవితాద్రవ్యవంయోజనాన్ని ఇలా భావించవచ్చు.

రీతి (వైదర్భి)

| | | |
|---|---|---|
| రసవృత్తి | ప్రౌఢోక్తి | రసవ్యంజక మైన |
| శబ్దం - అర్థం | వర్ణనాత్మకభణితి | రీతి కావ్యప్రస్థానం. |
| అలంకారం - వర్ణనం | | |

శ్రీనాథుని కవితలో వైదర్భీరీతి విస్తృతంగా కనిపిస్తుంది. నన్నయ కూడా వైదర్భీరీతిని ఆదరించాడు. కాని, ఆయన రీతిని గుణపోషణంగా నిలిపాడు గుణాలలో ప్రసాదానికి ప్రాధాన్య మిచ్చాడు. శ్రీనాథుడు కూడా నన్నయలాగా ప్రసాదాన్ని గ్రైకొన్నా దాన్ని ఓజో మాధుర్య గుణాలతో మిశ్రమం చేస్తాడు. ప్రసాదం తెల్లరంగులాంటిది. ఏరంగులోనైనా కలుస్తుంది ఆరంగును ప్రసన్నం చేస్తుంది. శ్రీనాథుడు ప్రసన్నమైన ఓజో మాధుర్యాలతో వైదర్భీరీతిని రూపొందిస్తాడు. పదప్రయోగ ప్రావీణ్యంతో రీతిలోనుండి వృత్తులను భావనామయంచేసి అందిస్తాడు. అవి రససాక్షాత్కారానికి ప్రత్యక్షో పస్కారా లవుతాయి. శ్రీనాథు డెంతటి సమాసం వాడినా, ఓజోగుణం గండూషించినా, మాధుర్యాన్ని మాత్రం మరచిపోడు. వీణానాదంలా శ్రీనాథునిరచన వీనులవిందు చేస్తుంది; పఠితను సమ్మోహపరుస్తుంది. అత

ఉక్తి ఎంత ప్రౌఢమో, కవితారీతి అంత మధురం. ఈఫణితిని ప్రబంధకవులు బహుధా అనుసరించారు.

శ్రీనాథునికవిత కండగల పండును తింటూ రసాన్ని గ్రోలుతు న్నట్లుంటుంది, రసగర్భమైన వైదర్భీరీతి ఆతనికవితా సౌందర్యరుచి.

## పోతనభక్తికవితా ప్రస్థానం

కవితలో భక్తి రక్తికట్టాలంటే శ్రవణం, సంకీర్తనం, చింతనం అనే భక్తిమార్గాల కది పరిపోషకంగా ఉండాలి. కవితకు లలితశబ్దసంయోజనంవల్లా, మధురాక్షర పునరావృత్తివల్లా, అనుప్రాసయమకాది శబ్దాలంకార సంవిధానంవల్లా శ్రవణసుభగత్వం అలవడుతుంది. ధారావాహికమైన కవిత్వంవల్లా భగవద్గుణసంకీర్తనంవల్లా, రాగరంజితమైన శైలివల్లా అలవోకగా అవధానం చేయగలిగే పద్యవిద్యవల్లా కవితలో సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడుతుంది. భావనాగంభీరాలైన అర్థాలంకారాలవల్లా, ఆలోచనామృతాన్ని వర్షించే సార్థకశబ్ద ప్రయోగంవల్లా వ్యంగ్యసౌరభాన్ని వెదజల్లే వాక్యవిన్యాసంవల్లా అరటిపండొలిచిపెట్టినట్లు అభివ్యక్తంచేసే తాత్త్వికతాత్పర్యంవల్లా కవిత్వం పఠితలలో చింతనను రెకెత్తింప చేస్తుంది. బమ్మెరపోతన్న కవిత్వం ఈలక్షణాలనన్నింటినీ సలక్షణంగా తనలో సమన్వయించుకొన్నది.

పోతన భాగవతకవిత్వం భక్తిరసభాగీరథి. సాహిత్యప్రస్థానాల్లో భక్తికవితాప్రస్థానానికి ఒక ప్రత్యేకత ఉంది. భక్తిఆలంకారికుల మతంలో భావం; మధుసూదన సరస్వత్యాదుల మతంలో పరిపూర్ణ రసం. భక్తిరసం శృంగారాదులవలె శుద్ధలౌకికం కాదు. తద్రసానుభూతిలో లౌకికాధ్యాత్మికస్థితుల మిశ్రప్రవృత్తి ద్యోతమానమౌతుంది. దానిని కవితలో ఒప్పించటం భక్తికవితను రచించే కవిబాధ్యత. ఆంధ్రభాగవత కవితలో పోతన భక్తియొక్క లౌకికస్థితిని, ఆధ్యాత్మికస్థితిని అపూర్వంగా సంవదింపచేశాడు. భక్తిరసస్థితికి తన కవితను ప్రమాణంగా ప్రపంచించాడు.

సాహిత్యదృష్టితో చూస్తే పోతన రసానుప్రాణితమైన అలంకారధ్వని ప్రస్థానానికి చెందినవాడుగా కనపడతాడు. అనుప్రాసలు, యమకాలూ వంటి శబ్దాలంకారాలు అర్థాలంకారాల అలంబనంతో పఠితచిత్తానికి భక్తి

భావతాదాత్మ్యాన్ని కలిగిస్తాయి. అలంకృతమైన రచన రసభావవ్యంజక మౌతుంది. భావంలో భాసించే భగవద్రూపగుణ కీర్తనరూపమైన రతి భక్తి రసాన్ని ప్రతీయమానం చేస్తుంది. అలంకారధ్వనిని రసధ్వనిలో పర్యవసింపచేసే పద్యరచనాపద్ధతి పోతనకవితకు ప్రాణం

భగవద్రూపరతి భక్తికి స్థాయి. భగవత్తత్త్వం సగుణనిర్గుణభేదంతో రెండువిధాలు సగుణరూపంతిలో భక్తి రసస్థితి నందుకొంటుంది. నిర్గుణరూపచింతనంలో భక్తి ఆధ్యాత్మికజ్ఞానస్థితి నందుకొంటుంది. సగుణనిర్గుణ భగవద్రూపరతిని భాగవతంలో పోతన నీరక్షీరన్యాయంగా పోషించాడు. తద్భావభావనంవల్ల అలౌకికాధ్యాత్మిక అనుభవరూపమైన భక్తి పఠితకు ఆస్వాదమధురంగా అందుతుంది. రచనవల్ల భావానుసంధానం, భావచర్వణం వల్ల భగవద్రూప రతి చర్వణం, తద్రతిచర్వణం వల్ల భక్తిరసానుభూతీ కలిగే మూడు అంచెల ప్రస్థానం పోతనకవితలో ప్రస్ఫుటంగా ప్రత్యక్ష మౌతుంది.

పోతనకవితలోని అలంకారం ఆర్ద్రితనూ, భావాభివ్యక్తిలోని ప్రసాదం పారవశ్యాన్ని, భగవద్రూపతత్త్వ చింతనామయమైన ఆధ్యాత్మిక ప్రవృత్తిప్రేరణం భక్తిమత్తచిత్తాన్ని కల్పించి అసంలక్ష్యక్రమవ్యంగ్యఫణితిలో రసామోదాన్ని కలిగిస్తుంది. ఆకవితలోని రుచితత్త్వం ఇదే.

పోతన వ్రాసింది మహాపురాణం. అది రసప్రధానం కాదు, జ్ఞాన ప్రధానం. అయినా పోతన తనకవితలో జ్ఞానాన్ని పానకంలో చక్కెరపలుకుల్లా కరిగించివేశాడు. మూలభాగవత శాంతరసస్థితిని తనరచనలో భక్తిరస పోషకంగా అనుసంధించి అభినవభక్తిప్రస్థానాన్ని పరిపోషించాడు. ఈదృష్టితో పోతనకవితలోని ద్రవ్యసంయోజన స్థితిని ఇలా భావించవచ్చు.

| | | |
|---|---|---|
| శబ్దాలంకారం | | |
| శబ్దం - భావం | మధురోక్తి | అలంకారధ్వనిమూలమైన |
| రసం - వర్ణనం | పురాణఫణితి | భక్తికవితాప్రస్థానం |
| వస్తువు | | |

## ప్రబంధ కవుల ప్రయోగ ప్రావీణ్యం

కావ్యయుగకవులతరువాత తెలుగులో ప్రబంధయుగకవులు పెక్కు ప్రయోగాలు నిర్వహించారు. ఆంధ్రప్రబంధం ప్రత్యేకసాహిత్య ప్రక్రియగా గుర్తింపబడింది. దానికి కారణం ప్రబంధకవుల ప్రయోగప్రావీణ్యమే. ప్రబంధ మంటే ప్రకృష్టమైనబంధం. వస్తువు, నాయకాదులు, పాత్రలు, రచన, రసం, అనే అంశాల నాధారంగా చేసికొని ఆప్రకృష్టబంధస్వరూపాన్ని వివేచింపవలసి ఉంటుంది.

1. వస్తువులు :- 1. ప్రబంధాలలో వస్తువు మృగ్య మని కొందరంటే, వస్త్వైక్యం ఉండా లని కొందరంటారు. ప్రబంధంలో వస్తువు ఉంటుంది. అందులో ఐక్యత కంటె ఏక వాక్యత ప్రధానం.

2. వస్తువు వర్ణనామయం కావటం సామాన్యలక్షణం, వస్తువర్ణనలమధ్య క్షీరనీరన్యాయంకంటె తిలతండుల న్యాయం ప్రబంధాల్లో మిక్కుటంగా భాసిస్తుంది.

3. వస్తువులో సన్నివేశకల్పనం ముఖ్యం: సజాతీయ విజాతీయ ప్రవృత్తులకు సంఘర్షణం కల్పించటం సన్నివేశ నిర్వహణశిల్పం.

4. వస్తువులోని ప్రతీకాత్మకప్రవృత్తిని పరిరక్షించటం ప్రబంధవస్తుధర్మం.

5. జాతివార్తాకథనం వస్తుసంపత్తికి పోషకద్రవ్యం.

6. స్వతంత్రకల్ప మైన వస్తునిర్మాణం ప్రబందంలో ముఖ్యం. ప్రఖ్యాత వస్తువుకంటె మిశ్రకల్పితేతి వృత్తాలే ప్రబంధవస్తువులుగా పరిగ్రహ యోగ్యాలు.

2. పాత్రలు :- 1. పాత్రచిత్రణంకంటె పాత్ర పోషణం ముఖ్యం.

2. పాత్రప్రవృత్తుల్లో లోకవృత్తప్రతిబింబ స్వభావం, ప్రతీకాత్మకత, సంఘర్షణస్వభావం ప్రధానం.

4. అతిలోకపాత్రలకంటె అపూర్వపాత్రలను గ్రహించటం సాధారణం.

3. రచన :- 1. శబ్దార్థశక్తుల విశ్లేషణం,
2. శ్లేషవక్రోక్తి చమత్కారాల ప్రాముఖ్యం.
3. ప్రతిపద్యశిల్పసామర్థ్యం.
4. శబ్దార్థాలంకార ప్రయోగంలో కవిప్రౌఢోక్తి ప్రాధాన్యం.
5. శాస్త్రార్థగర్భగౌరవం.
6. సంవాదశిల్ప సంవిధాన కౌశలం- రచనకు ముఖ్య లక్షణాలు.

4. రసం - 1. ప్రబంధాలు శృంగారరసప్రధానా లన్న వాదమూ ఉన్నది. ప్రబంధాలు రసప్రధానాలు కావన్న వాదమూ ఉన్నది.
2. ప్రబంధకవులకు రసప్రవణత్వం కంటె రసభేద ప్రయోగాసక్తి ఎక్కువ.
3. ప్రబంధకవులు రసశిల్పంతోపాటు రసాభాసశిల్పాన్ని కూడా పోషించటంలో ప్రయోగాలు చేశారు.
4. రసశిల్పంలో ఆనందం ధ్యేయం; రసాభాసశిల్పంలో ఆహ్లాదం ఉపాదేయం.
5. మనస్సుకూ, మెదడుకూ ముడివేయాలన్న ప్రయత్నం ప్రబంధాల ప్రయోగాలకు మూలం.
6. ప్రతీకాత్మకప్రవృత్తిని విశ్లేషించిటంలో రసవృత్తి జ్ఞానవృత్తిగా పరిణమించే పరిస్థితి ప్రబంధాలలో ఏర్పడటం కద్దు
7, బహుళార్థభావనం కానీ, శ్లేషచమత్కారం కానీ చేసి, రసభావ సంభావనం కంటె, రచనారామణీయకత్వాన్ని రమించే ప్రవృత్తిని పఠితల్లో అధికంగా ప్రేరేపించటం ప్రబంధరచనాస్వభావం.

8. ప్రబంధాలలోని ఆలంకారిక రచనవల్ల వస్తుధ్వని పోషింప బడింది. రసధ్వనికూడా పెక్కుచోట్ల వస్తుధ్వనిలో పర్యవసిస్తుంది. కొందరు దీనిని ప్రబంధధ్వని అని పిలుస్తున్నారు.

9. శృంగార రసపోషణలో పూర్వరాగ విప్రలంభానికి ప్రాధాన్యం ఇవ్వబడింది. కామశాస్త్ర రహస్యాలకు రూపకల్పనంగా సన్నివేశాలు చిత్రింపబడిన తావుల్లో రసభావవిశ్లేషణం మనో విశ్లేషణానికి ఉంగభూతమై పోయింది.

10. పాత్రభావపోషణంలోని అంతఃప్రవృత్తిచిత్రణానికీ, ప్రకృతివర్ణనంలోని బహిఃప్రకృతి చిత్రణానికీ ఏక వాక్యత కుదిరినప్పుడు మాత్రమే ప్రబంధంలోని స్థాయిని పోషించే సంచారిభావస్థితి గమ్యమాన మౌతుంది. కాబట్టి ప్రబంధరసస్థితి కొన్నిప్రయోగాల్లో సంశ్లిష్ట మార్గాన్ని ఆశ్రయించింది.

ప్రబంధ కవితా ప్రవృత్తిని వివేచించటానికి ప్రబంధస్వరూప స్వభావ సమాలోచనం ఉపకరిస్తుందని ప్రబంధలక్షణాలను సూత్రప్రాయంగా సమీక్షించటం జరిగింది. ఇక ప్రబంధ కవుల ప్రస్థాన ఫణితిని కొంత అను శీలించ వలసి ఉన్నది.

ప్రబంధ కవులు చారిత్రకంగా వారు జీవించిన కాలాన్ని బట్టి పూర్వ కవుల ప్రస్థానాలకంటె విలక్షణమైన వాటిని ఎన్నుకొని ప్రయోగాలు చేయ వలసి వచ్చింది. కాలమే వారికి క్రొంగ్రొత్త గళాల నిచ్చింది; వారి కవితలకు క్రొంగ్రొత్త రుచుల నందించింది.

ప్రాచీనకవులకూ ప్రబంధకవులకూ ప్రవృత్తిలో ఒక ప్రధానభేదం ఉంది. కవిత్రయ యుగ కవులు కథార్థాల్లో మునిగి ఈదారు. వారిశైలి వారి కావ్యాలకు పుట్టుకవచంలా పొలువు మీరింది. నాచన సోమాదులు కథార్థప్రవాహంలో తలయెత్తి నిలువుఈత ఈదారు. కథార్థాలకు వారి

కవిత అతికినా వారి వ్యక్తిత్వం తలయెత్తి ఉక్తివిలాసంతో ఉపజీవిస్తుండేది. కావ్యయుగ కవులు కావ్యార్థతరంగిణులపై అడ్డయీత ఈదారు. ఈద బడుతున్న నీరూ ఈదుతున్నవాడూ ఆధార ఆధేయభావంతో అందులో కన పడతారు. శ్రీనాథాదుల కృతుల్లో కవిశైలి నిలువెల్లా కనపడుతుంది. ప్రబంధ కవులు వీరందరి తరువాత వచ్చారు. వీరి కాలానికి ఈతలన్నీ పాత పద్ధతులయ్యాయి. అందువల్ల జలపాతాల్లో జలకమాడటం ప్రారభించారు. వీరు కావ్యార్థాలను స్వీయ కవితావ్యక్తిత్వాలకు అభిషేక జలాలుగా మార్చు కున్నట్లనిపిస్తుంది. ప్రబంధాల్లో అడుగడుగునా కవిప్రౌఢోక్తికి కావ్యార్థాలు మడుగులొత్తుతున్నట్లు భాసిస్తాయి. కావ్యమంతా కవితా వ్యక్తిత్వానికి కనకాభిషేకం చేయటం కనిపిస్తుంది. ఆత్మ ప్రత్యయం ఆంధ్రప్రబంధ కవుల అమూల్యాలంకారం! అది ఆయుగ ప్రవృత్తికి గర్వ కారణం అయింది!

సాహిత్య ప్రస్థానాల్లో ప్రబంధకవులకు అలంకారమార్గమే శరణ్యమై పోయింది. కవిత్రయంవారు గుణ ప్రస్థానాన్ని గురుతరంగా ప్రస్తరించారు. నాచనసోముడు చమత్కారమార్గాన్ని చిత్రవిత్రంగా నడిపాడు, శ్రీనాథుడు రీతి మార్గాన్ని అనన్యసాధ్యంగా నిర్వహించాడు, పోతన భక్తి మార్గాన్ని పరిపూర్ణంగా సాధించాడు. ఇక మిగిలింది విస్తారమైన అలంకారప్రస్థానం. అది ప్రబంధ కవులకు విహారరంగమై నిలిచింది. కాలపురుషుడు వారి కందిం చిన కల్పకం అలంకార ప్రస్థానం!

భామహాదులు అలంకార ప్రస్థానాన్ని సారించారు. 'సౌందర్యమలం కారః' అని భామహోక్తి. అలంకారం కావ్యంలో ఉక్తినాశ్రయించి ఉపజీవి స్తుంది. అందువల్ల కావ్యార్థాల్లో ఉక్తికి అలంకార ప్రస్థానంలో అగ్ర తాంబూలం లభించింది. ఉక్తికి అందం అలంకారం. ఆ అందం వక్రతవలన ఏర్పడుతుందని భామహుని తీర్పు. "వక్రాభిధేయ శబ్దోక్తి రిష్టావాచా మలం కృతిః 'వాచాం వక్రార్థ శబ్దోక్తి రలంకారాయ కల్పతే,' మొదలైన వాక్యాలు కావ్య సౌందర్యం వక్రతతో కూడిన శబ్దార్థాల వలన ఏర్పడు తుందని ఘోషిస్తున్నాయి. భామహుడు అలంకారాన్ని సౌందర్యంగా సంభావిస్తే, తరువాతి ఆలంకారికులు కవితకు సొమ్ముగా గణించి గుణిం చారు; వివేచించి విశ్లేషించారు. సౌందర్యం ఒకగుణం; సొమ్ములు గుణాన్ని

పోషించే ఉపకరణాలు. కరణాలనే ఉపకరణాలుగా భావించి ముందుకు సాగింది అలంకార ప్రస్థానం. ప్రబంధకవులు ఈబాటలో పథికులుగా ప్రయాణం సాగించారు. ఒకొక్క మహాకవికి ఒక్కొక్క ఉక్తి గౌరవం లభించింది. దాన్ని తరువాత పేర్కొంటాను.

సర్వాలంకారాలకు బీజభూతమైన అలంకార మేది అనే అంశంమీద ఆలంకారికుల్లో అభిప్రాయభేదా లున్నాయి. ఆయాసిద్ధాంతాలనుబట్టి నాలుగైదు మార్గాలు ప్రసిద్ధిలోకి వచ్చాయి - వాటిని ఇలా భావించవచ్చు.

1. వక్రోక్తియే సర్వాలంకారబీజభూత మనే భామహునిమతం.

2. ఉపమాలంకార మే సర్వాలంకారబీజభూత మనే వామనమతం.

3. అతిశయోక్తియే సర్వాలంకారబీజభూత మనే మమ్మటమతం.

4. స్వభావోక్తియే సర్వాలంకారబీజభూత మనే దండ్యాదుల మతం.

5. శ్లేషయే సర్వాలంకారబీభూజతమనే కొందరి వాదం.

దండ్యాదులు అర్థాలంకారాలను స్వభావోక్తులనీ వక్రోక్తులనీ, రెండు శాఖలుగా విభజించారు. భామహుడు స్వభావోక్తి నంగీకరించలేదు. రుద్రటుడు. వాస్తవ, ఔపమ్య, అతిశయ, శ్లేషలను అలంకారమూలాలుగా గ్రహించాడు. రుయ్యకుడు ఔపమ్య, విరోధ, శృంఖలా, న్యాయ, గూఢార్థప్రతీతి, సంసృష్టి, సంకరాలనే విభాగషట్కాన్ని పాటించాడు. విద్యానాధుడు ఔపమ్య, సాధర్మ్య, అధ్యవసాయ, విశేషణవైచిత్ర్యము లనే భాగాలు చేశాడు, ఇవన్నీ ఒక యెత్తు పైన పేర్కొన్న అయిదుమతాలు మరో యెత్తు. ఆంధ్రప్రబంధ కవుల కవితాదృక్పథాలను పరిశీలిస్తే ప్రసిద్ధులైన ఈ క్రింది కవు లాయా సిద్ధాంతాలను అనుసరిస్తూ తదనుగుణ మైన ఉక్తివైభవా న్ని వెలార్చా రని భావించటానికి వీలుంది. మచ్చుకు ఈపట్టి ఇవ్వటం జరుగుతోంది.

| కవి — | అలంకార సిద్ధాంతం — | ఉక్తిలక్షణ |
| --- | --- | --- |
| పెద్దన - | అలంకారాలు ఉపమామూలాలు | - చతురోక్తి |
| తిమ్మన - | అలంకారాలు ఉపమామూలాలు | - సరసోక్తి |
| రాయలు - | అలంకారాలు స్వభావోక్తి, అతిశయోక్తి మూలాలు | - ప్రౌఢోక్తి |
| సూరన - | అలంకారాలు వక్రోక్తి, శ్లేషోక్తి మూలాలు | - సమాసోక్తి |
| రామరాజభూషణుడు - | అలంకారాలు శ్లేషోక్తి మూలాలు | - పర్యాయోక్తి |
| రామకృష్ణుడు - | అలంకారాలు వక్రోక్తి మూలాలు | - ప్రౌఢోక్తి |
| చేమకూర వెంకటకవి - | అలంకారాలు శ్లేషోక్తి మూలాలు | - వక్రోక్తి |

ఈ కవుల్లో ఔపమ్యమూలవాదులకవిత ఉత్తమంగా ఉంటుంది. పెద్దన తిమ్మన లాకోవలో నిలుస్తారు. అయినా తిమ్మనకంటె పెద్దన పది రెట్లు పెద్దకవి. ఆయనది 'చతురరచన' అనీ, ఆయన ఉక్తులు 'శిరీషకుసుమపేశలసుధామయా' లనీ రాయలు కీర్తించాడు. చతుర పేశల శబ్దాల్లు సమానార్థకాలే. 'చతతే' కాంక్షతే ప్రయోజన మితి చతురః' 'పింశతి అవయవో భవతి కార్యేషు ఇతి పేశలః' అని గురుబాలప్రబోధిక. అంటే- ఉద్దిష్టమైన పరమప్రయోజనానికి సాధనభూతు డైనవాడు చతురుడు; అట్టి లక్షణం కలిగింది చతురవాక్కు. అట్టివాక్కు చేత కవి సాధించేది రసం. రససిద్ధిని కాంక్షించి తత్సాధకంగా శబ్దాలను ప్రయోగించటం చాతుర్యం. నన్నెచోడుడు ఉక్తులను సూక్తు లనీ, సదుక్తు లనీ వింగడించాడు. అందులో చతురోక్తులు ఉత్తమము లని పేర్కొన్నాడు.

"చతురోక్తుల, నుతపదబహు
గతుల, నలంకారభావకాంతి రసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్" (కు. సం, 1. 39)

ఇటువంటి చతురోక్తులు పెద్దన కవితకు పెట్టినరుచులు. పెద్దనకవితా శైలిని వివేచిస్తూ ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు 'ఆడంబరము లేని గాంభీర్యము, సౌమ్యమైన ప్రాభవము, ఉద్వేగము లేని శీఘ్రగమనము, పేలవత్వము లేని స్వాభావికత, వెలితి లేక నిండారి మెరుగులు దీరిన పదగుంఫనము ఈకావ్య శైలికి ముఖ్య లక్షణ, మ'నీ, 'శబ్దసరణి ఎన్ని రూపాంతములు పొందినను పెద్దనవాక్కునకు సహజమైన ప్రసన్నత ముత్యములోని లావణ్యము వలె ప్రస్ఫుట మగుచునే యుండును. మరియు అర్థానుగుణముగా నినదించునట్లు శబ్దములను గుంఫనము చేయుటలో ఈకవి అద్వితీయుడు' అనీ అన్నారు.

ప్రబంధకవుల్లో రసస్వరూపం బాగా తెలిసిన మహాకవి అల్లసాని పెద్దన, అలంకార ప్రస్థానానికి ఆదర్శప్రాయమైన కవితా రుచిని అందించిన వాడుకూడా ఆయనయే. అందుకే ఆయనను ఆంధ్రకవితాపితామహు డన్నారేమో అనిపిస్తుంది. శబ్దార్థాలంకార మండిత మైన సుకుమార మధుర పరీపాక మైన పదరచనతో రీతి నతిశయించిన రసవృత్తిని స్ఫురింపచేసే చాతుర్యం ఆయన సొత్తు. పెద్దనరచనలో శబ్దార్థ గుణరూపమైన శ్లేష సమృద్ధంగా నిండి ఉంటుంది. పెద్దన సాధించిన గుణశ్లేషను మాని శబ్దార్థశ్లేషాలంకృతులను సూరనాదులు తమ కవితలలో పండించుకొని క్రొత్తపోకడలు పోయారు. ఎవ రెన్ని ప్రయోగాలు చేసినా రసవృత్తివ్యంజకమై, గుణరీతి నిరూపక మైన అలంకృతోక్తి ప్రధానంగా గల పెద్దన వచోవృత్తి నన్నయ, శ్రీనాథుల వాక్పాకాలను అంటుతొక్కి క్రొత్తపంట పండించినదైంది. ఇది పెద్దన కవితకు పేరు తెచ్చిన రుచివైభవం.

పెద్దన - రసవృత్తి

అలంకారం – గుణం　　చతురోక్తి　　రసోన్ముఖమైన

శబ్దం – అర్థం　　ప్రబంధఫణితి　　అలంకార ప్రస్థానం

వర్ణనం

'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' అని ప్రసిద్ధి. ఆయనకు సరస మైనవాక్కు ఉన్నది. కాని, రసవృత్తిని వ్యంజింపచేసే గాంభీర్యము పెద్దన కంటె కొరవడినది. రసపోషణవిధానంలో తిమ్మన తన వాక్కును చమ

త్కారంవైపు తరచు పరుగెత్తించుటచే కవితకు ఆనంద మిచ్చే శక్తికంటె ఆహ్లాద మిచ్చే శక్తి ఎక్కువై పోయింది. అలంకృతోక్తిని మాధుర్యగుణో దంచిత మైన రచనలో రాణింపచేసే ప్రజ్ఞ తిమ్మన కున్నది. ఆయన కవితలో ఆంధ్రుల నాల్కలమీద నిలిచే కొన్నిపద్యాల్లో రుచిగా మిగిలేది ఆప్రజ్ఞయే.

రాయలకవిత పెద్దనకవితలా రసంవైపు పరుగెత్తలేదు. అనంత మైన ఊహాలనూ, ఉత్ప్రేక్షలనూ, లోకానుభవాలనూ నాలుగుచరణాల పద్యాల్లో కుదించి, కూర్పులోనూ, నేర్పులోనూ పాదుపరితనంకోసం ప్రాకులాడే ప్రవృత్తి ఎక్కువ. రాయలకవితకు రాజసంతోపాటు ఓజస్సు గుణం. గాఢబంధత్వం, అర్థప్రౌఢత్వం దాని శ్వాసకోశాలు. ఆయనకు రీతికంటె పాకం మీద ప్రణయ మెక్కువ. అందువల్ల రసవృత్తుల జాడలు ఆయనకవితలో తక్కువ. రాయలు గొప్పభావుకుడు. ఆయనభావన అలంకారోక్తిలో మూసలుగా జాలువారుతుంది. పట్టుపుగజాన్ని ఒంటినిండా అలంకరించి నట్లుంటుంది ఆయనకవిత. రాయలకవితలో రచనకంటె అలంకారమే ఆసక్తి దాయకం; పదంకంటె భావమే ఆనందదాయకం !

ఆయనపలుకుబడిలో నినదించే వింతసమాసాల పోహళింపుల్లాగానే స్వభావోక్తినీ, అతిశయోక్తినీ మన్నించే ఆయనదృక్పథం విరోధాభాసంగా స్ఫురించే విచిత్రదర్శనం !

సరసోక్తి, చతురోక్తి, ప్రౌఢోక్తి ప్రధానంగా సాగిన అలంకార ప్రస్థానాన్ని వక్రోక్తి, శ్లిష్టోక్తి మార్గాలవైపు మళ్ళించిన గౌరవం పింగళి సూరన్నకు దక్కింది. ఆయన వక్రోక్తివైభవం కళాపూర్ణోదయంలో కథా ర్థాలోనూ, ప్రభావతీప్రద్యుమ్నంలో కవితలోనూ ఫలించింది. అతని శ్లిష్టోక్తి ద్వ్యర్థి కావ్యప్రయోగంలో పడి కథార్థసంధానంలోనే కాలం వెళ్ళబుచ్చి రసలోకం చేరుకోలేకపోయింది. అయినా, శబ్దంలోని నానార్థ ప్రతీయమానశక్తిని రచనలో శ్లిష్టసుందరంగా సాధించవచ్చు నన్న వినూత్న ప్రయోగాన్ని తెలుగులో చేసిచూపాడు సూరన. ఈతని వక్రోక్తిమార్గాన్ని ప్రౌఢతరం చేసి తెనాలి రామకృష్ణుడు తనకవితలో పదగుంఫనంగా సానలు తీర్చాడు. శ్లిష్టకవితామార్గాన్ని రామరాజభూషణుడు చేపట్టి బంగారుపంట

పండించాడు. శ్లేషకవిత్వానికి ఒక గురుకులం ఆతని వసుచరిత్రలోని కవిత్వం. ఆగురుకులంలో పెరిగి మరోగురుపీఠాన్ని నిలుపుకొన్నవాడు చేమకూర.

ప్రబంధకవుల్లో పెద్దన్న శబ్దార్థగుణశ్లేషకు తనకవితలో పట్టం కట్టితే- రామరాజభూషణుడు శబ్దార్థాలంకారశ్లేషకు తనకవితలో సువర్ణాభిషేకం చేశాడు. ఇద్దరికీ అలంకారప్రస్థానాన్ని రసోన్ముఖంగా సాగించటం తెలుసు. ప్రబంధకవుల్లో వీరిద్దరూ ప్రముఖ ప్రస్థానాచార్యులు.

ఇలా విశ్లేషించుకొంటూ సాగితే ఇంకా గ్రంథం పెరుగుతుంది. నాలుగుమాటలలో ముగిద్దామని మొదలుపెట్టి చాలా వ్రాశాను. తెలుగు కవిత్వంలోని రుచిభేదాలను సమీక్షించే ఒక వినూత్నవివేచనమార్గాన్ని తెలుగులో వెలయించాలన్న నా ప్రయత్నాన్ని ఈ పీఠికలో సహృదయులు గమనిస్తే చాలు. క్రొత్తగా బాట వేస్తున్నప్పుడు కొన్ని ఎగుడుదిగుడులుండవచ్చు. వివరించవలసిన అంశాలెన్నో మిగిలిపోవచ్చు. నలుగురు ఈబాటను మెచ్చి నాలుగుసార్లు నడిస్తే అదే రమ్యమైన పథమౌతుంది.

ప్రాచీన కవిత్వరుచిభేదాలను, తీరుతెన్నులను విశ్లేషించి చూపినట్లే, ఆధునికాంధ్రకవిత్వపరంగానూ వాటిని వివేచించి ప్రపంచించవచ్చు. ఇప్పటికింతవరకు ద్వితీయముద్రణ పీఠిక. తృతీయముద్రణం వెలువడేటప్పుడు ప్రాచ్యపాశ్చాత్యప్రమాణాలతో ఆధునికాంధ్రకవితా సౌందర్యాన్ని సమీక్షించే అవకాశం దొరుకుతుందని ఆశిస్తాను.

నాయందలి స్నేహభావంతో నాకీ అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

హైదరాబాదు,
4-6-1981.

—జి. వి. సుబ్రహ్మణ్యం

# వి షయ సూ చి క

—: o :—

# నన్నయ్యకు పూర్వము ఆంధ్రభాష

## పూర్వపు తెనుగు శాసనములు

—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

మన వాఙ్మయ చరిత్రమున మొట్టమొదటి ప్రకరణమే సమస్యాబహుళమయిన పెద్ద ఘట్టము. మన భాష పుట్టుపూర్వోత్తరము లింకను దురవబోధములుగనే యున్నవి. అసలు మన భాష పేర్లను గురించియే యింకను ఎన్నో తికమకలు పడుచున్నాము. వానిని గురించి యింతవరకు ఒక నిశ్చితమయిన సిద్ధాంతమే కుదురలేదు.

**ఆంధ్రము : తెలుగు :**

ఆంధ్రము, తెలుగు అను రెండు పదములను మన భాషకు పర్యాయ పదములుగా వాడుచున్నాము. ఒకే భాష కింతటి విరుద్ధమైన పేర్లేల వచ్చెను యివి పర్యాయ పదములుగ చెప్పబడుట ఎట్లు సంభవించినదను ప్రశ్న ప్రప్రథమముననే కలుగుచున్నది, తెలుగనేమిటి, ఆంధ్రమేమిటి అను జిజ్ఞాస పెక్కు వాదములకు కారణమయినది. నిర్ణయమునకు తోడ్పడు నిర్దుష్టము లయిన యాధారములు లేకపోవుటవలన యుక్తికి బలము లేని వాదములు బహుళము లయినవి. ఎన్నో విధములుగ ఎందరో యీ వాదములను పరిష్కరించినారు. కాని ఏ పరిష్కారమునకును యింతవరకు సర్వజనాంగీకారము లభింపలేదు; లభించుటయు కష్టమే. ఈ పదములకు గల భేదమును పురస్కరించుకొని అసలు తెలుగు వారు వేరు, ఆంధ్రులు వేరు అను వాదములును పుట్టినవి. ఆంధ్రులు అసలు యిచ్చటివారు కారని, ఉత్తర ప్రాంతములనుండి యిచ్చటికి వచ్చినారని, ఇచట మొదటినుండి నివసించుచున్న వారలు తెలుగువారని, ఇది అసలు తెలుగు దేశమని, ఆంధ్రు లిచటికి వచ్చి తెలుగువారితో కలిసిపోయి ఆ రెండు తెగలవారికి గల భేదము నంతరించిన పిదప ఆంధ్ర, తెలుగు పదములు పర్యాయపదములుగ చెప్పబడినవని కొందరి వాదము. ఇచ్చటి

రాయలసీమ అసలు తెలుగుదేశ మని, సముద్ర తీరస్థదేశము ఆంధ్ర మని మరి కొందరి అభిప్రాయము. ఇట్లే వాదములలో ఇంకను భేదము లున్నవి. వాని నన్నిటిని ఇచ్చట నుటంకించుట యనవసరము.

ప్రబల ప్రమాణములుగ ఎన్నదగిన శాసనములను బరిశీలించినచో ప్రాచీన కాలమున ఆంధ్రులుగనే వ్యవహరింపబడినట్లు తెలియగలదు. పురాణములు సయితము ఆంధ్రులను ఆంధ్రులనియే వ్యవహరించియున్నవి. క్రీస్తుశకము ఐదారు శతాబ్దులనాటి నుండి ఆంధ్రపదమును, అంతకు పూర్వము అంధ పదమును శాసనములందు గానవచ్చును. ఆంధ్రపదము క్రీస్తుశకము మొదటి శతాబ్దులలోని ప్రాకృతశాసనములలో గానవచ్చును. ప్రాకృతమున అంధ్ర ఆంధ్రమైనది. ప్రాచీన బౌద్ధ త్రిపిటక వాఙ్మయము నందును, ప్రాచీన జైనవాఙ్మయమునందును ఆంధ్రులు అంధులని, అంధకు లని వ్యవహరింపబడి యున్నారు. తెలుగుపదము శాసనములలో పది, పదునొకండవ శతాబ్దులనుంచి కాని కానరాదు. తెలుగు, తెలుంగు, తిలంగ, తిలింగ రూపములతో శాసన వాఙ్మయమున ఇది కనబడుచున్నది. అప్పటికే తెలుగు, ఆంధ్రములు దేశనామములుగను, జాతివాచకములు గను పర్యాయపదములయినవి. పది పదునొకండవ శతాబ్దులకు పూర్వము పురాణములందు కాని, శాసనములందు కాని, జైనబౌద్ధవాఙ్మయములందు కాని, దేశనామముగ గాని, జాతివాచకముగ గాని, తెలుగు పదమే కానరాదు. దీని ననుసరించి తెలుగుజాతి వేరుగ నొకటి యుండె ననుటకు గాని, తెలుగుదేశము వేరొకటి యుండె ననుటకుగాని ఆధారములు లేవు.

ఆంధ్రపదము జాతివాచక మని పురాణములను బట్టియు, బౌద్ధ జైన వాఙ్మయములను బట్టియు స్పష్టమగుచున్నది. ఆంధ్రజాతి బహు పురాతన మయినదని ఐతరేయ బ్రాహ్మణమునుబట్టి మనకు దెలియుచున్నది. ఈ బ్రాహ్మణమునాటికి ఆంధ్రులు ఆర్యావర్త సీమావధులందు నివసించు చుండిరి. వీ రొకప్పుడు ఇప్పటి సంయుక్త రాష్ట్రములందుండినట్లు అనుమా నింప నవకాశము కలదు. అంధ వనమను పేర నొక వనము ఉత్తర కోసలమున నుండినట్లు విదేశ బౌద్ధయాత్రికుల గ్రంథముల వలన దెలియుచున్నది. ఇది బౌద్ధవాఙ్మయమున ప్రసిద్ధమైన జేతవనమునకు వాయవ్యదిశనుండెను. ఇక్ష్వాకు

వంశకులకాణాచియైన ఉత్తర కోసలమునకు బుద్ధునికాలమున శ్రావస్తి రాజధాని, అంధవన, జేతవనములు రెండును ఆ నగరము పరిసరములందలివే. ఆంధ్రులనను సరించియే ఆవనమునకు అంధవనమను పేరు కలిగిన దని నాయూహ. ఆంధ్రజనపదము నంటియున్న యరణ్య ప్రదేశము అంధవనమను పేర వ్యవహరింపబడియుండును. శ్రావస్తికిని, ఆంధ్రులకును కొంత సంబంధ ముండినట్లు అంధవనము ననుసరించియే కాక పురాణ ప్రమాణముల ననుసరించియు సంశయింప దగియున్నది. శ్రావస్తీనగర నిర్మాణకర్తయగు శ్రావస్త, లేక శ్రావస్తక మహారాజు ఇక్ష్వాకు వంశజుడయిన వికుక్షి ఆఱవతరము వాడని, అతని తండ్రి పేరు అంధ్రు డని వాయుపురాణము తెలుపుచున్నది. (వాయువు అ. 88.24-26) (విష్ణువు, అ. 4. 2-12) కాని మత్స్యబ్రహ్మపురాణములు అతడు యువనాశ్వకుమారుడని, ఆర్ద్రుని మనుమడని చెప్పుచున్నవి. వాయుపురాణోక్త అంధ్రుడే యీ ఆర్ద్రుడు. ఇతనినే భాగవతపురాణము పొరపాటున కావచ్చును. చంద్రగుప్తుని పేర్కొనుచున్నది. ఈ శ్రావస్తి సంయుక్త రాష్ట్రముల యందలి అయోధ్య (Oudh) జిల్లాయందుండెను.

దక్షిణకోసలము కళింగదేశము పొరుగున నున్నది. ఇక్ష్వాకు వంశజులు కొందరు దక్షిణమునకు వలస వచ్చి యచ్చట స్థిరనివాసము కుదుర్చుకొనుట చేతనే దక్షిణకోసల మిచట ఏర్పడుట సంభవించియుండును.

ఇక్ష్వాకులకును ఆంధ్రదేశమునకు సంబంధము కలదనుటకును నాగార్జునకొండ, జగ్గయపేట శాసనములు రూఢపరచుచున్నవి. వీని ననుసరించి చూడగా ఆంధ్రులు ఉత్తరకురుభూముల నుండి క్రమముగా దక్షిణమునకు వచ్చి కృష్ణా గోదావరీ తీరప్రదేశములను తమ జన్మదేశములుగ జేసికొని రని విదితము కాగలదు. ఆంధ్రులు ఇక్ష్వాకు వంశజు లయినను, విశ్వామిత్ర సంతతివా రయినను ఉత్తరదేశమునుండి దక్షిణమునకు వచ్చిన యార్యజాతివారనుట స్పష్టము. ఇచ్చటికి వచ్చిన పిదప ఆంధ్రులకు ఇరుగుపొరుగుల నుండు జాతులవారితో సంపర్కము హెచ్చినది. ప్రాంతీయ భాషా సంసర్గమున

వారి భాషయు చాల మార్పు చెందినవి. ఉత్తరదేశస్థ ఆర్య జనపదములతో సంబంధము తెగిపోయినది. కాగా, ఆంధ్రులలో దాక్షిణాత్యభాషాచార సంప్రదాయములు వెలసి బలపడినవి. ఆంధ్రులు చివరకు పంచద్రావిడులలోనివారయినారు. ఆంధ్రు లిచ్చటికి వచ్చిన పిదప దాక్షిణాత్యభాషల సంసర్గ, సంమిశ్రణమున పరిణతి చెందిన వారి భాషయే తెలుగైనదని నా యూహ. ఆంధ్రము జాతివాచక మని, తెలుగు వారి భాషాసంకేతమని నాతలంపు. ఈ కారణమువనే కావచ్చును దాక్షిణాత్యభాషలలోని కెల్ల తెలుగే పరిపూర్ణత నందుటకు కట్టకడపటి దయినది. తెలుగు రూపొంది కావ్యత్వసిద్ధి నందుటకు చాలకాలము పట్టుటకును ఇదియే హేతువై యుండవచ్చును. క్రమాభివృద్ధి పరిణామముల నొంది తెలుగు చక్కగ పరిణతి చెందునాటికి ఆంధ్ర, తెలుగు పదములు జాతికిని, భాషకును గూడ పర్యాయవాచకములుగ రూఢము లయినవి. తెలుగు పదము శాసనములందు కాని, పురాణములందు కాని క్రీస్తుశకము పది శతాబ్దుల వరకు కానరాకపోవుట ననుసరించి యీ యూహయందు కొంత సత్యముండవచ్చు ననిపించుచున్నది. కాని, యిది రాయి గ్రుద్దినట్లు చెప్పదగిన సిద్ధాంతము కాదనియు, ఊహామాత్రమే యనియు, ప్రస్తుతము మనకు దొరికిన యాకరముల ననుసరించి యిట్లూహింప నగునైన దనియు జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది.

ఇక తెలుగు ప్రాచీన స్వరూప మెట్లుండె నన్నది విచారింపవలసి యున్నది. నన్నయభట్టారకుని నాటినుండి మన తెలుగుభాష ఎట్టెట్లు మార్పుచెందుచు వచ్చిన దనియు, ఏ యే రీతుల వృద్ధిచెందినదనియు దెలిసికొనుటకు గ్రంథజాలము కావలసినంత యున్నది. నన్నయభట్టారకునికి పూర్వము, అనగా పదునొకండవ శతాబ్దికిముసుపు తెలుగుభాష తీర్పుతీరువ లెట్లుండినదియు తెలిసికొనుటకు గ్రంథములు లేవు. అందువలన మనకు శాసనములే శరణ్యము.

## ప్రాచీన శాసనములు : తెలుగు :

శాసనములను గురించి ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనవలసిన విషయములు ఒకటి రెండు కలవు. శాసనములలోని భాష కడు పరిమిత మయినది;

కొంత కాలమునకు దానమిచ్చిన గ్రామమునకు సీమావధులు (సరిహద్దులు) పేర్కొనబడుచు వచ్చుట చేత మరికొన్ని ఆంధ్రపదములు తామ్రశాసనములలో నుదాహృతము లయినవి. ఇట్లు దానమిచ్చిన భూమికి కాని, గ్రామమునకు గాని సరిహద్దులను దెలుపుట ఆచారము కాగా నాడాంధ్ర దేశమున వ్యవహార మునందుండిన క్షేత్రనామములు, గ్రామ నామములు తామ్రశాసనములలోని కెక్కినవి. ఇదయినను సంస్కృత వేషమును ధరించియే; సంస్కృత వర్ణ క్రమముననే-ఉదాహరణమునకు చూడుడు ; 'ముణ్డూరగ్రామే' ; 'కమ్ము రాజ్చ 'పవే' ; ప్రాలూర గ్రామే' ; గొల్లతెంకిః' ; చెఱుకు మడ్లుళ్ళ' పోతురాయుః'. సంస్కృత వర్ణక్రమము ననుసరించి, విభక్తి రూపమో, విసర్గమో తగిలించుకొన్నచో ఊరిపేరులును, క్షేత్రము పేరులును సంస్కృత తామ్రశాసనములలోని కెక్కుటకు యోగ్యత గడించుకొన్న వన్నమాటే

దేశమున తెలుగు ఎన్నిక కాంచినకొద్ది తామ్రశాసనముల యందలి యున్నవి యున్నయట్లు సంస్కృత ప్రత్యయముల తగులుబడి లేకయే నిలబడుటకు బలము కలిగినది.

పైని చెప్పిన విషయముల ననుసరించి మనకు ప్రాచీన శాసనములలో గానవచ్చు మొదటి తెలుగు పేరులు గ్రామనామములవే యని తెలియగలదు. తామ్రశాసనములలోను, శిలాశాసనములలోను గానవచ్చు తెలుగును బట్టి మనము తెలుగుభాష ప్రాచీనస్వరూపమును దెలిసికొనవలసి యుండును.

శాసనములలో గానవచ్చిన మొట్టమొదటి తెలుగుపదము 'నాగబు'. ఇది అమరావతీ స్తూపశాసనములలో కానవచ్చినది. అందువలన ఏ మూడవ, నాలుగవ శతాబ్దినాటిదో కావచ్చును. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని భారతిలో ప్రకటించినారు, మహానాగప్రతిమ క్రింద ఈ శాసనమును జెక్కియుందురని వారన్నారు. కావచ్చును. ఇప్పుడా నాగప్రతిమ శిథిల మగుటచేతనో, త్రవ్వినపుడు పగిలిపోవుటచేతనో ఈ 'నాగబు' శాసన మొక్కటియే మనకు దక్కినది. 'నాగబు' అనగా 'నాగంబు-నాగము' అన్నమాట. ఈ శాసనము ననుసరించి క్రీస్తుశకము మూడవ శతాబ్దినాటికే తెలుగునకు ఒకరూపు మేర్పడెనని యూహింపవచ్చును.

గ్రామ నామవాచకములు :

ప్రాచీన తామ్రశాసనములలో ఆంధ్రదేశ గ్రామములు అనేకము ఉదాహృతము లయినవి. అప్పటి యూరిపేర్ల ననుసరించి మన ప్రాచీన భాషా స్వరూపము కొంత బోధపడగలదు. అదిగాకున్నగాక ఆ పూర్వపు పేరు లిప్పు డెట్లు మారినవో తెలిసినచో భాష మారుచు వచ్చుటలోనే సూత్రముల ననుసరించినదియు గొంత తెలియగలదు. సాధారణముగా మన గ్రామ నామములు పఱ్ఱు, కుఱ్ఱు, దొఱ్ఱు, ఊరు, ప్రోలు, వాడ, వాటి, కొలను చెఱువు, పల్లి, పూండి, మొదలైన వాటితో నంతమైనవి. పేర్ల చివర సాధారణముగ నివి కనబడును. చూడుడు : ఉదాహరణము.

| | | | | |
|---|---|---|---|---|
| పాంబఱ్ఱు | దొంతికుఱ్ఱు | తాండివాడు | కలుచెఱువుల | పెనుంబూండి |
| కొంఱ్ఱు | మండపొఱ్ఱు | కొండివాడ | రొంపిచెఱువుల | వడ్డంబూండి |
| నిడుంబఱ్ఱు | మ్రోంతుకూరు | గుద్రవాడి | మహాదేవిచెఱువుల | |
| మొనంబఱ్ఱు | కొంకలూరు | ద్రోణవాడి | ఇక్కసచెఱువుల | |
| దిగుంబఱ్ఱు | ప్రూనూరు | ఒడ్డవాడి | పోకనచెఱువుల | |
| కలుచువుంబఱ్ఱు | మల్లప్రోలు | నేరుకొలను | చెఱకుంబల్లి | |
| పొలకుంబఱ్ఱు | కొల్లిప్రోలు | మూంగొలను | పెసరుంబల్లి | |
| పసపుంబఱ్ఱు | చేంబ్రోలు | రాంగొలను | నారికేడంబల్లి | |

ఈ పై ప్రత్యయములలో పఱ్ఱు పఱియనుగను, కుఱ్ఱు కుఱియగను, దొఱ్ఱు దొఱియగను, కూడ వ్యవహరింపబడుట గలదు. ప్రోలన్న పట్టణము. వాడ, వాటి నివాస ప్రదేశము, వాటి వాడుకలో వాడియైనది. వాడిలోని 'డి' 'ది' గ నుచ్చరించుటయు, వ్రాయుటయు కూడ గలదు. అందువలన 'వాడి' 'వాది' యైనది. పూండి యన్నది శివారు గ్రామము. పూర్వము బ్రాహ్మణుల కగ్రహారదాన మిచ్చునపుడు గ్రామ గ్రాసముగా నొక చిన్న పల్లె నిచ్చుటకూడ యాచారము ; ఏలన, బ్రాహ్మణులు వ్యవసాయము చేయుట ధర్మశాస్త్రముల ననుసరించి కూడదు గనుక వ్యవసాయము చేయు రైతాంగ ముండుట కీగ్రామవాసము నిచ్చువారు. గ్రామగ్రాసపు పల్లెకే 'పూండి' యన్న నామము తొలుదొల్త చెల్లుచు వచ్చినది. కాని, కాల

క్రమమున దాని విశిష్టత పోయి సామాన్య గ్రామవాచకమైనది. గ్రామ గ్రాసపు బల్లెలు పదునాలుగవ శతాబ్దిని కూడ నుండె ననుటకు,

"మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ములికినాట"

అని క్రీడాభిరామమున,వినుకొండ వల్లభరాయడు.

పై గ్రామనామములను పరిశీలించినచో కను, పెను, మొన, నిడు దగ్గు, దిగు, పాము, కోము-వీనికి పఱ్ఱును, చెఱకు పెసరు, పసువులకు పల్లియును, పెను, వల్ల పదములకు పూండిని చేర్చిన పై రూపము లేర్పడిన వనుట స్పష్టమగును. వానికి సరియైన యిప్పటి రూపములు దిగువ నిచ్చు చున్నాను.

కనుం + పఱ్ఱు = కనుంబఱ్ఱు = కనుమఱ్ఱు.
పెనుం + పఱ్ఱు = పెనుంబఱ్ఱు = పెనుమఱ్ఱు.
మొనం + పఱ్ఱు = మొనంబఱ్ఱు = మొనమఱ్ఱు.
నిడుం + పఱ్ఱు = నిడుంబఱ్ఱు = నిడుమఱ్ఱు.
దగ్గుం + పఱ్ఱు = దగ్గుంబఱ్ఱు = దగ్గుమఱ్ఱు.
దిగుం + పఱ్ఱు = దిగుంబఱ్ఱు = దిగుమఱ్ఱు.
పాము + పఱ్ఱు = పాంబఱ్ఱు = పామఱ్ఱు.
కోము + పఱ్ఱు = కోంబఱ్ఱు = కోమఱ్ఱు.
చెఱకు + పల్లి = చెఱకుంబల్లి = చెఱకుమల్లి = చెఱకుమిల్లి.
పెసరు + పల్లి = పెసరుంబల్లి = పెసరుమల్లి = పెసరుమిల్లి,
పసపు + పరు-పసు + పర్రు = పసపుంబర్రు = పసుంబఱ్ఱు = పసుమఱ్ఱు.
కలుచువు + పఱ్ఱు = కలుచువుంబఱ్ఱు = కల్చుంబఱ్ఱు = కంచుమఱ్ఱు.

మన గ్రామనామములలోని కొలను, చెఱువుల పదము లిపుడు కొల్లు చెర్లలుగా మారినవి: కోరుకొలను = కోరుకొల్లు; మాంగొలను = మాంగొల్లు రాంగొలను = రంగొల్లు = రాగోలు; కలుచెఱువుల = కలుచెర్ల; రొంపి చెఱువుల = రొంపిచెర్ల; మహాదేవి చెఱువుల = మాచెర్ల; జక్కన చెఱు

వుల = జక్కంచెర్ల; పోకనచెఱువుల = పోకంచెర్ల,, ఇల్లేమల్ల + ప్రోలు = మల్లప్రోలు, మల్లపోలు; బిక్కి + ప్రోలు = బిక్కిప్రోలు = బిక్కవోలు = బిక్కవోలు; చేం + ప్రోలు = చేంబ్రోలు = చేబోలు. మావుండూరు మాముడూరు; మావిండిపల్లి మామిడిపల్లి అయినది. తామర + వాడ = తామరవాడ = తామరాడ; ద్రోడ + వాడి = ద్రోణవాది = ద్రోణాది; ఒడ్డ + వాది = ఒడ్డవాది = ఒడ్డాంది యైనది.

ఈ పై మార్పుల ననుసరించి మనము కొన్ని సూత్రములను గమనింప వచ్చును. ఆగమముగా వచ్చిన అనుస్వారమునకు పరమైన ళ్ళు, ల్లి, పూండులు ప్రాచీనాంధ్రమున బళ్ళు, బల్లి, బూండిగా వ్యవహరింపబడి నేడు మళ్ళు, మల్లి, మిల్లి, మూండి, మూడిగా మారినవని నిశ్చయింపవచ్చును. ఈ సూత్రము ననుసరించి అర్వాచీన రూపములకు ప్రాచీనరూపములును ప్రాచీనరూపాములకు అర్వాచీనరూపములును కనుగొనవచ్చును. ఇట్లే[2] ప్రాచీనాంధ్రమున అనుస్వార పూర్వక 'డి' వర్ణము నేడు 'ణి' – 'ని'గా మారినది. : ఉదా ! కాకాండి = కాకాణి = ని; కాకండివాడ – కాకణి వాడ–కాకణాడ–కాకనాడ: పండిదం = పణిదం; కొండికి = కొణికి.

అరియేడు, ఇడియూరు, ఎలియేరు–ఈ ప్రాచీనాంధ్రమునందలి రూపములు అర్వాచీనాంధ్రమున ఆరేడు, ఈడూరు, ఏలేరుగా మారినవి. ఈ యుదాహరణముల ననుసరించి ప్రాచీనాంధ్ర స్వరూపము కొంత గోచరింపగలదు.

**మనుష్యనామములు :**

ఇక మనుష్యులపేర్లు చూతము. దోచిశర్మ, అగ్గిశర్మ, కుండిశర్మ, నన్నిశర్మ, కాటిశర్మ మొదలగు ఇకారాంతపదము లన్నియు శర్మపదము వాడని సందర్భములందు దోచియ, అగ్గియ, కుండియ, నన్నియ, కాటియ అని యకారాంతములుగా వ్యవహరింపబడెను. 'ఇయ'తో అంతము లగున ఇట్టి పదములు దోచే, అగ్గె, కాటె, కుండె, నన్నె అను రూపాంతర ములను బొందుచు వచ్చినవి. ఇట్టి రూపములను పదవ, పదునొకండవ శతాబ్దినాటి శాసనములో ఎన్నిటినైన చూడవచ్చును. ఉదా : ప్రోల–

ప్రోలియ· కేతె-కేతియ; బాదె-బాదియ మొదలైనవి. 'ఇయ' కాల క్రమమున 'అయ'గా మారగా నేటి దోచయ, అగ్గయ, కుండయ, సన్నయ, కాటయ, రూపములు సిద్ధించినవి.

నన్నయకు పూర్వము కానవచ్చు శాసనములలో మనము ప్రధానముగ గమనింపవలసినవి మూడు పదములు కలవు. (1) భోజక; (2) రట్టకుడి; (3) గ్రామకుడి.

(1) భోజకు అనగా ఊరిపెద్దలు· గ్రామప్రముఖులు, చైల్డర్స్ పాలీ నిఘంటువునందు భోజకపదమునకు **Village Headman** అని యర్థము చెప్పబడినది. గ్రామభోజకులు రాజాధికారపురుషులలో ఒకరు. శాసనము లందు గ్రామభోజకులు పేర్కొనబడినారు భోజ, భోజకపదములు రెండును ఏకార్థప్రతిపాదకములు. భోజశబ్ద వికృతి బోయ. పూర్వము బ్రాహ్మణులు గ్రామభోజకులుగ నుండినట్లు శాసనములవలన మనకు దెలియగలదు. ఉదా : ముదుగొండబోయ దుగ్గశర్మ్మ; ఇట్లే చేటూరోబ్బయ· పొన్నభూరోబ్బయ· రాంపూరోబ్బయ; మొదలయినవి. బోయ, భోజకపదములు నేడు బ్రాహ్మణులకు చెల్లుట కానరాదు; కాని నేడు వ్యవహారమున నున్న బుగత, భుక్తపదములు భోజక శబ్దభవములు కాని తత్సంబంధులు యైయుండునని నాయుద్దేశ్యము, ప్రాచీనాంధ్రశాసనములలో కానవచ్చు 'బోండు' పదము 'బోయండు' అను దాని రూపాంతరము. ప్రథమ ఏకవచనరూపము బోండు, బోఁడు, బోఁడు; బహువచన రూపము బోలు. ఉదా ; 'బోలు నల్వురాయ తోఁఅ'. బోలు పదము గౌరవవాచకముగ ప్రయోగించుటయుకలదు. ఉదా ; 'బాదె బోల పన్నస'. 'బోని' యన్నది ద్వితీయ, షష్ఠి ఏకవచనరూపము. ఉదా ; 'మండెబోని చేను'.

(2) ఇప్పటి రెడ్డిపదమునకు ప్రాథమికరూపము రట్టకుడి. రట్టకుడి, రట్టోడి,రడ్డోడి,రద్దోడి,,రట్టడి,రడ్డి అని పరిణామమున రూపాంతరములను పొందితుదకిపుడు రెడ్డి యైనది. రాష్ట్ర-కూట యనునది రట్టకుడి పదము యొక్క సంస్కృతరూపము. అదికూడ రాష్ట్రోడ, రాష్ట్రొడ, రాఠోడ, రాథ యని రూపాంతరములను పొందినది. రట్టకడి, రాష్ట్ర కూటపదములు

పొందిన రూపాంతరముల నన్నిటిని మనము ప్రాచీనశాసనములలోను, తరువాత వాఙ్మయమునను జూడగలము.

(3) రట్టకుడివంటిదే గామకుడి, గామకుడి సంస్కృతమున గ్రామకూట మైనది. గ్రామప్రముఖు అని ఆ పదమున కర్థము. గామకుడి (గ్రామకూట) గామోడ గాముండ, గావుండ, గౌండ అయి నేడు గౌడు అయినది. ఉచ్చారణసౌకర్యము ననుసరించి పదము అనేక వికృతులను పొందుననుట కివి యుదాహరణములు. ఎన్ని రూపాంతరములను పొందినను ఒక పద్ధతికి, ఒక సూత్రమునకు కట్టువడియే అది మారుచుండు నన్న విషయము మనము గమనింపవలసి యుండును.

**ఇతర విశేషములు :**

తెలుగుమాటల కాదినుండియు సంస్కృత వర్ణక్రమపద్ధతియే యేర్పడి నదని యిదివరలో చెప్పియున్నాను. ఈ కారణమున నన్నయ కాలమునకు చాల పూర్వమునకు బోవునకొలది తెలుగుపదములలో అనుస్వారము కాన బడదు. అనుస్వారమునకు బదులు వర్గాంత్యనునాసికములే వాడుకయం దుండెను. కాలక్రమమున అనునాసికము లోపించగా దాని స్థానమున అనుస్వారము వచ్చినది. అర్ధానుస్వారమసలులేదు. దేశికవితను గాని మార్గ కవితను గాని సందర్భానుసారముగ అనుస్వారము నూది, తేల్చిపలుకువారు. ఊది పలికినది (సిద్ధము) పూర్ణానుస్వారమును, తేల్చిపలికినది (సాధ్యము) అర్ధానుస్వారముగను పరిణమించెను.

కడుప్రాచీన కాలమునకు బోవునకొలది తెలుగు పదములు పరుష బహుళములుగ నుండినట్లు కన్పట్టును. ఉదా: అకు--(అగును), కరుసు, కర్త.

కోను, తిను మొదలయిన తెలుగు పదములు ప్రాచీన కాలమున ణజంతములుగ గనబడును; ఉదా : ఫణి, కొణు.

తెలుగుపదములలోని క, చ, ట, త, ప లకు పూర్వము రేఫ సంశ్లేష మైన అది లోపించి, ప వర్ణము ద్విత్వముం జెందును. ఉదా ; వర్చు-వచ్చు: పెర్గడ-పెగ్గడ: ఉర్పుటూరు-ఉప్పుటూరు: అర్కు--అక్కు.

పదస్థరేఫము వ్యతిపాతవిధి నొంది ప్రథమాక్షర సంయోగము చెందుటయు కలదు. ఉదా : పఱకి-పర్కి-ప్రక్కి: పుఱోలు-ప్రోలు: పెర్గడ-ప్రెగ్గడ: పఱంతూరు-ప్రాంతూరు-పాతూరు.

పూర్వపు తెలుగు శాసనములను బరిశీలించినచో సముచ్చయ ప్రత్యయ మిప్పటివలె 'ను' గా గాక అరవమునందువలె 'ఉమ్'గ నుండినట్లు తెలియను గలదు. ఒడుకరయం దిది 'ఉము' గను, ప్రయుక్త మయినది. ఉదా ; వేగుఱ్ఱుము-వేసెఱువులును: 'మాఱ్పిడుగునుము చోఱియరట్ట గుడ్యాళునుము ఉత్తమాదిత్యరట్ట గుడ్యాళునుము'.

రాజులయొక్క యను నర్థమున పూర్వపు తెలుగున షష్ఠీవిభక్తి 'కు' ప్రత్యయము ప్రయుక్తమగుచు వచ్చినది. 'కు' ను పూర్వపు అచ్చుదీర్ఘ మగుటయు కలదు. ఉదా; జయసింహవల్లభ మహారాజులాను ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్" "శ్రీవిష్ణువర్ధన మహారాజులాకు ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్", "మహాజాధిరాజ పరమేశ్వర భటారళాకు విజయరాజ్యసంత్సరంబుళ్," "పోన్మఖరామపుణ్యకుమార ప్రిథివీవల్ల భచోఱ మహారాజులాకు ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్". ఇవి ఏకవచన రూపములు. ఈ బహువచనరూపము నిమనింప నగినది : "తోంటళాయు పడువారంబు" -(తోంటళు + అయు + పడువారంబు). "యొక్క" అను షష్ఠ్యర్థమున అరవమున "ఉడయ" వచ్చును. ఉదా: ఎన్నుడయ; అవనుడయ." ప్రాచీన కన్నడమున నిది "అయ" "అ"గా మారినది. ఉదా : 'ఎన్నయ' (నా యొక్క); 'ఎన్న' (నా). ప్రాచీన కన్నడమునందలి "అయ" ప్రత్యయమే "తోంటళాయు పడువారంబులోని "అయ"."అ", "అయ" ప్రత్యయములు రెంటిని ప్రాచీనాంధ్రమునజూడగలను. "అ" ప్రత్యయమున కుదాహరణములు ; మాటలు + అ + పొందిక = మాటల పొందిక (మాటలయొక్క పొందిక). ఇట్లే పదములకూర్పు. తమ్ములప్రేమ మొదలైనవి.

కడుప్రాచీనకాలమున షష్ఠీ విభక్తిప్రత్యయమయిన 'కు' పరంబగునపుడు అకారాంతపదముల మీది తుది యచ్చును, నగాగమము మీది తుది అకారమును దీర్ఘమగుచుండెను. ఉదా : "నిష్టసోముళాకు" "ఉబిలీశ్వర

భటారకునాకు" "చౌళియ రట్టగుడ్యాకు"; "విన్నశర్మనాకు"; "పెళ్ళియాని యనంబునాకు" "గంగరాజ్యంబునాకు", "సముద్రరంబునాకు "వసంతీశ్వ రంబునాకు" మొదలైనవి.

షష్ఠీవిభక్తి రూపమునందలి యీదీర్ఘములు కడుప్రాచీన శాసనములందు మాత్రమే కానవచ్చును. కాలము గడచినకొద్ది ఈ దీర్ఘములు హ్రస్వములై "రాజులకు", "గంగరాజ్యంబునకు", "ఉటిలీశ్వర భటారకకు" అను అర్వాచీన రూపములు ఏర్పడినవి. స్థూలదృష్టిని శాసన ప్రాచీనతను గుర్తించుట కీరూపములు కొంతవరకు తోడ్పడగలవు. దీర్ఘరూపములు ఆఱవ, ఏడవ శతాబ్దులనాటి శాసనములలో కనబడును. ఎనిమిదవ శతాబ్ది యీ రూపములకు మార్పుకాలము అందువలన నాటి శాసనములలో ఉభయ రూపములను గాంచగలము.

చతుర్థీ, షష్ఠీ విభక్తులు రెంటను 'కు' ప్రత్యయమే వచ్చును. ఇప్పటి తృతీయావిభక్తి ప్రత్యయము 'తోడ' ప్రాచీనరూపము 'తోఱ' ఉదా: "రాము విభుతోఱ" 'తోడు' "తోడిదే యూతోఱ". ఇది సహార్థమున [illegible] ప్రయుక్తమయి తుదకు తృతీయావిభక్తి ప్రత్యయముగా రూఢమయినది. చూడు డీ యుదాహరణము "నల్మిణరాయునతోఱ:" (నల్మిణ+రాయు+తోఱ).

ఇక ద్వితీయా విభక్తిరూపమయిన 'దీని' గురించి కొంత చెప్పవలసి యున్నది. నన్నయకాలమునుండి ఒకట్రెండు శతాబ్దులు వెనుకకు పూర్వపు తెలుగు శాసనములను పరిశీలించుచు పోగా 'దీని' రూపమునకు మార్పులు కనబడును. 'దీని' అన్నది కొంత పూర్వమునకు బోయినయెడల 'దేని' గాను, ఇంకను పూర్వమునకు బోయిన 'తేని' గాను పరిణమించును. ఇట్లగుట, 'దీని' ప్రాచీన ప్రాథమిక రూపము 'తేని'. ఈ యుదాహరణములు చూడుడు: 'దీని చెఱిచ్చినవారు'; దీని రక్షిచ్చినవారు'; 'దీని అచ్చినవాని'; 'దీనికి వక్రంబు వచ్చినవారు'; 'దీనికి అడ్డమయిన వారు'; 'దేనిం గాచినవారు'; 'దేనికి సక్కి' (దేనికి సాక్షి); 'దేనికి వక్రంబు వచ్చువాన్డు'; దేని నిల్పిన వానికి: దేనిఅచ్చువాన్డు'; తేనిఅచ్చినవారికి; 'తేనిఅచ్చినవాన్డు' ;'తేని అచ్చు వారు'.

స్థూలదృష్టిని ఈరూపముల యునికిని బట్టికూడ మనము తెలుగు శాసనముల ప్రాచీనతను గుర్తింప వచ్చును. నేను చూచినంత వఱకు, నాకు తెలిసినంత వఱకు క్రీస్తుశకము ఏడవశతాబ్దికి పూర్వమే శాసనములలో 'తేని' దొరకును.

తొలుదొలుత తెలుగు పదములు సాధారణముగ పరుషాన్వితములుగ నుండెననుట కిది యొక దృష్టాంతము. ఇట్లే నేటి 'గరుసు'- ఏకభోగంబు గాగ నేలేరు గరుసు కడలిసీమయు గౌతమీ గంగమేర'-ఈ 'గరుసు' ప్రాచీన కాలమున 'కరుసే.' ఉదా : 'పులకరుసు'.

'దీని' ప్రాచీనరూప మయిన 'దేని' ('దేన్') అన్నది 'దే + ని' (దే + న్) అనుధాని సమాహారము. మన 'దేన్' రూపము ప్రాచీన కన్నడ శాసనములను జూచిన నిది తేటపడగలదు. ఉదా : 'ఇదాన్ అఱివోన్'' : ''ఇదా నఱివోన్'' : ''ఇదా'', ''దేన్'' అనురూపములలోని ''ఆ'' ''ఏ'' ల భేదము కన్నడులకు మనకు ప్రాచీనకాలము నుండియు సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్నదే. ఈ విషయము అరవము, కన్నడను, తెలుగు భాషలయందలి సర్వనామములను పరిశోధించి స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు ఇదివరకు నిరూపించియేయున్నారు. (చూడుడు : లక్ష్మణరాయ వ్యాసావళి ; ద్రావిడ భాషల యందలి సర్వనామములు) పోలికకు 'నేను' విభక్తులు చూడుడు :

| తెలుగు | అరవము | ప్రాచీన కన్నడము |
|---|---|---|
| నేను; ఏను | యాన్ | ఆన్ |
| నన్ను | ఎన్నై | ఎన్నం |
| నాకు | ఎన్నుడయ | ఎన్న,ఎన్నయ |
| నాకై | ఎనక్కు | ఎనగె |

ఈ యుదాహరణములను బట్టి 'ఆన్' 'ఏన్ సంప్రదాయము' లన్న దాని లోని యర్థము గ్రహింపవచ్చును. ప్రథమావిభక్తియందు తెలుగు వారికి 'ఏన్' 'నేన్' రూపములు రాగా కన్నడులకు, అరవలకు 'ఆన్'. 'యాన్' రూపములు వచ్చినవి. కన్నడులు 'ఆన్' సంప్రదాయమువారు.

ఈ సంప్రదాయమే 'దీని' తెలుగు, కన్నడ ప్రాచీనరూపములందు పొడకట్టు చున్నది. పూర్వపు తెలుగు శాసనములందు 'తేని' దొరకినట్లే ప్రాచీన కన్నడ శాసనముల యందు 'ఇతాఱ' రూపము కనబడవచ్చును.

'తేని'లోని 'త' యును అతను, ఇతను ఎతనులలోని 'త' యును ఏకైక శబ్దములు. అతను, ఇతను, ఎతను, అతడు, ఇతడు, ఎతడు, అది ఇది, ఎది రూపములలో 'తను', 'తడు' 'ది'లు సామాన్యములు, కాగా, అ, ఇ, ఎ లు విశిష్టములైనవి, ఇవి నిర్దేశక ప్రత్యయములు; వస్తువు ఫలానది అని నిరూపించి చూపునవి. అతను, ఇతను, ఎతను రూపముల పరిచ్ఛేద మిది; అ+త+ను; ఇ+త+ను; ఎ+త+ను. ఇట్లే అ+త+డు; ఇ+త+డు; ఎ+త+డు. అది, ఇది, ఎదిలలోని 'ది' కిని, 'త'కును పైకి పోలిక లేనట్టు కనిపించుచున్నను ఉన్నదను విషయము 'తేని' రూపమే స్పష్టపరుచుచున్నది. 'ఇది' యొక్క ద్వితీయరూపము 'దీని', 'దీని' ప్రాథమికరూపము 'తేని'. ఈ రూపమెట్లు కలిగినది ఇక చెప్పవలసి యున్నది.

అది, ఇది, ఎది అను వాని విభక్తి రూపము గూర్చినచో ద్వితీయా రూపము లకు మిగిలిన విభక్తి ప్రత్యయములు చేర్చిన యెడల మిగిలిన విభక్తి రూపము లేర్పడుచున్న వని తెలియగలదు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | అది | ఇది | ఎది |
| ద్వి | దాని | దీని | దేని |
| తృ. | దానిచే | దీనిచే | దేనిచే |
| చ;ష. | దానికి | దీనికి | దేనికి |
| పం. | దానివలన | దీనివలన | దేనివలన |
| స. | దానియందు | దీనియందు | దేనియందు |

'ఇది' ద్వితీయారూపము 'దేని' గ నుండినట్లు శాసనముల వలన దెలియ వచ్చుటచేత మనము 'దాని' 'దేని' రూపనిష్పత్తిని గురించియే యరయ వలసి యుండును. 'దేని' ప్రాచీనరూపము 'తేని' యని శాసన ప్రమాణ ముండుటచేత 'దాని' ప్రాచీనరూపము 'తాని' యై యుండవలెను.

ఇది కూడ ఎప్పుడో ఎక్కడో దొరకవచ్చునేమో. నిర్దేశార్థక ప్రత్యయము లయిన అ, ఇ, ఎ లు తాని, తేనిలో కూడ నుండియుండవలెను - అవి లేని యెడల వస్తునిర్దేశము కాదు గనుక.

'తాని' 'తేని'లలోని 'ని' ద్వితీయావిభక్తి ప్రత్యయము. ఇది పోగా మిగిలినది 'తా' 'తే' లు. అతడు, ఇతడు, ఎతడు, అతను, ఇతను, ఎతనుల లోని ప్రధానశబ్దము 'త' యని ఇదివరకు తెలిపినాను. అదియే యీ రూపము లందును ప్రధానమైనది. చూడుడు : త + అ = తా (జలజ + అక్షి = జలజాక్షివలె) ; త + ఇ = తే (తరుణ + ఇందు = తరుణేందువలె). అందువలన ద్వితీయా విభక్తిరూపము లివి : త + అ + న్ = తాన్—తాని; త + ఇ + న్ = తేన్-తేని. ఇది 'తేని' రూప నిష్పత్తి. 'తేని' ని గురించి శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి సంపుటమున వ్రాసినది అవిచారమూలకము.

పూర్వము తెలుగు శాసనముల యందలి సమాసపద్ధతి ఈ క్రింది యుదాహరణముల ననుసరించి చక్కగ తెలియగలదు. ఉదా : 'ఈందని చెఱువు'; 'వేల్పుజేని తూర్పున పన్నస'; 'కోఱబోయు తటాకము', కల్పుకురి ఎవోక్కచేనిసీమ; 'నొఱంబితోటి కయ్యాలు'; 'ఉత్తను గుండని యిచ్చిన'; పుల్గొట్టునగాణంబు; 'అశ్వమేథంబున ఫలంబు' తూర్పున దిశ'; 'తూడ్పునకోటి'; నిట్టనోముళపడసిన'; 'రాచమానంబున'; పోర్ముఖరామ'. మండ యూరి పొలగరుసున యిసుకకట్టల చెఱువు నడిమిదూబ-(ఇసుకకట్ట)

వాక్యరచన :

ప్రాచీనాంధ్ర శాసనములను జూచినచో పూర్వపు తెలుగున వాక్య నిర్మాణమున కొన్ని వింత తీరులు కనబడును. నేటి వాక్య నిర్మాణ పద్ధతికి భిన్నముగ గమనించు నుదాహరణములు కొన్నిటిని శాసనములనుండి గ్రహించి యీ దిగువ నిచ్చుచున్నాను.

(1) "దుజయ రాజుల ముతురాజులు నవప్రియ ముత్తురాజులు వల్లవ దుకరజులు పాఱికను ఇచ్చిన పన్నస కొట్టంబున పాఱక కుణ్డికాడ్లు ణో ఇచ్చిన పన్నస ఇరువదియాడి నాల్కు మఱుత్తుఱు నేల".

దుకరజు. సాతికను, నాల్కురూపములు గమనింపదగినవి. ఆడి ధాన్య విశేషము. అళ్ళు బహువచన రూపము. మఱుత్తు అన్నది ఎకరముల వంటి మాన విశేషము. 'ఇరువది'కి 'నాల్కుకు' నడుమ 'ఆడి' వచ్చినది. ఇప్పుడు మన మిట్లనము.

(2) "పుణకాలు ఇచ్చిన పన్నస ద్దపెన్పాతి ఇశెఱేనికిన్".

(3) తిరువుల కయ్యంబునం బొడిచిపడియె బొజ్జుకళు."

(4) "కుఱ్ఱమడు వేళువాన్ఱు గగుల్ల కాడమ్మ శ్రీమెట్టి సోరమడిని కయ్యంబునం బొడిచిపడియె విన్ఱి నాయకున్ఱు."

(5) "ఎరిగల్ల దుగరాజుల్ ఇచ్చిన పన్నస కొచ్చియ పాఱఁేవ సర్మారికిఁ."

## ప్రాకృత రూపములు :

పూర్వము తెలుగు పదములలో ప్రాకృత సంప్రదాయము ఎక్కువగ గనబడును. చూడుడు : సక్కిబడర గద్దె; గద్దెన ఆణతి గోయిద బోయ కొట్టంబులు దమ్మువులు బెజెయిత్త బెజెయరాజు బెజెయేశ్వరంబు చంద్రాయిత్తకాలము పరి యారువు కంద (స్కంద) అగరను (అగ్రహారము);

పహిండి (పసిడి)-పయిండి-పైడి.

[నాహిండు-నాయిండు-నాఇండు-నేడు]

## కొన్ని వర్ణపద విశేషములు :

ప్రాచీనాంధ్రమున వింతవర్ణములు రెండుకలవు. అందొకటి అడ్డుగీటు లేని బండిఱను పోలిన (ఱ) వర్ణము. దీనిని 'ఴ' యందురు. ఇది ప్రాచీనాంధ్రముననే కలదు. నన్నయ తరువాతి కాలమున ఱ. ల, డ, హ, ష గ మారి, మనభాషలో లోపించి పోయినది. ఈ వర్ణముతో గూడిన పదము లనేకములు కలవు. ఉదా : పొగఱు; పఱుమటి; అఱిసిన; ఏఱువేలు; లేఱ్ఱికోలు; కొఱొచ్చు; తోఱ; పుఱొలి: కొఱబ్బు॥

వీనిలో 'కొఱొచ్చు' పదము రూపాంతరము 'క్ఱొచు'. ఈ పదము నందలి 'ఱ' వర్ణము తరువాత 'ఱ'గ మారినది. అప్పుడివి 'కొఱొచు' 'క్ఱొచ్చు'-కొఱొచ్చు', 'క్రొచు' అగును. దీర్ఘము హ్రస్వము కాగ, 'క్రొచ్చు' 'గ్రొచ్చు' అయినది,

"గ్రొచ్చి కోరాడి త్రవ్వి రి కుతలమెల్ల"—భాగవతము.

'క్రొచ్చు', 'గ్రొచ్చు'ల ప్రేరణరూపము 'క్రొప్పించు', 'గ్రొప్పించు'.

"పెంచెం జుట్టల నెల్లఁ బేర్మి వెలయం బెట్టించె సత్రంబు గ
ట్టించెం భక్తి శివాలయంబు లిలఁ బ్రౌఢిం దాల్చి యొప్పంగఁ గ్రొ
ప్పించెం బూర్ణతటాకముల్ ........................................"

రెండవ వింత వర్ణము 'వాన్ఱు' లోని 'ఱ' కాదు. నాలుక మడత వేసి పలికినప్పటి 'ఱ' రూపము. ఇది సగము 'ట' గను, సగము 'ఱ' గను పలుకును. ఇది ప్రాచీనాంధ్ర శాసనములలో 'వాన్ఱు', మగన్ఱు', మూన్ఱు, న్ఱివి నాయికున్ఱు అను పదాదులలో గనబడును. ఈ 'న్ఱు' చివరికి 'ండు'గా మారిన దందురు, 'వాన్ఱు అను దాని కిప్పుడు 'వాడు', 'మూన్ఱు' అను దానికి 'మూడు' అని ఈ విధమున ఆ పదముల పరిణామమును దెలిసికొన వచ్చును. ఈ వింత వర్ణము 'ఈఱు' అను దానిలో కూడ గనబడును. 'ఈఱు' అన్నది 'ఈఱు' రూపాంతరమని నేను భావించుచున్నాను. 'ఱు' బహువచన ప్రత్యయము. 'పాఱ' లోని 'ఱ' యును బహువచన ప్రత్యయమే అందురు. 'పాఱ' అనగా బ్రాహ్మణులు : దీని ఏకవచనము 'పాడు'-చూడు డీ యుదాహరణము :

"దేని నిల్పినవానికి వేగుఱ్ఱుము వేసెఱువుళు వేవాన్ఱూఱ్ఱు నిల్పిన పుణ్యంబు."

'వే' యన వేయి. 'వేవాన్ఱూఱ్ఱు' = వేయి పాండూడ్ఱు-వేయి పాండూళ్ళు-వేయిపాఁడూళ్ళు అనగా వేయి బ్రాహ్మణాగ్రహారములు. పాఁడు అనగా బ్రాహ్మణాగ్రహారమని ప్రప్రథమమున గుర్తించినవారు, 'వేవాన్ఱూఱ్ఱు' అనగా వేయి బ్రాహ్మణాగ్రహారములని చెప్పినవారు పూజ్య

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. ‘పాఱ’ వంటిదే ‘చూపఱ’-చూపఱ యన చూచువారు అని యర్థము.

‘ఇఴ్ల’ అను దానిలో కూడ నీ వర్ణము వచ్చును.. ‘ఇట్ల’ అగునేమో యని నేనూహించుచున్నాను. ‘ఇఴ్ల కాను ఎవెఴుఙ్గువారు’ ‘ఇఴ్ల కా వెఴుగు వారు’ అను వాక్యము కడు ప్రాచీన శాసనములు కొన్నిట గానవచ్చును. ఇది యానాటి నుడికారపు పొందికయేమో. ‘ఇట్లనియే యెఱుగు వారు’ అని దాని యర్థమైయుండునని నా యూహ.

## పూర్వపు తెలుగు :

నాకింత వఱకు లభించిన మొట్టమొదటి సంపూర్ణాంధ్రభాషా శాసనము అఱవ శతాబ్దినాటిది. దీనిని నే నిదివరలో స్వర్గీయ గిడుగు వేంకటరామ మూర్తి పంతులుగారి ‘కమ్మెమొరేషన్’ సంపుటములో ప్రకటించినాను. దానిని మరల ఈ క్రింద నిచ్చుచున్నాను.

“స్వస్తి [।*] శ్రీ సోఱ మహారాజు ల్లోకనఇస్సెఱోలి అణపోతుల రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్నాఴు ఇశేఱనికిఁ [।*] దీని ఱిచ్చినవాన్డు పఞ్చమహా పాతకున్డు కుఁ [॥*]”.

## మఱియొక శాసనము

“మణయ శమ్మఁణ గణయ శమ్మఁణ వృద్ధ శమ్మఁణ ఇమువ్వుర ఒకాడు బోళ చేత శవణ గొణిరి [॥*] ఇఴ్ల కా వెఴుగువారు [॥*] సమతిబోళుసు విసబోళుము పట్టిముకున రట్టొఴ్లు పుణ్యసాఴ్లు వన్టిబోళుము ఇన్దాఴు దినికి సటి [॥*] అఴుగరాలన్వారు విషయబోళ కొణిరి [॥*].

క్రింది గీటు మీది యక్షరములలోని ‘ఴ’ వింత యక్షరముగ చెప్పబడిన ‘ఴ’. ఇది తరువాతి కాలమున ‘డ’ గ మారినది.

**ముగింపు :**

నన్నయకు పూర్వము తెలుగు ఎట్లుండెడిది అను విషయమును దెలిసి కొనుటకు ఈ వ్యాసము ఒక దిఙ్మాత్ర సూచన. నన్నయకు పూర్వపు తెలుగు శాసనములను మననముచేసి మథించి తీయవలసిన అమూల్య రత్నాదికము లెన్నో యున్నవి. ఇప్పటికి ప్రకటితములయిన నన్నయకు పూర్వపు తెలుగు శాసనములు చాలకొద్ది. రాయలసీమలోను, నెల్లూరు మండలములోను, పర్యటనము చేసి సేకరింపవలసినవి చాల కలవు. ఈ శాసనము లన్నిటిని అవలోడనము చేసి, చక్కగ పరిశోధన దృష్టితో చదివి మననము చేసినచో నన్నయకు పూర్వము తెలుగు స్వరూపమును బాగుగ తెలిసికొనుటకవకాశము కలుగునని నా విశ్వాసము. అంత సమగ్రమైనది కాకపోయినను ఆ భాష కొక వ్యాకరణము వ్రాయుటకును వీలగునని నా యభిప్రాయము.

—ఆంధ్ర పత్రిక

వృషసంవత్సరాది సంచిక (1941)

# మార్గదేశీ కవిత్వములు

—డాక్టరు దివాకర్ల వేంకటావధాని

సంగీతశాస్త్రమందు సంగీతము మార్గము దేశి యని యిరు తెఱఁగులుగా విభజింపఁబడి యున్నది. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమున బ్రహ్మాదులచేఁ మార్గిత మై యీశ్వర సమక్షమున భరతాదులచేఁ బ్రయోగింపఁబడినది మార్గ మనియు' నాయా దేశములందు జనుల హృదయరంజక మగునది దేశి యనియుఁ జెప్పఁబడినది. అంతే శార్ఙ్గదేవుఁడు—

"యేషాం శ్రుతిస్వర గ్రామ జాత్యాది నియమో న హి
నానా దేశగతి చ్ఛాయా దేశీరాగా స్తు తే మతాః
కామచార ప్రవర్తిత్వం దేశీరాగస్య లక్షణం
నియమే తు సతి తత్ర మార్గత్వ మనులక్షితమ్."

అని మార్గ దేశీరాగముల భేదమును వివరించియున్నాఁడు. దీనినిబట్టి నియమరహిత మైన కామాచార ప్రవర్తిత్వమును దశానుగుణ ప్రవృత్తియు దేశీరాగములకును, నియమసాహిత్యమును సర్వదేశ సమాన రూపశాలిత్వ మును మార్గరాగములకును లక్షణమని తెలియుచున్నది. సంగీత సుధాకరము, సంగీత దర్పణము, స్వరమేళకళానిధి మున్నగు నితర సంగీత శాస్త్ర గ్రంథములుకూడ లోకజన రంజనమును దేశికిఁ బ్రధానలక్షణముగా నిరూపించియున్నవి. పండితులైనవారు దేశిసంగీతమునువలె నియమ సహిత మును శాస్త్రబద్ధము నైన మార్గసంగీతమునుగూడ నాస్వాదించి యానందింపఁ జాలుటయు, సామాన్యజను లట్లుకాక హృదయరంజక మైన దేశిసంగీతమును వలె బుద్ధిరంజక మైన మార్గసంగీతము నాస్వాదింపఁజాలమియు నవియుట్లు చెప్పుటకుఁ గారణము.

శార్ఙ్గదేవుఁడు సంగీత రత్నాకరమందలి ప్రబంధాధ్యాయమున మార్గమునకు గాంధర్వ మనియు దేశికి గాన మనియు నామాంతరములు సూచించెను. గాంధర్వము (మార్గము) లక్షణానురోధముగాఁ బ్రయోగింపఁ బడును. దేశి లక్ష్యప్రధానమైనది. దేశీపద్ధతిలో లక్షణములకు వైరుధ్యము సంభవించుచో లక్ష్యమును బట్టియే లక్షణమును సవరించుకొనవలెను. స్వర యుక్తముగా వేదములను గానము చేయు విధానము మార్గపద్ధతికిఁ జెందినది. భారతరామాయణములు వేదప్రాయము లగుటచే వానిని జదువునప్పుడును మార్గవిధానమే యనుసరింపబడినట్లు తోఁచుచున్నది. వాల్మీకి యుత్తర కాండమున కుశలవులు రామవచః ప్రేరితులై రామాయణమును మార్గ విధానమునఁ బాడి రని వ్రాసియుండెను.

దశరూపక కర్త ప్రసంగవశమున నృత్యనృత్తములనుగూడ నిర్వచించుచు నృత్యము భావాశ్రయ మైనదనియు నృత్తము తాళలయాశ్రయ మైనదనియు నుడివి యందాద్యము (నృత్యము) పదార్థాభినయమై మార్గ మనఁబడు ననియు. రెండవది దేశి యనఁబడు ననియు వివరించెను.

Prof. హూస్ మార్గమును Higher Style అనియు, దేశిని Lower Style అనియుఁ బరివర్తనము చేసియున్నాడు. దీనినిబట్టి మార్గదేశి లక్షణములకు సంగీతమునఁగల వ్యత్యాసమే నృత్యవిషయమునఁ గూడఁ గన్పట్టుచున్నదని చెప్పవచ్చును. ఈ భేదమును బురస్కరించుకొనియే కవితా వాఙ్మయములందుఁ గూడ మార్గదేశీవిధానములకుఁ గల భేదము పరిశీలింపవలయును.

సంగీతమున మార్గ దేశీవిధానములకుఁ గల విభేదమును భాషా విషయమున సమన్వయించి చూడ సంస్కృతము మార్గవిధానమునకును ఆంధ్ర తమిళకర్ణాటాదులు దేశీవిధానమునకును జెందునని స్ఫురించును. సంస్కృతము దేవభాష. దానికి స్థిరమైన నియమములు కలవు, అది వేద కాలమునుండియు ననాదిసంప్రదాయమై వచ్చుచున్నది. అది పండితజనైకవేద్యము. ఆంధ్ర కర్ణాటాదిభాషలందు క్రీస్తుశకారంభమునకుఁ దరువాతనే జెప్పఁదగిన వాఙ్మయ మువ్పతిల్లినది. వానికిని వ్యాకరణాది నియమము లున్నను అవి

జీవద్భాష లగుటచే నా నియమములు స్థిరము లైనట్టివి కావు. సామాన్య జనులుగూడ వానిని జదివి యర్థము చేసికొనఁజాలుదురు.

భాషయొక్కటే కవిత్వము కాదు. దానికి భాష, భావములు రసము, ఛందస్సు, రీతి వస్తువు మున్నగునవి ప్రధానములైన యంశములు. పండితులయిన వారు వీని లక్షణము లన్నియు నెఱింగి తల్లక్షణానుగుణము గనే కవిత్వము వెలయించుచుందురు. పాండిత్యము లేనివారు కూడ వివిధసన్నివేశములందు భావోద్రేకము కలిగినప్పుడు కవితాసృష్టికిఁ గడంగు చుందురు. వారు లక్షణజ్ఞానము లేనివారగుటచే వారి కవిత్వమునఁ గవిత్వాంగములకు సంబంధించిన నియమములు పూర్తిగాఁ గానఁబడక పోవుటయు, నది సంప్రదాయ భిన్నములైన నవ్యతా లక్షణములతో భాసిల్లు చుండుటయు సంభవించును. ఈ రెండు రకములైన కవిత్వములలో బండితులచే లక్షణానుగుణముగా వెలయింపఁబడినదానిని మార్గకవిత్వ మనియు లక్షణములతో సంబంధము లేకుండఁ దమహృదయరుచి ననుసరించి సామాన్యజను లచే వెలయింపఁబడుదానిని దేశికవిత్వ మనియుఁ జెప్పవచ్చును. సలక్షణమైన భాష, ఉదాత్తములైన వస్తు భావములు, సంప్రదాయ సిద్ధమైన ఛందస్సు, లక్షణానుగుణమైన రసపోషణము మార్గకవిత్వమునకు లక్షణములు. దేశి భాషాభావరస చ్ఛందో వస్తువుల విషయమున స్థిరమైన నియమములు లేక కవుల యభిరుచులను బట్టియు, దేశకాలములను బట్టియు భిన్న భిన్న విధములుగా గోచరించును. కవిత్వమునందలి మార్గదేశీవిధానముల నిర్ణయించుట కొక్క భాషనే కాక యితర కవిత్వాంగములను గూడ దృష్టియం దిడుకొనవలయును.

తెలుఁగున మార్గదేశీపదములను గవిత్వపరముగా వాడిన మొదటి కవి నన్నెచోడుఁడు. అతఁడు కావ్యారంభమునఁ దొలుత నిష్టదేవతా స్తుతియుఁ బిమ్మట గురు ప్రశంసయుఁ గావించి తరువాత వాల్మీకి వేద వ్యాస కాళిదాస భారవ్యుద్భట బాణులను స్తుతించెను. వీరందఱును సంస్కృతమునఁ గవిత్వము చెప్పినవారే. తరువాత నాతఁడు—

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం

గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్."

అను మార్గదేశకవితా ప్రసక్తితోఁ గూడిన పద్యమును వ్రాసెను తదనంతర మతఁడు "సురవరులం గ్రమంబున" అను పద్యమునఁ దాను గావ్యారంభమునఁ గావించిన స్తుతిక్రమమును సింహావలోకనము చేసి యున్నాఁడు. వాల్మీకి వ్యాసులను బురాణకవులుగను, గాళిదాసాదులను మార్గకవులుగను బరిగణించి వీరేశలింగం పంతులుగారు దేశికవులం బేర్కొని నన్నెచోడుఁడు స్తుతించియుండు పద్య మొకటి పై పద్యము తరువాత లేఖక ప్రమాదమున విడిచివేయఁబడి యుండునని భావించిరి. ఈ యూహ యెంతవఱకు నిజమో మనము చెప్పఁజాలము. ఉన్నపద్యములను బట్టియే మన మొక నిర్ణయమునకు రావలయును. స్తుతిసింహావలోకన మొనరించిన పిదప నన్నెచోడుఁ డొక పద్యములో విబుధవర్గమును దలపోసి యనంతరము కుకవివరాకులఁ బరిహరించుచు

"మార్గ కుమార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తులనఁ దగు
మార్గవులఁ దలఁప నలఁతి మహి సుకవులకున్."

అను పద్యము వ్రాసెను.

నన్నెచోడుని మును 'మార్గకవిత' యను పద్యమున కర్థము చెప్పిన వారు మొదటఁ గేవలము భాషను మాత్రమే దృష్టియం దిడుకొని మార్గ దేశీ కవిత్వములను నిర్ణయము చేసినట్లు కానఁబడును. దాని ప్రకారము సంస్కృత కవిత్వము మార్గ కవిత్వముగను దేశభాషా కవిత్వము-సంస్కృత పదభూయిష్ఠమైనను గాకపోయినను-దేశికవిత్వముగను బరిగణింపఁబడినది. అప్పుడు పురాణకవు లనఁగా వాల్మీకి వ్యాసు లనియు, మార్గకవు లనఁగాఁ గాళిదాసాదు లనియు, దేశికవులనఁగాఁ దెలుఁగునఁ గవిత్వము చెప్పినవా రనియు వారిని నన్నెచోడుఁడు స్తుతించె ననియుఁ జెప్ప వలయును. అతఁడు

శుకవివరాదులను బరిహరించుచు మార్గవులను సుకవులుగాఁ బరిగణించి యుండెను. ఈ మార్గవులను మార్గకవు లని భావించుట యుచితముగాదు. అట్లు భావించినచో నన్నెచోడుఁ డిందు మార్గకవులను దుర్మార్గపదవర్తులని నిందించుటకును గవిస్తుతిలో వాల్మీకి వ్యాస కాళిదాసాదులను, మార్గ కవులను స్తుతించుటకును బొత్తు కుదురనేరదు. అదిగాక నన్నెచోడుఁడు కాని మఱియెవ్వరు కాని సంస్కృత కవులను నిందింతు రనుట భావ్యముు కాదు.

సంస్కృత కవిత్వమే మార్గకవిత్వ మని భావించినచో నన్నెచోడుని కవి స్తుతియందుఁ గొంత వైరుధ్యము గోచరించు చున్నది. అతఁడందుఁ బురాణకవులను మార్గకవులను వేఱువేఱుగాఁ బేర్కొని యున్నాఁడు. అతని దృష్టిలో వాల్మీకి వ్యాసులు పురాణకవులు. కాళిదాసాదులు మార్గ కవులు. రచించిన కావ్యముల స్వరూపములో భేద మున్నను నిజమునకు వారందఱునుమార్గకవులే. కాళిదాసాదులే మార్గ కవులై వ్యాసాదు లట్టివారు కారనుట కవకాశము లేదు. సురవరు లను పద్యమున వాల్మీకి వ్యాసు లిరువురికిని పురాణకవిసంఘ మని సంఘశబ్దము నుపయోగింపవలసిన యక్కఱ లేదు. సంస్కృత కవిత్వమే మార్గకవిత్వమని యాతఁడు దలంచినప్పు డాసంస్కృత కవులనే పురాణకవులని మార్గకవు లని వేఱు వేఱుగాఁ జెప్పుటకుఁ గారణము కనఁబడదు. అందుచే నాతఁడు పురాణకవి సంఘమను పదముచే సంస్కృత కవులందఱిని బేర్కొని మార్గసత్కవీశ్వరు లనుపదముచేఁ దద్భిన్నులైన కవులను సూచించె నని తలంచుట యుక్తముగా నుండును.

నన్నెచోడుఁడు మార్గకవిత్వ మని పేర్కొన్న కవిత్వ మేది ? అది యేదైనను మున్ను లోకమున వెలసె నని యాతఁడు చెప్పుచున్నాఁడు. లోకము, దేశ విషయములకంటె విస్తృతతరమైనది. ఈ శబ్దమును వాడుటలో మార్గకవిత్వ మొక్క యాంధ్రవిషయమునసే కాక ఇతర దేశములందుఁ గూడ వ్యాపించియుండెనని యూహించినట్లు తోచుచున్నది, ఈ యితర దేశములలో నాంధ్ర దేశమునకుఁ బొరుగులనున్న తమిళ కర్ణాటక దేశములు ముఖ్యములైనవి, నన్నెచోడునకుఁ దమిళ కర్ణాటకములతోడను దద్దేశా

చారములతోడను గూడఁ బరిచయ మున్నట్లు కుమార సంభవము సాక్ష్య మిచ్చుచున్నది. అతఁడు కన్నడమునఁ బంపాదులు రచించిన కావ్యముల నాదరముతోఁ జదివియుండును. మార్గ దేశి కవితా సంప్రదాయముల నాతఁడు కన్నడము నుండి గ్రహించినట్టివే పంపాదులకు బూర్వము కూడఁ గన్నడమున గద్యపద్యాత్మకములైన కావ్యములు పెక్కు రచింపఁబడినట్లు నృపతుంగుని కవిరాజ మార్గము వలనఁ దెలియుచున్నది. భాషాచ్ఛందములను బురస్కరించుకొని యందలి రచన మార్గపద్ధతికిఁ జెందినదని చెప్పనగును. దీనినిబట్టి క్రీ.శ. 700 కుఁ బూర్వము నుండియుఁ గన్నడమున మార్గకవిత ప్రచారమునందుండెనని తలంప వచ్చును.

క్రీ.శ. 10వ శతాబ్దికిఁ బూర్వము దేశమున దేశభాషల కంత గౌరవము లేదు. సంస్కృత పాండిత్యమే పాండిత్యముగాఁ బరిగణింపఁబడు చుండెను. పండితులు శాస్త్రవాదము లొనరించునప్పుడును దమలోఁ దాము మాటాడు కొనునప్పుడును సంస్కృత భాషనే యుపయోగించు చుండినను సంస్కృత భాషానభిజ్ఞులైన సామాన్యజనులతో మాటాడవలసి వచ్చినప్పుడు దేశభాష లోనే మాటాడవలసి యుండును. వారట్లు మాటాడునప్పుడందుఁ బెక్కు సంస్కృత పదములు కూడఁ బ్రవేశించుచుండుట కవకాశమున్నది. కొందఱు సంస్కృత పదములకు దేశభాషా విభక్తులను జేర్చి తత్సమ శబ్దములను వాడుచుండిరి. సంస్కృత భాషయం దత్యాదరము గల పండితుల కీతత్సమీ కరణము రుచింపక పోవుటలో వింతలేదు. సంస్కృత పదములకు దేశభాషా విభక్తులను జేర్చు పద్ధతి వారి కంగీకారము కాకపోవుటచే వారు సంస్కృత పదములను సంస్కృత విభక్త్యంతములుగాను దేశభాషాపదములను దేశీయ విభక్త్యంతములుగాను బ్రయోగించుటయే యుక్త మని తలంచియుండురు. ఈ పద్ధతికే మణిప్రవాళ మని పేరు. అప్పటి పండితులలోఁ గొంద ఱిట్టి భాషలోఁ గూడఁ గవిత చెప్పియుందురు. ఆ పద్ధతి యుండుటచేతనే పాల్కురికి సోమనాథుఁడు తన వృషాధిప శతకమునఁ బలుభాషలలోఁ బద్యములు వ్రాయుచు మణిప్రవాళమునఁ గూడ నొక పద్యము వ్రాసియుండెను. ఈ మణిప్రవాళ సంప్రదాయ మాంధ్రకర్ణాటకములలోఁ గ్రమముగా నంతరించి పోయినను మళయాళమున మాత్రము నిల్చి యున్నది. నృపతుంగుఁడు కవి రాజమార్గమున సమ సంస్కృతమునే దేశభాషలలోఁ గలుపవలెను గాని కేవల

సంస్కృత పదములను గలుపరా దని నియమము గావించియుండును. నన్నయ కేతనలు కూడ నట్లే యభిప్రాయపడి యుండి రనుట కాధారములున్నవి. తిక్కన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెప్పుడుం జొన్ప" నని చెప్పుటకూడఁ గేవల సంస్కృతపదములను దెలుఁగునఁ బ్రయోగింపరా దను నిషేధమును సూచించుటకే.

నన్నెచోడుఁడు తనకుఁ బూర్వము కన్నడమున రచింపఁబడియుండిన వాఙ్మయముతోఁ బరిచయము కలిగియుండిన కతమునను, వానిలోఁ బెక్కు మార్గ కవితా పద్ధతిని రచింపఁబడినవే యగుటచేతను మును "మార్గకవిత లోకంబున వెలసె" నని వాక్రుచ్చియుండెను. చాళుక్య రాజాదులు తెలుఁగున నట్టి మార్గ కవిత్వమునుగాక దేశికవిత్వమును బుట్టించి తెనుఁగును నిల్పుటకు యత్నించి యుండిరి. ఈ చాళుక్యరాజు రాజరాజనరేంద్రుఁడు కాఁడనియు నాతని పూర్వులలో నొకఁడై యుండుననియుఁ దోఁచుచున్నది. అతఁడే యా చాళుక్య రాజైనచోఁ బుట్టించి యనుపదమున కర్థము కుదురదు. ఏలయన నాతనికిఁ బూర్వము కూడ దేశికవిత్వ మున్నదనుటకు శాసనాధారము లున్నవి. అందలి పద్యములు సీసము, తరువోజ, మధ్యాక్కర మొదలగు దేశిచ్ఛందములకు మాత్రమే చెందియున్నవి. రాజరాజే దేశికవితను బుట్టించినవాఁడన్నచో నన్నయ భారతమే యా దేశికవిత యని చెప్పవలసివచ్చును. కాని భాషాచ్ఛందోవస్తు వర్ణనాదులను బురస్కరించుకొని చూచినచో నది మార్గకవితా పద్ధతియే కాని దేశికవిత్వము కాదు.

నన్నెచోడుఁడు "సురవరు" లను పద్యమున స్తుతించిన యుత్తమ మార్గకవులు తెలుఁగునకు సంబంధించినవారే. వారిలో నన్నయకూడ నొక్కఁడై యుండును. నన్నయకును దనకును మతవిషయమున భేద ముండుటచేతను అప్పటి కింకను నన్నయ భారత మధిక ప్రాచుర్య మంది యుండకపోవుట చేతను అతఁడు ప్రత్యేకముగా నతనిఁ బేర్కొనక సాముదాయికముగా నుత్తమ మార్గకవులను మాత్రమే స్తుతించియుండును. అందుచే నన్నెచోడుఁ డిచ్చటఁ బేర్కొన్న యుత్తమమార్గ కవులు, దేశిసత్కవులు అనుపదములు "దేశభాషలోఁ జేయబడిన రచనను లక్ష్యముగాఁ జేసికొని చెప్పిన వని తలంపవలసినదే కాని సంస్కృతభాషారచిత కవిత్వమున కిందుఁ బ్రసక్తి యేమున్నది." ?

ఇంక నన్నెచోడుఁడు కవివరాకులను పరిహరించిన పద్యమును బై యభిప్రాయముతో నన్వయింపవలసియున్నది. ఆతని కుత్తమ మార్గకవులన్నను దేశిసత్కవులన్నను గౌరవమే యనుటకు వారి నాతఁడు కొల్చియుండుటయే తార్కాణము. "మార్గకుమార్గము, దేశి యమార్గము" అనునది నన్నెచోడుని యభిప్రాయమే యైనచో నాతఁడా రెండు మార్గములకుఁ జెందిన కవులను గొల్చియే యుండఁడు. అందుచే నా యభిప్రాయ మతనిది కాదనియు నాతనిచేఁ బరిహరింపఁబడిన మార్గవుల దనియుఁ దోచుచున్నది. ఈమార్గవులు మణిప్రవాళపద్ధతి నవలంబించినవారే. వీరికి సంస్కృతపదములను దత్సమములుగాఁ జేసి దేశభాషాపదములతోఁ గలిపి చెప్పుమార్గకవిత్వము నెడఁగాని దేశికవిత్వము నెడఁగాని, ప్రీతి లేదు. వీరిది "తృతీయః పంథా". వీరికి మార్గము కుమార్గము దేశి యమార్గము. రెండుపద్ధతులును నచ్చవు కావున మాటాడ కూరకుండుటకు వారికి మనసొప్పదు. అందుచే వారొక క్రొత్తమార్గమును; సంస్కృతపదములను సంస్కృతపదములుగానే యుంచి దేశి పదములలోఁ గలిపి చెప్పుమార్గము - అవలంబించిరి. నన్నెచోడుని కిది దుర్మార్గము. ఉత్తమమార్గ మాతనికిఁ బ్రీతికరమే. అందుచే నాతఁడు తమకు (మార్గవులకు) వగవంగ (ఆలోచింపఁగా) మార్గ (సంస్కృతపదములను దత్సమీకరించి చెప్పుమార్గము) కుమార్గము (కుత్సితమార్గము) దేశి (కేవలదేశికత్వము) అమార్గము (మార్గమే కాదు). అయినను గవిత్వమును బూర్తిగా విడిచివేయుటకు మది (మనస్సు) వదలక (విడువక) దుర్మార్గపదవర్తులు (మణిప్రవాళ మను పదమున వర్తించువారు. అగు మార్గవులను సుకవులు తలంప నక్కఱలేదని హేళన పూర్వకముగాఁ జెప్పినాఁడు. నన్నెచోడునకుఁ గవిరాజమార్గ నిర్దిష్టమైన మార్గ ముత్తమ మార్గము. అతిసంస్కృతాభిమానులైన మార్గవు లవలంబించు మణిప్రవాళము 'దుర్మార్గము'. అందుచేతనే యతఁ డుత్తమమార్గ సత్కవీశ్వరులను బొగడి దుర్మార్గపదవర్తులైన మార్గవులను (మాఱు + కవులు) దెగడినాఁడు.

మార్గవుల యభిప్రాయములో మార్గ కుమార్గము దేశి అమార్గము. ఇచ్చటి కుమార్గ - అమార్గ పదముల కర్థమున వ్యత్యాస మున్నది. కుమార్గ మనఁగా గుత్సితమైన మార్గము. అదియు నొక మార్గమే కాని చెడ్డమార్గము అమార్గ మసలు మార్గమే కాదు. అందుచే ననుసరింపఁ దగినదే కాదు.

మార్గదేశికవితాపద్ధతు లస నెట్టి సంబంధమును లేని పృథఙ్మార్గములు కావు. ఏదైన నొక పద్ధతిని దేశియో మార్గమో యని చెప్పుట ప్రాధాన్య దృష్టితోడనే. మార్గకవిత్వమున దేశికవితాచ్ఛాయలును దేశికవిత్వమున మార్గకవితాచ్ఛాయలును గొన్ని కానవచ్చుచునే యుండును. ఉదాహరణమునకు నన్నయ భారతమే తీసి కొందము. అందు మార్గకవితాంశ మధికమనుమాట సత్యమే యైనను దేశికవితా రేఖ లసలు లేకపోలేదు. అతనికవిత్వములోఁ దరువోజ లున్నవి. మధ్యాక్కర లున్నవి. అచ్చటచ్చట దేశ్యపదప్రచురమైనరచనయు నున్నది. కాని సమాసతత్సమ భూయిష్ఠము, శార్దూల, మత్తేభ చంపకోత్పలమాలాలంకృతము నగు మిగిలిన రచనతోఁ బోల్చి చూచినచో దేశికవిత చాలఁ దక్కువ. అందుచే మొత్తముమీఁద నాతని రచన మార్గకవిత్వమని చెప్పఁబడుచున్నది. నన్నెచోడుని కుమారసంభవ రచనకూడ మార్గపద్ధతికిఁ జెందినదే. కాని యిందు నన్నయ భారతము కంటె దేశి మార్గచ్ఛాయ అధికముగా గోచరించును. శార్ఙ్గదేవుఁడు సంగీత రత్నాకరమున గాన గాంధర్వములను గూర్చి వివరించుచు గానము నిబద్ధము, అనిబద్ధము అని రెండు తెఱంగు లనియు, గాంధర్వగానములు మార్గదేశిభేదముల కపరరూపము లనియుఁ దెల్పియుండెను. కవిత్వవిషయమున మార్గపద్ధతులు రెండిటఁగూడ నీ రెండు తెఱఁగులు గోచరించునని చెప్పవచ్చును. నన్నయరచన నిబద్ధమార్గము. అనఁగా స్వతంత్రచ్ఛాయలతోఁగూడిన మార్గపద్ధతి, పాల్కురికి సోమనాథుఁడు పేర్కొన్న తుమ్మెద వెన్నెల పదాదులు శుద్ధ దేశిమార్గమునకుఁ జెందినవి. అవి యనిబద్ధములు. సోమనాథుని రచనలు నిబద్ధదేశిమార్గమునకుఁ జెందినవి. అనఁగా వాని యందును సంస్కృతప్రభావము కొలదిగా నైనను లేకపోలేదు. ఇది ప్రాధాన్య దృష్టితోఁ జేయబడిన వ్యపదేశము.

నన్నెచోడుడు కుమారసంభవమునఁ గావ్యప్రశస్తిలో "దేశిమార్గంబులు దేశీయములుగా నలంకారములు దా నలంకరింపఁ" గవిత రచింపవలెనని సూచించెను. మార్గమును దేశీయముగా నొనరించుట యనఁగా నేమో యర్థము చేసికొనవచ్చును గాని దేశిని దేశీయముగా నొనరించుట యనఁగా నేమి ? దేశికవితను బోషించి యధికతర దేశీయతా ముద్రతో దాని

నలంకరింప సలయు ననుటయే యాతని యభిప్రాయమై యుండును. దేశి కవితారీతి నితోధిక దేశీయముగను మార్గకవితను దేశి కవితను సన్నిహితముగను జేయవలెనని యాతని ధ్యేయమైనట్లు తోచును. అతని కావ్యమున నీ రెండు ప్రక్రియలును గోచరించును. దేశి మార్గములను గలుపుట యను పద్ధతి నతఁడు కన్నడకవులనుండియే గ్రహించెను. "దేసియొళ్ పుగువుదు పొక్క మార్గదొళె తళ్వుదు" అని పంపకవియు, "నెగళ్ద రసం మనం గొళిసెమార్గ మొడంబడె, దేసికబ్బ మంబగె గొళెలింత పేళ్దుదు" అని రన్న కవియు భారత గదాయుద్ధ ములలోఁ జెప్పియుండిరి. మార్గదేశీవిధానములను గలిపి చెప్పుటయే వారి కభిమత మైన పద్ధతి.

తెలుఁగున నీమార్గదేశీపద్ధతుల ప్రసక్తి తెచ్చినవాఁ డింకొకఁడు గలఁడు. అతఁడు నన్నెచోడుని కించుక తరువాతివాఁడని చెప్పఁదగు నృపధూర్జటి భీమయ పండఁడు.

"తలఁపు సదర్థ భావమునఁ దగ్గతసూక్తులఁ గూడ వర్ణనల్
గొలుసుగొనంగ ప్రావడులు గోరిన భంగ్గిక వచ్చిముట్టఁగో
మలగతి దేశిమార్గములు మట్టువడం గ్గటనం బులొప్ప నా
ద్యులప్రక్రియఁ జెప్పనేర్చె నృపధూర్జటి భీమయపండ్డఁడిమ్మహిన్"

అను పద్యమున దేశీమార్గములు మట్టువడునట్లుగా నాద్యుల క్రియఁ జెప్పఁగల నేర్పును ప్రశంసించుకొని యున్నాడు. ఈ పద్యము భాషా భావగమకములందు నన్నెచోడుని "సరళము గాఁగ భావము" అను పద్యమును బోలియున్నది

నన్నెచోడుని తరువాత పాల్కురికి సోమనాథుఁడు దేశిమార్గమున కధిక ప్రాధాన్య మొసంగెను. తిక్కనకూడా భాషావిషయమున దేశి కవితాభిమానమునే ప్రదర్శించెను. కాని యితర కవితాలక్షణములలో మార్గపద్ధతినే యవలంబించెను. నన్నెచోడుఁడు నిష్ఠ యొనరించినను భాషా సమాసాది ప్రయోగమున నించుక విశృంఖలముగా వర్తించుటచేఁ బండితాదరము పడయలేకపోయెను. నన్నయ కవిత్వమునందు మార్గకవితాభాగ

మెక్కువ. తిక్కన కవిత రెండింటి సలక్షణమైన సమరసమైన కుండిక. తిక్కన తరువాత మరల దేశికవితా మార్గమునకు దుర్దినములు పట్టినవి. పండితులును గవులును దేశిమార్గమునం దాదరము చూపక నన్నయ యవలంబించిన మార్గకవితా సంప్రదాయమునే యాదరించి పెంపొందింపఁ దొడంగిరి. సోమన శ్రీనాథాదులును, పెద్దనాది ప్రబంధకవులును ఆమార్గమును బరాకాష్ఠనొందించిరి. అప్పుడు తాళ్ళపాక పరికృతులలో నది సజీవమైయుండి నను ఉరవడితో నుద్వేలమై ప్రవహించిన ప్రబంధవాహిని ముందు దాని నంతగా నాదరించినవారు లేకపోయిరి. తరువాత నాయకరాజుల కాలమున యక్ష గానాదులలో నది కొంత విజృంభణము గాంచెను. మరల నాధునిక కాలమున పండితులకును, గవులకును బ్రజలకును గూడ దేశికవితావాఙ్మయముపై నధికమైన యాదరాభిమానము లుదయించినవి. కవులు పూర్వపుపాటలను బదములను నొజ్జబంతులుగా గ్రహించి సర్వసుబోధములైన గేయరచనలు కావించుచున్నారు. అభ్యుదయ కవిత్వమునఁ జాలభాగము దేశిమార్గ ముననే నడచుచున్నదనుటలో నత్యుక్తి యుండదు. కాని పండితులకును శిష్టులకును బూర్వమువలె నేఁడును దీనియెడల సహజమైన యాదరాభి మానము లంతగా గోచరించుటలేదు. దీని భవిష్యత్ప్రవృత్తి యెట్లుండునో యిప్పుడు నిర్ణయించుట కష్టము.

—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 49, సంచిక 2,3 (1960)
(శ్రీ జయంతి రామయ్య పంతులుగారి శతవార్షిక
జన్మ దినోత్సవ స్మారక సంచిక)

# నన్నయ్యగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి

—శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

"సారమతిఀ గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునఀ మహా
భారత సంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్"

ఈ పద్యములో నన్నయగారు తన కవితాప్రపంచమునగల యనేక గుణములను పేర్కొనక మూఁడు గుణములనే ప్రధానముగా చెప్పి కొనియెను. మొదటిది ప్రసన్న కథాకవితార్థయుక్తి. రెండవది అక్షర రమ్యత. మూఁడవది నానారుచిరార్థసూక్తులు. వీనిలో నన్నయ్యకు మొదటిది మూఁడవది యనుగుణంబులం దభిమానము కలిగినట్లు, రెండవదాని యందు తక్కువ యభిమాన మున్నట్లును కనిపించు చున్నది. తన కవితలో నానారుచిరార్థసూక్తు లుండుట నన్నయ్యగారు తన కది యొక బిరుదముగా చెప్పికొన్నట్లు భాసించుచున్నది, పరిశీలింపఁగా నీ కాలమున ఆయన తాను ప్రత్యేకముగా చెప్పిన ఈ రెండు గుణములందును లోక మాదరము చూపుచున్న దనుటకు నిదర్శనము కనిపించుటలేదు. నన్నయ్యగారి సూక్తులు జగత్ప్రసిద్ధములు. ప్రతిధర్మము వేరొక పద్యముగా వ్రాయబడియుండును. పూర్వకాలమున నీ సూక్తులు దేశమునందు జనులు బహుధా వాడుకొనెడి వారేమో! కొన్ని పద్యములు నా చిన్నతనములో గూడ ప్రావాహికముగా జీవితయాత్రలో పల్లెటూళ్ళలో వాడుకొనుట నేనెఱుఁగుదును. ఈనాడు సంస్కృతములోనున్న సూక్తులే గీర్వాణ భాషావేత్తలు లోకవృత్తమున నుపయోగింతురు. ఆ సూక్తులనే సంస్కృతము రానివారు కూడ తప్పుల తడకలుగా చదువుచుందురు. భారతములోని నన్నయ యనేక సూక్తి పద్యములు తెలుగు జీవితములోనుండి బహిర్గమించినవి. దీనికి ప్రధాన

కారణ మింగ్లీషు చదువు. ఆ యింగ్లీషు చదువు మన కావ్యములను పాశ్చాత్య విమర్శదృష్టితో చదువ నలవాటుచేసినది. పాశ్చాత్య విమర్శ సూత్రములు పట్టించి దాని కాగని కవిత కవిత కానట్లు కవి కానట్లు చెప్పింపఁ జొచ్చినది. మఱియును సుష్ఠు శబ్దజ్ఞానము లేని పలువురు విమర్శకులై, యున్న విషయమును సరిగా చూడక లేని దానిని తమ మనస్సులో కల్పించుకొని యిష్టము వచ్చినచోటుల నధిక గుణారోపణము చేయుచు నుండుచుండిరి.

కొన్నిచోట్ల కొన్ని విచిత్ర సిద్ధాంతములు వ్యాప్తిలోనికి వచ్చినవి. శబ్దము సర్వభావమును చెప్పలేదని యొక్క సిద్ధాంతము. ఉత్తమ కవి యందు శబ్దాడంబరముండదని యొక సిద్ధాంతము. పదాలు కొద్దిగా నుండవలయును, అర్థము దానికి కొన్ని రెట్లుండును. ఇదియే ధ్వనియని యొక సిద్ధాంతము. ఇది ధ్వని సిద్ధాంతము కాదు. స్ఫూర్తి కలుగుటకు దాని కనువైన శబ్ద ముండిననే స్ఫూర్తి కలుగును. గాలిలో దీపము పెట్టి 'దేవుడా నీ మహిమ' యనునది కవిత్వము కాదు. పాఠకులు ఈ విషయమున కొన్ని పొరపాట్లు చేయుచుందురు. తాము నింగ్లీషులో నొక యూహను చేసి ఆ యూహ తన కిష్టమువచ్చిన కవియొక్క కవితలో నుండుననుకొనుట. మరియొక కవి తానేదియో వ్రాసి యందులో శబ్దములం దీయఁబాలని యర్థము తానున్నదనుకొనును. ఇవి నేయార్థములన్న కావ్యదోషములు. ధ్వని యనునది అచ్చట నున్న శబ్దముయొక్కయు, వాక్యముయొక్కయు శక్తివలన కలుగును. ఊరకే గాలిలో పుట్టదు. ఈ ధ్వని యనేకవిధము లైనది. వీనిలో రసధ్వని యనునది పరమోత్తమమైనది. రసము, రసాభాసము భావము, భావాభాసము. భావశాంతి, భావశబలత మొదలైనవన్నియు రస కక్ష్యలో చేరును. ఈ రసధ్వని రెండు విధములుగా భాసించును. ఒకటి కవిశక్తిచేత. రెండవది రచనాశిల్పముచేత. రచనాశిల్పము మిక్కిలి గొప్పది. నన్నయ్యగారు ప్రసన్న కథాకవితార్థయుక్తి యని చెప్పుటలో నీ రచనాశిల్పమునుగూడ భావించినారు. ప్రసన్న కథాకవితార్థయుక్తి అన్న సమాసమునకు నాలుగైదు విధములుగా పదవిభజనచేసి అర్థములు చెప్పవచ్చును. ప్రసన్నకథయొక్క కవితార్థముయొక్క యుక్తి. అనగా కవితార్థములో ప్రసన్నమైన కథ యుండుట. కథ ప్రసన్న మగుట. ఇట్లు రెండు మూడర్థములు

చెప్పికొని నపుడు కథాకవిత యను నొక శబ్ద మేర్పడి యింగ్లీషుభాషలో నున్న 'Narrative Poetry' అన్న శబ్దమునకు చక్కని యర్థముగా భాసించు చున్నది. కాని ఈ కథాకవితయన్నది మన పూర్వలాక్షణికులలో చెప్పఁబడి నట్లు కనిపించుటలేదు. అందుచేత నీ దృష్టియే మనపూర్వులకు లేదనుటకుఁగూడ గలదు. ఇదికాక 'ప్రసన్న కథాకలి తార్థయుక్తి' యనియు పాఠాంతరము గలదు. ఈ పాఠమే యెక్కువ సమంజసముగాఁ గన్పించుచున్నది. సామంజ స్యము రెండు విధములు. బహు తాళపత్ర గ్రంథములయందు సమానముగా నున్న సామంజస్య మొకటి. అర్థపుష్టిచేతను తత్కవియొక్క భావనా సజా తీయతచేతను సమకూడునది రెండవది. నన్నయ్యగారి కథానిర్మాణవైఖరిని బట్టి చూచినచో 'ప్రసన్న కథాకలితార్థయుక్తి' బాగుగా నున్నది. ప్రసన్న మైన కథతో గూడుకొనియున్న యర్థముల యోజనయని యర్థము. అనఁగా నచట నున్న యర్థములను చక్కఁగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్న మగును. అచట నున్న యర్థములను చక్కఁగా యోజింపవలయును. అచట నున్న యర్థములలోపల సారయవలయును. ఈ పని కవీంద్రులు చేయుదురు. చేసి మేలందురని యాయనయే చెప్పెను. లోనారయక మేలు కాదనుట న్యాయము కాదు.

రచనాశిల్ప మిందులోని భాగముగానే నన్నయ్యగారు భావించి యుందురు.

నన్నయ్యగారి తర్వాత కొన్ని వందలయేండ్లకు వచ్చిన రసగంగాధర కర్త గాని యీ రచనాశిల్పమును ప్రపంచించలేదు. ఇది జగన్నాథ పండితుని చేత ప్రపంచించ బడకపూర్వమే సర్వమహాకవులయందును భాసించుచున్నది. వ్యాసుఁడు వేదములను విడదీసినట్లు లాక్షణికులు కవితాలక్షణములను విడఁ దీసిరి. ప్రస్తుతము నా చెప్పఁబూనినది రచనాశిల్పమునుగూర్చి కాకపోయినను తత్పరామర్శ కొంచెము కావించెదను. ఎందువలన ననఁగా రచనాశిల్పము చేతనే యర్థము ప్రసన్న మగును.

ఈ రచనాశిల్ప మనంతవిధములుగా నుండవచ్చును. ఒకచోట వృత్తముల నాశ్రయించి యుండవచ్చును. ఔచిత్యవేత్తలు దీనిని వృత్తౌచిత్య మనవచ్చును.

అరణ్యపర్వ ద్వితీయాశ్వాసాదియందు నన్నయ్యగారు నలోపాఖ్యానము వ్రాసినారు. అది రెండువందల యిరువదినాలుఁగు పద్యముల కథ. ఈ కథలో నెచ్చటను శార్దూలముగాని, మత్తేభముగాని వ్రాయఁబడలేదు. ఇది కరుణరసము ప్రధానముగాఁ గలిగిన కథ. ఈకథకు ఆ రెండు వృత్తములు పనికిరావని నన్నయ్యగారి నిష్కర్ష. ఇట్లే యెల్లచోటులఁ జూడవచ్చును. భిన్నవృత్తము నన్నయగారు వాడినచో దాని ప్రయోజనము పేఱుగనున్నదనియే వాడిరి. ఈ రీతిగా పరిణతమైన శిల్పమాయన రచనయందు సర్వథా భాసించుచున్నది.

ఈ రచనాశిల్పము సూచికగా నొక చిన్న విషయము వ్రాసెదను.
"చిరముగ బ్రహ్మకున్ దపముజేసి యనంతుఁ డనంత ధారుణీ
భరగురుకార్యశక్తుఁ డయి పన్నగ ముఖ్యుల పొత్తుబాసి చె
చ్చెర తనయంత నుండి మదిచేర్చి ఁలంపడ యొక్కనాఁడు దు
ర్భరతర దందశూక కులభావి భయప్రవిఘాత కృత్యముల్.

ఈ పద్యము భవిష్యత్తులో జరుగబోవు సర్పయాగమును గూర్చి భయపడిన వాసుకి తన సహోదరులతో చెప్పినది. ఈ పద్యములో "అనంత ధారుణీ భర గురు కార్యశక్తు" డన్నది యొక సమాసము. చివరిచరణమంతయు నొక పెద్దసమాసము, ఈ సమాసము లెందుకు? ఏదియైన ప్రయోజనమున్నచో నదిశిల్పము, నిష్ప్రయోజన మైనచో శబ్దాడంబరము.

ఒక కుటుంబములో నొకయన్నగా రున్నారు. అతఁడు పెద్దయుద్యోగములో నుండి దూరదేశమునందు సుఖముగా నుండెను. ఇంటి దగ్గర నున్న కుటుంబము మిక్కిలి కష్టములనుభవించుచుండును. "వానికే మిమహారాజువలె నున్నాడు. మన మిచ్చట నానాబాధలు పడుచున్నాము" అనుట లోకము నందలి పద్ధతి. ఈ మాటలు నోటితో ననెడువాఁడు అతఁడు సుఖముగా నుండుటయు, తాము బాధలు పడుటయు మిక్కిలిగా చెప్పును. ఆయర్థములను చెప్పు శబ్దములమీఁద గాకువును ప్రయోగించును. "నానా యిబ్బందులూ పడుతున్నాము. నానాగడ్డి తింటున్నాము" మొదలైన మాటలు ఆవేశముతో చెప్పును. ఈ యావేశము కావ్యములో నెట్లు కననగును ?

నాటకములో రంగముమీద నటకుఁడు వాక్యగతభావమును తన వాచికముచే సాత్త్వికాద్యభినయముచే ప్రకాశింపఁ జేయవచ్చును. "కావ్యేషు నాటకం రమ్యం" అనుదానిలో కొంత రహస్య మియ్యదియే. పూర్వకాలమున నీ బాధ లేదు, మన పూర్వుల ప్రకారము కావ్యములు రెండు రకములు. అనఁగా పాఠకుఁడు వినిపింపఁగా వినెడివి. ఎట్లు చదువవలయునో తెలిసిన వాఁడే పాఠకుఁడు. వాఁడే చదివెడివాఁడు, చదువునప్పుడు సర్వార్థములు గోచరించెడివి. ఈనాఁడా శ్రవ్యములన్నియు పాఠ్యకావ్యము లైనవి. అందరును పాఠకులు మాత్రము కాలేదు. ఈ దోషము జాతియందు సన్నిహితమై యది కావ్యగతమైనది వలెఁ గన్పించుచున్నది.

లోకము మాటాడుకొనునపుడు తాను చెప్పు నర్థము సువ్యక్త మగుటకును సమకోపాదులు భాసింపఁజేయుటకును కొన్ని శబ్దములు బిగ్గరగా నావేశముతో నొక్కి చెప్పుదురు. ఇట్టి చోట్ల కవి శబ్దమయమైన మార్గాంతరముచేత వానిని ప్రకాశింపఁ జేయవలయును.

లోక మొకప్పుడు కోపముకొలఁది కఠినములైన శబ్దములను ప్రయోగించును. కవి తన కావ్యమునం దట్లే చేయును. ప్రేమ యున్నచోట సుకుమారముగా మాట్లాడును. పెద్దలతో ప్రసంగించునపుడు సభ్యములైన శబ్దములనే వాడును. లోక మెట్లో కవిత అట్లే. తత్తద్భావానుకూలముగ శబ్దములను వాడుట. కొన్ని యధిక ప్రయోజనములను సాధింపవలసి వచ్చినపుడు సమాసము లుపయోగించుట. ఆ సమాసముల యొక్క హ్రస్వత్వము దైర్ఘ్యము తత్తదావేశోచిత స్ఫోరకముగా ప్రయోగించుట కవితాశిల్పము. ఇది మహాకవుల కుగ్గుపాలతో పెట్టిన విద్య. ఈ పై పద్యములో నున్న రెండు సమాసముల యొక్క హ్రస్వత్వ దీర్ఘత్వములు సరిగా ఆమాట లన్నవాని మనోవాగ్వ్యాపారముల రెండింటిని విస్పష్టముగా స్ఫురింపజేయును. దీనినే మన పూర్వులు రసధ్వని యనిరి. ఇది యిచ్చట సమాసగతమై కనిపించుచున్నది. మఱియొకచోట నన్వయగతమై యుండును. ఒకవిధముగా నేమి, బహువిధములుగా నుండును. ఇది రసధ్వని యనుట సుపలక్షకముగానే చెప్పితిని. నిష్కృష్టముగాఁ జెప్పవలయునన్నచో నిట్టిరచన

రసధ్వని కుద్దీప్తి హేతువు. అనఁగా నొక ప్రేలెడెడము. గనుక కావ్యభాగ నిక్షిప్తమని యిట్లు చెప్పితిని. నన్నయ్యగారి రచన సర్వత్ర యిట్లుండును.

వట్టి వర్ణనలచోట నీ రచనాదీప్తి కనిపించదు. ఆ వర్ణనాంశములు రసవ్యంజకేతర భాగములు. తత్స్పృష్టి యుండదనికాదు. ఒకఁడు చెప్పు మాటలలో ప్రసంగములో వాని కామక్రోధాది భావములు వాఁడు వెలు పరుచుటలో నున్న మనుష్య హృదయ స్పందనము వర్ణనాంశములలో నుండదు. వర్ణనాంశమునయందు కవియొక్క యుత్ప్రేక్షాది కల్పనాశక్తియు, పాఠకుని యొక్క యూహాశక్తియు విజృంభమాణము లగుచుండును. అప్పటి రచన సర్వత్ర యీశిల్పమున కొగ్గదు. ఈ శిల్ప మచటఁ దక్కువగా నుండును. అచట కవియొక్క శక్తి రసధ్వనీతర ధ్వనులయందు ప్రకాశింప వచ్చును. ఆ ధ్వనులు వస్త్వలంకారముల నాశ్రయించి యుండవచ్చును.

ఇట్టి రచనాశిల్పముకంటె భిన్నమైన శిల్పము ప్రతిభాపరుయొక్క పద్య రచన యందుండును. శిల్ప మనగా చేయుట యని యర్థము కాదు. ఒకా నొక సౌందర్యమా పద్యరచనయందు భాసించుట, పద్య మెత్తుగడ బాగుండుట, దింపుగడ బాగుండుట, ప్రాస యతిస్థానములయందు కొన్ని రమ్యములైన శబ్దములు ప్రయోగించి పద్యమంతయు బంగుగా నున్న దని పించుట, పద్యము ధారాశుద్ధి కలిగియుండుట, ఇట్టివి పద్యమునకు సహజమైన సౌందర్యమును సంపాదించు లక్షణములు, పై నుదాహరించిన నన్నయ్య గారి పద్యమువంటి పద్యమే తత్సామాన్య పద్యముకంటె నధికమైనది. ఇతర పద్యములయందు రమ్యముగా రచించినచో పద్యసౌందర్యముండును. ఈ పై పద్యమునందు శిల్పసౌందర్య మున్నది.

ఈ శిల్ప మక్షరగతమై కూడ నుండును. పూర్వాలంకారికులు చెప్పనిది నన్నయ్య గారు దీని నేకదేశ గణగతముగాఁ జేసినారు. చూడుడు:

"ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయఁగడఁగి సకల క్షత్రా
న్వయ వీరుల రావించిన"

ఇది బాహుకుఁడు పర్ణాదునితో నన్నమాట. కందపద్యముయొక్క రెండు నాల్గు చరణముల మొదల జగణము వేసినచో పద్యమొక విచిత్రముగా విరుగును. ఈ విరుగుట వలన పద్యమున కొక శోభవచ్చును. పద్య మూరకే యందముగా కనిపింపఁ జేయుటకు నన్నయ్యగారీపని నెప్పుడును చేయరు. 'పునస్స్వయంవర' మని నొక్కుటచేత బాహుకుఁడైన నలుని యాక్షేపణ ద్యోతమాన మగుచున్నది. ఆ యాక్షేపణకు దీనివలన నుద్దీప్తి కలుగుచున్నది

ఇట్లనంత విధములైన ధ్వనిమార్గములయందు నన్నయ్యగారి రచన నిష్ణాతమై కనిపించుచున్నది. ఇది యంతయు పీఠికాప్రాయము. ఇట్లాయన కవితయందలి గుణములను జెప్పఁబూనినచో నెంతయో గ్రంథమగును. ఈ విషయములను పరామర్శించి చెప్పుట 'లోనారయుట' కాదు. ఈ గుణములు చూచుటకు 'లోనారయ' నవసరము లేదు. ఇది సుపరిచితమైన యాలంకారిక మార్గము. సర్వలాక్షణికులు వ్రాసినదియే. పండితుల కందఱకు పరిచితమైనదియే.

కవీంద్రులు 'లోనారసి మేలన' దగిన ప్రసన్న కథా కలితార్థయుక్తి యెట్టిది ? అదియే లోకోత్తరమైన శిల్పము. ఇంతకంటె తానేదియో అధికముగాఁ జేసిన గదా కవీంద్రులు లోనారసి మేలనవలయును. అది యెట్టిది ? ఏ యితర మహాకవులకు తెలియరానిది. ఏ యితర మహాకవులు చేయనిది. తానేదియో చేసినట్లు చెప్పుకొనినాఁడే. అది యేది ?

తాను భారతము రచించుచున్నాఁడు. భారతమునం దుపాఖ్యానములు వేలున్నవి. ప్రధానకథ యున్నది. ముందర యుపాఖ్యానము లెట్లు తీర్చెనో చూచి ప్రధానకథ పొంతకు పోదము. అన్ని యుపాఖ్యానములను పరిశీలించుటకు వేళ చాలదు, గ్రంథము చాలదు. స్థూలముగా నైనదా రుపాఖ్యానముల స్వరూపము పరిశీలించి ప్రధాన కథను కొంత పరిశీలించినచో స్థాలీపులాకన్యాయ్యమున నన్నయగారి రచనామార్గ మిట్టిదగునని తెలిసికొనుట కలుగునని కొలఁది కథలను గుఱించి మాత్రమే వ్రాయుదును.

అన్ని కథలు నొక్కరీతిగనే యుండవు గదా! భారతములోని కథలు కొన్ని పూర్తిగా వైదికములు, కొన్ని రాజుల కథలు, కొన్ని ఋషిమహాత్త్వ

బోధకములైన కథలు, కొన్ని ధర్మబోధకములు, కొన్ని లౌకికములు. అందుచేత నన్ని కథలొకేరీతిగాఁ జెప్పినచో కథా ప్రసన్నతయే లేదు. నన్నయగారందుచేత నొక్కొక్క కథ నొక్కొక్క రీతిగాఁ జెప్పును. భిన్న మార్గములను జాగ్రత్తగా పరిశీలించినగాని యాయనమహారచనౌత్కృష్ట్యము గోచరింపదు. ప్రఖ్యాత సునివిష్టులైన కాళిదాసాదులు గూడ నజ్ఞాతపూర్వమని చెప్పఁబడిన యాయన శక్తి తెలియదు.

కథా ప్రసన్నత యన నేమో తెలిసికొనుటకు మున్ను ప్రసన్న శబ్దార్థము తెలిసికొనవలయును, 'దేవీ ప్రసన్నత' ఇట్టి శబ్దములలో-"భగవంతుఁడు ప్రసన్నుఁడైనాఁడు" మొదలైనచోట్ల భగవంతుడు ప్రసన్నుఁడగుట యనఁగా నెట్టిది? ఉపాసనాస్వరూపము తెలిసి నిశ్చల బుద్ధితో పరమేశ్వరధ్యానము చేసినచో భగవంతుఁడు ప్రసన్నుడగును. కావ్యమందు ప్రసాదగుణ మను నొక గుణము కలదు. ప్రసాద గుణ మనఁగా నర్థ వ్యక్తి యని యొక మతము. ఆ యర్థవ్యక్తి యెట్లు కలుగును? శబ్దార్థ సుపరిజ్ఞానము, సంప్రదాయాభిజ్ఞతయు నున్నచో నది కలుగును. కొందఱనుకొనునట్లు గుణరహితమై యర్థమగుచుండుటవలన ప్రసాద గుణము సిద్ధింపనేరదు. భిన్నశబ్దార్థముల వాక్యార్థముల పరిజ్ఞానముచేత నర్థప్రసన్నత గలిగినట్లు కథా గత భిన్నాంశముల పరిజ్ఞానముచేత, అనఁగా వానిని చక్కఁగా పరిశీలించుటచేత కథా ప్రసన్నత కలుగును.

మొదట కద్రూవినతల కథలోని ప్రసన్నత యెట్టిదో విచారింతము. ఋషులు సూతు నిట్లడిగిరి,

"ఒరుల వలన పుట్టు నోటమియును నెగ్గు
బొరయకుండ నరసి పుత్త్రవరుల
తగిలి కాచునట్టి తల్లి సర్పములకు
నేల యలిగి శాప మిచ్చె నయ్య?"

ఈ పద్యమును జాగ్రత్తగా పరిశీలింప వలయును. "అరసి పుత్త్రులను తగిలి కాచునట్టి తల్లి" అని యుండవలయును. పుత్త్రులలో శ్రేష్ఠులను రక్షించునది. యని యర్థము వచ్చుచున్నది. శ్రేష్ఠులనే రక్షించును గాని

గక్కినవారిని రక్షించదా? మఱియు నట్టి తల్లి సర్పములకేల యలిగినది? అని ప్రశ్న. అక్కడ పుత్రవధులన్నప్పు డిక్కడ సర్పరాజు లనవలయును. ఈ రెండు నొకదాని కొకటి పొసగుటలేదు.

ఇది ఆదిపర్వము ప్రథమాశ్వాసము చివరి పద్యము. ద్వితీయాశ్వాసములో ముప్పదియైదవ సంఖ్యగల పద్యము కద్రువయొక్క శాపము. ఆ పద్యమిది :

"అనుపమ మగు జనమేజయుఁ
డను జనపతి చేయు సర్పయాగనిమిత్తం
బున పాములు పంచత్వము
ననియెదు మని యురగములకు శాపం బిచ్చెన్."

కొడుకులతో కద్రువ మీ రీ పని చేయుఁడనెను. వారు సుముఖులు కాలేదు. అప్పుడిచ్చిన శాపమది, మీరు పంచత్వము ననియెదుమని శాపమీయవలయును. మధ్యమపురుషలో కాక యీ శాపము ప్రథమపురుషలో నున్నది. 'పాములు' అని మాత్రమే యున్నదిగాని యెల్లపాములు నని లేదు.

ఇది యొక చమత్కారము. సర్వసర్పములు సర్పయాగమునందు మరణింపవు. శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, మొదలైన మహాసర్పములు చావవు. ఆ మౌనులు వేసిన ప్రశ్నలో నీ కద్రువ యిచ్చిన శాపములో నీ రహస్యము చిత్రముగా నిమిడియున్నది. ఈ రెండు పద్యములయొక్క యర్థమును చక్కగా పరిశీలించినచో కథయొక్క యీ రహస్యము ప్రసన్నమగును.

ద్వితీయాశ్వాసారంభము కద్రూవినతల కథారంభము. వీరిద్దరు కశ్యపుని సంతానార్థము ప్రార్థించిరి. ఆయన "వరంబు లిచ్చెద వేడుండనిన——"

"వినుతసత్త్వులఁ గోరె కద్రువ వేవురన్ గడువేడ్కతో
వినత గోరె........................... వారి కం
టెను బలాధికులైనవారిఁ గడింది వీరుల నిద్దరన్"

ఈ కోరికలచేత కద్రూవినతల స్వభావము పొడకట్టుచున్నది. కద్రువతో వినతకు స్పర్ధ యున్నది. ఆస్పర్థకు హేతువేమో తెలియదు. వినత దుర్మార్గురాలా ? కద్రువ వినతను సరిగా చూడకపోవుటచేత వినత కామె మీఁద కోపమా ? ఇంకను వినత యెట్టిది ? కద్రువ యిడిన గ్రుడ్లు పగిలి వేయిసర్పము లుద్భవించినవి. వినతకు రెండు గర్భాండము లవియలేదు. అందుచేత వినత "అతి లజ్జావనతయయి యొక యండమ్ము విగతధృతి నవియించెన్."

తనకు సంతానము కలిగెను. వారు పెద్దవాండ్రు కాలేదు. లజ్జచేత నెందుకు నవనత కావలయును ? "విగతధృతిఁ"— పోయిన ధైర్యము చేత. ధైర్యమెందుకు పోవలయును? అండములలో పిల్లలే లేరనియా ? అది యేమియు కాదు. మరియు చూతము. వీరిద్దరు సముద్రపు టొడ్డున వినోదార్థము విహరించుచుండిరి. ఉచ్చైశ్శ్రవము కనిపించినది. ఈ పైఁ జెప్పిన దాని రహస్యము ద్వితీయాశ్వాసము 31-32 ఈ పద్యములలో నున్నది. కద్రువ యన్నది కదా "చూడవే యల్ల నతిధవళం బైన యశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె వాల ప్రదేశంబునందు నల్ల యున్నది"అని.

దానికి వినత యిట్లనెను. "నీ వే కన్నులంజూచితే అక్కా ! యెక్కడిది నల్ల ? ఈ యశ్వరాజమూర్తి మహాపురుషుని సత్కీర్తిం బోలె నతినిర్మలంబై యొప్పుచున్న యది" యని.

ఈ రెండు మాటలవలన కద్రువ యెట్టిదో, వినత యెట్టిదో, తెలియఁగలదు. కద్రువ యబద్ధములు మాట్లాడును. దోషమునే వెదకును. వినతను తెలివితక్కువ దానినిగా చూచును. వినత చాల మంచిది. పోలిక తెచ్చుటకుఁగూడ "మహాపురుషుని సత్కీర్తియుం బోలె" యనుట యామె స్వభావమును జెప్పుచున్నది.

అప్పుడు కద్రువ పందెము పెట్టినది. ఆ గుఱ్ఱము యొక్క ధవళ దేహము నందు నల్ల కలిగెనేని, నీవు నాకు దాసి వగుము. నల్ల లేనిచో నేను నీకు నగుదును. "పన్నిదము సరుము". పందెము వెయ్యి అని

బలవంతము పెట్టినది. వినత కిష్టములేదు. పందెమున కొప్పుకొన్నది. కారణము ? కద్రువ యామెమీఁద నధికారము చెలాయించుటయే. వినత దగ్గరకుఁబోయి చూత మన్నది. కద్రువ యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూత మన్నది.

జీవితాంత మొకరి కొకరు దాస్యము చేయవలె నన్న పందెము నొడ్డిరి. అప్పుడే చూడకుండ నేల రూరుకుందురు ? దగ్గరకుఁబోయి చూడవలసిన యవసరము కద్రువ కున్నదా ? వినత కున్నదా ? నల్లగానున్నదని మొదట చెప్పినది కద్రువ. నిజముగా నల్లగాలేదు. రేపు వచ్చిన మాత్రమేమి ? తెలుపు నలుపగునా ? అన్న ధైర్యము వినతకున్నచో నామె యమాయకు రాలు. వ్యవహారము తెలియనిది. లౌకికజ్ఞానము లేనిది. ఈ కథ కదిలించినది కద్రువ కాన నామె యేదియో మోసము చేయునని వినత గ్రహించవలయును. అట్టి శక్తి వినతకు లేదు.

అసలు కద్రువకు వినతను దాసిగా చేసికొనవలయు నన్న కోరిక యేల పుట్టెను ? వినత తనకు లోకువయైన మనిషి. ఇదివఱకే వినతమీఁద తా నధికారము చేయుచుండెను. వినత మెత్తనిది. ఎదురు తిరుగలేదు. ఆమె యధికారము సాఁగనిచ్చుచుండెను. సాఁగనీయక తానేమిఁయు చేయ లేదు. కాని వినత మనసులో కష్టపడుచునే యుండెను. అందుకనియే కద్రువ కొడుకులకంటె తన కొడుకులు గొప్పవాండ్రు కావలయునని కోరెనది. కద్రువయొక్క గర్భాండము లవిసి పిల్లలైనారు. తన గ్రుడ్లు సంతానముగా మారెను. వినత గ్రుడ్లు కొడుకులు కాలేదని కద్రువ వినతను వెక్కిరించి యుండును. అందుచే లజ్జావనత యైనది. ఆమె కొడుకుల వలన తాను బాధకూడపడియుండును. అందుచేత విగతధైర్యయైనది.

ఈర్ష్య కాకూడదా ? అని ప్రశ్న పుట్టవచ్చును. ఆ పద్యము దగ్గర నీ రెండును వికల్పములే. తరువాతి కథచేత కద్రువయొక్క యధికార ధూర్వహత్వమే నిరూపింపబడి రెండవ వికల్పము తీరిపోవుచున్నది.

ఈ రీతిగా ఆ కథ ప్రసన్న మగుచున్నది.

ఈ ప్రసన్నతకు నన్నయ్యగారు మఱియును దీప్తి కలిగించెను. ఇచట నప్రస్తుతమైన సముద్రమథన కథ యుచ్చైశ్శ్రవము కనిపించుటకు పూర్వాంగముగా రచించెను, ఈ సముద్రమథనకథ యంతయు నిగూఢార్థములు లేకుండ వట్టి ప్రవాహముగా తన సహజ మధురశయ్యలో రచించెను. వెంటనే కద్రూవినతలు సముద్ర తీరమునందు గనిపించుట జరిగినది. ఈ సముద్రమథన కథారచనకు, కద్రూవినతల ప్రసంగమునకు రచనా పద్ధతులలో మిక్కిలి భేదమున్నది. సముద్రకథలో దీర్ఘ సమాసములు, పద్యగమనా సౌందర్యము మిక్కిలి భాసించును. ఈ కథ దగ్గరకు వచ్చునప్పటికి నెక్కువ తెలుఁగుశబ్దములు, వృత్తములు వదలిపెట్టుట, అనఁగా గీతములు, సీసములు, కందములు వచనములే వాడుట. ఈ భేదము కల్పించి కవీంద్రులను లోనారయుటకు మార్గమేర్పరచెను. ఈ లేనిపోని కద్రువ యల్లిన యల్లిక తెల్లని గుఱ్ఱములో కొంతనల్లగానున్నదనుట. ఇది యాసర్పయాగకథ కాయువుపట్టు. అంత యబద్ధమూరకే యెవరును కల్పించరు. దైవప్రేరితమై కల్పింపఁబడును. ఆ దైవము ఈ లోకమునందు దుష్టజనులయొక్క స్వభావమై యుండును. ఈ రహస్యము తెలసినచో కథ ప్రసన్న మగును. దీనికి ప్రాధాన్య మిచ్చి వ్రాయుటలోనే కథాప్రసన్నతకలుగును. ఈప్రసన్నత నెరుగుటకు కవీంద్రులు లోనారయ వలయును. లోనారయుట యనఁగా కథనిట్లు చూచుట. అచట ప్రయోగించిన వాక్యములయొక్కయు. శబ్దముల యొక్కయు, సంతరార్థము పరిశీలించుట.

ఈ సర్పయాగ కథ పెద్దది. కద్రూవనితల మాత్సర్యము పెంచి వ్రాయుటకు వీలులేదు. తత్కథాంశముల యొక్క వ్యక్తి కలుగుటకు కొలఁది మాత్రమే వ్రాసి తక్కిన విషయముల మీఁదికి పోవలయును,

ఇట్టి విషయములు మఱియు పెంచి వ్రాయుటకు నీ కథ కాదు. వేరొక కథ కావలయును. ఇట్టి శిల్పమును విస్తారముగా చేయుటకు నీకథలో తగినంత వస్తు భాగము లేదు, దీనికి శర్మిష్ఠ కథయో, నలచరిత్ర కథయో వ్రాయవలయును.

—భారతి

రజతోత్సవ సంచిక.

సర్వధారి—పుష్యము జనవరి, 1949.

సంపుటము-25. సంచిక—1

# నన్నెచోడ కవికాలము

— శ్రీ జయంతి రామయ్యపంతులు

నన్నెచోడ కవికృత కుమారసంభవములోని మొదటి యేడాశ్వాసములును పీఠికతోఁ గూడ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 1909వ సంవత్సరమునఁ బ్రకటించిరి. ఆ పీఠికలో "ఇతఁడు (నన్నెచోడుఁడు) క్రీ.శ. 940లోఁ బాశ్చాత్య చాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁ డయ్యెను"— అని యొక చోటను, ఈ కృతి నన్నయభట్టుకంటె నూఱేండ్లకు పూర్వముదైనను 1000 సంవత్సరములుగా నెవ్వరును గుర్తెఱుంగక యుండఁ దటస్థింపఁ దనియు దీనిని నేనో మఱియెవ్వరో రచించి గ్రంథ ప్రాశస్త్యమున కై ప్రాచీనులపేర వ్యవహరింపఁబడె ననియు గ్రంథమును బ్రచురింపక మును పే యొక వార్త పుట్టినది"— అని మఱియొక చోటను వ్రాసి నన్నెచోడుఁడు నన్నయభట్టుకంటెఁ బ్రాచీనుఁడను నభిప్రాయము వ్యక్తపఱిచిరి. ఈ యభిప్రాయము సరియయినది కాదనియు నన్నెచోడుఁడు నన్నయభట్టుకంటె దరువాతివాఁడుగాని పూర్వుఁడు గాఁడనియుఁ గొందఱు విమర్శకులు పత్రికాముఖమునఁ బ్రకటించిరి. 1914 సంవత్సరములోఁ గుమారసంభవము యొక్క యుత్తరభాగమును బ్రకటించుచు రామకృష్ణకవిగారు పూర్వోదాహృత విమర్శనములఁ బరిశీలించి పూర్వభాగ పీఠికలోని వ్రాఁతలయందలి వేగమును గొంతవఱకుఁ దగ్గించుకొనిరి గాని నన్నెచోడుఁడు భట్టారకుని కంటె బ్రాచీనుఁడను వాదమును మాత్రము విడువలేదు. ఇటీవల శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు రామకృష్ణ కవిగారి మతము నవలంబించి యా మతమును ఖండించిన విమర్శనముల ఖండించుచు నొక వ్యాసమును రక్తాక్షి సంవత్సరాషాఢమునందు వెలువడిన "శారదా" పత్రికయందుఁ బ్రకటించిరి ఇందును గుఱించి నాయభిప్రాయమును బ్రకటింపవలయు నని కొందఱు భాషాభిమానులు కోరుటచేతను, నేనీ విషయమై కొంత పరిశోధన చేసి యుండుటం బట్టియు నింతవఱకు జరిగిన వాదప్రతివాదములఁ బరిశీలించి

నానిశ్చితాభిప్రాయమును దెలుపఁ బూనినాఁడను. ఈ పత్రికా వాదములు పుట్టకపూర్వమే యనఁగా 1910 వ సంవత్సరమున (సెప్టెంబరు నెలలోఁ గాబోలును) చెన్నపట్టణమున రాజకీయ శాఖాశాలలో జరిగిన యాంధ్రభాషాభివర్ధనీ సమాజ సాంవత్సరికోత్సవ సమయమున నేనగ్రాసనాధ్యక్షుఁడుగా నుండుట తటస్థించి యాసమయమున "నన్నయ భట్టునకుఁ బూర్వము తెలుఁగు కవు లుండిరా" యను విషయమును జర్చించుచు నాసందర్భమున నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁడు గాని పూర్వుఁడు గాఁడని చెప్పియుంటిని. కావున రామకృష్ణకవిగారి మతమును ఖండించినవారిలో నేను ప్రథముఁడనే. అయినను బట్టుదలమాని, యిటీవల జరిగిన వాదప్రతివాదములు సాధ్యమగునంతవఱకు మధ్యస్థభావముతో విమర్శించి సత్యమును నిర్ణయించుటకే యత్నించెదను.

నన్నిచోడుని చరిత్రమును దెలుపు పద్యములు మూఁడు కుమారసంభవమునందుఁ గలవు. అవి ; ప్రథమాశ్వాసములోని 53, 54, 55 సంఖ్యలు గలవి. 53వ పద్యమువలన నన్నిచోడుఁడు "పాఁకనాఁటియం దిఱువదియొక్క-వేయిటి కధీశుఁడునాఁ జను చోడబల్లికిని" "హైహయాన్వయాంబర శశిరేఖయైన గుణభాసిని శ్రీసతికి"నిఁ దనూజుఁ డైనట్టును, 54వ పద్యమువలన నతఁ "డొరయూరి కధిపతి"యుఁ "టెంకణాదిత్యుఁడు" ననియు, 55వ పద్యము వలన నతఁడు "కాశ్యపగోత్రుఁడును," "మిత్రాన్వయ శేఖరుఁడు" ననియును గనఁబడుచున్నది.

కాలనిర్ణయమునకుఁ బూర్వము కవి యేదేశమువాఁడో నిర్ణయింపవలసియున్నది. ఈ చర్చకవతారికగా చోడరాజుల వృత్తాంత మించుక విచారింతము. చోడరాజులలో నరవచోడు లనియు, ఆంధ్రచోడు లనియు రెండుశాఖలవా రున్నారు. ఈ యిరువురకును కరికాల చోడుఁ డను నాతఁడొక్కఁడే మూలపురుషుఁడు. కరికాలుని కాలమందును పిదప మఱికొంత కాలను వఱకును అరవచోడులు తిరుచునాపల్లికిఁ జేరియున్న యొరయూరను నూరు రాజధానిగాఁ జేసికొని కొంత ద్రావిడదేశమును బాలించుచుండి, కాలక్రమమున పల్లవరాజులను జయించి కంచి రాజధానిగా నొనర్చుకొని చోళదేశమంతయు నేలిరి. వారిలోఁ గొంద ఱాంధ్రదేశమునకు వచ్చి,

తొలుత కడపమండలము నందలి పొత్తపి యను గ్రామము రాజధానిగాఁ జేసికొని, తత్ప్రాంత దేశము పాలించుచుండి, క్రమక్రమముగా సముద్రపు వఱకును బ్రాకి, పలుతెగలై యొకతెగవా రిప్పుడు నెల్లూరను పేరుగల విక్రమ సింహపురమును, వేఱొకతెగవారు నెల్లూరిమండలములోని కందుకూరును, మఱియొక శాఖవారు గుంటూరు మండలమునందలి కొణిదెన యను గ్రామమును రాజధానులుగాఁ జేసికొని యాయా ప్రాంతములందలి దేశమును బాలించుచుండిరి. ఈ యాంధ్రచోడుల కిటీవల దక్షిణదేశముతో సంబంధ మేమియు లేకపోయినను తాము కరికాల వంశమువారమని చెప్పుకొనుచుండుటం బట్టి ఒరయూరు పురవరాధీశ్వర వేంకటాదిత్యేత్యాది పూర్వచోడ బిరుదములఁ బెట్టుకొనుచుండిరి. ఇది యంతయు శాసనమూలమున స్పష్టపడుచున్న నిర్వివాదాంశము. నన్నిచోడుఁడు ఆంధ్రచోడుడా? లేక అరవచోడుడా? యని విచారింపవలసి యున్నది. పూర్వభాగ పీఠికలో రామకృష్ణకవిగారు "ఇతఁడు కావేరితీరమున నొరయూరను పట్టణము రాజధానిగా గోదావరీ సింహాళమధ్యదేశము నేలెను"—అని వ్రాసి, దానిపైఁ బుట్టిన ఖండనములను విమర్శించుకొని యుత్తరభాగ పీఠికలో "ఆంధ్రచోడులు కారితకావేరీతీర కరికాల చోడవంశజు లగుటయు, నొరయూరి పురవరాధీశ్వరు లగుటయుఁ జోడశాసన విఖ్యాతాంశములు. అయినను నన్నిచోడుని వర్ణనము నించుక చక్కఁగా నాలోచించినచో నతఁ డొరయూరికే పరిపాలకుఁ డనియుఁ గేవలము కులక్రమాగత బిరుదమును బేర్కొన్న వాఁడు గాఁడనియుఁ దోఁపక మానదు-" అని వ్రాసిరి. మొదటి పీఠికలో నాంధ్రచోడుల మాటయే తలపెట్టని రామకృష్ణకవిగారు రెండవ పీఠికలో నట్టి వారున్నట్టులే గాక వారందఱు నన్నిచోడుఁడు పెట్టుకొన్న కులక్రమాగత బిరుదముఁ బెట్టుకొనుచుండి రని కూడ నొప్పుకొనవలసిన వారయ్యును జిట్టచివరి మాటలో నన్నిచోడుని రాజధాని యొరయూరే యని సిద్ధాంతీకరించుట వింతగా నున్నది. వింత యేల? పట్టినపట్టు విడుచుట కష్టముగదా!

నన్నిచోడుఁడు ద్రావిడుఁ డనుటకంటె నాంధ్రుఁ డనుటకే హేతువు లెక్కువగాఁ గనఁబడుచున్నవి. అవి యేవి యనఁగా :— (1) ద్రావిడ చోడ వంశావళిలో నెచ్చటను నన్నిచోడుఁ డను పేరుగాని, చోడబల్లి యను

పేరుగాని కానరాదు. (2) ఈనామము లాంధ్రచోళ వంశావళులలోఁ బెక్కుతావులఁ గన్పట్టుచున్నవి. (3) నన్నిచోడుఁడు ద్రావిడుఁడే యయి నచోఁ గుమారసంభవము వంటి ప్రౌఢ కావ్యము రచించుటకుఁ జాలినంత యాంధ్రభాషాపాండిత్య మలవడుట దుర్లభము.

ఆ యీ కారణంబులం బట్టి నన్నిచోడుఁ డాంధ్రచోడుఁడే యని నిశ్చయింప వలసియున్నది. రామకృష్ణ కవిగారును రెండవపీఠికలో నన్ని చోడ నామముగల శాసనములఁ బేర్కొని "వీరెల్లరును క్రీ.శ. 850 మొదలు 1210 లోగా నుండినవారు. వీరిలో నెవ్వఁడు కుమారసంభవ కావ్యకర్తయో నిర్ధారణము సేయుట సులభసాధ్యము కాదు" అని వ్రాసిరి. దీనినిబట్టి కుమారసంభవకర్త యాంధ్రచోడుఁడే యయి యుండవచ్చు నని రామకృష్ణ కవిగారొప్పుకొన్నట్లు స్పష్టపడుచున్నది కదా! నన్నిచోడుఁ డాంధ్రచోడుఁడే యనుట కిన్ని హేతువులు కనఁబడుచున్నను నాతఁ డొరయూరునందే రాజ్యము చేసెననుటకుఁ బట్టుదలయే ముఖ్యకారణము. ఈ కారణమునకుఁ గారణమైన "ఒరయూరి కధిపతి" నను నన్నిచోడ వాక్యము "ఒరయూరి పురవరాధీశ్వర" యను బిరుదమువలెనే యర్థవాదముగా గ్రహింపవలసి యున్నది. నన్నిచోడుఁ డాంధ్రుఁడే యైనను దక్షిణదేశమును జయించి యొరయూరిలో రాజ్యము చేసియుండునని రామకృష్ణకవిగారు గాని, తత్పక్షము వారుగాని చెప్పవచ్చును. కాని యట్లనుట కాధారము లేమియు లేవు. కావున సర్వ విధముల నన్నిచోడుఁ డాంధ్ర చోడుఁడనియే సిద్ధాంతీకరింపవలసి యున్నది.

ఆంధ్రచోడ శాసనములలోఁ బెక్కురు నన్నిచోడులు కనఁబడుచున్నారు. కుమారసంభవకర్త వీరిలో నెవ్వఁడై యుండునో నిర్ణయింపవలసియున్నది. పత్రికలయందు వ్రాసిన విమర్శకులు శాసనముల విమర్శించి, యొక్కొక్క రొక్కొక్క శాసనము ప్రమాణము చేసికొని యందఱు నేకగ్రీవముగా నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతి వాఁడని నిశ్చయించిరి. కీ. శే. వీరేశలింగము పంతులుగారుగూడ నిట్లే యభిప్రాయపడిరి. వీరందఱవాదములనువిమర్శించి, వీరాధారములుగాఁ దీసికొన్న శాసనములు సరిగాఁ బట్టలేదని వీరరాజుగారు ఖండించిరి. ఈ ఖండనము యుక్తియుక్తముగా నున్నదనియే నాయభిప్రా

యము. వీరు నిరాకరించిన శాసనములేవియుఁ గుమారసంభవకర్తకు సంబంధించినవి కావు. అతనికి సంబంధించిన శాసనము పెద్దచెఱుకూరు శాసనము శాసన మొక్కటియే. ఈ శాసనమును బత్రికలలో నీ విషయము చర్చించిన విమర్శకులు చూచినట్లు లేదు. రామకృష్ణకవిగారు మాత్రము చూచినట్లు వారి రెండవ పీఠికవలనఁ దెలియుచున్నది. ఈ శాసనము నాధారము చేసికొనియే 1910 వ సంవత్సరములో నేను "నన్నిచోడుఁడు నన్నయ భట్టునకుఁ బూర్వమువాఁడు కాఁడనియు, సుమారు నూఱు సంవత్సరములు తరువాతివాఁడనియు స్పష్టపడుచున్నది"—అని యభిప్రాయపడియుంటిని. ఈ శాసనము గుంటూరుమండలమునందలి పెద్దచెఱుకూరు గ్రామములో నొక వీథిలో నున్న రాతిమీఁదఁ జెక్కఁబడియున్నది. 1897వ సంవత్సరములో రాజకీయ శాసనాధికారులు ( Government Epigraphist ) సంపాదించిన శిలాశాసనములలో నిది 243 వది. దీని ప్రతిబింబము నాయొద్ద నున్నది. వీరరాజుగారు చూచినారు. ఇతరులెవ్వరైనఁ జూడఁగోరినచోఁ జూడవచ్చును. ఈ ప్రతిబింబమునుబట్టి వ్రాసిన ప్రతి యీ వ్యాసమున కనుబంధముగాఁ బ్రకటించుచు నందులోని విషయ మిచ్చట సంగ్రహముగాఁ జూపుచున్నాఁడను. కరికాలాన్వయమందు చోడబల్లినృపుఁడు పుట్టె ననియు, నతనికి నన్నిచోడుఁడు, నతనికి సూరభూపుఁడును కొడుకు లనియు. సూరభూపునకు ఘంటకారనృపుఁడను తమ్ముఁడుండె ననియు, ఘంటకారునకు చోడ మహాదేవియందు మల్లిదేవనృపుఁడును, మల్లిదేవునికి మహాదేవియందు నన్నిచోడుఁడును, నన్నిచోడునకు గంగాదేవియందు మల్లిదేవుఁడును గొడుకులు పుట్టి రనియు, రెండవ మల్లిదేవుఁడు కాకతీయగణపతిదేవునకుఁ బుణ్యముగా పరిదపూండి యను గ్రామము నిడుపుర (పెద్దచెఱుకూరు) మందలి శ్రీ భీమేశ్వరస్వామి కిచ్చె ననియు నీ శాసన మందున్నది. వంశావతార వర్ణన మయిన పిదప "స్వస్తి చరణసరోరుహ విహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల ప్రిథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకుల రత్న ప్రదీ పాహిత కుమారగజాంకుశ కంద్దుకూరి పురవరేశ్వర కాశ్యపగోత్ర పాకనాంటి విషయ ఏకవింశతి సహస్రగ్రామావనీవల్లభ భయలోభదుర్లభ సత్యరత్నాకర నామాది సమస్తశస్తిసహితం" అని రాజప్రశస్తికలదు. దానమును వర్ణించుటలో "శ్రీమ ద్గణపతి క్ష్మేశః పరిదపూండి మిమం పునః భీమేశ్వరాయ దేవాయ

ప్రాదాదాచంద్రతారకం" అని చెప్పి తిరిగి "బహుభిర్వ్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్యయస్య యదాభూమి స్తస్యతస్య తదా ఫలం ఇతి సంచింత్య మల్లి దేవచోడ మహారాజ్ఞా సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరరాజేంద్ర కాకతియ్య గణపతి మహాక్షోణీశస్య ధర్మాత్తృణం క్రీతం" అని చెప్పఁబడి యున్నది. దీనినిబట్టి దానకర్తయగు మల్లిదేవుఁడు కాకతీయగణపతిదేవరాజు నాజ్ఞకు లోపడిన సామంత రాజనియు, నా గణపతిదేవునకుఁ బుణ్య మగునట్లుగా దానము చేసెననియు దేయుచున్నది. ఈ శాసనమునం దిద్దఱు నన్నిచోడులున్నారు. అందు మొదటి నన్నిచోడుఁడే కుమారసంభవకర్తయని సహృదయులగు పండితులకుఁ దోపకమానదని నా నమ్మకము. తల్లి పేరు లేకపోవుట తప్ప శాసనమునకును గుమారసంభవములోని పద్యమునకు నన్నివిధముల సరిపోవుచున్నది. శాసనములోఁ దల్లి పేరు లేకపోవుటయొక దోషమనుకాదు. తల్లి పేరు కూడ నున్న దనుకొందము. అప్పుడు మాత్రము తల్లిదండ్రుల పేళ్ళును దన పేరును సమానములుగా నున్న వారిద్దఱుండఁగూడదా యనువాదము రాకుండునా ? కుమారసంభవ కర్త యితఁడే యనికూడ నుండిననట్టి యాక్షేపములు రాకుండునేమో? అట్టి శాసనములు లేనిచోఁ గవికాలనిర్ణయ మసాధ్య మనుకొనవలయునా? శాసనములోని మొదటి నన్నిచోడుఁడే కుమార సంభవకర్తయని నిశ్చయించి యాతని కాలము నిర్ణయింతము. దీనికిఁ బూర్వము రామకృష్ణ కవిగారి యపసిద్ధాంత మొకటిఖండింపవలసి యున్నది. పూర్వభాగపీఠికలో రామకృష్ణ కవిగారు "ఇతఁడు (నన్నిచోడుఁడు) క్రీ.శ. 840 లోఁ బాశ్చాత్య చాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున హతుఁ డయ్యెను" అని నిరంకుశముగా వ్రాసి యుత్తర భాగపీఠిక వ్రాయునప్పటికిఁ బూర్వాపర విమర్శనము కొంత చేసికొని తాము మొదట వ్రాసిన వ్రాఁత నిలువదని తెలిసికొని "ఒక నన్నిచోడుఁడు పాశ్చాత్య రాజులచే రణరంగమున క్రీ. శ. 840లో నిహతుఁ డయ్యె"నని మార్చినారు, ఇప్పుడైనను దమకా శాసన మెచ్చట లభించినదో చెప్పియుండలేదు. కావున నీ వ్రాత నిరాధారమే. ఇఁక పెద్దచెఱుకూరు శాసనకాల నిర్ణయములోనికి దిగెదము.




రెండవ మల్లిదేవుని కాలములో శాసనము పుట్టినది. శాసనకాలము చెప్పఁబడి యుండలేదు. కాని యూహించుట కాధారములున్నవి. కాకతీయ గణపతిదేవునకుఁ బుణ్యముగా మల్లిదేవుఁడు దానముచేసెను. గణపతిదేవుఁడు 1120వ శతాబ్దము మొదలు 1182వ సంవత్సరము వఱకు 62 సంవత్సరములు రాజ్యముచేసెను. కొంతకాలము రాజ్యము చేసిన పిదప నీతఁడు కమ్మనాఁడు. పాకనాఁడు జయించి స్వాధీనము చేసికొనెను; పాఁకనాఁటి చోడులందఱు నీతని కాజ్ఞావర్తులయిరి. ఈతని నాశ్రయించియే తిక్కన సోమయాజులు తన యేలికయైన మనుమసిద్ధికి రాజ్యము తిరిగి సంపాదించి పెట్టెనని సిద్ధేశ్వర చరిత్రము చెప్పుచున్నది, ఈ గణపతిదేవుని నాఁటి శాసనములు కమ్మనాఁడు నం దచ్చటచ్చటఁ గలవు. గుంటూరు మండల మందలి ఒంగోలు తాలుకాలో దయ్యాలరేవూ రను గ్రామమును "శకవర్షంబులు ౧౧౮౦ శాహి శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్య గణపతిదేవ మహారాజులు" బ్రాహ్మణాగ్రహారము నిచ్చినట్లొక శాసనముకలదు. (చూ. **Nellore Inscriptions No. 17 of Ongole**). గుంటూరు మండలములోని కొణిదెన శంకరేశ్వరస్వామి యాలయములో నున్న యొక శాసనములో "ఒరయూరి పుర వరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యపగోత్ర చెంకణాదిత్య జగనొబ్బ గండ కీర్తి నారాయణ సమస్త ప్రశస్తి సహితంబు శ్రీమన్మహామండలేశ్వర యోపిలిసిద్ధనదేవ చోడమహారాజులు స్వస్తి శకవర్షంబులు ౧౧౮౬ గు తారణ

సంవత్సర కార్తికశుద్ధ శ్రీ యేకాదశీ శుక్రవారమునం గమ్మనాంటిలోన నిజరాజధానియైన కొట్టియదొన శ్రీశంకరేశ్వర మహాదేవరకు గణపతిమహారాజునకు ధర్మముగా హావిర్బలి యర్చనలకు నంగభోగ రంగభోగాలకు సందుల మొగడ చెఱువు దేవభోగ మా చంద్రార్క-తారకము సర్వకరపరిహారముగా నిచ్చితిమి" అని యున్నది. ఈ శాసనము 1899వ సంవత్సరములో శాసనాధికారులు సంపాదించిన శిలాశాసనములలో 183వది. వీనినిబట్టి మూడ పెద్దచెఱుకూరు శాసనము 1140-వ శతాబ్దప్రాంతమునని యూహించుట యాక్షేపార్హముగానుండదు. రెండవ మల్లిదేవునకును మొదటి నన్నిచోడునకును, నడుమ నాలుగు తరములుగలవు. చరిత్రకారులు తరమున కిరువదియైదు సంవత్సరముల లెక్కను గణింతురు. రెండవ మల్లిదేవుఁడు శ 1140-వ సంవత్సర ప్రాంతమువాఁ డైనచో ప్రథమ నన్నిచోడుఁడు శ 1040 వ సంవత్సర ప్రాంతమువాఁ డగును. అనఁగా నన్నయభట్టారకున కించుమించుగా నూఱేండ్లీవలివాఁ డగును. ఇతర శాసనముల నాధారము చేసికొని వ్రాసినవారి సిద్ధాంతముకూడ నించుమించుగా నిదియే. ఘట్టకుటికా ప్రభాత న్యాయముగా నెట్లు చూచినను నన్నిచోడుఁడు నన్నయభట్టునకును తిక్కన సోమయాజులకును నడిమివాఁడని తేలుచున్నది. ఇదియే సిద్ధాంతము

శాసన సాహాయ్యముచేత నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వము వాఁడని రుజువు చేయఁజాలక, రామకృష్ణకవిగారు "ఇఁక నన్నిచోడుఁడు నన్నయ భట్టాదులకంటెఁ బ్రాచీనతరుఁడని కుమార సంభవములోని వ్యాకరణచ్ఛందో విశేషపూర్వ పదప్రయోగములు సహస్రముఖముల ఘోషించుచున్నవి" అని ద్వితీయ పీఠికలో వ్రాసిరి, దీని కనుగుణముగా వీరరాజుగారును "ఒక కవికాలమును నిశ్చయించుటకు నిరాపేక్షములైన శాసనాది దృష్టాంతము లెవ్వియు లభింపనినాఁడు, అతని కవిత్వమునుబట్టి యాతనికాలమును నిర్ణయింపవలసియుండు ననుట చారిత్రక వేత్తలకు నూత్న విషయము గాదు. ఇప్పు డద్దానింబట్టి యాఁత డెప్పటి వాఁడై యుండునో కనుగొందము" అని వ్రాసి కుమార సంభవమునుండి కొన్ని భాగముల నుదాహరించి వానినిబట్టి నన్నిచోడుఁడు నన్నయభట్టుకంటె ముందువాఁడే యని నిర్ణయించుకొనిరి. గ్రంథభాషనుబట్టి గ్రంథకాలము నిర్ణయించుట సత్సం

ప్రచ్ఛాయమే. కాని యా భాష గ్రంథకర్త ప్రయుక్తమనఁదగినదిగా నుండ వలయును. అట్టి నమ్మకము లేనిచో నా భాష ప్రమాణము కానేరదు. రామకృష్ణకవిగారచ్చు వేయించిన కుమారసంభవము భాష కొన్ని కొన్ని తావులందుఁ గవిప్రయుక్తమయినది కాదేమో యని యనుమానింప నవకాశము కలదు. గ్రంథమునకు మాతృక యేదియో ప్రథమభాగ పీఠికలో రామకృష్ణ కవిగారు చెప్పియుండలేదు. ద్వితీయభాగ పీఠికలో "కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీన శాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధ ద్రవిడదేశముననే యగపడియె" నని తమకు మూఁడు ప్రతులు దొరికినట్లు వ్రాసిరి. కాని యేయే గ్రామములం దేయే గృహస్థులవలన నేయే ప్రతులు లభించినవో తెల్పనైరి. ఆ ప్రతులు కావలసినవారు జూచుట కవకాశము కలుగునట్లు రాజకీయ పుస్తక భాండాగారమునందుఁగాని, యాంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము నందుఁగాని, వానిని బోలు మఱియొక పుస్తకాలయము నందుఁగాని యుంచవలసి యుండెను. అట్లును జేయలేదు.

లోకమంతకుఁ దెలిసిన తాటియాకు ప్రతియొకటిగలదు. అది తంజావూరు మహారాజా సర్ఫోజి సరస్వతీమహాలులో నున్నది. దీనికిఁ బ్రతియొకటి రామకృష్ణ కవిగారు వ్రాయించుకొన్నా రనుట నిశ్చయము. అట్టిచో రామకృష్ణకవిగారీ ప్రతిని స్మరింపక పోవుటకుఁ గారణమే మున్నదో తెలియదు. తంజావూరు పేరైనను రామకృష్ణకవిగారు తలపెట్టలేదు. తంజావూరు ప్రతికిని, రామకృష్ణ కవిగారి ప్రతికిని బాఠ భేదములు పలుతావులఁ గనఁబడుచున్నవి. వానిలోఁగొన్నిటి నుదాహరించెద.

1. 1 ఆశ్వాసము. 2 పద్యము.

"హరుఁ డాదిగ సకలచరా,
చరమయ్యజీవాళి నెల్ల సతతము గామా
తురులుగ వలగతిఁ జేసిన,
మరుఁ డీవృత్త మ్మఖిల వశ్యమతి మత్కృతికిన్"

—రా. కృ. పాఠము.

మూఁడవ పాదమునందు "వళగతి" యని తంజావూరి పాఠము.

2. 1 ఆశ్వాసము. 14 పద్యము.

"శ్రీపీఠంబున నిడుతన
శ్రీపాదుకలందు వ్రాలి సేవించెదనేఁ
బాపహతిఁ జెప్పి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జునదేవున్"

—రా. కృ. పాఠము

"శ్రీపీఠంబున నిడుకొని,
శ్రీపాదుక లర్చలిచ్చి సేవించెదనేఁ
బాపహతిఁ జేసి పుణ్యం,
బాపాదింపంగ మల్లికార్జునదేవున్."

—తం. పాఠము.

3. 1 ఆ 23 పద్యము.

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్ర విషయమునఁ
జన సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్.

—రా. కృ. పాఠము

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్"

—తం. పాఠము.

4. 1 ఆ. 41 పద్యము.

"మదపుున సత్కవి కావ్యము,
నదరఁగ విలుకాని పట్టినమ్ము̃ను బరహ్మా
ద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మలరి పట్టినదియుం గరమే."

—రా. కృ. పాఠము.

నాలవపాదమునందు – "యది కావ్యమె మఱియుఁ బట్టినదిర
స్మరమే."

—తం. పాఠము.

5. 4 ఆ. 93 పద్యము.

"నలి మొగ్గలు విరిపువ్వులు,
సలలిత మయి చూడ నొప్పెఁ జంపకమృత్యూ
జ్వలరుచి రేవగ లూరక,
వెలిగెడు నుద్దీప దీపవృక్షము వోలెన్."

—రా. కృ. పాఠము.

"వలిమొగ్గల విరిపువ్వుల,
సలలితమయి చూడనొప్పెఁ జనుపక (జంపక) మత్యూ
జ్వల రుచి రేవగ లారక
వెలిగెడు నుద్దీపదీప వృక్షము వోలెన్.

—తం. పాఠము.

6. 10 ఆ. 149 పద్యము.

"వడిఁ బ్రిదిదశాలి నోర్చు డొక వావిరి బీరముగాఁగ రజ్జు చె
ప్పుడు నది నీవు చేసిన తపోవిభవంబున నబ్జగర్భుచేఁ
బడసిన విద్య గాక........................"

—రా. కృ. పాఠము.

"పడిఁ ద్రిదశాలి నోర్చు డొకవావిరి బీరము గాఁగ రజ్జు చెప్పుడునది."

—తం. పాఠము.

7. 10 ఆ. 153 పద్యము.

"వీం డేమి సేయుఁ బంచిన
వాం డుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
ఖండలుఁడు గాక యేలన
వాం డుండగ నేమిసేయు పరికరమనిలోన్."

—రా. కృ. పాఠము.

"వీం డేమి సేయుఁ బంచిన,
వాం డుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
ఖండలుఁడు గాక యేసిన
వాం డుండఁగ నేమి సేయు వరశర మనిలోన్."

—తం. పాఠము.

8. 12 ఆ. 42 పద్యము.

"నిరుబుతి వారిమాయల కనిం బ్రతిమాయ లొనర్చి"

—రా. కృ. పాఠము.

"నిరుతి (యు) వారిమాయల కనిం బ్రతిమాయ లొనర్చి"

—తం. పాఠము.

ఇట్టి భేదము లనేకము లున్నవి. కొన్ని తావులందు తంజావూరి ప్రతి లోఁదప్పులుగాను సంశయాస్పదములుగాను నున్న పాఠములు కవిగారు సవరించినారు. కాని సవరించిన భాగములకు గుఱుతు లేవియులేకపోవుటచే మూలపాఠము లెవ్వియో కవిగారిపాఠము లెవ్వియో తెలిసికొనుట కాధా

రములు లేకున్నవి. కొన్నిచోటుల మూలమందున్న చక్కని పాఠముల నెఱిఁగియో యెఱుఁగకయో కవిగారనవసరముగా మార్చినారు. ఈ పాఠాంతరముల నితరప్రతులనుండి తీసికొని రనుకొనుట కట్టిప్రతు లున్నవనుకొన్నను నే ప్రతిలో నే పాఠమున్నదో కవిగారు సూచింపలేదు. మనకువలెనే కవిగారికిని తంజావూరు ప్రతి యొక్కటిమాత్రమే లభించి యుండునని యూహించుట కొక హేతువు కనఁబడుచున్నది. తంజావూరు ప్రతిలో నేకాదశాధ్యాయమందు నలువదియాఱవ పద్యము పిదప నిట్లున్నది.

వృ. తనకని దాఁప కర్థికి సుధామయ పక్వఫలంబు లిచ్చునో
లిన కొనుకాలి వహ్నికిఁ జలింపక మార్కొన నిల్చి కాలు నీ
మనుజులు కొంద ఱాయడవి భ్రూఁసుల కంటెను కష్ట మర్థి వెం
చుం జాగియు నేననియ తలంచు లోభి యెప్పుడు ననికిన్.

క. జాననియ తలఁచు వీరుఁడు
పాననియ తలంచుఁ బంధ సరిపెట్లకునున్"

ఇందు మొదటి మూఁడును జంపకమాలా వృత్త పాదములు. తక్కినవి కందపద్య భాగములు. రామకృష్ణకవిగారికి నింతమాత్రమే దొరకినదిగాని లోపించిన భాగములు దొరకలేదు. వేఱువేఱు ప్రదేశములందు దొరకిన మూఁడు ప్రతులలోను నొక్కచోటనే లోపము లుండుట చిత్రము.

ఈ కారణములంబట్టి రామకృష్ణకవిగారి పాఠము లన్నియుఁ బ్రమాణములు కానేర వని చెప్పవలసి యున్నది.

నన్నయాదుల కవిత్వమునకుఁ గూడ నీ దోషము పట్టియే యున్నది. కావునఁ బాఠములఁ జక్కఁగఁ బరీక్షించి కవిప్రయుక్త పాఠము లనఁదగిన వానిని మాత్రమే ప్రమాణములుగా గ్రహింపవలసి యున్నది. అట్టి పాఠము లున్నను నన్నిచోడుఁడు నన్నయభట్టారకుని కంటెఁ బూర్వుఁ డని చెప్పఁ జాలవు. రామకృష్ణకవిగారును. వీరరాజుగారు నుదాహరించిన ప్రయోగములు నన్నిచోడుఁడు ప్రాచీనకవి యనుటకే పనికివచ్చునుగాని యాతఁడు నన్నయభట్టుకంటెఁ బూర్వుఁ డనుటకుఁ బనికిరావు. నన్నిచోడుఁడు ప్రాచీన

కవి కాఁడను వారెవరును లేరు. ఆతఁడు ప్రాచీనకవియేగాని నన్నయభట్టు నకుఁ దరువాతివాఁడు ; తిక్కన సోమయాజులకు ముందువాఁడు.

## అనుబంధము

[గుంటూరు జిల్లా పెద్ద చెఱుకూరు గ్రామములో నొక వీథిలోనున్న రాతి మీఁది శాసనము] (243 of 1897)

స్వస్తి శ్రీ స్తనచందన
లిప్త శ్రీ శస్త దియ్యా
నాభ్యాజ్జాతో జగతి
లతికా బీజం బ్రహ్మ
బ్రాహ్మీపతిస్సోభూత్॥
దానశౌర్యైః గుణౌక
స్వం నిరూపయన్నివా
త్మనః। తస్యతాద్రిగ్విధా
దంగాద్దోర్ద్వైయాత్క్షత్రియా
న్వయః। తత్రసూర్యాఖ్యా
న్మను స్తస్మాదిక్ష్వాకు స్త
త్కులేన్రిపః। అదేవీత్క
రికాలాఖ్య చోడ స్త
స్యాన్వయే జని। చోడ
బల్లిన్రిప స్తస్మాన్నన్నిచోడ
స్తదాత్మజః। సూరభూప।
స్సుత స్తస్య రాజరాజమహీ
పతిః। తస్యానుజో ఘటంకార
న్రిపోహంకార శంకరః। తస్య
చోడమహాదేవీ ప్రియాంత
త్తనయోన యీ। మల్లిదేవ
న్రిపోయ త్త్రిజాత్రధర్మాన్ న్స
లియ్యతా। తస్యకాంతామహా
దేవీ నన్నిచోడ స్తయో స్సుత
ః। న్యగ్రహీ దుగ్రవీరారీ న్యగ్ర
హీద్విజయశ్రియం॥ గంగాదే
వీప్రియాతస్యయాదేశమ
తిచక్రమే। తాభ్యాం భూచక్ర
శక్రో భూన్మల్లి దేవ మహీశ్వరః।
ధర్మసంస్థాపనార్థాయ గాం(ం)
గేయః కలియుగే పునః॥ స్వ
స్తి చరణ సరోరుహ విహితవి
లోచన త్రిలోచన ప్రముఖా
ఖిల ప్రిథివీశ్వర కారిత
కావేరీతీర కరికాలకుల
రత్నప్రదీపాహిత కుమార
గజాంకుశ కంద్దుకూరిపు
రవరేశ్వర కాశ్యపగోత్ర పా
కనాంటి విషయ ఏకవింశ
తిసహస్రగ్రామావనీవల్ల
భభయలోభ దుల్లభ సత్య
రత్నాకరనామాది సమస్తప్ర
శస్తిసహితం శ్రీమన్మహా మ
ండలేశ్వర మల్లి దేవచోడ మ
హారాజ్ఞాపురాణన్యాయమీమా
ంసాంగ మిశ్రశతవేద ధర్మశాస్త్రా

యువ్వేన దాద్వ్యష్టాదశ విద్యాస్థా
న స ప్తశతోత్తర సహ
స్రభాగపరిపూర్ణ న స
ప్తశతాగ్ని హోత్రాలంకా
రైవమాదిగుణగ
ణశోభితేషు గ్రామా
గ్రహార శ్రీవర్ధమా
నాయ శ్రీభీమేశ్వర
దేవాయ అంగభో
గార్థం దగ్గాంబికా
నందనేన మారాయ
నేన పూర్వన దత్త ప
రిదపూండి నామ
గ్రామోష్ట దిక్సీమ స
హిత స్సర్వన కరిపరి
హార మాచంద్రార్కనంద
త్తః తత్కాలీన రాష్ట్రకూ
టప్రముఖాన కుటుం
బిన స్సమాహూయే
త్థ మాజ్ఞాపయతి వి
దితమస్తువః శ్రీమ
ద్గణపతిక్ష్మేశః ప
రిదపూండి మిమం
పునః భీమేశ్వరాయ
దేవాయ ప్రాదాదాచ
ంద్రతారకం । బహు
భిర్వసుధాదత్తా బ
హుభిశ్చానుపాలితా
యస్యయస్యయ
దా భూమి స్తస్యత
స్య తదా ఫలం ఇతి
సంచింత్య మల్లి దేవ
చోడమహారాజ్ఞాస
మధిగత పంచమహా
శబ్దమహామండలేశ్వ
ర వీరరాజేంద్ర కాక
తియ్యగణపతి మహా
క్షోణీశస్యధర్మానత
ంకితం । స్వ దత్తాద్వి
గుణం పుణ్యం పర
దత్తాను పాలనం
పరదత్తాపహారే
ణ స్వదత్తంనిష్ఫల
ంభవేత్ ॥స్వదత్తాం (౦) పర
దత్తాంవాయోహరేత
వసుంధరా (౦) షష్టిర్వన్షన
సహస్రాణి విష్టాయాం
(౦) జాయతే క్రిమిః॥

—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 13. సంచిక 3-4.
(రక్తాక్షి-శ్రావణ-కార్తీక) (1925.

# తిక్కన కావ్య నిర్మాణ వైభవము

—శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి

తిక్కన కావ్య నిర్మాణ వైభవ మనఁగా నదియొక అఖండ శబ్ద ప్రపంచ సృష్టి-ఊహాతీత భావనా ప్రపంచ చైతన్యము - హృదయోన్నిద్ర కళానుభూతి పరమార్థము. కొందఱు దాని బాహ్యసౌందర్యముగ్ధులై విస్మయ వికచనేత్రములతో దూరదూరాన నిల్చినవారు పోఁగాఁ, గొందఱు లోనికిఁ జొచ్చి పదపదార్థ నిర్వచనముతో, భావతాత్పర్య ప్రవచనముతో ధన్యులైనవారును గలరు. కాని, దాని ఆంతరిక సౌందర్య సాక్షాత్కారముఁ బొంది యానందానుభూతి నందినవారెవరో-మహానుభావులు! ఎందు కనఁగా: ఆయానందానుభూతి వాక్కుల కందరానిది. ఆ కావ్యదివ్య జ్యోతి బ్రహ్మసాక్షాత్కార సధ్రీచీనమైనది. సాధకులు-ఉపాసకులు తమతమ యనుభూతి విశేషములను దెలిపినట్లె నేనును ఒక కోణము నుండి నేఁగన్న విశేషములు మనవి చేయుదును.

లోక వ్యవహారమునఁ దిక్కన సాంగవేదాధ్యయనముఁ జేసినవాఁడు. క్షుణ్ణముగా శాస్త్రములు చదివినవాఁడు. మనుమసిద్ధి యాస్థానమునఁ బండితుఁడు. మహామంత్రి. ఇంతేకాదు- అవసరమైనచోఁ గవచఖడ్గధారియై రణరంగముల వీరవిహారముఁ జేసిన సేనాపతి యనియుఁ గొందఱందురు. ఒకప్పుడు మనుమసిద్ధి రాజ్యముఁ గోల్పోవఁగా కాకతి గణపతి రాజు సాయముచే ఆతనిని రాజ్యపునః ప్రతిష్ఠితునిఁ జేసిన రాజనీతికోవిదుఁడు. కవియై నిర్వచనోత్తర రామాయణము రచించి, కృతికన్యను మనుమసిద్ధి కొసఁగి, ఆ మహారాజుచే వియ్యపు మర్యాద లందుకొన్న మామ. శిష్యుఁడై మార్కండేయ పురాణము రచించిన మారనతో గురు విద్యా వంశమునకు ఆనృణ్యము సంపాదించుకొన్న దొడ్డగృహస్థు. సారస్వత పోషణ భారము వహించిన యానాఁటి భూనాయకుల భుజస్కంధములకు విశ్రాంతి నొసఁగుచుఁ, దాను కృతికర్త యగుటయే కాక, కేతన దశకుమార చరిత్ర

మునకుఁగృతి భర్తయై మారనాది శిష్య ప్రశిష్యుల ద్వారా సారస్వతాభి వృద్ధి సేయుచున్న కులపతి. ఇంత మాత్రమేగాక యజ్ఞముఁజేసి సోమయాజియై భారతామ్నాయము నాంధ్రీకరించిన వైదిక కవి.

కొందఱు సంస్కృతాంధ్ర మహాకవుల ఇయత్త కొలిచి చెప్పుటలో "నన్నయ లిఁకఁబుట్టరు-తిక్కనలు మరలఁ బుట్టవచ్చు" నన్నారు. మఱి కొందఱు "కాళిదాసే భారత మాంధ్రీకరించి యున్నచోఁదిక్కన స్థానమేది?" అని పరీక్షించుచున్నారు. ఇఁక గొందఱు "వాల్మీకి రామాయణ రచనము చేతఁబట్టుటతో వ్యాసునకు -తదను యాయి తిక్కనకు ఊరు పేరులు దక్కిన" వందురు కొందఱు. "అసలు వ్యాసుని పెట్టుబడి లేనిచోఁ దిక్కన బండాల మెంతటి" దని పెదవి విఱుచువారును గలరు. వారివారి యూహాలలో నేదో యొక కొలబద్ద-ఒక మానపాత్ర ఉండకపోదు. కాని, ఇదంతయు అభిరుచి భేదమనుట యుక్తము. కాకున్న ఎవరెవ రేమి తక్కువవారు: మన కందఱును బూజ్యులే. తీరికయు, నోపికయుఁ గలవారు తారతమ్య పరీక్ష చేయుచుందురు గాక. మనము తిక్కన కావ్యానంద రసానుభూతి నందుకొందము. అయినను ఇక్కడ నొక్కమాట చెప్పక తప్పదు. కావ్య నిర్మాణము నెవరెవ రెట్టి సామగ్రితో, నెట్టి విలక్షణ సరణితో, నెట్టి ప్రత్యేక శక్తులతోఁ దీర్చినను, దత్కావ్య పరమ ప్రయోజనము ప్రజా హృదయము లందే ఫలింపవలె ననుటలో నెవరికి నభిప్రాయభేదముండ దనుకొందును. ఆ దృష్టితోఁజూచినచో సంస్కృత కావ్యముల నట్లుంచి తెనుఁగు పొత్తములలోఁ, దిక్కన భారతమువలెఁ దెలుఁగువారి డెందములలో ఇంత సుస్థిరముగ, నింత సుప్రతిష్ఠితముగఁ బీఠము వేసికొన్నది మఱొకటి యుండదని అనుభవ పూర్వకముగఁ జెప్పవచ్చును. ఎందుకనఁగా: ఇన్ని శతాబ్దముల తేరబడి యెన్నో ఒడుదుడుకులతోఁ గడచిన యీ కాలములో నేఁటికిని ప్రజాహృదయ ములలో నేదో యొక మెత్తని చోటఁ జల్లఁగఁ దావుచేసికొని కూర్చుండి వారి నూరడించుచు, ఉత్సాహ పఱచుచు, దారి చూపుచు, ధార్మికనిష్ఠఁ గఱపుచుఁ, జెదరక నిలఁబడి యున్నదిక దా తిక్కన భారతము! "వింటే భారతము వినవలె-తింటే గారెలు తినవలె" అను నీ సామాన్య లోకోక్తిగూడ నీ విషయము నెంత విస్పష్టముగనో చాటుచున్నది. ఇంతకుఁ దేలిన సార

మేమనఁగా-లోకశాస్త్రకళా జీవన రహస్యములను విజ్ఞాన వివేక మందర ముతో మథించి, ప్రజాభద్ర జీవితమునకు శాశ్వతముగా నమృతకలశము నందించిన ఆ మహాకవి మనకుఁ ద్రికాలముల యందు నారాధ్య మూర్తి. ఈ మహత్త్వము ఆయనలో-ఆయన యుభయ కవి మిత్రతలో-ఆయన హరిహరోపాసనా తాత్పర్యములో-"ఆంధ్రావళి మోదమున్ బొరయ" కావ్యనిర్మాణము చేయుటలో నిమిడి యున్నది.

ప్రకృతము కావ్యమును గూర్చి కొంత ముచ్చటింతును. నేఁడు మన నిత్య జీవితావసర వస్తువులలోఁ గావ్యమున కే సామాన్య స్థానముగాని, ఆవశ్యకతగాని యున్నట్లు కనఁబడదు. ఎందుకనఁగా, అది లేకున్న మన ఆహార విహారాదు లేవియుఁ గుంటుపడుట లేదు. కనుకనే వాని ఉత్పత్తి వినిమయములఁ గూర్చియు, ఎగుమతి దిగుమతులఁ గూర్చియు, ధరలు నియమించి యందించుటఁ గూర్చియు ఏ ప్రభుత్వముగాని యెట్టి చర్యయుఁ దీసికొనుట లేదు. ఉప్పుతో ముప్పది ముప్పది వస్తువులకు నింతగా ధరలు పెరిగిన యీ రోజులలో మన కావ్యపు సరకునకు చిగురు కదలినంత చలనము గాని, జీవము గాని యున్నట్టు లేదు. కడకుఁ దెల్లకాగితము కావ్యముద్ర పడుటతోఁ గరుడు కాగితమై పాతికపలక బేరాలకుఁ ఘాల్పడుచున్నది. కాని, యిప్పుడిప్పుడు కొందఱు పెద్దలు ఈ కావ్యపు సరకును అక్కఱ వస్తువుగాఁ దయారు చేయుటకును, దానికి ఒక పాటిగానైనా బజారు విలువ కట్టించుటకును బాటుపడుచుఁ బ్రజాభ్యుదయమున కొుందడుగు వేయు చున్నారు. ఇది సంతోషింపఁదగిన విషయము-కాలధర్మము కూడ! 'రాజా కాలస్య కారణం' కదా!

మన కీనాఁడు ఒంటఁబట్టిన విజ్ఞానమును జూడఁగా అన్నవస్త్రములు కొఱత పడకుండ ఆహారవిహారాదు లనుభవించుటే యానంద మనుకొన్నట్లు తోఁచును. కాని, ఇదే సర్వమార్గమనలేము. ఈ మాత్రపు జీవనము ప్రాణిసామాన్యమైనది. మానవుఁడు తక్కిన ప్రాణులవంటి వాఁడు కాఁడు. ఉత్తముఁడు. ఆ యుత్తమత్వ మాతని యవయవ నిర్మాణమునందే గోచరించుచున్నది. ఆతని కార్యములయందుఁబరిస్ఫుట మగుచున్నది కూడ. కనుకనే అతనిది ప్రాణులలో నుత్తమశ్రేణి. ఆ శ్రేణిలోనైత మాతని

యుత్తమ స్థానము దైవత్వమునకుఁ బ్రతినిధి. ప్రతినిధి యేమి-అగోచరమగు దైవత్వమునుగూడ నచ్చటనే చూడఁగలము. అట్టి మానవుని జీవిత విహారపరిధి అన్నమయ ప్రాణమయ మనోమయ కోశముల వఱకే నిలిచి యుండదు. కనుకనే అతనికి బాహ్యజగత్తుతోపాటు ఆంతరిక జగత్తేదో యొకటి ముఖ్య నివాసముగ-ఉచిత కార్యస్థానముగ - నిత్యవిహారభూమిగ నుండక తప్పదు. ఈ బాహ్యాభ్యంతర జగత్తుల కేదో యొక రాచబాట వేసి, పూలపాన్పు పఱచి, ఉచిత సంవిధానములతో రెండు జగత్తులను భాగ్యవంతములఁజేసి, అచ్చటఁ బరిపూర్ణ మానవత్వమునో - దైవప్రాతినిధ్యమునో సుకుమారముగఁ బ్రతిష్ఠింపఁ గలదేదో అది కావ్యజగత్తు. ఆ కావ్య జగన్నిర్మాతలే కవి బ్రహ్మలు

ఈ కావ్యజగత్తున భౌతిక ప్రపంచమందు వలెనే యెన్నో పట్టణములు, పల్లెలు కలవు. మహారణ్యములు, దివ్యోద్యానవనములు గలవు. మహోన్నత పర్వత శ్రేణులు-చిన్నగుట్టలు, దివ్యవాహినులు, అల్పసరస్సులు, రాలగనులు, రత్నాల గనులు-ఇట్లే ప్రకృతి సంభార సర్వస్వ మంతయుఁ గలదు. వీనిని వేద వేదాంతము మొదలు వీధిభాగవతము వఱకుఁ బోల్చుకొనవచ్చును. భేద మొక్కటియే. అది తైజస ప్రకృతి-ఇది భౌతిక ప్రకృతి. మానవ జీవిత సౌభాగ్యమునకు వలయు పదార్థజాతము నంతయు రెండు జగత్తులలోని ప్రతి యొక మూర్తియు యథాసంభవముగఁ దయారు చేయుచున్నది-యథార్థముగ నందించుచున్నది. శివుని జటాజూటమునుండి దిగజాఱిన భాగీరథీ ప్రవాహమువలె వేదశిరస్సుల నుండి జాలు వాఱిన విజ్ఞానరస తరంగిణి స్వర్గ మర్త్య పాతాళముల నాక్రమించి, తాను మెట్టిన చోటు పునీతముగఁ బుష్కల జీవన సంపన్నముగఁ జేయుచున్నది. కాని, యీ రెండు జగత్తుల యందును మురికి గుంటలను, మఱుగు దొడ్లను గట్టిన వారుండక పోరు-ముండ్ల పొదలును, ముష్టిపండ్లును లేకపోవు. వానివాని యౌచిత్య మెఱిఁగి వాడుకొనుటే మనము చేయవలసిన పని.

ఇట్టి కావ్య జగన్నిర్మాణమును గూర్చి మన ప్రాచీను లిట్లు పలికి యున్నారు : "నియతి కృత నియమ రహితాం హ్లాదైకమయీ మనన్య పర తంత్రాం, నవరసరుచిరాం నిర్మిత మాదధతీ భారతీ కవే ర్జయతి"—ఇందు

లోని "నియతి కృతనియమరహితాం-హ్లాదైకమయీం" అనుపదములఁ బట్టి కొందఱు 'కావ్యరచనఁ గూర్చి నియమ మక్కఱ లేదనియు, 'ఆ కావ్య మానందైక ప్రయోజన' మనియుఁ బలుకుట వినుచున్నాము. కాని "దీని యర్థమిదేనా ? ఇది యనుభవమునఁ గుదురునా" యని నాసందేహము. నియమము-తాను గల్పించుకొన్నదో, యితరులు కల్పించినదో, యేదైనఁగావచ్చు-అట్టి దేదియు లేక తాను నడుచుకొనుచున్నాఁడా ? తనయింటిలో నైనఁ-గేవలము తన్నుఁ గూర్చియైన నేనియమము లేక నడువఁ గలఁడా? కడకు 'నియమ మక్కరలే'దను నియమమైన నతని నంటుకొని యుండలేదా ? "ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" అన్న గీతావాక్యమున కర్థమేమి ? ఈ వాక్యమును బలికిన గీతాచార్యుని వలెఁ దాను ప్రకృతి విజేత యైనపుడు కూడఁ బరహితము సాధించుట కొఱకైనఁ బ్రకృతి నియమ మంగీకరింపక తప్పదు కదా! కావ్య మానందైక ప్రయోజన మనుటలో సత్య మున్నది. కాని, ఆయానంద మేది? ఎవరికి? - శ్రేయఃప్రాప్తి ఆనందము. అది విశ్వప్రజకు, అందులో నొకఁడైన తనకుఁ గూడనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. 'కావ్యము నాయానందమునకే - ఇతరులతోఁ బని లేదని యెవరైన ననవచ్చును. కాని అది భారతీయ సంప్రదాయము కాదు. ఏ సత్కావ్యపఠనము-ఏ సారస్వతగోష్ఠి జరిగినను ముగింపునందు "స్వస్తి ప్రజాభ్యః.........లోకాః స్సమస్తా స్సుఖినో భవంతు" అని ఫలశ్రుతి చెప్పుట నేఁటికిని ఖిలముగాని యాచారము. "విశ్వ శ్రేయః కావ్యమ్", "కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యఃపర నిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే"—ఇత్యాదిగఁ బెద్దల సూక్తులు ఈ విశిష్ట ధర్మమునే బోధించుచున్నవి. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్"—ఈ నిషేధవాక్యము సంప్రదాయ విరుద్ధమైన యసత్కావ్య విషయమని వ్యాఖ్యాతలు వివరించి యున్నారు. ఈ విధమున మానవజీవిత వివిధమార్గములలో దివ్యజ్యోతులు వెలిఁగించి వారికిఁ దుష్టిపుష్టి నిర్వాణముల సమకూర్చు నుత్తమకావ్యములు సముద్రప్రయాణమున దిక్సూచిక దీపస్తంభములవలె నక్కడక్కడ నొక్కొక్కటియైన స్థిరముగ నిలిచి యుండుట యెంతయేని యావశ్యకము. ఈ పరమార్థమును భావించియే మన తిక్కన భారతాంధ్రీకరణమునకు గంటముఁ బట్టినాఁడు.

"భారతము కావ్యమా? ఇతిహాసము గదా ! అందులోని బంగారము వ్యాసమహర్షిది కదా-తిక్కన దేమున్నది?" అని కొందఱనవచ్చును. దీనిని విమర్శించు కొందము. ఒకవిధముగ వేదములు మొదలుకొని సారస్వతభాగములన్నియు కావ్యములే. దాని వ్యుత్పత్తియే యాభావమును దెల్పుచున్నది. అధికారమును బట్టియు, వంతస్సారమును బట్టియుఁ, బ్రవచన పద్ధతిని బట్టియు వేదములనియు, శాస్త్రములనియుఁ, బురాణములనియుఁ, గావ్యములనియుఁ బలురకములుగఁ బెద్దలు ప్రత్యేక నిర్వచనముఁ జేసియున్నారు.

> "యద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
> యచ్చార్థ ప్రవణాత్ పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
> కాంతా సమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
> కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్మై నమస్కుర్మహే".

వేదము శబ్దప్రధానమై ప్రభుసమ్మిత మైనది. పురాణము అర్థప్రధానమై సుహృత్సమ్మిత మైనది. కావ్యము భావప్రధానమై కాంతాసమ్మిత మైనది. ప్రభువువలె శాసింపక, మిత్రునివలె సలహా నిచ్చి, యూరకుండక, కాంతవలె సుకుమారముగ మనసు గరగించి, మానవుఁడు తనకుఁ గానే కర్తవ్యమునకుఁ గడంగునట్లు ప్రేరేచునది కావునఁ గావ్యమొక్కటే యుత్తమ మని పెద్దలయాశయము. భారతము వ్యాసుని తక్కిన యష్టాదశ పురాణములవలెఁ గాక విశిష్టమైన యితిహాసమై యతని రచనయందే కొంత కావ్యత్వమును దక్కించుకొన్నది. "మహత్త్వాత్ భారవత్త్వా చ్చ" మహాభారత మైనది. భారతమును గూర్చి నన్నయ భట్టారకుఁడు "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మ విదులు వేదాంత మనియు, నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్య మనియు, లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, ఐతిహాసికు లితిహాస మనియు, పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయం బని"......కొనియాడిన భారతమును బరాశరాత్మజుండు విశ్వజనీనమై వరగునట్లు చేసినాడని ప్రశంసించినాఁడు. ఇంతటి యుత్తమ సాహిత్యమును నా తెలుగువారికి తంగేటిజున్ను చేసి బంతి విందులు పెట్టెద

నని నడుముగట్టి, సముద్రమున కేతము నెత్తిన ఆ వాగనుశాసనుఁడు మనకు ప్రథమారాధ్యుఁడు. ఆమహా భాగుని శుభారంభనుచేతనే తెనుఁగునకు భారతవర్షీయ భాషలలో భారతమును ప్రథమముగా నవతరింపఁ జేసికొన్న గౌరవము దక్కినది. రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుఁడును, అవిరళ జపహోమ తత్పరుఁడును, సంహితాభ్యాసుడుఁను, నానాపురాణ విజ్ఞాన నిరతుఁడును అయిన ఆ ప్రథమాచార్యుఁడు తన సహజగంభీర గీర్వాణశైలీ పరిణతమైన రచనతో వ్యాసభారతమును తెనుఁగున మనకు నితిహాసముగానే ప్రసాదించినాఁడు. మూఁడు పర్వములతో ముగియక ఆగింటమే అష్టాదశ పర్వములను నిర్వహించి యుండినచో నెట్లుండెడిదో ! కాని, భారతమును గావ్యముగాఁ జదువు భాగ్యము తెలుఁగునాఁడు నోచినది. దానిపై కవి బ్రహ్మ యవతరించినాఁడు. అప్పటి తెలుఁగుబాస అమృతసేచనముసఁగాని నవలు కొనలుసాగుచుఁ దెలుఁగుఁదనము నలువైపుల గుబాళింపఁజేయఁ జాలినది కాకుండెను. ఆనాఁడు ఊరికొక దొరయై గడియకొక గండమై యుడికిపోవు ప్రజాహృదయముల నూరార్చుటకును, ఉత్సాహపఱచుటకును, భవిష్యన్మార్గము భాగ్యవంతము చేయుటకును చక్కని చిక్కని తెనుఁగు దనముతోడి జాతీయ రచన ఎంతయేని అవసరమైయుండెను. ఇంతయుఁ దడవికొనుచుఁ దీవ్రతపస్సులోఁ దెలుఁగు నుడికారములఁ గరగిపోసికొనుచు, భావనాదృష్టితోఁ బ్రజాహృదయములం దంత రాంతరముల నాకళించుకొను చున్న తిక్కన సోమయాజియై, అవభృథస్నానమున శుద్ధుఁడై బుద్ధుఁడై హరిహరోపాసనమున ఆర్షవర్చస్వియై, సంస్కృతమున ఇతిహాసమైన భారత మును తెలుఁగునఁ బోతపోసి మహాకావ్యముగా మనకు బ్రసాదించినాఁడు. "నా నృషిః కురుతే కావ్యం" అను సూక్తికిఁ దార్కాణగా నిలిచినాఁడు. అదియే మన తిక్కన మహాకావ్యము. అదియే ఆంధ్రమహాభారతము.

ఇఁకఁ దిక్కన కావ్యనిర్మాణమును బ్రశంసింతును. "త ఏవ పద సంఘా తాస్త ఏవార్థవిభూతయః, తథాపి ముఖభేదేన కాపి కాపి సరస్వతీ" అన్నట్లు భారతములోని యితివృత్తమంతయు వ్యాసుని బంగారమే కాని అది తిక్కనచేతి శిల్పమున నమూల్యకంఠాభరణమైనది. కావ్యనిర్మాణమునకు వలయు సామగ్రి కవు లందఱికి నొకటే. దానిని విపులముగా లక్షణికులు వర్ణించియే యున్నారు. అందచందములు తీర్చుటకై అలంకారికులు దక

రకములైన సొమ్ములు తయారు చేసి జాబితాలు ప్రకటించియున్నారు. కాని, వాని నేర్చి కూర్చుటలోఁ దీర్చిదిద్దుటలో మాత్రము లోనివెలుఁగు, చేతి పనితనము ప్రత్యేకవ్యక్తి విభిన్నమై కావ్యము దేని యంత కది ప్రత్యేకమై విలక్షణముగాఁ దయారగుచుండును. ఒక పద్యము కావ్య మన్నాఁడు. ఒకాయన. రసాత్మకమైన వాక్యమే కావ్య మన్నారు మఱి యొకరు. వాక్యముగానీ, పద్యముగానీ వ్రాయు నపుడు సాధారణముగా నేమేమి కావలెనో మనకే తెలియును. ఏదో యొక విషయము-దాని కొక భావన-దానికిఁ దగిన శబ్దార్థములు - అవి నడుచుట కొక ఛందస్సు - అది కాకున్నను దానికి సహజముగా నున్న యేదో యొక నడక అనుకొన్న భావము సరిగా నున్నదా లేదా - దాని నీపదార్థలు సరిగాఁ జెప్పుచున్నావా లేదా - అని తెలిసికొనుట కేదో కొంత లోకశాస్త్రజ్ఞానము - ఇంత మాత్రపు సరకుతో రచన సాగింప వచ్చును. దీనికిఁ గొన్నాళ్లు కొంత గరడీసాము చేసిన సరిపోవును. దీనితోఁ బ్రతి యొకఁడు వాక్యకర్తయుఁ, బద్యకర్తయుఁ గా వచ్చును. కాని, ఒక పద్యముగాని ఒక వాక్యముమే గాని విశ్వశ్రేయము సాధింపవలసి వచ్చినప్పుడు దాని పరిణాహము - పరిణతి - పరికరము కొంత విస్తృతము కావలసియుండును. నేను రసము-నేను ఆనందము ఈ వాక్యమే కావ్యమై విశ్వశ్రేయమును సాధింపలేదు. దానికి వ్యాఖ్యాన ప్రాయముగా నైనఁ గొంత ప్రపంచము కావలయును. కనుకనే పెద్దలు కవితా బీజములుగ "శక్తి ర్నిపుణతా లోక కావ్యశాస్త్రాద్యవేక్షణాత్, కావ్యజ్ఞశిక్షయా చేతి ఇతిహేతు స్తదుద్భవే" అని సూత్రించుచు, ప్రతిభ - వ్యుత్పత్తి - ఉపజ్ఞ - సంస్కారము - ఇట్లే మరికొంత సామగ్రి కావలె ననియు, వీనిలోఁ గొన్ని మనము తెచ్చికొన్నను, మరికొన్ని పుట్టుకతోనే రావలసినవి కలవనియు నుపదేశించి యున్నారు. దీనినిఁబట్టి ఈ జన్మలోఁ గాక జన్మాంతరమునఁ గూడ గూడఁబెట్టిన కొంతసామగ్రి యున్నపుడే కావ్యనిర్మాణ దక్షత యేర్పడునని తెలియుచున్నది. కొందఱు "శాస్త్రము పదపదార్థములను ఛేదించునది-దాని సంస్కారము కావ్యరచనకు బ్రతిబంధక" మని యందురు. నిజమే! శాస్త్రము వేఱు - కావ్యము వేఱు. కాని, కళావేత్తయైన కవిని శాస్త్రసంస్కారమును కావ్యమునం దంతర్వాహిని చేయునది కళ. ఒక

శాస్త్ర సంస్కారమునే కాదు - ప్రకృతిలోని భౌతికాంశము నంతయు విడఁగొట్టి, అందులో సారభూతమైన సౌందర్యమును రసమయముఁ జేసి కావ్యమున మెదుపునది కళ. ఈ కళాప్రభుత్వమునఁ గళోపాసనమున నాలుగు పురుషార్థములు కూడఁ దమ తమ సాధనామార్గములందుఁ గటుత్వముఁ దొలఁగించుకొని సుందరములై సుఖసంసేవ్యము లగుచున్నవి. వివిధజలాశయములనుండియు; విభిన్న భూములనుండియు సూర్యకిరణములచేఁ బొంగిన యావిరి ఆకాశమున వాయు సంపర్కముచే ఘనీభవించి విద్యుత్కాంతులతో విహరించుచు, వాయుసంచాలనముచేఁ గరఁగి, వర్షబిందువులుగా కురిసి భూమినిఁ దనిపి సముద్రమునఁ జేరుచున్నది. ఇట్లే వివిధమానవసంఘ సంప్రదాయ వ్యవహారములనుండి వివేచనాబలముచే సంగ్రహింపఁబడిన విజ్ఞానము సుకవిభావనాపథము రసమయమై కరుడుగట్టి కళాదీప్తుల విలసిల్లుచు కవితామార్గమునఁ గావ్యమై యమృతము కురిసి ప్రజాహృదయములఁ దనుపుచు విశ్వసాహిత్యమున విశ్రాంత మగుచున్నది. ఇన్ని తెఱఁగుల సామగ్రి సంపన్నముగ నిలువచేసికొన్న సుకవి సత్వస్థుఁడై కావ్యరచనమునకుఁ గలము బట్టుచున్నాఁడు. ఉత్తర రామాయణ రచనమునాఁటికి మన తిక్కనయు నిట్టివాఁడు. ఇంతే కాదు. ఆయన భాండాగారము పుష్కలమైనది. భావ సంస్కారము పారావారమువలె నగాధమైనది.

తిక్కన "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడం గళావిదుఁడ" నని చెప్పుకొనుచు నిర్వచనోత్తర రామాయణ రచన నారంభించినాఁడు. "ధీరోదాత్తనృపోత్తముఁడు రామ ధరణీపతి సద్వృత్తము సంభావ్య" మగుటచేఁ దన ధర్మోపదేశము ఫలించు ననియుఁ, దన కుభయలోక ప్రతిష్ఠ సిద్ధించు ననియు యాశయము. శ్రీ రాముని ఉదాత్తనాయకునిఁగా, ధర్మ్యమైన సాంసారిక సౌఖ్యము ననుభవించువానిగా, "ఉదాత్త వృత్తితో మహినేలెడువానిఁగా, ఎట్టి కష్టముల యందును నిర్లిప్తుఁడై "ఎక్కుడు దిగ్గును" లేనివానిగా, ధర్మానుష్ఠానము కొఱకు, ధర్మపాలనము కొఱకుఁ బుట్టిన రాజుఁగా నెంతో చక్కఁగా దీర్చి దిద్దినాఁడు. పదబందము కూడ సుందరమై "లలితపద హృద్యపద్యంబులన కథార్థంబు ఘటితపూర్వాపరమై, అలతి యలతి తునియలు గహాల నంధించిన

విధంబున" నమరినది. కాని, తా ననుకొన్నంతగా నా రామాయణము ప్రజా హృదయమునకుఁ బట్టినట్లులేదు, అందలి రాముఁడలౌకికుఁడైన దేవుఁడును గాదు. ప్రాకృతసముడై ప్రజలలోఁ దిరుగు మానవుఁడును గాక పోయినాఁడు. తన ధర్మోపదేశ మా రచనలో నదుకలే దని కనుఁగొన్నాఁడు. ఆ తర్వాత జరిగిన సారస్వత తపస్సే. భావసంస్కారమే. లోక ధర్మ సమన్వయమే భారతాంధ్రీకరణమునకుఁ బాదులు గట్టినవి. నన్నయ భారతమును జదువుకొన్నాఁడు. అప్పటి తెలుఁగుదేశమును—భాషను—బరిస్థితులను బరిశీలించినాఁడు. ఎక్కువ తక్కువలను సవరించుకొన్నాడు. "జనాభ్యర్చిత మైన భారతము-నానేర్చుకొలంది సెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్" అని సంకల్పించి భారతమును జేతఁ బట్టి "శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి 'విష్ణురూపాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్" అను నాంది పద్యముతోఁ దెనుఁగుఁ జేత నుపక్రమించినాఁడు. ఈ నాందీ పద్యమే ఆయన రచనలో స్వతంత్రతను, విశిష్టతను, ఔచిత్యమును జాటుచున్నది. తిక్కన తన యిష్ట దైవమునకు హరిహరనాథ రూపకల్పన చేయుటయందే ఆయన హృదయ పాకము, సర్వసమభావము, భారతరచనోద్దేశము తెల్లమగుచున్నది. చూడుడు:ఆయన దేవుఁడు హరియు-హరుఁడును గాఁడు; శూన్యము గాదు; వ్యక్తముగాదు - అవ్యక్తముగాదు - అన్నియుఁ గావచ్చును. ఈ సమన్వయను చాల గొప్పది. అధ్యాత్మికమునఁ గూడ నెంత రాజనీతి చతురత ! వైదిక ధర్మనిష్ఠ కెట్టి పునాది ! మత వివాదములకెంత చక్కని 'రాజీ' పద్ధతి ! కర్మభక్తిజ్ఞానముల కెట్టి సమన్వయము ! ఇది సమభావమో ! అద్వైతభావమో ! ఏదైన నేమి, మొదటినుండి తుదివఱకు దీనిని తిక్కన చక్కఁగ నిర్వహించినాఁడు. ఈ భావమును బాఠకులకు దోధించుటే కాదు ప్రతి ఆశ్వాసాద్యంతముల యందును జక్కని వృత్తములతోఁ గమ్మని పలుకులతోఁ హృదయములోఁ దూఱి పై సమభావమునే తట్టి జ్ఞప్తిచేయుచుండును. తిక్కన హరిహరనాథుని ప్రశ్నించు ఈ శ్లోకమును వినుఁడు.

"కి మస్థి మాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం

కిం కాలకూటః కిము వా యశోదా స్తన్యం
తవ స్వాదు వద ప్రభో మే.''—

నీ యలంకారమునకు అస్థిమాల కావలెనా ? కౌస్తుభమణి కావలెనా నీ ఆహారమునకుఁ గాలకూటమా- యశోదచనుబాలా ? ఏది నీకుఁ జవిగా నుండును ? ఈ అడుగుటలో నెంత యమాయకత్వమో అంత చాతుర్యము- ఎంత భక్తియో అంత విరక్తి-ఎంత ఆవేశమో అంత అద్వైతభావము ! ఆహా ! ఏమి నేర్పరితనము ! పేరునకు హరిహరనాథు నడుగుచుండినను నిజమునకుఁ దన సమభావమును లోకమునఁ జెప్పుచున్నట్లు లేదా ! చూపులు దేవునివైపు, హృదయము లోకమువైపు - ఈ వ్యంగ్య మర్యాద యెంత మధురమైనది ! ఇందులో నీ గడుసు తనము(జూడుఁడు; తానెన్నఁడో వ్రాసికొన్న ఈయొక్క శ్లోకమును వినఁగనే స్వామి సంతోషించి మెచ్చుకొని "ఈ గ్రంథమును నా కంకితము సేయు" మని యడిగె నఁట ! ఎన్నఁడో వ్రాసికొన్న పద్యమే యింత హృద్యమై, సామాన్య రాజుగాదు- హరిహరనాథు నంతటివాఁడు అంకితము కోరుటలో నెంతధ్వని యున్నది ? ఒక శ్లోకమే యిట్లున్నచో నిఁక గ్రంథమంతయు నెట్టిదిగా నుండవలయును- ఈశ్వరుఁడే యిట్లడుగునపుడు సామాన్యమానవు లా గ్రంథమునకై యెంత యువ్విళ్ళూరుదురు ! ఎంత బతిమాలుకొందురు ?— ఈ స్వప్నవృత్తాంత ముతో గ్రంథము మొదటి యాకునందే తిక్కన యెంత దివ్యచిత్రమును మన కన్నులకుఁ జూపు చున్నాఁడు ! ఈయన రచన యంతయుఁ దుది మొదలుగా నిట్లే యుండును. ఒక చిన్నమాటతో నొక గొప్ప భావమును- ఒక చిన్న సంవిధానముతో గొప్ప ప్రయోజనమును సాధించుచుండును. తిక్కన పద్యరచనయే ఒకరకమైన యెత్తుగడగలది. వేయి పద్యముల రాశిలోఁ దిక్కన పద్య మెక్కడ నున్నను అతని శైలి విన్నవాఁడు వెంటనే 'యిది తిక్కన పద్య'మని యెత్తిచూపఁగలఁడు. అలతి యలతి పదములు. అట్టివే సమాసములు—వాక్యములు, వాక్యాంతమందు భావస్ఫోరకమగు నేదో యొక కాకుస్వరము-భావము సంగ్రహించుటలో, సూటిగఁ జెప్పుటలో నొక ప్రత్యేకత-సందర్భసాక్షాత్కారము చేయుటలో నొక విశిష్టత-ఇట్టి వెన్నియో ఆయనకు సొంత సొమ్ములై యితరుల కనుసరింపరాని గుణములు గలవు. చూడుడు :

"ఇది యొక పెద్ద గట్టి మొన; యీ మొన నుండట గాంగణంబుతో
నది యొక యల్పసైన్య; మట యాతల వేఱొక కొంత సేన; య
ల్లదె యిటు నించిపెట్టఁ బనె; నన్నిటిలోన వృథాభిమాన దు
ర్మద బహుభాషియైన కురురా జెచటన్ జనుచున్న వాఁడొకో ?"

ఈ విస్పష్ట వివరణము చూడుడు :—

వచ్చినవాఁడు ఫల్గునుఁ; డవశ్యము గెల్తు మనంగరాదు; రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే ?
హెచ్చుగుఁ గుందగుఁ; దొడరు టెల్ల విధంబుల కోర్చునట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగు చేఁతయున్ దగున్."

తిక్కన రచనలోని శబ్దప్రపంచ సౌభాగ్యము వర్ణనాతీత మైనది. ఒకమానవుడింత సృష్టిచేయఁ గలఁడా యని యాశ్చర్యము కలిగించును తెలుఁగులో నింతటి యమూల్యపదములు—మృదువులై, మనసులోని భావమును సూటిగా జెప్పగలిగినవి, కర్ణపేయములై కూర్పునందాణిముత్యాలవలె నదికి యందగించగలవి ఎక్కడివి ? తిక్కనకుఁ బూర్వ మేగ్రంథమునివి కనఁబడవే ! తర్వాతి కవు లెంత యత్నించినను అగని వారికి దొరలేదేమో ! అది యంతయు నాయన సొంత ఆస్తి. పట్టణములలో-అంతకంటె ముఖ్యముగఁ బల్లెలలో నిత్యవ్యవహారమున నిగనిగలాడునవి-మాఱుమూలల మరుగుపడినవి అన్నియు సేకరించినాఁడు. మాసిపోయిన వానికి మెఱుఁగులు దిద్దినాఁడు. వికృతములైన వానికి వేసముఁ దీర్చినాఁడు అవసరమైనచోట పదముఁబట్టి యనువుగా సృష్టించుకొన్నాఁడు. అప్రయత్నముగా దొరిలిపడినవి దక్కించుకొన్నాఁడు. అన్నింటికి రూపమునుబట్టి, గుణమును బట్టి, లక్కణఁ బట్టి కులగోత్రముల నేర్పఱచుకొన్నాడు. పుష్పజాతులు కొన్ని, ఫలజాతులు కొన్ని - రత్నజాతులు కొన్ని, లోహజాతులు కొన్ని జాతీయములు కొన్ని, సామెతలు కొన్ని అన్నియు రాసులు పోసి దొంతులు తీర్చినాఁడు. వానివాని పలుకుబడి వేఱు నుడికారము వేఱు· సందర్భమును బట్టి ఆ ధ్వని కొక యర్థము ధ్వనినిఁబట్టి యా సందర్భమున కొక భావము వచ్చునట్లును, ఒక పదము తన సొంత వెలుఁగుతో నిరుగు

పొలుగు వానికి జీవము పోయుచున్నట్లును, ఇరువైపుల పదములు నడుమ నున్న మూఁగదానికి మేలిమాటలు నేర్పినట్లును దండలు గూర్చి చెండులు గట్టి వింతసోయగముతో విన్నాణములఁ దిద్దినాఁడు. అన్నింటను దెనుఁగుదనము, తియ్యందనము నిండి తొనికిసలాడునట్లు పుంజుకొన్నాఁడు. భారత రచనలోఁ గవి బ్రహ్మచేసిన శబ్దసృష్టి అనన్య సామాన్యమైనది. ప్రబంధ పరమేశ్వరుఁడు ఈ రచనను గూర్చి "తన కావించిన సృష్టి తక్కొరులఁ జేయఁగా"దని ప్రశంసించినాఁడు. తిక్కన యీ తెలుఁగు నుడికారమునకు భారత మంతయు నుదాహరణమే. ఇది యని దేని నెత్తిచూపఁగలము! ఈ పద్యముఁ జిత్తగింపుఁడు :—

"ఇది గడునుద్ధరాలు: పను లేమియుఁ జేయఁగ నేర; దెంతయున్-
మృదు; వొకకీడుపాటునకు మేకొనఁ జాల; దుదాత్తచిత్త; యొం
టిఁ దిరుగు చాని కోర్వ; దొకటిన్ దనుఁ దా నవరించు చొప్పెఱుం
గదు; తగ నొండులన్ గొలువఁగా వెఱ వెమ్మెయిఁగల్గునక్కటా!"

ఇట్లని తిక్కనకు సంస్కృత రచన సహింపదని, చేతఁగాదని యనుకోఁ గూడదు. సందర్భమునుబట్టి సంస్కృతము నెంతో గంభీరముగా నడుపఁగలఁడు.

"దుర్వారోద్యమ బాహు విక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిష్టు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి, గం
ధర్వుల్ మానముఁ బ్రాణముల్ గొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా!"

ఒకప్పు డన్నియు సంస్కృత దీర్ఘసమాసములతే కూర్చును. చూడుఁడు :—

"భీష్మ ద్రోణకృపాది ధన్వినికరాభీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు, శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వా కలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే!".

మఱి యొకప్పుడు విడివిడి సంస్కృత పదములతో నడచుచుఁ దటాలునఁ దెనుఁగు నడకలోనికి దిగును. చూడుఁడు :—

> "అకుటిలుఁ, డార్యసమ్మతుఁ, డహంకృతిదూరుఁడు, నీతినిర్మలా
> త్మకుఁ, డనవద్యశీలుఁడు, సధర్ముఁడు, దాంతుఁడు, గొంతిముద్దు సే
> యుకొడుకు, మేను లేఁత, తన యుల్లము మెత్తన; యిట్టి యాతఁ డె
> ట్లోకొ యొరు నాశ్రయించు! విధి యోపదె యెవ్వరి నెట్లు సేయగన్!"

మఱి యొకసారి తెలుఁగునుడుల కూర్పు నందముగ నడపుచు నడుమనడుమ సంస్కృత పదముల నదుకుట యదొక వింతగా నుండును.

> "తగవునఁ బోక రాజు బెడిదంబులఁ బల్కెనయేని సైఁచి యొ
> ప్పుగ నిలుమీ! గురుత్వము ప్రభుత్వమునున్ గల పెద్దవారి మా
> ట గొనమి యాసురోధను కడఁక నిలువఁగ, మనమెల్ల గారవం
> బుగఁ గురువృద్ధపల్కు తలపుఁ జననిచ్చిన మెచ్చరే జనుల్!"

తిక్కనార్యుని విచిత్ర విహారములతో నిట్లెంత సేపైన నానందింప వచ్చును. కాని మనకు వ్యవధి చాలదు. అక్షర ధ్వన్యాత్మకముగా వీనుల విందు సేయుచున్న యీ బాహ్య సౌందర్య మింత కమనీయముగదా! ఇఁక భావార్థ గౌరవాది పరిపాక పరిణతమైన ఆంతర మాధురి నాస్వాదింతము. అది యొక చిద్విలాసము! తిక్కన యెంత గంభీరార్థము నైనను తేఁటఁగాఁ బిడిచి యియ్యఁ గలఁడు—తేలికగా నొలిచి పెట్టఁగలఁడు. ఎంత సామాన్య విషయముపై నైన వెలితి పేదటికములు లేక గంభీరోపన్యాసము చేయగలడు. చెప్పవలయునది మానఁడు — మానఁదగినది చెప్పఁడు. చెప్పునప్పటి యీ మెలఁకువ యాయన తోనే పుట్టిన దనవచ్చును. విషయము నెత్తికొనుటలోనే యొక క్రొత్తపోకడ నడుమ నడుమఁ దానే యొక ప్రశ్న వేసికొని సమాధానముఁ జెప్పుకొను చున్నట్లుగాఁ బోవును. ఒక విచిత్రమైన కాకు స్వరముతో బ్రహ్మాండమైన భావమును బెల్లగించును. మొగము చూచుచు మనసుతో మాటలాడును. మనసు గిల్లుచు మొగమున నవ్వును. ఇష్టానిష్టము లేవియు వాచ్యముగఁ జెప్పక యేతలయూపుతోనో, కనుబొమ కదలికతోనో, పెదవులు విప్పుటతోనో సూచించును. ఏ విషయముఁ జెప్పుచున్నను ఆ సందర్భమునకు నా పాత్రము నకుఁ దగినట్లుగాఁ దనదే యొక ముద్రవైచి, అలంకారికులు సెప్పిన ఉక్తివై చిత్ర్యముల కన్నిటికిని—భరతముని చూపిన యభినయ విశేషముల కన్నిటికిని

ఉత్తమ లక్ష్యముల నిచ్చుచుండును. అన్నిటికంటె నాయనసందర్భశుద్ధియు, ఔచిత్యపోషణము బరవడిగా గ్రహింపఁదగినవి. ఒక ఘట్టమును దేనినైన వర్ణింపవలసి వచ్చినపుడు కథను సన్నివేశమును రెండు మాటలతో సూచించి అది యొక రంగముగాఁ గల్పించును. సంభాషణ క్రమముతోఁ దక్కిన సంగతు లన్నియుఁ బాత్రనోటనే పల్కించును. అది శ్రవ్యకావ్యమే యైనను పద్య మయమైన దృశ్యకావ్యముగాఁ జిత్రించి మన కన్నుల యెదుటఁ బెట్టును. ఈ నాటక ఫక్కి రచనలోఁ దిక్కన నైపుణ్య మద్వితీయము. తర్వాతి కవులలో ఈ ఫక్కి సాధించినవారు చాల తక్కువ. తిక్కన కవితాశిల్పము నిల్లే తడవి కొనుచు నెంతదూర మైనను సంతోషముతోఁ బ్రయాణము చేయవచ్చును. ఉదాహరణముగ నెన్ని పద్యములైనఁ జూపవచ్చును. మచ్చునకొకటి రెండు చిత్తగింపుఁడు :-

"ఆపద గడవం బెట్టఁగ,
నోపి శుభం బైన దాని నొడఁ గూర్పఁగ మా
కీ పుట్టువునఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్ను జూపి చనియె మహాత్మా !"

ఇందు పూర్వార్ధము సాధారణము. ఉత్తరార్ధమునఁ బ్రతియొక పద మెంతో భావమును గర్భీకరించుకొన్నవి. "మేము తండ్రిలేని బిడ్డలము. అన్ని విధముల నీవే మా కాదరువు" అని ధర్మరాజు చెప్పుచున్నాఁడు. అవును మానవుఁడు తా నెన్ని రీతుల నెంత పెద్దవాఁడైనను ఈశ్వరుని యెదుట నింటివాఁడుగనే నిలఁ బడును గదా! "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అను భాగవత ధర్మమిదియే గదా ! "ఈ పుట్టువున" అన్నప్పుడు "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను గీతావాక్యము ధ్వనించుచుండలేదా ! "పాండు క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె"— ఈ చూపి చనుటలో ఒప్పగింతయు, పాండుక్ష్మాపాలుని యందలి విస్మృతకర్తృత్వ మంతయుఁ గృష్ణ నిపై మోపుటయు నెంత సుకుమారము ! మఱియు "గురూపదేశమునఁ గాని యీశ్వరునిఁ గనుఁగొనఁ జాలఁడు. తా నసహాయుఁడైనపుడు గాని యీశ్వ రునివైపు మనసు త్రిప్పఁడు" — ఈ భావము లెంత గంభీరముగా ధ్వనించు

చున్నవి : "మహాత్మా" – "నీవు పరమాత్ముఁడవు – నేను జీవుఁడను. ఈ జన్మమున గురూపదేశమున నిప్పుడే ఆత్మసాక్షాత్కారము చేసికొను చున్నాను"– ఈ భావ మెంత సంప్రదాయసిద్ధ మైనది! పద్యము కథ చెప్పు చున్నను, తిక్కన పదప్రయోగము ఈ సందర్భమున వ్యాకరణతంత్రముల నన్నింటిని గడిపి మధుర భావాలాపన చేయుచున్నది.

"మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము; ధర్మనీతి వ
ర్తనములు రెండు దిక్కుల హితంబును పెంపును గల్గునట్టి చొ
ప్పున విదురాది సజ్జనుల బుద్ధికి రాఁ నుచితంబు తోఁడి మె
ప్పున పరుసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ !

ధర్మరాజు స్వకార్యమునే చెప్పుచున్నాఁడు. అయినను "మాదెస పక్షపాతము వలదు – ధర్మనీతి వర్తనములు — రెండు వైపుల హితము పెంపు గల్గునట్టి చొప్పు గమనించియే నడువు" మని అసిధారావ్రతనుగా నులు మ్రొగ్గని రీతిగా ధర్మమునే చూచి పల్కు అతని యుదాత్తత యెట్లున్నదో చూడుడు! పోనీ — స్వకార్యమున నేమఱుపాటు గలదా? "విదురాది సజ్జనుల బుద్ధికి రాఁ — ఉచితంబుతోఁడి మెప్పునఁ — పరుసందనంబునను — భూపతులెల్ల నెఱుంగఁ "— ఈ పదము లన్నియు ఒకవైపు న్యాయ పక్షమును సమర్థించుచున్నను, మఱియొక వైపు ప్రతి పదము స్వకార్యసిద్ధి కొఱకుఁ బ్రత్యేక ప్రయోజనముల గర్భీకరించుకొని సుకుమారముగ సూచన లిచ్చుచున్నవి.

"మమ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు;
నెమ్మి యెఱుఁగు, దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి యెఱుఁగుదు
పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్."

అన్నియు నీవే యెఱుఁగుదువు; నీకు బుద్ధులు సెప్ప నేనెంతటివాఁడను పోయిరమ్ము" అనుచున్నాఁడు ధర్మరాజు. పాపము! తా నేమియు నెఱుఁగఁ డఁట— చెప్పవలసిన దేమియు లేదఁట! ఇంకను జెప్పవలసినదని యేమే

మనుకొన్నాడో! ప్రతియొక చిన్నవాక్యమునందును దాను జెప్పవలసిన దంతయుఁ గొసరు ముగ్గులతో నూఁది చెప్పుచునే యున్నాఁడు. పైఁగాఁ జల్లగా సమ్మోహనాస్త్రమును బ్రయోగించుచునే యున్నాఁడు. ఔరా! చాతుర్యము! "బుద్ధులు సెప్పఁ" అని ఒక ఛలోక్తి వినుచు — "ఎఱుఁగుదు" అను ప్రతిచోటను "ఎఱుఁగుము" అని మార్చి చదువుకొమ్మని ఉపాధ్యాయునివలె సూచింపుచుఁ గృష్ణుని హృదయమును లోనికిఁ దొంగిచూచు చున్నట్లు లేదా! తిక్కన ఉక్తివైచిత్రియంతయు భావనమునిండ నిట్లే యుండును. భారతమున నుద్యోగపర్వము — అందు కృష్ణునిరాయబారము ఇట్లే ప్రత్యేక జాగరూకతతోఁ జదువఁ దగినవి. ఈ ఘట్టమున ద్రౌపది ఒక అసాధారణ వ్యక్తి. పరాభవము పొందిన భారతపిపక్తి—భారత నీరమూర్తి. ఈమెకు వ్యాసుఁడు పుడుపున్నెములు తీర్చి పెద్ద చేసినను, తిక్కన తీర్పులో ఆమెకు ఆర్యత్వము, ఆంధ్రత్వము నిలువెల్ల వెలసినవి. కథలో ద్రౌపది పాండవపంచక మునకు ధర్మశక్తి — భావములోఁ బ్రాణపంచకమునకు జీవ శక్తి. భారతకథా జీవయాత్రలో నామె ఇచ్ఛాశక్తి — క్రియాశక్తి స్వరూపిణియై ప్రవర్తించినది. స్వారాజ్యసిద్ధికై రాయబారము పంపునపు డామె పాండవులకు, గృష్ణునకు నడుమ నిలిచి జీవాత్మకు, బరమాత్మకు నడుమ ఆది శక్తియై అద్భుత విహారము సలిపినది. ఆయా విశేషము లన్నియు భావుకులు, రసజ్ఞులు భారతమును ప్రత్యేకముగా జదివి ప్రతిపద్యమునను చవిచూడఁ గలరు. ఇట్లే భారతమున విరాటపర్వ మొక ప్రత్యేక కావ్యమనఁ దగినది. అజ్ఞాతవాసముతోఁ బ్రారంభమై ఉత్తరా వివాహముతో మంగళాంతముగా ముగిసినది. మహాకావ్యత్వసిద్ధి నంతయు నందుఁ జూపఁ గలము. అందలి పాత్రపోషణము, రసపుష్టియు మిక్కిలి హృద్యములైనవి.

ఇతివృత్తమునందలి పాత్ర లేవి యెప్పు డెట్లు నడచుకొన్న స్వభావ సిద్ధములై మన యనుభవములను దలంపునకుఁ దెచ్చుచుండునో అట్లు చిత్రించుట పాత్రపోషణము, భారతరచనయం దీకార్యము మిక్కిలి కష్టమైనది. ఎందుకనగా: అది యొక సముద్రమువంటిగాథ. పాత్రలు అసంఖ్యాకములు వివిధములైన అర్హతలు, అంతరములు గలిగి, ఒకటి రెండు తరముల వఱకు కథవెంట నడచినవారు పెక్కురు గలరు. ఆయా సన్నివేశములలో ఆయా

దశలలో వారివారి భావరూప చేష్టాదులను భావనాపథమునఁ జిత్రించుకొని, అందరి జాతక చర్యలకు సహజమైన, అనుభవసిద్ధమైన ఫలితములు వ్రాసి చూపుట చిన్నపని కాదు. తిక్కన నిజమైన దైవజ్ఞుఁడు — నైష్ఠికుఁడు. కావుననే తనకు రావలసిన సంభావన యెట్లున్నను తాను జేయవలసిన పని ఉత్తమముగా నిర్వహించి కృతార్థుఁ డైనాఁడు. పలుతావుల మూలమున కెన్నో మెఱుఁగులు దిద్దినాఁడు. కొందఱు ద్రౌపదీ పాత్రపోషణము నందు వ్యాసుని — నన్నయను — తిక్కనను — పోతనను బోల్చుకొని హెచ్చు తక్కువలు కొలుచుచుందురు. కాని వీరందఱు నొక శకమువారా, ఒక శతాబ్దివారా? ఒక తరము వారిలోనే ఎన్నో నూర్పులు మనము చూచు చున్నాము గదా! కనుకనే యెవరి గొప్పను వారిలోఁ జూచి సంతోషించుటే మంచిది.

తిక్కన భారతాంధ్రీకరణము మూలమునకు సరిగా లేదనియుఁ, గొన్నిచోట్ల వికృతమైన దనియుఁ గొందఱు విమర్శించినారు. ఇది సాహసము. భారతమును 'మక్కికి మక్కి'గా వ్యాఖ్యానాంశములతోఁ గూడఁ దెలుఁగునఁ బెట్టితి నని తిక్కనయుఁ జెప్పలేదు. అది స్వరసమును గాదు. ఆ కాలమున నెవరి యాంధ్రీకరణ పద్ధతియు నట్టిది కాదు. మూలమునకు స్వేచ్ఛానువాద స్వాతంత్ర్యమే యందఱు నవలంబించిరి. వారిలోఁ దిక్కన యగ్రగణ్యుఁడు - సిద్ధహస్తుడు. కథాసంవిధానము, పాత్రౌచితి, సందర్భశుద్ధి-పదియుఁ గొఱత పడకుండఁగనే చక్కఁగఁ దీర్చినాఁడు, భారతమును జదువునప్పు డందలి పాత్ర లేదో కథ నడుపుచున్నట్లుగాక, అందలి బ్రదుకు తాము బ్రదుకుచున్నట్లుగాఁ దోపించి, మన హృదయానుభవములను మేల్కొల్పుచు వారితో మనకుఁ దాదాత్మ్యము గలిగించుచుందురు. తిక్కన తన పాత్రలకు ఇట్టి జీవకళ పోసి నిర్మించినాఁడు కనుకనే అతని రచనలో భారతము కావ్యమైనది. అప్పుడు గూడ నది తన ఇతిహాసత్వము, పంచమవేదత్వము పోఁగొట్టుకొనలేదు. మీఁదు మిక్కిలి ఆయన తెనుఁగు పలుకుబడిలో మెగిది అందలి సర్వసామగ్రియుఁ దెలుఁగువారి సొమ్మైనది. ఆ భారత వీరులు-వీరమాతలు మన కుటుంబములోని వారైనారు. భారతధర్మయు మన యింటి యాచారమైనది. మన తెనుఁగుతోఁట నందనోద్యానమై పరి

మళించి ఫలించినది. తిక్కనయే భారతము నాంధ్రీకరించి యుండనిచో లేక 'మక్కికి మక్కి'గాఁ జేసి యున్నచో ఆంధ్రజాతికి, ఆంధ్రభాషకు- నిజముగా నెంత నష్టము కలిగి యుండెడిది! ఆ పరమ స్వతంత్రుని ఆ తెలుఁగు ఋషిని దీవించి, ఆయన చేతినుండి ఆంధ్ర భారతమును దనచేతఁ బెట్టించు కొని, దానిని మన చేతిలోఁ బెట్టి మనకు మహా సాహిత్యభాండారమును బ్రసాదించిన ఆ హరిహరనాథునికి ఆంధ్రజాతి యంతయుఁ దీరని యప్పుపడి యున్నది.

కొందఱు "తిక్కనకు సంస్కృతము రాదు. ఆయన పాత్రౌచిత్యముఁ జెఱచినాఁడు. భావస్ఫోరకముగా వాక్యరచన చేయలేఁడు" ఇట్లే కొంత విమర్శ చేసియున్నారు. తిక్కన యందందు తన రచనలో నిరువది నవ్వులు నవ్వినాఁడఁట. వానిలోఁ గొన్ని ఈ విమర్శనములకు బదులు చెప్పఁగలవు.

ఆంధ్రసాహిత్యమున నున్నతోన్నత స్థానము నాక్రమించిన మహా భారత సాగరమును గడముట్ట నీఁది పూర్ణకాముఁడై, సుప్రసన్నస్వాద యముతోఁ జేతులు జోడించుకొని "హరిహరనాథ! సర్వ భువనాత్మక! నన్నదయఁ జూడు మెప్పుడున్"-అని స్వామి యెదుట నిలిచి వేఁడుకొను చున్న ఆ కవిబ్రహ్మను - మన తిక్కన సోమయాజికి భక్తిపూర్వకముగ ధన్య వాదము లర్పించుచున్నాను *

—భారతి

సర్వజిత్తు-చైత్రము, ఏప్రిల్ 1947
సంపుటము 24; సంచిక 4.

....:o: ...

# ఎఱ్ఱయ ప్రవృత్తి

—నోరి నరసింహశాస్త్రి

"క్రమపాకంబునఁ గెంపుతోడి నలుపెక్కంగా మిక్కుటంబైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రస మంతర్గామి యయ్యుంగ వెలిం
గమియం గాఱుచునున్న చాడ్పున విలోకప్రీతి గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలము లీ తాళద్రుమశ్రేణులన్"

ఈ విధముగా ధేనుకాసురుని తాళవనములోని ఫలములను బల రామునికి శ్రీకృష్ణుఁడు చూపుచు పలికినాడు. ముట్టినంతనే స్రవించిపోవు ద్రాక్షాఫలముల రసము కాదు. అతికష్టసాధ్య మగు నారికేళరసమును గాదు ఎఱ్ఱయ కభిమానమైనది! అంతర్గామియై చిక్కని రస ముండుటే కాక, అది వెలింగమియం గారుచున్నట్లుండి నేత్రపర్వము చేయుచు ఉచిత మగు పాకముచే దట్టమగు సుగంధము దిక్కులు నిండిపోవునట్లు చేయగల తాళఫలరసపాక మతని కభిమానపాత్రమైనది.

అతడు తన కావ్యములలో స్తోత్రము చేసినది సంస్కృత కవులలో వ్యాస వాల్మీకులను, తెలుగువారిలో నన్నయ తిక్కనలను మాత్రమే! ఎఱ్ఱయకు సూక్ష్మ విషయములో గూడ ఔచిత్యవిచార మెక్కువ! ఏ కావ్యములో ఎవరిని ముందు స్మరించవలెనో, ఎట్లు స్మరించవలెనో కూడ అతడు విచారించియే చేసెను. ఈ నలువుర స్మరణచే ఆతని కెట్టి కవిత్వ మభిమానమో కూడ సూచించినాడు. ఆంధ్రమహాకవులను మహర్షులగు వ్యాసవాల్మీకులతో పోల్చుట సాహసము కాని, కవితామార్గములలో నన్నయకు వాల్మీకి ఫక్కియు, తిక్కనకు వ్యాసఫక్కియు నిష్టము లనుటకు అభ్యంతర ముండదు. అంతర్గామి రస మొకరికిని, వెలింగమియంగారు రస మొకరికిని కావ్యరచనలో అభిమతములు. ఈ రెండు మార్గముల రసయోగము సాధించుట ఎఱ్ఱయ ఆదర్శమా ?

మహాభారతములో ఆ కాలమునకు మిగిలిపోయిన ఆరణ్య పర్వశేషము పూరించుటకు ఈతనియందు మునుపు నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి చెందినది. ఆ సమ్మాట 'ప్రాక్తన సంగసుమితాల్ప వర్తను'డగు నాతని పితామహుడు స్వప్నములో శాసించగా కులదైవము అహోబల నృసింహుని యవతార కథ వర్ణించెను. అంతట నింతవరకును మనకు లభించకున్న శ్రీరామకథ చెప్పి అన్నమ వేమభూవిభుని 'అత్యుత్తమ ఖ్యాతి గడింప' జేసినాడు. ఆ తరువాత హరివంశము భారత శిరాంశము కనుక మహాభారత సంపూర్తికై యదియు తెలిగించినాడు. ఈ విధముగా భారత రామాయణముల భాసురార్థములను పూర్తిగా 'గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వి తెలుంగు వారికి' అంద జేసిన ధన్యుడు ఎఱ్ఱన !

ఈ 'శంభుదాసుడు' రచించిన గ్రంథము లన్నియు శ్రీనారాయణావతార లీలలు వర్ణించున వగుట ప్రాకృతులకు వింతగా నుండ వచ్చును.

"గిరిశ పదభక్తి రసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగా
బరగిన గోవింద సుతా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెంపన్ !".

అని పితామహుడు పల్కెను. హరివంశములో శ్రీకృష్ణుడు సంప్రం ఖ్య తీవ్రతపస్సు చేసిన కథ కలదు. అత డప్పుడు—

"ప్రణిధానంబున సంబా
ప్రణయుం బశుపతి సమగ్రభక్తి యెలర్పన్
ప్రణవము రుద్రాధ్యాయము
ప్రణుతమతి జపించుచుండెఁ బర్యాయమునన్"

తుద కాతనికి హరుడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు,

"హరిఁ జూతురు హరుఁ జూతురు
హరిఁ జూతురు క్రమ్మఱంగ హరుఁ జూతురు ని

గ్జరులును మునులును నిమ్మోయి
హరిహర తత్త్వముగ విస్మితాలోకనులై ."

అందే బాణాసురుని సంహరింప శ్రీకృష్ణుడు చక్రమెత్తెను. బాణుని రక్షింపుమని హరుడు కోరెను. శ్రీకృష్ణుడు సుదర్శనచక్రము నుపసంహరించి—

"దితి సుతుఁడు బ్రతుకుగా కను
మతి నిమ్మోయి నరిగెదను నమస్కృతి యిదె నీ
కతుల భవత్ప్రియకరణ
ప్రతిపాదన మెందుఁ బరమ భద్రము కాదే !"

కావ్యరసముకూడ రసయోగమువలెనే అభినవత్వము, నిత్యయౌవనము కలిగించు నని రసాభిమానము ప్రదర్శించినాఁడు.

"ఘనరసోపయోగంబున గ్రమ్మఱంగఁ
బడసెఁ బ్రాయంబుఁ దగదె యిబ్భంగి యనఁగ
హరిత తృణలతారుణ కోమలాంగి యగుచు
బృథ్వి యెంతయుఁ గ్రొత్త యొప్పిదము నొందె."

అని వర్షర్తువును వర్ణించినాడు. వసుదేవుడు కంస సభలో మొదటిసారి, శ్రీకృష్ణుని........"చూచుచుఁ

వెసనానంద రసానుభూతి నలవన్ సిద్ధుండవోలెన్ జరా
వ్యసనం బేమియు లేక యత్తఱిఁ గుమారాకారుఁ డయ్యెన్ మదిన్."

ఎట్టియ నందుచే కావ్యరససిద్ధు డనవచ్చునా ?

"అతిసౌమ్యము లతిఘోరము
లతిసూక్ష్మము లతివిపులము లద్భుతములు నీ
వితతాకారంబులు త
ద్గత హృదయుల కెఱుఁగవచ్చుఁ గందర్పహరా !"

శంభుదాసుని రసాకారములు మాత్రము ?

ఈ రసయోగాదర్శనముచే వాక్కులో ఎఱ్ఱయకు హృద్యతయు, ఉదాత్తతయు నభిమాన మైనవి. హరివంశ 'రమ్యకథఁ దెనుంగున ధీరోత్తము' డగు నాతఁడు ప్రారంభించెను. 'అత్యంత హృద్యోక్తి విన్యాసం బొప్పఁగ శ్రుతితుల్యం బద్భుతార్థోదయ శ్రీసంభావిత మగు పురాణము చెప్పు' మని సూతుని శౌనకుడు వేడెను. వైశంపాయనుడు దానిని జనమేజయునికి 'ఉదాత్త తరహృద్యోక్తితో' పలికెను. వందిమాగధులు పృథుచక్రవర్తికి 'మధుర మనోహర పవిత్ర చిత్ర స్తోత్రంబుల నుపన్యసించిరి.' నారదుడు వీణను మధురదివ్యధ్వని మెరయ జిత్త ప్రబంధోజ్జ్వలతాన రచన వాయించెను! కాళియుడు కృష్ణునిఁ బట్టగా బలభద్రు డాతని 'గంభీర మధురస్వనము'తో నుద్బోధించెను. అంతట కాళియుని పడగలపై శ్రీకృష్ణుడు నాట్య మొనర్చెను.

"యమునావీచి మృదంగవాద్యములు ప్రమోయం దీరగాఢఘోషహ
ర్షమనోజ్ఞ ధ్వనితంబు గేయముగఁ బంచత్కాళియ వ్యాళ భో
గమహారంగ తలంబునం బటుగతిం గంజాక్షుఁ నిర్మథ్య నా
ట్యము హృద్యాద్భుతభీమమై పరఁగ దివ్యశ్రేణి మెచ్చెం దివిన్"

అక్రూరుడు శ్రీకృష్ణుని 'మధురతాభ్యుత్పన్న వాక్యములతో' స్తుతించెను. విశ్వకర్మ ద్వారకానగరమును 'ఎంతయు నుదాత్తతరం బగు నాస్పదంబు పెంపలరఁగ నుత్పాదింతు' నని ఇంద్రునితో జెప్పి దాని నతడు 'తన విద్యాతపములచేత నుపార్జితమైన పేర్మి దగ నఖిలంబును వినియోగించి విభుని పంచినకంటె నుదాత్త శిల్పము దోడగెను 'నారదుడు' వీణావల్లిక నక్క జూచి...... మధుర ప్రారంభ సంభూతితో .... .... నిర్వాణానందముఁ బట్టి చూపెడు గతిన్" వాయించినాడు. ప్రహ్లాదుఁడు— ...... "వెండి పల్కు నిం

పెలయఁగ నంబ లక్ష్మి జగదేకజనేత ముకుంద యంచు న
త్యలఘుతర ప్రబోధ మధురాక్షర-వాక్య వివేకదక్షుఁడై"

హిరణ్యకశిపు డాతని— ......"ప్రస్ఫురితార్థసార మై

తీపులు వీనులం గుఱియ దివ్యసుభాషితరత్నం మొక్కటు
ద్దీపిత ధీవిజృంభణ విధేయత యొప్ప నుసన్యసింపుమా!"

అని కోరెను. భవనాళినీజలము ఆ కలంకము 'అక్షయరసోదాత్తము,' 'చతురమనోజ్ఞ విజ్ఞానలతలు లక్ష్మీవనములో కలవు. శ్రీకృష్ణుడు మార్కండేయునితో 'లోకసమ్మానిత వాక్య, నీదయిన మంజుల వాగమృత ప్రవాహముల్ వీనుల దోయి లించుచును వేడుకఁ గ్రోలి కొనంగ నాత్మలం బూనెద" మని పల్కెను.

"పరిపక్వ మంజుల ఫలరసోద్ధతము లై
పలుకు రాచిలుకల పటురవంబు".

సావిత్రికి సత్యవంతుడు వనములో చూపెను. వామనుడు బలియొద్ద కరిగి 'యాశీర్వాదం బిచ్చి మధురోదాత్త స్వరంబున' బల్కెను. నారాయణుడు మార్కండేయునితో ప్రళయ పయోనిధిలో' విస్ఫుర దుదాత్త మనోజ్ఞమితస్వరంబునన్" బలికెను జనమేజయుడు వేదవ్యాసుని సమక్షమున భారత రచన నిట్లు ప్రశంసించెను.

"సర్వామ్నాయ పురాణశాస్త్ర పదవీ సంభావితార్థ స్థితుల్
నిర్వాహంబునఁ బొంద సర్వకవితా నిర్బంధ సంపూర్ణ మై
గర్వారూఢి దలిర్ప సర్వజనతా కర్ణామృత స్యందిగా
సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్రజ్ఞం జేత యిం తొప్పునే!"

"హరివంశ కథోత్తరముగఁ
గురువంశ సుధారసంబు గ్రోలెదు నెడ నొం
డు రసంబులు చెవు లొల్లవు
పరవశ మై మనసు చెవుల పాలిద యయ్యెన్."

ఉజ్జ్వల, ఊర్జిత శబ్దములు ఎట్టియ వర్ణనలలో దొరలుచుండుటయు నాతని యాదర్శములు ఎట్టివో అనుమేయించ నగును.

## 2

అవసరము కలిగినప్పుడు వ్యంగ్యరచనలో ఎఱ్ఱయ సిద్ధహస్తుడు. బలరామ కృష్ణులను మట్టుపెట్టించు నుద్దేశము మనసులో నిడుకొని కంసుడు వారలను చూడ దలచినవాడు వోలె నటించుచు తోడితెమ్మని శ్రీకృష్ణ భక్తుడగు అక్రూరుని బృందకు పంపెను. కంసుని అంతరంగికోద్దేశము శ్రీ బలరామకృష్ణులకు తెలుపుట కంససేవకుడగు నాతనికి పాడిగాదు. భగవంతుడగు శ్రీకృష్ణునికది తెలుపకుండ భక్తుడగు నతఁ డెట్లుండగలడు? ఆ రాత్రి యెల్ల నక్రూరుడు శ్రీకృష్ణునితో మాట్లాడుచునే యుండెను. ఎట్లు?

"తీపు మిగులు నక్రూరు నాలాపములకు
నుల్లమపగతి నిద్రమై యుల్లసిల్ల
నట్లు ప్రియమందుచున్న దైత్యాంతకునకు
నరిగె నవ్విభావరి ముహూర్తాభ యగుచు".

అంతసేపును వాచ్యముగ నాతడు కంసునిభావము చెప్పలేదు కాని, వ్యంగ్యముగా బహుభంగుల తెలుపకుండఁగనే తెలిపి, ఇటు ప్రభుభక్తికి అటు భగవద్భక్తికి విరోధము లేకుండ సమర్థించెను. అ ఘట్టము ఎఱ్ఱయ మిక్కిలి సమర్థతతో నిర్వహించెను. కాని దానితో నాతనికి తృప్తి కలుగలేదు. "అని యక్రూరుండనేక క్రమంబులం జెప్పిన వాక్యంబుల యభిప్రాయం బంతయు నెరింగి కృష్ణుడు"—అని తుదకు చెర్చినాడు.

అట్లే వ్యంగ్యరచన కౌశికకుమారుల ఘట్టమునను, నారదుడు అద్భుత ధన్యతముల నన్వేషించిన సందర్భమునను కలదు. కాని, రెండుచెడల గూడ తుదకు వివరణ యున్నది.

ఆంధ్రదేశము పూర్వమీమాంసకు కాణాచి. అందుచే స్పష్టమగు వాక్కునందు మన కభిమానము. ఎఱ్ఱయకును వాక్కులో విస్ఫుటత్వము అభిమానము. 'నన్నయ తిక్కనార్యులు భాసురభారతార్థముల పరమార్థము తెనుంగువారికి తెల్లగఁ జేసినారట. గాలవుడు 'విశదవిస్తారముగా' కథ నుపన్యసించెను. రాజస్తవములో అత్రి 'ఎవ్వ నిన్ను గొనియాడు

బరిస్ఫుట వాక్యభంగులఁ' అనెను. శౌనకుడు యాదవుల 'జన్మచరిత్ర ప్రపంచము సమస్తంబును విస్తర ప్రశస్తముగ సుపన్యసింపవలయు' నని యర్థించెను, బ్రాహ్మణుఁడు బ్రహ్మదత్తునికి 'సువ్యక్త వర్ణోచ్చారంబగు నెలుంగున' శ్లోకంబులు వినిపించెను. నారాయణుని సురలు 'ప్రకట మధుర వాక్యంబులఁ బ్రస్తుతించిరి. కృష్ణసంక్రీడనంబుల సంక్లిష్ట విస్పష్టంబులగు వాక్యంబులం గ్రమంబునం జెప్పెను. ఆశ్వాసాంతములందు వైశంపాయ నోక్తి వర్ణన మున్నది. ఒకచో, 'కథాప్రపంచంబు నమంచిత వ్యాఖ్యాన విఖ్యాతంబుగ' ననియు, 'విష్ణుచరిత్రాత్మకం బగు వాఙ్మయం బతిప్రవ్యక్తం బుగ' ననియు ఉపన్యాసము పరిస్ఫుటోల్లాసంబుగ' ననియు. 'వ్యాఖ్యాతం బైన వాక్యజాతం బభిజాతార్థ సమర్థంబుగ' ననియు 'వినిపించిన కథ ప్రశస్త విస్తరఫణితిఁ" అనియు పరిపరి విధముల వర్ణించెను.

ఇట్లు విస్ఫుటముగా విస్తరించుటలో ఎఱ్ఱయకు ఔచితియం దభిమాన మెక్కువ ఔచిత్యావసరమునకు మూలకారణము సత్యవచనాభిమానము. అనుచిత మెప్పుడును అనృతముగా నుండును.

స్తోత్రములో గూఢ నతిశయ వర్ణనము అనుచితము లేని గుణము లున్నట్లు వర్ణించుట నిజమైన స్తోత్రము కాదు. 'మున్నంభోజభవు యాగంబు నందు సుత్యాహమున జననమొంది సూతుండును, మాగధుండును నా నొప్పు సంయమియు నా యజునాజ్ఞ గైవారులై దివిజుల పనినున్కినందుల ఋషులు వేల్పులు బ్రియంబున వారింబిలువఁ బనిచి పృథునరేశ్వరు డిటమీదఁ బేర్మి యొనగ జేయగల కార్యములు సవిశేషకృతులు నాత్మదృష్టిమై గని మీర లతని యెదిరి కేగి కైవార మొనరింపు డింపు మిగుల ననహా రట్ల చేసిరి. పిమ్మట ప్రథు వా కార్యములు నిర్వర్తించెను. వందిమాగధుల కైవారమే సత్యవాక్య మైనచో ఇతర స్తుతు లెట్లుండవలెను.? అది అత్రిగౌతమ సంవా దములో ఎఱ్ఱయ వివరించెను.

అధ్వరదీక్షితు డైన పృథుచక్రవర్తని అత్రి ఆశీర్వదించి "నీవ విధాత విద్రుండవు నీవ సమస్త జనేశ్వరుండవున్, నీవ యశేష ధర్మములు నీవ యెఱుంగుదు.........." ఇత్యాదిగా స్తుతి చేసెను. అది విని సభలో నున్న

గౌతముడు 'కలుషించి ఇటు నో రఘువంగఁ బ్రేలెదవు....అర్ధకాంక్షివై మనమున శంకలేక యొక మానవు నింత నుతింప నేటికిన్?' అని అధిక్షేపించెను. అత్రి తన స్తోత్రము సత్యమని సమర్థించుకొనెను. 'వారు మహానాదంబుగా వాదించుచుండ' కాశ్యపుడు సకల ధర్మజ్ఞుడగు సనత్కుమారుని పాలికి వారి వివాదంబు తెఱం గెఱింగించిన నతండు 'అత్రి నిజంబు పల్కెఁ దగు నాతని వాక్యము ధర్మయుక్తము' అని సమర్థించెను.

ఈ రహస్య మెఱిగిన ఎఱ్ఱయ దేవశ్రవునిచే నిట్లు శ్రీ లక్ష్మీనృసింహావతార* ప్రారంభమున చెప్పించెను.

"ఏనును బెద్దలచే మును
వీను లలర దరతరంబ విన్నవిధంబున్
మానసమున నున్న తెఱఁగు
గానుపునం గన్నక్రమము గథన మొనర్తున్."

నృసింహమూర్తిని "అది బహుభంగులన్ ముని సురావలి తన్వినుతించు వాఙ్మయ ధ్వనులు నభోదిగంత మిళితంబులుగా....దన నరసింహ లీల వినుత స్థితి సార్థకమై తనర్పఁగన్" విలసిల్లెనట. మరియు భారతీవల్లభుండు సల్లాప రూపంబుగా నభిరూపార్థ సంస్తవంబులు గావించె! సావిత్రి స్తుతికి యము డిట్లనెను ;

"తృషితుఁ డగు వాని బరిలఘు
తుషార తోయములు మోదితునిఁ జేయుగతిన్
హృషితాంగుఁ జేసె నను గ
ల్మష రహితములైన నీ సమంజస ఫణితుల్."

---

* ఎఱ్ఱయ తన్ను గ్రంథములలో నెన్నడును ఎఱ్ఱాప్రెగ్గడ అని చెప్పుకోక ఎఱ్ఱయ నామధేయ యనియే చెప్పుకొనెను. అట్లే తన గ్రంథము శ్రీ లక్ష్మీనృసింహావతార మని యెల్లెడ జెప్పెనే కాని నృసింహపురాణ మని యెక్కడ ననలేదు. లోకములో ఈ మార్పులకు కారణమేమో!

మఱియును 'వివిధ భంగి సత్యధర్మ ఫణితి సంస్తుతించుటయు గృపార్ద్రి చిత్తు డగుచు నజ్జముండు' సావిత్రికీ సత్యవంతు నిచ్చెను.

బలదేవ ప్రభావ మడుగగా వైశంపాయనుడు 'వచోబలశాలి యనఁగఁ బరగిన బలరిపుగురునకు, బొగడ భరము నరేంద్రా, అయినను మదీయ బుద్ధి వాక్య ప్రచారంబులకు గోచరంబులైనవి వినిపించెద'నని ప్రారంభించెను.

సత్యవాక్య భంగమునకు ఎఱ్ఱయకు గలుగు కోపము బలదేవునితో ద్యూతములో రుక్మియు, కళింగుడు నన్నృత మాడగా తెలిసి-"సీరాయుధుండు సంరంభంబున సముత్థితుండై పటుముష్టి ఘాతంబున రుక్మిం జఱపి యుఱికి నెత్తపలక యొత్తి కాళింగు దల పగుల నడిచి పండ్లు డులిపి చంపి, యంత నిలువక....పలువురఁ బొడిచేసి....మత్త దంతావళంబు విడివడి యనర్గళ క్రీడం గ్రాలు చందనంబునం జరియించుచు రుక్మిం గొప్పువట్టి సభాద్వారంబునం దాక దిగిచి నిహతప్రాయుం జేసి విడిచె"-అను నిత్యాది వర్ణనలో స్పష్టమగును

కవుల జీవితాదర్శములే వారి కావ్యములలో ప్రతిఫలించును. కవులు ఎంత తీయని మాటలతో వ్రాసినను, ఎన్ని యలంకారములు గుప్పించినను ఏమి అభినవముగా చెప్పుటకు ప్రయత్నించినను వారి జీవితాదర్శములు ఉదాత్తములు కానిచో కావ్యములు కూడ మహాకావ్యములు కానేరవు. కవిత్రయమునకు, వారితోపాటు పోతనకును, కొంతవరకు పెద్దనకును తెలుగుదేశములో ఇప్పటికి నిలిచియున్న విశేష పూజ్యభావమునకు వారల పవిత్ర జీవితములే కారణములు !

ఎఱ్ఱయను గూర్చి ఆరణ్యపర్వాంతమున 'భవ్యచరిత్రుడు, గుణగణ గరిష్ఠత నొప్పు ధన్యుఁడు, ధర్మైకతత్పరాత్ముఁడు, లోకైక విదితుఁడు, ధీర విచారుఁడు, సాధుజనహర్ష సిద్ధి గోరి కవీంద్ర కర్ణపుట పేయముగా' నారణ్య పర్వశేషము పూరించె నని యున్నది.

శ్రీ లక్ష్మీ నృసింహావతారములో 'గురు భజన పరాయణుఁడు' సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథావిస్తరవేది, వినయోదిత భరితుఁడు అతులానుభావ భవ్యుఁడు' అని యున్నది.

హరివంశములో 'అంచిత చరితుఁడు, సకలభాషా కవిత్వ విశారదుఁడు, సాధుసమ్మతుఁడు, నిత్యసౌమ్యమతి, భవ్యుఁడు, ధీరోత్తముఁడు' అని కూడ నున్నది.

ఇవి యన్నియు నతడు తన్ను గూర్చి స్వయముగా చెప్పికొన్నవియు, ఇతరులు అన్నట్లున్నవియు నగు వచనములు. ఏమిటీ ఆత్మస్తుతి యని నేటి వారడుగుదురు. హరివంశాంతమున వాచకలక్షణము లిట్లున్నవి :

"అనసూయుఁ జిత కామరోషుఁ గమనీయాకారు సత్యోక్తిశీ
లు నశేషాగమశాస్త్ర తత్త్వ నిపుణుఁ లోకజ్ఞుఁ బ్రాజ్ఞుఁ శుచిన్
జనతాసమ్మతు భవ్యభక్తి నియమ శ్రద్ధాసమేతుం బ్రియం
బున సత్కారము లొప్ప వాచకునిగాఁ బూజించి యుంచందగున్"

ఇచ్చటి వాచక లక్షణములే పై వర్ణనలోని ఎఱ్ఱయ కన్వయించి యాతని కీ గ్రంథములు చెప్పుటకు గల యధికారమును చూపు చున్నవి.

ఎఱ్ఱయకాలమున ఉత్తరభారతము మ్లేచ్ఛాక్రాంతమైనది. దక్షిణ భాగమున గూడ వారల యలజడి ఎక్కువైనది. పరస్త్రీలను బలాత్కరించు మ్లేచ్ఛుల కథ లతడు వినెనేమో ! అట్టి ప్రయత్నము చేసిన సైంధవుని పాటు నతడిట్లు వర్ణించెను.

"తల్లడపడి యరదము డిగి
విల్లును నమ్ములును విడిచి వెల్లఁ ఏగుచు మే
నెల్లఁ జెమర్పఁగ నూర్పులు
పెల్లుగ నమ్మనుజ పశువు పెలుంచం బఱచెన్."

అట్లు 'మనుజ పశువు' అని వర్ణించుటలో ఎఱ్ఱయ కట్టివారిపైగల యసహ్యము, అతని ధర్మ తత్పరత సూచించును, భీముడు—

"ఒడిసి తలపట్టి నేలం
బడఁ దిగిచిన వాడు పెనఁగ బడుటముఁ జిక్కన్

మెడఁ ద్రొక్కి గాఢ ముష్టిం
బొడిచె మొగం బవియ రక్తపూరము దొరుగన్",

"ఒడలెల్ల బిండి కూడుగ
బొడిచి యొగయనెత్తి త్రిప్పి ఘూర్ణిల్లి మఱియుం
బడవైచి యురము మొగమును
నడిచెను వడముడి తల ప్రహార కుశలుఁడై."

అప్పుడును ఆ శిక్షకు పాత్రుడయినది సైంధవుడే యగుట చిత్రము, సింధు దేశములో నెప్పుడు నేదైన నున్నదా ?

అతనిని ధర్మజుడు, 'నిన్ను నింద్రియ విలోలు నల్పు ధృతివిహీను నేమి యందుము, అరుగుము' అని మాటలతో శిక్షించి పంపివేసెను.

ఇట్టి ఘట్టములలో కవివ్యక్తి కథాయవనిక చాటున నుండి సువ్యక్త మగుచుండును. కామ విలోభక స్పృహాల గర్వపరంపర పొందువాసి.... తుది దాకిన యున్నతిఁ గన్న శంకరస్వామి గురుండు మాతలపు సర్వము దానయి యుండుఁ గావుతన్" అని ప్రార్థించిన ఎఱ్ఱయ తన్ను గూర్చి చెప్పుకొన్నది ఆత్మస్తుతియనఁ దగువా ? గురుభజన పరాయణుడును! వినయోదిత భరితుడు ననుటకు—

"మహాకవిజన ప్రార్థనంబును సద్గురు చరణానుస్మరణ కీర్తనంబును సమర్థించి కృతార్థతం బొంది కతిపయాక్షర పరిగ్రహ జనితం బైన నైసర్గిక చాపలంబు కతంబున"—

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగుభంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తి సంగ సుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్".

అను భాగములు చాలవా ? అట్లు చెప్పఁగలిగినవాడు అతులానుభావ భవ్యుడనుట కేవల సత్యవర్ణనము కాదా !

## 3

రసములు తొమ్మిది యను మతము వృద్ధసమ్మతము. ఐనను అవి ఎనిమిదేయను వాదమును గలదు. అట్టివారు శాంతము ప్రత్యేకరసము కాదనియు, సర్వ రసముల సామరస్యమే అనియు నందురు. ఎఱ్ఱయ అట్టి రసవాది యనుటకు గొంత యాధార మున్నది. వైకుంఠపురములో—

"కూడి సమగ్ర తత్త్వ రసగోష్ఠి సుఖంతురు యోగి బృందముల్
క్రీడ యొనర్తు రష్టరస కీర్తితభంగిఁ బ్రసన్ను లయ్యెడన్"

అని వర్ణించినాడు. క్రీడకు శాంతరసము యోగ్యముకాదు కనుక అష్టరసములన్నా డని, కానిమరి యిక్కడ కావ్యరసములకు ప్రసక్తియే లేదని కాని సమర్థింపవచ్చును. అష్టరసము లని వాచ్యముగా నిచ్చట జెప్పినది బలపరుచు సూచనలు మరికొన్నియు గలవు. ఇతర రసముల పేర్లక్కడక్కడ నతడు గ్రంథములలో ఉదాహరించినాడు గాని శాంతరసము పేరెత్తలేదు. అంతే కాదు. అతనికి అద్భుత రసము అభిమానరసము. అద్భుతరసము అను మాటలు ప్రయోగించి నన్నిమారులు శ్రీ కల్యాణశబ్దములు తప్ప మరి యేవియు నితడు ప్రయోగించలేదు. ఈ మూడు శబ్దములును అతనికి అలవాటైన ఊతపదములా యేమి అనునట్లు తిరిగి తిరిగి వచ్చుచుండును. అద్భుత శ్రీ కల్యాణములే అతని నావేశించి గ్రంథములు పలికించినవా ? అవియే యతని కవితాదర్శములా ? శ్రీ కల్యాణపులు వేరుగా విచారింతుము. ఈ అద్భుతమును ముందు కొంత పరామర్శ చేయుదము.

తార్క్ష్యుని యాశ్రమములో చనిపోయిన బాలకుని మహాద్భుతాత్మకులై చూచిరి. వైవస్వతుని యొడను మత్స్యము అద్భుత వేగంబున నీడ్చెను. బాల కృష్ణుడు ప్రళయకాలములో అద్భుతాకృతి నుండునట. ధర్మజుడు మార్కండేయముని ప్రసాదమున నత్యద్భుత కథా శ్రవణ పరితోషితుడయ్యెను. మండూకాంగన మాయము కాగా అవని విభుడు అద్భుతాత్మకుడయ్యెను. మార్కండేయుడు తనకంటె వృద్ధతముల నెరిగించుట మహాద్భుత

మట : కువలయాశ్వుని తండ్రితో ఉదంకుడు 'విను మొక్క యద్భుతంబు సెప్పెద'నని ప్రారంభించెను. కౌశికుడు ధర్మవ్యాధునితో 'నీ చరిత్రముం గన మది నద్భుతం బొలసె' ననెను. పాంచజన్యుఁ డను పావకుడు పుట్టగా తద్దయు నద్భుతమందె లోకముల్' కుమార స్వామి ముఖమున నద్భుతముగ నుదగ్ర దహన శిఖావళు' లుద్భవించెను. ద్రౌపది కేవురు భర్తలు నను రక్తులగుట యద్భుతము. ధృతరాష్ట్రుడు పాండవుల యరణ్యవాసము విని "ఇట్టివి గదా వివిధాద్భుత కర్మపాకముల్" అనుకొనెను. జనమే జయుడు అద్భుతంబగు దుర్యోధనుని చరితము చెప్పుమని యడగెను. ద్రౌపది భీముని వీర్యము 'అనేక మద్భుత'మని వర్ణించెను. 'అతలంబునఁ గ్రుంగిన నద్భుతముగ దివమునకు నెగసిపోయిన సైంధవునిఁ దెత్తు'మని భీమార్జునులు ప్రతిజ్ఞ చేసిరి వానరులు భూవివరము అద్భుతముగఁ గనిరి.

మరియు నిట్లెన్నిమారులు అద్భుత శబ్దప్రయోగము చేసినాడో లెక్కించిన గ్రంథము పెరిగిపోవును.

అద్భుత ధన్యశబ్దవాచ్యుడెవరో వానికై నారదు డన్వేషించిన మనో హర మగు నొక యాఖ్యాయిక హరివంశములో నున్నది. నారదుడు ముందొక కూర్మమును చూచి దాని కాశబ్దము లన్వయించెను. కూర్మము గంగయే యందుకుతగుననెను. గంగ సాగరమే అందుకు పాత్ర మనెను. సాగరము భూమిని నిర్దేశించెను. భూమి తన్ను ధరించు కులగిరులను జూపెను. కులగిరులు విశ్వమునకు పితామహు డాధారము గనుక పరమాద్భుతం బతండే'యనెను. నారదుడు బ్రహ్మను అద్భుత ధన్యపదములతో సంబోధింపఁగా నతండదరిపడి యట్టి ప్రభావము కలవి వేదములే యనెను. అంతట నారదుడు వేదముల నారాధించి సాక్షాత్కారంబు నొందించుకొని బ్రహ్మవాక్యము లివి అని చెప్పెను,

"అనపుడు వేదములు తపో
ధనవర యాశ్చర్య ధన్యదశ కర్తలమే
యనుపమ మహత్త్వ కలితము
లనంతములు యజ్ఞములు సమగ్రోదయముల్."

"ఏము గల్గుట యెల్లను యజ్ఞార్థంబ యజ్ఞార్థంబులు లేనినాడు మా కలిమియుఁ నిరర్థకంబ మాకుం బరమ పరాయణంబులు యజ్ఞంబుల కా నెఱుంగుము"—అనెను. అంతట నారదుఁడు యజ్ఞంబులఁ బ్రత్యక్షంబు గావించి అద్భుత ధన్యశబ్దవాచ్యములుగాఁ బలికి వాని పరమప్రభుత్వము కొనియాడఁగా నధ్వరము లిట్లనియె :

"మా కాత్మ విష్ణుఁ డాతఁడు
గైకొని నడసంగఁ జెడక కలుగు నిరుపమో
త్సేకం బగ్నియు హవియు న
నాకులమంత్ర శుభతతు లతఁడ మునీంద్రా !"

"ఇట్లగుటం జేసి యాశ్చర్యధన్య శబ్దంబులు రెంటికి వాచ్యుం డమ్మహాపురుషుం డని చెప్పిన యధ్వర్యంబుల పలుకులు విని"

యాదవ గోష్ఠిలో శ్రీకృష్ణ భగవాను డుండంగా సకలజన శ్రోత్ర సుందరంబగు చందంబు గల యెలుంగునఁ గనుంగొని

"అమరులు లోనగు జనముల
నమితాద్భుత కీర్తితో మహాధన్యుఁడ వో
కమలాక్ష నీవు, నీతో
సము లెవ్వరు నిక్కమునకుఁ జర్చింపంగన్".

"అనిన నవ్వుచు నవ్విభుఁ డతనితోడ
ననఘ ! యద్భుతాత్మకుఁడ నత్యంతధన్య
తముఁడ నగుదు నే నొకఁడన విమలదక్షి
ణాఖ్యుపేత సద్భావ మమరు నేని"

"నా విని నారదుండు యదునాయక నా చను దెంచినట్టి కా
ర్యావధి సిద్ధ మయ్యెఁ బ్రియమందితిఁ జెచ్చెఱఁ బోయి వచ్చెదన్"

అని గమనోన్ముఖుఁ డయ్యెను.

అద్భుతరసమున కింత యతిశయ మేమి ? ధన్యశ్బ్దముతో పాటు అద్భుతశబ్ద ముండుటకు కారణ మేమి ? కేవలాలంకారికులకు అద్భుతరసము నుత్కృష్టత ద్యోతకము కాకపోవచ్చును. వారికి శృంగారము ప్రథమారాధ్యము. కొందరికి వీరము. ఉత్తమ నాటకములు శృంగార వీరములలో నేదో ఒక రసము ప్రధానముగా నుండవలెనని వారి మతము. భవభూతి కరుణయందు అభిమానము చూపినాడు. ఇప్పుడిప్పుడు హాస్యమును కూడ కవులు ఆదరించుచున్నారు. కాని అద్భుతము ఎల్లరి యభిమాన మనుటలో సందేహము లేదు. పై యాఖ్యాయికచే వ్యాసమహర్షికే దాని యందు పక్షపాతము కనిపించును. భారతము శాంతరస ప్రధాన మనియు, దానికి నాయకుడు శ్రీకృష్ణు డైనట్లును పెద్దలు నిర్ణయించినారు.

శివశక్త్యాత్మక మైన శ్రీచక్రరాజార్చనము మన దేశములో అనాదిగా నున్నది. శ్రీచక్రరాజము నవావరణాత్మకము. అందులో అగ్రస్థాన మలంకరించునది బిందువు. ఆ పిమ్మట త్రికోణము కలదు· తొమ్మిదవ దానికి భూపురసంజ్ఞ. ఈ తొమ్మిది ఆవరణములను తొమ్మిది చక్రములని భావన చేయుచు వానిని ఇతర భావనలతో పాటు నవరసాత్మక భావన చేయుట కూడ గలదు. ఒక్కొక్క చక్రము, అనగా ఆవరణ ఒక్కొక్క రసాత్మకము. అందు భూపురము శృంగార రసాత్మకము: త్రికోణము అద్భుత రసాత్మకము; బిందువు శాంత రసాత్మకము. శాంతమునకు స్థాయి నిర్వేదము. అందుచేత శాంతరసాత్మక భావనకు పుష్కలాధికారులు సర్వసంగ పరిత్యాగము చేసిన పరమహంసలే. గృహస్థు అగు ఎల్లరియు దానికి అవ్యవహిత మగు అద్భుత రసభావము హృదయ పద్మములో ఆరూఢము చేసికొనెనా ? ధన్యశబ్దము శాంతరసోపాసనాసిద్ధులకా ?

బృందావనములోని గోగణంబులను వర్ణించుచు నతఁడు- "శ్రుతి విభవంబులుంబోలె లోకోద్ధారకంబులు, విష్ణు కీర్తనంబునుం బోలె శ్రవణ మంగళంబులు, నధ్వరంబులుంబోలె నిత్యనిర్మలంబులు, మంత్రంబులుంబోలె రక్షణీయంబులు, దైవంబులుంబోలె నర్చనార్హంబులు, గురువులుంబోలె నిరంతరాను వర్తన పరితోష్యంబులు, శ్రీ విశేషంబులుం బోలె నఖిల లోక చకీర్షంబులు, భావంబులుంబోలె రసజనకంబులు"-అని వర్ణించెను.

ఈ శంభుదాసుడు శ్రీ చక్రరాజార్చ నాతత్పరుడా ? ఆ చక్రమునే ఒక ముఖముగా చూచిన శక్తిచక్ర మనియు, మరియొక విధముగా చూచిన శివచక్ర మనియు రూఢి యున్నది. అతడు శివకోణములు సమ్ముఖము చేసికొని యర్చించువాడా ?

## 4

ఏమో! కాని యొక్కటి మాత్రము నిశ్చయము. అతనికి అద్భుతశబ్దము నందు కంటె గూడ శ్రీ శబ్దము నందెక్కువ పక్షపాతము కలదు. శ్రీ శబ్దము నకు పర్యాయ పదమా యన్నట్లు కల్యాణ శబ్దమును కూడ నతడట్లే తరచుగ ప్రయోగించెను.

శ్రీ శబ్దమునందు తెలుగు కవు లందరికిని విశేష మభిమాన మున్నది. కాని ఎఱ్ఱయది నిరుపమానము. శ్రీ కల్యాణ శబ్దములు పాదపూరణకు. పద్యపూరణకు నుపయోగించి యతడు తన గ్రంథము లన్నియు శ్రీ కల్యాణాంకితములు చేసెను. అద్భుతశబ్ద ప్రయోగము చేసిన యెడల నెల్ల సందర్భ శుద్ధి ఉన్నది. కాని ఈ శ్రీ కల్యాణ శబ్దములు అతడు అక్కడక్కడ ఆశ్వ విశ్రమించుటకు మాత్రమే వేసెనా యనిపించును. అతని హృదయ కుహర ములో నిత్యనివాసము ఏర్పరచు కొనిన రెండు మహామంత్రములు – రెండు దివ్యనామములు–, ఏమైన నీవిధముగా అప్రయత్నముగ బహిర్నిస్సృతమై అతని హృదయగతాదర్శమును సఫలము చేయుచు లోకమునకు వెదజల్లు చున్నవా ?

కావ్యములను ఆశ్వాసాది పద్యములను శ్రీకారముతో ప్రారంభించుట ఇతరాంధ్ర కవులకువలె ఎఱ్ఱయకును సామాన్యము. కాని 'శ్రీకరదై తేయత నూభవోద్భవ కథాకల్యాణ ముద్ఘోష మైనిండారె' నన్నాడు ఎఱ్ఱయ. కుమారస్వామి 'శ్రీసమేతుఁడై విశేషకాంతి స్ఫూర్తి నొలసెను'.

"ఏ దినమునందు షణ్ముఖు
శ్రీదేవి వరించెఁ గమల చిహ్నితకరయై

యాదివసము పంచమిలో
కాదరణీయంబు లక్ష్మి కాస్పద మయ్యెన్".

సైంధవుడు 'శ్రీ విహీనుల గరం బర్థింతురే కామినుల్'? అని యడిగెను. రామభద్రుడు శ్రీరమణీయుడు. అట్టి రామభద్రుని నడవికి పంపించి 'దుష్కీర్తి నాయాదల గీలుకొల్పి శ్రీకి నెడపెదవా'? అని భరతుడు తల్లి నడిగెను.

"ఇద్ధవైభవ శ్రీసుఖసుస్థిరాయువులఁ జెందగఁ బాత్రమ వై తనర్చుటన్" జనమేజయునకు హరివంశోపదేశము ప్రారంభించెను. 'చరణపీఠ శ్రీకున్నతి యొసగఁ బృథుఁడు చెన్ను వహించె'నట. 'పితరులు వసింతురు శ్రీతోడ'. ఆశ్వాసాంతసంబోధనలో 'సత్కృపముఖ శ్రీ ప్రీతగీర్వాణ' యనియు, 'రామాయణ హరివంశ శ్రీ మన్మధురప్రసంగ ... శ్రీ మల్లచమూవరేణ్య ....' అన్నాడు. 'వైదేహకన్య....అతని చేతోదయిత యయ్యె సాక్షాచ్ఛ్రీదేవి యయోనిజాత సీత యనంగన్', శ్రీకృష్ణుఁకు శకటాసురభంజన సమయమున 'శ్రీ రమ్యాంఘ్రి యుగంబు గింజుకొనె'నట. ఆశ్వాసాదిలో నొకచో 'శ్రీకర కవి ప్రబంధములు' అనెను. గోపాంగనలు 'శ్రీసంపన్నము లైన పాటలముల' నలంకరించుకొనిరి.

"నీకేలఁ దగిలి శ్రీనిత్య మై తనరు నిర్వేణువు త్రైలోక్య వినుత పదము" అని వాసుదేవ భరద్వాజులు స్తుతించిరి. గోగణములు 'శ్రీవిశేషంబులుం బోలె నఖిలలోక చకిర్షంబు'లట. గోవిందునికి 'అభిషేకశ్రీ మేనం జేసెను. సురపతి యీ నిఖిలంబునకుఁ బరమహిత మగు పొంటిన్'. 'గోపాలురు తద్వేణు రవాపూరములోన మునిగి యానందరస శ్రీపరిణతి నాత్మీయ వ్యాపారము లెల్ల వదలి రవిచేష్టితులై'. కంసుడు వసుదేవుని సభలో 'ఒక్కపడుచుఁ దే తెచ్చి పోరించి యే శ్రీకింబాత్రమవై తలర్చెదవు'? అని నిందింపగా, యాదవస్థవిరు డొక డాతని 'శ్రీదక్కి వనంబులో జడలు దాల్పఁగఁ బోయెడునట్లు' మాటలాడుదూవా యని మందలించెను. 'వాసుదేవు చరణ ద్వంద్వంబు నూతన గోమయంబున ననర్ఘ శ్రీ' దనర్చెను. రామకృష్ణులు 'పుట్టినకోలెఁ బురశ్రీ లెట్టివో' యెరుగరు. రాజదర్శనమునకు పోయెడి వారికి 'శ్రీమెదిల్లంగ మంచి చీరలు వలయును'. 'ఇంద్రచాపద్యుతి శ్రీలం గ్రాలిరి'.

'రామకృష్ణులు, మల్లులు కంసుని' విశ్వశ్రీలను భజింపు మనిరి. గురువు 'కేశవుఁ డీ శ్రీనిండారఁగ నొక్క కౌఁగిటన యర్థిం జేర్చెను'. వారు విద్యాభ్యాస మై తిరిగిరాగా - శ్రీనిండారఁగ నొక్క కౌఁగిటన యర్థిం జేర్చెను'. వారు విద్యాభ్యాసమై తిరిగి రాగా -

"లలితాయతనంబులలో
సలఘు సమభ్యర్చనముల నంది తనరు వే
ల్పుల ప్రతిమలను బ్రసన్నత
కలిమి యెఱింగించె భద్రకాంతి శ్రీలన్".

'మహాత్మ రామసుఖ శ్రీభాగి' యని గోపవృద్ధులు పొగడిరి. 'యాదవు లతిలోక భుజశ్రీ దర్పితు'లట. రేవతి 'వినయశ్రీ వినుత'. రథాశ్వగజబృందశ్రీ వెలర్పంగ రుక్మి మగధనాథు నెదుర్కొనెను. నారదుడు సనాతన యోగశ్రీ కుశలుడు. రుక్మిణి యలంకారములు 'సాధక సాధన శ్రీల'వలె నున్నవి. రుక్మిణీ కల్యాణము చూచుటకు 'భవోజ్జ్వలాలంక్రియల్ విభవశ్రీలఁ దలిర్ప వచ్చిరి.' శ్రీమత్కవితాగర్విత యని యాశ్వాసాది. 'స్థితి కాలంబున దుగ్ధసాగరములో యోగసుప్తి రతుఁడై శ్రీదేవీ పాదాంబుజ ద్వితయం బంకతలంబుపై నిడి ప్రమోదింపం బ్రమోదించు నట అచ్యుతుడు. 'చిత్రోరు చాపశ్రీ నిండారఁగ' కృష్ణుడు యుద్ధము చేసెను. యోగమాయను సంబోధించుచు నారాయణుడు, 'శ్రీయు....హ్రీయు... విద్యయు....సంధ్యయు.... అను నామంబులు నీకు వాచకంబులుగా మహామునులు కీర్తింతురు'. అనెను.

ఇట్లే శ్రీపదయోగము ఎన్నియెడలనేని గలదు, చిత్రము ! ఎఱ్ఱయ గోత్రమే శ్రీవత్స గోత్రము ! అంతకంటె గూడ కల్యాణ శబ్దప్రయోగము అతని కావ్యములలో తరచుగా కానవచ్చు చున్నది.

"అప్రియముల యందును బ్రియముల యందును హైన్యహర్షంబులఁ దగులక యున్నట్టి కల్యాణవర్తన కాంతు లెవ్వ"అని ధర్మవ్యాధుని ఉపదేశము. కాకుత్స్థకుల ప్రదీపకుడు కల్యాణ కీర్తనుడు. యాజ్ఞసేని పరమకల్యాణి ధర్మసంభావనీయ."

"సవిత్రివాఁడి 'త్రిజగత్కల్యాణిఁ బ్రార్థించి.. కావునఁ జెప్పెదఁ గల్యాణావహ మహనీయ రచన హరివంశము' అని ముందుగా ఎఱ్ఱయ ప్రతిజ్ఞ చేసినాడు. 'కరుణాకల్యాణ' యని యాశ్వాసాంత సంబోధన. నందుఁడు 'గోవులఁ బూజించి గోవాటం బలంకరించె నిట్టి కల్యాణంబున సంతసిల్లెను', 'సుధాశీకరముల మెయిజిలుకునట్టి కల్యాణం బా పురుషోత్తమునకు నొదవును! 'గోపాల దేవమూర్తి యఖిల శోభా కలాప కల్యాణి యయ్యెను.' కలకల్ దేఱి తనర్చె నేఱులు శరత్కల్యాణ కల్యాకృతిన్' 'మాద్యద్భూత బేతాళకీర్తన కల్యాణవిధి ప్రసిద్ధ బహు సంగ్రామంబు'లగు నాయుధములు వచ్చెను. యాదవులు బలరామునితో 'మీ వారసువారే వారు. వారు కల్యాణావాసు లుదార' యనిరి. 'అంత వా రందరును చేతో విలాస కల్యాణంబు .లగు మాల్యంబులు అనేకంబు లా కల్యాణ మూర్తికి సమర్పించిరి'. నారదుడు అవతార కథలు చెప్పఁగా యాదవులు విని 'ఇమ్ముని పుంగవుండు మన కింత కల్యాణం బొనర్చునె' అని యాశ్చర్య పడిరి. రుక్మిణి 'పుంసవన సీమంతాద్యనుపమ కల్యాణంబు పొనర్చెను: హరివంశ కథాశ్రవణ ఫలము చెప్పుచు—

"భారతము గోపు విప్రుడు
భారతియును జాహ్నవియును బద్మావిభుఁడున్
గోరి నిరంతర చింత్యులు
గా రూపించు సుజనుండు కల్యాణి యగున్."

ఎఱ్ఱయ తన హరివంశములో ఒక్కటే సంస్కృత శ్లోక ముంచినాడు.

"నమః కైవల్యకల్యాణ కల్యానంద విధాయినే
నారాయణాయ మహతాం వరదాయ వరీయసే !"

నారాయణుఁడు వరాహరూపమున దన్నుద్ధరింపగా భూదేవి యాతనిని—'నీ వెవ్వరిం గానం బూనితి హరు ధన్యులు జగత్కల్యాణ నారాయణా !' అని స్తుతించెను. ఇంతేకాదు. బృందారకులు పురుషోత్తము నికి మ్రొక్కుచు విశ్వరూపము భావించుచు చేసిన స్తోత్రములో,

"ద్వైత భ్రాంతి వికల్పితంబు ఖిలముగా స్వప్నేంద్రజాలోపమం
బై తూలన్ బృథు రజ్జు సర్ప సదృశ వ్యామోహ విచ్ఛేదనం
బై తత్త్వజ్ఞత యావహిల్లి యపరోక్షాభేదవిత్సౌఖ్య వి
ఖ్యాతుం గాంతురు నిన్ను నౌపనిషదుల్ కల్యాణనారాయణా!"-అనిరి.

ఎఱ్ఱయ తాను 'శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్యుండ'వని గద్యలలో సగర్వముగా చెప్పుకొనినాడు. తన గ్రంథములలో శంకరస్వామి స్తోత్రము ప్రత్యేకముగా చేసినాడు. శాంకరపీఠస్వాములందరకు శంకరస్వాములవారను సామాన్య నామము రూఢియైనది కాని వారి వారి గురువు లిచ్చు సన్న్యాస దీక్షానామములు వేరుగా నుండును. ఎఱ్ఱయ గురువులగు శంకరస్వాముల దీక్షానామము కల్యాణపదముతో కూడి యుండుటచే నది యిన్ని విధములు ద్యోతమైనదా ? గురునామములు ప్రత్యక్షముగా చెప్పక గోప్యముగా నుంచుట కొందర కాచారము కదా ! అందుచే ఎఱ్ఱయ యుపాస్యస్వరూప నామమే కల్యాణమా ? కాక ఎఱ్ఱయయే కల్యాణయోగియా ?

శాంకరపీఠస్వాము లందరును భారతీయ సంప్రదాయ యతులు. అందుచే సరస్వతీదేవి నామములలో ఎఱ్ఱయకు భారతీశబ్ద మభిమానము. బ్రహ్మదేవునిం గూడ 'భారతికి గాదిలి' యని యతడు వర్ణించెను. ఆరణ్యపర్వము ప్రారంభించిన కొద్ది వ్యవధిలోనే సరస్వతీగీత ఘట్టము వచ్చెను. తార్క్ష్యుడను మునివరుడు భారతి నారాధించి, ప్రత్యక్షము చేసికొని ధర్మస్వరూప మామెను ప్రశ్నించెను. వేదాధ్యయనము, నానాధ్వరములనే ధర్మ మని చెప్పి మరియు, "అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము.... నేను మహనీయంబైన యగ్నిహోత్రముఖంబునం బ్రభవింతును"—ఇత్యాదిగా చెప్పగా తార్క్ష్యుడు కృతాంజలి యై—

"అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబర వీధి విశ్రుతవిహార ననుం గృపఁజూడు భారతీ"

అని వినుతించి కృతార్థు డయ్యెను. ఈ స్తోత్రము మూలములో లేకున్నను ఎఱ్ఱయ చేర్చుట యాతని యభిమానమును తెలుపును. ఇది కొన్ని భాగవత ప్రతులలోనికి గూడ నెక్కించుటచే పోతన పద్య మను భ్రాంతి లోకములో వ్రాకినది. మరియు నా భారతి యెట్టిది ?

"వరవస్తు ప్రతిపత్తి ధుర్యమగు నైశ్వర్యంబు పంచాశద
క్షర సంసిద్ధ సమస్తశబ్దరచనా సంవ్యాప్తి నుద్దీప్తమై
పరగం గల్పలతాసమృద్ధి యగుచుం బ్రజ్ఞావిశేషాఢ్యులన్
గరుణం బ్రోచు సవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్."

ఈ భారతీదేవిని ఎఱ్ఱయ అపూర్వముగ భావించినాడు. శ్రీలక్ష్మీ నృసింహావతారములో—

"కరకమలం బొసంగ బటికంబు గమండలు వంటి కాంతి భా
సుర మగు మౌక్తికంపు జపసూత్రముఁ దాల్చుట బ్రహ్మవాద మై
పరగిన హంసముం బిలిచి బాలమృణాలముఁ జూపు చందమై
సిరి తిలకింప నొప్పు బుధసేవిత మూర్తిఁ దలంతు భారతిన్".

భారతిని బ్రహ్మవాది యగు పరమహంస పరివ్రాజ కాచార్యునిగా భావించుట శంకరస్వామి సంయమీశ్వరుడు తన తలపు సర్వము దానయి యున్న యాతని శిష్యుం డగు ఎఱ్ఱయకే సాధ్యమైనది.

మన దేశములో భారతీభారత శబ్దములకు గంభీర మగు స్వరూప మున్నది. ఈ దేశములో ప్రభుత్వ మెవరు చేసినను, రాజనామను అన్వర్థ ముగా ధరింప దగినవారు. పట్టాభిషేకము వైదికమంత్రములతో యథావిధిగా నైనవారే. అట్టి వారిలో నెల్ల తక్కువవానికి 'సమ్రాట్టను సంజ్ఞ ఉన్నది. అతడు సమ్రాట్టయినను చక్రవర్తి యైనను అభిషేకానంతరమున చేరినపెద్దలు "ఇతడు మీకు రాజు భరతుఁడు" అని మహాసభలో ప్రకటింతురు. అట్టి యభి షేకమైన రాజులందరికి భరత సంజ్ఞ వేదోక్తము. అట్టివారే ఇక్కడ అనాదిగా రాజులు గనుక ఇది భరతభూమి, భారతము. ఆసేతు హిమాచల మధ్యస్థ భూమియందును ఉన్న ఈ కర్మసమానమే.

ఇట్టి పవిత్ర మగు భారతిని ఉపాసించువారల జీవితాదర్శ మేమి ?—

"మగ పొడవు లెల్ల శివుడును
మగువలు శివ యెనెడు శ్రుతుల మాటలు నిక్కం
బుగఁ దులుపు భంగి దత్సము
లగు గణదంపతుల యొప్పు లప్పుడు మెఱసెన్."

ఈ లోకయాత్ర చేయునపుడు స్త్రీ పురుషులయందు యోగులైనవారి కెట్టి భావన యుండిన కృతకృత్యు లగుదురో ఎఱ్ఱయకే తెలిఁయును. ఎఱ్ఱయ పూర్ణదీక్షాభిషేక పవిత్రీకృతాంగుడు. అతని దీక్షానామము కల్యాణ యోగియా యను సంశయము కలుగును. కాని విజ్ఞానయోగి యని తోచును. శ్రీ లక్ష్మీనృసింహావతార కథ వ్రాయుచు తన తండ్రి 'శ్రీ సూర్యుఁ డీ విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్" అని ఆశించెను. మరియు గ్రంథములలో పలుతావుల నా విజ్ఞానశబ్దము చేర్చిన విధానము కూడ ఆ ఊహనే బలపరచుచున్నది. కాని ఏమైనను అది ఊహ మాత్రమే.

భారతీదేవిని పరివ్రాజక రూపముతో భావించుటే కాదు. అతడు చేసిన వింత వర్ణన : వసంతాగమము ఏకవికి అభిమానము కాదు ? ఎన్ని విధముల గాదు ? కాని ఎఱ్ఱయ కది యెట్లు భాసించినది ?

"చిగురుం గెంజడ లొప్ప బుష్పరజము ల్సెల్వార నున్మ్యాదిపూ
తగ తేఁటేటల చుట్టుకోలు జపసూత్ర శ్రీలుగాఁ గోకిల
ప్రగుణామ్నాయాధ్యయనంబుతోడ సకలారామంబులుఁ శాంభవం
బగు దీక్షావిధి నొందఁగా వెలసె జైత్రారూఢి విశ్వంబునన్."

మంత్రదీక్షా భేదములలో విపులమైన ఒకానొక విధానమునకు శాంభవీ దీక్షయని సంకేతనామము కలదు. దాని ఫలము తంత్రములలో నిట్లున్నది :

"గురో రాలోక మాత్రేణ భాషణాత్ స్పర్శనా దపి
సద్య స్సంజాయతే జ్ఞానం సా దీక్షా శాంభవీ మతా".

ఎఱ్ఱయకు వామాచారము నందు గల యసహ్యమును నాలుగు తావు లలో ప్రదర్శించినాడు. ఒకానొక సందర్భములో శ్రీకృష్ణుడు "అహంకా రంబు పూరించెనే వామాచారుఁడు మృత్యువన్ ఖలుడు సావంగోరె గాకేమి" అని విజృంభించెను. జనమేజయుడు 'ఈయసతిన్ మదీయగృహా మిప్పుడ వెల్వడఁ ద్రోసిరండు కౌలేయక లీఢమైన హవి లెస్సఁగఁ జూతురె?' అని భార్యను పరిత్యజించెను. కలియుగ ధర్మములు చెప్పుచు నందు—

"గొనకొని బ్రహ్మవాదు లయి కొందఱు మద్యముఁ గ్రోలి మాంసమున్
దిని ధనవాంఛమై జనులఁ ద్రిప్పుదు రుగ్రపు వంచనంబులన్"

అని స్పష్టముగా నిందించినాడు. మరియు పిశాచనాయకు డగు ఘంటా కర్ణుడు.

"ఇదే భూదేవశవంబు పావనము నీ కే భక్తి నర్పించెదన్
సదయాత్ముల్ నతులైన యాశ్రితుల యర్చల్ గొంద్రు నిశ్శంకతన్"

అని శ్రీకృష్ణుని ప్రార్థింపగా —

"పీనుగు నంటరు మాదృశు
లై నెగడెడు పెద్దవార లటుగాన మహా
మానోన్నత నీ యిచ్చిన
యీ నీచపుఁ బూజనంబు హేయము నాకున్."
అని యాతడు నిరాకరించెను.

మహాభారతమునం దెల్లెడల గానవచ్చునట్లే హరివంశమున గూడ దుర్గా స్తోత్రాదులు కానవచ్చు చున్నవి. అవి ఎక్కడ వచ్చినను అన్నిటికి మూలమైన దుర్గాసప్తశతి వివరణములుగనే ఉన్నవి. అనిరుద్ధుడు బాణుని నాగపాశముచే బద్ధుడై బాధపడుచు చేసిన ఆర్యాస్తోత్రము హరివంశములో కెల్ల విపులమును, ఉత్తమమును ఐనది. ఎఱ్ఱయ అది వదలక వివరించెను.

విరాటనగర ప్రవేశమునకు పూర్వము ధర్మజుడు చేసిన దుర్గాస్తోత్రమే ఆరవ అధ్యాయమంతా! అది యంతయు తిక్కన సోమయాజి వదలివేసెను.

అట్లే భారతయుద్ధమునకు ముందున్న దుర్గాస్తోత్రము కూడ తిక్కన తెనిగించ లేదు. ఇట్లు వదలుటలోనను, గ్రహించుటలోనను వారి వారి యాదర్శముల నను మేయింప వచ్చునుగదా !

## 5

"ఈలోక మయురు గొందఱ
కాలోకము కొందఱకు నిహంబును బరముం
మేలగు గొందఱ కధిపా
యే లోకము లేదు వినవె యిలఁ గొందఱకున్."

ఇహపరలోక సాధకమైనది శ్రేయస్సు, శ్రీ, కల్యాణము : అట్టి శ్రేయస్సు లోకమునకు కలిగించుటకే ఎఱ్ఱయవంటి తపస్వులు కావ్యరచన కుపక్రమించినారు. అతనిని శ్రీ లక్ష్మీనృసింహావతార కథ గావింప నాతని పితామహుడు 'జగద్ధితంబు గానే' యనిచెను.

కావ్యరస పాకముల సమ్మేళనములోననే గాక ఎఱ్ఱయ తన జీవయాత్ర యంతయు మహాయోగిగనే గడపెను. అతని దృష్టిలో భగవంతుడు, నారాయణ నామ మైనను, శంకర స్వరూప మైనను,

"తలపులకు జేరుగడ తాన తెలువులకును
నిక్కఁ దాన పలుకులకు నెడము దాన
యజరు డమరు డనంతుఁ డవ్యయు డచింత్యుఁ
డనఘుఁ డజుఁ డంచితశ్లోకుఁ డచ్యుతుండు."

ఆ భగవంతునిఁ బొందుట యన నాత్మజ్ఞానము సంపాదించుటే. తన గ్రంథమున ఈ ఆత్మయోగము నెన్ని యెడల నేని అనుభవజ్ఞు నివలె వర్ణించెను.

"ఇది పరమయోగి దర్శన
విదితం బిప్పాటఁ బవనవిదు లైన మునుల్
వదలక యభ్యాస విధిన
ముద్రమున ధరియింతు రాత్మ మూర్ధతలమునన్"

అనియు,

"అనుదినంబు నియతాశియు, జితేంద్రియుఁడు నై పూర్వరాత్రమ్మునఁ నపర రాత్రమ్మునందు యోగధారణ నిరతుఁడై యుండవలయు; నప్పుడ బోధదీపంబున నాత్మ నాత్మయందుఁ గనుచు నివాతదీపానుకారి యై వెలుఁగుచు నమృత మయత్వ మొందు"

అనియు,

"శుక్రప్రముఖు లయిన వీరందఱు యోగవిద్యా ప్రవర్తకులు" అని ఆ యోగ ప్రవర్తకుల నొకచో వర్ణించెను. అగ్రిమబోధనిధియగు సనత్కుమారుడు మార్కండేయున కిట్లుపదేశించెను :

"సకల క్లేశ నిబర్హణంబును మహాసారంబు సర్వార్థ ద
ర్శకముఁ సిద్ధనిషేవితంబు నగు సూక్ష్మజ్ఞాన యోగంబు నీ
వకలంక స్థిరబుద్ధి దాల్చి నియతాహారుండ వై యింద్రియ
ప్రకరోచ్ఛేద మొనర్చి యుండుము పరబ్రహ్మంబు ప్రాప్తం బగున్."

"యోగధర్మంబునకు నెక్కు డొక్కటియును
నిఖిలమందును లే దిది నిశ్చయంబు
నీ మనమునందు నిక్కంబు నిల్పితేనిఁ
జేరుఁ గాలక్రమంబున సిద్ధపదము."

ఆ తర్వాత కొంత కాలమునకు ఆ మార్కండేయునికి —

"విజ్ఞానము మునుపుగ భ
వ్యజ్ఞానము దివ్యచక్షు రన్వితముగ స
ర్వజ్ఞుఁ డగు నమ్మహాత్ముని
యాజ్ఞన్ ప్రాదుర్భవించె నప్పుడు నాకున్."

అట్లే కౌశికపుత్రులు కూడ ఎంతో శ్రమపడి తుదకు —

"రాగాది దుర్లభంబు ను
పాగత సత్వాద్వయోదితానంద నిరు
ద్వేగము నగు యోగం బా
యోగీశ్వరు లొంది చెంది రుత్తమసిద్ధిన్."

ఇట్టి వెన్నియైన గలవు. ప్రత్యక్షముగా నిట్టి యోగవివరణలే కాక ఉపమాన రూపముగా గూడ యోగవిషయములు దొరలుచుండును. "యోగ నియమంబునుం బోలె బవనపరిచయ జనితకుండ ల్యుల్లాసంబును... పరబ్రహ్మాం బునుం బోలె నారణ్యకోద్గీత మాహాత్మ్యంబును .... వేదాంత సారంబునుం బోలె మహాయోగి ధర్మనోపలాలితంబును" అని ఇట్లెన్నియో కలవు.

కాని ఎఱ్ఱయకిష్టమైనది హఠయోగమును గాదు; వేదచోదిత కర్మల పరిత్యజించు మెట్ట వేదాంతమును గాదు. అశుచిగా అశాస్త్రీయముగా పర వశ భావముతో ప్రదర్శించు నుత్తర భారతమున విపులప్రచారము గన్న భక్తి యనునదియు కాదు. వేదాధ్యయనము చేసి వేదోక్త యజ్ఞము లాది గల ధర్మము లాచరించి యందుపై నిరూఢమతులైన వారికి చిత్తశుద్ధిచే గలుగు పరమయోగమే యతనికి సమ్మతము!

"సోముఁడు వత్సముగా సు
త్రామగురుఁడు దోహకుఁడుగఁ దగ నఖిలచ్ఛం
దోమయ పాత్రికఁ బితికి ర
సామయులగు మునులు బ్రహ్మ మను దుగ్ధంబున్."

వైదిక కర్మలయందు అతనికున్నంత అభిమానము తిక్కన సోమయా జికే కాక నన్నయకే ద్యోతము కాదు. అతని అభిమానమును ఎన్నియో ఉపమానములే రూపించును. "పావకునకు నభిమంత్రితమై వేల్వఁగఁ బడిన హవ్య మధిక సముద్వేగావహ మైనట్లు" అనియు, మరియు ద్రౌపదిని సైంధ వుడు ఎత్తుకొని పోయిన సందర్భమున "బూదిలోఁ దొరగిన పూర్ణాహుతియుఁ బోలె .... వినునె సన్మంత్ర విశ్రుత పురోడాశంబు శునకమునకు ...." అనియు ఉపమించెను. మఱియు —

"ఖేదము లేక యజ్ఞమయ కేసరముల్ గదలంగ విస్ఫుర
న్మేదుర హేషితధ్వను లమేయములై ప్రణవస్వరూపతః
రోదసి నిండఁగా హయశిరోవపు వొప్ప యుగాంత సంప్లుతిన్
వేదము లుద్ధరించిన పవిత్రయశుండవు నీవు శ్రీనిధీ!"

అని హయగ్రీవ స్తోత్రము చేసిన ఎఱ్ఱయ జిహ్వ ఎంత పవిత్ర మైనదో ఊహింపదగినదే కాని వర్ణింప సాధ్యము కాదు,

ఇట్టి మహాయోగి తన గ్రంథము నరాంకితము చేసెనే యని ఈ కాలపువా రడుగుదురు. పోతన 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములుఁ సొమ్ములు కొన్ని పుచ్చు' కొనుట కిష్టము లేక శ్రీహరి కిచ్చి భాగవతము చెప్పినదాది దేశములో ఎన్నియో కథలు వ్యాప్తమైనవి. అంతకు ముందే తిక్కనయు, సోమనయు హరిహరాంకితముగను, నృసింహాంకితముగ ఎఱ్ఱయయు కావ్యములు రచించి యుండిరి. అంతేకాని గ్రంథముకు నరాంకితము చేయుట దోష మనియు, భగవదంకితము చేయుట విశేష మనియు భావింపరాదు.

ఒకవేళ భాగవతము వంటి భక్తి గ్రంథముల భగవంతుని కంకితము చేసినను ప్రమాదము లేదనవచ్చునేమో గాని మహాభారతమువంటి ధర్మప్రబోధక గ్రంథములు ఉత్తమ రాజాంకితము చేసినప్పుడే కవికర్మ కృతార్థత నొందగలదని ఖండితముగా జెప్పవచ్చును. ధర్మమును లోకములో ప్రతిష్ఠించి అది పాలించి ఆచరణలో పెట్టించగలవారే నిజమైన రాజులు. అట్టి రాజులకు ధర్మ ముపదేశించినచో ప్రయోజనము ఘటించును గాని వేరు విధముగా కానేరదు. ఈ ధర్మోపదేశకులు దేశికులు. వారు ధనాపేక్షతో ప్రభువుల నాశ్రయించు తర్వాతి కాలపు ఆస్థాన కవులు గాని, ఆ పిమ్మటి కాలపు ముష్టి కవులు కాని కానేకారు.

కలియుగము ప్రవేశించిన తర్వాత భరతఖండ మేలిన ప్రథమ చక్రవర్తి పరీక్షిత్తు. అతడు ధర్మపరిపాలనమే చేసినను కవి ప్రభావము అతని అవసాన దశలో ఆవహించినది. అతని కుమారుడు జనమేజయుడు రెండవ

చక్రవర్తి. అతడు తామస మగు సర్పయాగముతో ప్రారంభించి తుదకు అశ్వమేధయాగను నానాభ్రష్ట విధానముగా ఆచరించెను. కాని అతనికి పెద్దల స్మృతి యింకను ఉన్నందున ధర్మాభిమానిగ నుండెను. ఇకముందు అంతకంటె హీనులు రాగలరని ఊహతో నతనికి వైశంపాయన మహర్షి ముఖమున భారత కథామిషతో వేదవ్యాసుడు భారత ధర్మ ముపదేశించెను.

మరల ఆదిరాజ నిభులైన రాజులు బహుకాలమునకు ఆంధ్ర దేశములో వెలసిరి. అట్టివారిలో నొకడగు రాజరాజనరేంద్రునికి ఆంధ్రభాషలో ధర్మోపదేశము చేయవలసి వచ్చినది. నన్నయ భారతాంధ్రీకరణమున కుపక్రమించెను. శ్రేయఃకృతులకు బహువిఘ్నములు ! ఆగిపోయినది మధ్యలో.

రెండు వందల సంవత్సరములు గడచినవి. సమర్థుడగు రాజనాథుడు లేడు. తిక్కన ఆ గ్రంథ మందుకొన్నాడు. అందు కధికారము సంపాదించుటకు యజ్ఞము చేసి సోమయాజి యైనాడు. కాని తనశక్తిచే ధర్మప్రతిష్ఠ చేయగల ప్రభు వాతనికి గోచరింప లేదు. తనకు ఇష్టుడైన మనుమసిద్ధి చిన్న రాజు. రెండు మూడు పర్యాయము లారాజ్యమే అతడు పోగొట్టుకొనెను. అందుచే విరక్తుడై తిక్కన పుణ్యమైన దక్కునని హరిహర నామాంకితముగా విరాటపర్వాదిగా రచించెను. వ్రాసిన కొలదియు నాతని వాక్కునకు పవిత్రత ఎక్కువ కాసాగినది. రసాభిమానముతో విరాటపర్వ మారంభించి, ఉద్యోగమును రాజ్యతంత్రజ్ఞతతో సాగించెను. యుద్ధ పర్వములు దండనాథుల దృష్టితో వ్రాసెను. భారతకథ మారినట్లుగనే చివర పర్వములను అతడు అతిలోకాద్భుత ధర్మసూక్ష్మము గ్రహించిన వాడయ్యెను. అయినను ఆ ధర్మములు ఆచరింపజేయు ప్రభు డేడి ?

మరల షుమారు నూరు సంవత్సరములు కడచినవి. ఎఱ్ఱయకు రాహుగ్రస్తమైన చంద్రబింబము వలె శ్రీమదాంధ్ర మహాభారతములోని అరణ్యపర్వములోని మొరికి కనిపించెను. 'ధర్మశాస్త్రార్థ వేది' యగు నాత డది పూరింప నిశ్చయించెను. కాని ఫినుధర్మరాజు లేడే : ఆ భాగములో సరిగా కలియుగ ధర్మములే ప్రారంభవు !

'అరుల మిగులఁ గొని రాజులు నరులకు నెంతయును భయమొనర్తురు'. మరియును —

"ధరణీ రక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బళ్యతో
హారులై సాధుల దోచి చేకుటు తదీయ స్త్రీ ధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరంబై పెల్లు చెల్లుం బర
స్పర వైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణి నాశంబుగన్".

మరి మనుష్యులో —'తవిలి శరీరంబు తద్దయుఁ బోషింతురు', అట్టి రాజులయు, జనులయు స్థితి ఎఱ్ఱయ కనులార చూచెను. అరణ్యపర్వశేషము ఆ రాజరాజు పేరనే ఆ నన్నయ రచించి నట్లే పూరించెను. అతడు వ్రాసిన మొదటి యాశ్వాసాంతములో 'చరమయుగ చలిత ధర్మస్థిరీకరణ చతురచరిత' అని ఎన్నడో పోయిన రాజరాజును సంబోధించుటలో నతని కట్టి ధర్మప్రభు డా కాలములో పొడ కట్ట నందుకు కలిగిన ఆవేదన వ్యక్తమగును.

ఆ పిమ్మట ఈ ఎఱ్ఱయ మహాయోగి మహాప్రబంధ కల్పనా కుతూహలా యత్తంబగు చిత్తంబుతో నొక్కనాడు తదను సంధానానుబంధ సమాధి నిమీలి తేక్షణుం డై యుండెను. శ్రీలక్ష్మీనృసింహావతార కథ చెప్పు మను నాదేశ మాతనికి భాసించెను.

ధర్మవిప్లవ మెప్పుడు కలిగినను ధర్మరక్షణకు తాను అవతరించెద నని పలికిన భగవద్వచనములే సాధువులకు శరణ్యములు. అది చేతకాని వారిది అసమర్థత కాదు. అనుకూల కాల ప్రతీక్ష; ముందు చేయబోవు కార్యమునకు సాధన సంపత్తి సమీకరించుట: శ్రీలక్ష్మీనృసింహావతారములో ఎఱ్ఱయ చేసిన వైకుంఠ వర్ణనము ఉదాహరింప ప్రారంభించినచో నంతయు ఎత్తి వ్రాయ వలసి వచ్చును. ఆ కథ ఎత్తుకొనుటలో ధర్మసంస్థాపన కెంత భీకరమనోజ్ఞా కారము ఎఱ్ఱయ హృదయస్థము చేసికొనెనో ఊహించ దగినదే. వీరాద్భుత రసములు క్షీరాబ్ధివలె పొంగి యా కావ్య మయ్యెను. ఆ కావ్యము అహోబల నృసింహస్వామికే అంకితము చేసెను.

ఇంతలో మల్లచమూపతితోడను, అతని ద్వారా అన్న యగు వేమ భూనాథుని తోడను ఎఱ్ఱయకు పరిచయ మైనది. వేమభూపాలుడు సమస్త

శత్రువులను జయించిన 'శ్రీ మాద్యదాంధ్రదేశ క్షేమకరపాలుఁడు'ను, 'శ్రీ మద్యాంధ్ర సుదేశ క్షేమద కరవాలుఁడు'ను, 'యవననృప బలాబ్ధి వ్యాపి ఖడ్గార్వ వేగుఁడు'ను మాత్రమే కాదు. 'వాణీధురీంణాంతర్వాణి జనాగ్నితో జ్జ్వలుఁడు !' 'మఖశ్రీ ప్రీత గీర్వాణుఁడు.' 'రక్షితానాథ వృత్తుఁడు !' "ఇష్టా పూర్త రూపం బగు క్రియాకలాపంబు నిజకర్త వ్యాను రూపంబుగాఁ దొడంగి" "అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చి యజ్ఞ కర్తలుగ నునిచె — గోమరారఁ జెఱువులు గుళ్ళు ప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె.... చేసెఁ జేయుచున్నాఁడు చేయనున్నవాఁడు పునరుక్త కృతి శుభావలుల నెల్ల."

ఎఱ్ఱయ తగిన ధర్మప్రభువు దొరికినా డను కున్నాడు. ముందు శ్రీ రామకథ యతనికి చెప్పి యట్టి మహాకీర్తి ధను డగు వేమక్ష్మాపాలునికి ముల్లో కముల ఖ్యాతి కల్పించినాడు. కాని హరివంశము వ్రాయనిది భారత ధర్మము సంపూర్ణత నొందదని ఎఱ్ఱయకు పొడకట్టినది ఆతని ఇచ్చకు అనుకూలముగా, వేమరాజు ఒకనాడు —

"చేతోమోద మెలర్ప రామకథ ముౕ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియఁ గావ్యామృతాస్వాదనన్."

"భారత పరాంశమని యుం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్."

"అనినం బ్రహర్షిత పులకిత దేహుండ నై యమ్మహాభాగుని సమగ్ర సంప్రార్థనంబు గృతార్థతాకలిత వృత్తం బగు చిత్తంబునం గైకొని" యంగీ కరించి, 'కల్యాణావహమహనీయ రచన హరివంశము' రచింప ప్రారం భించెను. గ్రంథము నన్నయ తిక్కనలవలె గాక అమూలాగ్రముగా పూర్తి చేసెను. ఆ మహానందముతో గ్రంథమును 'గుణవితరణపావన నిను బొందు గాత భవ్యశుభంబుల్ !' అని వేమ భూజాని నాశీర్వదించి సమాప్తి కావించి నాడు.

ఉపనిషత్తులకు వేదశిఖ లని సంజ్ఞ కలదు. అట్లే పంచమవేద మను ప్రసిద్ధి కల మహాభారతమునకు హరివంశము మకుటాయమానము.

నన్నయ సంహితాభ్యాసియు, నవిరళ జపహోమ తత్పరుడు నగు వేదవేదాంగ వేత్త. తిక్కన స్వయముగా క్రతుకర్మ నిర్వహించిన సోమయాజి. అనేక జన్మాంత రములలో నిరంతరముగా చేసిన అధ్యయనము వలనను, అధ్వరముల వల్లను చిత్తశుద్ధి అధిగమించిన మహాయోగి ఎఱ్ఱయ. ఆ ముువ్వు రలో అద్భుత కృతార్థ శబ్దములకు పుష్కలముగా వాచ్యుడగు వాడును అతడే!

కాని యీ కవిత్రయము నిజముగా ముువ్వురా? లేక మూడు కాల ములలో మూడు మూర్తులు ధరించిన ఆంధ్రుల ధర్మతపః ఫలమా?

—భారతి, రజతోత్సవ సంచిక
సర్వధారి- పుష్యము. జనవరి, 1949.,
సంపుటము 26 — సంచిక 1

# వీరశైవ వాఙ్మయము

—శ్రీ నిడుదవోలు వేంకటరావు

వీరశైవ వాఙ్మయ మనగా శైవమతములో నవాంతర భేదమగు వీరశైవ మతమునకు సంబంధించిన తెనుగు వాఙ్మయము. తెనుగున, గీతి సాహితీ కవితా రీతులలో విస్తరిల్లిన వాఙ్మయమున, తక్కిన మతము లన్నింటికన్న నీ వీరశైవ మత ప్రాబల్యమే క్రీ.శ. 12వ శతాబ్ధి నుండి 15వ శతాబ్ది వఱకు విస్పష్టముగా గోచరించుచున్నది ఈ ప్రాబల్యమునకు దేశ కాలోపాధులే ముఖ్య కారణములు.

తెనుగుదేశ మంతయు శైవమహాక్షేత్రము. తెనుగు దేశము (నేటి మన భావ ప్రపంచమున నున్న విశాలాంధదేశము) యొక్క నైసర్గిక స్వరూపము మును గమనించిననది 'ఓం' అను నక్షరాకారమున నున్నది. శ్రీశైలము, కాళేశ్వరము, దాక్షారామము నను మూడు లింగములును ఓంకారమున మూడు మాత్రృకలు కాగా. తెనుగు దేశము ప్రణవస్వరూపమై వెలయుచున్నది.

తెనుగుభాష శైవమహామంత్రాత్మక మైనది. తెనుగున నక్షరాభ్యాసము 'ఓం నమశ్శివాయ' మంత్రముతో ప్రారంభమై శైవసాహిత్య రూపమైన యక్షర ప్రపంచమున విలీన మగుచున్నది. కేవలము దేశియగు తెనుగు, మంత్రశాస్త్ర సంప్రదాయానుసారముగా అక్షరమాలా వర్ణక్రమమున, సంస్కృత భాషను గ్రహించి, తత్సమముగ జేసికొనినది. కాబట్టియే వాగర్థముల ప్రతిపత్తికై సంస్కృతాంధ్ర భాషలకు గల యవినాభావ సంబంధమును, పార్వతీ పరమేశ్వర స్వరూపము వలె తెనుగు వ్యక్తము చేయుచున్నది.

దేశభాషలలో తెనుగునకు గల యిట్టి యపూర్వ విశిష్టతను గమనించియే కాబోలు క్రీ. శ. 7వ శతాబ్ది నుండి 12వ శతాబ్ది వఱకు తెనుగునాటి నేలిన పరమమాహేశ్వరులగు చాళుక్యరాజు లీభాషను రాజభాషగా నొనర్చి, పంచమ

వేద మగు మహాభారతమును నీభాషలో నిర్మింపఁజేసిరి. ఆ వెనుక నేలిక లైన చోళులును, కాకతీయులును శైవు లగుటచేత, 12వ శతాబ్దమున ప్రవర్తిల్లిన వీరశైవమత విజృంభణముతో బాటు తెనుగును నద్భుతరీతిని పెంపొందినది. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిత్త్యనంతరము, 14వశతాబ్దాది నేర్పడిన విజయ నగర రాజ్యసంగమ వంశీయులు శైవు లగుట చేతను, అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరము రాజధానులుగా విలసిల్లిన రెడ్డిరాజులు కేవలము సవైదిక వీరశైవ నిష్ఠాగరిష్ఠు లగుటచేతను శైవ సంప్రదాయములు తెనుగు భాషాసాహిత్యమున 15వ శతాబ్ది వఱకును ప్రస్ఫుటము లైనవి, తర్వాత వ్యాప్త మైనది వైష్ణవము.

క్రీ. శ. 11వ శతాబ్దినాటి కుత్తమ సాహితీ విశిష్టత యేర్పడిన తెనుగున, వైదికమత ప్రాధాన్యము వలన సాహిత్య మంతయు సంస్కృత పండితాధీన మైనది. సంస్కృత భాషాగౌరవము, బ్రాహ్మణజాతి ప్రత్యేకతయు సర్వత్ర వ్యాపించినది. మత సంబంధ మగు నాధ్యాత్మిక విషయ ముత్తమ సాహిత్య ద్వారమున గాని ప్రజా సామాన్యమున కందుబాటులోనికి రాకపోయినది. కేవల దేశీసాహితీ కవితలయం దాదరము సన్నగిల్లినది. దేశీయముగాని మార్గకవిత ప్రకృష్టస్థాన మాక్రమించినది.

12వ శతాబ్దిని శివకవులు భక్తిమతములో నవైదిక సవైదికములను సమ న్వయము చేసినట్లు సాహిత్యములో దేశీ మార్గములను సమన్వయించి దేశీయ ములుగా దేశీ తెనుగును సంస్కృత భాషతో సమాన మగు నున్నతస్థానమున నిలువ బెట్టిరి. అవైదిక మైనను, సవైదిక మైనను నాధ్యాత్మిక లక్ష్యము గలదిగాన శైవవాఙ్మయ మంతయు శైవమత వ్యాపనమునకు వినియోగ పడినది. అవ్యాప్తికి ద్విపదాది శాఖలుగా విస్తరిల్లిన దేశీసాహితీ రూపము లన్నియు సాధనము లైనవి. కావున మార్గకవితయం దొక్క కావ్యశాఖకే నన్నయ మార్గదర్శకుడు కాగా తక్కిన దేశీ సాహితీ వాఙ్మయ శాఖల కన్నింటికి శివకవులే మార్గదర్శకు లైరి.

ఉత్తమ సాహితీ పథకమున జాతిమత వివాదము కూడదని నిరూపించిన వారు శివకవులు. శైవవాఙ్మయము వ్యాప్త మైన తరువాతనే వేమనాది

మహాకవులు తెనుగుదేశమున విలసిల్లిరి. మఱియు పెక్కు జాతులలో కవులు వెలసిరి. అల్పాక్షరముల ననల్పార్థ రచన గల్పించిన వీరశైవ వాఙ్మయ ప్రాబల్యమువలన నతి గంభీరములగు వేదాంత విషయములు తెనుగున సర్వ జనులకు సులభగ్రాహ్యము లైనవి.* అద్వైత వేదాంతశాస్త్ర వాఙ్మయబల మెంతయో విస్తరిల్లినది.

భక్తిప్రధానమగు వైష్ణవమతము పంత్రెండవ శతాబ్దాదిని తెనుగునకు సన్నిహిత సంబంధము లేని తమిళదేశమునను, తమిళభాషలోను ప్రవర్తిల్లుటచే తెనుగున స్వల్పముగా వ్యాపించినది. వైష్ణవము వ్యాపించినను, ఆనాటికి వీరశైవ వాఙ్మయము సుప్రతిష్ఠిత మగుటచే సాహిత్యమునకన్న సంగీతమున వైష్ణవమత ముద్ర స్పష్టముగా గోచరించుచున్నది.

తెనుగు సాహిత్యమున వీరశైవ మత ప్రాబల్య మెట్లు విలసిల్లినదో వివరించుచున్నాను.

దక్షిణాపథమున నెలకొనిన మతములలో బౌద్ధ, జైన మతముల వెనుక శైవమతము చారిత్రముగ సారస్వతముగ చాల ముఖ్యమైనది. పంత్రెండవ శతాబ్ది నాంధ్రకర్ణాట దేశములలో నీ శైవమున కొక భేదమగు భక్తిప్రధాన మతము విలసిల్లినది. ఇదియే వీరశైవము. తెనుగు దేశమున 12వ శతాబ్దిని బౌద్ధ జైన మతములు క్షీణదశలో నుండి ఆ మత విజ్ఞానములు కేవల బాహ్యాడంబరమునకు మాత్రమే నిలిచినవి. వైదికమతము కేవల కర్మాచరణమునందే నిమగ్నమై, సాంఘిక జీవితమున కనుపయుక్తమైనది. సంఘమును చైతన్యవంతముగా జేయు సామర్థ్యము గల మతధర్మము, మతలక్ష్యము లేకుండుట వలన సంఘశక్తి క్షీణించినది. సంఘమున నే కొలది మందికో గాని సాధ్యము గాని కర్మజ్ఞాన మార్గములను విడిచి ప్రజాసామాన్యము యొక్క ఆత్మశక్తులను కేంద్రీకరింప జేసి, భక్తి సూత్రమున,

* ఈ వాఙ్మయశాఖయం దెన్నియో తెనుగుభాషా సంప్రదాయములను దెలుపు గ్రంథములు గలవు. ఒక్క దత్తాత్రేయ యోగియు, నాయోగీశ్వరుని శిష్యపరంపరయు వ్రాసిన వేదాంత గ్రంథములే చాల వ్యాప్తిలో నున్నవి. తక్కిన శాఖలవలె నీశాఖకు పర్యాప్తమైన పరిశీలనలేదు.

సంఘమును బంధించు మత మా నా డావశ్యక మైనది. ఆ మతమే వీర శైవము.

ఈ మత వ్యాప్తి వాఙ్మయమూలమున జరిగిన కతన నీ మతప్రాబల్యమును తెలిసికొనునపుడు వాఙ్మయ సంప్రదాయములు ముందెరుగవలయును. ఆంధ్రవాఙ్మయ క్రమపరిణామమున రెండు సంప్రదాయములు మనకు గోచరింపగలవు. 1. మార్గము. 2. దేశి మార్గము సంస్కరించబడిన దేశీ యని, దేశి యనగా దేశమునకు నైసర్గిక మైనది అని చెప్పనొప్పును. ఈ రెండును నాంధ్ర జాతీయ జీవితమున మత, సాంఘిక, భాషా, సాహిత్య చరిత్రలో ప్రస్ఫుట మగుచునే యున్నవి. ఒక శైవమత విషయమున నీ సంప్రదాయ మెట్లు ప్రవర్తిల్లినది. యీ క్రింది వివరణము తెలియనగును.

మతము :- మర్గము : పండిత సంప్రదాయము. వైదిక మత ప్రాధాన్యము. కర్మ మార్గానుసరణము.

దేశి : బసవ సంప్రదాయము. అవైదికము. కర్మమార్గ విచ్ఛేదనము. కేవల భక్తి మార్గానుసరణము.

సంఘము:- మార్గ : చాతుర్వర్ణ్యవ్యవస్థ. బ్రాహ్మణప్రాధాన్యము.

దేశి : జాతి విచక్షణ లేకపోవుట. నిమ్న జాత్యుద్ధరణము.

భాష :- మార్గ : సంస్కృత ప్రాధాన్యము. దేశభాషలలో సంస్కృతాధిక్యము. తత్సమ ప్రాధాన్యమగు తెనుగు.

దేశి : భాషలో జాతీయత. దేశభాషా తత్త్వము ననుసరించి సంస్కృతమును దేశిగా చేయుట. దేశిప్రాధాన్యమగు జాను తెనుగు.

వాఙ్మయము:-మార్గ: కవితారీతి పద్యకవిత. సంస్కృతవృత్త కవిత్వము. అక్షరగణ ప్రాధాన్యము. సంస్కృతపద జటిలత్వము.

దేశి : కవితారీతి పదకవిత. మాత్రాగణప్రధానము. దేశి పలుకుబడి. జాతీయ ధ్వని.

1. వాఙ్మయము-సాహితీరీతులు : మార్గ : చంపూ పద్ధతి. గద్యపద్యాది ప్రబంధ సంస్కృత పదభూయిష్ఠ రచన.

దేశి : ద్విపద, రగడ, శతక, యక్షగాన, ఉదాహరణ, గేయ కృతులు.

2. మార్గ : కథావస్తువు ఆర్యమత సంబంధము, పౌరాణికము. దివ్యనాయకము వైదికధర్మ ప్రతిపాద్యము.

దేశి : కథావస్తువు మానవనాయకము. వీరారాధన. భక్తి మతము, నూతనము. దేశకాలపాత్ర ప్రతిబింబితము.

3, మార్గ : శిష్టజనసంవర్ధితము - ప్రౌఢ సాహిత్యము.
దేశి : సర్వజన సంవర్ధతము - ప్రజాసాహిత్యము.

కవిత్వము :—మార్గ : సాహిత్య ప్రాధాన్యము : గ్రంథస్థము.

దేశి : సంగీత, భావ, ప్రాధాన్యము ; ముఖస్థము.

పై రెండు మార్గములును పదియవ శతాబ్ది నాటికి ప్రచురమై యున్నను, 11వ శతాబ్దిని నన్నయ భారతరచనా ప్రారంభము నుండియు మార్గకవితయే ప్రధానమై ప్రామాణికమైనది. 12వ శతాబ్దిని శివకవులలో తొలివాడగు నన్నెచోడ కవిరాజశిఖామణి దేశి మార్గకవితల సమ్మేళనచేసి. ఆ సమ్మేళనమున దేశి సాహిత్యమునే ప్రస్ఫుటీకరించెను. శివకవి గావున తన కావ్యమున శివోత్కర్షను, శివపారమ్యమును, శైవసంప్రదాయానుసారముగ ప్రతిబింబించునట్లు చేసెను.

నన్నెచోడుని కాలమునందే కన్నడదేశమున బసవేశ్వరుడు జన్మించి కేవల భక్తిప్రధాన మగు శివమతమును బోధించి ప్రచారము చేసి తన్మత ప్రవర్తకుడయ్యెను. జాతిమత వివక్షలేని కారణముచేత నందఱు నామతములో చేరుటకు నధికారులేయైరి. బసవన పుట్టుకచే బ్రాహ్మణు డయ్యు. బ్రాహ్మణ ధర్మమును, వైదికకర్మలను విసర్జించి, కర్మజ్ఞాన మార్గములను విడనాడి,

కేవలభక్తిమతమును ప్రబోధించెను. దీనికే వీరశైవ మని పేరు. కాలచుర్య కల్యాణ కటకమున బిజ్జలుని మంత్రిగ బసవేశ్వరు డుండుటచేతను, తాను స్వయముగ సంగీతజ్ఞానము గలిగిన మహాభక్తు డగుటచేతనే తన మాటల చేతనుఁ భక్తిచేతను, ప్రజా సామాన్యము నంతయు త్వరలో నాకర్షించి తన మతములో చేర్చగలిగెను. వీరశైవ మతములో చేరినవారి కందఱికి జంగములు అనిపేరు. ఇందులో జాతిమత వివక్షలేదు గాన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది అష్టాదశ వర్ణములవారిలో నెవరు చేరినను వారు జంగములే. కాబట్టియే నన్నెచోడడు భూసురకుల తిలకు డని తన గురువగు జంగము మల్లికార్జునుని పేర్కొన్నాడు, బసవేశ్వరుడు కన్నడదేశము వాడేయైనను కన్నడ తెలుగు దేశము లా కాలమున నత్యంత సన్నిహితముగ నున్న కారణముచే, తెలుగునాటి యందు గూడ నీ వీరశైవము వ్యాపింపజొచ్చెను. కాని యా కాలమునందే తెలుగుదేశమున వేంగియందు దాక్షారామమున మల్లికార్జున పండితుడు జన్మించి, అవైదికమగు నీ వీరశైవమును సవైదికముగ సంస్కరించెను. అనగా భక్తిప్రధానమగు నీ మతమును వైదిక కర్మాను సారముగా సంస్కరించెను. అందుచే నగ్రవర్ణము వారైన బ్రాహ్మణు లీసంస్కారమును పొందిన భక్తిప్రధానమైన వీరశైవమును స్వీకరించిరి. ఇట్లు స్వీకరించినవారే ఆరాధ్యులు. ఆరాధ్యమతము బ్రహ్మణులే స్వీకరించి నను వెనుక 'జంగమ' శబ్దము మొదటి విశాలమైన యర్థమును వీడి, సంకుచితమై బ్రాహ్మణేతర జాతియందలి శైవులకే రూఢియైనది.

నాటినుండియు నాంధ్రదేశమున బసవసంప్రదాయము వారైన జంగములును, పండిత సంప్రదాయము వారైన యారాధ్యులును నీ మతమును పెంపొందించిరి. బసవేశ్వరుడు కన్నడ దేశీయుడు గాన నా దేశమున బసవ సంప్రదాయమే వ్యాప్తిచెందినది. వారిని 'లింగాయతు' లందురు. ఆ దేశమున నప్పటికి బ్రాహ్మణు లున్నను వారు పండితశైవ సంప్రదాయమును స్వీకరింపలేదు. కావున నారాధ్యు లా దేశమునలేరు. పండిత సంప్రదాయము తెలుగు దేశముననే పెంపొందినది. గాన నేడా కన్నడ దేశమున నున్న యారాధ్యు లిచ్చటివారే కాని యా దేశీయులు కారు. పండితుడు వేద ప్రామాణ్యము నంగీకరించి, బౌద్ధులను నోడగొట్టి శాస్త్రీయ పద్ధతిని నీ

సంప్రదాయమును నిలిపినాడు. క్రీ. శ. 1240 ప్రాంతమున నిట్లే రెండు సంప్రదాయములు ప్రవర్తిల్లుచుండగా పాల్కురికి సోమనాథ మహాకవి యుద్భవించి కన్నడాంధ్ర దేశముల నీ రెండు సంప్రదాయములను స్థిరముగా నెలకొల్పెను. ఈతడు తెలుగు దేశమున జన్మించిన వాడైనను పండితారాధ్యుని మనుమని కాలములోని వాడగుట చేతను సంస్కృతమే కాక కన్నడము, అరవము మొదలగు వానియందు మహాపండితుడును, మహాకవియు నగుటచేత నా కాలమున నీ రెండు సంప్రదాయములకు జెందిన వాఙ్మయముల నాధారముగా గొని, వీరశైవ మతప్రవర్తకుల చరిత్రలు, ప్రాచీన భక్తుల చరిత్రలు. శివమతతత్త్వ వివరణములు, మత ప్రవర్తకుల స్తుతులు మొదలగునవి రచించి ఆంధ్రవీరశైవ వాఙ్మయమునకు మూలపురుషుడయ్యెను.

ఆ నాటికి కన్నడమున జైనమత సంబంధమైన వాఙ్మయమే ప్రచురమైయుండెను. మార్గపద్ధతిని పంప, రన్న, పొన్నకవులు రచించిన జైనతీర్థంకరులలో ప్రఖ్యాతు లగు పురుషుల చరిత్ర లుత్తమ కావ్యములై ప్రసిద్ధములైయుండెడివి. దేశిపద్ధతిని హరీశ్వరుడను కవి కొందఱు శివభక్తుల చరిత్రమును రగడగా రంచించినాడు. అతడు సోమనాథునికి కొంచెము పూర్వుడు, సోమనాథుడు తొలుత వీరశైవమత వ్యాపకుడగు బసవని చరిత్రమును బసవపురాణ మను పేర రచించుటయే కాక బసవ మహిమ ప్రతిపాదకములైన వృషాధిప శతకము, గద్యకృతులు, అష్టకము, ఉదాహరణము మొదలగు స్తుతిరూపక గ్రంథములను రచించి బసవని భక్తి మతమును వాఙ్మయమూలమున వ్యాప్తము చేసెను. సోమనాథు డీ గ్రంథములను దేశిలో రచన చేయుటచేతను, నవి ప్రజలకు ముఖస్థములై పాడుటకు వీలుగ నుండుటచేతను, నవి దేశమెల్ల నతిత్వరగా నల్లుకొనినవి. కన్నడదేశమున నీ గ్రంథములు వ్యాప్తములై, కన్నడ సాహిత్యస్వరూపమును మార్చివైచినవి. అంతకు ముందు వెలసిన మార్గకవిత సంస్కృత వృత్తపద్య రచన, సాహితీ రీతులు వెనుకబడినవి. దేశిపద్ధతిని పదకవితలు విజృంభించినవి. బసవ పురాణము కన్నడింపబడినది. భక్తుల చరిత్రలు ప్రత్యేకముగ పదకవితలలో వెలసినవి. కన్నడ వాఙ్మయములో వీరశైవము ప్రధానస్థాన మాక్రమించినది. ఈ

వీరశైవ సాహిత్యమును కన్నడులకు ప్రసాదించినది తెలుగువాడగు సోమనాథుడే! కాబట్టియే తెలుగు కవులకన్న కన్నడ కవులాతనిని హెచ్చుగా స్తుతించిరి.

క్రీ.శ. 1050-60 ప్రాంతముల మార్గకవితారీతిని నన్నయ రచించిన మహాభారతము క్రీ. శ. 1260 ప్రాంతము వరకు పూర్తి కాకుండుటకు ప్రధాన కారణము వీరశైవమత ప్రాబల్యమే. నన్నిచోడ కవి కుమార సంభవము మార్గ కవిత యందు ప్రధానస్థాన మాక్రమించి యాంధ్రసాహిత్యమున ప్రకృష్టస్థాన మాక్రమించిన ప్రబంధశాఖకు మొదటిదిగా విలసిల్లినది. పండితారాధ్యుడు, పాలుకురికి సోమనాథుడు దేశికవిత యందలి ద్విపద, శతక, యక్షగాన, ఉదాహరణాది శాఖలకు మూలపురుషులై వానిని ప్రవర్తిల్ల జేసిరి. ఈ వాఙ్మయ మంతయు వీరశైవ మత ప్రతిపాదకమే యగుట చేతను, నిందలి భాష, భావములు, కథావస్తువు దేశియే యగుట చేతను, ఆర్యమత విరుద్ధ మగునవైదిక ధర్మమే ప్రతిపాద్య మగుట చేతను, ఆర్యసంప్రదాయ ప్రవర్తకమును, పంచమ వేదమును నగు మహాభారతము పూర్తి చేయుటకు నవకాశ మేర్పడ లేదు.

మఱియు నా కాలమునందు వెలువడిన తెలుగు కావ్యములు కథా రూపమున నున్నవి. కవిభల్లటుని బేతాళపంచవింశతి, శూద్రక రాజ చరిత్రము, కేతన కాదంబరి, అన్నయ షోడశకుమార చరిత్రను, అభినవ దండి దశకుమార చరిత్ర, కేయూరబాహు చరిత్ర-వీటియందు ఆధ్యాత్మిక లక్ష్యము లేదు. కేవల సాహిత్య ప్రయోజనమే లక్ష్యముగా గలవి. ఇవియే గాక, గాథాసప్తశతి మున్నగు ప్రాకృత కావ్యములు కూడ జనాదరణ పాత్రములై యుండెను. ఇట్టి వాఙ్మయమును మనస్సునం దుంచుకొనియే ఎఱ్ఱాప్రెగ్గడ ఆధ్యాత్మిక దృష్టిగల ఆంధ్ర భారత రచనమును ఇట్లు సమర్థించినాడు :

"గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వు తెలుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లున జేసినట్టి య
జ్ఞాసన కల్పులు........"

ఇందులో 'గాసట బీసట' యనగా, గాథాసప్తశతి, బేతాళ పంచవింశతి అయినవి. (గాసట—గాథాసప్తశతి. బీసట—బేతాళ పంచవింశతి). దీనియర్థ మిది గాని, తెలియని భాష, సలక్షణము గాని భాష యని యర్థము కాదు. శివకవుల కావ్యములలో కథానాయకులు నవీనులే యైనను నారి జీవితము మతోద్ధరణమున ప్రవర్తిల్లుటచే నవి యాధ్యాత్మిక సంపన్నములైనవి. ఈ యాధ్యాత్మిక దృష్టిని పౌరాణికముగ గాక కేవల నవీన కథాసాహిత్యము నందే శైవవాఙ్మయము సాధించినది. కావున అట్టి దృష్టితో ప్రాచీనార్య కథాసంవిధానములతో వ్రాయబడిన నన్నయ భారతము అతని మార్గ సంప్రదాయము ననుసరించి మఱిరెండు శతాబ్దముల వరకు పూర్తి కాలేదు. ప్రజాభిరుచి పై కథలయందే యుండుటచేత దాని ననుసరించి వాఙ్మయయమున నూతనత్వము కలిగించుటచేత భారత గ్రంథరచనము వెనుకబడినది. రెండు శతాబ్దముల వెనుక తిక్కన సోమయాజి మార్గదేశి పథకమును జీర్ణంచుకొని, దేశిపద్ధతికి ప్రాధాన్య మొసగి, నూతన సృష్టి కావించినాడు. దేశి మార్గములను దేశీయములుగా జేయుట యనెడి నన్నెచోడుని సంప్రదాయమును తిక్కన పునరుద్ధరించినాడు. మత విషయమున కేవలము పాక్షికము లగు వీరశైవ, వీరవైష్ణవ, భక్తి పథకములను సమన్వయము చేయుచు హరిహర భక్తి తత్వమును ప్రతిపాదించినాడు. భారతీయ సంస్కృతికి మూలమగు వైదిక ధర్మమును ప్రతిపాదించుటకు తాను సోమయాజి యైనాడు. ఇట్లు కర్మజ్ఞాన భక్తి ప్రతిపాద కముగా దేశీయముగా భారతరచన చేయుటకు వీరశైవ వాఙ్మయమే యుపజీవ్య మైనది-తిక్కన భారతముతోబాటు, నన్నయ భారతమునకు ప్రాధాన్యము కలిగి తరువాత నదియేవాఙ్మయ ప్రపంచమున కాదర్శప్రాయమై పరమప్రమాణ మైనది-శైవ వాఙ్మయము నందలి దేశిరీతులు తరువాత కవులలో నొక్క భాషావిషయమున మాత్రమే నిలిచిపోయినవి.

కాబట్టియే విలక్షణ మగు శైవకవుల భాష భారత భాషనే లక్ష్యముగా తీసుకొనిన లాక్షణికులకు నాటికి నేటికిని ఆదరణ పాత్రము కాక పోయినది. లాక్షణికులును నీ గ్రంథములను విస్మరించుటచే ప్రాచీన భాషా సంప్రదాయములు మనకు మఱుగు పడినవి. మన వ్యాకరణము, ఛందస్సును

అతిసంకుచితములై, లక్ష్యలక్షణ సమన్వయము లేక 'వ్యాకరణ మొకత్రోవ, మహాకవు లొక త్రోవ'గా పరిణమించినవి. ఇట్టి సమన్వయము భాషా తత్త్వ శాస్త్రమునకు, వ్యుత్పత్తి పరిజ్ఞానమునకు నత్యంతావశ్యకము. అట్టి సమన్వయము వలననే సమగ్రమును, సప్రమాణమును, శాస్త్రీయమును నగు నీ తెనుగు భాషా చరిత్ర లభింపఁగలదు. శివకవు లగు నన్నిచోడ, మల్లికార్జున పండిత, పాల్కురికి సోమనాథులే కాక, శివకవులని చెప్పఁ దగిన యథా వాక్కుల అన్నమయ్య, వేములవాడ భీమకవి, చక్రపాణి రంగన, శర కుంకఁడు, శ్రీనాథుఁడు, బమ్మెరపోతన, వేమన, గార్లపాటి లక్ష్మయ మొదలగు వారి రచనలయందు పదునాఱవ శతాబ్ది వఱకు నీ భాషా సంప్రదాయములు నిలిచియే యున్నవి. పై కారణము చేత నేడు మనకు లభించిన లాక్షణిక భాష చారిత్రకముగ గాని, సాహితీరీతిని బట్టి గాని సప్రమాణము కాదనియు, అది కృతక మనియు చెప్పవచ్చును. శివకవుల భాష వలననే సజీవమైన తెలుగు భాషా సంప్రదాయము తేట పడును.

వాఙ్మయము-వీరశైవము వ్యాప్తికి దెచ్చిన నూతన పథకములు— తొల్లి తెనుగు సారస్వతము విస్తరించియున్న శాఖలలో భారతకవు లొక్క కావ్యప్రబంధ శాఖనే ప్రవర్తిల్ల జేసిరిగాని, తక్కిన శాఖ లన్నింటికి వీరశైవ వాఙ్మయమే మూలము. తెనుగు సాహితీ చరిత్ర సమగ్ర స్వరూపము తెలుసుకొనవలె నన్న ఈ శాఖలను గూర్చి తెలుసుకొనుట యత్యంతావశ్యకము. వీరశైవ వాఙ్మయమెట్లు ద్విపదలు, పద్యకృతులు, శతకములు, ఉదాహరణములు, యక్షగానములు, గద్యకృతులు, గేయకృతులు, వచనములు మున్నగు శాఖలకు మొదల మూలమైన తరువాత నాయాశాఖ లెట్లు వర్ధిల్లినవో వివరించుచున్నాను. ఆయా శాఖలందు నేడు ప్రసిద్ధములై, పరిచితములైనవి, అముద్రితములును, సుపరిచితము లగు వానిని కొన్నింటినే గ్రంథవిస్తర భీతిని జూపుచున్నాను.

## ద్విపద

నేడు మనకు లభ్యములైన ద్విపద కృతులలో పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్య చరిత్రము మొదటివి. అయిన నంతకుముందు

ద్విపదకావ్యములు లేకపోలేదు. సోమనాథుఁడే "ఉపమింప గద్యపద్యోదాత్త కృతులు ద్విపదయు సమను" అని పండితారాధ్య చరిత్రమున దెలిపినాడు, అనగా నతని కాలముననే ద్విపదకృతు లున్నను, వానిలో యతి ప్రాసాది నియమము లున్నను, కేవల జానపద కవిత్వముగా ప్రచారమున నుండి, ఉత్తమ సాహిత్య గౌరవము నందలేదు. ఆంధ్ర చ్ఛందస్సునకు ద్విపద మూలము. ద్విపద విశేష మగు తరువోజ క్రీ. శ. 850 ప్రాంతము నుండి కానవచ్చుచున్నది. మన ఛందో గ్రంథములలో ప్రాచీన మని చెప్పదగిన కవిజనాశ్రయమున ద్విపదలక్షణము చెప్పబడినది. లక్ష్య మున్న గాని లక్షణము బయలు దేరదు. కాబట్టి సోమనాథుని ముందు ద్విపదకృతులు వెలసిన వనుట నిర్వివాద విషయము. అవి దేశికవితా సంప్రదాయికములై ప్రజాసాహిత్య మునసే ప్రచారము నందినవి.

సోమనాథుని కాలమున మార్గకవితా సంప్రదాయకములై గద్యపద్య మయమగు చంపూ పద్ధతిని విరచితములైన కావ్యములే యుత్తమ సాహిత్య ముగా పరిగణింపం బడుచుండెడివి. సోమనాథుడు కేవల దేశికవితకు జెందిన ద్విపదలను పునరుద్ధరించి, ద్విపదకు మహాకావ్య విశిష్టత గడించి వాఙ్మయ మున నాశాఖకు శాశ్వతస్థానమును గడించినాడు. కావుననే యీశాఖ కాతఁడు మూలపురుషుఁడు. అతడీ శాఖను పునరుద్ధరించి మహాకావ్యలక్షణ ములను పట్టించి సాధించిన పద్ధతు లివి.

## ద్విపదపద్ధతి : ఛందస్సు

1 ద్విపదలలో పాదమునకు యతినియమమే యుండగా ప్రాసయతిని నిలుపుట. ఈ నియమము కావ్యమునం దుపయుక్తమగు సీసములకే గాని తక్కిన వానికి లేదు.

'ఉల్లమున మదీయ వల్లభుఁ జెన్న
మల్లికార్జును తేటతెల్లగా నిలిపి.'
"కన్నరాథూపతి వెన్నాజిలో చూపె" (శాసనము)

నన్నయ భారత భాగము :—

'తన కుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమ తత్పరు విపుల శబ్దశాసను.'

2. ఏ ద్విపద కా ద్విపద విడివడి యుండగా దానికి వృత్తములతో వలెనే ద్విపదకు ద్విపద సంధించుట.

'జాతులు మాత్రానుసందాన గణ వి
నీతులు గాన యనియత గణైర
నియు, ప్రాసోవా యతిర్వా యనియు
నియుక్తి జెప్పు ఛందో వినిహితోక్తి గాన'.

3. ద్విపదలోనే కావ్యమంతయు రచించినను నవి కావ్యరీతిని నాశ్వాస ప్రకరణ విభాగము గావించి కృత్యాది, ఆశ్వాసాంత గద్య మున్నగు లక్షణముల ననుసరింప జేయుట.

4. మహాకావ్యరీతిగ నవరసములను, వర్ణనలను, నలంకారములను లక్ష్యముగా రచించుట.

5. కావ్యలక్షణములను పాటించినను రసము నావిష్కరించుట యందును భావవిన్యాసము నందును రచనారీతిని, నడకను మార్పుచేయుట.

6. కేవలము కావ్యమునందే వాఖ్యారూపమున మాత్రమే వివరింప దగిన వేదవేదాంగ పురాణేతిహాస గంభీర విషయములను మూల భూతము లైన వాక్యములనే ద్విపదలలో నిముడ్చుట.

7. మహాకావ్యమునందు వలె ద్విపదలయందు జాతీయజీవనమును ప్రతిబింబింప జేయుట.

పైని వివరించిన మార్గరీతిని కావ్యపద్ధతులతో బాటు ద్విపదలలో దేశి సంప్రదాయముల నీ క్రిందిరీతిని సమ్మేళనము చేసియున్నాడు. ఈ సమ్మే ళనము వలననే సోమనాథుని ద్విపదకావ్యములు వాఙ్మయమున ప్రత్యేక

స్థానమును గడించినవి. ద్విపదశాఖలో సోమనాథుని వంటి ప్రతిభావంతుఁడగు కవి తిరిగి లేక పోవుటచే నాతని పద్ధతి తరువాత అనుకరణీయము కాలేదు.

1. పేరునకు సంస్కృత మైనను, కేవలము దేశీయ చ్ఛందస్సగు ద్విపద పాదములు రగడవలె పొడుగుపాటివి కాక; రగడభేదము వలస నేర్పడు నుత్కలికలవలె పొట్టివి కాక యుండుటచేతను, తాళానుగుణమై గేయప్రాధాన్యమై యుండుట చేతను పాటలవలె సర్వజనులు పాడుకొనుటకు వీలు కలుగునట్లు రచించుట.

2. ద్విపదలలో అక్షర బాహుళ్యము లేకపోవుటయు, అక్షరగణములలో వలె గాక గురువులను లఘువులుగా జేయు ఛందస్సగుటచేతను చదువుకొనుటకు సులభముగ నుండునట్లు చేయుట.

3. వృత్తములు మొదలగువానిలో నావృత్తములోనే భావముల నిముడ్ప వలసిన యవసరము గలిగినపుడా నాలుగుపాదములలోనే సంకుచితపఱుపవలసిన యగత్యము గలదు. ద్విపదలో నట్టి నియమము లేకపోవుటచే, భావవిన్యాసము విశాల మగు నవకాశము కలిగిన దని గుర్తించుట.

4. ద్విపదలయందు సలలితయలతి పదము లుపయుక్తములగుటచే నన్వయ క్లేశము లేకుండ భావము గ్రహించుటకు వీలగునట్లు రచించుట.

కావున ద్విపదలను సోమనాథుఁడు వేదములతో సమానములుగా జేసినవాడు. ద్విపదలు శ్రుతులు (అనగా వినదగినవి), వేదములు (అనగా తెలిసికొన దగినవి), ఆమ్నాయములు (అభ్యసింప దగినవి) గా నొనరించి, కేవల సాహిత్యమున గల ద్విపదను ఐహికాముష్మిక ద్విపద హేతువుగ ప్రపంచించినవాడు.

## వీరమాహేశ్వరాచార సంగ్రహము

వీరశైవాచార విధానమున్ను వేదోక్తముగ నిరూపించు నీ గ్రంథము సంస్కృత మున నీలకంఠ నాగనాథాచార్యుడు రచించిన వీరమాహేశ్వరా

చార సంగ్రహమునకు ద్విపదానువాదము. కవి పర్వత మంత్రి లింగనా మాత్యుఁడు. ఈతఁడు శ్రీవత్స గోత్రుడు. కామాంబకు, పర్వత మంత్రికి తనయుఁడు. నాగయ-గౌరమ: పోతయ-నాగమ, నాగయ-ఓబక్క, పర్వత మంత్రి-కామాంబ - ఇది యీతని వంశక్రమము. పై వంశ క్రమమును బట్టి యీతఁడు శైవాచారములనుపాటించు స్మార్తు డని తెలియుచున్నది. గ్రంథాంతమున గద్యలో -

"ఇది శ్రీ గిరీశ విశ్వేశ్వరధ్యాన - విదిత శివాచార విహిత సుజ్ఞాన - పండితారాధ్య శ్రీ పాదాబ్జభృంగ-ఖండేందుధర భక్తికామ్యాంతరంగ" అని యున్నందున నీతడు పండితారాధ్యుల శిష్యుడని తెలియుచున్నది. ఈ పండి తారాధ్యుఁడు మల్లికార్జున పండితుడు కాక, క్రీ. శ. 1480 ప్రాంతమున నున్న కుంటముక్కల తిమ్మయ వీర శైవాచార సంగ్రహ కృతి భర్తయగు గన్నమంత్రి గురువుగా నున్న పండితారాధ్యుఁడు* కావచ్చును. అట్లయిన నీతడు కృష్ణదేవరాయలకు కొంచెము పూర్వుఁడు కావచ్చును.

ఈ గ్రంథమున వీర శైవమతమును గూర్చి విపులముగా నీ క్రింది విషయములలో దెలుపబడినది. 1. విభూతి మహిమ. 2. రుద్రాక్ష మహిమ. 3. పంచాక్షరీ మహిమ. 4. హరనామ మహిమ. 5. శివరాత్రి మహిమ. 6. శంఖుచక్రోత్పత్తి. 7. మార్కండేయ చరిత్ర. 8. విష్ణుశాప విమో చనము. 9. శరభేంద్ర మహిమ. 10. వ్యాసశిక్ష. ఇది పది యాశ్వాసముల మహాగ్రంథము. ఇందులోని గ్రంథభాగములు ప్రత్యేకము గ్రంథములుగా పరిగణితము లైనవి.

## మనోబోధ

మంజరీ రచనమున నున్న యీ శైవ వేదాంత గ్రంథము, శివయోగ సారమును రచించిన కొలని గణపతిదేవకవి రచితము. ఈ గ్రంథమున గణపనారాధ్యులని తన వాడుక పేరే తెలిపియున్నాడు. తానీ గ్రంథమునే

* పండితారాధ్య మహాదేశిక శిష్యునకు... ....
ఈతడు మల్లికార్జున పండితుని వంశమువాడై యుండును.

కాక దేశి తెలుగులో మఱికొన్ని రచించినట్లు శివయోగ సారావతారికలో (91 ప.) నిట్లు చెప్పియున్నాడు.

"పశుపాశపతి జ్ఞానము
నశరీర భ(వ) విజయ? మనోబోధముగా
విశదము లగు నీ కృతు లన
దృశగతి (చెప్పితిని) దేశి తెలుగున తెలియన్.

ఈ మంజరీ రచనము తేటతెనుగున సులభముగా నుండి హృద్యమై యున్నది. అముద్రిత మగు నీ గ్రంథమునుండి కొన్ని పంక్తుల నుదాహరించు చున్నాను.

ఆది. శ్రీ పార్వతీనాథు శ్రీనాథునాథు
నలినసంభవనాథు నలనాప్తనాథు
ముక్తికాంతానాథు మునిమనోనాథు....
భక్తసాగరచంద్రు పరమయోగీంద్రు.

మధ్య. మనస! తలంపుమా మాయలం బడక
మాయచే జగములు మాయ మౌచుండ
మాయచే చిత్తంబు మలినమై యుండు
మాయచే ప్రాణంబు మగురమై యుండు
వటమూలశయనుండు వాసుదేవుండు
ఇట్టి మహాదేవు నెఱుగవే మనస!

అంతము. ౦ ఉర్విపై గాంతా సహోదరుం డనగ
గణపనారాధ్యుల గరుణించు శివుడు
ఆచంద్రతారార్కమై యొప్పు భక్తి
వెలయు మనోబోధ వేడ్కమై జెప్పె.

---

౦ ప్రా, ప్ర. భా. సంఖ్య. 2151-2152.

## శైవాచార సంగ్రహము - పద్యకృతి

శివాగమముల ననుసరించి తెలుగున శివపూజా విధానాదికములను దెల్పు నీ కృతి కుంటముక్కల తిరుమలనాథకవి విరచితము. ఈతడు తిమ్మ కవి యని వ్యవహృతుడు. మూడాశ్వాసములు గల యీ కృతిని పిల్లలమఱ్ఱి† గన్న నామాత్యున కంకితము గావించెను. ఈ గన్నమంత్రి యాజ్ఞవల్క్య శాఖీయుడు. భారద్వాజ గోత్రుడు. గన్న సైన్యపతి పౌత్రుడు. విస్సమంత్రికి, వీరాంబకు పుత్రుడు. శ్రీశైలమున భిక్షావృత్తి మఠాధ్యక్షుడగు వారణాసీ సిద్ధభిక్షావృత్తి తనయుడగు గేమయ ప్రభుని సుతుడగు వీరభద్రునకు నీ గన్న మంత్రి హితుడని గ్రంథమున జెప్పబడి యున్నది. సిద్ధభిక్షావృత్తి శ్రీశైల శాసనము వలన క్రీ. శ. 1464 ప్రాంతము వాడు. అతని మనుమని కాలమున క్రీ. శ. 1490 ప్రాంతమున గన్నమంత్రియు, కుంటముక్కల తిమ్మకవియు నుండురని చెప్పవచ్చును.

కుంటముక్కల తిమ్మకవి కొక్కోకమునకు కృతపతియగు భైరవ మంత్రి యన్నయగు నౌబళమంత్రి కుమారుడు. (అహోబల మంత్రీంద్రుని సందను, తిమ్మనార్యు నని చెప్పుకొన్నాడు). కొక్కోక కృతిపతి భైరవమంత్రి గజపతుల కాలములో అజమాఖానునిచే మహాపాత్ర బిరుదము బడసినవాడు. క్రీ. శ. 1484లో కొండా చిల్లి వద్దగల యాజమాఖాను శాసనము గలదు. (అజమాఖాను రాయలచేత బెహారామహాపాత్ర విభవంబు గాంచినాడు - అని కొక్కోకము.) ఈ కాలమునుబట్టి చూచినను కృతికర్త, కృతిభర్త లిరువురు కృష్ణదేవరాయల కించుక పూర్వులగుదురు.

---

† సీమంతినీ పరిణయ కృతికర్త పెనుమళ్ల సోమకవి యీ పిల్లలమఱ్ఱి గన్నా మాత్యుని వంశీయుడే కాదగును. కవియగు పినవీరభద్రుని వంశము వాడు కాడు. ఈ పిల్లలమఱ్ఱివారు భారద్వాజగోత్రులు. పినవీరభద్రుడు కాశ్యపగోత్రుడు. సోమకవి భారద్వాజగోత్రుడు. కావున గన్నమంత్రి వంశీయుడు. పిల్లలమఱ్ఱి వారిలో చాల ప్రఖ్యాతిచెందిన వీరభద్రుని వంశము నుండి తన వంశము చెప్పుకొనియుండును.

## శతక వాఙ్మయము

తెలుగున దేశిసాహితీ విశిష్టత గల సారస్వతశాఖలలో ప్రచుర ప్రచారము గల శతక వాఙ్మయమునకు మార్గదర్శకము శైవ వాఙ్మయమే తెలుగు శతకములకు ప్రత్యేక లక్షణములగు మకుటనియమమును, సంఖ్యానియమమును పాటించి తొలుత శివపారమ్యభక్తి ప్రబోధకముగ మల్లికార్జున పండితుడు మల్లికార్జున శతకమును రచించెను. ఈ శతకము మనకు లభ్యము కాలేదు. మనకు లభించిన పద్యమును బట్టి, కన్నడానువాదమును బట్టి, దీని యందలివృత్తములు చంపకమాలికలు, ఉత్పలమాలికలు నని చెప్పవచ్చును.

> "లోకము లెల్ల నీ తనువులోనివ, నీ వట యెంత కల్గుదో
> నాకపపద్మసంభవ జనార్దను లాదిగ నెల్ల పెద్దలున్
> నీ కొల దింత యంత యన నేరక మ్రొక్క దొడంగి రన్న ని
> న్నేకరణి న్నుతింతు బరమేశ్వర శ్రీగిరిమల్లికార్జునా!"

కన్నడ కృతి మొదలు :

> "శ్రీపతి వాక్పతి ప్రముఖ దేవతగళ్ బహువేదసార వా
> గ్రూపగళింద కాణదిహ శైవమహత్వ మనల్ప బుద్ధియిం
> రూపిసలాసమర్థన కృతార్థన దంతహనల్ల దిర్కచి
> ద్రూప నవాచ్యనం నుతిపనై శివ పర్వత మల్లికార్జునా!"

(మల్లికార్జున పండితుని కృతి యగు శివతత్త్వసారము నందలి మొదటి కందపద్యమున కిది వృత్తరచన.

> "శ్రీపతి వాక్పతి ముఖ్య మ
> హాపురుషులు నేరగనోప రతివాఙ్మనస
> వ్యాపార మైన నీ నిజ
> రూపం బిట్టి దని నే నిరూపింతు శివా.")

కన్నడ శతకము పూర్తిగ లభ్యమగుచున్నది. దానికి మల్లికార్జున శివస్తుతి యని పేరు, ఈ శతకమును పాల్కురికి సోమనాథుడు పేర్కొనినాడు.

ఇదియే మన తెలుగున తొలి శతక మైనను సమగ్రముగా దొరికిన వానిలో తొలి శతకము పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము. ఇది 'బసవా, బసవా, బసవా వృషాధిపా' యను మకుటము గలది. 'శతకమకుటము వలన నిదియును పై మల్లికార్జున శతకమువలె చంపకోత్పల మాలికలతో రచితమైనది. సంఖ్యానియమము పాటింపబడినది. సోమనాథుని బహుభాషా వైదుష్యమును తెలుపుపద్యములు, సంస్కృతము, తమిళము, కన్నడము, ఆరె (మహారాష్ట్రభాష), మణిప్రవాళము, దేసితెలుగులలో గలవు. ఇది బసవన మహిమలను, కొందఱు భక్తుల చరిత్రను దెలుపును.

దైవస్తుతి పరములై, శివభక్తి రచనతో నారంభమైన శతకవాఙ్మయమున, కేవల భక్తిరస ప్రాధాన్యము లైన శతకము లాయాకాలముల సకల దైవతముల పేర వెలసినను, నా వెనుక నీతి, శృంగారము, వేదాంతము మున్నగు విషయముల ప్రపంచించి మానవస్తుతి పరము లైనవి. ఈ విషయ విభాగ క్రమపరిణామమును బరిశీలించిన మనకు శతక వాఙ్మయమున నీ క్రింది విశేషములు గోచరింప గలవు.

1. క్రీ. శ. 11వ శతాబ్ది నుండి 14వ శతాబ్ది వరకు శైవమతమే ప్రధానముగా వ్యాపించిన కారణమున నా కాలమున శతకము లన్నియు నించుమించుగ శివపారమ్య ప్రతిపాదకములు, శైవభక్త చారిత్రక నిరూపణములు. సర్వేశ్వర శతకము, శ్రీగిరీశ శతకము, గిరిజాధినాయక శతకము, విరూపాక్షలింగ శతకము, చెన్నమల్లేశ శతకము, గణసౌజన్యాఖ్యాన శతకము, కొల్యుదొన శంకరేశ్వర శతకము అంబికా శతకము అనునవి.

2. అద్వైత వేదాంత తత్త్వము నాబాలగోపాలమునకు నాటపెలదులలో నందించిన వేమన తన్ను దానే సంబోధించుకొను సంప్రదాయమునకు శివకవులే తొలివారు. శివదేవయ్య 'శివదేవధీమణీ' అనియు, శరభాంకుడు 'శరభాంకలింగమా' అనియు, సిద్ధరాముడు 'సిద్ధరామ' యనియు వేమన గురువు వటమూలుడు 'వటమూల మందిరా' అనియు తమ్ము తామే సంబోధించుకొనినారు. ఈ సంప్రదాయము కడచిన శతాబ్దము వఱకును నిలిచియే యున్నది

3. శృంగార శతకములకు గూడ శివకవి యగు రావిపాటి అంబికా శతకము మార్గదర్శకము. ఇది వైష్ణవకవి యగు తాళ్ళపాక అన్నయ్యగారి 'వేంకటేశ్వర శతకము'నకు మాతృక.

4. విష్ణుభక్తి ప్రతిపాదకము లైన శతకములలో వెన్నెల కంటి జన్నయ దేవకీనందన శతకము, బమ్మెరపోతన నారాయణ శతకము మొదలుగా నారంభమైనవి.

5. శతకములలో నుపయుక్తము లగు వృత్తములు-చంపకము, ఉత్పలము, మత్తేభము, శార్దూలము, జాతులు, కందము, ఉపజాతులు, సీసములు, గీతములు, ఆటవెలదులు. వీనిని మొదట శతకములలో నుపయోగించినవారు శివకవులు.

6. వీరశైవ మతమునకు సహజమగు నావేశము వలన, భక్త్యుద్రేకము వలన నాయాపట్టుల శివకవుల గ్రంథములలో గననగు పరమత నిరసనము, బ్రాహ్మణనింద మతేతరులకు వైరస్యకారణమై, ప్రజాసామాన్యమున వ్యాప్తి గాంచలేదు. కాని యొక్క శతకరచనమున మాత్రము శివకవులు నిమ్నోన్నతమగు సైలి గాక సమత్వము గల శైలి నవలంబించుటచే నవి బహుళ ప్రచారము గాంచినవి. సోమనాథుని పండితారాధ్య చరిత్రమును వృషాధిప శతకమును పై సూత్రమునకు ప్రథమోదాహరణములు.

తెలుగున నా వెనుక వెలసిన వాఙ్మయము సంతతను నిట్లే నిర్దిష్ట రచన-నియత గ్రంథ పరిమితి - భక్తిభావన - ఆధ్యాత్మిక లక్ష్యము గలిగి, దేశకాల పాత్రల ననుసరించి వాఙ్మయమున ప్రజాసాహిత్యమునకు భాండారము లైనవి.

## ఉదాహరణములు

ఆంధ్ర వాఙ్మయ శాఖలలో ప్రత్యేక వ్యక్తిత్వము గల యీ శాఖలో సోమనాథుని బసవోదాహరణము ప్రథమము. ఉదాహరణ మనగా నేడు

విభక్తులకు నేడు పద్యములు. ఏడు కలికలు*, ఏడు ఉత్కలికలును, గలిగి అన్ని విభక్తులతోను అంకితాంక పద్యము చివర గల ఒక లఘుకృతి. ఉదాహరణములకు నంతమున కవిపేరు కూడ కొన్నింటిలో తెలుపబడును. ఇవి సాధారణముగా దైవస్తుతి పరములు. తరువాత మానవస్తుతిపరములైనవి. ఇట్టి రచనలు సంస్కృతమందు గాని, ద్రవిడకర్ణాట భాషల యందుగానిలేవు. కావున నీ పథకమునకు మార్గదర్శకుడు సోమనాథు డని చెప్పనొప్పును సోమనాథుని వెనుక రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము ప్రసిద్ధమైనది. ఉదాహరణములలో శివపరము లైన వెనుక, వైష్ణవపరముగ వేంకటేశ్వరోదాహరణము (తాళ్ళపాక పెదతిరుమలయ్యగారిది), హనుమోదాహరణము (చిత్రకవి పెద్దనది), శ్రీకృష్ణోదాహరణము (అప్పకవిది) గలవు. నవీనకాలమున ముఖలింగేశ్వరోదాహరణము రచిత మైనది. కాలక్రమమున శేషార్యోదాహరణము, నాగేశ్వరోదాహరణము, గోపాలోదాహరణము, వీరేశలింగోదాహరణమును వెలసినవి.

## యక్షగానములు

**దేశిమార్గ** రచనా భేదములచే రెండు విధము లైన మన సాహిత్యములో యక్షగానము, దేశిరచనము నిండుగా గలిగి, తెనుగు దనమును, సంగీత సాహిత్య విశిష్టతను వెల్లడిచేయు కృతి. ఆంధ్ర వాఙ్మయమున ప్రత్యేక వ్యక్తిత్వము గల స్వతంత్ర రచనలలో విలసిల్లు నీ యక్షగాన శాఖకు పర్యాప్తమైన పరిశీలన లేదు. శైవవాఙ్మయమునకు సంబంధించిన యక్షగానములు

---

* కలిక యనగా నెనిమిది పాదముల రగడ భేదము.

* ఉత్కలిక యనగా నందులో పాదము సగము భాగము. ఇందును నెనిమిది పాదము లుండును.

* సంస్కృతమందు లేకుండుటచే సోమనాథుడు బసవోదాహరణమును రచించినవాడు. దానిని శ్రీ బండారు తమ్మయ్యగారు, నేనును ప్రకటించితిమి.

తక్కిన వాఙ్మయ శాఖలకువలె నీ శాఖయందును ప్రచారమును బడసినవి, వీని యందలి కథావస్తువు కేవలము శివపరమై యుండును. వీనియందుసు కురవంజి మొదలగు రచనాభేదములుండును. ఈ యక్షగానములకు ప్రత్యేక కాలనిర్ణయమునకు నవకాశము వేదు. ఇవి క్రీ.శ. 1500-1750 మధ్య రచితములై యుండునని స్థూలదృష్టిని నిర్ణయింపబడినది,

ఈ యక్షగానములలో శైవయక్షగానములు ప్రాచీనములు. వానిలో కొన్నింటిని పేర్కొనుచున్నాను. 1. అక్కమహాదేవి చరిత్ర-బాలపాపాంబ, 2. కిరాతార్జునీయము-మోహన కవి బొమ్మలాట సాంబయ్య, కురవంజి-సిద్ధలింగకవి, 4. గంగాగౌరీ విలాసము-పెదకెంపరాయడు, 5. గురునంబి చరిత్ర 6. నిజలింగ చిక్కయ చరిత్ర-నిమ్మనాథుడు, 7. చిరుతొండ భక్త కథానిధానము-వాలెకోటయ్య 8. బసవ కల్యాణము-అనుమోద సన్యాసికవి. 9. బసవ మహిమామృత విలాసము-కామూరి వీరభద్రకవి. 10. భద్రకాళీ కల్యాణము- వెలువ పెద్దయ, 11. భల్లాణ చరిత్ర-బుక్కమ సాంబయ్య 12. వీరచోడవ్వ చరిత్ర-గుబ్బిము కపోతయ్య, 13. వీరభద్ర విజయము-శివలెంక మల్లనారాధ్య కవి.

## పద్యకృతులు-లఘు స్తవములు-సంఖ్యాసహితకృతులు

ప్రత్యేకస్తుతి రూపములగు లఘురచనలు - పంచకములు, అష్టకములు, నవరత్నములు మొదలగు సంఖ్యాసహిత చాటుకృతులకు మల్లికార్జున పండితుడు, సోమనాథుడును ప్రథములు. ఇందులో ప్రాయికముగ సంస్కృత వృత్తములుండును. మల్లికార్జున పండితుని స్తుతిశ్లోక పంచకమును పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున నుదాహరించినాడు. ఇవి సాంస్కృతికము లైనను తెనుగునకు సహజము లగు యతిప్రాసములు వీనిలో పాటింపబడినవి.

"శ్రీ మల్లినాథాయ జితమన్మథాయ
సోమాంక జూటాయ శూలాయుధాయ
భస్మీకృతాఘాయ పరమేశ్వరాయ
తస్మై నమోస్తు కుధరవల్లభాయ".

నన్నెచోడ కవి కుమార సంభవములో దారిద్ర్యవిద్రావణ స్తవమును తొమ్మిది శార్దూలమత్తేభ వృత్తములలో చెప్పినాడు. సోమనాథుడు బసవ పంచరత్నములు, బసవాష్టకము రచించి యున్నాడు. ఆ వెనుక వైష్ణవ వాఙ్మయమున కందుకూరి జనార్దనాష్టకము, నవనీతచోరకాష్టకము, వేణు గోపాల పంచరత్నములు, శ్రీరామ నవరత్నములు, కోదండరామ భాస్కర మాల, తారావళి మున్నగు లఘుకృతులు బయలువెడలినవి. ఇట్టి కృతులను లాక్షణికు లంగీకరించుటచే, నీ శాఖకు గూడ వీరశైవ కవులే మార్గదర్శకులని చెప్పనొప్పును. ఈ కృతులింకను సేకరింప దగినవి.

## గద్యకృతులు

నేడు 'గద్యము' అను పదమునకు ఛందోబద్ధము కాని వాక్యరచన యని యర్థము. కాని ప్రాచీన సంప్రదాయమున గద్య మనగా ఛందోబద్ధ మైన వాక్యరచన యనియే యర్థము. ప్రసిద్ధ సంస్కృతాలంకారికు డగు వామనుడు గద్యము వృత్తగంధి, చూర్ణము, ఉత్కలిక అని మూడు విధము లుగ దెలిపినాడు. వీనిలో పద్యభాగముతో సమానమైనది వృత్తగంధి; లలిత పద బంధురమైన కూర్పుగలది చూర్ణము-ఇదియే తెలుగున 'చూర్ణిక' యని వ్యవహరింప బడుచున్నది; ఈ రెండింటికన్న విపరీతమైనది ఉత్కలిక. అనగా దీనియందు వృత్తభాగము, పదబంధురతయే గాక తాళానుగుణమైన గతి యుండును. ఈ ఉత్కలికయే తెలుగునుదాహరణములలో 'అర్ధకళిక' యని చెప్పబడును. అర్ధకళికయనగా కళికలో సగము. కళికయనగా నొక రగడ భేదము. కాబట్టి యర్ధకళికయు రగడభేదమే. ఉత్కలిక గద్యభేదము గాన రగడలు, చూర్ణికలునుగూడ గద్యములనియే వ్యవహృతములైనవి.

శరణు బసవరగడ *:- ఇదియు గద్యకృతియే. ఈ రగడకు నాద్యంత ముల కన్నడ పద్యములున్నను రగడ తెలుగుకృతి. ఇందులో యతిప్రాస ములు పాటింపబడినవి. ఇది హయప్రచారము, లేక తురగవల్గనము అను రగడభేదము.

---

* ఈ రగడ అముద్రితము :- కన్నడపద్యము లాద్యంతమున నుండు టచే కన్నడకృతిగా బరిగణింపదగదు. (ప్రా. పు. భా. సంఖ్య. 2137)

ఆది. వృ, "దేవరాజ దేవరాజ సిద్ధసాధ్య యక్ష ర
క్షా విహంగ రాట్పతంగ సోమ....
జీవితేశ విశ్రుతపాశ....విద్యాంఘ్రి రా
జీవ నిమ్మనాం పౌగళ్వ శ్రీవృషాధి నాయకః!

రగడ. శ్రీ వృషాధినాయక ప్రసిద్ధభావ శరణు బసవ
తావ కాంఘ్రి సేవకాఘ దావధావ శరణు బసవ
నంది ద్వితీయ శంభు నామధేయ శరణు బసవ
వందిత త్రిలోక విబుధ వందితాయ శరణు బసవ ...

అంతము. రసిక ముకుర శరణు బసవరాగ ముకుర శరణు బసవ
అసమగాన శరణు బసవ అప్రమాన శరణు బసవ
శరణు శరణు శరణు బసవ శరణు శరణు శరణు బసవ-
శరణార్తి బసవేశా!

శరణు స్తవ కల్పకుజాం। కుర పద నఖాభిజాతసపటు
త్తర నామంగళ బసవర। సరిగప్పి సిదను పాల్కురికి
సోమాంకం"

దీనిననుసరించి శివకవి రంగనాథుడు నమశ్శివాయరగడను రచించినాడు.

గద్యభేదములగు రగడకృతులు ప్రత్యేకముగ రచించిన నివిస్తుతిపర ములుగ నుండుటచే, తొలుత మార్గకవితా రీతిని కవులను కావ్యములలో వీనిని దైవస్తోత్రము చేయునపుడుపయోగించెడివారు. శ్రీనాథ మహాకవి కాశీఖండమున మణికర్ణికా ఘట్టమును రగడతో వర్ణించినాడు, నందిమల్లయ ఘంటసింగయ కవులు వరాహపురాణమున శివస్తవము రగడతో గావించినారు. తెనాలి రామలింగకవి యుద్భటారాధ్య చరిత్రలో రగడ శివస్తుతి గలదు. అందు కొన్నిపంక్తులు రావిపాటి త్రిపురాంతకుని యుదాహరణము లోని చతుర్థీకళిక (వృషభగతి రగడ) లోని పాదముల కనువాదములు. శేష నాధుని పర్వతపురాణములో రగడలుకలవు.

## 1. పర్వతలింగ రగడ

ఆది : శ్రీ మత్పర్వత శిఖరవిశాల - స్థిరశుభ పీఠము పర్వతలింగము
సామ ఋగ్యజు ర్ముఖ నిఖిల శ్రుతి-సన్నుతపారము
పర్వతలింగము.

తుది : శిఖరము జూచిన నరులకు నధిక-శ్రేయము లొసగును పర్వత
లింగము

శిఖరము జూచిన నరులకు నధిక-శ్రీ లొసరించును
పర్వతలింగము

## 2. శ్రీశైల రగడ

ఆది : శ్రీగిరినాయకు సేవించెదమని-శ్రీగిరి సన్నుతి సేవించెదమని

తుది : ఇది శ్రీగిరిపతి హితసన్నుతియని-ఇది ధర్మంబని ఇది ధర్మంబని

తరువాత ప్రబంధములలో నీ రగడలు తాళాంగ ప్రధానములగుటచే పుష్పాపచయ వర్ణనలలో కవులు వాడినారు. ఈ సంప్రదాయమునకు అల్లసాని పెద్దనయే మూలపురుషుడు. అతని ప్రత్యేక ప్రబంధరచనలో నిదియొక పథకము. తరువాతివారెల్ల దీనిననుసరించిరి.

శైవవాఙ్మయమున నీరగడల వెనుక వైష్ణవవాఙ్మయమున సుదర్శన రగడ, శ్రీరామనామ రగడ (శ్రీమదఖిల రహస్య విశేషధామము రామ నామము) మొదలగునవి వెలసినవి.

### అంతాది రచన

గద్యకృతులలో 'అంతాది రచన'ను నారంభించినవారు శివకవులే. అంతాది రచనమనగా అకారము మొదలు క్షకారము వఱకుగల యక్షరములను పాదాదియందుపయోగించుట. ఈ రచనము వలన నాపాదములన్నియు

నొకకులకమై మాలికగా నేర్పడును. ఇట్టి రచన కావించినవాడు తొలుత క్రీ. 950 ప్రాంతమున, కన్నడ కవులలో రత్నత్రయమని ప్రసిద్ధికెక్కిన వారిలో నొకడగు పొన్నకవి. అతడు 'జినాక్షరమాల' యను పేర కందపద్యములలో నీ రచనను చేసినాడు.

తెలుగున నిట్టిరచన కావించిన శివకవి మల్లికార్జున పండితుడు. ఇతని 'మల్లికేశ్వర గద్యము'* అక్షరాంకస్తుతి. ఇంతవరకీ గద్యకృతి ముద్రింప బడలేదు కావున నిందు ప్రకటించుచున్నాను.

“అఖిలలోకాధార । ఆనందరసపూర । ఇనచంద్ర శిఖినేత్ర । ఈడితామలగాత్ర । ఉరులింగ నిజరూప । ఊర్జితాచలచాప । ఋక్షాంకకోటీర । ౠపర్జితోదార । ఌలితతాండవకాంత । ౡనిష్కృతాజాంత । ఏకైకవక్త్రేశ । ఐక్యసౌఖ్యానేశ । ఓంకార దివ్యాంగ । ఔన్నత్యగుణసంగ । అంబికాహృదయేశ । అఃస్తోకకలనాశ । కనదహీనాభరణ । ఖల జలంధరహరణ । గణనాయక విధేయ । ఘనభక్తివిజ్ఞేయ । ఙఝల్ల కాలధర । చతుర త్రిశూలధర । ఛద్మయోగధ్వస్త జలజజ శిరోహస్త । ఝమ్మార్తి శృంగార । ఞాన గుణ విదళధీర । టత్రయాది విదూర । ఠ ప్రభావాకార । డమరుకాది విహార । ఢ్రవాత పరిహార । ణప్రభావాకార । తత్త్వరజోనేత । థవిమోక్ష జనపద । దవన బాలనదీశ । ధరణీ ధరోల్లీఢ । నందికేశారూఢ । పర్వతేశ్వర లింగ । బహుళభూత విలాస । భక్త హృద్వనవాస । మంత్రస్తుతోదార । యక్షరుద్రాకార । రతిరాజ బిసహంస ।లలితగంగోత్తంస । వదదశైల విహార । శరసంభవాస్ఫార । షట్ త్రింశ తత్త్వగత । సకల సురముని వినుత । హరినేత్ర పదపద్మ । ళశితభూధర సద్మ । క్షరరహిత చారిత్ర । అక్షరాంక స్తోత్ర । శ్రీపర్వత లింగ । నమస్తే నమస్తే నమః॥**

---

* ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము. సంస్కృత గ్రంథ సంఖ్య. 11003.

** శ్రీశైలఖండ–నాగులూరి శేషనారాధ్యుని కృతిలో నిదిగలదు.

పాల్కురికి సోమనాథుడు పండితుని రచన ననుసరించి అక్షరాంక గద్యను వ్రాయుటయే గాక సంస్కృత పద్యములనుగూడ రచించినాడు. అవి ప్రకటితములైనవి.• సోముని అక్షరాంక గద్యమొదలు :

"అపిచ శివశృంగార । ఆదిపథ విస్తార । ఇహపర సుఖాధార। ఈషణ త్రయ దూర"—కావున 'అక్షరాంక గద్య'లు రెండని తెలియవలెను. ఈ గద్య ఉయభద్ర రగడలోని యర్ధభాగము.

సోమనాథుని వెనుక తెలుగున 'రఘురామాక్షర మాలిక' 'రామాక్షరమాలిక'* మొదలగు కృతులు వెడలినవి. ఈ కృతులు కందములలో రచితములైనవి. ఇందు పాదాదియందే కాక పాదాంతమునందు నక్షరక్రమము పాటింపబడినది — అనగా పూర్వపద్యాంత్యాక్షర ముత్తర పద్యాద్యక్షరము గా వచ్చునట్లు చెప్పబడినది. ఉదాహరణము— "శ్రీకర సీతా వల్లభ....ప్రాకటముగ విన్నవింతు భావజ జనకా"— తరువాతి పద్యము మొదలు "కనకాంశుకధర.........వరశిత విశిఖా". తరువాతి పద్యమున 'ఖర దూషణ సంహారిక'అని మొదలు. అధునాతన కాలమున నిట్టిరచనలు గలవు.

అంతాది రచనములవలన మన భాషాతత్త్వ సంప్రదాయ మెఱుగుటకు వీలుకలుగుచున్నది. మన యక్షర సమామ్నాయము యొక్క చారిత్రక పరిణామము తెలిసికొనుటకీ రచన యుపయుక్తము. సంస్కృతమునకంటె విలక్షణములైన దేశభాషలు గదా తెలుగు కన్నడములు. వీనిలో సంస్కృత భాషా సహజములగు మహాప్రాణాక్షరములు మొదలగునవి యుండ నేరవు. కాని యంతాది రచనలు చేయునపుడు, మంత్రశాస్త్ర సంప్రదాయము ననుసరించి, 'అక్షరమాలగా' రచింపవలెను. అందు వర్ణమాలలోని యక్షరము

---

• శ్రీ బండారు తమ్మయ్యగారు - 1934-35 సంవత్సరాది సంచిక (పుటలు 107-114)

*ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, శతక సంపుటము, 1686, 1687 సంఖ్యలు (సం. 7)

లన్నియు రావలెను. అక్షరమాలలో 'నేబది' సంఖ్య నియమము గాన, నా మాలకూడ నేబదియైనది. మంత్రములు సంస్కృతమునందే గాని దేశభాషలలో నుండవు గావున, దేశభాషలలో రచియింపబడిన సంస్కృతభాషారీతి ననుసరించి, సంస్కృతభాషకుగూడ నేబదివర్ణములని తెలుగు వ్యాకరణమున జెప్పఁ బడినది. సంస్కృత భాషకు నేబది వర్ణములని సంస్కృత వ్యాకరణములందు లేనేలేదు—అకారాది క్షకారాంత వర్ణసమామ్నాయమందు లేదు. కావున తెలుగు వ్యాకరణమున చెప్పబడిన సంఖ్య మంత్రశాస్త్ర సంప్రదాయమే యని చెప్పనగును. ఇట్టి మంత్రశాస్త్ర సంప్రదాయకము కావుననే మా తెనుగు భాష యెన్ని విలక్షణములైన తత్త్వములుగల భాషలతో సంబంధ మున్నను తన ప్రత్యేకత, పవిత్రత నిలువబెట్టుకొనగలిగినది.

## గేయకృతులు - ఏగంటివారి పదములు

శివభక్తి ప్రతిపాదకములగు గేయకృతులలో ఏగంటివారి పదములు (ఇవియే 'ఏగంటివారి వచనము' అను పేర బరగుచున్నవి) ప్రఖ్యాతము లైనవి. ఈ పదములలోను పాటలలోను కొన్ని ముద్రితములైనను, అవి సమగ్రముగా, సరిగా ముద్రితములు కాకపోవుటచే తెలుగున సంకీర్తన వాఙ్మయమున వీనికెట్టి విశిష్టస్థానము గలదో తెలియలేదు. ఈనాటి సంగీత శాస్త్ర చారిత్రక పరిశోధకులకు నివి యపరిచితములు.

ఈ పదములు రచించిన కవి గార్లపాటి లక్ష్మణుడని నవచోళ చరిత్ర యందు పోలిసెట్టి లింగన కవి యిట్లు చెప్పినాడు.

"పాటలు సద్భక్తిపరులు నుతింప
పాటి కెక్కిన గార్లపాటి లక్ష్మణుని
వెలయగా వినుతించి........"

ఈ పదముల వ్రాతప్రతులయందు "లక్ష్మయ్యగారి వచనములు" అనియే కలదు. ఈ పాటలలో నొకచోట—

"చూడంగ చూడంగ సూక్ష్మరూపంబైన
జోడుగా తనయందు జ్యోతి వెలుగు
కూడి లక్ష్మణయోగికృప యెఱిగియున్నపుడు
ఏడ యుండిన మనసు కేమి భయమూ."

అని తన పేరును తెలుపుకొనియే యున్నాడు. ఈ పాటలన్నియు ఏగంటి నంజయగురు ముద్రతో నున్నవి గాన, వీనికి ఏగంటివారి పదములను పేరు ప్రచారములోనికి వచ్చినది. ఈ పదములయం దచ్చటచ్చట ఏగంటి నంజయదేవుని యొక్కయు, పిడుపర్తి గురుని యొక్కయు ప్రశంస గలదు, పిడుపర్తి గురుడనగా ప్రసిద్ధుడగు పిడుపర్తి బసవన కాదగును. అట్లయిన నీతనికాలము క్రీ. శ. 1530 ప్రాంతమగును. ఈ లక్ష్మయ్యగారే వ్రాసిన 'శివజీవైక్య విధానము' అను గ్రంథమున 'ఇతి శ్రీ గార్లపాటి లక్ష్మార్య కృతౌ' అని కలదు. ఈ పదముల తాళప్రతులలో నీ పేరు కలదు. తెనాలి రామలింగ కవి యింటిపేరు తొలుత గార్లపాటివారు. ఈ లక్ష్మయ్యగారు రామలింగకవి తండ్రి రామయ్యగారి సోదరుడో, యా వంశీయుడో యై యుండునని యభిప్రాయపడుచున్నాను. శైవపదములలో ప్రసిద్ధమగు తుమ్మెదపదము (మొదటి భారతిలో ప్రకటితము) లక్ష్మయ్యగారి కృతి.

ఈ పదములు కొన్ని క్రీ. శ. 1904 లో ముద్రితములైనవి. కాని చాల పదము లింకను ముద్రితములు కావలెను. 'దేవులకెల్లను దేవగు పార్వతీదేవి తల్లి మాకు" అనుపద మిందులోనిదే. ఇందుండి శైవమత ధర్మములను నిరూపించు నొకపాట నుదాహరించుచున్నాను.

శరణు శరణు శర ణనవే మనసా
శరణు శరణను మనస శివభక్తి రతుల గని
చరణాంబుజములపై శిరము వంచి
శరణు ప్రసాదంబు సేవించి లెంక లై
పరగ భక్తుల కరుణ బడయగదవే మనసా ! శరణు 1

పరసతుల తల్లిగా భావించవే మనస
పరధనంబుల కాసపడకుమో మనసా

పరనిందలను నెపుడు పలుకబూనకె మనస
పరుల చిత్తము నొవ్వ బలుకకే మనసా ! శరణు 2

కర్మములయందు దగ్గఱ బోవకే సునప
కర్మములు బహుజన్మ కారణములు
కర్మములు దుస్సంగగతు లంచు శివునందు
నిర్మలజ్ఞానివై నిలువవే మనసా ! శరణు 3

భక్తి హరి బ్రహ్మాది పశువు లెఱుగగలేరు ;
భక్తి గురు కారుణ్య ఫలపుణ్యమూ
భక్తితో శివుని గని ప్రమథాదు లందఱియు
భక్తిముక్తుల కరుణ బడయగదవే మనసా ! శరణు 4

భవులసంగము బాసి పరదైవముల రోసి
భవము లన్నియు గోసి భ్రాంతి విడచి
శివభక్తులను గూడి సేవ లెన్నియు జేసి
శివభక్తి మార్గమున వెలగవే మనసా ! శరణు 5

దుష్టేంద్రియంబుల దూరిపాఱకె మనస
అష్టాంబుజంబున హరువు చెడకా
యిష్టంబుతో ప్రాణ మిరవుకొలుపవె మనస
నిష్టజంగమ భక్తి నిలుపవే మనసా ! శరణు 6

అరయ భక్తుల కరుణ ఆనందమును బొంది
పరగ బసవని కరుణ బాయకెపుడు
పరమగురు డేగంటి ప్రభువు నంజేశ్వరుని
కరుణ నంజేశ్వరుని కనగదవె మనసా ! శరణు 7

ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నీపదములు తాళపత్రముల యందున్నవి. సంగీతమున పదకర్తల గూర్చి పరిశ్రమ జరుగుచున్న యీ కాలమున నీ పదము లన్నియు చక్కగ ముద్రింపవలసిన భార మాంధ్రవిద్వల్లోకముపై నున్నది.

## దారుకావన క్రీడ

వీరచోడవ్వ చరిత్ర రచించిన సుబ్బయ్య కపోతయ్య రచించిన యీ కృతి సువాలపాటగా నున్న గేయకృతి-ఇదియును రొంపిచెర్ల శంకరేశునకు కృతి-దారుకావనమున శివుని విలాస క్రీడలను పాటలాగంధులెల్ల ప్రౌఢి పాడగా తేటగా సువాలపాటగా రచించినాడు. ఈ సువాలపాట స్త్రీలు పాడుకొనుటకు వీలుగానున్నది. దీని తేటరచనకు కొన్ని పంక్తు లుదాహరించుచున్నాను :

"శ్రీసుధాంశుధారు సుప్రకాశు రొంపిచెర్ల శంక
రేశు దురితనాశు గగనకేశు గొలిచెదా
కొండయందు బుట్టి పైడికొండవిల్లు చేట్టబట్టి
కొండకాపురంబు నున్న కొమ్మగొల్చెదా
విద్దెలెల్ల నేర్చి చాలబుద్ధిమంతుడైన శివుని
పెద్దకొడుకు నేకదంతు ప్రేమ బొగడెదా.
హరుడు నొక్కనాడు తారకాబలంబునందు తనకు
నర్హ మైన రత్నసింహాసనంబు నా
ఈసువాలు నిత్యమును పఠించువారలెల్ల గృత్తి
వాసుడిచ్చు నడిగినట్టి వాంఛితార్థములే ......"

## కేవల వచనములు

శైవవాఙ్మయమున, వైష్ణవ వాఙ్మయమునందలి వేంకటేశ్వర వచనములవలెను, యతిరాజశేఖర వచనములవలెను కొన్నివచనములు వెలసినవి. ఈ వచన వాఙ్మయ మపారముగా కన్నడదేశమున బసవనచేతను, నాతని సమకాలికులచేతను ప్రపంచితమైనది. కన్నడదేశమున శైవవాఙ్మయమున దేశిసాహిత్యముగా చెప్పదగినది వచన వాఙ్మయమే. తెలుగుదేశమున వీరశైవవాఙ్మయ ముత్తమ సాహితీరీతిని వెలసినది. తెలుగున నిట్టి వచన రచన మధ్యకాలమునుండి వ్యాప్తిలో నున్నదని నా యభిప్రాయము. వీనిలో —

1. భవానీ మనోహర వచనములు : ఇవి చాల ప్రసిద్ధమైనవి. సరళమగు శైలిలో నున్నవి. ప్రతి వచనము "నన్నురక్షింపవే భవానీ మనోహరా"

అను మకుటముతో ముగియును. ఇవియే పురాతన శంకర వచనములను పేర ముద్రితములైనవి. రచయిత పేరెఱుగరాదు.

2. కాళికావచనములు : ఇందు శివరాజయోగ విషయములు వర్ణితములైనవి. అసమగ్రము. రెండు వచనములు మాత్రమే లభించినవి. (సం. 1404), వీనిని గద్యశతకము లన నొప్పును.

## వచన గ్రంథములు - టీకలు

సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస నిరసనము :- ఇది వచన కృతి; అసమగ్రము. వైష్ణవులు శైవమత నిరసన పూర్వకముగా సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసమును రచియింప, దానికి ఖండన గ్రంథముగా నీ కృతిని బుద్ధిరాజు పేరయకవి రచించెను. ఈతడు భారద్వాజ గోత్రుడగు నయ్యనార్యుని పుత్రుడు. ఇవటూరి వీరభద్రారాధ్యుని శిష్యుడు. ఈతడు కొండపల్లికి దండనాథుడుగనుండి, పరాశరపురాణమును దెలిగించె నట.

ఈ గ్రంథము పిసపాటి లింగనారాధ్యుని కుమారుడగు సర్వదేవయారాధ్యుని ప్రేరణచే రచితమైనది. ఇందు గ్రంథకర్త తన గురువగు నివటూరి వీరభద్రారాధ్యుని వంశమును గూర్చి తెలిపినవాడు.

ఈ గ్రంథమున పండితారాధ్యులు వెలనాటిచోడని సభలో బౌద్ధులను జయించిన సంగతి గలదు. వెలనాటిచోడని రాజధానియగు చందవోలులో నాడు వివాదము జరిగి పండితునికి జయము కలిగినట్లుగా నిచ్చటను శైవులకే జయము కలుగుట సూచితమైనది.

గ్రంథావతారికలో శైవ గ్రంథకర్తలు, గ్రంథములు చాలా పేర్కొనబడినవి.

హరదత్తాచార్యులు-చతుర్వేద తాత్పర్య సంగ్రహకర్త; శ్రీకంఠుడు-నీలకంఠ భాష్యకర్త; కాళహస్తి దీక్షితుడు-కాళహస్తి మాసకర్త: నాగదేవుడు- శ్రౌతలింగ విదేహారాద్ధాంతము: అప్పయ దీక్షితుడు-శివార్క

మణిదీపిక; పాల్కురికి సోమనారాధ్యుడు-బసవరాజీయము; జ్యోతిర్నాథుడు-శైవరత్నాకరము; నీలకంఠ నాగన్న-వీరమాహేశ్వరాచార సంగ్రహము.

ఇందు కృత్యవతరణిక యంతయు పద్యములతో చెప్పబడినది. పైగ్రంథములను బట్టి యిందలి విషయములను గ్రహింపవచ్చును.

## వీరమాహేశ్వర సారోద్ధారము

ఇది సోమనాథ భాష్యమునకు తెనుగు టీక. ఇందు పదియవ ప్రకరణము వఱకు మాత్రమే గలదు. టీకాకారుడు మనోహరుడు. "ఇతి శ్రీ వీరమాహేశ్వరసారోద్ధారే శ్రీ బసవరాజీయే సోమనాథభాష్యే మనోహరీయమాంధ్రభాషా విలసితం వీరశైవమాహాత్మ్యం నవమ ప్రకరణం సంపూర్ణమ్." ఇందులో విభూతి, రుద్రాక్ష, లింగధారణ, లింగార్చనా మహాత్మ్యములు ప్రతిపాదితములైనవి. ఈ టీకారచనము పూర్వటీకలవలె సరళమైన వ్యవహార శైలిలో నున్నది. (ప్రా. పు. భా, సంఖ్య. 2649). శైవవాఙ్మయజ్ఞులకీ కృతి పరిచితము గాదు. టీకాకారుని గూర్చిన యుదంతము తెలియ రాలేదు.

వీరశైవ వాఙ్మయమునకు సంబంధించిన పెక్కు గ్రంథములు చాల వఱకు ముద్రితములుకాలేదు. ముద్రితము లైనవానికి పర్యాప్తమైన పరిశీలన లేదు. శాస్త్రీయమైన పద్ధతులపై వాఙ్మయ చరిత్రము రచింపవలె నన్న ఇంకను చాలగా నా వాఙ్మయమున బహుముఖ పరిశోధన చేయదగియున్నది. మల్లికార్జున పండితుని శివతత్త్వసారము, పాల్కురికి సోమనాథుని యనుభవ సారము, చతుర్వేదసారము, అన్నమయ్య సర్వేశ్వర స్తోత్రము మొదలగు కృతులు సరిగా ముద్రితములు కావలసియున్నవి. పైని వివరించిన వానిని నాకు సాధ్యమైనంత వఱకు పరిష్కరించి యుంచినాను. వాని వలన ప్రాచీన భాషాసాహిత్య సంప్రదాయములు పెక్కులు తెలియగలవు.

—భారతి
రజతోత్సవ సంచిక.
సర్వధారి-పుష్యము జనవరి, 1949.
సంపుటము-26, సంచిక-1.

# సోముని హరివంశము

- శ్రీ నడకుదుటి వీరరాజు పంతులు

ఎల్ల భాషల యందును గవితాకన్యను వెలయించిన కవులలో నుత్తమ మధ్యమ సామాన్యాది భేదములు గలవు. ఆయా భేదములుగల యాయా కవులయందు మఱల నుత్తము లేర్పడుచుందురు. ఇట్లేర్పడుచు రాఁగా నొక్కొక భాషయందును నొక్కడో, యిద్దఱో, ముగ్గురో, నలువురో యుత్కృష్ట కవులుగాఁ బరిగణింపబడుదురు. సంస్కృత భాషయందుఁ బురాణములను రచియించిన వారిలో వాల్మీకి వ్యాసులుత్కృష్టులు. కావ్యముల నొనర్చిన వారిలోఁ గాళిదాస భవభూతు లగ్రగణ్యులు. ఇట్లే తెలుఁగు బాస యందును బొత్తములను వ్రాసినవారియందుఁ దిక్కన సోమనలు మిన్నలై యున్నారు. ఇట్లని తక్కిన కవులను దక్కున పఱచుచున్నానని భావింప వలదు. మేలు చేతులఁ దగినవారింకను నున్నారు తెలుఁగు కవులలోఁ దిక్కన సోమన లిరువురును గన్నాకులని పండితుల యభిప్రాయము.

''క. ఘను నన్నయభట్టును ది
క్కన నేఱ్ఱాప్రెగడఁ దొగడి యలికంబున న
డఁని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాఁసు స్తుతి యొనరింతున్''.

అని మూఁడవ కన్ను డాఁచి వచ్చిన సర్వజ్ఞునిఁగా బండితవప్యు లగు చిన్నయసూరి గారు సోముని స్తుతియించియున్నారు. ఇట్లే యాతనిని మహా కవి యనియు, సర్వజ్ఞుఁ డనియు సనాతనాధునాతనులగు కవులు, పండితులు విమర్శకులు మిక్కిలియుఁ బొగడి యున్నారు.

ఇక్కవి చక్రవర్తి యార్వేలకుల కలశాంబునిధి సంపూర్ణ సోముఁడు, విద్యానగర సంస్థానాస్థాన కవి చంద్రముఁడు. ఈతఁడు కవి బ్రహ్మయగు తిక్కన సోమయాజి కడపటి దశయందుఁ బ్రసిద్ధిఁగాంచినవాఁడు. ప్రబంధ పర

మేశ్వరునకుఁ గొంచెము పూర్వమున నున్నవాఁడు. ఈతని కాలమును నిర్ధరించుటయందు నాకుంగల యాధారములను మఱియొకప్పుడు ప్రకటించెదను. కాని,

శ్లో. "అలంకృతే శకస్యాబ్దే, రసాభ్ర నయనేందుభిః
తారణాబ్దే చైత్రమాసే, నవమ్యాం శుక్లపక్షకే".

ఇత్యాది శ్లోకములతో రాగిరేకుపైఁ జెక్కఁబడిన యక్షరములు తాము నిర్ణయించుకొనిన కాలమును విరోధించుచున్నవని "కవిరాజ నయనేందుభిః, సాధారణే" అని రైసుదొరగారు దిద్దఁజూచి యుండుటయు, దానినే మనవారు ప్రమాణముగాఁ గైకొనఁ జూచుటయు సమంజసముగా నుండలేదని మాత్రము ప్రస్తుతము విన్నవించుచున్నాను. చరిత్ర శోధకు లింకను బరిశీలింతురుగాక యని వేడుచున్నాను.

వేదవ్యాస మహర్షి ప్రణీత మని పేర్కొనఁబడు హరివంశములోని పూర్వ భాగమును పూర్వ హరివంశమను పేరితోను, ఉత్తర భాగమును ఉత్తర హరివంశమను పేరుతోను సోమనాథుఁడు తెలిఁగించెను.

తిక్కన సోమయాజి యాంధ్రీకరింపఁగా నున్న భారతశేషమగు హరివంశమును, సర్వవిధముల నాతని కెనయనఁదగు నీ సోమనాథుఁడు, అతనివలెనే మూలమునకు మెఱుఁగు వెట్టుచు మనోహరముగను, సలక్షణముగను దెలిఁగించి యాతనివలెనే హరిహరనాథునికే కృతియిచ్చి యాంధ్ర మహాభారతము సమగ్రము గావించెను తన గ్రంథము తిక్కన సోమయాజి గ్రంథమునకు శేషమైనట్లును, సోమయాజి తరువాతఁ దాను రచించినట్లును ఈ క్రింది గద్యమునఁ జెప్పియున్నాఁడు.

"ఇది శ్రీ మదుభయ కవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీత శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి నవీన గుణసనాథ నాచనసోమనాథ ప్రణీతం బైన.... హరివంశంబునందు .... ఆశ్వాసము".

తిక్కన సోమయాజివలెనే ఒక్కొక్క యాశ్వాసము మొదట హరి హరనాథుని సంబోధించి, "దేవా వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె" అని వ్రాయుచు, ఆశ్వాసాంతములందును నాతనివలెనే ఒక వృత్తము, ఒక కందము, ఒక మాలిని-వీనితో హరిహరనాథుని స్తుతించుచు దన గ్రంథము కవిబ్రహ్మ గ్రంథము తరువాతిదే యైనట్లు వెల్లడించినాడు.

తాళపత్త్రముల యందుఁ దెలుఁగు లిపిని వ్రాయబడియున్న సంస్కృత హరివంశపుఁ బ్రతులలోఁ గొన్నిటికిని, ఆ లిపియందే ముద్రింపఁబడిన సంస్కృత హరివంశమునకును, వంగదేశ లిపిని (Bengal Characters) దేవనాగరాక్షరములను ముద్రింపఁబడిన సంస్కృత హరివంశములకును ననేక స్థలంబుల ననేక భేదంబులు గలవు.

మఱియు సోమనాథునికి లభించిన మూలమునకును, ఎఱ్ఱాప్రెగ్గడకు దొరికిన మూలమునకును విశేషభేద మున్నట్లు గన్పట్టుచున్నది. ఎట్లన-ఆంధ్ర పరిశోధక మహామండలి వారు సంపాదించిన సంస్కృత హరివంశపుఁ బ్రతి యందు (i) ప్రథమాధ్యాయము మొదలుకొని రుక్మిమారణ కథనము గల 124 వ యధ్యాయము వఱకు నున్న గ్రంథము పూర్వభాగముగాను. (ii) బలదేవ మహాత్మ్యాభివర్ణనము గల 125 వ యధ్యాయము మొదలు కొని యుత్తర భాగముగాను- గాన వచ్చుచున్నవి. సోముని గ్రంథమునకు మూల మిట్టిదే యని స్పష్టమగుచున్నది. ఈ పూర్వోత్తర భాగ విభాగము పై ప్రతియందే కాక బొబ్బిలి నగరమునఁ గల వ్రాతప్రతుల యందును, చెన్న పురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని కొన్ని వ్రాత ప్రతుల యందును గలదు. ఈ ప్రతులన్నిటి యందును ముద్రిత ప్రతులలో లేని 'ఉషాప్లుష్ట నరకాసుర సంభాషణము మొదలగునవి" గలవు. (మఱియు బలదేవ మహాత్మ్యాభి వర్ణనముతో ననఁగా నుత్తర భాగము కథతోఁ బ్రారంభింపఁబడిన సోముని యుత్తర హరివంశము నయితము పై భాగద్వయ విషయమును నిర్ధారణము చేయుచున్నది).

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములోని యుత్తర భాగము మొదటి మూఁడాశ్వాసముల యందును గానవచ్చు జరాసంధవధ, కాలయవన సంహారము,

రుక్మిణీ కల్యాణము, ప్రద్యుమ్నజననాదులు, రుక్మివధ మొదలగు కథలన్నియు నేను జూచిన పై సంస్కృత హరివంశపుఁ బ్రతులలోఁ బూర్వభాగమునందే యున్నవి. దీనింబట్టి యిక్కథలెల్ల సోముని పూర్వ హరివంశమున నుండి యుండునని మనము గ్రహింపవచ్చును. మఱియు గ్రంథాదినుండి కంసవధాంతము వఱకును గలది పూర్వ భాగముగాను, మిగిలినది యుత్తర భాగముగాను ఎఱ్ఱాప్రెగ్గడ గ్రంథమునకు మూలమైన ట్లాతని హరివంశమువలన నెఱుంగబడుచున్నది.

కావున సర్వజ్ఞ శంభుదాసుల మూల గ్రంథములు వేఱగుట స్పష్టము. ఇప్పుడు గానవచ్చుచున్న యుత్తర హరివంశము మాత్రమే సోముని గ్రంథమని కొందఱాధునికులు వ్రాసియున్నారు. సంపూర్ణ గ్రంథమే లభింపలేదనియుఁ బ్రకటితమైనది భాగము మాత్రమే యనియు చరిత్ర శోధకులు వ్రాసి యున్నారు.

ఇప్పుడు ప్రచారమున నున్నదియే సోముని గ్రంథమని తలంచువారిలో నెవ్వరును. ఆతని గ్రంథమునకు 'ఉత్తర హరివంశ' మను నామమేల కలిగెనో విమర్శించి యున్నట్లు గానఁబడదు. శ్రీమాన్ సీతారామాచార్యుల వారు మాత్రము తమ శబ్దరత్నాకరమున- "ఎఱ్ఱాప్రెగడ హరివంశము వ్రాసిన తరువాత నాచన సోమన హరివంశమును వ్రాసెను. దానం జేసి యాతని గ్రంథ ముత్తర హరివంశమని యెఱుంగబడుచున్నది" అని వ్రాసి యున్నారు. దీనిని మనంబున నిడికొనియే కాఁబోలు శ్రీ వీరేశలింగము పంతులవారు ఎఱ్ఱాప్రెగడ హరివంశము ప్రౌఢముగా నుండలేదన్న యభిప్రాయముతో నీతఁడీ యుత్తర హరివంశమును వ్రాసెను"- అని తమ కవి చరిత్రమున వ్రాసియున్నారు. ఈ వ్రాతలను బట్టి ఎఱ్ఱాప్రెగ్గడది పూర్వ హరివంశమనియు, సోమునిది యుత్తర హరివంశ మనియుఁ బై మిద్దఱ యభిప్రాయమైనట్లు తెలుచున్నది. కాని కాల నిర్ణయమునుబట్టి యిది యనుపపన్న మగుచున్నది. ఇంతియకాక పై వివరణములను బట్టియు సోమనాథుఁడు సంస్కృత హరివంశము పూర్వభాగమును బూర్వహరివంశ మను పేరితోను, ఉత్తరభాగమును ఉత్తర హరివంశమను పేరితోను దెలిఁగించెనని యూహిం

పనగుచున్నది. మఱియు నెల్లిన హరివంశము నుత్తర భాగములోని నాలవ యాశ్వాసపుఁ గథను బెంచియుఁ దగ్గించియు నాఱాశ్వాసములు గ్రంథముగా సోముఁడు వ్రాసె”నను వ్రాఁత గూడ మొదలే నిరాధారమై పోయినది.

ఇఁక నాతఁడు పూర్వహరివంశమును వ్రాసెనాయను దాని నిప్పుడు విచారింతము. సోమనాథుఁడు పూర్వహరివంశమును రచియించినట్లాతని యుత్తర హరివంశమునందే ప్రబలమైన యాధారము గలదు.

కం. “హరివంశ ప్రథమ కథాం
తరమునఁ గల వింత లెల్ల దప్పక మదిలోఁ
దిరమయ్యెఁ గదా మీఁదట
నరవర ! యే కథలొకో వినం బ్రియ మనుడున్”.

కం. “జనమేజయుఁ డిట్లను న
మ్మునితో బలదేవులావు మును విని మఱియుం
దనియదు మది ముద మొదవఁగ
వినఁ గోరెదుఁ జెప్పవే వివేకనిధానా !

ఇచ్చట బలదేవులావు జనమేజయుఁడు ఇంతకు మున్ను వినినట్లును, ఇంకను వినఁగోరెనట్లును దెలియుచున్నది. ఇంతకు మున్ను విన్న బలదేవులా వెచ్చట నున్నదని విచారింపఁగా, పైని నేను వ్రాసిన సంస్కృత హరివంశపుఁ బ్రతులయందుఁ బూర్వభాగము కడపటి యధ్యాయము చివర శ్లోకముల యందే బలదేవు లావు రుక్మివధ సందర్భమునఁ జెప్పఁబడియున్నట్లు స్పష్టమైనది. (దీనింబట్టి సోముఁడు బలదేవ పరాక్రమము పూర్వహరివంశమునఁ జెప్పి యున్నాఁడని నిశ్చయమగుచున్నది). పిమ్మట సంస్కృత హరివంశోత్తర భాగము ప్రారంభమైనట్లు పైని నేను వ్రాసిన ప్రతుల యందున్నది. అదియే సోముని యుత్తర హరివంశము నారంభము.

ప్రథమ భాగమును దెలిఁగింపకయే “ప్రథమ భాగమునందలి కథలెల్ల వింటివి గదా, మీఁదట నే కథలు వినఁగోరెదవు?” అని కవి వ్రాసియుండఁడని యూహింపనగుచున్నది. హరివంశము పురాణముగాని ప్రబంధము గాదు.

ప్రబంధమువలె నొక కథయే తీసికొనఁబడి పురవర్ణనాదులతో నింపఁబడినదిగా దీ యుత్తర హరివంశము. పురాణకథలే యనేకము లిందుఁ గలవు. పురాణములు దెలిఁగించు నే కవియును బూర్వభాగమును రచియింపకయే యుత్తర భాగమున "పూర్వకథలెల్ల వింటివి గదా! ఇఁక నేమి వినవలతువు?'' అని వ్రాసియుండఁడు. కావున సోముఁడు హరివంశ పూర్వభాగమును నయితము దెలిగించెననుట విస్పష్టము.

పూర్వలక్షణ గ్రంథముల యందు నుదాహరింపఁబడిన సోముని పద్యములలో, నొక్కొక్క పద్యము మొదట 'సోముని హరివంశము, సోముని హరివంశము' అనియే కాని యుత్తరహరివంశ మనునామ మెచ్చటను గానరాదు.

సోముఁడు పూర్వహరివంశమును రచియించిన ట్లొండు రెండు నిదర్శనములు గానవచ్చుచున్నవి. శ్రీమ దోగిరాల జగన్నాథ కవి రాజుగారు తమ సుమనో మనోభిరంజన కావ్యము వ్యాఖ్యానమున నాచన సోమనాథుని యీ క్రింది ప్రయోగము నుదహరించినారు.

"శతతాళ దఘ్నహ్రదమున నుఱికెన్"

సుమ. ద్వి. 48 ప. వ్యాఖ్యా.

ఈ పాదము గల పద్యము ఉత్తర హరివంశమున లేదు, ఇది శ్రీకృష్ణుడు యమునానది యందలి కాళియనాగరాజు హ్రదమున నుఱికిన ఘట్టములోని దని తోఁచుచున్నది. నలువది మూడేండ్ల క్రిందటఁ గవియే ముద్రింపించుకొన్న గ్రంథములోని దీ యుదాహరణము. ప్రక్షిప్త మనుటకుఁ గాని, లేఖకప్రమాద మనుటకుఁ గాని, వలనుపడునది గాదు. కాళియుని మడువున శ్రీకృష్ణుఁ డుఱికినది పూర్వహరివంశములోని కథయై యున్నది.

నలుపదియేండ్ల క్రిందటి వఱకును గల యిమ్మహాగ్రంథ మిప్పు డేమయ్యెనోయని భాషాభిమానుల కెవ్వరికి విచారము గలుగకుండును? మొన్నటి జగన్నాథ కవియఁట! సోముని హరివంశపు నిండుప్రతియఁట నేఁడు గానరాదంట! కాలమా!. శ్రీ జగన్నాథ కవిగారి కుటుంబము గోదావరి మండలములోని (ఫ్రెంచివారి యానాముకడ నున్న) నీలపల్లె గ్రామమునకు

వెడలి పోయినట్లు వినియుంటిని. మహనీయు లెవ్వరైన దాని యునికిని గనుఁగొందురు గాక యని వేఁడుచున్నాను.

మఱియు, ప్రబంధ మణిభూషణములోని సోముని పద్యమున్నది.-

సీ. "పురుడు వచ్చిన నాఁడ పూతనా మోతన
స్తన్య జీవితముల చవులు సూచె,
వెన్న మ్రింగెడి నాఁడ వెడఁద పొక్కిటిలోని
జగము వల్లవరాజసతికిఁ జూపెఁ,
దడవి యాడెడునాఁడ దనుజరూపము లైన
మద్దుల యుద్దులు మలఁగఁ జేసె,
నడవ నేర్చిన నాఁడఁ బుడమి వ్రేఁగంతయుఁ
బాపఁబూనిన తనపనులు దెలిపెఁ,
గాచె శరణంగతులఁ బశుగణముఁ గాచెఁ
గేలగిరి యెత్తె యెత్తెఁ బాంచాలి మాన
మనఁగఁ బొగడొందు దేవర నాశ్రయింతు
జిష్ణసఖుఁ గౌస్తుభాలంకరిష్ణుఁ గృష్ణు".

అను దానిలోఁ గొన్ని లేఖక ప్రమాదము లున్నను, శైలినిబట్టి యీ పద్యము సోమునిదే యని తోఁచెడిని. ఇది యమునా తరంగిణి జలములలో శ్రీకృష్ణునిఁ గాంచిన యక్రూరుని స్తవములోని దని యుఁ బూర్వహరివంశము లోని దనియు నూహింప నగుచున్నది. అక్రూర స్తవము పూర్వహరివంశము లోనిదే.

ఇంకను లక్షణ గ్రంథజాలమున నెచ్చటనైన సోముని పూర్వహరి వంశములోని పద్యము లుదాహరింపఁబడి యున్నవేమో విచారింపవలసి యున్నది. (ఆనంద రంగరాట్ఛందమునందును గొన్ని సోముని పద్యములు గానవచ్చుచున్నవి.)

సోముని యుత్తర హరివంశమునకు, అవతారిక లభింపలే దని కొందరు తమ విచారమును దెలిపి యున్నారు. పూర్వహరివంశమున నుండు

నవతారిక యుత్తర హరివంశమున నెట్లుండ గలదు? నన్నయ మొదటి మూడు పర్వములను దెలిఁగించి, భారతమును విడిచి దివంబున కరుగఁగా, కవిబ్రహ్మ నాలవపర్వము మొదట నవతారికాదులను వ్రాసినట్లే, సోమయాజి స్వర్గారోహణ మొనర్చిన తరువాత దక్కనిశా పీఠము నధిరోహించిన సర్వజ్ఞుఁడును భారతశేషమగు హరివంశమును దాను దెలిఁగించుటను గూర్చియుఁ దన వంశాదికమును దన పూర్వ హరివంశమునఁ జెప్పియుండును. మఱియు దిక్కన సోమయాజి గ్రంథమునకుఁ దన గ్రంథము శేషమైనట్లు తోఁపించుటకే యాశ్వాసాంత పద్యముల నాతనివలెనే కూర్చి తన పద్యమునం దయ్యభిప్రాయమును "తిక్కన సోమయాజి ప్రణీత శ్రీ మహాభారత కథానంతరంబున" తాను రచించినట్లు స్పష్టముగ వెల్లడించినాఁడు.

కావున సోమనాథ మహాకవి తిక్కన సోమయాజి యనంతరము భారత శేషమగు హరివంశమును దెలిఁగించి యాంధ్రమహాభారతమును సమగ్రముఁ గావించె ననియు, నం దాని పూర్వవంశ మాంధ్రదేశ దౌర్భాగ్యమున నే మూలనో డాఁగి యుండు ననియుఁ దలంపనై యున్నది భాషాభిమానులెవ్వరైన దగు ప్రయత్నము లొనర్చి యమ్మహా గ్రంథమును బయటికిఁ దెత్తురని మఱియొకతరి వేఁడుచున్నాను.

ఇప్పట్టున "తన హరివంశంతోనే యాంధ్రమహాభారతము సమగ్రమైనట్లు సోమనాథుఁడు తలంచియుండె నేని యారణ్య పర్వభాగమును దెలిఁగింపక యేల విడిచెను?" అని కొందఱు ప్రశ్నింతురు. దీనికి నుత్తరముగా "తిక్కన సోమయాజియే కారణమున నారణ్య పర్వశేషమును ముట్టలేదో సోమనాథుఁడును నా కారణము ననే తాఁకి యుండఁడు; సర్వజ్ఞునకుఁ గవిబ్రహ్మ ననుసరింపవలయు నను నిచ్చయే కాని నన్నయ ననుసరింపు తలంపు లేదు. "ఇవి మొదలగు సామాన్యములైన యుక్తులు కొందఱు చెప్పుదురు. కాని, సూక్ష్మదృష్టిం బరికించు వారికి నీ క్రింది సమాధాన మేర్పడు నని తలంచెదను.

నన్నయభట్టారకుఁడు మొదటి పర్వములను సంపూర్ణముగనే తెలిఁగించెను. తిక్కన సోమన మూరనలనాఁటికి నవి (సమగ్రముగనే)

యుండెను. కావుననే తిక్కన "మహాత్ముండు నన్నయభట్టు ... కృతులు రచించె" నని చెప్పెను. సూరనయు 'భారతసంహిత ... త్రిపర్వములు' నన్నయ రచించె నని చెప్పెను. ఎఱ్ఱాప్రెగ్గడకు ... మునను న్న యియ్యదవుడు నట్లు స్పష్టముగ జెప్పియుండ వారెవి 'సా... న్యపు వ్రాంత యనుట న్యాయేతరము.

అరణ్య పర్వమును నన్నయయే సంపూర్ణముగ రచించె ననియు, నెఱ్ఱాప్రెగ్గడ చేసినది శిథిలభాగ పూరణమే కాని ప్రత్యేక రచనము గాదనియు నిరూపించుటకు ననేక కారణములు గానవచ్చుచున్నవి. కాని, యవ్వానిం బ్రదర్శించుటకునిది యదను గామి విరమించుచుఁ బ్రస్తుత విషయమునకు వచ్చెదను.

ఇప్పుడు గానవచ్చు నుత్తర హరివంశము, దాని యారవ యాశ్వాస ముతోనే పరిసమాప్తి నొంది యుండు నని కొందఱు వ్రాయుచున్నారు. కాని యయ్యాశ్వాసముతో గ్రంథము ముగిసినట్లు గనరాదు. ఏమన, ఆఱవ యాశ్వాసము కడపటి గద్యమునందు 'సర్వంబును షష్ఠాశ్వాసము' అని వ్రాయఁబడి యుండలేదు. తక్కిన యాశ్వాసముల వలెనే యదియు "ఉత్తర హరివంశమునందు షష్ఠాశ్వాసము" అని వ్రాయఁబడి యుండెదో ... యున్నట్లు చాటుచున్నది. గ్రంథము సమగ్రమై యుండె నేని య ట్లున్నడు నుండదు. తిక్కన యేకాశ్వాసము గల పర్వంబుల కడపట నియతము"... ......పర్వంబునందు పర్వంబు నేకాశ్వాసము" అని వ్రాసియున్నాఁడు. ఇట్టిచో గ్రంథమును ముగించెనేని సోమనాథుఁ డట్లు వ్రాయక యుండునా? హరి వంశమున నింకను వ్రాయవలసిన కథ లనేకములు గలవు. ఫలశ్రుతియు నిందులేదు. గ్రంథమును సమాప్తి నొందించే నేని సోమయాజి వలెనే సోముఁడును ఫలశ్రుతి వ్రాయక విడువఁడు. మూలమునను, ఎఱ్ఱన హరి వంశమునను ఫలశ్రుతి యున్నది. కావున యారవ యాశ్వాసముతోనే సోముని యుత్తర హరివంశము ముగిసె నని తలంచుట సరికాదు.

ఆతని సంపూర్ణ గ్రంథమే లభింప లేదనియు, ప్రకటితమైనది భాగము మాత్రమే యనియుఁ బరిశోధకులు వ్రాసిన వాక్యములు నా యూహను బలపఱచు చున్నవి.

ఈ రీతిని సోమనాథునియత్యుత్తమ గ్రంథమగు నాంధ్ర హరివంశము నానా ముఖములఁ జెదరి యున్నది. ఉన్న గ్రంథమైన లభియింపఁ జేసిన పరమేశ్వరునకు సహస్రాభివాదనంబు లర్పించుచున్నాను. (ఉన్న యాశ్వాసముల సంఖ్య యైనను క్రమమైనది గాదని తోచెడిని).

నాచన సోమనాథ మహాకవి 'ఆంధ్ర వ్యాస మహర్షి' యగు తిక్కన సోమయాజికి శిష్యుఁ డనియుఁ 'ఆంధ్ర కాళిదాసుఁ' డనియుఁ జెప్పఁ దగినవాఁడు. సకల విద్యా పారంగతుఁడు. ఆతని గ్రంథములోని గద్యమునందును, బుక్కరాయలచే నాతని కియ్యఁబడిన దానశాసనమునందును ననేక బిరుదము లాతనికిఁగలవు. అవియన్నియు సార్థకములు. ఇతని గ్రంథమునందు భారతము నందలి కొన్ని భాగములను మించు నవీనగుణను లనేకములుగలవు. "ఈతఁడు తిక్కనసోమయాజి యందపార గౌరవమునుంచి యాతనివలెఁ గవిత్వమునుఁ జెప్పనెంచి తత్ప్రయత్నమును బరిపూర్ణముగ నెఱవేర్చుకొనెను" అని విమర్శ కాగ్రేసరు లగు మ. రా. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం, ఏ,. గారు వ్రాసినది యదార్థము. తిక్కన సోమనల పద్యములయందు నొండొంటినిఁ బోల్చఁదగిన పద్యములు నూఱుల కొలఁదిఁ గలవు. మఱియుఁ గొన్ని విషయముల నాతని కీతఁడు తీసిపోవు చున్నను, గొన్ని విషయముల 'గురువును మించిన శిష్యుఁ' డగు చున్నాఁడు. అవి మృదు మధుర పద ప్రయోగములతోఁ గూడిన శైలి లోనగునవి. ఈతని పద్యములు భాషాదేవి విపంచీ నినాదముం బోలె శ్రోతలకు మహత్తరానందముం గూర్చును. ఏ యే స్థానముల నే యే పదముల, నే యే లోకోక్తులఁ బ్రయోగించినఁ జదువరుల హృదయముల యందాయాకథా భాగములలోని విషయము లచ్చొత్తింపఁ బడి నట్లుండి హాయిం గూర్చునో యీ ప్రయోగ విధానమును దిక్కన తరువాతఁ జక్కఁగ నెఱిఁగినవాఁ డీతఁ డొక్కడే. వేసవి తెరువరికి సెలయేఱుం బోలెఁ బాఠకవర్యునకు నీతిని కవిత యెనలేని సౌఖ్యము నొడఁగూర్చును. కవిత్రయములో నొకఁడగు శంభుదాసుఁడును, కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడును ననేక స్థలంబుల సోముని కల్పనలను, పదపద్యంబులను, భావములను ననుకరించి యుండిరన నీతని యాత్కృష్టముం గూర్చి వేఱ చెప్పనేల? అందు 'సీసమునకు శ్రీనాథుఁడు' అను శ్రీనాథుని ప్రఖ్యాతి

లతకు సోమనాథుని సీసపద్య కవితాధోరణియే యాలవాలము. శ్రీనాథుని సీసపద్యముల పోకడ లన్నిటికి సోముని సీసములె యాధారములు మఱియు శ్రీనాథుని కవిత్వములో ననేక స్థలంబుల నాచనసోముని చిఱునవ్వుగాన వచ్చుచుండును. వేయేల ? కవిసార్వభౌముఁడు సోముని శిష్యులలో నగ్రగణ్యుఁడని చెప్పుట యతిశయోక్తి కానేరదు. ఎఱ్ఱన శ్రీనాథుల యనుకరణ ములం గనుఁడు :

సోమన:- సీ. ''మకరంద మాని మైమఱచిన గొనయంబు
పెడమ్రోయు గడివోని వింటితోడ
జలజకేసర రాజి జల్లెడ మూఁకగా
దాఁటు వతారి రథ్యములతోడఁ
గర్ణికారపు మొగ్గ కనకంపు గుబ్బగాఁ
గోయిల నోరూరు గొడు(డ) తోడ
రతి కన్నుఁగవ మచ్చరము సేయు టెక్కెంబు
వడఁక వీతెంచు సేవకులతోడ

వలపుఁ దూపులు గరసాన వాఁడిసేసి
మండు నెలతోడఁ దన మేనమామ యైన
నిండు నెలతోడ వలరాజు నిర్జరేంద్రు
నభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ''.

—ద్వి. 194.

(సంస్కృత హరివంశమున నీ వర్ణనము లేకున్నను సోముని నెఱ్ఱన యీరీతి ననుకరించెను).

ఎఱ్ఱన:- సీ. ''ముందట నెలమావి మొక్కల నలరించు
కర్త దానగు చెలికాఁడు నడువ
నిరువంకలందును విరుల తేనియఁ గ్రోలు
దొరలు మోదంబునఁ ద్రుళ్ళియాడ

సుసుఁగుత్తుకల తీపుఁ గసఁ గూయు పులుఁగుల
చారునాదములు కైవారములుగఁ

జందనగిరి నుండి చనుదెంచి చల్లని
బంగ్లెల్ల పనులకుఁ బరువు వెట్టఁ

జిలుక మావులు గట్టిన చిగురు తేరి
పసిఁడి బలుమీను పడగ యెద్దెసల మెఱవఁ
జెఱకు విల్లు పూవమ్ము లేత్తెఱ ధరించి
గట్టి బిగిసి యేతెంచె నక్కడిమి మగఁడు.

శ్రీనాథుఁడు:- సీ. "కాంతాజనంబుల కటివంక బొమలతోఁ
బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ

గోకిల వ్రాతంబుఁ గ్రుక్కిళ్ళు మ్రింగుచు
క్రొమ్మావి చిగురాకు గొడుగుతోడ

రతిదేవి నిడుసోగ గ్రాలు కన్నుల డాలు
దలఁపించు మీనకేతనము తోడ

భుజగ లీలావతీ భుక్తశేషములైన
గంధవాహ కిశోరకములతోడఁ

జందురునితో వసంత మాసంబుతోడ
రాజకీర రథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రు నాస్థానమునకు."

—హరవిలాసము తృ. 38 ప.

(పై మూఁడు పద్యములను బరీక్షించిన పాఠకవర్యులు తత్తత్కవుల సామర్థ్యముల నరయుదురుగాక !) మఱియు, సోమనాథుని గ్రంథమును జదువఁ దటస్థించిన యాంధ్రకవులందఱును నాతని పద్యములవంటి వానిని విడువక వ్రాసియే యుండిరి. ఒండు రెండు దాహరణములు.

సోమన:- సీ. పా. ''మాఁగు పాటిన చంద్రమండలంబును బోలె
వదనారవిందంబు వన్నె దఱుఁగ;''

చరికొండ ధర్మన:- సీ పా. ''సైంహికేయచ్ఛన్న చంద్రబింబము రీతి
వదనంబు మిక్కిలి వాడికంద;''

సోమన:- సీ. పా. ''బర్హిర్ముఖార్థమై సర్వేశుని తండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు;''

సీ. పా. ''ఫణిపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు;''

కవిలోక బ్రహ్మ:- సీ. ''శేషపన్నగరాజు సెజ్జగా నాతండు
వ్రాల్చినాఁ దీతండు దాల్చినాఁడు:''

సోమన;- సీ. పా. '' దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
విరులనెల్లావికి వీడుకోలు

నిశ్శంకుని కొమ్మన:- సీ. పా. ''దైతేయ కాంతల తటుకుఁ గెమ్మోవుల
వీటికాశ్రీలకు వీడుకోలు''

(వీరమాహేశ్వ.)

చూపఁబూనిన నిట్టి వెన్నియేని గలవు. గ్రంథవిస్తరభీతిని విరమించెద.

శ్రీమాన్ పనప్పాకము అనంతాచార్యులవారి వైజయంతీ పత్రిక యందు నాచనసోమనాథుని గూర్చియు, నాతని గ్రంథముం గూర్చియు వ్రాయఁబడిన ప్రశంసయాతని యౌత్కృష్ట్యమును దెలుపుచున్నది గావున నిచ్చట వ్రాయుచున్నాను.... ''ఇట్టి యుద్గ్రంథమును దేహధనవ్యయములు చేసియతిప్రయాసమున దీనిని సంపాదించి ముద్రించి లోకవ్యాపకము (చేసిన) వీరేశలింగము పంతులు గారిదివఱకు శతాధిక గ్రంథములు వ్రాసి పొందిన గౌరవములకంటె దీని ముద్రించుటచే సంపాదింపఁ గల కీర్తియ వేయిమడుంగు లెక్కువ యని మా యభిప్రాయము ........ఈ కవి సర్వజ్ఞుఁడైనను ఇతనికి

వేదాంతమునందుఁ గల ప్రజ్ఞ యపారమనియుఁ దోఁచుచున్నది. ఇతఁడు కేవల పుస్తకవిద్యలయందు కాక వాత్స్యాయనోక్తంబులగు చతుష్షష్టి కళల యందును గుశలుఁడని యితని గ్రంథము వేయి విధములఁ జాటుచున్నది. ఇతఁడు పుట్టుకవి. లోకస్వభావము చక్కఁగా నెఱిఁగినవాఁడు. అపారమైన భావనాశక్తి గలవాఁడు. ఆంధ్రభాషయందెల్ల నితఁ డొక్కఁడే పదవాక్య ప్రమాణజ్ఞుఁడు. ఏకవియు నూహింపని యనేక విషయముల నీతఁడు పాటించి యున్నాఁడు...."

ఈరీతిగ సోమనాథుని కవిత్వము పలువురచేఁ గొనియాడఁ బడి యున్నది. నవీన గుణసనాథుఁడగు సోమనాథుని గ్రంథమునఁ గొన్ని విశేష ములగుపడుచున్నవి. పద్యమునుబట్టి గ్రహింపఁదగిన కొన్ని విశేషములను మాత్రమిచ్చుట నిచ్చుచున్నాను.

మ. ధనదాంతః పురతారహారములు, యాదః పాలబాలాఘన
స్తన కాశ్మీరము, ధర్మరాట్కులవధూ సంవ్యాన కౌశేయమున్
దనుజేంద్రారి వరావరోధ దయితా ధమ్మిల్లమాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మి నిత్య నైపథ్యమున్."
ఉ, హ. ప్ర. 16 ప.

నరకాసురుఁడు దిక్పతుల సతుల యలంకారముల దెచ్చి, వానితోఁదన జయలక్ష్మిని గైసేయఁజూచుచున్నాఁడు. కవి వాని దృష్టి నప్పుడు దిక్పాల కుల సతుల కడకు నుత్తరమునుండి (ధనాధిపు దిక్కునుండి) తూర్పునకుఁ (అప్రదక్షిణముగాఁ) బోనిచ్చినాఁడు. ఏల? వాని దిగ్విజయము శాశ్వతము కాదు:- అనఁగా జయలక్ష్మి వానికడఁ దడవుండదు! ఈ పద్యము మొదలు కొని యాగభాగముల కై మునీంద్రులను నరకుఁడు బాధిఁచు పద్యమువఱకు గల ఘట్టమంతయు సోమనాథ కవీంద్రుని రచనా సామర్థ్య మనన్యసాధ్యమని చాటుచున్నది.

నరకునితో దేవేంద్రుడు సమర మొనర్చుచుండ నాతనికిఁ దోడుగా వచ్చిన లోకపాలుర నప్రదక్షిణముగాఁ గని దెలుపుచున్నాఁడు.

తే, "వచ్చె యక్షగుహ్యాకులతో వైశ్రవణుఁడు
దోఁచె దారుణభుజగ యాదోబలముల

తోడ వరుణుండు, కాలమృత్యువులతోడ
నడచె దండధరుండు దానవులమీఁద."

ప్ర. 24 ప.

ఇందు దేవతల జయము సూచింపఁబడినది.

మఱియు నరకుని నోటనుండి వచ్చిన యీ క్రింది పద్యములయందలి విశేషములు నరయుఁడు :

(ప్రదక్షిణ):- ఉ. "ఆ లలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం
డాలములో ననుంగదిసి యంతకపాశి కుబేరయుక్తుఁడై
తోలుపులం బడెన్ ..................."

ప్ర. 61 ప.

(అప్ర):- మ. "అవె సుత్రామరథంబు లల్లవె కుబేరానేకప శ్రేణు ల
ల్లవె వార్ధీంద్ర తురంగమంబు లవె ప్రేతాక్షీశ వీరావళుల్".

ప్ర. 63 ప.

(అప్ర):- చ. అవు నిదివోలు వాసవుఁడు నంతకుఁడు, న్వరుణుండుఁ, జాహ్నవీ
ధవ సఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలుదురే ........"

ప్ర. 80 ప.

(ప్రద):- మ. "పాశిం బాఱఁగఁదోలి, యంతకు దిశాపట్టంబుఁ గావించి, పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని ధనాధ్యక్షు న్విభాళించి...."

ప్ర. 91 ప.

ఈ ఘట్టమున నెఱ్ఱన పద్యము లిట్లున్నవి.

మ. "వరుణుం దోలితి నర్థపుం జదిపితి న్వైవస్వతుం గెల్చితిన్
హరిఁ దోఁ జోపితి నేన యీశ్వరుఁడ............"

ఏ. హ ఉ. 4 అ.

చ. "యముఁడు, కుబేరుఁ, డబ్ధిపతి యాదిఁగఁ గలిగిన దేవకోటితో
నమర వరేణ్యు నూర్జిత భుజాతిశయంబున భగ్నుఁ జేసి...."

ఎ హ. ఉ. 4 అ.

ఇందు దిక్పాలురు నిఁయతి ప్రాసనంబద్ధు లయినట్లు మీరు గ్రహింపఁ గలరు.

మఱలఁ బై 'ధనదాంతః పురతారహారములు...' అను పద్యమునే చిత్తగింపుఁడు. ఇందు జగదీశ్వర మహిషీమణుల యలంకారముల వారించి వారికి వైధవ్యము నాపాదింప నరకాసురుఁడు తలంచుచున్నాఁడు. అమరుల భార్యలకు వైధవ్య మెక్కడ? కావుననే మన సర్వజ్ఞుఁడు (1) పెరిగినను (2) కరఁగినను (3) మాసినను, (నలఁగినను. మఱల మఱల ధరించుకొను నవియ, సౌమాంగల్యమునకు భంగము తేనివియు నగు (1) తారహారములు, (2) కాశ్మీరము, (3) సంవ్యాన కౌశేయము, (4) మాల్యంబులు నను తాత్కాలికాలంకారముల మీఁదికే నరకుని దృష్టి పోవునట్లు చేసినాఁడు:

(1) ఈ సంవిధానము రాక్షసకాంతలయెడ నెట్లు ప్రయోగింపఁ బడినదో కనుఁగొనుఁడు.

సీ. "దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ,
విరుల నెత్తావికి వీడుకోలు
దనుజ శుద్ధాంత కాంతా కటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గాని వాని
దానవ మానినీ స్తన కుంభములతోడఁ
బసుపుఁ బయ్యెదలకుఁ బాయు తెరువు
దైత్యావరోధన దయితా ధరములతో
నొబగు విడెములకుఁ జుక్క యెదురు

చేసి సురసుందరీ కరోశీరతాల
వృంత చలితాంత కుంతల విలస దింద్ర

పుర........" అను పద్యములోనివే పై విశేషములు! ఇట్టి సాహిత్యరస పోషణ సంవిధాన చక్రవర్తి కవన సౌందర్య మహిమను గని—

శా. "ఔరా! హారి వచోరసస్థితి! యహోహో! శబ్దదాంపత్య మ
య్యారే! పాక ఋజుక్రమంబు! భళి! శయ్యారీతు! లోహో! చమ
త్కారం! బద్దిర! జాతివార్తలు! పురే! ధారాసమారూఢి! మ
మ్మారా! రాజదలంకృతుల్! కవులలో మాన్యుండ వీవన్నిటన్".

అను ప్రబంధ రాజములోని పద్యము నెవ్వరు జ్ఞప్తికిఁ దెచ్చుకొనకుందురు? •

*ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 11. సంచిక 6. (1923)
*ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 13. సంచిక 1. (1924)
•ఆంధ్ర పత్రిక
పదునొకండవ సంవత్సరాది సంచిక. (రౌద్రి) (1920)

# శ్రీనాథుని రచనలో భక్తి శృంగార భావశబలత

- శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

కవులు తమ రచనలను రసికజన హృదయాస్వాద్యములుగ నొనర్చుటకు వివిధ రసభావములను దమతమ ప్రతిభానుసారముగ సంతరింతురు. విశేష మయిన విద్యాసంస్కారము లేకున్నను ప్రాణి సామాన్యమున కనుభవ గోచర మగునది ప్రణయము. ఇట్టి ప్రణయము పరమేశ్వరాలంబన మగుచో భక్తి యనియు, మాతృ పుత్రాశ్రయ మైనచో వత్సలత యనియు, ప్రేయసీ ప్రియాలంబన మైనచో శృంగార మనియు వ్యవహరింపఁ బడుచున్నది. అఖండానందానుసంధాయి యగు నీ ప్రణయము ననుసంధానించుటకుఁ గవికిని, అనుభవయోగ్య మొనర్చుకొనుటకు రసికునకును సముచిత చిత్తసంస్కార మావశ్యకము. అట్టి సత్త్వము కొందఱకే సమకూడి యుండును. వీర శాంతాది రసభావములు కొందరకే సముల్లాసజనకములు. హాస్యరౌద్రాది తదితర రస భావములు పాఠకులందఱకు నాస్వాద యోగ్యములుగావు కాని యనుసంధానించు యత్నము కూడఁ గవులలోఁ గొందఱకే జరుగుచుండును.

శృంగార రసభావములు, తత్సముత్తేజక స్త్రీ పురుష సౌందర్యవర్ణనము తదాలంబన ప్రాకృతిక వికాస సమున్మేషములును సహాయముగఁ గవి దృష్టిని రసిక హృదయమును వెంటనే యావర్జించును. కాని, తదనుగుణ వస్తుసమున్మీలనము కవికి మిక్కిలి కఠినము. తదనుసంధాన యోగ్యమగు చిత్తసంస్కారము లేని పాఠకులకు శ్రోతలకు నది యట్టిదియే. ప్రణయ మనునది తెలిసియో తెలియకయో, కొలఁదిగనో గొప్పగనో మానవహృదయ మందు తత్తద్వయోవస్థానురూపముగ మొలకెత్తుచుండును. కావుననే యది స్త్రీ పురుష సామాన్యముగ ననుభవయోగ్యమై యెసలారుచుండును. అందును సరస ప్రేయసీ ప్రియాశ్రయమైన ప్రణయ భావములు, తదుత్తేజక సామగ్రియు నుత్తమకావ్యోపనిబద్ధమై యాస్వాదయోగ్యములై వెలువడినపుడు, నవి యాశ్రమ వయోవిభాగ నిరపేక్షముగ నందఱకు సముల్లాసము గలిగించును. అట్టి శృంగారరస భావముల నౌచిత్యభంగ మిసుమంతయు లేకుండ

రాగులకు యోగులకుఁ గూడ శ్రవణ పేయముల నొనర్చినవాఁడు సంస్కృతమున మహాకవి కాళిదాసు.

కాళిదాస విరచిత కావ్యములలో ప్రధానరసము శృంగారమే యయినను తదున్మేషక సామగ్రి సామాన్యమునకు హృదయాహ్లాదిగ గానవచ్చినను కవితారహస్య వేత్తల కది పార్వతీపరమేశ్వర భక్తిభావ సమున్మేషక వస్తుసామగ్రిగనే గోచరించును. అతఁడు తన కుమారసంభవ కావ్యమున పార్వతీపరమేశ్వరాలంబన మైన శృంగారరస భావములను సమగ్రముగ వర్ణించి, తద్భావావిష్కరణము నాత్మీయభక్తి భావావిష్కరణ పర్యవసాయిగ నొనర్చి యున్నాఁడు. ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథుని రచనయు నట్టిదియే. సంస్కృత వాఙ్మయము నందలి సరససామగ్రిని దన రచనలో ననుసంధానించుచు పరమేశ్వరాలంబనముగ శృంగారరస భావముల నావిష్కరించిన యీతని రచనయు భక్తిభావ పర్యవసాయియై యెసలారు నొక స్రవంతి.

శ్రీనాథుని రచనలో శృంగారరసభావము లోతప్రోతమై యుండునని యొక ప్రసిద్ధి. ఆతని చాటుపద్యము లని లోకమున వ్యాప్తిలో నున్న పద్యములను బట్టి యాతఁడొక శృంగార పురుషుఁ డని కింవదంతి. ఇట్టి ప్రవాదము కాళిదాసునకు లేకపోలేదు. కాని శ్రీనాథుని రచన లని నిర్వివాదముగఁ దేలిన వానిలో నొక్క నైషధము దక్క మిగిలిన వానిలో పెక్కు తావులందు పరమేశ్వర భక్తిభావమే విపులముగ నిరూపితమైనది. ఈ తీరుగ భక్తిభావము నావిష్కరించు పట్టులందు సైతము శృంగారరస భావములు జతకూడునట్లు లొనర్చి, తన కవిత నాస్వాదయోగ్య మొనర్చుటకై శ్రీనాథుఁ డొక ప్రత్యేక సరణి నంగీకరించెను. ఇటులనే శృంగారరస భావ సామగ్రితో భక్తిభావముల నతికించుటయు నాటనికిఁ బట్టువడిన యొక ప్రత్యేకతగా నిరూపింప నగును.

కవియైనవాఁడు తానేయితి వృత్తమును దీసికొనినను దానిలోఁ దన కాలమునాఁటి జనుల వారిరుచులను, వారి మనః ప్రవృత్తులను తాత్కాలికము లగు వేషభాషాదికమును వ్యంగ్యముగనో వాచ్యముగనో ప్రతిఫలింపఁ

జేయుచునే యుండును. కథావస్తువును బట్టి గైకొనిన పాత్ర లతీతయుగము లకుఁ జెందిన వారయినను, వారిని జిత్రించునపుడు తనకు సమకాలికు లయిన వ్యక్తుల మనోభావములను మాత్రమే నిరూపింపఁ గలుగును. మానవబుద్ధి కందని విషయములను వదలివేసినచో, అందెడి వన్నియుఁ గవికాలము నాఁటి వియే యగును. అతీత విషయములను గూఁడ దమ యోగబలముచేఁ బ్రత్య క్షము చేసికొని కవిత సాగించిన వాల్మీకి వ్యాసుల రచనలయందుఁ దక్క, తక్కిన కవుల రచనలలో కవి సమకాలిక విషయములే స్ఫురించుచుండు నని యాలంకారికులు వాకొని యున్నారు. ఈదృష్టితో మనము శ్రీనాథుని రచనలను బరికించినచో నాతని కాలమునాఁటి వ్యక్తులకుఁగల భక్తి శృంగార భావసామగ్రితో పాటు, నాఁటి వ్యక్తుల వేషభాషాభూషణ భంగియు నానాఁటి జనుల యభిరుచులు కవి మనోభావములును దెల్లమగును.

ప్రణయ మతిలలితము. దాని నాస్వాదింప వలయు ననిన లలిత మధు రభావసమ్మిశ్రితమైన చిత్తవృత్తియు నావశ్యకము. ఉద్రేకము ఉద్వేగము గల చిత్తముల కది యాస్వాద యోగ్యము గానేరదు. కవి హృదయము ద్రవీభావ యోగ్యమైననాఁడె ప్రణయసంబంధి భావముల నాతఁడు మృదుమధురముగ నతిని వెలార్పఁ గలఁడు. రసికుఁ డగు భావుకుఁడు కూడఁ దదనుసంధాన యోగ్య మగు నంతఃకరణ వృత్తి గలిగిననాఁడే యాస్వాదించి యానందింపఁ గలఁడు. అందును బరమేశ్వరాలంబన ప్రణయరూపమైన భక్తిని భావించుటకు, తదావి ష్కరణమునకు, తదాస్వాద జనితానందానుభవమునకు, సర్వథా చిత్త సంస్కార మెంతేని కావలయును. కావుననే కాళిదాసాదులు కవిత సామాన్య చిత్తసంస్కారముగల వ్యక్తులకుఁ దలస్పర్శిగ నాస్వాద యోగ్యము కాదనియే చెప్పవచ్చును.

ఏవస్తువునందలి సౌందర్యము నయినను కవి తన సూక్ష్మదృష్టితోఁ బరికించి, భావించి, కావ్యముఖమున వెలార్చినపుడది సామాన్య వస్తువే యయినను విశిష్టవస్తువుగ గోచరించును. కవి కంటఁబడిన నీరస వస్తువు కూడ తద్భావనా బలమున రసబంధురమే యగును. కవి యా వస్తువును లోకము నెదుటఁ బెట్టునపుడు మఱింత మనోహరముగఁ గానవచ్చును. శ్రీనాథుఁడు

తన కృతులలోఁ బ్రసక్తి వచ్చినపు డెల్ల ప్రాకృతిక సౌందర్యమును, స్త్రీ పురుష శరీర సౌకుమార్యమును సమవయోవస్థాను రూపముగఁ జిత్రించుచునే వచ్చెను. అందును స్త్రీ సౌందర్యవర్ణన ప్రసక్తి వచ్చినపుడు గొంత యవధానమును, ముఖ్యముగ వయోధర పరిణాహ వర్ణనమునం దొక ప్రత్యేకతను బ్రదర్శించుచు వచ్చినాఁడని చెప్పవచ్చును.

సౌందర్య మనునది స్త్రీ పురుష సాధారణమే యయినను కవులు మాత్రము స్త్రీ సౌందర్యవర్ణనమునఁ గొంత ప్రణిధానమును వహించినట్లుకన్పట్టును. పురుషు లెంతటి సౌందర్యవంతు లయినను వారిలో సహజముగఁ గొంత మోటు దనమును, స్త్రీలెంతటి యనాకారులైనను వారిలోఁ గొంత లాలిత్యమును గాననగును. కావున గవుల రచనలు స్త్రీపక్షమున నేములుచూపుచు వచ్చినవి. ప్రత్యంగ సౌష్ఠవమును జిత్రించిన ఘట్టములలో బురుషుల సంఖ్య కంటె స్త్రీల సంఖ్యయే హెచ్చుగా గానవచ్చును. సాధారణముగఁ గవులు స్త్రీ సౌందర్యమును వర్ణించు పట్టులలో కచకుచ నితంబాభోగమును విశిష్టముగ వర్ణించుట యొక పరిపాటి. ఏ ప్రకరణమునం దయినను వానిని వదల కుండ చిత్రించుట శ్రీనాథుని కొక యలవాటు. ఇట్టి వర్ణనము రసికజన హృదయమున కానందమును విరాగిజన హృదయమున కుల్లాసము నొదవించును. శ్రీనాథుని రచనలలో నిట్టి వర్ణన లెడనెడ నుండుటను గాఁబోలు నాతని నొక శృంగారకవిగా లెక్కింతురు. కాని, యాతని కృతులను సావధాన మతితోఁ బరికించినచో భక్తిభావ నిరూపణమునందే యాతనికిఁ బ్రణిధాన మేర్పడియుండునట్టు లాతని కృతులు తార్కాణించును. ఆ విషయము నిటఁ గొంత ప్రస్తావించెదను.

శ్రీహర్షుఁడు నైషధీయ చరిత మహాకావ్యము నందలి విశిష్టతను గూర్చి ప్రస్తావించుచు పదునొకండవ సర్గ తుదిని—

శ్లో॥ శృంగారామృత శీతగావయ మగా దేకాదశ స్తన్మహా
కావ్యే చారుణి నైషధీయ చరితే సర్గో నిసర్గోజ్జ్వలః"

సం. నై.॥ సర్గ.

అనినాఁడు. దీనిని బట్టి శ్రీహర్ష నైషధ కావ్యము శృంగారరస వారాసినిఁ బెల్లుబుకఁ జేయు చంద్రస్వరూప మని తెలియుచునే యున్నది. తన్మూలముగ నీ కావ్యమున శృంగారరస భావము లతిమాత్రములు నగాధములు

నని స్ఫురించుచునే యున్నది. శ్రీనాథుడు తా నాంధ్రీకరించిన యీ నైషధ కావ్యము తుదిని ''భట్టహర్ష మహాకవీశ్వరుఁ డొనర్చిన నైషధ శృంగార కావ్యప్రబంధ విశేషంబున నశేష మనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీ భాషా నైషధ కావ్యంబు'' అని వాకొని యున్నాఁడు. ఈతని ప్రసంగమును బట్టియు నైషధకావ్యము శృంగారరస వారిధి యనుట స్పష్టము. ఇట్టి యీ కావ్యమున శ్రీనాథుఁ డౌచిత్యమును పాటించి శృంగారరస భావముల నెంతగాఁ బ్రపంచించిన నబ్బురపడ నక్కఱలేదు. ఇట్టి శృంగారరసమయ కావ్యమునందు సైత మదను చూచుకొని తనకుఁగల భక్తిభావమును వ్యక్తము చేసి యున్నాఁడు. తద్వ్యక్తీకరణ మొక విలక్షణ విషయము. ఆతీరు పరికింతము.

దమయంతీ స్వయంవరమునకు రాజు లందరును సమావిష్టు లైనపుడు వారివారి కులగోత్రాదికమును వివరించువా రెవరని చింతించి, భీమభూపతి, తన కులదైవత మగు శ్రీహరిని మనసార నొకమాఱు స్మరించును, వెంటనే విష్ణువు సరస్వతి నాపని నెరవేర్పు దానిగా నియమించును. విష్ణునానతిని సరస్వతి సభాస్థలి కవతరించును. శ్రీహర్షుఁడు తన వాక్కులతో వాగ్దేవితా స్వరూపమును వర్ణించును. ఈ యదనున శ్రీనాథుఁడు భీమభూపతిచే సరస్వతీదేవిని స్తుతింపఁ జేసియున్నాఁడు. ఆ స్తుతి ఆంధ్రభాషా ప్రవంతిలో సలకలనాదముతో నడచిన సంస్కృత భాషా మయమైన యొక దండకము దండకమునందలి విషయము శ్రీ హర్షనైషధ శ్లోకసారరూపమే యయినను మధురనాదానుసంధానముగ విలక్షణమై యొప్పారినది. దండకము తుదినున్న యీ క్రింది పంక్తులు మాత్రమే శ్రీనాథ స్వకపోల కల్పితములు. ఆరచన యిట్లు సాగినది :—

''నమస్తేస్తు కైవల్య కల్యాణ సీమ్నే నమస్సర్వ గీర్వాణ చూడా
మణి శ్రేణిశోణ ప్రభాజాల బాలాతపస్మేర పాదాంబుజాయై నమస్తే

శరణ్యే, నమస్తే వరేణ్యే, నమశ్కారదాయై, నమో నర్మదాయై
నమ శ్శాశ్వతాయై నమో విశ్రుతాయై నమస్తే నమస్తే నమః''

—నైష. 4. 138

ఈ విధముగ మూలమున సరస్వతీ వర్ణన మాత్ర పరములైన శ్లోకములను దండకముగా సంతరించి, శ్రీనాథుఁడు శారదాంబ యెడఁదనకుఁగల భక్తి భావము నావిష్కరించి యున్నాఁడు. దండక రచనము సామాన్యముగ దేవతాస్తుతి కుద్దిష్టమైనది. అందు నీ దండకమున సమకూర్చిన పదజాల మంతయు భక్తిభావ సముద్దీపకమై యెసలారినది. అందలి యొక వాక్యము పరికింపుఁడు—

''జయజయ జనయిత్రి కల్యాణ సంధాత్రి. గాంధర్వ విద్యా కళా కంఠ నాళాం, త్రివేదీవళీం, సారసాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్ల సద్భక్తరంగా, మనేకాభిచారక్రియా హోమధూమావళీ మేచకాథర్వ ణామ్నాయ రోమావళిం, కల్పశిక్షాతురాకల్ప సాక్షాచ్చరిత్రాం నిరుక్త ప్రియోక్తిం భుజద్వంద్వతా మశ్ను వానేన సంశోభితాం, ఛందసా జాతి వృత్త ప్రభేద ప్రభిన్నేన విద్యామయీం త్వాం భజే''

—నైష. 4. 138

ఇట్లే దండక విషయ మంతయు విద్యా స్వరూపిణియైన శారదా స్తవ రూపము. ఈ దండకము తరువాతఁ గూర్చిన పద్యము శ్రీనాథునకు శారదాంబిక యెడఁ గల భక్తిభావమున కుపష్టంభకము.

మ. ''జగతీనాథుని మందట న్నిలిచె సాక్షాత్కారముం బొంది యా
జగదేక స్తవనీయ శారద శరచ్చంద్రాతపాలోకము
న్నగవుం దేటయు దివ్యదేహరుచియున్ సమ్మేళనం బొంది చె
ల్వగుచుండం గరుణాపరాయణత నయ్యాస్థాన మధ్యంబునన్.''

—నైష. 4. 140

ఈ విధముగనే నలుఁడు ప్రాతస్స్నానమునకై మిన్నేటి కేఁగినపుడు అవకాశము కల్పించుకొని గంగాభవాని నగ్గించియున్నాఁడు. ఈ రచనయు భక్తిభావపరీత మైనది. దీనికి మూలము లేదు.

''ఏఁగియట మహానటజటాటవీ వాటి నవతరించి, నభోవీథీమేధీ భూతం బగుధ్రువమండలం బొరసికొనుచు శింశుమారాకారంబునం దారకామూర్తి యైపవ్వళించిన పాంచజన్యధరుని చరణపల్లవంబుఁ బ్రక్షాళించుచు, సోమార్కమయ మహాసోపానంబులం బ్రవహించి పరివహాపవన ఝుంపా సంపాతంబులం దూఁగియాడు కరళ్ళచప్పుళ్ళు దిక్పుటంబుల నాస్ఫోటింపఁ ద్రివిష్టప లలాటికా తిలకంబును నరకపుర గోపుర ద్వార దంతార్గళయును, నారాయణ చరణారవింద మకరంద బిందు నిష్యందంబును, బుండరీకభవ కమండలు తీర్థధారయునైన యమ్మహానది డాసి.... యొక్కరేవున డిగ్గి.''

—నైష. 8. 28

ఈ వచనమున శ్రీనాథునకు గంగానదీమతల్లియెడఁ గల భక్తి భావము ప్రస్ఫుట మయినది. ఈ వచనము తరువాత నొక సీసపద్యమున నలుఁడు గావించిన స్నానాది నిత్యకృత్యములు వర్ణింపఁ బడినవి. ఆ రచనలో నాతని నాఁటి శివభక్తుఁడైన ధార్మికుని మూర్తి చూపట్టును. ఇదియు మూలము నపేక్షింపక నడచినదియే.

సీ. ''అత్యంత నియతిఁ బంచాంగంబు పఠియించె,
నఘమర్షణ స్నాన మాచరించె,
దైవత ఋషి పితృతర్పణం బొనరించె,
సంధ్య నారాధించె, సవితఁ గొలిచె,
గాంగేయవాలుకా లింగమూర్తిని నిల్పి
కాంచనాబ్జములఁ బూజించె శివుని,
పారిజాతక లతాపల్లవాగ్రంబులు
చిదిపి యొయ్యన మేపెఁ ద్రిదశ గవికిఁ
గేలుదో యెత్తి యోదలఁ గీలు కొలిపి
గగనమునిరాజులైన చుక్కలకు మ్రొక్కె

దివ్యరథ మెక్కి వేగ యేతెంచె మరల
నధిపుఁ డట సురనది తీర్థయాత్ర సలిపి"

—నైష. 8, 29,

పంచాంగము పఠించుట, అఘమర్షణమంత్ర పఠన పూర్వకముగ స్నానమాచరించుట, స్నానాంగముగ దేవఋషి పితృతర్పణము సేయుట, సంధ్యవార్చుట, సూర్యోపాస్తి నెఱపుట యను నివి శ్రీనాథుని నాఁడు ధార్మికుఁడైన గృహస్థు నెఱపెడి యహర్ముఖ కృత్యములు, కావున శ్రీనాథుఁడు నలునిచే వానిని నెఱపించి నాఁడు. శ్రీనాథుఁడు శివభక్తుఁడు కావున నలునిచే వాలుకా లింగమును నిలిపించి, కాంచన పద్మములచేఁ బూజ గావింపఁ జేసినాఁడు. పారిజాత పల్లవములు త్రుంపి కామధేనువునకు మేత పెట్టుట, సప్తర్షులకు నమస్కారము సేయుట - యను నివి సామయికాచారములు. ఈ వర్ణనను బట్టి శ్రీనాథుని మూర్తిగాని, యానాటి ధార్మికుఁడైన శివభక్తుని మూర్తిగాని మన యెదుటఁజూపట్టును

ఇటులనే నలుఁడు శివపూజాగృహమునకుఁ బోవునప్పటి యాతని యాకృతి మూలమును మీఁటి నాలుగు సీస పాదములలో వర్ణింపఁబడినది. ఈ రచనలో శ్రీనాథుని నాఁటి శివభక్తవరుని వేషము మన యెదుట గోచరించును.

సీ. "సీమంత మేర్పడఁ జికురభారమున సు
శ్లిష్ట బంధంబుగ శిఖ యమర్చి,
గన్నేరుఁ బూచాయఁ గనుపట్టు జిలుగైన
సలిల కాషాయ వస్త్రంబు గట్టి,
చంద్రాతపముతోడ సరియైన వెలిపట్టుఁ
బుట్ట ముత్తరవాసముగ ధరించి,
ప్రక్షాళితములైన పదియాఱు వన్నియ
కనకంపుఁ గొడుగు బాగాలు దొడిగి,
శైవుఁడగు బ్రాహ్మణ బ్రహ్మచారి యిచ్చు
హస్త మవలంబనంబుగ నల్ల నడచి

నియత మౌనవ్రతంబుతో నృపతి సొచ్చె
శాంతచిత్తుఁడై దేవపూజాగృహంబు"

నైష. 8-108.

ఇది శ్రీనాథుని నాఁటి శివపూజా ధురంధరుఁడు దాల్చెడి వేషము గానోపును. కాని, నాఁడు మూలములో లేని విషయ మింతగఁ బ్రసంచించు నేల ? కాకున్న శివపూజావసరములందు శ్రీనాథుని మనః ప్రవృత్తియేని యిట్లుండనోపును.

ఇట్లే మూలములో శ్రీహర్షుఁడు నలునిచే శివపూజ చేయించునపుడు దుత్తూరములు, నాగకేసరములు, మల్లికుసుమములు మాత్రమే యుపయోగింపఁగా, శ్రీనాథుఁ డంతటితోఁ దృప్తినందక శివప్రీతికరములైన పత్ర పుష్పముల నన్నిటిని శివున కర్పింపఁ జేసి యున్నాడు.

సీ. "ఖట్వాంగపాణిఁ జెంగల్వ పుష్పంబుల
ఫాలలోచను బిల్వ పల్లవముల
నాగేంద్ర కేయూరు నాగకేసరముల
బాలేందు కోటీరుఁబాటలములఁ
గుసుమకోదండారిఁ గుండవర్ధనములఁ
గాంచనాచల చాపుఁ గాంచనముల
నంబికా హృదయేశు నసితాంబుజంబుల
దక్షాధ్వరధ్వంసి దమనకముల

బొండు మల్లియ విరిదండ ఖండపరశు
నఖిల సురసార్వభౌము దూర్వాంకురముల
బంతి శ్రీవత్స లాంఛన ప్రాణబంధు
శివుని చేమంతి బంతిఁ బూజించె నలుఁడు

నైష. 8-107.

పూజాపుష్పముల నింతగ విపులీకరించుట శ్రీనాథునకుఁ జంద్రశేఖరు నెడఁగల భక్తిభావమును ప్రపంచించుటకే—యని విదిత మగుచున్నది. ఇటులనే పూజోపచారాది సమర్పణ విషయమునందును విశేషములను ప్రదర్శించియున్నాడు.

సీ. "పద్మాసనస్థుఁడై భావించె మానస
కమల కర్ణిక యందు కాలకంఠుఁ
బంచాస్యు ప్రోల జపించెఁ బంచబ్రహ్మ
పంచాక్షరంబులఁ బరమ నియతి
భక్ష్యభోజ్యాదిక బహుపదార్థంబుల
నతిభక్తిఁ గొలిచె రాజార్ధమౌళి
రాజ దేవోపచార ప్రకారంబుల
నతిభక్తిఁ గొలిచె రాజార్ధమౌళి"—

నై. 8. 110.

పద్మాసనాసీనుఁడై మానస కమల కర్ణికయందుఁ గాలకంఠుని భావించుట, పంచాస్యుని ప్రోల పంచబ్రహ్మ పంచాక్షరీ మంత్రములు జపించుట బహుపదార్థములు విరూపాక్షున కుపహార మిచ్చుట, రాజశేఖరుని రాజోపచార దేవోపచారముల నతిభక్తి కొలుచుట యను నివి శ్రీనాథుని నాటివి, యాతని కభిమతము లైనవి యగు పరిపాటులు. అదను గుర్తించి వాని నదికించుటలో శ్రీనాథునకుఁ గల భక్తి భావము వ్యక్త మగుచున్నది.

స్వయంవరానంతరమున సరస్వతీదేవి నలునకు చింతామణి మంత్రము నుపదేశించును. అప్పటి సరస్వతి దేవతా స్వరూపమును మూలములో లేని దానిని సంతరించి యున్నాఁడు. ఈ వర్ణనము శ్రీనాథునకు వాణియెడఁ గల భక్తిభావమును వ్యక్తము చేయుచున్నది. ఇది యొక సీసపద్యము. దీనికి మూలము శ్రీహర్ష కృతిలో లేదు.

సీ. "కబరికాభరముపైఁ గన్నె గేదఁగి పువ్వు
రేకుతోఁ గూడ రేఱేనిఁ బొదివి

లలిత కస్తూరికా తిలక మధ్యంబున
సొబగారు ముత్యాల చుక్క నిలిపి
కుదురు నిండిన మించు గుబ్బ చన్నుల మీఁద
జిలుగు దువ్వలువఁ గంచెలయుఁ దొడిగి
యచ్చవెన్నెల చాయ నవఘళింపఁగఁ జాలు
నిద్దంపు వెలిపట్టు నెఱిక గట్టి

యంచ కొదమలఁ బూన్చిన యరద మెక్కి
యుపనిషద్వీధి విహరించుచున్న నన్ను
మహిత చింతామణీ దివ్యమంత్ర మూర్తిఁ
దలఁప సారస్వతం బయత్నమునఁ గలుగు".

—నైష. 6-22

ఈ పద్యమును బట్టి శ్రీనాథున కుపాస్య యైన శారదామూర్తి యిట్టి దని తెలియవచ్చుచున్నది. కవితాస్ఫూర్తి నపేక్షించు తఱి నిట్టి బ్రాహ్మీస్వరూపము నాతఁడు ధ్యానించువాఁడని కూడ మన కెఱుఁగ నగును.

ఈ ప్రకరణమునందే శ్రీహర్షుఁడు చింతామణి మంత్ర ప్రభావమును దెలుపుచు నొక శ్లోకమును రచించి యున్నాఁడు. శ్రీహర్షుడు చింతామణి మంత్రోపాసకుఁ డగుటచే నాతని భావనలోఁ దన్మంత్రము చింతితార్థ స్ఫోరకము. అది శివశక్త్యభేద భావనాత్మకము; లక్ష్మీనారాయణ స్వరూపానుసంధానాత్మకము; మంత్ర తంత్ర స్వరూపానుసంధాన స్వరూపమునై యున్నది. ఈ విషయ మంతయు నారాయణీయవ్యాఖ్య యందు వివరింపఁ బడి యున్నది. ఆ శ్లోక మిది :—

శ్లో. అవామా వామార్థే సకల ముభయాకార ఘటనా
ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతి యత్
తద న్తర్మంత్రం మే స్మరహర మయం సేందు మమలం
నిరాకారం శశ్వ జ్జప నరపతే! సిద్ధ్యతు సతే.

—సం. నైష. 14-88.

ఈ శ్లోకమును శ్రీనాథుఁ డిట్లనువదించి యున్నాడు.

మ. "సకలం బై హిమరుక్కళాభరణమై సవ్యాపసవ్యార్థయు
క్తకి రూపం బయి శైవమై గతకళంకం బై శివం బై యుపా
సకచింతామణియై ప్రసిద్ధాభగవచ్ఛబ్దాభిధేయార్థ మై
యొక మంత్రంబు మదీయ మొప్పు; నది నీ కుర్వీశ! యే నిచ్చితిన్"
—నైష. 6-18.

ఈ పద్యమున శ్రీనాథుని శివభక్తి పరత వ్యక్త మగుచున్నది. మంత్రములు తత్తద్బీజాక్షర సంపుటీకరణమున నుపాసకాభిమతముగ వివిధార్థస్ఫోరకములై యెసలారు చుండును. కావున శ్రీనాథున కీ చింతామణి మంత్రము పార్వతీపరమేశ్వర స్వరూపానుసంధానాత్మకమై భాసించినది.

ఈ విధముగ శ్రీనాథుఁడు శృంగారరసవారినిధి యైన యీ యాంధ్ర ప్రబంధము నందుఁ దనకుఁ గల శివభక్తి పరతను వ్యక్తము చేసి యున్నాఁడు. ఈ తెలుఁగు సేతలో శ్రీనాథుఁడు శృంగారరస భావములు వర్ణించు పట్టులందుఁ దనకుఁగల భావాభినివేశమును వ్యక్తము సేయక పోలేదు. శ్రీహర్ష నైషధము నందలి భావములను బెంచియుఁ ద్రుంచియు ననువాదము సాగించి యున్నాడు. మూలముతో సరిపోల్చి చూచిన నా విషయము వ్యక్త మగును

నలుఁడు దేవేంద్రాదు లొసఁగిన శాంబరీ విద్యాప్రభావమున దమయంతి యంతఃపురమునకుఁ బోయినపుడు అంతఃపురాంగనలు గావించిన చమత్కారములను శ్రీహర్షుఁడు మూలమున వర్ణించి యున్నాడు. ఆంధ్రీకరణమున శ్రీనాథుఁడు వాని నెట్లు వివరించెనో కనుఁగొందము. మూలమునం దంతః పురాంగనల చేష్ట లిట్టు లారంభింపఁ బడినవి.

శ్లో. "అంతఃపురాంత స్స విలోక్య బాలాం
కాంచి త్సమాలబ్ధు మసంవృతోరుమ్,
నిమీలితాక్షః పరయా త్రపయాంత్యా
సంఘట్ట మాసాద్య చమ చ్చకార".
సం. నైష. 6-13.

దమయంతీదేవి యంతఃపురమున నొక బాలిక పయ్యెద పెట్టుకొనక పై యనాచ్ఛాదితమైన యూరువులు గలిగి యుండుట చూచి, రాజు కన్నులు మూసికొనెను. ఇంతలో హేలనఁ దిగజారిన మఱియొక బాలిక వచ్చి రాపాడెను. దానికి నలుఁడు డబ్బర పోయెనని ఈ శ్లోక భావము. ఈ శ్లోకమునందలి "అసంవృతోరుమ్" అను విశేషణము వ్యంగ్యముగా రాజు కనులు మూసికొనుటకుఁ గల కారణమును దెలిపినది. ఆ భావమును శ్రీనాథుఁడు మఱింత నిగూఢము చేయుచు మఱికొంత చమత్కారిం జెసినాఁడు.

చ. "ప్రిదిలిన నీవిఁ గేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతి బడిఁ గన్నులు మోడ్చ నొకక్షోణిరక్షుపై
యెదురుగ వచ్చివచ్చి యొక యిద్దరు ముద్దియ లొత్తి రక్ష్మాధిపున్
మదగజరాజ కుంభముల మచ్చరకించు కుచద్వయంబునన్".

నైష. 3-86.

రాజు కన్నులు మూసికొనుటకుఁ గారణము నగ్నమైన స్త్రీనిఁ జూచుట పాపమని. అట్టి నగ్నత్వ మేర్పడుటకుఁ గారణము సంస్కృత శ్లోకమున నొకబాల యుద్వర్తనమునకై యనాచ్ఛాదితోరువై కానవచ్చుట. ఇచట సడలిపోయిన పోఁకముడిని గేల సవరించుకొనుచుండఁగాఁ జూచుట రెండిటను వ్యంగ్యభంగి సమానమే. కన్నులు మూసికొనిన వెనుక నేర్పడిన స్త్రీ సంఘర్షణమును మాత్రము శ్రీనాథుఁడు కొంచెము విశిష్టము చేసినాఁడు. అది యిద్దరు ముద్దియ లేనుఁగు కుంభముల వంటి కుచములతో నొత్తుట యనునది. మఱి యొక శ్లోకము నందలి భావమును జమత్కృతి విశేషమునకై యిచట గలిపించి యున్నాఁడు.

శ్రీనాథుఁడు శృంగారముగ స్త్రీ వర్ణనము గావింపవలసి వచ్చినపుడు కుచతటమునం దేదియో యొక విశేషమును గాన్పింపఁజేయక మానఁడు. ఈ క్రింది పద్యము పరికింతము:

ఉ. "సోరణగండి మార్గమునఁ జొచ్చిన సన్నని గాలి యొక్క యం
భోరుహపత్ర నేత్ర నునుబొంకపుఁ జన్నులమీఁది సన్నపుం

జీర చెఱుంగు వాయగిలఁ జేసిన విశ్వధరాతలేశ్వరుం
డోర యొనర్చెఁ బాపభయ మంది నిజానన చంద్రబింబమున్."

నైష. 3. 89.

ఈ పద్యమునకు మూల మీ శ్లోకము:-

"పశ్య న్న తస్మి న్మరుతాపి తన్వ్యాః
స్తనే పరిస్రస్తు మివాత్త వస్త్రో
అథాంత వథాంత మృగాంక మాస్యం
దధార తిర్యగ్వలితం విలక్షః"

—సం. నైష. 6–18.

వాయువు గూడ తానంతఃపురాంగనల స్తనములు తాకుటకై, యచటి వస్త్రమును దొలఁగింపఁగాఁ జూచి, నలుఁడు సిగ్గుపడి చంద్రబింబము వంటి తన ముఖము నోర జేసికొనె నని భావము. వాయువునకుఁ గూడ ముచ్చట గొలుపునవి యా యువతి స్తనము లనుట వ్యక్తమగుచున్నది. కాముకులు రహస్య క్రీడకుఁ గడగునపుడు చంద్రుఁడు మాటుపడియుండుట యుక్తమను విషయ మిట ధ్వనించుచున్నది. ఈ భావమును శ్రీనాథుఁడు తన యనువాదమున మఱింత సరసము చేసినాఁడని చెప్పవచ్చును. వాయువను విటుఁడు సోరణగంటి మార్గమునఁ జొచ్చి, యంతఃపురాంగనల కుచముల మీఁది సన్నని పైట చెఱుగు వాయగిలఁ జేయఁగా భూతలేశ్వరుఁ డగు నలుఁ డది గాంచి, పాపభయమునఁ దన ముఖమును నోరఁ జేసికొనె నఁట. ఇచట సోరనగండి మార్గమునఁ గన్యాంతఃపురమునఁ బ్రవేశించినది సన్నని గాలి. అది యొక యందగత్తెపొంకపుఁ జన్నులమీఁది సన్నని చీర చెఱుగుఁ బాయగిలఁ జేసినది. ఇట్టి యా విటుని రహస్య క్రీడ కంటఁబడుటచే విశ్వపాలకుఁడగు నలుఁడు పాపభీతిచేఁ దనముఖచంద్రు నోరఁ జేసికొనె ననుటలో భావ మొక కొంత మధురమైనది.

ఈ విధమైన యనువాద సరణిలో ననౌచిత్యపరిహారమునకుగా మూలములో నుండిన విషయములనే కొన్నిటిని వదలివేసినాఁడు. ఈ క్రింది శ్లోకము నాంధ్రీకరింప లేదు.

శ్లో. దోర్మూల మాలోక్య కచం రురుత్సో
స్తతః కుచౌ తా వనులేపయంత్యాః
నాభీ మద్రైవ శ్లథ వాససోను
మిమీల దిక్కుక్రమకృష్ట చక్షుః"

—సం. నై. 6-20.

జుట్టుముడివైచుకొను నామె కక్షములను, మైపూఁత పూసికొను వనిత కుచములను, కట్టుబట్ట విడిచిన యామె నాభినిఁ జూచి, దిక్కు లన్నిటి నుండి చూపు మరలించి నలుఁడు కన్నులు మూసికొనె నని యీ శ్లోకభావము. పై మూఁడు విషయములు జుగుప్సాకరము లని యెంచి కాఁబోలు శ్రీనాథుఁ డనువదించుట మానినాఁడు ఈ ప్రకరణమునందే మఱియొక చోట నౌచితిని బాటించి మార్పు చేసినాఁడు:

చ. "ఉరవడి నేఁగుచోట నొకయుగ్మలి యొల్లెచెఱంగు మేదినీ
శ్వరుని భుజావిభూషణము వజ్రములం దవులంగఁ బాఱినన్
విరిలెను నీవిబంధ మది విస్మయ మందఁగ దోడభామినుల్
పరిహాసనం బొనర్పఁ బతి పాపభయంబునఁ గంప మొందగఁన్".

—నైష. 3-94.

శ్లో. "సంఘట్టయంత్యా స్త రసాత్మభూషా
హీరాంకుర ప్రోత దుకూలహారీ
దిశానితంబం పరిధాప్య తన్యా
స్తత్పాప సంతాప మవాప భూపః"

—సం. నైష. 6-28.

ఒక తన్వి నలుని రాపాడఁగా నాతని భూషణమునందలి వజ్రాంకుర ములం జావనిత కట్టువస్త్రముఁ దగుల్కొనెను. రా జామె కటితటమును వివృతముగఁ జేసి, తత్పాపమునకు సంతాపము నందెను. ఈ శ్లోకభావము ననువదించుటలో శ్రీనాథుఁడు కటితటమును దిగంబరముగఁ జేయుట మాని వైచి, యామె నీవిబంధము నెడలింపఁజేసి, యాతన్వికి యాకస్మిక సంఘటనచే విస్మయమును, తోడిభామినులకుఁ బరిహాసముచేయుట కవకాశమును, పాపభీతిచే నలునకుఁ గంపమును, గలిగింపఁ జేసినాఁడు. సిద్ధించిన ప్రయోజనము సమానమే యయినను శ్రీనాథుఁడు గావించిన మార్పులో వ్యంగ్య ఫణితి సున్నితమై యొసలారెనది. ఇచట నీవిబంధము సడలుట వజ్రములం దొల్లె చెఱఁగు పొసఁగుట మూలమునఁ దటస్థించెను గావున రాజునకీ విషయమునఁ బ్రసక్తి లేదు. పాపభయమున నాతఁడు కంపించుట మాత్రమధికము.

నలుఁడు రాజమార్గమునఁ బడి వివాహమండపమున కేఁగునపుడు పౌరాంగనలు వెలార్చిన శృంగారభావములను మూలమున కంటెఁ గొంత కొంత యధికము చేసి చమత్కరించియున్నాఁడు. ఆ యా పట్టులలో నాతని భావాభినివిష్టమతి వ్యక్తమగుచున్నది.

మ. "జిలుగుం బయ్యెద జేరువాటి యెడలన్ శృంగార పత్త్రాంకురం
బులతో నొక్క చకోర లోచన కుచంబుల్ పూర్ణకల్యాణ మం
గళ కుంభంబులు నూత్నపల్లవ విభంగ శ్రీ సమేతంబులై
నలలిం జెన్నెసలారె నైషధ మహీనాథావలోకంబునన్."

—నైష. 6. 67.

దీనికి మూలశ్లోక మిది :

శ్లో. "అజానతీ కాపి విలోచనోత్సుకా
సమీరధూతార్ధ మపి స్తనాంశుకమ్,
కుచేన తస్మై చలతేఽకరోత్ స్ఫురః
పురాంగనా మంగళ కుంభసంభృతిమ్."

—సం. నైష. 15. 74.

ఒక పౌరాంగన నలునిఁ జూచి వేడుకలో వాయువుచేఁ [illegible] శుకము సగము తొలఁగింపఁబడినను కనుగొనక, వడుఁదై వెసలు [illegible] రుగఁ దన కుచమును మంగళపూర్ణ కుంభముగఁ గూర్చె నని [illegible]. ఇఁక శ్రీనాథుఁ డీ భావమును బొడిగించిన తీరు పరికింతము. ఒక [illegible] లోచన నలమహారాజును జూడఁ బోయెడి తొందరలో జిలుఁగు పైఁట జారి పోగా మకరికాది పత్త్రాంకిత మయిన యామె కుచములు నూత్న [illegible] లతోఁ గూడిన మంగళ కలశములుగా నెసలారెన వఁట. మంగళకలశ [illegible] ట్రియే గాకుండుటకు, వానిని నూత్నపల్లవ సమేతములు గావించుటకు, వాయుచే నర్ధభాగమును మాత్రమే తొలఁగింపఁజేయక, పైఁటను [illegible] నుండి ప్రక్కకు జీరువాఱఁ జేసినాఁడు. అట్లు జీరువాఱుటకు నై [illegible] భావలోకనమును గారణముఁ గావించినాఁడు. ఇదియొక మధుర [illegible].

అదియునుగాక శ్రీనాథుఁడు స్త్రీ వర్ణనము చేయునప్పుడు [illegible] కుచతటము నెచట వర్ణించిన నేదియో యొక విశేషము నరికించి [illegible] డంటిమికదా! ఈ క్రింది పద్యమును [illegible] లేకుండఁగనే [illegible] యున్నాఁడు.

గీ. "ఎల్ల చిగురాకు బోండ్లకు నెంత వేడ్క
యంత వేడుక దనలోన యతిశయిల్లు
నొక్క గుబ్బల కొమరాలు చక్కవచ్చి
కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని"

—నైష. 6. 66.

చూడవచ్చినది గుబ్బల కొమరాలగుటచేఁ గాఁబోలు నందఱి యువ [illegible] తులకుఁగల వేడుక దా నొక్కతె యేదాల్చి యొడలెల్లఁ గన్నులు చేకొని యా మనుజ విభునిఁ జూచెనని వర్ణించియున్నాఁడు, ఇటులనే [illegible]లో లేని యంశములుగొన్ని జతగూర్చు పట్టుల—

"భూ, దవదేవేంద్రునిఁ జూచె హేమకలశ ద్వైరాజ్య సం[illegible] వై భవశుంభత్కుచ కుంభపీఠిఁ బులక ప్రారంభ మేపారఁగన్",

అని యొక యువతికి నలుని జూచు వేడుకలో కుచకుంభ పీఠమునం బుల కాంకురముల రేకెత్తించి యున్నాఁడు,

మఱియు సంస్కృత నైషధమున నలుని గుతుకముతోఁ జూచెడి వనితల విలాసములు, నాతని వివాహయాత్రలోఁ గానవచ్చిన మంగళ ద్రవ్య ములనుగా వర్ణించియుండ, నానిని బ్రపంచించి క్రంత సాగించినాఁడు శ్రీనాథుఁడు.

శ్లో. "లసన్నఖాదర్శ ముఖాంబుజస్మిత
ప్రసూన వాణీ మధుపాణి పల్లవమ్
యీయాస తస్తస్య నృపస్య జజ్ఞిరే
ప్రశస్త వస్తూని తదేవ యావతమ్"

—సం. నైష, 15. 76,

శ్రీహర్షుని సంయోజనమున యువతుల నఖము లద్దములు, ముఖములు పద్మములు, మందహాసములు పూవులు, వాక్కులు తేనెలు, పాణులు పల్లవములు నైయమర నా యువతీ సమూహమే మంగళవస్తు సముదయ మైనది.

సీ. "కలికి చూపులు రత్నకలికా కలాపంబు
గుబ్బచన్నులు హేమకుంభ వితతి
మెఱుఁగుఁ జెక్కులు క్రొత్త మించు టద్దంబులు
పాణి యుగ్మంబులు పల్లవములు
వెలఁది మందస్మితంబులు కమ్మఁబువులు
పలుకులు వల్లకీ కలకలములు
పరిపాట లోష్ఠబింబములు తేనియతోలల్
తనుకాంతి యోల గందంపుఁ బసుపు

గాఁగ సౌభాగ్య వివిధ మంగళ పదార్థ
వరములు గ్రంత నడుచు భావంబు తోఁచెఁ

పౌరకాంతలు రాజకుమార దర్శ
నోత్సవంబున కేతెంచుచున్న యపుడు"

—నైష. 6-68.

ఈ క్రంత నీ విదముగ సాగించుటకు వలయు మంగళ సామగ్రిని సమకూర్చుటలో శ్రీనాథుని నాఁటి వైవాహిక పరిపాటి మనకు వ్యక్తమగుచున్నది ఈ విధముగ శ్రీనాథుఁ డీనైషధానువాద సరణియందేచటఁ గాని శృంగారరసభావముల నభివ్యక్తము సేయునపుడు కేవల మూలానుసరణమునే పాటింపక, తద్రస సామగ్రిని దన యభిరుచి ననుసరించి, కొంతకుఁ గొంత విపులీకరించియో, లేక సంక్షేపించియో రసాభినివిష్ట మతియైన రచన సాగించియున్నాడు.

—భారతి.

మే., 1958.

సంపుటము 35; సంచిక 5.

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి-శృంగార శాకుంతలము

—శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావు.

పినవీరభద్రకవి రచించిన గ్రంథము లీ క్రమముగా నున్నవిగాని' వానిలో మన కిప్పటికి లభించినవి రెండు మాత్రమే.

సీ. "రచియించినాఁడవు రమణీయ వాగ్రీతి
[1]నవరస దర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁ జేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసో
ల్లాససారము సముల్లసిత శయ్య
భారతీతీర్థ యతిసార్వభౌమ గురు కృ
పాతిశయ లబ్ధ కవితా విభూతి గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తి నిర్ణిద్ర వీరభద్ర".

ఈ పద్యమును దన శృంగార శాకుంతలమునఁ గవియె చెప్పుకొనెను. దీని యందుఁ జేర్కొనిన[2] నాలుగు గ్రంథములును నామ మాత్రావశిష్టము

---

1. అవతార దర్పణ మని సోమనామాత్యుఁడు చెప్పెను. అదియే సరియైన పాఠ మని తోఁచుచున్నది.

2. ఇవి గాక 'పురుషార్థ సుధానిధి' యను గ్రంథమును గూడ రచించెనఁట: అదియును లభ్యము గాలేదు. విద్యారణ్యులు పురుషార్థ సుధానిధి యను గ్రంథము రచించిరి, దాని కిది తెనుగై యుండునేమో. తైత్తిరీయ భాష్యసారమునకు మాన సోల్లాసమను పేరు గలదు. దాని సారమే యితని కృతియై యుండవచ్చును.

లైనవి. ఈ మహాకవి కృతులలో మన కిప్పటికి లభించినవి (1) శృంగార శాకుంతలము (2) జైమిని భారతమును—బహుళః యీ రెండే ప్రౌఢ గ్రంథము లగుటచేత విస్మృతి లోకమున సుఖనిద్రఁ జెందక యీ నాలుగైదు వందల సంవత్సరముల నుండియుఁ బాఠక మహాశయుల హృదయ సీమల యందు గౌరవ స్థానము నలంకరించి యున్నవి.

**శృంగార శాకుంతలము:—**

భారతమందలి శకుంతలా దుష్యంతుల కథను 'శృంగార శాకుంతల' మనెడు పేరిడి ప్రబంధరూపముగా విరచించెను.

గీ. "కథ ప్రసిద్ధము మిగుల శృంగార వతియుఁ
బరిగణింపఁగ శ్రీ మహాభారతమునఁ
గథిత యైన శకుంతలాఖ్యానభంగి
నది ప్రబంధముఁ జేయు ప్రఖ్యాతినొంద".

గీ. భారత ప్రోక్తకథ మూల కారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవ శ్రీ వహింపఁ
గూర్మి కృతిసేయు నాకు శాకుంతలంబు.

అని కృతి నొందిన చిల్లర వెన్నయామాత్యుడు కవితోఁ జెప్పెను.

భారత మందలి కథను, కాళిదాసుని సుప్రసిద్ధ నాటకక్రమమును బాటించి యాంధ్ర ప్రబంధముగా నితఁడు రచించెను. ఈ సందర్భమున నొక జటిల ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మాలోచింతము. సంస్కృత నాటకరాజములను మన పూర్వకవు లాంధ్ర ప్రబంధములుగా ననువదించిరి గాని, యాంధ్ర నాటకములుగాఁ బరివర్తింప లేదు. విద్ధసాలభంజిక యను సంస్కృత నాటకమును మంచన కవి 'కేయూరబాహు చరిత్ర' యను పేరఁ బ్రబంధముగా మార్చెను. పినవీరభద్రునికి సమకాలికు లగు (జంటకవులు) నంది సింగన్న, ఘంట మల్లయ్య యను వారు కృష్ణమిశ్రుని ప్రసిద్ధనాటక మగు 'ప్రబోధ

చంద్రోదయము' నాంధ్ర ప్రబంధముగా ననువదించిరి. రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామమును' శ్రీనాథుఁడు క్రీడాభిరామ మను ప్రబంధముగాఁ జేసెను. మురారి కవి రచించిన యనర్ఘ రాఘవమును బిజ్జల తిమ్మకవి ఆంధ్ర ప్రబంధముగా రచించెను. ఇట్లింకను మఱికొన్ని దృష్టాంతములను గనుపఱుపవచ్చును. ఆంధ్ర కవులు సంస్కృత నాటకములను జదివియు నాటక నిర్మాణముల గ్రహించియు నాటకములుగా వ్రాయక ప్రబంధములుగా వ్రాయుటకుఁ గారణ మేమి ?³

సంస్కృత నాటకములు సూమారు రెండువేల సంవత్సరములయి మనదేశమందుండియు, విశేషతః ఆంధ్రదేశమున, పది పదునైదు వందల సంవత్సరములనుండి చదువఁబడు చుండియు ఆంధ్ర భాషలో మాత్రము గత శతాబ్ది వఱకు నిజమయిన నాటక మొక్కటియుఁ గానరాకుండుట యందఱకు నచ్చెఱువు గలిగించుచుండిన విషయమే. సంస్కృత నాటకములను బండితులు చదివిసంతోషించిరేగాని యనుకరణమైనఁ గావింపరైరి. దీనిని గుఱించి పలువురు పలువిధము లయిన యభిప్రాయములను దెల్పిరి గాని ముఖ్యముగా నా దృష్టికిఁ దోచిన కారణ మేమన, మన వాఙ్మయములో సంస్కృతము నందుఁ గాని మఱి యే హైందవ భాష యందుఁగాని పొడసూపని ప్రబంధ స్వరూపముత్పత్తి యగుటయే యని చెప్పఁవగియున్నది. మన ప్రబంధములు సంస్కృత నాటకములకును, సంస్కృత కావ్యములకును మధ్యవర్తులు. వీని యందు నాటకముల యొక్కయుఁ గావ్యముల యొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే వేఱుగా నాటకములు వ్రాయనవసరము లేక పోయినది. ఇటీవల నాంగ్లేయ వాఙ్మయము నందలి యనుభవము గలిగిన కొలఁది నా భాష యందున్న నవలలను, నాటకములను మనవారు చదివి యా మూర్తులను బట్టి ప్రతిమూర్తులనుసృష్టింపఁ జేసిరి.

---

3. ఈ విషయమును గుఱించి యిదివఱలోనే వ్రాసిన "ఆంధ్ర నాటకములు, రంగస్థలములు" అను గ్రంథము నందుఁ గొంతవఱకుఁ జర్చించితిని. ఆ భాగము నిచ్చట సందర్భానుసారముగ జతపఱిచెదను.

ఇతర ద్రావిడ వాఙ్మయములు, అనగా, అఱవమును, గన్నడమును బరీక్షించినను, బైనఁ జెప్పిన సిద్ధాంతము స్థిరమేయై యున్నది. ద్రావిడ కర్ణాటక భాషలకంటె మన భాషయందెక్కుడు సౌకర్య మొకటికలదు. అదేదనః- ఆ భాషలయందు వలెఁ గాక మన ప్రబంధములు గీర్వాణ నాటకములవలె, నయిదా ఱాశ్వాసములతోఁ బూర్తిఁజెందిన కథ యంతయు నాటక నిర్ణయ పరిమాణములను మించకయుండును. ద్రావిడ కర్ణాటకములలో నట్లుగాక కొన్ని ప్రబంధము లిరువది, ముప్పది యాశ్వాసముల వఱకు విస్తరించి, సంస్కృత కావ్యములఁ బోలియుండును. అనఁగా నాంధ్రప్రబంధములు సంస్కృత నాటకముల వలెను, ద్రావిడ కర్ణాటక ప్రబందములు సంస్కృత కావ్యములవలెను నిర్మాణక్రమమును సూచించుచున్నవి. కావున విద్యాభ్యాసులగు వారికి నాటకములకు బదులుగాఁ బ్రబంధములు చేకూర్పఁబడినవి.*

కాళిదాసుని శాకుంతలము నాధారముగాఁ గొని పినవీరభద్రుఁడు శృంగారశాకుంతల మను గ్రంథమును వ్రాసెను. ఈ గంథ్రమునకు శృంగార శాకుంతల మను నామ మిడుటకు బహుశః శ్రీనాథుఁడు తాను రచించిన నైషధ ప్రబంధమునకు శృంగార నైషధ మని పేరిచ్చి యుండుటయే యని చెప్పవచ్చును. శ్రీనాథుని వెనువెంట వచ్చిన కవులలో ముఖ్యముగా పినవీరభద్రుఁ డామేటికవి ననేక విధములుగా ననుసరించెను. పాండిత్యమునను, కవిత్వశైలిని, శృంగారరస వర్ణములను, సీసపద్యముల గరువంపుహారువుల నీకవి శ్రీనాథుని జాలవఱకు ననుసరించి యున్నాఁడు. శృంగారరస వర్ణ

---

* పామరజనులకు 'వీధినాటకములు' 'భాగవతములు' రచింపబడినవి. ఈ గ్రంథములు సైతము గొప్ప కవుల చేతనే వ్రాయఁబడినవి గాని హీన ప్రజ్ఞులకు విడిచిపెట్టఁబడలేదు. ఏ మహానుభావుఁ డయినను ప్రాచీనకాల మందలి భాగవతము లాడుటయే వృత్తికాఁగల కూచిపూడి గడ్డిపూడి మొదలగు గ్రామముల నుండి యీ గ్రంథములను సంపాదించి యాంధ్ర నాటక వాఙ్మయ చరిత్రను సవిమర్శదృష్టితో విపులముగా వ్రాసిన నెంతయో దేవసేవ యొనరింపఁగలఁడు.

నను విషయములో బహుశః శ్రీనాథునకుఁ దాను సమాన మయినయుద్ది యని భావించుకొని యుండె నని యూహించుట పొరపాటు కాదు.

ఈ శాకుంతల ప్రబంధకృతి సమర్పణములో నొక చిన్న వింత సంగతి కానఁబడుచున్నది. అది చూడ బహువిచిత్రముగా నున్నది కావునఁ గొంత విపులముగా వ్రాసెదను.

ఈ గ్రంథమందలి యాంధ్రకవి స్తుతిలో నన్నయభట్టును, తిక్కన సోమయాజిని మాత్రమే యీ కవి పేర్కొనెను.

క. ''ఇట్టల మగు మఱి భారత
ఘట్టమునకు నడవ యచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలచి పరమ ప్రీతిన్"

గీ. "ఉభయ కవి మిత్రు నత్యంక శుభచరిత్రు
భానుసమ తేజుఁ గొమ్మయ ప్రభుతనూజు
సుకృతి విభ్రాజిఁ దిక్కన సోమయాజి
బ్రణుత బహుదేశ కవిరాజిఁ బ్రస్తుతించి".

అని కవిత్రయములో మొదటి యిద్దఱినే ప్రశంసించెను. తరువాత వెన్న యామాత్యునకుఁ గృతిపూర్వకముగా నొక్క ప్రబంధము రచింపు మనినప్పు డయినను.

సీ. "నన్నిపార్యుఁడు ప్రబంధ ప్రౌఢి వాసనా
సంపత్తి సొంపు పుట్టింపనేర్చుఁ
దిక్కన యజ్వ వాక్ఫక్కి కామోదంబు
చెలువు కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజుని సోను వాచామహత్త్వంబు
సౌరభంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంఫంబుల
పరిమళంబులు గూడఁ బఱపనేర్చు.... ...."

ఇట్లు ప్రాచీనాంధ్ర కవుల స్తుతించుచు నన్నయ, తిక్కన, సోమన్న, శ్రీనాథులను మాత్రము ప్రశంసించెను గాని యుభయ సందర్భములలోను గవిత్రయములో నొకఁ డగు శంభుదాసుని మాట నెత్తనైన లేదు. ఇది చాల వింతగా నున్నది. ఎఱ్ఱాప్రగడను గుఱించి, తనకు గౌరవము లేక కృతిపతికి గౌరవము లేకపోయెనా యని విచారింప. జైమిని భారతములోఁ గృత్యాదిని 'మా నన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్' అని యీ కవి రచించెను. కావున నెఱ్ఱాప్రెగడను గుఱించి కవి కెంతమాత్రము ననాదరము గాని, యగౌరవము గాని లేదని స్పష్టపడుచున్నది' మఱి యే కారణమున నెఱ్ఱాప్రెగడ మహాకవిని ప్రశంస చేయుట లేదనిన, — ఎఱ్ఱాప్రగడ గుడ్లూరు గ్రామస్థుఁడు. అద్దంకి రెడ్డి ప్రభువులయొద్ద నాస్థానకవి. గుడ్లూరు కండకూరు తాలూకాలోనిదియు, సోమరాజుపల్లికిఁ జాల దగ్గఱగానున్నది. చిల్లర వెన్నయామాత్యుఁడు కరణముగా నుండి రెడ్డి ప్రభువుల క్రింద నుద్యోగిగా నుండెను. స్వశాఖీయు లగు నియోగులై, సమీప గ్రామములలో నున్న గృహస్థ కుటుంబములకుఁ జేరియుండిన వారగుటచేతను, ఏక సంస్థానాధిపత్య సేవకు లగుటచేతను ఎఱ్ఱాప్రెగడ కుటుంబ మగు చెదలవాడ వారికిని వెన్నయ కుటుంబమగు చిల్లర వారికి నన్యోన్యద్వేషము లుండి యుండ వచ్చును. అందుచేతఁ గృతిపతి యగు వెన్నయ శత్రుకుటుంబము వాఁడైన శంభుదాసుని గుఱించి యొక్కమాట యైనను వ్రాయనియ్యలేదు.

పినవీరభద్రకవి భారతమునందలి మూలకథను గాని, కాళిదాసుని నాటక మందలి కథనుగాని యథారూపముగాఁ దీసికొనక రెంటిని మిశ్రమము జేసి తన ప్రబంధమున కనుకూలముగా నుండునటుల వాడికొనెను. కాళిదాసు రచించినది దృశ్యకావ్య మగు ప్రబంధము. నాటకము యొక్క ముఖ్యోద్దేశము ప్రదర్శనముచే రసముఁ బుట్టించుట. నాటకమందుఁ బ్రదర్శన యోగ్య మగు కథాసంవిధానము స్థల కాలనియమములకు లోపడియున్నది. ప్రబంధమందలి కథాసంవిధానమున కట్టి సంకుచితనియమములు లేవు. కాఁబట్టి కాళిదాసు, నాటక నిర్మాణము కొఱకు నూతన పాత్రములు చిన్నవియుఁ బెద్దవియుఁ గల్పించి కథాప్రణాళికను నిరంతజీవిత వాహినీ ప్రతిబింబితముఁ జేసెను. పినవీరభద్రుఁడా యా పాత్రములను జాలవఱకు విడిచి

పెట్టి రసవర్ణనల కనువగు క్రొత్తయవస్థలను గల్పించికొనెను. ఇట్లుభయ కవులు లక్ష్యభేదములఁబట్టి కథాసంవిధానము మార్చుకొని తగు వ్యక్తి మహిమలు పోషించుకొనిరి.

తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మి కృతిసేయు నాకు శాకుంతలంబు".

అని వెన్నయామాత్యుఁడు చెప్పినరీతి యొప్పిదముగా నిర్వహింపఁబడినది. పినవీరభద్రుని శృంగారశాకుంతల కథకును, భారతమందలి కథకును కాళిదాసుని నాటక మందలి కథకును గల భేదములు—

1. భారతమునందు శకుంతల తన జన్మప్రకారమును దానే దుష్యంతునితోఁ జెప్పినటులును, కాళిదాసుని నాటకమందు, చెలికత్తెలు దుష్యంతునితోఁ జెప్పినటులు (ను గలదు). ఈ విషయమును పినవీరభద్రకవి పై రెండు విధముల నిరాకరించి తన గ్రంథమున కనుకూలించిన క్రొత్త మార్పుఁ జేసికొనెను. శృంగారరసపూరిత మగు నీ యితివృత్తమును స్త్రీలచేఁ బురుషునకుఁ జెప్పించిన విపులవర్ణనలకు నవకాశ మీయ దని కణ్వముని శిష్యులచే రాజునకుఁ జెప్పించెను. ఈ మార్పెంతయు సమంజసమై కవియొక్కయుచితజ్ఞతకు గొప్ప దృష్టాంతముగా నున్నది.

2. కాళిదాసుని గంథమందు వనగజ మాశ్రమమునఁ బ్రవేశించినట్లును, దుష్యంతుఁడు దానిని బంధించుటకు వెళ్ళినట్లును జెప్పుటచే శకుంతల యొద్దకుఁ దిరిగిపోవుట కవకాశము లేక విరహవేదనమున రాత్రి గడిపెను. పినవీరభద్రుఁడా విషయమున వనగజమునకు బదులు దుష్యంతుని నగరి వేఁటపులిని గల్పించెను. కారణము మృగ్యము.

3. కాళిదాసుని నాటకమందు కణ్వాశ్రమమున దుష్యంతునిఁ గొంత కాలముంచుటకుఁ దదాశ్రమమున నధ్వరాచరణ నియమమును, రాక్షసాటోపంబులను, దుష్యంతునిచేఁ గ్రతురక్షణంబును గల్పింపఁబడి స్వల్ప

మాత్రముగ సూచింపఁబడినది. రౌద్రవీర రసద్యోతనంబుగ నీ ఘట్టము పినవీరభద్రుని గ్రంథమున నతి విపులముగ వర్ణింపఁ బడుటచే శృంగారరస ప్రధాన మగు తత్కావ్యంబున మితి మీఱి కొంత రసాపకర్షణముగా నున్న దని నా తలంపు.

4. మూలకథయందు శకుంతల తన పంచవర్ష వయస్కుఁ డగు కుమారుని దీసికొని దుష్యంతుని యొద్దకు వెళ్ళినట్లును, కాళిదాసు నాటకమున గర్భవతిగా నుండియే రాజునొద్దకు వెళ్ళినట్లు నున్నది. ఈ రెంటిలోఁ బిన్నవీరభద్రుడు మూలకథలో నున్నదానినే గ్రహించి తన గ్రంథమున వాడుకొనెను. పురాణము నందువలెనే ప్రబంధమునందును గూఁడి నియమములు లేకపోవుటచేఁ గాలవిలంబనము వలన దోషము లేదు గాని యీ కవివర్యుఁ డట్లు చేసెనని యూహింపవలసి యున్నది.

5. మూలకథలో లేకపోయినను గాళిదాసుని నాటకములో నున్నటులు దూర్వాసుని శాపమును, అంగుళీయక ప్రభావమును పినవీరభద్రకవి తన గ్రంథమున నుపయోగించుకొనెను.

6. శకుంతలా విస్మృతినిఁ జెందిన దుష్యంతునకుఁ బునఃస్మరణము గలుగఁ జేసినవి—భారతమందు ఆకాశవాణియు, కాళిదాసునందు నంగుళీయకమును; ఈ రెంటిని రెండుగ్రంథముల నుండియుఁ దీసి పినవీరభద్రుఁడు తన కథ యందు జతపఱిచెను.

ఇట్లు మూలకథనండి కొంతయు, కాళిదాసుని కథనుండి కొంతయుఁ దన ప్రబంధమున కుపయోజ్యము లగు భాగములను స్వీకరించి కథాసంవిధాన మెంతయు నుచితముగను, రసపోషకముగను నిర్వహించెనని నిష్పక్షపాత బుద్ధితోఁ జెప్ప వచ్చును.

## శృంగార శాకుంతల మందలి కవిత్వ లక్షణము

"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" అను నార్యోక్తి ప్రకారము సంస్కృత వాఙ్మయమం దత్యున్నతస్థాన మలంకరించుచున్న

యీ మహానాటకమును గొంతవఱకైనను ప్రాచీనాంధ్ర కవులలోఁ బేరెన్నికఁ బొందిన యొక కవి వర్యునిచేఁ దెనిఁగింపఁ బడుట మన యాంధ్రుల భాగ్యవిశేషమని నొక్కి వక్కాణింపఁ దగును...

ఈ మహనీయ కృతి నిర్వహింప సమర్థుఁడు పినవీరభద్రుఁడే యని వెన్నయామాత్యుఁడు మనకుఁ దెలియఁ జెప్పెను. నన్నయభట్టు ప్రబంధ వాసనా సంపత్తియుఁ, దిక్కయజ్వ వాక్ఫక్కికా మోదమును, నాచనసోముని వాచా మహత్త్వమును, శ్రీనాథుని భాషా నిగుంఫనములును, ఈయన యందుఁ గాన్పించుచున్నవనియు, నీయన యొక్క పితృపైతామహంబుగఁ గవిత్వ లక్ష్మి వెలయుచున్నదనియు వెన్నయామాత్యుఁడు నిస్సందేహముగా మనకుఁ జెప్పెను. ఈతని పలుకులనర్థములగు స్తోత్రపాఠములు గాక, యథార్థ వాక్యములే యని మన కగుపడుచున్నది.

పినవీరభద్రుని కవిత్వమునందు ముఖ్యముగా సరస వచో రచనల సుధా మాధుర్యము గగనధునీ తరంగములవలె నిరంతరామోద ముద్భవింపఁ జేయుచుండును ఈతని కవితాధార నిరర్గళమైన ప్రవాహమును బోలి యుండును. పద్యములు కమ్మచ్చునఁ దీసిన బంగారు తీఁగలవలె నింపుసొంపుల నీనుచు మహావేగమునఁ బరుగులిడుచుండును.

ఈయనకుఁ దెలుఁగు శబ్దములకంటె సంస్కృత శబ్దము లెక్కుడు వాడుక. అందులో దీర్ఘ సమాసములు దఱచుగఁ దటస్థించును. శైలి విషయములో శ్రీనాథుని శైలిని లక్ష్యముగా నిడికొనినట్లు గాన్పించు చున్నది. శ్రీనాథుని కవిత్వమందున్న గుణావగుణము లీతని కవిత్వమునందు నావిధముగానే గాన్పించుచున్నవి. శ్రీనాథుని వలె పినవీరభద్రుఁడు గొప్ప పండితుఁడు. బహుగ్రంథ పారంగతుఁ డగుటచే నితని కవిత్వమందు పూర్వ కవుల వర్ణనలు నప్రయత్నముగాఁ బ్రసరించి తమ ఛాయ నంతర్లీనముఁ జేయుచుండును.

కథాకథన మతిరసవంతముగను, మనోహరమగు చిత్రపటవర్ణనాదికము లతో నేత్రపర్వముగ నుండి విసుగు గలుగనీయకుండఁ దత్తత్కాలోచిత వర్ణ

నలతో నలరారుచుండును. నాటకమందు నూతన పాత్రలు ప్రవేశించునప్పుడు తెరమాటు వదలి దడాలున దృగ్గోచరమగునట్లు ఈ కవి, కవి యొకచోట క్రొత్త క్రొత్త యవస్థలను వర్ణించునప్పు డద్భుతరసావేశము గలిగించు నూతన కల్పనలతోఁ బ్రారంభించును. శ్రీనాథుని పద్ధతి యిదియే. పెద్దనాదులు నీకథన చమత్కృతినే యనుసరించిరి. మనుచరిత్ర వసుచరిత్ర ప్రబంధముల జూచిన యెడల పినవీరభద్రుని తీరు వారి కెంత మార్గమునఁ జూపినదో తెలియ వచ్చును. విస్మయజనకము లగు రుచులఁ బుట్టించు రసపోషణ విశేషములను మనోజ్ఞ భావపుష్టిని నెలకొల్పు మృదుశబ్ద పరంపరలను, కథాకథనము నప్ర యత్నముగఁ బరిపోషించి శ్రోతల నానందాబ్ధి నోలలాడునట్లు చేయుచుండును.

ఈ కవియందు వర్ణన చమత్కృతి చాల యెక్కువ. భావనా వైశిష్ట్య మపారము ఇతఁడ సామాన్య పాండిత్యగౌరవమున జంకుగొంకులు లేక ధైర్యము నఁ గవితోద్యోగము నిరాఘాటముగ నిర్వహింప సమర్థుఁడు. తన శక్తి తనకు బాగుగఁ దెలియును. ఉన్నదాని కంటెఁ జెప్పికొనుట గూడ హెచ్చు: ఆత్మవిశ్వాస మత్యధిక మగుటచే శ్రీనాథుని వలె రసనిరూపణమందుఁ బ్రమాదములు గలుగు చుండును. శకుంతల యొక్క ప్రేమానురాగము గ్రహించి దుష్యంతుఁడు, అనసూయా ప్రియంవదలతో భాషించిన ప్రశ్నోత్తరములంత సరసముగ నుండలేదు. కూరగాయల బేరము జరిపిన ట్లుండుట యేగాక వేగిరపడి నిశ్చితాభిప్రాయముఁ జెప్పెను. తొందరపెట్టుట సుకుమారకీర్తి వధూప్రేమ నాకర్షించెడి విధము కాదని నా నమ్మకము.

క. "మా సొమ్ము మాకు నొసఁగిన
మీ సొమ్ము మీకు మగుడ మీ మా సొమ్ముల్
వ్యాసివడకుండ నూరకఁ
గోసన మేమిటికి మార్చుకొనియెద మెందున్."

గీ. "ఇందులో నిష్ట మెద్ది మీ యిందుముఖికి
నడుగుఁ డెడమాటలకుఁ బ్రొద్దునిడివి లేదు
సాయ మవసాన మైనను సవనరతు
కొదవ వలెఁ గాని యింకను నుండరాదు."

ఇట్లు కొన్ని కొన్ని స్థలములలో రసభావ ప్రమాదములుఁ గాన్పించు చున్నవి. పాత్రోచిత సంభాషణ సంఘటనమున సామాన్యముగ నీ కవి యతి సమర్థుఁ డని తోఁపదు. శృంగార రసవర్ణనలు తఱచు రసవంతముగను మృదు మధుర వచోయుతముగ నింపారుచున్నవి.

విప్రలంభ శృంగార మెప్పుడు నొక్కటే ఫక్కిగా నుండి చదువుటకు విసువు గలిగించుచుండును. దుష్యంతుఁ డీ గ్రంథమందు సుమారు మూఁడు నూర్లు విరహవేదనలఁ బొందినట్లు వర్ణింపఁబడెను. ప్రతిమాఱును దుమ్మెదల రొదలు, కోయిలల కూఁతలు, చిలుకల పలుకులు నిత్యాది సామాన్యకవి సంప్రదాయ సిద్ధములగు సాధనములే యుపయోగింపఁబడినవి కాని క్రొత్త కల్పనలు గాని మదనోద్వేగ సూచన లగు మనోవికార చేష్టితములు గాని వర్ణింపబడలేదు. పెద్దన, పింగళి సూరన మొదలగు కవు లీ విషయములో నెంత మనోహరముగా వర్ణించిరో చూడవచ్చును. ఈ కవికిఁ బ్రపంచానుభవ జ్ఞానము తక్కువ. గ్రంథ పఠన జ్ఞానమెక్కువ యనియుఁ దోచుచున్నది. ఆ కారణముచేతఁ బూర్వ గ్రంథములలో నున్న విరహవర్ణనలను గొంచెముగా మార్చి తన గ్రంథమం దిడుకొనెను.

ఆంధ్ర వాఙ్మయమున శృంగారరస ముత్కటముగా నిరూపించుట శ్రీనాథునితోఁ బ్రారంభించి పినవీరభద్రుఁడు, పెద్దన, సూరన్న మొదలగు వారిచే వృద్ధి నొంది దక్షిణదేశమున ముద్దుపళని, శేషము వేంకటకవి మున్నగు వారి చేతులలో వెఱ్ఱి తలలు వేసి పరిహాసాస్పద మయ్యెను.

పినవీరభద్రుని శాకుంతలమందు శృంగారరస వర్ణనలకంటె యుద్ధ వర్ణనము చాల రసపూరితముగా నున్నదని చెప్పవచ్చును. తృతీయాశ్వాస ములో హయగతి రగడను వర్ణించిన సైన్య సమరోత్సాహం బంతయు నెన్ని సార్లు చదివినను తనివితీరదు. నిజముగ నారాజ సైన్యము మన కన్నుల యెదుట నడచుచున్నట్లుండును. బహుశః కర్ణాట రాజ్యసేనాని యగు యన్నగారితో నీ కవి సమరసన్నాహమున నున్న చమూనివహంబుల వెంబడి కొంత కాలము దిరిగి ప్రత్యక్షముగఁ జతురంగ బలంబుల సమర కౌతూహల

కోలాహలంబుల వీక్షించి తన స్వానుభవము యథార్థముగ వర్ణించెనేమో యని సందేహము గలుగుచున్నది.

## భాషాంతరీకరణము

కాళిదాసుని నాటక మీ గ్రంథమునఁ గొంతవఱకుఁ దెనిఁగింపఁబడిన దని యింతకు పూర్వము చెప్పితిని. ఆ భాషాంతరీకరణము కథా క్రమముగాఁ గాని, అంకక్రమముగాఁ గాని చేయుటలేదు. అచ్చటనున్న మేలైనశ్లోకముల నాంధ్రీకరించి కథా సందర్భమునఁ దన గ్రంథమున కలంకారముగా నుంచికొనెను. కాళిదాసుని శిరీష కుసుమ లాలిత్యమును వన్నె చెడకుండ, వాసనవోవకుండ, నవరసభరితముగ నుండునట్లు తెనిఁగించి గీర్వాణ కవితా మాధుర్యమునుఁ దెనుఁగు బాసయందు యథా మూలముగఁ జూపింపవచ్చు నని సిద్ధాంతపఱచెను.

పినవీరభద్రుని తర్వాత నీ గ్రంథమును గృష్ణకవియు, నాగరాజా మాత్యుఁడును, వేఱువేఱుగా వ్రాసియున్నారు. ఆధునిక కవులలో వీరేశ లింగముగారు మున్నగువారు కాళిదాస నాటకమును నాటకరూపమునఁ దెనిఁగించిరి. ఎంతమంది కవు లెన్ని విధముల నీ నాటకమును దెనిఁగించిన నవి పినవీరభద్రుని కృతిని మించుటలేదు. పినవీరభద్రుని యాంధ్రీకరణ మస దృశము. అనతిశయ్యము.*

—ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక
సంపుట 16; సంచిక 2, 3.
ప్రభవ - జ్యేష్ఠము - భాద్రపదము

---

*గ్రంథ విస్తరభీతిచే నిందు వ్యాసమునందలి ముఖ్యాంశములే గ్రహింపుట యైనదని పాఠకులు గమనింప ప్రార్థన - సంకలనకర్త.

# సింహాసన ద్వాత్రింశిక

—శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

సింహాసనద్వాత్రింశిక యను నీ కావ్యము ద్వాత్రింశత్సాలభంజికలు భోజరాజునకుం జెప్పిన విక్రమార్కునికథలు. అయ్యవి ముప్పదిరెండు. ఆ కథల సముచ్చయమే యీ కావ్యము. దీనికి మూలము కథాసరిత్సాగరము. ఆ సాగరము నుండి యీ రత్నము నెత్తి చక్కగా సానఁబట్టి యాంధ్ర సరస్వతిని బూజ యొనరించిన మహాకవి కొఱవి గోపరాజు. ఇట్టి మహారత్న మింత కాలము దాఁకను మఱుఁగుపడి యుండుట యత్యద్భుత మనక తీఱదు. కవి కాలమును బట్టి చూడఁ బురాణయుగమునకుఁ గడపటను బుట్టిన మొదటి ప్రబంధ మయ్యును దీనినిఁదరువాతఁ బ్రబంధ కవు లెవ్వరును స్మరింపకుండుట యేకారణముననో యూహింపఁజాల కున్నారము. ఇట్టి కావ్యరత్నమును దిరుగ సముద్ధరించిన శ్రీ యాంధ్ర సాహిత్య పరిషత్తు వారికి నాంధ్రదేశ మెంతయుఁ గృతజ్ఞమై యుండక తప్పదు చిన్నచిన్న మాటలతోఁ దేనెలు గురియునట్లు, లేకాకారముగా నుండి విపులమయ్యు విసువుపుట్టనట్లు తత్తదుచిత స్థలములందే వర్ణనలతో నిండి పాండితీశక్తి యటుండఁ గవితాశక్తికే ప్రాధాన్య మీయఁబడిన యిట్టి కావ్యము లాంధ్రమునం దరుదు. ఇట్టి కథా సముచ్చయ రూపము లగు కావ్యములు బేతాళపంచవింశతి, శుకసప్తతి మున్నగునవి యున్నను నిట్లు సర్వావయవ పరిపోషణము గాంచిన వనవిలు లేదు. కడపటి దగు శుకసప్తతి జీవకళ గల కావ్యములలో మిన్నయే కాని కథావస్తువు ననుసరించి విలువ తగ్గక మానదు. హంసవింశతి యొక్క నిఘంటు వనినను దప్పు కానేరదు. బేతాళ పంచవింశతి కవిత యించు

---

*అచ్చుపడిన సంస్కృత మూల మొక్కటి విక్రమార్క చరిత్రము (గద్యపద్యాత్మకము) కలదు గాని యందుఁ గల కథల వరుస యిందుఁ గానరాదు. విషయములును భేదముగా నున్నవి.

మించుగా నంతయు సంస్కారాపేక్ష గలది యనవచ్చును. ఇట్టి కావ్యముల దృష్టినే కాక కేవల కల్పనా కథలు, నాద్యసత్కథలు, సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములు ననుమూఁడు విధములగు కావ్యముల దృష్టి యందును నీకావ్యముత్తమము కాకపోవదు.

ఇయ్యది స్వతంత్ర కావ్యము కాదనియు. నాంధ్రీకరణమే యనియు, నాంధ్రీ కరణమే మహాకష్ట మనియు నీకవియే యవతారికయందు సుకుమార మగు ఫణితిని వివరించి తన భావనాశక్తిని వెల్లడించినాఁడు.

ఉ. "ఈ సరసోక్తి కావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లు వీఁడు మఱిచేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసిన వానిద సూటి గావునన్".
1-25.

ఈ పద్య మెంతయు స్వానుభవమునఁ జెప్పిన దనుటకు సందియము లేదు. కాని యారీతి 'మక్కికి మక్కి' గాఁ జెప్పినవాఁడు కాకున్నను నాంధ్రీకరణమునఁ గల ప్రయాసము వెల్లడించెను. ఇఁక నెట్టి భాష నుప యోగింపఁ బూనె నను విషయమున—

చ. "తెనుఁగునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందులేదు; మె
త్తన పస చాల దంద్రు; విశదంబుగ సంస్కృత శబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్పముం దలఁచుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్".

అని చెప్పి యనువగు తావులం దెల్ల లలితము లగు జాతీయములతో నింపినాఁడు. ఈతని కవితను గూర్చి యేదియు విశేషించి వ్రాయం బని లేకుండ నవతారిక యందుఁ దానే యద్దమువలె నిలిపి యున్నాఁడు.

కావ్యమునకుఁ బదునెనిమిది వర్ణనము లుండవలె నను నియమము పాటింపఁ దలఁచియు వాని నుచిత స్థలములయందుఁ జూపెద నని చెప్పి

యుండుటయే కాక యాయాయి ప్రసంగము లందాయావిద్యల సంపూర్ణ స్వభావమును ప్రదర్శించి నాఁడు సర్వజ్ఞులకు భంగ మనియు దానికేని యుచితజ్ఞత ముఖ్య మనియు.

క. "ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కావిద్య మహిమ మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడునే కావ్య మంత సులభమె ధాత్రిన్".

121.

అని చెప్పుట మాత్రమే కాక యట్లే చూపియున్నాఁడు.

ప్రథమాశ్వాసమునఁ బద్మిన్యాది స్త్రీ లక్షణములు. ద్వితీయాశ్వాసమునఁ జతుర్విధ ప్రాకృతములతోను జిత్రరీతులతోను గవితాకౌశలమును, తృతీయాశ్వాసమునఁ బౌరోహిత్య దారిద్ర్యాది దూషణములను, నాల్గవయాశ్వాసమున నాంధ్ర చ్ఛంద శ్శాస్త్రమున విశేషించి యున్న యతుల విచారమును, బంచమాశ్వాసమున జీమూతవాహన చరిత్రమును, మఱొక తావున మల్లవిద్యయు, మఱొక సందర్భమునఁ జోరవిద్యయు, నింకొక ప్రసంగమున నఱువది నాల్గు విద్యల నామములును, స్వప్నములు, శకునములు మున్నగు వానిని విశేషముగానో సామాన్యముగానో ప్రదర్శించెనే కాని విడిచి పెట్టిన యంశ మొక్కటియుఁ గానరాదు. ఈ కావ్యమున నచ్చటచ్చట సందర్భముల ననుసరించి సార్వకాలికములును, సార్వజనీనములు నగునట్లు చెప్పఁబడి చెదరియున్న నీతి పద్యము లన్నియు నేర్చి కూర్చిన యెడ నొక చిన్న నీతిశాస్త్ర మగును. గ్రంథవిస్తర భీతిచే మానవలసి వచ్చినది. కాని యెత్తి చూపవలసిన వెన్నో విచిత్ర కల్పనము లిందు గలవు. వివాదగ్రస్తమైయున్న యొంటిమిట్ట వారంగలు వాదను నీకవి మున్నే తీర్చి యున్నాఁడు. ధర్మపురి, భువనగిరి, శ్రీశైలము మున్నగు వానిం దెల్పుచు- "త్రిలోక మాత మహాపాతక సంఘాత విఘాతాను యాతఁ గనియెన్ గంగన్".

క. "అనదికి మ్రొక్కి ముఖ్య
స్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా
లోనం దెకతెక నుడుకం
గా నద్భుత మైన మడుఁగుఁ గని వెరఁగందెన్".

అని గంగయే గోదావరి యని తెల్పుట కుష్ణగుండమును వర్ణించినాఁడు.

ఉ. "ఆకడ నీతిశాస్త్ర విదుఁడై గురు వీడ్కొని యేఁగె వేడ్కతోఁ
గాకిత మూలశక్తి గనిగా నొనరించిన పైఁడి చట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రి లోన నే
పోకలఁ బోని యట్టి సిరిపుట్టిన యింటికి నోరుగంటికిన్".

8 ఆ. 156. ప.

అని యేకశిలానగర మోరుగల్లే గాని యొంటిమిట్ట కానట్లు తెలియఁ జేసినాఁడు.

ప్రత్యేకత :— ప్రతి కవికిని గల్పనా పాటవముననో, యలంకారముననో, వ్యాకరణముననో, ఛందస్సుననో, భాషయందో కొంత ప్రత్యేకత యుండకమానదు. కల్పనాదుల మాట యటుండ భాషయం దీతఁడు చూపిన ప్రత్యేకత యనుపమానము. తరువాత కవుల యందుఁ గాని పూర్వులయందుగాని లేని యెన్నియో నూత్న శబ్దముల నీకవి వాడి యున్నాఁడు. బానగిలు = బలాత్కృతమగు; కాసించు = కాసెవోయు; ముక్తాశేషలు = ముత్యాలసేసలు; వెంచ = మఱఁగు; పాఁగు = (తమిళపదము) రహస్యము, వృత్తాంతము; భజన కెక్కు = స్తుతి కెక్కు; పరిణయించి = పెండ్లాడి; నెలగ = ధనము; పెట్టము = విరోధి; వితండము =, విరోధము; పరిమాళించుట = (పరిఘూర్ణించుట అని బ్రౌను పాఠము)-మల్లవిద్యాక్రియా విశేషము; వయ్యంది = కొలిమి; ఇట్టి యపూర్వ పదప్రయోగమున నీ కవి యొక్క ప్రత్యేకత స్పష్టపడుచున్నది.

వ్యాకరణము విషయమయి యారయఁ గ్రొవ్వార్థకమున వికల్ప సంధియును, నావుడు, మున్నగు నానంతర్యార్థకముల సంధియు, నచ్చ

టచ్చటఁ గలవు. క్త్వార్థకేకారసంధి విషయమున నీతనితోపాటు పెక్కండ్రు కవులు గలరు. కాని యానంతర్యార్థక మున్-డున్ -(6.67; 8.115) తోఁ (ప్రాచీన కవితయందు 'డు' వర్ణకము భావార్థకము. సముచ్చయ సహితము యానంతర్యార్థము నిచ్చును. అనుటయున్ వంటిది). పర పదాద్యచ్చునకు సంధిచేసిన కవులు కానరారు. ఈ విషయమున నితఁడు యథేచ్ఛముగా వర్తించెను. ఇట్టి నెఱసులు వెదకుట రసాస్వాదనమున కడ్డమే కాని వాస్తవము తెల్పవలసి వచ్చినప్పుడు మఱుఁగు పెట్టుట ధర్మము కాదు. ఇట్టి స్వల్పప్రమాదము లున్న మాత్రమున నీతని కవితకు నాలేశములు కళంకదాయములు కానేరవు.

ఇఁక నీకవి శబ్దముల యెడ జాగరూకతతో మెలంగినవాఁడే కాని ప్రమత్తుఁడు కాఁడు. ఎచ్చటనేని యొకటి రెండున్నను బ్రమాద మనుకొన నగునే కాని మఱొండు కానేరదు. "ఏకోనవింశతిమ" (6-2) "షడ్వింశతితమ" (10-31) ఇట్టి వొకటి రెండున్నను నవి పొరపాటులు కాని యజ్ఞానమునఁ బ్రయోగించిన వనుట యన్యాయము. సంస్కృతపాండితీ స్ఫోరకములగు ప్రయోగము లనేకము లిందుఁ గలవు.

కవి కాలనిర్ణయము :—

గోపరాజను నీతఁడు నియోగి బ్రాహ్మణుఁ డనియును, ఇంటిపేరు కోవెలవారనియును బదునేడవ శతాబ్దములోనివాఁ డనియుఁ గవుల చరిత్రమున నున్నది, ఈతని కేసవ పురుషుఁడు పెన్నయామాత్యుఁడు. పెన్నయామాత్యుఁడనియు నందుఁగలదు. కాని, పెన్నయామాత్యుఁడనుట ప్రమాదము. వెలనాటి చోడుల దాక్షారామ శాసనము లందును వెన్నయామాత్యుఁడనియే యున్నది. ఇఁకఁ గోవెలవారనుటయు నట్టిదే. ఈ కవి తాత తండ్రులనాఁడు [illegible]ల్లెకొండను బరిపాలించుచున్న 'రాణామల్ల నృపాలుని' 'రాణన్' అని పదచ్ఛేదముచేసి యెవరో మల్లనృపాలుఁడని స్థూలముగాఁ గవుల చరిత్రము వ్రాసినది. "కొలని యన్నామాత్యకుంజరుండు", 'కొలని యన్నయ యెపుడున్!' మున్నగు మువ్వది యిద్దఱ మంత్రుల చరిత్రమునందలి ప్రయోగముల వలనను, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి తాళపత్ర

ప్రతి యందలి యాశ్వాసాంత గద్యము వలనను, 'కొఅవి' వారేకాని కోవెలవారు కారని తెలియుచున్నది. (శబ్దరత్నాకర కారుడు కొండమీది వారనియెను). ఏదియేని లేఖక ప్రమాదమున కోవెలవారనియున్న తాళ పత్రప్రతి యాధారమునఁ గవుల చరిత్రమున నచ్చెక్కియుండును. ఈ గోప రాజున కేడవ పురుషుఁ డగు వెన్నామాత్యుఁడు వెలనాఁటి పృథ్వీశ్వరుని రాజ్యభారధురంధరుఁ డనియు, నవక్రవిక్రమశాలి యనియు, ననదవోలు (చందవోలు) నెలవుగాఁ గలవాఁ డనియుఁ. ప్రథమాశ్వాసమున 41వ పద్యమున వర్ణింపబడినది. "కలుష మండలిక" ...... ఇత్యాది.

ఇందలి బిరుదములు వెలనాఁటి పృథ్వీశ్వరునివి కావు. వెలనాటి పృథివీశ్వర రాజ్యభారధుర్యుఁ డనునదియు, నా బిరుదావళిలో నొకటి యని యాశ్వాసాంత గద్యమునందలి 'వెలనాఁటి పృథివీశ్వరరాజ్య సముద్ధరణ' అనునది చెప్పుచున్నది. కావున నీ వెలనాఁటి పృథ్వీశ్వరుని కాలమును బట్టి వెన్నయకాలము నిర్ణయింప నగును.

శైవమతాచార్యుఁ డగు పండితారాధ్యుని కాలనిర్ణయమునకై శివత త్త్వసార పీఠికయందుఁ గొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు పై వెలనాటి పృథివీశ్వరుని కాలము నిట్లు నిర్ణయించినారు. పండితుఁడు, చందవోలు వెళ్ళునప్పటికి వెలనాఁటి చోడుఁడు పాలించుచున్నాఁ డనియును, నాలనికి మనుమఁడు పృథివీశ్వరుఁడనియుఁ,చోడుని కాలము క్రీ.శ. 1113 సం. మొదలు 1180సం. వఱకు ననియు వివరించిరి. 'పృథ్వీశ్వరుఁడు 1165 వఱకే రాజ్యము నకువచ్చినట్లు తోఁచుచున్నది' అని మఱొక వాక్యము. 1185 నాఁటికే యని యర్థము కావలయును, వెన్నామాత్యుఁడు పృథ్వీశ్వరుని తండ్రి యను గొంకరాజునాఁడే మంత్రి యయ్యెను. గొంకరాజు బహు స్వల్పకాలముననే మరణింప బాలుఁడగు పృథ్వీశ్వరునిఁ బెంచి పెద్దవానినిఁ జేసి రాజ్యమభివృద్ధి లోనికిఁ దెచ్చియుండవలెను. అప్పుడే పృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ బిరుదము సార్థకను గాఁగలదు.

వెన్నామాత్యుఁడు గొంకనృపాలుని మంత్రిగా నున్నట్లీ క్రింది చోడరాజుల దాక్షారామ శాసనమువలనఁ దెలియ నగును.

**Vol IV No.** 1214– "(స్వస్తి) శ్రీ వెలనాంటిచోడం ద్రిపతే స్సూను ర్మనీ మండనః శ్రీమా(న్గొం)క మహీపతి" **No.** 1205 ...... స్మంత్రి శిఖామణి ర్బుధనిధి శ్రీ వెన్న (నామాను)స్సః"....అని యుండుట వలన నాగొంక నృపాలుని కాలముననే మంత్రిత్వము వహించి, యాతని పిమ్మటఁ బృథ్వీశ్వరుని రాజ్యమును సంరక్షించి యుండును. గొంక నృపాలుని నాఁటికి వెన్నయయును యువకుం డై యుండును. పృథ్వీశ్వరుని కాలము నందును జాలభాగ మునిడి యుండును. కాన 1240 దాఁక వెన్నామాత్యుని కాలము; అధమ పక్షము 1220 దాఁక నేనియునై యుండును. ఈ వెన్న యకుఁ బౌత్రుఁడు, అమరేశ్వరుఁ డనియె గాని పుత్రుఁ డెవ్వఁడో యీ గ్రంథమునఁ గవి చెప్పలేదు. అతఁడు తేఁ బ్రాయమున మరణించెనో లేక యప్రసిద్ధుఁడై యుండెనో కారణ మూహింపఁ జాలము. మనుమఁ డగు నమలేశ్వరునకు, అన్నయ, సింగయ యను నిద్దఱు కుమారులు. ఇందలి యన్నయ ముప్పది యిద్దఱ మంత్రుల చరిత్రమున వర్ణింపఁబడి యున్నాడు.

సీ. "ఘన దానకర్ణుఁడై గండపెండెము దాల్చెఁ
గొఱవి యన్నామాత్య కుంజరుండు".

క. "హరి సిరిని వలచు సిరియును
నరుదుగ హరిఁ గోరుఁ గొఱవి యన్నయ యెపుడున్
వరకీర్తి సతిని వలచును
వరుసన్ వరకీర్తి యతని వలచు సతతమున్".

మున్నగు పద్యములం బట్టి యీ యన్నయమంత్రి మహాదాత యైనట్లు న్నది. అట్లున్నను గవి తననాఁటికి దూరముగుటచేఁ దాను అన్నయ్య, తమ్ము డగు సింగయ శాఖలోని వాఁడగుటచేఁ గాఁబోలు నాతనిని గూర్చి యీ కావ్యమున విశేషముగాఁ బ్రశంసింపలేదు కాని, యాతని పుత్రుఁ డగు పెద్దిరాజును గూర్చి పల్లెకొండ జనపాలుఁ డగు మల్లన దేవరాజుచేఁ గుంచెలు, నందలములు వెల్లియుఁ గైకొన్న వాఁడని ప్రశంసించెను. గోపరాజు కీతఁడు పెద్దముత్తాత.

ఇంకను సప్తసంతాన యను సింగయను గూర్చి విశేషించి చెప్పలేదు. ఈ సింగనకు అబ్బయ, గోపయ, సత్తెనారయ, యను ముగ్గురు కొడుకులు గల రనియు, దన తాతయగు గోపరాజునకు నన్నయగు అబ్బయ కొమాళ్ళు రామరాజు, కేసన, బాచిరాజు-అనువారలు ముగ్గురును - అనపోతకుమార సింగయకు మంత్రులుగా నుండి రనియుఁ జెప్పెను. (చూ. 1-48). వెన్నా మాత్యునికి నాలవతరము లోనివా రగుటచే వీరు ముగ్గురును నించుమించుగా 1400-దాఁక నుండియుందురు. వెన్నయ 1220 దాఁకను, ఆపై 20 ఏండ్లే యతని పుత్రుని కాలము చూచు కొన్నను 1250 దాఁకను, తరువాతఁ బౌత్రుఁ డగు అమరేశ్వరుని కాలము—1280 దాఁకను, నాల్గవతరములోని యన్నయ సింగయల కాలము-1320 దాఁకను, అయిదవ తరమగు పెద్దిరాజు, అబ్బయ, గోపనార్యుఁడు, సత్యనారనయు 1360 దాఁకను ఉండి యుందురు. ఇందలి పెద్దిరాజు కొడుకు లగు రామరాజు. కేసన, బాచి రాజులు 1360 మొదలు 1400 దాఁక నుందు రనుటకు సందియము లేదు గదా! ఏకశిలానగరాధిపతి యగు రేచర్ల సింగమ నాయని పుత్రుఁడు 'అన పోతనాయఁ డనియు', నతని పుత్రుఁడు రెండవ సింగనాయకుఁడు (1380-1400) దాఁకను నున్నాఁడనియు నాంధ్రవాఙ్మయ సంగ్రహకారుని సిద్ధాంతము! ఈయనపోతసింగయకే రామరాజాదులు మంత్రులై యుందురని సమకాలిత్వమును బట్టి నిశ్చయించుట సుసాధ్యము.

ఆ రామరాజాదులకు సమానతరములోని వాఁడగు కసువరాజును నించు మించుగా 1420 సంవత్సరముల ప్రాంతములోని వాఁడు కావలసి వచ్చును. (ఈ కసువరాజు మన కవికిఁ దండ్రియనియు 'రాచామల్ల నరేంద్రునకుఁ బరమ గురులై శైవాచార ప్రథమ సింహాసనాసీను లైన బ్రహ్మదేవ యొడయల కూఁతుఁ గామాంబిక యను కామినీ రత్నంబుఁ బరి గ్రహించి వేములగల్లు నివాసియై యుండె ననియు, నిందుఁ జెప్పఁబడియె),

కావున నీ కవి 1460 దాఁటియే జీవించియున్నా'డన వచ్చును. ఏ మనఁబూర్వకవి స్తుతియందు 'అనఘు హుళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా'జును.... అనుటవలనఁ పిల్లలమఱ్ఱి వీరభద్రునికిఁ దరువాతి

వారని యనుమానము కల్గవచ్చును. కాని సమకాలికుఁ డనినను సరేఁ డును క్రీ.శ. 1240లోని వెన్నామాత్యుని కేడవతరము వాఁడగు నీ గోపరాజ 1450 ప్రాంతము దాఁక నుండవచ్చును గదా! ఒకతరమున హెచ్చినన నొక తరమునఁ దగ్గినను తరమునకు 40 సంవత్సరముల చొప్పునఁ గదా చరిత్రకారులు కాలనిర్ణయము చేయుచున్నారు. కావునఁ బిల్లలమఱ్ఱి వీరనకు సమకాలికుఁడు కావుట నిశ్చయ మనవచ్చును. ఇంకఁ గవుల చరిత్రములోని పదియేడవ శతాబ్దమను సిద్ధాంతము స్థూలదృష్టితోఁ జేసినదేమో యనిపించుచున్నది. రాణామల్లనను గూర్చియును, వెన్నామాత్యునిఁ గూర్చియు వ్రాసినట్లె యీ కాలనిర్ణయమును, నట్లే యందుఁ జేయఁ బడినది.

ఈతఁడు ప్రసంగవశమున నాల్గవ యాశ్వాసములోఁ జెప్పిన ఛందస్సందర్భమునఁ బదమూఁడు వళ్ళు తెల్పినాఁడు. భీమన కాలమునాటికిఁ బదియే కలవు; అనంతుని నాఁట కిరువది యైనవి. ఈతఁడు భీమన పద్యభాగములనే వాఁడినాఁడు. ఇదియు నాలోచింపవలసినదే.

నవమాశ్వాసమున 69 వ పుటలో 105 వ పద్యము తరువాత రెండు పద్యములర్థము కానివి కలవు. ఈ రెండు పద్యములకు రెండు విధములగు పాఠములు దొరకినవి. వాని నీ క్రింద వ్రాయుచున్నాఁడను. ఎచ్చటనైన సరియైన పాఠము దొరకిన యెడఁ బ్రచురించి యీ కొఱఁత దీర్తురు గాక! యని విద్వల్లోకమును గోరుచున్నాఁడను.

ఆ. "తొలుపు తిరములు మెరుపులు వంకమోళ్ళు
తిలలు జివ్వడీలు తీపివేళ్ళు
లెక్కములు చమనుచు లికొట్టి పుడుకుచు
గొందినిడక తెంపు లెందుఁ గలవు."

క. "పుడుగులలోఁ జుట్టముగా
నడవలు గ్రామములు తవులు నాదంబులు నం

గడుపున నెరయంగఁ జాలే
ర్పడ....అయ్యె లిట్టి వదనివి నిలిపెన్.

అని కొన్ని ప్రతులు. వీనికే పాఠాంతరము లిట్లు గలవు.

ఆ. తెలుపు విరము మేరపులు వంక మోరలు
తిలలు జప్పటీలు తీలువెళ్లు
లెక్క మలుచముగుచు దిక్కొటి యుడుగుచు
గొంది నిడక కెంపు లెంపు గమ్మె."

క. "పుడువులలోఁ జిట్టముగా
నడువలు గామములు నాతంబులు నం
గడవు నెలుంగం జా లే
ర్పడ సిద్ధ గలవయ్యె వృద్ధ పావని విప్పె."

వేఱొక వ్రాఁత ప్రతిలో—

గీ. "తొలుపు తిరములు వంకమోరలు పరషులు
తెల్లలుసు చప్పటాలుసు తీరెవేళ్ళు
లెక్కమలు చమ్మనుచును దాపెక్కు పుణుగు
గొండు విడువక వేగెంపు లెండు గొమ్మ."

క. "పుడుగులలో బుట్టముగా
నడవలు గామములు దవులు నాంతంబుఁగునం
గడసు నెర యంగ జాకీ
ర్పడ సిద్ధికయయ్యె విద్య విడసివి నిలిపెన్."

ఈ పద్యము లెవ్వరును నే నిఘంటువునను వాడియు నుండ లేదు.

కృతి సమర్పణము — ఈ కవి శిఖామణి తన కావ్యమునకు శివకేశవుల నుభయులను గృతిపతుల నొనర్చినాఁడు. తిక్కన సోమయాజి నాచన సోమనలవలె హరిహరుల నుభయులను సమానభక్తితో సేవించిన యద్వైతి.

అందుచేత "తథాపి భక్తిస్తరుణేందుశేఖరే" అనినట్లు తొలుత శివస్తుతితో నారంభించినాఁడు! మఱియు నాశ్వాసాంతపద్యములం దొక పద్యము హర సంబోధనములతోను నొకటి హరిసంబోధనములతోను వేఱొకటి హరిహర సంబోధనములతోను ముగించుచు వచ్చెను.

భోజుఁడు సింహాసన మెక్కుటకై ముప్పదిరెండు మాఱులు వచ్చు నప్పుడును హరునో హరినో ధ్యానించుచు వచ్చినట్లు ప్రతి కథ మొదటను ద్వితీయాంతములతో లలితమగు నచ్చతెలుఁగు పదములతో నొక్కొక్క పద్యము నెలకొల్పెను.

హరిహరులను సమానముగా ధ్యానించుట తిక్కన కవీంద్రుని మార్గమే యయ్యును భిన్నభిన్నముగా వర్ణించి హరిహరుల నేకమొనర్చి ముగించుచు వచ్చురీతి నాచనసోమనార్యుని యుత్తర హరివంశ ద్వితీయాశ్వాసము నందలి హరిహరస్తవమును స్మరణకుఁ దేక మానదు. కథలయందు సందర్భాను సారముగా అందికను, సూర్యునిఁ గూడ సరసముగా స్తుతించి యున్నాఁడు. కేవలము భక్తితత్పరుఁడై శివకేశవాత్మక మగు భగవంతుని కృతిపతి నొనర్చి యీ కవి తాను ధన్యుఁ డగుటయే కాక లోకమునుగూడ ధన్య మొనర్చిన మహానుభావుఁడు. మఱియు నాశివకేశవుల వర్ణించుచున్నట్లు మృదువైన వ్యంగ్య ముతో భావనా పటిష్ఠత వెల్లడించెను. అదియే కదా కావ్యమునకు జీవము! చూడుఁడు :

చ. "పులుగుల పెద్ద వారువము పోటరి బిడ్డఁడు ఱాఁగ రౌతు పా
ముల నమికాఁడు సెజ్జ నలుమోములవాఁ డిలుదీర్చు పట్టి వే
ల్పులు బలుబంటు లాకమల పొల్తుక తెల్లనితల్లి పెద్ద కో
డలనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లని వేల్పుఁ గొల్చెదన్".

1 2

క. "వెలిపట్టును బులితోలును
మలయజమును బూదిపూత మణులున్ ఫణులున్
దిలకము నెఱగన్నుం గల
వెలదియు మగవాఁడు నైన వేల్పుందలఁతున్".

7.115.

ఇఁక విక్రమార్క చరిత్రమును రచించిన జక్కన కవి [illegible] గాని, యీ గోపరాజు జక్కనను గాని స్మరించియుండక పోవుటవలన కొత్త గ్రంథము లోకరెఱుఁగరని యనుకొనవలసి యున్నది. జక్కన 1410–20 సంవత్సరములలో విక్రమార్క చరిత్రమును రచించినాఁడని కవుల చరిత్రము తెల్పుచున్నది. జక్కన ఈ కవికంటెఁ గొలదిపాటి ముందు [illegible] కావలెను. అతనికంటె మిన్నగాఁ జెప్పఁ దలంచినట్లును నింపుఁ [illegible]. కవిత్వ తారతమ్యములు చూచిన యెడల నీకవి జక్కనకుఁ గొంచెపాటు వెనుక వాఁడేయగును. అతనివలె నిమిడికఁగాఁ జెప్పఁగల కవి యితఁడు. అ[illegible] ముముం దీకావ్యము కొంచెము వన్నె తగ్గి యిమిడిక లేనట్లుండక మానదు. అంత మాత్రమున నియ్యది గౌరవ పాత్రము కాకపోవదు. మెఱసిన రత్నముల హారమొకటి, విరిసిన మల్లెపూవుల దండ యొకటి. దాని తేజస్సు, దీని పరిమళమును మనోహరములే! సహజమైన శైలితో లలితము లగు జాతీయములతో మనోహరము లగు వర్ణనలతో నీ కావ్యము ప్రాచీన కావ్యములలోఁ బ్రశస్తిగాంచి మించినదే.*

—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 24; సంచిక 6.
యువ—మాఘఫాల్గునములు—(1936 ఫిబ్రవరి, మార్చి).

*ఈ వ్యాసము 1936లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచేఁ బ్రకటింపఁబడిన సింహాసన ద్వాత్రింశికకు పీఠికగా నున్నది. అందుచే పత్రికలో నీ వ్యాసమునకు శీర్షిక 'సింహాసన ద్వాత్రింశిక పీఠిక' యని కలదు. గమనింప ప్రార్థన—సంకలనకర్త,

# బమ్మెర పోతరాజు

—శ్రీ రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు

శ్రీమద్భాగవతము నాంధ్రీకరించిన బమ్మెరపోతరాజు ఒంటిమిట్ట వాఁడని కొందఱును, ఓఱుగంటి వాఁడని కొందఱును కొంత కాలమునుండి పరస్పర విజయార్థులై పట్టుదలతోఁ బోరాడుచున్నారు. నే నాంధ్రకవుల చరిత్రమును వ్రాసినప్పుడు తెలుఁగు భాగవతమును ముద్రించినవారు తమ పీఠికలో వ్రాసిన దానిని నమ్మి పోతన యొంటిమిట్టవాఁ డనియే చెప్పితిని గాని యిటీవల బైలుదేఱిన వాదానువాదములను బట్టి నా తొంటి యభిప్రాయమును మార్చుకొని యోరుగంటి వాఁడని నే నీ నడుమ సంస్కరించి ప్రకటించిన కూర్పులోఁ బ్రచురించినవాఁడ నైతిని. అట్లు చేసినందులకయి బ్రహ్మశ్రీ వావిలకొలను సుబ్బారావుగారు నన్ను బహువిధముల దూషించి పరిషత్పత్త్రికలో నొక వ్యాసము వ్రాసి ప్రకటించిరి. దూషణము లెప్పుడును వాదదౌర్బల్యమునకు సూచన లగుట విచారించి వారి దూషణ వచనముల నాశీర్వచనములుగా స్వీకరించి సత్యగ్రహణపరాయణు లగు వారి యుపయోగార్థముగా నా పూర్వాభిప్రాయమును మార్చుకొనుటకుఁ గల యాధారములను సంక్షేపించి వ్రాయుచున్నాను. సత్యగ్రహణ సమాదరణచిత్తులు దీనినిఁగూడ చిత్తగించి, తమకు తోఁచిన సిద్ధాంతమును చేసి కొందురుగాక!

పోతనామాత్యుని భాగవతములో నొంటిమిట్ట యనిగాని, యోరుగల్లనిగాని లేదు; దానిలో "ఒక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనాను మతంబున సభ్రంకషశుభ్రసముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి....మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జను దెంచి" అని యేకశిలానగర మని మాత్రము చెప్పఁబడినది. దీనినిబట్టి యిందుఁ బేర్కొనఁబడిన యేకశిలానగర మేదియని నిర్ణయింపవలసియున్నది. శిలా తామ్ర శాసనములయందును, పూర్వ గ్రంథములయందును ఓరుగంటికే

యేకశిలానగరనామము వ్యవహరింపఁబడి యుండుట నిర్వివాదాంశము. ఏకశిలానగర నామ మొంటిమిట్టకే శాసనము నందును గ్రంథమునందును వాడఁబడలేదు. నూఱు సంవత్సరముల క్రిందట మెకాంజీగారు గ్రామస్థుల వలన కయిఫీయతులు మొదలైన వానిని సంగ్రహించి కూర్చి చేర్చిన స్థానిక చరిత్రముల (**Local Records**) లోని యొంటిమిట్ట కైఫీయతులలోను శాసనములలోను ఒంటిమిట్ట కొంటిమిట్ట యన్న పేరే కాని యేకశిలానగర మన్న పేరెక్కడను గానఁబడదు ; అంతేకాక యొంటిమిట్ట యను పేరా గ్రామమున కొంటఁడు, మిట్టుడు నను బోయలవలన వచ్చినదని కూడ చెప్పఁబడినది. ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలములో సనఁగా మన పోతన్నకు నూఱు సంవత్సరములు ముం దోరుగంటియందే వాసము చేయుచుండిన విద్యానాథ కవి తన ప్రతాపరుద్రీయములో "రాజ న్నేకశిలానగరాధీశ" యని యనేక స్థలములలో నోరుగంటి నేకశిలానగర మని వాడియున్నాఁడు. ఒంటిమిట్టలో నున్న కవులలో నొక్కరును ఒంటిమిట్ట నేకశిలానగర మని చెప్పలేదు. ఒంటిమిట్ట కవులలో మొదటివాఁడగు తిప్పనామాత్యుఁడు తన శతకములో నొంటిమిట్ట రఘువీరుఁ డనియే చెప్పెను గాని యేకశిలానగర నామ మచ్చరింపలేదు. ఒంటమిట్ట రఘువీరశతకములోని రెండు పద్యముల నిం దుదాహరించుచున్నాను :

శా. కారుణ్యోదయ యొంటిమిట్టపురినాథా నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పిన మాఱుఁబేరు వెలయున్ మాత్రంబుగా నంతసా
నోరుం బావన మౌను నీకరుణఁ గాంతుఁ భక్తి నన్నుం దయుఁ
రా రమ్మందురు గారవించి రఘువీరా జానకీనాయకా!

మ. అతుల ప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యప్రాజు సత్పుత్రుఁడం
చిత భక్తిం ద్రిపురాంతకుండు* రచియించెఁ దెన్గు పద్యంబులన్
శతకం బొక్కటి దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
ర్వతకన్యానుత యొంటి మిట్ట రఘువీరా జానకీనాయకా!

నేమో చూతము. పోతన చేసిన గ్రంథములు నాలుగు-వీరభద్ర విజయము, భోగినీదండకము, నారాయణ శతకము, భాగవతము. ఈ నాలిగింటిలో ముందుగా నేకశిలానగర నామమును జెప్పిన భాగవతమును గూర్చి విచారింతము. ఓరుగల్లేకశిలానగర మగుట భాగవత రచనకు పూర్వమే సుప్రసిద్ధము కావున భాగవతమునందుఁ బేర్కొనఁ బడిన యేకశిలానగర మోరుగల్లే యని విశేషవిచార మక్కఱలేకయే స్థూలబుద్ధికి సహితము గోచరమగును. అది యట్లుండఁగా భాగవతమును బట్టి యేకశిలానగరము గంగకు కొన్ని దినముల ప్రమాణములో నున్నట్టు కనఁబడుచున్నది. గంగ యను పేరు గౌతమికిని భాగీరథికిని గూడ నాంధ్రదేశమున సామాన్యముగా వ్యవహారమునందున్నది. రాజమహేంద్రవర ప్రాంతమున గౌతమీనది సాధారణముగా గోదావరియను నామముతో వ్యవహరింపఁబడు చున్నను. ఓరుగల్లు ప్రాంతమున సామాన్యముగా గంగ యను పేరితోనే వ్యవహరింపఁబడు చున్నది. అందుచేత నేకశిలానగరమే యోరుగల్లయ్యెడు పక్షమున నక్కడకుఁ గొన్ని దినముల ప్రయాణములో నున్న గంగాభాగీరథి గాక గౌతమియే యగును. ఈ గంగకు కొన్ని దినముల ప్రయాణములో నున్న నేకశిలానగర నామ మోరుగల్లునకే చెల్లును గాని యొంటిమెట్టకుఁ గాని ధరించిన యే యితర పురమునకుఁ గాని చెల్లదు. ఒంటిమెట్టకు సమీపమునఁ గొన్ని దినములలోఁ జేరఁదగిన నది యేదియు లేదు. వ్యవహారములో లేకపోయినను నేదో స్థలమాహాత్మ్యములో గంగ యనఁ బడిన పినాకినీనది యొంటిమెట్టకు సమీపములో నున్నను, ఆ పెన్న యొంటిమెట్టకు భాగవతములోఁ జెప్పఁబడినట్టు కొన్ని దినముల ప్రయాణములో లేక కొన్ని గంటల ప్రయాణములోనే యున్నందున నందుఁ బేర్కొనఁబడిన గంగ పెన్న గాదనుట నిశ్చయము. సామాన్యముగా జలసామాన్యమును గంగయని జనులు వ్యవహరింతురు గాన నందుదాహరింపఁబడిన గంగ కొన్ని దినముల ప్రయాణములో నున్న యే చెఱువు నీరో యేటి నీరో యను విద్వాంసులకు సమాధానము చెప్పుట నా వంటి మితజ్ఞునకు సాధ్యము కాదు. కొన్ని దినము లనఁగా నెన్నిమాసములైనను కావచ్చు నను పండితులను సమాధానపఱచుటయును నసాధ్యమే. పినాకిని యన్న పేరు రెండు నదుల కున్నప్పుడు

త్తరపినాకిని దక్షిణపినాకిని యని పిలుచుచున్నట్లుగానే గంగ యను పేరు రెండు నదులకు సామాన్యమయి యుండుటచేత నుత్తరమునను్న భాగీరథి నుత్తరగంగ యనియు దక్షిణమున నున్న గోదావరిని దక్షిణగంగ యనియు పిలుచుట వాడుకయై యున్నది. అయినను, గోదావరి దక్షిణ శబ్ద ప్రయోగము లేక కేవల గంగ యని పిలుచుటయు వాడుకలోఁ గలదు. పోతన తోడి సమకాలికుఁడైన శ్రీనాథ మహాకవి రాజమహేంద్రవరమును వర్ణించుచు,

"ప్రవహించు నే వీటి పశ్చిమ ప్రాకార
మొగసి గంగమ్మ నాగరము కొమ్మ"

అను సీసపాదమున గోదావరిని గంగ యని చెప్పియున్నాఁడు. గోదావరీ నామముతో గౌతమిని సాధారణముగా వ్యవహరించు రాజమహేంద్రవరములోనున్న శ్రీనాథుఁడే దక్షిణశబ్ద విరహితముగా వాడినప్పుడు, గంగ యనెడి యేక నామముతోనే వ్యవహరించు దేశమునం దుండిన పోతనామాత్యుఁడు దక్షిణగంగ కనక 'యభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగ" కని ప్రయోగించుటలో వింత యేమున్నది? దక్షిణ పదానుపూర్వకముగా ప్రయోగించినను ప్రయోగింపవచ్చును; దక్షిణ పదమును విడిచి ప్రయోగించినను ప్రయోగింపవచ్చును. "దక్షిణ గంగ నాఁ దద్దయు నొప్పు గోదావరియు" నని నన్నయ భట్టారకుఁడు దక్షిణ శబ్ద పూర్వకముగా ప్రయోగించెను. భాగవత భాగములను రచించిన బమ్మెర పోతన్న యొక్కయు, వెలిగందల నారాయణకవి యొక్కయు, మరుపూరి సింగన యొక్కయు గృహనామములు గల యూళ్ళు మంగళగిరి సమీపములో నుండుటచేత భాగవతోదాహృత మయిన యేకశిలానగర మోరుగల్లే యని సిద్ధాంత మగుచున్నది. ఓరుగల్లు కాదని యొంటిమిట్టనే సిద్ధాంతము చేయు తలఁపుతో ఈ నామములకు ప్రతిగా పర్చూరును కేల్పాగును పెలిగందలను వెలిగండ్లయు మేనమామ పోలికగల రెండు గ్రామముల నొంటిమిట్టకు చేరువ నుండు వాని నొంటిమిట్ట వారు కట్టడి ననిపెట్టఁ గలిగిరి గాని ప్రధానగ్రామమైన బమ్మెరతోడి సమానాంతర సంబంధముగల గ్రామము కల్ప

ము దేనిని తత్సమీపమునఁ గనిపెట్టఁ జాలక బొమ్మవరమును బమ్మెర యందు మనిరి. బొమ్మెర బమ్మెర కాదని వాదించెడి యీ ఘనులకు తక్కిన యక్షరముల మాట యటుంచినను బొమ్మెరలో మొదట నున్న బొకారముతో నారంభమయ్యెడు బొమ్మవరము నెట్లు చెప్ప సాహసము గలిగెనో! ఈ పే రొంటిమెట్ట వాదులకే సరిపడక దానిని గప్పిపుచ్చుటకును బమ్మెర యూరిపేరే కాదనియు పోతన పూర్వులూరూరు తిరుగుచువా రగుటచే భ్రమణ శబ్దభవమైన బమ్మెర వారియింటిపేరయ్యెననియు అపూర్వపాండిత్య ప్రభావు లయిన యొంటిమెట్టి వాదులు తమపాండిత్య విశేషముచేత విశేషార్థకల్పనము చేసిరి. బమ్మెర గ్రామ మగునో కాదో పూర్వికయైన పిట్టమట్ట సరస్వతీ సోమయాజి కృతమయిన పృథు చరిత్రములోని యీ క్రింది పద్యమును జదివి వారు గ్రహింతురుకాక!

చ. పరుల కసాధ్యమై పరఁగు భాగవతంబు రహస్య మంతయున్
హరి కృపచే నెఱింగి మృదులాంధ్ర వచోరచనాచమత్క్రియా
కరణ మహాప్రబంధమునుగా రచియించిన భాగ్యతేజు బ
మ్మెరపుర పోతరాజు నసమీకృతభోజు నుతింతు నెంతయున్.

గ్రామనామము బొమ్మెర యని వాడుకలో నుండుటచే నది బమ్మెర కాదని వాదించుచున్నారు గదా! ఓరుగంటి వైపువారు బమ్మెర పోతరాజు నిప్పటికిని బొమ్మెర పోతరాజనియే చెప్పుచున్నారు. తొంబది సంవత్సరముల క్రిందట ననఁగా 1829వ సంవత్సరమునం దింగ్లీషున దక్షిణ హిందూస్థాన కవుల చరిత్రమును ప్రకటించిన కావలి వేంకట రామస్వామి గారు పోతరాజు గృహనామము బొమ్మెర వారని వ్రాసియుండుట మీరు చూచియుండ లేదా! ఇంతకును మీ రేకసిలానగర మనెడిది వంటిమిట్టా? ఒంటిమిట్టా? "వంటిమిట్టలోను" వసతిగాను అని స్థలపురాణములో వకారాదిగా నున్నప్పుడు బమ్మెర బొమ్మెర కాదని వాదించెడు మీకు వంటిమిట్టయే యొంటిమిట్ట యని యెట్లు చెప్పుదురు? గ్రామము వంటిమిట్టయేయయిన పక్షమున దాని కేకశిలార్థమే రాక మీవాదము నిర్మూలమగును కదా!

భాగవతములో కవి వ్రాసిన రెండు ముక్కలను బట్టియే యేకశిలా నగర మోరుగల్లనుటయే సంభావ్యముగా నున్నది. ద్వాదశస్కంధములలో దేనిలోను కృతిపతియగు రాముని సంబోధించుటలో నొక్కచోట నైనను నొంటిమిట్ట కోదండ రామా! యని కాని తుదకు కోదండరామా! యని కాని లేకపోవుటచేతనే పోతనార్యుని యిష్టదైవతము సాంద్ర రామ మూర్తియే కాని యొంటిమిట్టలోఁ గాని మఱియే గ్రామములోఁ గాని యుండిన యర్చావిగ్రహము కాదని స్పష్టపడుచున్నది. పోతరాజు తనకు ప్రత్యక్షమయినట్టు చెప్పిన రాజముఖ్యుని వర్ణనను బట్టి యైనను మూఁడవ చరణములోని—

"పల్లవయుత తమాల వసుమతీజము భంగి
బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు"

అను దానిని బట్టి కోదండరాముఁ డని యూహించుటకంటె ప్రథమ చరణములోని

"మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగట నుండి నొప్పువాని"

అనుదానిని బట్టి సీతారాముఁ డని యూహించుట యధిక విశ్వాస యోగ్యము కాదా? పోతన నారాయణ శతకములోని యీ క్రింది పద్యము వలనఁగూడ

మ. "అపరాధంబులు నిన్ను నమ్మి విను మే నాజన్మపర్యంతము౯
విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీ వేదిక్కు నాలోనికి౯
గపటం బింతయు లేక దండధరుకుం గట్టీక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడ నయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా!"

భాగవతమునఁ బేర్కొనఁబడిన యేకశిలానగర మోరుగల్లే యని యూహింపబడఁదగియుండ లేదా? ఈ ధర్మపురి నైజాము రాజ్యములో మంథెన సమీపమున గోదావరీతీరమునందున్నది. పోతన భాగవతమునఁ

జెప్పఁబడినట్లు చంద్రగ్రహణ పుణ్యకాలమున గంగాస్నానార్థము పోయిన దీ పట్టణమునకే యయి యుండును. మహేశ్వర ధ్యానంబు చేసి కించి దున్మీలిత లోచనుండై యుండినప్పుడు రామభద్రుడు కవికిఁ గన్నుఁగవ నెదుటఁ గానఁబడుట యిచ్చటనే యయి యుండును. అందుచేత నావఱకు శివభక్తుఁడయి యుండిన పోతనార్యుఁ డాకస్మికముగా విష్ణు భక్తుఁడుగా మాఱి యాయూరి నారాయణునిపై నక్కడనే నారాయణ శతకమును జెప్పి యుండును. అక్కడనుండి మరలి కొన్ని దినములలో నేకశిలానగరమునకు వచ్చి శ్రీకృష్ణస్తుతితో భాగవతపురాణాంధ్రీకరణ మారంభించి యుండును. ధర్మ పురీశ్వరునిఁ బేర్కొనుటచే బమ్మెర పోతరాజు స్నానమునకుఁ బోయినది యా పురముకడ నున్న గౌతమీ గంగకే యనియు గోదావరినుండి కొన్ని దినములలో వచ్చిన యేకశిలానగర మోరుగల్లే యనియు సులభముగాఁ దెలిసికోవచ్చును. ఈ పుస్తకద్వయమునకు ముందుగా రచియింపఁ బడిన భోగినీదండకమునఁ బేర్కొనఁ బడిన సింగమనాయఁడు గోలుకొండ రాజ్యములోని రాచకొండ, మెతుకు సంస్థానాధీశ్వరుఁ డగుట కూడ బమ్మెర పోతరాజొంటిమిట్ట నివాసి కాఁడనియు, నోరుగల్లన బరఁగిన యేకశిలానగర వాసియే యనియు ఘోషించుచున్నది. పోతనార్యుఁడు ప్రప్రథమమున రచియించిన శైవగ్రంథ మగు వీరభద్రవిజయము గూడ కొంతవఱ కాతఁడోరుగల్లు పురవాసి యని స్థాపించుచున్నది. ఈ గ్రంథము కవి మిక్కిలి చిన్నవాఁ డయి శైవమత పక్షపాత మధికముగా కలిగియుండిన కాలములో చేయఁబడినది మతగురువైన యివ్వటూరి సోమనారాధ్యుఁడు కవి నుద్దేశించి చెప్పినట్లున్న వీరభద్ర విజయములోని యీ క్రింది పద్యములు గ్రంథరచనారంభకాలము నాఁటికి పోతనార్యుఁడు పిన్నవాడని స్పష్టపఱచుచున్నవి.

సీ. "సమయంబు లాఱును జర్చించి చర్చించి
చదువులు నాల్గును జదివి చదివి
బహు పురాణంబులు భాషించి భాషించి
యితిహాసముల నెల్ల నెఱిఁగి యెఱిఁగి
కావ్యంబు లెన్నేని ఘర్షించి ఘర్షించి
యఖిలవిద్యల నాత్మ నరసి యరసి

ఘనులతో సద్గోష్ఠి గావించి కావించి
సకల కృత్యంబులు జరపి జరపి

యున్న నైనను మా కెల్ల నూహలోన
వింత గండువుఁ బోలెను వీరభద్ర
విజయ మెల్లను వినఁ గడు వేడ్క యయ్యె
నది తెలుంగున రచియింపు మభిమతముగ.

ఆ. పిన్నవాఁడ ననియుఁ జెక్కు సత్కృతులను
వినని వాఁడ ననియు వెఱవు మాను
మత్ప్రసాద దివ్య మహిమచే నెంతైనఁ
గవిత చెప్ప లావు కలుగు నీకు.

పోతన కులగురువైన సోమనారాధ్యుని యింటిపేరు ఇవ్వటూరివారు. ఇది గ్రామనామ మగుటకు సందేహము లేదు. ఇవ్వటూ రోరుగల్లు పట్టణము నకు ముప్పది మైళ్ళ దూరములో నున్నది. అందుచేత

"అనఘుఁ డివ్వటూరి యారాధ్యచంద్రుండు
సోమనాథసముఁడు సోమవిభుఁడు"

అని కవి వర్ణించిన సోమనారాధ్య గురుఁడును ఆ గురువుచే వీరభద్ర విజయ విరచనమునకు నియమింపఁబడిన తచ్ఛిష్యుఁ డగు పోతనయును ఓరుగల్లు ప్రాంతము వారని యేర్పడును గాన భాగవతము నందుఁ జెప్పఁబడిన యేకశిలానగర మోరుగల్లే యని నిశ్చయ మగుచున్నది. ముద్రిత మై యున్న వీరభద్ర విజయములో

ఉ. భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షుదు
ర్యాగకథా ప్రసంగమున నల్పవచస్కుఁడ నైతిఁ దన్నిమి
త్తాగత వక్త్రదోష పరిహారముకై యజనైక శైవశా
స్త్రాగమ వీరభద్ర విజయంబు రచించెద వేడ్క నామదిన్.

అని యుండిన పద్యమును జదివి భ్రమపడి నేను భాగవత రచనానంతరమున వీరభద్ర విజయము వ్రాయఁబడె నని చెప్పియుంటిని. ఇప్పుడు గురుప్రాయులైన వావిలకొలను సుబ్బారావు గారీ పద్యము వ్రాతప్రతులలో లేదని చెప్పి, నా కన్ను తెఱపి చూపినందునను ఇప్పుడు నే నిందు నిమిత్తమై చదివిన వ్రాఁత పుస్తకములలో నొక్కదానియందుఁ దప్ప నీ పద్యము కానఁబడ నందునను కవి పిన్నవాఁడని చెప్పిన పద్యమున వది ప్రత్యక్ష విరోధముగా నున్నందునను ఈ పద్యము ప్రక్షిప్త మని నిశ్చయించి నా ప్రమాదమును కృతజ్ఞతాపూర్వకముగా సవరించుకొనుచున్నాను. శైవుఁడు వైష్ణవపురాణము రచించెనన్న శైవసంఘమున కెల్ల నవమానకరముగా నుండు నని యెంచి భాగవతరచనా పాపపరిహారార్థముగాఁ దరువాత వీరభద్ర విజయము రచించినట్లు స్వజనులలో నమ్మకము కలిగించుటకై వీరశైవుఁ డెవ్వఁడో యొకఁడీ పద్యమును గూర్చి పుస్తకమునఁ జేర్చియుండును. ఈ పద్యము ప్రక్షిప్త మని యిప్పుడు స్పష్టపడి నందున కడపట రచియింపఁబడిన భాగవతములో కంటె మొదట రచియింపఁబడిన వీరభద్ర విజయములో నెక్కువ లక్షణ దోషము లుండుటకు కారణము సహితము కరతలామలకమైనది. వీరభద్ర విజయము పోతన కృతము కాదనియు నెవ్వఁడో వేఱొకఁడు పోతన పేరుపెట్టి దానిని రచించెననియు మొట్టమొదట కొంతకాలము క్రిందట నొక వాదము బైలు వెడలినది; ఆ వాదము నిలువదని తేటపడిన తరువాత నిప్పు డది పోతన కృతమే యనియు వీరభద్రవిజయము రచించిన పోతన భాగవతమును జేసిన పోతన గాక వేఱు పోతన యనియు ఇద్దఱు పోతన్న లున్నట్లు బుద్ధిమంతు లగుటచే నింకొకవింత వాదమును బైలుదేఱఁ దీసిరి. పోతన్న కానివాఁడు కష్టపడి పుస్తకము చేసి తన పేరు మాసిపోవునట్టుగా నన్యుఁడైన పోతన్న పేరుపెట్టుట కుద్దేశ మేమి యుండును. పుస్తకమునకు ప్రసిద్ధి రావలె నన్న యుద్దేశముతో నట్లు చేసె ననెడు పక్షమున, పూర్వ లాక్షణికులు నిర్దుష్ట కవిత్వము కాదని నిరాకరించిన పోతన్నకు కర్తృత్వ మారోపించుటకంటె సర్వలాక్షణికులును పరమ ప్రామాణిక కవిత్వ మని శిరసావహించెడు తిక్కనాదులలో నొక్కరికి తన పుస్తక కర్తృత్వము నారోపించి యుండఁడా? పుస్తకములో కర్త పేరు ప్రత్యక్షముగా కనఁబడుచున్నప్పుడు దానిని నిరాకరించి యన్య కర్తృత్వము నారోపించుటకు నిరా

క్షేపములును, నిర్దుష్టములును నైన యమోఘ నిదర్శనము లుండ నక్కఱ లేదా? వీరభద్రవిజయమును రచించిన పోతన్న వేఱు, భాగవతమును రచించిన పోతన్న వేఱు, అని చెప్పుటకైన నేమి హేతువు లున్నవి? వీరభద్ర విజయములో గద్య – 'ఇది శ్రీమన్మహా మహేశ్వర యిపటూరి సోమనా రాధ్య దివ్యప్రసాద పాదపద్మారాధక కేసనామాత్య పుత్ర పోతయ నామ ధేయ ప్రణీతం బైన" అనియు, భాగవతములో గద్య– "ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనా మాత్య ప్రణీతం బైన" అనియు వేఱువేఱుగా నుండుట యని చెప్పుదు రేమో! ఒక్క కవి చేసిన గ్రంథము లన్నిటిలో గద్య లేకరీతినే యుండ వలెనా? ఒక పుస్తకములో నొక విధముగాను ఇంకొక పుస్తకములో నింకొక విధముగాను ఉండఁగూడదా? మీ యొంటిమెట్ట కవియైన యయ్యలరాజు రామభద్రుఁడే తన ప్రథమకావ్యమైన సకల కథాసారసంగ్రహములో గద్య– "ఇది శ్రీరామభద్ర భద్రప్రసాద లబ్ధ కవిత్వ మహత్వవిశారద శారద సస్య విమిత్రాప స్తంబసూత్ర పాత్ర కాశ్యపసగోత్ర పవిత్ర రామభద్ర ధీముద్రా భద్ర రామభద్ర ప్రణీతంబైన"—అనియు, ద్వితీయకావ్యమైన రామాభ్యు దయములో గద్య - "ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగదేకఖ్యాతిధుర్యాయ్యల రాజు తిప్పయ మనీషి సర్వతాభిధాన పౌత్రా క్కయార్య పుత్ర బరిశీలిత సమిద్ధ రామానుజ మత సిద్ధాంతమర్మ ముమ్మడి వరదాచార్య కాటాక్ష వీక్షాపాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్ర కవి ప్రణీతం బైన" – అనియు వేఱువేఱు విధములఁగా వేయ లేదా? భాగవతములో కంటె వీరభద్ర విజయములో తప్పు లెక్కువ యున్న వనెడు పక్షమున, రామాభ్యుదయములో కంటె సకలకథాసార సంగ్ర హములో తప్పు లెక్కువలేవా! ఆఁతేఁటిన మీఁదట చెప్పెడు కవిత్వములో కంటె ప్రారంభదశలో చెప్పిన బాలకవిత్వములో దోషము లధికముగా నుండుట స్వాభావికము కాదా? ఉభయ కావ్యములలోను గల వంశావళిలో గంథకర్తలు భిన్నులని స్థాపించుటకుఁ గావలసినంత యున్నట్టు మన మిత్రులు తమ సూక్ష్మబుద్ధిచేఁ గని పెట్టిన భేదము స్థూలబుద్ధినైన నాకుఁ దెలియరాకున్నది. ఈ క్రిందనుదాహరింపఁ బడెడు రెండు పుస్తకములలోని

వంశావళులను పరిశీలించి బుద్ధిమంతులు తాము తెలిసికొందురు గాక:
భాగవతములోనిది యిది—

సీ. "కౌండిన్య గోత్ర సంకలితుఁ డాపస్తంబ
సూత్రుండు పుణ్యుండు సుభగుఁ డైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ
కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్త వరమునఁ గనియె సోమన మంత్రి
వల్లభ మల్లమ వారి తనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ
వారి పుత్రుఁడు వంశ వర్ధనుండు

లలితమూర్తి బహుకళానిధి కేసన
దానమానవీతి ధనుఁడు ఘనుఁడు
తనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్రమతముఁ గనియె.

క. ఆమానినికిం బుట్టితి
మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన పోతన
నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్."

పై దానినిబట్టి భీమనకొడుకు అన్నయ, అన్నయ కొడుకు సోమన, సోమన్న కొడుకు ఎల్లన ఎల్లన కొడుకు కేసన్న, కేసన్న కొడుకు లగ్రజుఁడు తిప్పన్న, తదనుజుఁడు పోతన్న అని విదిత మగుచున్నది.

వీరభద్ర విజయములోని వంశావళి యిది—

ఉ. మల్లయ భీమనాహ్వయ కుమారకుఁ డన్నయమంత్రికిన్ దయా
వెల్లికి గౌరమాంబ కరవింద దళేక్షణుఁ డై జనించి వ

ద్ధిల్ల వెలుంగు సజ్జన విధేయుఁడు సోమన నామధేయుఁ డా
మల్లమయందుఁ గాంచె సుకుమారుల ధీరుల సత్కుమారులన్.

ఉ. నీతి యుగంధరుం డనఁగ నిర్మలుఁ డై ఘననాగరీకుఁ డై
యాతత మైన రేచనయు నన్నయమంత్రియు సర్వశైవలో
కాతులహారుఁ డెల్లనయు నయ్యల ప్రెగ్గడయుఁ దయాగుణ
వ్రాత విభూషణుండు జనవంద్యుఁడుమాచయ నాఁగనున్నతిన్.

క. అందుల మధ్యముఁ డెల్లన
మందరధీరుండు నీతిమంతుఁడు వనితా
కందర్పుఁడు మాచాంబిక
నందంబుగఁ బెండ్లియాడె నభినవ కీర్తిన్.

ఉ. మానిని మాచమాంబకుఁ కుమారకుఁ డెల్లనకుం బ్రసిద్ధిగా
మానుగ నుద్భవించిరి కుమారులు కేసనయున్ గుణావళిన్
మానితుఁడైన మాధవుఁడు మాన్యుఁడు నిమ్మడినాఁగ మువ్వు
రున్ భూనుత మైన తేజమునఁ బోలిరి ధర్మజభీమ పార్థులన్.

ఉ. అట్టి ఘనుండు మంచికి దయాగుణ ధీమణి మాచమాంబకున్
బుట్టిన లక్ష్మియే యనఁగఁ బొల్పగు గోపన కూర్మి చెల్లెలిన్
నెట్టనఁ బెండ్లియాడె మహనీయుఁడు కేసనమంత్రి శ్రీసతిన్
దట్టపు వేడ్కఁ గేశవుఁడు దాను వరించిన భంగిఁ బొంగుచున్.

క. ఆ దంపతులకు సంతత
మోదిత చిత్తులకు మిథునముఖ్యులకు దయా
పాదిత గుణులకు శంకర
పాదయుగాంభోజ భక్తిపారీణులకున్.

శా. సారాచారుఁడు వైభవోన్నత గతిఁ సంపూర్ణచంద్రుండు భూ
భారాహీంద్ర సమాన దక్షుఁడు సదా ధర్మాకరుం డర్థిమం

దారుం డంచిత రూపరేఖలను గందర్పుండు భూయోయశ
శ్శ్రీరమ్యుం డగు తిప్పనార్యుఁడు జనించెన్ వంశవర్ధిష్ణుఁడై.

వ. తదనుజుండ నయి యేను జన్మించి పోతన నామధేయుండనై పరగితి.... దీనిని బట్టియు మల్లయ పుత్త్రుఁడైన భీమన కొడుకు అన్నయ, అన్నయ కొడుకు సోమన, సోమన కొడుకు ఎల్లన, ఎల్లన కొడుకు కేసన, కేసన కొడుకు లగ్రజుఁడు తిప్పన్న తదనుజుఁడు పోతన్న, అయియే యున్నారు. ఇందుఁగల భేద మంతయు భీమన తండ్రి మల్లయ యనియు, ఎల్లన యన్నలు రేచనాన్నయ లనియు తమ్ములయ్యల మాచయ లనియు, కేసన తమ్ములు మాధవేమ్మడు లనియు, లక్ష్మమ్మ (లక్కమాంబ) తండ్రి మంచయ్య తల్లి మాచమాంబ యన్న గొంసన్న యనియు, భాగవతములోఁ జెప్పఁబడని విశేషము లిచ్చుట యయియున్నది. పోతన్న యొక గ్రంథములోఁ జెప్పని తన తండ్రియొక్క తమ్ముల పేరులను పితృవ్యుల పేరులను తల్లియొక్క జననీజనకాగ్రజుల పేరులను రెండవ గ్రంథములోఁ జెప్పిన మాత్రముననే యొక పోతన్న చెడి యిద్దఱు పోతన్నలు గానగునా? పోతప్న యన్నయు తల్లిదండ్రులును పితామహప్రపితామహాదులును రెండు గ్రంథములలోను జెప్పఁబడిన వా రించుకయు భేదము లేక యింటి పేరుల తోను, పేరులతోను, భార్యలతోను, సరిగా సరిపోవుచుండఁగా వారు వేఱువే అనుట కేమి యాధార మున్నది? ఒడయనంబి విలాసమును బట్టియు దాక్షాయణీ వివాహమును బట్టియు పోతన పుత్రపౌత్రప్రపౌత్రులు గోదావరీ ప్రాంతమునందే యుండి గోదావరీ ప్రాంతవాసులతోనే సంబంధబాంధ వ్యములు చేయుచున్నట్లు స్పష్టపడుచుండుటచే పోతన యొంటిమెట్టవాఁడు కాఁ డనియు గోదావరీ నదీ సమీపమునం దున్న యోరుగంటి వాసియే యనియు సిద్ధాంత మగుచున్నది.

ఈ విషయము నింతట విడిచిపెట్టి పోతన యొంటిమెట్టవాఁ డని చెప్పుటకయి యొంటిమెట్టవాదులు చూపెడు గ్రంథప్రమాణములను గూర్చి యించుక విచారింతము. వీ రాధారము చేసికొన్న ప్రమాణము సుమారు డెబ్బది సంవత్సరముల క్రిందట ననఁగా క్రీ.శ. 1848వ సంవత్సరమున నాంధ్రభాగవతము నచ్చొత్తించినప్పుడు పురాణము హాయగ్రీవ శాస్త్రులు

గారు తమకు లభించిన బమ్మెర పోతనామాత్యుని జన్మకర్మ ప్రభావాదులను గూర్చి తెలిపెడు వచన గ్రంథమును బట్టి వ్రాసితి మని యతఁడు బాల్యములో నేకశిలానగర పరిసర వనములో పశువులను మేపుచుండఁగా చిదానందయోగి యతనికి దర్శనమిచ్చి రామమంత్రోపదేశముచేయుట మొదలైన కథలు చెప్పుచు వ్రాసిన చాని పీఠిక. వారు తమ పీఠికయందు ఏకశిలానగర మని వ్రాయుటయే కాని యొంటిమెట్ట యని యెక్కడను వ్రాయకపోవుట చేత వారికి దొరకిన పూర్వగ్రంథమునం దొంటిమెట్ట యను పేరు లేకపోవుట నిశ్చయము. అయినను, వారు తమ పీఠికలో నేకశిలానగర మను పదము ప్రక్కపువ్వువేసి యా పుటముయొక్క యడుగు భాగమునందు "ఈ గ్రామమునకు ప్రతినామము ఒంటిమిట్ట, ఇది కడపకు దక్షిణమున చెన్నపట్టణమునకుఁ బోవు బాటలో మొదటి మజిలీస్థలముగా నుంటున్నది" అని వివరణము చేయుటచే మూలగ్రంథమును జేసిన వారి యభిప్రాయము గాక కేవల శాస్త్రిలవారి యభిప్రాయమేయగును. అందుచేత నొంటిమిట్టకు నేకశిలానగర మని చెప్పుట కాయనయే ప్రథముఁడు. ఆయన యోరుగంటి కంటె ముక్కిలి చేరువ నున్నవాఁడగుటచేతను, ఓరుగల్లు ప్రాంతములకుఁ బోయి పోతన విషయమున నక్కడి వారేమి చెప్పుదురో విననవకాశము లేనివాఁ డగుటచేతను, ఒంటిమెట్టవా రెవ్వరో తమయూరను పోతన పొలము మొదలయిన వున్నవని చెప్ప విని విశ్వసించినవాఁడగుట చేతను, అట్లభిప్రాయపడి యుండును. కేవల జనశ్రుతులు నమ్మి వ్రాసినవ్రాత లెప్పుడును ప్రమాణములు కాఁజాలవు. శాసనముల వలనను చరిత్రముల వలనను రాజరాజ నరేంద్రునకు సారంగధరుఁడను కొడుకున్నట్టే కానఁబడక పోయినను రాజమహేంద్రవరపువారు నిజముగా సారంగధరుఁ డుండినట్టును, సారంగధరుని మెట్ట యనఁబడెడి యా పట్టణములోని యొక్క చిన్న కొండ మీఁద నాతని కాలుచేతులు నఱకఁబడి నట్టును, ఆమెట్ట క్రింద నున్న చెఱువులోనే మత్స్యనాథుఁడను సిద్ధుఁడు సారంగధరుని తెగినకరచరణములు కడిగి స్వస్థునిఁజేసినట్టును జెప్పి యాయా స్థలములను జూపుదురు. ఈకథ తమ దేశమునందే నడచెనని చెప్పి యోరుగల్లు ప్రాంతముల వారు స్థలనిదర్శనములు చూపెదరఁట! ఈ కథ మాళవదేశములో నడచినట్టు గౌరనకృత నవనాథ చరిత్రము వలనను వేంకటపతి సారంగధర చరిత్రము వలనను

తెలియ వచ్చుచున్నది. ఇది పాంచాల దేశములో నడచిన దయినట్లు కొన్ని సంవత్సరముల క్రిందట గోదావరీ మండలమునకు వైద్యాధికారిగా వచ్చిన యొక పంజాబు దేశస్థుఁడు చెప్పెను. ఇట్టి కథలన్నియు నిజమని నమ్మ వచ్చునా? గోదావరీ మండలములోని కోనసీమవా రర్జునుఁడు మత్స్యయంత్రమును తెగనేసి ద్రౌపదిని గ్రహించిన స్థలము తమ కోనసీమలోనే యున్న దని చూపుచున్నారు. ఇట్టి జనప్రవాదములకును నిదర్శనములకును మేర యుండదు. మెకన్జీ దొరవారు నూఱుసంవత్సరముల క్రిందట గ్రామస్థులచే వ్రాయించిన యొంటిమెట్ట కైఫీయతులలోను, పూర్వమునందున్న శిలా శాసనములలోను, తద్గ్రామవాసులైన కవులు చేసిన గ్రంథములలోను ఒంటిమెట్ట కేకశిలానగరనామము లేక పోవుటచేత భాగవతపీఠిక నాటినుండియే వచ్చిన దనియు అంతకు పూర్వము దాని కా పేరు లేదనియు భావింపవలసి యున్నది. నిరాధార మయిన జనప్రతీతిని బట్టి వ్రాయఁబడిన దగుటచేత హయగ్రీవ శాస్త్రిలవారి యభిప్రాయము ప్రమాణము కాదు. ఒంటిమెట్ట కైఫీయతులలో ఒంటిమెట్ట యను పేరా గ్రామమునకు ఒంటఁడు మిట్టఁడు నను బోయల పేర కట్టఁబడుటచే వచ్చినదని స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

ఒంటిమెట్టవారి రెండవ గ్రంథ నిదర్శనము దొరతనమువారి పరిపాలన వివరణ సంగ్రహము (Administration Report) ఈ గ్రంథము యొక్క మూఁడవ సంపుటము 991వ పుటలో నిట్లున్నది :— "Vontimittah (వొంటిమిట్ట—Vontimitta, *Tel.) From (onti, tel. single + mitta, tel. mound) [or] Sanskrit name (ekasilanagara), meaning single + rock + city (Warangal)-Village Railway Station. Cuddapah Dist., Sidhouttal..............Large Pagoda [q. v.] dedicated to Codanda Ramaswamy, built or restored by a Vijayanagar rajah in 14th century-Car festival (ratotsavam) in April. Ancient mantapam [q. v.] close to a tank west of the village. North of this are two caves in the hill. Finely sculptured old temple of Gopaulaswamy."

ఈ పరిపాలన వివరణ సంగ్రహము 1893 వ సంవత్సరమునం దనఁగా శ్రీ హయగ్రీవ శాస్త్రిులవారి భాగవత పీఠిక ప్రకటింపఁబడి యొంటిమిట్ట నేకశిలానగర మనుకొన నారంభించిన నలువది యైదు సంవత్సరముల తరువాతఁ బ్రకటింపఁబడినది. ఇది వ్రాయబడుచుండిన కాలమునందు హయగ్రీవ శాస్త్రిులవారి పీఠికను చదివి భ్రమపడిన క్రింది యుద్యోగస్థు లెవ్వరో తెలుఁగువా రగు పయి యధికారుల కొంటిమిట్ట యనఁగా సంస్కృతమున నేక శిలానగరమని తెలుపుటచేత నట్లు వ్రాయఁబడి యుండును. ఈ పుస్తకమును ప్రకటించిన గ్రంథకర్త లేకశిలానగరముప్రక్క వోరంగ లని వ్రాసియు న్నారు. భాగవత పీఠికానంతరమున బహుసంవత్సరములకుఁ బ్రకటింపబడిన యీ గ్రంథ మీ విషయమున ప్రమాణము కానేరదు. పదునాల్గవ శతాబ్దము నందొక విజయనగర రాజుచేత కోదండ రామస్వామి దేవాలయము కట్టఁ బడినదని పై వ్రాతలలో నుండుటచేత మన బమ్మెర పోతరాజు నాఁటికి దేవాలయము కట్టఁబడినదో లేదో? ఒకవేళ కట్టబడినను దాని కప్పటి కిప్పటి ప్రసిద్ధి వచ్చియుండునా యని సందేహింపవలసి యున్నది. అప్పటికి రాలే దనియే చెప్పవచ్చును ఆ గ్రామములో గోపాలస్వామిది పురాతన విష్ణ్వా లయ మొకటి యున్నదని పయివ్రాఁతలో నున్నది గదా! ఒంటిమిట్ట కవి యని నిర్వివాదముగా నంగీకరింపఁబడిన పోతనకు నూఱు నూటయేఁబది సం వత్సరముల తరువాత నుండిన యయ్యలరాజు రామభద్రకవి తన ప్రథమ గ్రంథమైన సకల కథాసారసంగ్రహమును గోపాలస్వామి కంకితము చేయు టయే మన యూహను సిద్ధాంతము చేయుచున్నది పాఠకుల యుపయోగార్థ ముగా సకల కథాసార సంగ్రహములోని మొదటి పద్యము నిందుదాహరించు చున్నాను:

శా. శ్రీ లీలావతి యైన రుక్మిణియు రాజీవాస్య యైనట్టి స
త్యాలోలాక్షియు నిర్వు రెప్పు డతివేలాసక్తి నిర్వంకలన్
హేళి న్నిల్వఁ దటి ద్ద్వయీ లలిత నీలాభ్రాకృతింబొల్చు గో
పాలస్వామి కడున్ దయారసము నాపైఁ జిల్క నెల్లప్పుడున్.

ఆ-౧.

కడప మండల చరిత్ర సంగ్రహము నందు (Cuddapah District Mannual Page 49). ఒంటిమిట్టను గూర్చి యేమున్నదో చూడుడు-

"Ontimetta (the solitary hill) is of the most important towns. It has a large and very holy Pagoda and a tank of some importance. The Pagoda is dedicated to Kodanda Rama swami and is said to have been built by one of Chitwail Rajahas about 300 years ago, though, if the inscription, at Gandikota (See Appendix) is to be believed, it must have been built by a member of the Vizianagar dynasty in the 14th Century"

పై దానికిది తెలుగు — ఒంటిమెట్ట (ఒంటిగా నున్నదిబ్బ) మిక్కిలి ముఖ్యములైన పట్టణములలో నొకటి. అది పెద్దదై మిక్కిలి పవిత్రమైన యొక్క దేవాలయమును కొంత ముఖ్యమైన యొక చెఱువును గలిగి యున్నది. దేవాలయము కోదండరామస్వామి కర్పింపఁబడినది. గండికోట (అనుబంధము చూడు) వద్దనున్న శాసనమును నమ్మవలసి యుండిన పక్షమున విజయనగర రాజకుటుంబములో నొకరిచేత పదునాల్గవ శతాబ్దమునందు కట్టఁబడవలసి యున్నను, అది సుమారు మున్నూఱు సంవత్సరముల క్రిందట చిట్టివేలు రాజులలో నొకరిచే కట్టింపఁబడి యున్నట్టు చెప్పఁబడుచున్నది".

చిట్టివేలు రాజులు మట్ల అనంతభూపాలుఁడు లోనగువారు. పైని చెప్పఁబడినట్టు కోదండరామస్వామి దేవాలయము కట్టఁబడి మున్నూఱు సంవత్సరములేయయిన పక్షమున, అది మన పోతనార్యుని యనంతరమున నూఱు సంవత్సరములకు పైని గాని కట్టబడియే యుండదు. సంశయగ్రస్తమైన శాసనమును నమ్మి దేవాలయము పదునాల్గవ శతాబ్దమునందే కట్టఁబడె ననుకొన్నను, అది భాగవత రచన కాలమునందో తదనంతరమునందో కట్టఁబడి యుండవలెను. అందుచేత పోతరాజునకు ప్రత్యక్షమైన రాముఁ డొంటిమెట్ట కోదండరామస్వామి కాఁడనియు, పోతన యేకశిలానగర మొంటిమెట్ట కాక యోరుగల్లే యనియు ఊహింపవలసి యున్నది.

ఇఁక నొంటిమెట్ట వారుల మూఁడవ గ్రంథ ప్రమాణమునకు వత్తము. దానినే వారు పరమ ప్రమాణమైన పురాణ మనుచున్నారు. వారు పరమాధారముగా నెన్నుకొనుచున్న యీ కడపటి మహాగ్రంథ మొంటిమెట్టకు దాపున నున్న యోబిలి గ్రామ నివాసి యయిన రామదాసాఖ్య మహానుభావుఁడు తన కెవ్వరో సంస్కృత స్కాందపురాణము నుండి తెనిఁగించి తెచ్చి యిచ్చిన తెనుఁగు వచనము ననుసరించి చేసినట్లుగా "ఏకశిలానగర మాహాత్మ్యము" అను పేర 1906వ సంవత్సరాంతమున సృజించిన మూఁడాశ్వాసముల యత్యద్భుత పద్యకావ్యము. ఈ మహాకవి విరచిత పవిత్ర విచిత్ర కావ్యములోని కడపటి గద్య మిట్లున్నది — "ఇది శ్రీమద్రామభద్ర కరుణాపాత్ర రామయామాత్యపుత్ర ఆంధ్రమాఘ పురాణ నిర్మాణ కవితా ప్రవీణ అష్టవిద్యానిధాన రామదాస ప్రధాన ప్రణీతం బైన యేకశిలానగర మహాత్త్వంబు సర్వంబును ద్వితీయాశ్వాసము".

కవి తా నాంధ్ర మాఘపురాణ నిర్మాణ కవితా ప్రవీణుఁడ నని గొప్ప చెప్పుకొన్నను భాషావిషయమును బట్టి విచారింపఁగా నీ పురాణము వట్టి తప్పుల కుప్పగా నున్నది. కవిత్వమునం దారితేరిన తరువాత రచింపఁబడిన యీ యేకశిలానగర మాహాత్మ్య రచనయే దోషభూయిష్ఠ మయి యుండఁగా ప్రథమ నిర్మాణ మయిన మాఘపురాణ మహిమ యెంత శ్లాఘాపాత్రముగా నుండునో! ఒక్క భాషావిషయమున మాత్రమే కాక చరిత్రాంశ విషయమునను నిది తప్పుల కుప్పగానే కానఁబడుచున్నది. కవి తా నీ గ్రంథము నేపురాణమునుండి గైకొంటి ననియెనో యాస్కాంద పురాణ భాగము నైనఁ జూచిన పాపమునఁ బోయినవాఁడు కాఁడు. అసలట్టి పురాణ ముండిన గదా చూడ నవకాశము కలుగును? లేని పురాణము నెవ్వః డెట్లుచూడఁ గలుగును? హయగ్రీవ శాస్త్రిలవారి భాగవత పీఠికను జదివి దానిలోని కథలను స్థానికేతిహాసములలోని కట్టుకథలను గైకొని స్థలాభిమానముచేత నొంటిమెట్టకు ప్రాశస్త్యము తీసికొని రావలెనన్న చింతతో కావ్యమునకు గౌరవము కలుగుటకయి స్కాందపురాణాంతర్గత మని చెప్పి, కవియే యీ యేకశిలానగర మాహాత్మ్యము నీ నడుమ సృజించియుండును. దీని సత్య మీ క్రింది భాగములను జదివెడు నిష్పాక్షిక బుద్ధులకు బోధపడక మానదు. ఒం

టఁడు మిట్టఁడు అను బోయ వాం డ్రిద్దఱు కోదండరామ విగ్రహమును బూజించుచు నొక యడవిలో వాసముచేయుచుండి రనియు ఆ యరణ్యమున నొకరాజు మృగయావినోదార్థముగా వచ్చి వేఁటాడి యలసి పిపాసాపీడితుఁ డయి జలాశయమును జూపుఁడని వేఁడఁగా,

గీ. "అనుచు రాజు నుడువ నా వంట మిట్టలు
రమ్మటంచుఁ బోయి రామతీర్థ
సరసుఁ జూప నదియుజలములు చాల లే
వొక్కగజము గ్రోల నిక్కువముగ".

బోయ లాతనిని గొనిపోయి రామతీర్థ మనఁబడెడి యొక మంచినీళ్ళ గుంటను తాము పూఁత వేసియుంచిన రాతిని బైకిఁదీసి చూపఁగా రాజందు జలపానము చేసి సంతృప్తుఁడై సంతోషించి వరము కోరుఁ డని యడిగె ననియు,

క. "మే మార్జించిన ద్రవ్యము
రాముల కర్పించినాము రాతిని గుడిగా
తా మేర్పరించి యందున
స్వామిని నిల్పియును నవలఁ జ(జె)లు వుంచవలెన్.

క. ఇది గాకను మా పేరను
సదయుఁడ వై పట్టణంబుఁ జ(జె)య్యగవలె నా
మదిలోన నుండు టిదియే
సుదినంబును గూడినట్టి శుభలగ్నమునన్.

క. ఆచంద్రార్కస్థాయిగ
భూచక్రము నుండు వఱకుఁ బోకుండంగా
నా చక్రికిఁ గైంకర్యము
వే చేయించంగ భూమి యీవలె రాజా!

ఆ. చ(చె)ఱువు క్రింద భూమి చాలినంతయు స్వామి
కియ్యవలెను పూజ లిచ్చువారి

కిల్లు వాకిలియును నేర్పరింపఁగవలె
వంటిమిట్టలోను వసతిగాను.

వాని రామస్వామికి దేవాలయమును దేవాలయ సమీపమునఁ దమ పేర నొక యూరును గట్టింపుమని కోరగా రాజువారి కోరికను దీర్చి యొంటి మెట్ట గట్టించెననియు గ్రామమున కొంటిమిట్ట నామము వచ్చుటకుఁ గారణ ముందు వివరింపఁబడియున్నది. ఈ గ్రంథమునుబట్టి మొదటిబోయ వాని పే రొంటఁడో వంటఁడో యాతని పేరఁ గట్టఁబడిన గ్రామ మొంటిమెట్టయో, వంటిమిట్టయో స్పష్టముగాఁ దెలియరాకున్నది. పయిపద్యమును బట్టి వంటిమిట్ట యయినట్టే కనఁబడినను, పురవర్ణనములోని యీ క్రింది పద్యమును బట్టి చూడఁగా నొంటిమిట్ట యగుచున్నది.

సీ. "పురవిశేషంబు గోపురవిశేషంబులు
నొనరఁగా నొప్పును నొంటిమిట్ట
స్థలవిశేషం బుపస్థల విశేషంబులు
నొనరఁగా నొప్పును నొంటిమిట్ట
జలవిశేషంబు లంజెల విశేషంబులు
నొనరఁగా నొప్పును నొంటిమిట్ట
కులవిశేషంబు గోకుల విశేషంబులు
నొనరఁగా నొప్పును నొంటిమిట్ట

సరవిశేషంబు నయ్యె వాసర విశేష
మయ్యె రథగజతురగ వాహనము లయ్యె
చుట్టు నుద్యానవనము లై చోద్యముగను
చూడఁ జూడంగ నొప్పును సురుచిరముగ.

ఏకశిలానగరమును దెనుఁగులో నొంటిమిట్ట యందు రనియు స్కాంద పురాణములోనే చెప్పఁబడెనఁట!

క. ఏకశిలానగరం బన
శ్రీకరముగఁ బట్టణంబు చెలఁగుచు నుండున్

లోకులు తెలుఁగున నుడువుదు
రేకంబుగ వంటిమిట్ట యిది యను పేరన్. —ఆ.౧

మన వారికిఁ గావసిన దంతయు నిందులోనే యుండఁగా మఱి యేది కావలెను? బమ్మెరపోతరా జొంటిమెట్టవాఁ డనియు నీ యపూర్వ పురాణములోనేయున్నది. చిత్తగింపుఁడు—

గీ. శాలివాహన శకగత మౌలి నడుచు
వేయి మున్నూఱు వత్సరా ల్వెలయుచుండ
బమ్మెర కులాబ్ధిచంద్రుడు భగవదంశు
కేసనామాత్య పుత్రుండు కేశవునకున్.

క. భక్తుఁ డయినట్టి పోతన
యుక్తవయసు రాకమునుపె యురుగోత్రము లా
సక్తత గోవుల మేపుచు
రక్తిగ నేకశిలనగర రాజము నందున్.

క. కాపురము చేయుచుండియుఁ
గాపులతోఁ గూడి పసులఁ గసవు స్థలములన్
మేపుచునుండఁగఁ గొండల
దాపు చిదానందయోగి దర్శన మయ్యెన్.

గీ. దర్శనంబు మౌని స్పర్శయుఁ గలిగినఁ
బావనుండు నయ్యెఁ బారుఁ డతఁడు
నదియుఁ జూచి రామనామంబు నుపదేశ
మొనరఁ జేసె దాని మూలమునను.

గీ. ఆ చిదానంద యోగికి నపుడు భక్తి
వినయములు చేసి శాశ్వతవిభవ మమరఁ
దారకంబును దొరకెను ధన్యుడైతి
ననుచు మ్రొక్కిడి పోతనానంద మొందె.

వ. అంతఁ జిదానంద యోగి యదృశ్యుండై చనినఁ దదనంతరంబున.

సీ. భాగవతము(ఁ జేయ భావించి రాముల
కృష్ణుఁ బాత్రుఁ డైన కొడుకుఁ జూచి
తల్లిదండ్రులు లపుడు తగునని చెప్పిరి
పోతనాఖ్యుఁ డపుడు పూనఁగఁ జేసె. —అ. ౨.

ఉ. బమ్మెరపోతనాఖ్యుఁడును బాసిలు కాశిపురంబుఁ జేరి భీ
ష్మమ్మను వేఁడికొంచుఁ గలుషమ్ములఁ బాపు మటంచు విష్ణుపా
దమ్మునఁ బుట్టినమ్మ యని దబ్బున గంగను దోఁగి లేచి చి
త్తమ్మున రాముఁ జేర్చుకొని తారకమున్ జపియించు
చున్నెడన్. —అ. ౩.

క. పట్టాభిరామ దేవుఁడు
పట్టుగఁ గనుఁ గవకుఁ జాలఁ బ్రత్యక్షుం డై
దిట్టముగా భాగవత మి
ప్పట్టునఁ దెనిఁగించు మోక్షభాగ్యము లొదవున్. —అ. ౩.

బమ్మెరపోతరా జొంటిమిట్టవాఁ డని చూపుటయే కాక బమ్మెర పోతరాజు స్నానముచేసినది గోదావరిగాక కాశిలోని భీష్మమ్మ (భీష్మని యమ్మ) యని స్పష్టపటిచి యీ మహాపురాణ మొంటిమిట్టవాదుల పాలిటి కల్పతరు వైనది. కవికి రాముఁడు సాక్షాత్కరించినదియు కాశీనగరములోనే యని యీ పుస్తకము తెలుపు చున్నది. రాముఁడు ప్రత్యక్షమయి భాగవతమును రచింపు మని యాదేశింపఁగానే పోతరా జొంటిమిట్టకు పరుగుత్తుకొని వచ్చెనట !

క. ఏకశిలానగరమునకుఁ
బ్రాకటముగఁ బోతరాజు పరుగిడి యచటన్
శ్రీకాంతుం డగు రాముల
నాకరముగఁ జేసికొంచు నయ మరుదారన్. —అ, ౨.

ఈ యపూర్వ స్కాందపురాణములోఁ బేర్కొనఁబడిన వాఁ డొక్క పోతరాజు మాత్రమే కాఁడు. తరువాత బహుకాలమున కుండిన యొంటిమిట్టకవి యయ్యలరాజు రామభద్రుఁడు సహిత మిందుఁ బేర్కొనఁబడెను. ఆతని కథను జూడుఁడు—

క. శివదేవరాయ లను ప్రభు
సవినయత న్విజయ నగరసామ్రాజ్యుండై
నవఖండంబుల నేలుచు
నవిరళముగ రామదేవు నర్చన చేసెన్. —ఆ.౩,

వ. అట్టి కాలంబున శాలివాహన శకవర్షంబులు వేయి న్ననూ్నట డెబ్బది మొదలు యెనుబదిరెండువఱకుఁ దన రాజ్యంబునకు లోఁబడిన సిద్ధవటపురంబున కిరుదెసల వంటిమిట్ట శ్రీరాముల వారికి సకలభోగంబులు జరుగునటులఁ గొన్నిపురంబుల నరణం బిచ్చె నా సమయంబునందు.

ఉ. అయ్యలరాజు వంశజుఁడు నాలును బంధులు మిత్రు లాదిగాఁ
జయ్యనఁ బుత్రు నెత్తుకొని స్వామికి నర్చనచేయు వేళఁ ద
ల్లి య్యెడఁ బుత్రునుంచి బహుళమ్ముగ వేఁడుచునుండి రాత్రియై
పొయ్యెరి బిడ్డయం చనక పొల్పుగ రాముల మాయొ చిత్రమో.

గీ. ఉదయమున లేచి బిడ్డను వెదకుకొనఁగ
న ల్లెడలఁ గాన కాత్మలోఁ దల్లడిల్లి
పదియు నొక్క నెలయు బాగుగాఁ బెంచితి
నిచ్చినతని కియ్య నేమి కొదవ.

క. అనుచును మూఁడు దినంబులు
తన యాత్మం బుత్రు దలఁచి తారకనామం
బును జపియించుచు నుండినఁ
గనుఁగవకుం దోఁచె సుతుఁడు కాపున్నక్రియన్.

క. నాలవనాఁడును పూజా
మూలంబుగ నంబి యరుగి మురహారివలెఁ దా
కాలుని గెలిచిన పుష్కరు
వాలెం గుడినుండి వెడలె వసుగకు నంతన్.

ఆ. తల్లిదండ్రి మొదలు దగవారి వారలు
హర్ష మొదవ రామహర్నిశములు
దలఁచుకొంచుఁ బేరు దగు రామభద్రయ్య
యనుచుఁ బిలిచికొనుచు నరిగి రపుడు.

క. సీతారాములు పెంచిరో
యేతీరున బ్రతికివచ్చె నీకుఱ్ఱఁడు శ్రీ
మాత యయి సీత స్తన్యం
బీతనికి నిచ్చెననిరి పృథివిని దివినిన్.

క. ఆ రామభద్రయాఖ్యుఁడు
శ్రీరాముల దయను బొంది చెలఁగుచుఁ గవియై
యారాయ ప్రభునివద్దను
పాలుఁడు ప్రబలకవి యయ్యుఁ బరఁగుచునుండెన్. —ఆ.౩.

ఈ గ్రంథమునందుఁ బేర్కొనఁబడినవారు రామభక్తు లగు భారతీయులు మాత్రమే కాదు. మహమ్మదీయులు సహిత మిందుఁ బేర్కొనఁబడిరి. కన్నులు తనియం గనుఁడు—

చ. అదియునుగాక మ్లేచ్ఛకులుఁడైన యిమాంబెకుఁ డొక్కనాఁడు తాఁ
బదుగురు గుఱ్ఱ మేనుఁగులు పత్నియుతంబుగ వచ్చి దేవలం
బొదివిన నర్చకుందులును బొమ్మనఁబోక పురుండ నచ్చటన్
వదలకయుండ సామునిసి వాఁడగు పచ్చలబద్ద పట్టుకన్. —ఆ.౩.

సర్వజ్ఞులకు గోచరము గాని దేముండును? ఇన్ని దెలిపిన సర్వజ్ఞుఁడైన యీ స్కాందపురాణ కర్త యిటీవలఁ బుస్తకములఁ గోదండరామస్వామి

కకింత మొనర్చిన భక్తుల నేల పేర్కొనలేక పోయెనో! ఈ పుస్తక కల్పనము 1906వ సంవత్సరమునందుఁ గాక 1918వ సంవత్సరమునందుఁ జేయఁబడినచో నీ నవభాగవతోత్తముల పేరులు సహితమిం దెక్కియుండును. ఇఁక నీ యేకశిలానగర మాహాత్మ్యమునకు మూలమైన సంస్కృత స్కాందపురాణము రాక యొక్కటి కొఱఁతగా నున్నది. ''ఓరుగంటి కాధారముగ లిఖితాధారములు తాళపత్రములు సృష్టింపఁబడుచున్న వని వింటిని'' అని ఆంధ్ర వాల్మీకులును, భక్తాగ్రేసరులు నైన శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు పలికినట్లు వారి యిష్టదేవతానుగ్రహంబున నా కొఱఁతయు శీఘ్రకాలములోనే తీరునేమో!

—ఆంధ్రపత్రిక

పదియవ (సిద్ధార్థి) సంవత్సరాది సంచిక.

(1919, మే 28వ తేది.)

# ఆముక్తమాల్యద కర్త కృష్ణరాయడే

— శ్రీ చిలుకూరి నారాయణరావు

ఆముక్తమాల్యదా కర్తృత్వమును గురించి సందేహము లెందుకు కలుగుతవో నాకు బోధపడకుండా ఉన్నది. "నేను వ్రాసినానయ్యా!" అని కృష్ణరాయడు నోరు విడిచి చెప్పుకుంటూ ఉండగా "ఛా! ఊరుకో! నీవు ఎక్కడ, ఎప్పుడు, ఎందుకు, ఏ సందర్భములో వ్రాసినావు? నీవు యుద్ధాలే చేస్తావా? రాజ్యాలే ఏలుతావా? దేవేరుల జగడాలే తీరుస్తావా ? వేటలకే పోతావా? కావ్యాలు వ్రాయడానికి నీకు తీరిక ఎక్కడఉంది? అసలు నీవేమి చదువుకొన్నావు? "అని అతనిని నిలబెట్టి నాగతీసి అడగడమేమి బాగుంటుంది? అతని పరోక్షములో అతని సమకాలికుల పరోక్షములో ఇటువంటి ప్రశ్నలు వేస్తున్నారు గనుక సరిపోతున్నది గాని?—

"అని యిష్టదేవతా వందనంబుఁ చేసి మున్నేఁ గళింగదేశ విజగీషా మనీషం దండెత్తిపోయి....శ్రీకాకుళ నికేతనుం డగు నాంధ్ర మధుమదను సేవింపం బోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్ర చతుర్థ యామంబున....ఆంధ్రజలజాక్షుఁడు....కృతి వినిర్మింపుము....మాకుఁ బ్రియము గాఁగ....ప్రియాపరిభుక్త భాక్కథన్ జెప్పుము....దానిని వేంకట పతి కంకితము సేయుము పొత్తమిటు సేయ నీకుత్తరోత్తరాభివృద్ధి" అన్నాడు. నిండోలగమున విద్వజ్జనములు "సాహితీ సమరాంగణ సార్వభౌమ....కృతివినిర్మింపుము" అన్నారు. కృష్ణరాయడు "ప్రహృష్టాంతరంగుండనై....నా విన్నవింపం బూను నాముక్తమాల్యదా మహాప్రబంధంబునకు కథాక్రమంబెట్టి దనిన" అని ఎత్తుకొన్నాడు. "కృష్ణరాయ మహీభృన్నామాన్మదాముక్త మాల్యద" (ఆశ్వా. 2); "కృష్ణరాయ నృపసంజ్ఞా స్మత్కృతాముక్త మాల్యద" (ఆశ్వా. 3, 4, 5, 6) అని ఏడాశ్వాసాలలోని అయిదాశ్వాసాలలో అంతమందు కంఠోక్తిగా చెప్పుకొన్నాడు. అన్ని వ్రాతప్రతులలోను కృతి కృష్ణరాయ ప్రణీతముగానే ఉన్నది.

కవి ననుకొని అప్పకవి అని పేరుపెట్టుకొన్న అప్పన్న వ్రాసిన తప్పుడు వ్రాత నాధారముగా చేసుకొని ఇటీవలివారు ఆముక్తమాల్యదను పెద్దన్నకు తగిలిస్తే నిలుస్తుందా ? ఆముక్తమాల్యదవంటి ప్రబంధమును వ్రాయడానికి మెరుగుల మేనత్త పని చేసిన పెద్దన్నవంటి వా డెన్నాళ్ళు తపస్సు చేయవలెను? పెద్దన్న కవిత్వాని కా కటుత్వమూ లేదు, ఆ పటుత్వమూ లేదు. అతని కా పాండిత్యమూ లేదు, ఔద్ధత్యమూ లేదు. ఆ మాటల విసురూ లేదు, తలపుల ఉసురూ లేదు. ఆ లోకానుభవమూ లేదు, ఆ రాజసభావమూ లేదు. ఆ పలతిరుగుడూ లేదు, ఆ వినయ సంపదా లేదు. కల్పనలలో ఆ రాకడా లేదు, ఆ పోకడా లేదు. అల్లసాని వాడల్లా ఇల్లా అల్లుకపోయి నాడు. ఆముక్తమాల్యద ప్రత్యేక వైశిష్ట్యము గల కావ్యము. మనుచరిత్రాముక్తమాల్యద లేకముఖవినిస్సృతము అంటే నమ్మవీలు లేని మాట, కాదుకూడదు పెద్దన్నయే ఆముక్తను వ్రాసి నాడని హఠము పట్టితే, పెద్దన్న మనుచరిత్రను వ్రాయ లేదని మొండికి పడవలసి వస్తుంది. ఎందుకీ తగాదాలు?

పులిమీద పుట్ర అన్నట్లు ఇప్పుడు జగద్గురువుల వారొకరు బయలుదేరినారు. ఆముక్తను కృష్ణరాయడూ వ్రాయలేదట, పెద్దన్నా వ్రాయలేదట! ఎవడో అనామధేయుడు సాత్తాని వైష్ణవుడు వ్రాసినాడట! ఏమి విడ్డూరము! ఈ పేరు లేని సాత్తాని వైష్ణవునికి విశిష్టాద్వైత సంప్రదాయ మంత సమగ్రముగా ఎక్కడ పట్టుబడినదో! అనుభవ మూలకమైన ఆ రాజనీతి ఎక్కడ అలవడినదో! సంస్కృతాంధ్ర ములం దంతటి కూలంకష పాండిత్య మెట్లబ్బినదో!... పిచ్చి మాటలు! !

దాని మాట కేమి గాని, పండితులు కొందరు పెద్దన్నకు ఆముక్త కర్తృత్వమును ఎట్లా అయినా పులమడాని కింకా ప్రాకులాడుతున్నారు. రాజేమిటి, కావ్యము వ్రాయడ మేమీటి అని వారి సందేహము. రాజు కుండవలసిన లక్షణా లేమిటో, కృష్ణ రాయనికి వానిలో నేమేమి వుండడము చేత దక్షిణ హిందూదేశము తురుష్కాక్రాంతము కాకుండా వరాహధ్వజ మెగరడాని కవకాశము కలిగినదో రాయవాచకము చదువుతే తెలుస్తుంది. అతని ఆస్థానకవు లందరున్నూ అతనిని విద్యాభోజునిగా, కావ్యకలాదక్షునిగా వర్ణించి

నారు. అతడు తీరిక వున్నప్పుడెల్ల విద్వద్గోష్ఠిలోనే రాజకార్యముల వల్ల కలిగే తొందరలను కొంతకాలము మరచేవాడు. అతనికి విద్యా-బుద్ధులు కరపించిన వాడు తిమ్మరుసు మంత్రి-అప్పాజీ. కృష్ణుని సార్వభౌమునిగా దిద్ది తీర్ప నెంచి కృతకృత్యుడైన అప్పాజీ. అతడు కవిసార్వభౌము డౌతేనే కాని అతని సార్వభౌమత్వానికి వన్నె రాదని ఊహించకుంటాడా ?

కృష్ణరాయడు ఆముక్తను వ్రాయడము సత్యము. దాని నాతడు మనుచరిత్రమును పెద్దన్న వ్రాయకముందే వ్రాసినాడు. ఆముక్తలోని కృష్ణరాయని వంశవర్ణన పద్యములు, అవతారపద్యములు మొదలయినవి మనువులోని కెక్కినవి; రాజు మొగమెచ్చుకోసము రాయల రచనను పెద్దన్న కొన్నికొన్ని పద్యములలో అనుకరించినాడు. చూడండి—విల్లిబుత్తూరి వర్ణన, అరుణాస్పద పురవర్ణన, విలుబుత్తూరి భాగవత వర్ణన, ప్రవరుని తీర్థసంవాసి సేవావర్ణన, విష్ణుచిత్తుడను నిష్ఠానిధిగేహసీమ "నడురే యాలించినఁ ద్రోయు....కృపయా భోక్తవ్య" మన్నట్లు "వండ నలయదు వేవురు వచ్చిరేని నన్నపూర్ణకు నుద్దియౌ నతని (ప్రవరుని) గృహిణి, అతిథు లేతేర నడికిరేయైనఁ బెట్టు"—ఇటువంటివి మరికొన్ని ఉదాహరించ వచ్చును. రాతున వృత్తాంతము రెండు గ్రంథములకున్ను కొంతపోలికను కలిగిస్తున్నది. ఇంతకు మించి వీటికి మరెట్టి పోలికా లేదు. కృష్ణరాయడు పెద్దన్నకు కొంచెము దారిచూపినాడు. కాని, అతడు దాని నవలంబించలేక పోయినాడు. ఆముక్తమాల్యదను చదువుతే పుణ్యమూ, పురుషార్థమూకూడా కలుగుతవి. మనుచరిత్రను చదివితే రెండున్ను లేవు....

ఆముక్తమాల్యద ప్రత్యేక వైశిష్ట్యము గల కావ్య మనడానికి సందేహము లేదు.

గ్రంథము పేరులోనే ఆ వైశిష్ట్యము కనపడుతుంది. సంస్కృతాంధ్ర వాఙ్మయములోనే అనడ మెందుకు. ప్రపంచ వాఙ్మయములో మరెక్కడా ఇట్టి గ్రంథ నామకరణము కనబడదు. గ్రంథము పేరు 'విష్ణుచిత్తీయము' కాదు. అట్లని కవి యెక్కడా వ్రాయలేదు. విష్ణుచిత్తీయ మనడానికి గ్రంథమున కెంతటి అర్హత ఉన్నదో యామునీయ మనడానికి కూడ అంతే

అర్థాత ఉన్నది. అట్లే ఖాండిక్యకేశిధ్వజీయ మని కాని, మాలదాసరి కథ అని కాని కూడ చెప్పవచ్చును. ఈ కథల కన్నిటికిన్ని గ్రంథములో సమ ప్రాధాన్యమే వున్నది గదా! ఆముక్తమాల్యద అయిన గోదాదేవిని శ్రీరంగ భర్త పెండ్లాడడముతో కథ అంతమొందు తున్నది కాబట్టిన్ని, ఆముక్త మాల్యములు నిచ్చిన పిన్నదానిని పెండ్లాడడమే విశేషముగా కవి తలంచి దానిని మనస్సులో ప్రధానముగా వుంచుకొని గ్రంథమును వ్రాసినాడు కాబట్టిన్ని, 'ఆముక్తమాల్యద' అనేపేరే కవిఉద్దేశించిన దని నిస్సందేహముగా చెప్పవచ్చును.

'ఆముక్తమాల్యద' అనేపేరు కర్థ మేమిటి? "ఏ మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము", "ప్రియాపరిభుక్త భాక్కథన్ చెప్పుము" అని ఆంధ్రవిష్ణు హానతిచ్చినది. మొదటిదానికి ఏనును, మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్న దియు రంగములో (శ్రీరంగ ములో) అయిన పెండిలిని గురించి చెప్పుము" అని వేంకట్రాయ శాస్త్రిల వారున్ను, ఇతరులున్ను అర్థము చెప్పినారు. కాని, ఇది చాలా దూరాన్వ యముగా కనబడుతున్నది. 'ఏను' పదముమీదను, 'పిన్నది' అనే పదము మీదను కూడ సముచ్చయ చిహ్నము లోపించడముజేత ఈ అవస్థ పట్టినది. లేదా, "ఏను మున్ను దాల్చిన మాల్యమిచ్చు నాపిన్నది (పిన్నదానికి) రంగ మం దయిన పెండిలిని గురించి చెప్పుము" అని అయినా అర్థము చెప్ప వచ్చును. వాక్యవిన్యాసము ననుసరించి యిట్లే అర్థము చెప్పవలసి యున్నది. మరేవిధముగా చెప్పినా క్లిష్ట దూరాన్వయము సంభవించి దోషము కలుగు తుంది. ఆ పిన్నది మాల్యమును శ్రీరంగభర్తకు సమర్పించిన విషయ మిచ్చుట ప్రధానము. కాని, గ్రంథములో ఆమె అట్లు సమర్పించిన విషయా నికి కవి ప్రాధాన్యము నివ్వలేదు. ఆమె శ్రీరంగభర్తను పూజించిన విధాన మును కొంత వివరించి చెప్పినా దానిలో మాల్యదానము ప్రత్యేకించి చెప్ప లేదు. ఆమె యర్చా విధాన మిది:

"బోటి గట్టిన చెంగల్వ పూవుఁబెత్తుఁ
దరు పరిణతోరు కదళ మంజరియుఁ గొనుచుఁ

బోయి గుడినంబి విజనంబుఁ జేయఁ జొచ్చి,
ప్రెుక్కి. వెదిక౯ బలువన్నె ముగ్గు వెట్టి,
కవిల గవి సర్పిఁ బృథు దీపకళికఁ దీర్చి
ద్వయముతో వక్షమునఁ గల్వదండ నేర్చి,
యగరు ధూపంబు లిడి శర్కరా రాజ్య యుక్త
హృద్య కదళీ ఫలాళి నైవేద్య మొసఁగి,
ఖండిత పూగీ నాగర
ఖండంబులు ఘన శశాంక ఖండంబులచే
హిండిత మపు తాంబూల మ
ఖండ స్థిర భక్తి నొసఁగి కదలి చెలులతోన్.
చెలువ గర్భ గృహ ప్రదక్షిణముఁ జేసి
వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణ తీర్థముఁ గొని, తత్ప్రసాద లబ్ధ
మయిన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు.
ప్రతిదినము నిట్లు చని య
చ్యుత పూజ యొనర్చి, వచ్చి, సుదతి వియోగ
చ్యుత ధైర్య యగుచు నయ్యదు
పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచు నుండున్."

పయి పద్యములలో శ్రీహరివక్షమున ఆమె కల్వదండను చేర్చి నట్లున్నూ, తత్ప్రసాద లబ్ధమయిన మాల్యమును దాల్చినట్లున్నూ మాత్ర మున్నది. శ్రీహరి 'ప్రియా పరిభుక్త భాక్' ఎట్లయినాడో గోదాదేవి 'ఆముక్త మాల్యద' ఎట్లయినదో యిచ్చట వివరింప బడలేదుగదా! 'ప్రియా పరిభుక్తభాక్' అంటే 'ప్రియా పరిభుక్త మాల్యభాక్' అని అర్థము కవి ఉద్దేశించినట్లు కనబడుతుంది. లేదా 'పరిభుక్త ప్రియాభాక్' అనబోయి అతడిట్లన్నాడా? తాను ముందుగా ధరించిన మాల్యమును గోదాదేవి శ్రీహరికిచ్చినదని కవి యెక్కడా చెప్పలేదు. లేదా ముందుగా శ్రీహరి ధరించిన మాల్యమును తాను ప్రసాదముగా గ్రహించి, దానికే తిరిగి ఆమె శ్రీహరికి సమర్పించేదా? "ఏ మును దాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది" అనే

దానిని బట్టి ఈ అర్థము స్ఫురిస్తున్నది. కాని, పూజావర్ణన సందర్భములో "తత్ప్రసాద లబ్ధమయిన మాల్యము దాల్చి గేహమున కరుగు"నని మాత్రమే చెప్పబడినది కాని దానిని తిరిగి శ్రీహరి కిచ్చినట్లులేదు. కాని, పూజావర్ణనానంతర మున్నట్లుండి కవి —

"మొదల నాముక్తమాల్యద మదన తాప
తరణి పెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్ట మాడు ననుచుఁ
దొలఁగె నన నుత్తరాశకుఁ దొలఁగెఁ దరణి."

అని వసంతర్తు వర్ణనము నెత్తుకొన్నాడు. ఇక్కడ నేమైనా గ్రంథ పాతమున్నదేమో అని నాకు సందేహము. లేకుంటే ఇంతటి అవ్యవస్థ యేర్పడదు.

గోదాదేవి 'ఆముక్త మాల్యద' అనిన్నీ, రంగేశుడు 'ప్రియాపరిభుక్త (మాల్య) భాక్కు' అనిన్నీ కవి ఉద్దేశించినట్లు స్పష్టమే. ఆమె పరిభుక్తమైఁ ఆముక్తమైన మాల్యమును రంగభర్త కిచ్చిన దని మన మనుకోవలెను. అంటే, తాను బాగుగా అనుభవింపగా వాడిపోయి పనికిరాక పోవుట వల్ల సంపూర్ణముగా త్యజించిన మాల్యము నామె సమర్పించిన దన్నమాట, పరి, అజ్‌. అనే ఉపసర్గల వల్ల ఈ అర్థము తేలుచున్నది. అట్టి మాల్యము నిచ్చినా, మున్నొక మగవాడు (సుదాముడు) చక్కని పరిమళిస్తూ ఉన్న, వాడని ననదండ నివ్వగా దానిని 'ఏవ'తో గ్రహించినవాడు. ఇప్పుడొక ఆడుది, యౌవనవతి, సుందరి, ప్రియురాలు, తనకోసము సగమైనది, ద్రావిడి, ఇచ్చినది కాబట్టి, ఒక మగవాని చేతినుంచి పూలమాలను గ్రహించిన అరసికతా దోషమును, కొదువను తీర్చుకొనటానికి 'రంగేలా' అయిన రంగనాయకుఁడు 'రింగురంగా' అని ఆ పూలమాలనే కాకుండా పూబోడిని కూడా పరిగ్రహించాడు. అదీ, ఆమె కూడా అప్పుడు పరిభుక్తలయినారు.

అయితే మాల్యదాన కథకోసము కృష్ణరాయలు కావ్యమును వ్రాయలేదు. కాథా విన్యాసము వల్ల రసోత్పాదనము చేయటానికి కూడ అతడు ప్రయత్నించలేదు. ఆముక్తలోని రసము 'శృంగారమా?' కాదు. విష్ణు

చిత్తునిలో ఏమి శృంగారమున్నది? యామునిలో ఏమి శృంగారమున్నది? ఖాండిక్య కేశిధ్వజులలో ఏమున్నది? మాలదాసరిలో ఏమున్నది? బ్రహ్మ రాక్షసునిలో ఏమున్నది? గోదాదేవి విరహతాప వర్ణనమును చేసినంత మాత్రమున శృంగారరస ముట్టి పడిందనవచ్చునా? ఆమె మీద రంగేశునకు గల మక్కువ వర్ణన మేదీ? ఒక సీస పద్యములో అత డామె అంగసౌందర్య మును వర్ణించినంత మాత్రమున సరిపోతుందా? పోనీ, వైష్ణవ సంప్రదాయములో భక్తి శృంగారమునకు పర్యాయవాచకము కాబట్టి గ్రంథములో భక్తిరసము ప్రధానమైనది. అందామా అంటే, అది కూడా సుస్పష్టముగా కనపడదు: విష్ణు సర్వోత్తమత్వ స్థాపనము కోసము చేసిన తర్కవాదము భక్తి రసస్ఫోరకము కాజాలదు.

ఆముక్తమాల్యదలో నాయికా నాయక నిర్ణయము కూడా సందిగ్ధ విషయమే. కవి అన్నాడు కాబట్టి చూడికుడుత్త నాంచారున్నూ, రంగ మన్నారున్నూ నాయికా నాయకు లని అనుకోవలసినదే కాని, కావ్యమును బట్టి ఈ విషయమును నిర్ణయించలేము. కథలో వస్త్వైక్యము కుదరలేదు. ఈ విషయములో మనుచరిత్రకు పట్టిన అవస్థే ఆముక్త కున్నూ పట్టినది. రెండు గ్రంథములున్ను వేరువేరు చిన్న కథల సంపుటులే. ఆ చిన్నకథలను చెప్పే తీరులో మనుచరిత్రకారు డెక్కువ నేర్పు చూపినాడు. ఆముక్త మాల్యద కర్త కానేర్పు లేదనియే చెప్పవలెను.

ఆముక్తమాల్యదా వైశిష్ట్యమునకు కారణము దాని నామకరణ మొకటి అని చెప్పినాను. కూలంకష సంస్కృత పాండిత్య ప్రకటనము, తెలుగు నుడికారపు సొగసు, శాస్త్రోక్తుల లోకోక్తుల విన్నాణము, వర్ణనముల ఉన్నతి, అద్భుతానల్ప కల్పనల శిల్పము అలంకారముల లాలిత్యము, లోకాను భవ సమృద్ధి—ఇవి గ్రంథములోని తక్కిన విశిష్టగుణములు. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదనము, రాజనీతి విస్తరము అనేవి కథతో ఆనుషంగికముగా ప్రసక్తములయి, రాయల అపూర్వజ్ఞాన ప్రత్యేకతను తెలిపే విషయములు....

కృష్ణరాయడా, పెద్దన్నయా ఆముక్తను వ్రాసినది అనే చర్చ క్రొత్త దికాదు. కృష్ణరాయడా గ్రంథమును వ్రాయలేదన్న వారికి గురజాడ

శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'కవిజీవితము'లలో చక్కని సమాధానముల నిచ్చినారు. చర్వితచర్వణముగా ఊకను దంచుటవల్ల ప్రయోజనములేదు. శ్రీ నీలకంఠశాస్త్రిగారి* యిప్పటి క్రొత్తవాదములోని ముఖ్యవిషయాలను మాత్రము పరామర్శించ వలసియున్నది.

ఆముక్త మాల్యద వీరవైష్ణవ తత్త్వ ప్రతిపాదకము. పెద్దన్న గాని, కృష్ణరాయడు కాని వీరవైష్ణవులు కారు. అందుచేత ఎవడో యీనాటివాడు వీరవైష్ణవుడు దీనిని వ్రాసి యుండవలె నని శాస్త్రిగారు వ్రాసినారు.

ఆముక్తలో ప్రతిపాదింపబడినది విశిష్టాద్వైత సిద్ధాంత వ్యతిరిక్త మైన వైష్ణవ మేమో తరువాత విచారింతాము. కాని, సంపూర్ణముగా వైష్ణవుడైనవాడే వైష్ణవ కావ్యమును వ్రాయవలెనా? రామకృష్ణాదుల కథలను, వైష్ణవపురాణములను రచించిన వైష్ణవేతర కవులు లేరా? వారు విష్ణు సర్వోత్తమత్వమును తమ గ్రంథము లందు స్థాపింప లేదా? ఆముక్తలో విష్ణుభక్తి మహిమ వివరిలపబడినదే కాని శివనింద యెచ్చటనైన ఉన్నదా? వైష్ణవ కథను వ్రాస్తూ ఉన్నప్పుడు తత్సంప్రదాయానుసారు లగు వర్ణనములను మాత్రము చేయడము వల్ల దోషము కలుగుతుందా? గ్రంథరచన వల్లనే తత్కర్తమతము నూహింపవచ్చునా? ఆముక్తను పెద్దన్న రచింప లేదని అతని శైవ, వైష్ణవాభిమానము మూలముగా గాక ఇతర విధములుగా రుజువు చేయవచ్చును, కృష్ణరాయడు దానిని రచించి నాడనికూడా ఇతర విధములు గానే రుజువు చేయవచ్చును. కృష్ణరాయనికి శైవక్షేత్రముల మీద ఎంత గౌరవమో వైష్ణవక్షేత్రముల మీద కూడ అంత గౌరవమున్న దనడాని కాతని దానశాసనములే ప్రబలసాక్ష్యములుగా ఉన్నవి. రాయలకు శైవ

---

* క్రిందటి ఏప్రిలు భారతి సంచికలో శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి గారు వ్రాసిన వ్యాసమునకు ప్రముఖస్థానము నిచ్చి పత్రికాధిపతులు ప్రకటించడముచేత ఈ విషయమై ఇంకా చర్చచేయవలసినదిగా తద్విషయాభిమానుల నాహ్వానించినట్లెంచి, ఈ వ్యాసము వ్రాయ నుపక్రమించినాను. ఏమో ఆ వ్యాసమును చదువగానే మనస్సునకు చురుక్కు మన్నది.

వైష్ణవ క్షేత్రములు రెంటిమీదను సమానమైన గౌరవ మున్నదని రాయ వాచకములోని యీ క్రింది యాత్రాచర్యవల్ల తెలియవస్తున్నది.

"తిరుపతికి వచ్చి అలమేలు మంగాసమేతులైన కల్యాణ వేంకటేశ్వరుల దర్శనంబు సేసి, లొక్ష రూపాయలు కానుక వేసి సకల భూషణములున్ను స్వామికి సమర్పించి, ఆ స్థలాన షోడశమహా దానాలున్నూ సేసి, సన్నిధిని నిత్యసేవగా అంజలిపుటులై పూర్వద్వారమందలి వుభయ పార్శ్వములా తిరుమలదేవి చిన్నాదేవి సహితంగా వుండేటట్టుగా తాంబ్రాన ప్రతిబింబములను సేయించి స్వామికి యెదురుగా నిలిపి, (౨) అందుంటి కాళహస్తికి వచ్చి స్వామిని దర్శించి, కానుకలున్ను, నవరత్నాభరణము లున్ను సమర్పించి, శ్రీముఖ సంవత్సరం ఆశ్వీజశుద్ధ ౧౨ దినములు... ... రాదిగాగల వస్త్రము లున్ను గ్రామాదులున్ను సమర్పించి స్వామి సన్నిధిని షోడశ మహా దానాలున్ను సేసి, అవ్వారిగా సత్రము లున్ను కలుగసేసి (౩) అంద్దుండి త్రిపురులచేత పూజగొన్న త్రిపురస్థలాలకున్ను పోయి స్వామి దర్శనం చేసి, (౪) అళగదుగుడ్కి వచ్చి, మీనాక్షిదేవి నిన్ని చొక్కనాధస్వామి నిన్ని త్రిసంధ్యంల యందున్ను సేవించ్చి కానుకలు వేసి అనేక భూషణములు సమర్పించ్చి, అమ్మవార్కి వజ్రాలకమ్మలున్ను వైడూర్యపు పతకములున్ను పచ్చల కమ్మలున్ను ముత్యపు ముక్కరానున్ను సమర్పించి, త్రిరాత్రుళ్ళుప వాసముసేసి, (౫) శ్రీవిల్లిపుత్తూరికి వచ్చి చూడుకొడుత్తునాచ్చార్యరు సహితముగా సంపెంగ్గి మన్నారుస్వామిని సేవించి తిరుముక్కు కెంపుల వొడ్యాణం బంగ్గారు నూపురములున్ను, నవరత్నకిలిత మైన సింహ్మముఖం ప్రభలున్ను సమర్పించి, గుంట తొవ్వించి, రాతికట్లానకున్ను నడిమి మంటపానకున్ను లక్షమాళ్ళు యిప్పించి, (౬) కరువ నల్లూరికి వచ్చి. . . ..".

కృష్ణరాయనికి మాల్యదాన కథ మనస్సుకు నచ్చింది. అందుచేత దానిని వ్రాసినాడు. అంతేకాని వీరవైష్ణవుడు కావడముచేత వ్రాయలేదు.

ఆముక్తమాల్యదలో వర్ణింపబడిన వైష్ణవమునకు వీరవైష్ణవ మని ఎందుకు పేరు పెడుతున్నారో తెలియదు. దానిని నిందించడానికై ఉంటుంది. పన్నిద్ద రాళ్వారులస్తుతిని వీరవైష్ణవులే చేయరు; వైష్ణవులందరున్ను చేస్తారు.

సిద్ధాంత విషయములలో వైష్ణవమునకున్ను, వీరవైష్ణవమునకున్ను భేదములేదు.

విష్ణుచిత్తు డజ్ఞాతకులశీలుడు కాదు. అతడు విప్రకులుడు.

"అనిన వడవడ వణఁకి సాష్టాంగ మెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు సుమ్మరింప
వినయ వినమిత గాత్రుఁడై విప్రవరుడు
వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె".

—2-89.

అనే పద్యమును నీలకఠశాస్త్రిగారే ఉదాహరించి, విష్ణుచిత్తు డజ్ఞాత కులుడని యెంద కన్నారో తెలియలేదు. అతడు చదువుకొనినవాడు కూడా కాడు. అతడు "ఉరు, చ్ఛందోబృందతదంత వాగపఠనా సంజాత తజ్జన్యని, ష్పందద్వైత సుసంవిదాలయుఁడు". అంటే, కష్టపడి చదువుకోనక్కర లేకుండనే అతనికి చక్కని జ్ఞానము కలిగినది. అతడు "అశ్రాంత యోగాందూ బద్ధమధుద్విష ద్విరదుఁడు". ప్రహ్లాదునివంటి వాడన్నమాట. కవి యిట్ల న్నాడని అతడు మూర్ఖుడు, గురుముఖతః ఏమీ చదువుకో లేదని నిందింప వచ్చునా ?

గోదాదేవి కూడా అజ్ఞాతకులశీల కాదు. ఆమె సత్యభామ అపరా వతారము: "........... ఎఱుక, యెదఁ గలిగెనేని యెఱిఁగింపుఁ డేను మొదల నెవ్వతె" నని ఆమె సఖుల నడుగగా,

"దివిజద్రు ప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి, చూపోవ, కిం
తవు జిల్లుంబని యంత సేసి, మది నీర్ష్యాక్రోధముల్ సందడిం
ప, విరింబోక, ద్రుమంబుఁ గైకొని, పతిఁ మందన్న మ్రానెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య వీ వహహా! కావా, భామినీ !....

అన్నారు.

ఇక మాలదాసరికి కైశికీరాగగానముచేత భగవదనుగ్రహము కలిగిన దంటే, శాస్త్రిగారికి ఓర్వలేమి ఎందుకో? మాలదాసరియే కాదు, అంతకు

తక్కువ జాతివాడయినా, కైశికీరాగాలాపనచేతనే కాదు, కూనురాగాలాపనచేతనయినా, నిజమయిన భగవత్ప్రవృత్తి గలవానికి తప్పకుండా భగవదనుగ్రహము కలుగుతుందని వైష్ణవ సంప్రదాయ ప్రసిద్ధము. కృష్ణుడు వాయక సుదాములననుగ్రహించలేదా? అబ్జనాభుడు కుబ్జకునోదము నీడేర్చలేదా? ఇవి శాస్త్రిగారికి కిష్టమే. మాలదాసరి ననుగ్రహిస్తేనేనా కోపము?

బ్రహ్మరాక్షసుని కథమూలముగా కవి బ్రాహ్మణనింద చేసినాడని శాస్త్రిగారి అపవాదము. ఎట్టి బ్రాహ్మణుని నిందచేసినాడో మాత్రము వా రెత్తుకొన్నారు కారు. చూడండి: శాస్త్రిగా రెట్టి బ్రాహ్మణుని పక్షమును వహించి, కృష్ణరాయని నిందించినారో:—

"ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్చండిమఁ జర్చగెల్తు ఘటశాసుల, శ్రౌతులఁ దప్పు పట్టుదున్
ఖండలముష్టి విప్పఁగని నవ్వుదు, వెండి ప్రయోక్తలన్ సుధీ
మండలి గ్రాంధికత్వ మవమానముసేయుదు జల్పవాదినై."

మదాంధుండనై - యల్పవిద్యాలబ్ధి.... అచ్చదువెఁ పరబ్రహ్మం బై, పెద్దలం జెనకి యోడియు సరియైతి ననియును, సరిపోయి జయించితి ననియు నబద్ధంబు లాడి, చిల్లరప్రభువులం భ్రమియించుచుండి, దీక్షితులం జూచి యియక పోడమి, ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోయి, యప్పురంబున—

"బహివడ్డ ద్విజున కల్పపుఁ బాచితం బిడి,
పసిఁడికై తా వాని బంతిఁ గుడివి...."

ఎంతటి అచ్చమైన బ్రాహ్మణుఁడు! ఇతనిని నిందించినందు కా శాస్త్రిగారి కంతటి యాగ్రహము? ఇందుకా కవి వీరవైష్ణవుడు కావడము!

మాలదాసరి మూలముగా ఈ బ్రాహ్మణబ్రువుడు భాగవతశ్రేష్ఠుడై బ్రాహ్మణశ్రేష్ఠుడై వెలసినాడు.

"స్నిగ్ధ త్రిభాగముండిత శిరశ్శిఖతోడ
హిమ ధవళోపవీతములతోడఁ
బుణ్యపద్వీత యోర్ధ్వ పుండ్రవల్లులతోడఁ

దులసికాబ్జ స్రగావళులతోడఁ
గోపీనకటి సూత్ర కాషాయ యుగితోడ
జలపూర్ణ శుభకమండలువుతోడఁ
బాణిస్థ దివ్యప్రబంధ సంపుటితోడ
నుత్తర వాక్పూర్వకోక్తితోడ

బసిఁడి జిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవత లక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలు నమ్మేను వెడలి, చూడఁ
జూడ వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ."

మాలదాసరి మూలముగా అతడు బ్రాహ్మణత్వము నొందినా డని మనము వగవ నక్కరలేదు. వాల్మీకి మూలముగా లోకము తరించలేదూ?

ఆముక్తమాల్యదలో ప్రతిపాదింపబడినది వీరవైష్ణవము కాదు; విశిష్టాద్వైత సిద్ధాంతము. అది శ్రుతి నిబద్ధము.

"విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖసంవిత్తత్త్వ బోధైకచుం
చుద్వైపాయన సూత్ర సచ్ఛ్రుతుల నీశుఁ ముసన్నిరూపించి, పైఁ
దద్విష్ణుత్వము, దాని కన్యదివిషద్వ్యావర్తనంబున్, విశి
ష్టాద్వైతంబును దేఁటగాఁ దెలుప మాటాడెం బ్రమాణంబులన్"

ఎవరు? విష్ణుచిత్తుఁడు, కృష్ణదేవరాయని నోట. ఇక నీ వీరవైష్ణవ వాదము మళ్ళీ లేవ దనుకుంటాను.

—భారతి

వృష, వైశాఖము. మే, 1941.
సంపుటము 18; సంచిక 5.

# మనుచరిత్రము-కుతపకాల ప్రశంస

--శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

స్వారోచిష మనుసంభవకారుఁడు మూలవిరుద్ధముగఁ దెచ్చిపెట్టిన మార్పులను గూర్చి మన గ్రంథవిమర్శన పద్ధతికారు* లేమి వ్రాసిరో కనుఁగొందము.

ప్రవరు నింటికి నౌషధసిద్ధుఁ డొకనాఁటి కుతపకాలమున వచ్చి పాదలేపమను మందును కాళ్ళకుఁ బూయఁగాఁ దత్ప్రభావముచే నాకాశగమనమునఁ దృటిలోఁ బ్రవరుఁడు హిమగిరి కేగి దాని రామణీయకమును జూచుచుండఁగా నచ్చట మధ్యాహ్న మైనదని పెద్దన చెప్పె; ఈ రెండును, (కుతపకాల మధ్యాహ్నకాల నిరూపణములు) ఈ కథకు మూలమగు మార్కండేయ పురాణమునందు లేవు, ఇవి యాంధ్రకవితా పితామహుఁడు తన గ్రంథములోఁ దెచ్చిపెట్టిన మార్పులు. ఈ మార్పు లోక పరస్పర వైరుధ్యమును గలిగించినది.

కథాసందర్భమును బట్టి చూడ సిద్ధుఁడు మందిచ్చిననాఁడే ప్రవరుఁడు హిమగిరి కేగినట్లు గాన్పించుచున్నది. కుతపకాలానంతరమున హిమగిరికి బయలు వెడలిన ప్రవరుఁడు హిమగిరియం దుండఁగా నాఁడే మధ్యాహ్నమగుట యసంభవ మగుచున్నది. కాన పెద్దన కుతపకాలానంతరమున మధ్యాహ్నమును వర్ణించి మూలకథను సందర్భ విరహితమునుగా నొనరించెనని యస్మదాదులము వ్రాసితిమి.

పెద్దనయం దభిమానము గలవార మనుకొనువా రీదోషము నైనను సాధువుగా మార్చి పెద్దనను సమర్థింపవలెనని విశేషయత్నము గావించి

---

* (వ్యాసము) 'గ్రంథవిమర్శన పద్ధతి'—శ్రీ కేతవరపు వెంకటశాస్త్రి.
ఆం. సా. ప. ప. 16-4, 5, 6.

యనవసర గ్రంథము నెంచుచున్నారు. ఎవరెన్ని వ్రాసినను దప్పు తప్పె యగునుగాని యొప్పెన్నటికిని గాదు సరికదా యొకదోషమును గప్పి పెట్టఁ బోయిన మఱికొన్ని దోషములు వచ్చిపడును. మనుచరిత్రము నందలి కుతపకాల విషయికదోష మొక్క ప్రమాదలేశము. ప్రమాదము లెంతటి వారికైన నుండవచ్చును. అంతమాత్రమునఁ గవులకుఁ గాని, గ్రంథములకుఁ గాని లోపమింతయు రానేరదు. ఆ యంశము నాలోచింపక పెద్ద నార్య పక్షావలంబుల మనుకొను వారు వృథాగా లేనిపోని సమర్థనములఁ గావించి దోషమును మఱింత పెద్దదానిని జేయుచున్నారు. ఈ సంగతులన్నియు నా యొనర్చిన విమర్శనమును జదువుకొనిన స్పష్టపడఁగలవు. ఇఁక మన వెంకట శాస్త్రిగారున్ననో తోడి మనుచరిత్రాభిమానులవలె నిందు దోషము లేదని తెలుపుటకు మాత్రమే ప్రయత్నము చేయక వారి నందఱిని మించి యిందు గుణవిశేషముగూడఁ గలదని చాటఁ జొచ్చిరి. ముందు వీరు చెప్పిన గుణవిశేషమేమో కనుగొందము.

పెద్దన కుతపకాల వర్ణన మేల చేసె? "అతిథి సత్కారార్హమగు కాల విశేషమును దెల్పుటకై పెద్దనకవి, మూలములో లేని కుతపకాలమును వర్ణించినాఁడు" అని మన వేంకటశాస్త్రిగారు, తేవప్పెరుమాళ్ళయ్యగారి గమనిక ననుసరించి లిఖించిరి, ఇది సరికాదు. కుతపకాల మనునది యతిథి సత్కారమునకై నియమింపఁబడిన కాలము కాదు. అయ్యది శ్రాద్ధమునకై నియమింపఁ బడిన కాలము. "కుతప ప్రథమేభాగే ఏకోద్దిష్ట ముపక్రమేత్" (కాలమాధవము). "ఆరభ్య కుతపే శ్రాద్ధం కుర్యా దారోహిణం బుధః" (గౌతముఁడు). "దివస స్యాష్టమే భాగే మన్దీభవతి భాస్కరః స కాలః కుతపో జ్ఞేయః పితౄణాం దత్త మక్షయమ్" (మత్స్యపురాణము). "త్రీణి శ్రాద్ధే ప్రశస్యన్తే దౌహిత్రః కుతప స్తిలాః" (మనువు). ఈ విధముగా పితృ శ్రాద్ధమునకుఁ గుతపకాలము ముఖ్యమని శాస్త్రములు బోధించుచున్నవి. అంతియేకాని యతిథిపూజ కావించుటకుఁ గుతపము తగుకాల మని తెలుపుట లేదు, అతిథిపూజ శ్రాద్ధము కాదు. అయ్యది మధ్యాహ్నమునకు ముందును గావింపవచ్చును. తరువాతను గావింపవచ్చును. సాయాహ్నమునను గావింప వచ్చును. పెక్కేల నడికిరే యయినను గావింపవచ్చును. "తస్య చ వైశ్వదేవ

బలేః ప్రాగేవ పూజ్యతా। పరత్ర ఆహారదాన మాత్రం" అని వాచస్పత్యము తెలుపుచున్నది. "వైశ్వదేవ ఉపస్థిత మితి దివసాభిప్రాయం" అని మాధవ విద్యారణ్య స్వాములవారు పరాశరమాధవీయములో వ్రాసిరి. కావున వైశ్వదేవకాలమునందు వచ్చువాడు మాత్రమే అతిథికాఁడు. "సాయ మాగతో ప్యతిథి ర్నప్రత్యాఖ్యేయః। సాయ మాగతోతిథి సూర్యోఢ ఇత్యుచ్యతే" (శబ్దార్థ సర్వస్వము). ఇట్టి ప్రమాణ వాక్యములఁ బట్టి అతిథి వైశ్వదేవమునకుఁ బూర్వమునందును రావచ్చును, బరము నందును రావచ్చును సాయాహ్నమునను రావచ్చునని తేలుచున్నది. మన పెద్దనార్యుఁడు ప్రవరుని భార్యను వర్ణించుచు "అతిథు లేతేర నడికి రేయైనఁ బెట్టు-వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ" అని చెప్పియున్నాఁడు. ఇంకఁ బ్రవరుఁ డెట్టివాఁడనః:— వైశ్వదేవాంతమున వీథిగుమ్మము కడకుఁ బోయి యతిథు లెవ్వరైనఁ గలరా యని తొంగి చూచువాఁడు మాత్రముఁగాడు. అతిథులు తన పురికి వచ్చుచున్నారని విని యెంత దూరమైన నెదురుగ నేగి తనయింటికిఁ దీసికొని వచ్చి వారి కాతిథ్య మిచ్చునని పెద్దన "తీర్థసంవాసు లేతెంచినారని విన్న నెదురుగా నేగుదవ్వెంత యైన, నేగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చు దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు" అను పదములలో వర్ణించె. దీని నంతను బట్టి చూడఁ బ్రవరునింటికి నతిథులు సరిగ భోజనకాలమునందే వత్తురని కుండ చెప్పుకొన నవసరము లేదు. ఇంకఁ గుతపకాలమున వత్తురని చెప్ప నవసరమేమున్నది ?

ఇతఁడు సిద్ధునకు నర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి పిమ్మట నిష్టమృష్టాన్న కలన సంతుష్టుఁ జేసినట్లు మనుచరిత్రయందు వర్ణింపఁ బడినది. వైశ్వదేవమునకుఁ బూర్వమునందు వచ్చిన యతిథికి మాత్రమే యర్ఘ్యపాద్యాది పూజను ముందును గాని తరువాత వచ్చినవాని కుండ నేరదు. తరువాత వచ్చిన వానికి భోజనము పెట్టుట మాత్రమే కావింప వలయునని వాచస్పత్యము చెప్పుచున్నది. కావున మనుచరిత్రమునందు నతిథిపూజ కూడ వర్ణింపఁ బడి యుండుటం జేసి సిద్ధుఁడు వైశ్వదేవమునకుఁ బూర్వమునందే ప్రవరునింటికి వచ్చెనని చెప్పవలసి యుండును. వీనినన్నిటినిబట్టి చూడ నతిథి కుతప కాలమునందు మాత్రమే గృహస్థుల యిండ్లకు రావలెనను విధి లేదనియు

నట్లు చెప్పుట యవసరము కాదనియు నంతకు ముందే వచ్చి యుండవలసి యుండుననియుఁ దేలుచున్నది.

కాఁబట్టి మూలములో లేని కుతపకాలమును పెద్దనార్యుఁ డనవసరముగాఁ దెచ్చిపెట్టెనని చెప్పక తప్పదు.

' వాద నిమిత్త మతిథి పూజార్థమగు కాలము కుతపకాల మనియు నందు మూలముచే సిద్ధుఁడు కుతపకాలమున వచ్చెనని పెద్దన్న వర్ణించెననియు భావింతము. అట్లు భావించినను దగువాఁడు గావింపఁబడిన మధ్యాహ్నకాల వర్ణనము సందర్భ విరోధము గల్గింపకపోదు. కాన నింక నీ వైరుధ్యమును వేంకటశాస్త్రిగా రెట్లు సమర్థించిరో బరీక్షించి చూచుకొందము.

మనుచరిత్రమునందలి కథావిధానముం బట్టి చూడ నొకనాఁడే కుతప కాలానంతరమున మధ్యాహ్నము సంప్రాప్త మయ్యెనను దోషమును నివారించుటకై మన వేంకటశాస్త్రిగారు కుతపకాలమున సిద్ధుఁడు వచ్చిన దినముఁ గాక మఱునాఁడుదయమునఁ బాదలేపమును బూయుటయుఁ బ్రవరుఁడు గిరి కేగుటయుఁ గలిగిన వనియుఁ, బెద్దన గావించిన మధ్యాహ్నవర్ణనము మఱునాఁటి దై యుండవలెననియు నొక యపూర్వ వాదమును దెచ్చి పెట్టిరి. తమ నూతన వాదమునకు బలము కలుగుటకై, మనుచరిత్రము నందలి పై సందర్భ విరోధముం గూర్చి పండితులకు భిన్నాభిప్రాయములు కలిగిన వని వ్రాసిరి కాని ఇది యంతగా సరికాదు. పెద్దన్నపక్ష మవలంబించిన పూర్వ విమర్శకులు కూడఁ బెద్దన్న చెప్పిన కథా సందర్భముం బట్టి చూడ మరునాఁడు ప్రవరుఁడు హిమగిరి కేగెననుట కంతగా నవకాశము గాన్పించుట లేదనియుఁ బెద్దన్న వ్రాఁతయం దేదో యొకలోప ముండి తీరెని దని యునే వ్రాసిరి.

కీ. శే. తేవప్పెరుమాళ్ళయ్య గారు మనుచరిత్రమును మాత్రమే పరిశీలించు నెడల సిద్ధుఁడు వచ్చిన నాఁడే ప్రవరుఁడు పాదలేపమును బూయించుకొని హిమగిరికేగె నని తలంపవలసి యుండు ననియు,నట్లు తలంచినఁ బరస్పర వైరుధ్యము మనుచరిత్రమునందుఁ గలదన వలయుఁ ననియుఁ దేల్చిరి. ఇంక

శ్రీమదెడ్లపాటి వేంకటసుబ్బారావు గారు సురుడు సిద్ధుఁడు వచ్చినాఁడు గాక మఱునాఁడు ప్రవరుఁడు గిరికేగెనని పెద్దనార్యుఁడు చెప్పకపోవుట తప్పు గావచ్చునని లిఖించిరి. అనఁగా వైరుధ్య మున్నదని యొకవిధముగా నొప్పుకొని తీరిరి. ఇఁక మన వేంకటశాస్త్రిగారి వాదమును స్వమతమువారే అంగీకరింపలేదని తెలుచున్నది కదా! స్వమతము వారగు శ్రీ బోడపాటి రాజన్న పంతులుగారు కూడ నీ సందర్భవిరోధమును మార్కండేయ పురాణోక్త కథాక్రమమునుబట్టి నివారింపఁ జూచిరే కాని మనుచరిత్రము నందలి కథా సందర్భమునుబట్టి నివారింప యత్నము చేయలేదు.

పెద్దనార్యుని మనుచరిత్రము నందలి కథాప్రచారము క్రమముగ నున్నదా లేదా యను విచారము మన కనవసరము కాని మార్కండేయ పురాణోక్త కథాక్రమము సరిగ నున్నదా లేదా యనునది మనకు విచార్యము కాదు. అది సరిగ నుండినను పెద్దన గ్రంథమునకు లాభములేదు. ఇఁక సిద్ధప్రవరుల గమనము విషయము నన్నెచో పెద్దనను సమర్థింపఁ జూచిన వారు గూడ మన వేంకటశాస్త్రిగారు తలంచినట్లుగాఁ దలంపలేకపోయిరి. ఎడ్లపాటి సుబ్బారావుగారు, పాదలేపమును బూని సిద్ధుఁడు మొదటి దినముననే యేగెననియుఁ బ్రవరుఁడు మాత్రము మఱునాఁడు హిమగిరి కేగెననియు మనుచరిత్రముం బట్టి బోధపడుచున్నదని వ్రాసిరి. తేవప్పెరుమాళ్లయ్య గారు కూడ సిద్ధుఁడు మొదటి దినముననె పాదలేపమును బూసెననియు, మఱునాఁడు మంచుమలకుఁ జనెననియుఁ జెప్పిరి. తమ పక్షము నవలంబింపక మనుచరిత్రముం బట్టి సందర్భ విరోధము కలదని రూఢిచేసిన పండితవరులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువా రన్ననో పాదలేపముఁ బూయుటయు సిద్ధప్రవరు లేగుటయు మొదటి దినముననే జరిగిన వని స్థిరపఱిచిరి. పండితవరు లిట్లు సిద్ధప్రవరుల పోకంగూర్చి భిన్నాభిప్రాయములు గలవా రగుటకుఁ గల కారణము గ్రంథము సరిగ లేకపోవుటయే.

ఇఁక నెడ్లపాటి వేంకట సుబ్బారావు పంతులు వారును, వారిని మించి మన పద్ధతికారులును మఱియొక లాగునఁ దలంచుటకుఁ గారణ మేమనఁగా — గ్రంథ మా భావమును గల్గించుట చేతఁ గాదు. మఱేమన్న దోషమును

నెట్లైన గప్పి పెట్టుటకు, పెద్దనాభిమానులు మొదటి దినమునఁ బాదలేపము ప్రవరుని కాళ్లకుఁ బూయఁబడినట్లును, మఱునాఁడు ప్రవరుఁడు హిమగిరి కేగినట్లును కుతపకాల మధ్యాహ్నకాలమై యుభ్యముఁ దొలిగించుటకై గ్రంథ మున లేని భావమును దెచ్చిపెట్టిరి. అట్లు చెప్పిన మఱియొక దోషము సంఘ టిల్లె. ప్రవరుఁడు కర్మిష్ఠుఁడు. తఱచుగాఁ బాద ప్రక్షాళనమును, స్నాన మును నొనరించువాఁడు; ఇట్టి వాని కాళ్ళకు వెనుకటి దినమునఁ బూసిన పసరు మరునాఁటి వఱకు నెట్లు నిల్చునను శంక చేసితిమి. ఈ శంక నుండి కూడ తప్పించుకొనుటకై మన వేంకటశాస్త్రిగారి టీవలఁ బాదలేపమును బూయుటయును బ్రవరుఁడును సిద్ధుఁడును వెడలిపోవుటయును, మఱునాఁడే జరిగినవని వ్రాసిరి. ఈ రీతిగా దోష సమర్థనమును జేయఁబోవుటలోఁ గలుగు చిక్కులనుండి తప్పించుకొనుటకై పెద్దన పక్షపాతులు ప్రవరుఁడు మఱునాఁడు హిమగిరి కేగెనని తలంచుస్థితికి వచ్చిరి. కాని కథాసందర్భ మట్టిభావమును దేల్చుచుండుట చేతఁ గాదు. శ్రీమదేఁల్లపాటి సుబ్బారావు గారు మఱునాఁ డేగెనని పెద్దన చెప్పక పోవుట ప్రమాదమే కావచ్చునని యంగీకరించియే యుండిరి కదా! మన వేంకట శాస్త్రిగారు మాత్రము కథా సందర్భముం బట్టి చూడఁ బాదలేపనమును బూయుట, సిద్ధప్రవరు లేగుట మఱునాఁడే జరిగియుండ వలెననియు నయ్యది గ్రంథ సందర్భముం బట్టియే స్ఫురించుచున్న దనియు లిఖించిరి.

పెద్దనకవి తాను జేసిన మధ్యాహ్నవర్ణనము సిద్ధుఁడు ప్రవరు నింటికి వచ్చిన నాఁటి దని తెల్పలే దనియుఁ గాన నయ్యది యానాఁటి దన నవరసము లే దనియు వేంకటశాస్త్రిగారు లిఖించిరి. ఇది సరి కాదు. ఒకనాఁటి కుతప కాలము నెత్తికొని కథ చెప్పుట ప్రారంభించి నపుడు నాఁటి సంగతులు తెలు పుటలోఁ బ్రతి సంగతియు నాఁడే జరిగినదని తెలుపుచుండ నవసరము లేదు. అట్లెవరును దెలుపరు. ఆ సంగతులలోఁ గొన్ని మఱునాటివైన యెడల మఱునాఁటి వని కవి తెలిపి తీరవలెను. అట్లు తెలుపుట కవుల సంప్రదా యము. కవి పాదలేపముఁ బూయుట మఱునాఁడు జరిగిన దని చెప్పక పోవుటచేత సిద్ధుఁడు వచ్చిన నాఁటిదే యని మనము భావింపవలెను. గాని యానాఁటిదని తెల్పలేదు కావున మఱునాఁటి దని మనము భావించుట

ధర్మముకాదు, సిద్ధుఁడు పగటిపూట ప్రవరు నింటికి వచ్చినట్లు మనుచరిత్ర మునఁ దెలుపఁబడి యున్నది. తరువాత మధ్యాహ్నవర్ణనమును దాని తరువాత సాయంకాల వర్ణనము గావింపఁ బడినది ఇంతవరకు జరిగిన వన్నియు నానాఁటి పగటిపూఁట జరిగినవే యనుకొనవలెను. పిమ్మట "ఉగ్ర సంధ్యాతప శోణమ్మృత్కలితమై........మార్తాండుండు దోఁచెన్ దివిన్" అను పద్యము వఱకు జరిగిన వన్నియు నాఁటి రాత్రిపూఁట జరిగినవిగా భావించు కొనవలెను. ఈ కాలమునకుఁ దరువాత జరిగిన వన్నియు మఱునాఁడు జరిగి నవిగా భావించుకొనవలెను. ఇది న్యాయమగు పద్ధతి. ఇట్లుండఁగాఁ బ్రవరుఁడును సిద్ధుడును ప్రవరు నింటనుండి తీర్థయాత్రలం గూర్చి కడపటి సంభాషణము గావించుకొనుటయుఁ, బాదలేపముఁ బ్రవరుని పాదములకుఁ బూయుటయు వా రుభయులును బైలు వెడలి యావలకుఁబోవుటయు మఱునాఁడు జరిగిన వనుట యసంగతము. ప్రసంగమధ్యమున (నాఁటి) సాయంకాల మగుట యటు తరువాత రాత్రి యగుట తటస్థించుట కలిగినచోఁ గవి వాని నా సందర్భమున వర్ణించియే యుండును. సిద్ధ ప్రవర ప్రసంగములలో నెంత వఱకైన తరువాత సాయంకాల మైనదో పిమ్మట నెంతవఱకైన తరువాత నుదయ మైనదో యెవరు చెప్పఁగలరు? అట్లు తెలుపుట కవకాశ మెక్కడ నున్నది? మన వేంకటశాస్త్రిగారు "మనుచరిత్రమునందలి యచ్చటి ఘట్టము చదివినచో వారు దీర్ఘ ప్రసంగము సలిపినట్లు తోఁచును. గాని కొన్ని మాట లాడి విరమించినట్లు తోఁపదు. కావున, వా రది ప్రసంగించుచుండగనే సాయంకాలము కావచ్చును" అని లిఖించిరి. వీరు తెలిపిన రీతిగాఁ బ్రసంగ మధ్యమున సాయంకాలమే యైయుండిన యెడలఁ గవి యాసంగతిని దెలిపియే యుండును. సాయంకాల వర్ణనము గావించియే యుండును. అట్లు వర్ణింప లేదు. కావునఁ బ్రసంగ మధ్యమున సాయంకాల మైన దని తలంచుట యనవ కాశము, మన వేంకటశాస్త్రిగారు సిద్ధ ప్రవరుల ప్రసంగ గమనికం గన నా ప్రసంగ మతిదీర్ఘమై రెండు మూఁడు పూఁటలు పట్టినట్లు తోఁచునని వ్రాసిరి. ఇది యసంగతము. ఇదివఱ కెవ్వరికిని నట్లు తోఁప లేదు. విమర్శకు లెల్లరును సిద్ధుఁడు నాఁడు వెళ్ళిపోయె ననియే తలంచిరి. అది యట్లుండ నప్పుడు సిద్ధప్రవరులు కావించిన ప్రసంగము పది నిముసముల కాలమో,

యట్లు గాకున్న నర గంటయో గంటయో జరుగవలసినదిగా నున్నది, గాని, యంతకన్న మించి జరుగవలసినదిగా లేదు. పదునెనిమిది యధ్యాయములు పట్టిన కృష్ణార్జున సంవాదము (భగవద్గీత) ఒక పూటలో నొక్కింత స్వల్ప కాలములో జరిగిపోయినట్టుగా భారతములోఁ దెలుపఁబడి యున్నది. అట్లుండఁగాఁ బది నిమిషములలోఁ బరిసమాప్తి నొందఁ దగిన సిద్ధప్రవర సంవాదమునకుఁ బెక్కులగు పూఁటలు పట్టెననుట యసంగతము కాదా? స్నానాదికములనకుఁ గొంత కాలమును, భోజనమునకుఁ గొంత కాలమును, ప్రసంగమునకుఁ గొంత కాలమును బట్టె నని చెప్ప నవసరము లేదు. అవి స్వల్పకాలములో జరిగిపోవునవి. ఇంక దేశాటన ప్రసంగ విషయమున నన్ననో, దేశములు తిరుగుటకుఁ జాలకాలము పట్టును గాని దేశము తిరిగి వచ్చుటను దెల్పుట కెంతో కాలము పట్టదు. పండ్రెండు గంటలు దాఁటిన పిమ్మట సిద్ధుఁడు ప్రవరు నింటికి వచ్చె ననినను 1½ గంటలకు హిమగిరికి వెళ్ళె నని చెప్పుకొనుట కే విధమగు సందియమును లేదు సిద్ధప్రవర ప్రసంగ మతి దీర్ఘముగా సాగినదని కాని యిట్ల నేక విషయముల గూర్చి వారు ప్రసంగించి రని కాని కవి యెచ్చటను దెల్పియుండ లేదు. సూచించి యైన నుండ లేదు. కావున గ్రంథము నందుఁ దెల్పఁబడి యున్న విషయముకంటె నెక్కుడుగఁ బ్రసంగము జరిగిన దనుట కవకాశము లేదు. సిద్ధప్రవరులు ప్రసంగించిన ప్రసంగము నంతను గవి విపులముగా వర్ణించి చెప్పినాఁడు. మనుచరిత్ర మందలి కథాభివర్ణనముంబట్టి చూడఁ గవి యింతలంతలు చేసి వర్ణంచి చెప్పి నట్లున్నది. కాని, తగ్గించి చెప్పినట్లు లేదు. మన వేంకటశాస్త్రిగారు పెద్దన గావించిన మధ్యాహ్న వర్ణనమును మఱునాఁడు జరిగిన దానినిగాఁ జేయుటకై యొకగంటలోపల జరిగిపోయిన చర్యను నతిదీర్ఘమైన దానినిగా భావించి మఱునాఁటివఱకు సాగింప నెంచిరి. ఇది సమంజస మెట్లు కాఁగలదు?

అయినను వేంకటశాస్త్రిగారు తెలిపినరీతిగా మధ్యాహ్నము మఱునాఁడే సంభవించె నందము. దీని తరువాతఁ దటస్థించిన సాయంకాల మా మఱునాఁటిదే యని మన వేంకటశాస్త్రిగారు లిఖించిరి. మన శాస్త్రి గారి వాదగమనిక ననుసరించి చూచిన, పెద్దన వర్ణంచిన సాయంకాల మా

నాఁటి దని తెలుపుట కవకాశము గలుగుట లేదు. ఏమన నాఁటి మధ్యాహ్నమునఁ బాదలేపము గరఁగి పోయినట్లు ప్రవరుఁడు తెలిసికొనినాఁడు, పిమ్మటఁ గొంత సేపటి వఱకు, నదలక యొక్కచో నిలిచి విచారించినాఁడు. విచారించి పర్వతముపైఁ దిరిగి తిరిగి యొకలోయం గని దానిలో మెల్లఁగఁ బ్రవేశించి యచటి మేడలను జాడలను జూచి చూచి యటు పిమ్మట నొక వనములోఁ బ్రవేశించి యందు వరూధినిని గాంచి యామెతోఁ బ్రసంగించెను. ఈ ప్రసంగము ప్రారంభించు నప్పటి కాదినాపరార్ధములోఁ జాలభాగము గడచి యుండును. పిమ్మట వరూధినీ ప్రవరులకు జరిగిన ప్రసంగము సిద్ధప్రవర ప్రసంగము కంటెఁ జాలఁ బెద్దది. ఇందులకై 3, 4 పూఁటలు పట్టి యుండును. ఆ ప్రసంగ మైపోయిన తరువాత ప్రవరుఁ డేటికిఁ బోయి వార్చి యగ్ని దేవుని కరుణచే నంతరేతు సమయంబున నింటికిఁ బోయె. అతఁడు చనినపిమ్మట వరూధిని యరణ్యమునం దంతటను వానికై తిరిగి తిరిగి చెలులం గూడి యింటికి వచ్చి కానక చాలకాలము పరితపించె.

మన వేంకటశాస్త్రీగారు వేసిన లెక్కనుబట్టి చూచిన నిది యంతయు జరుగు నప్పటికి రెండు దినముల కాలమునకుఁ దక్కువ పట్టదు. అయినను మన వేంకట శాస్త్రిగారు ప్రవరుఁడు గిరి కేగిన పూఁటనే, నాఁటి సాయంకాల మగుటకుఁ బూర్వమే యిది యంతయు జరిగినట్లు భావించిరి. ఇది యెట్లు సంభవ మగును? సంభవము కానేరదు. కాఁబట్టి మన వేంకట శాస్త్రి గారి లెక్క తప్పు. తక్కువది యగు సిద్ధ ప్రవర సంవాదమునకు నెక్కువ కాలము పట్టిన దనియును నెక్కువది యగు ప్రవరవరూధినీ సంవాదమునకుఁ దక్కువకాలము పట్టిన దనియును వేంకటశాస్త్రిగారు తలచిరి. ఇది యసంగతము. ప్రవరుఁడు గిరి కేగిన తరువాత నచటఁ బెద్దనచే మధ్యాహ్న కాల వర్ణనమే పెట్టఁబడకుండిన సిద్ధప్రవర సంవాద మంతయు నొక్క పూఁటలో జరిగిన దానిం గానే మన వేంకటశాస్త్రిగారును భావించి యుందురు. సందర్భవిరుద్ధముగా వచ్చిపడిన కుతపకాలానంతరమున నగు మధ్యాహ్న వర్ణనమును సమర్థింప శ్రీ శాస్త్రిగారివంటి వారు ప్రయత్నించుటచే విరుద్ధాంశము లనేకములు బయలువెడలఁ జొచ్చినవి.

మొదటి దినముననే భోజనానంతరమునఁ బ్రవరుఁడు గిరి కేగెనని తలంపక శ్రీ వేంకటశాస్త్రిగారు తలంచిన రీతిగా మఱునాఁటి యుదయమున బయలువెడలి యాతఁడు గిరి కేగె ననుచో మఱియొక యసందర్భ విషయము ఘటస్దించుచున్నది. ప్రవరుఁడు కర్మఠుఁడు. ఇట్టివాఁడు పావనమైన వియన్నదిలోనను నగపు పుణ్యక్షేత్రములు గల హిమగిరికి నుదయముననే యేగి యున్నచో నాదీర్ఘములలోఁ గ్రుంకు లిడియే యుండును. కాని, ప్రవరుఁ డట్లు పుణ్యనదీ స్నానము చేసినట్లుగా మనుచరిత్రకారుఁడు చెప్పియుండ లేదు. ఎందుచేత ననఁగా నా ప్రవరుని మన పెద్దన భోజనానంతరమున హిమగిరికిఁ దీసికొని పోయెను గావుననే. దీనిఁబట్టి ప్రవరాఖ్యుఁడు మొదటి నాఁటి మధ్యాహ్నమే మంచుమలకుఁ బోయెను గాని మఱునాఁటి యుదయమునఁ గాదని తేలుచున్నది.

మఱియును మఱునాఁటి యుదయమునఁ గూడా ప్రవరుఁడు గిరి కేగి యుండ వచ్చునని వేంకటశాస్త్రిగా రూహింతు మనిరి. శ్రీ శాస్త్రిగారు ప్రవరుఁడు కర్మఠుఁడనియు నమిత మగు కర్మశ్రద్ధ గల వాఁడనియు నంగీకరించిరి. ఇట్టివానికి నుదయకాలమున స్నాన సంధ్యాద్యనుష్ఠానములు, జపతపములు, హోమాదికములు, నతిథి బూజాదికములు, దేవతార్చ నాదికములును మెండుగ నుండును. కావున మొదటి దినార్ధము నందుఁ బ్రకృతి విశేషములఁ జూచుటకై పోవుట కవకాశము లేదు. ఇది యనుభవముచే నందఱు నెఱిఁగి యున్న విషయమే. కావుననే పెద్దనార్యుఁడు గిరి కేగుటకు భోజనానంతరమునఁ బెట్టినాఁడు. అది సర్వవిధముల సమంజసముగ నున్నది. మొదటి దినార్ధమునఁ బ్రవరుని వంటి కర్మశ్రద్ధ కలవాఁడు ప్రకృతి వైభవమును జూచుటకై యిల్లు విడిచి దవ్వుల కేగుట యసమంజసము.

ఇంత యేల? మన వేంకటశాస్త్రిగారు తలంచిన రీతిగాఁ బ్రసంగము మఱునాఁటి వఱకును జరిగియున్న యెడల నా యంశమును గవి స్పష్టముగాఁ జెప్పియుండవలెను. అట్లు చెప్పకపోవుట తప్పు. చెప్పఁదగిన దానిఁ జెప్పకుండుట చెప్పఁ దగని దానిఁ జెప్పుట తప్పయి తీరును.

వేంకటశాస్త్రిగారు "గ్రంథమునఁ జదువరు లూహించు కొనఁదగిన యంశములు పెక్కు లుండును గదా" అని లిఖించిరి. ఇది చదువరుల

యూహకు విడిచి పెట్టఁ దగిన యంశము కాదు. ఏమనఁ గవి యొక దినమును, సందులో నొక కాలమును నిర్దేశించి కథ వర్ణించుటకుఁ బ్రారంభించినాఁడు. కావున నాఁటి కథను మించి చెప్పునప్పు డద్దానినిఁ గూడ నిర్దేశింపవలయును. అట్లు చేయకుండుట తప్పు.

ఏ విషయమునఁ జూచినను గవి యందుఁ దప్పు లేదనుట కవకాశము గాన్పించుట లేదు. ప్రమాదములను గప్పఁబోయి యస్వాభావికములు లైన లేనిపోని కల్పనముల నన్నింటిని చేసి యూహలపై నాకాశహర్మ్యముల నిర్మించుట కంటెఁ బ్రమాదములను న్యాయదృష్టితో నంగీకరించుటయే మేలని వేంకటశాస్త్రి గారికి విన్నవించుచున్నాఁడను.

—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
విభవ - మార్గశీర్ష పుష్యములు (1929)
సంపుటము 17; సంచిక 5.

# పాత్ర చిత్రణము - పెద్దన తిమ్మనలు

డాక్టర్ కె. వి. ఆర్. నరసింహము

మహాకవి ప్రతిభఁ గల ముఖ్య లక్షణములలో నొకటి పాత్ర నిర్మాణ కౌశలము. సజీవపాత్ర నిర్మాణకౌశలము సామాన్య కవు లందఱకు నందు బాటులో నుండునది కాదు. పురాణకవులకును ప్రబంధ కవులకును గల ముఖ్యభేద మీపాత్ర నిర్మాణనైపుణియందే కాననగును. పురాణకవులు సాధారణముగాఁ బాత్రల యింగితాకార చేష్టాదులను వ్యక్తము సేయుటలోఁ దటస్థభావమును వహింతురు. కథా కథనము - ధర్మస్థాపనము మొదలగు విషయములే వారి కాదరణీయములై యుండును. ఈ రెండిటికిని సామరస్యమును గుదిర్చిన తిక్కనవంటి మహాకవులు కొలఁదిమంది మంది మాత్రమే కలరు. అట్టియెడ నమ్మహాకవులును ప్రబంధ ధోరణి ననుసరించి రనియే చెప్పనొప్పును.

సజీవపాత్ర నిర్మాణ మనఁగా నేమి? పాత్రలు కొఱడుపాటి కొయ్య బొమ్మలవలె నుండక చైతన్యసహితములై యుండవలెను. సచేతనత్వమునకు ముఖ్యలక్షణము వైవిధ్యము. అనఁగానే రెండు పాత్రలు నొక తీరుగ నుండకుండుట. ప్రపంచమున మనుజుని బోలిన మనుజు లున్నను నన్ని లక్షణములయందును వారికి నేకీభావ ముండుట దుర్లభము. ఎద్దియైనను వైలక్షణ్యము వారియందు గోచరించియే తీరును. బాహ్యజగత్తు కావ్యజగత్తునందుఁ బ్రతిబింబించును గాన విశ్వనిర్మాతయగు బ్రహ్మకుఁ గావ్యనిర్మాత యగు కవి ప్రతిద్వంద్వి యగుచున్నాఁడు, కావున బ్రహ్మసృష్టియందుఁ గన్పట్టు వైవిధ్యము కవిబ్రహ్మ సృష్టియందును గన్పట్టవలయును. "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః" అను నాలంకారిక వచన మీ విషయమునే బోధించుచున్నది. ఈ వైవిధ్యమే లేకున్నచోఁ బాత్రలు నిశ్చేతనములై పోఁతఁబోసిన బొమ్మలవగిది నుండును. అట్టి పాత్ర నిర్మాణము మహాకవి ప్రతిభకుఁ దార్కాణము కాదు.

సజీవపాత్ర నిర్మాణకౌశలము ప్రబంధకవు లందఱకును గలదని చెప్పఁ జాలము. గతానుగతికముగా రచించిన కవులనేకులు గలరు. కాని సజీవపాత్ర నిర్మాణము నద్వితీయముగా నిర్వహించిన మహాకవులును గలరు. అట్టి వారిలో నొక్కఁ డల్లసాని పెద్దనామాత్యుఁడు.

పెద్దనామాత్యుని మనుచరిత్రము శాంత శృంగారములు సంగమించిన తీర్థ మని చెప్పవచ్చును. సహజశృంగార ప్రియమైన చిత్తము శాంతోన్ముఖ మైనపుడు రచింపఁబడిన గ్రంథ మిది యని యిందలి ప్రతి పద్యమును జెప్పక చెప్పుచున్నది. మహాకవి పోతన భక్తి శృంగారములను జోడించెను. పెద్ద నార్యుఁడు శాంత శృంగారములను నేర్పుతోఁ గలిపెను. ఈ గ్రంథమున మొదటి మూఁడాశ్వాసముల యందును నద్వితీయ శిల్ప సామర్థ్యము చూపఁ బడినది. అయ్యెడఁ దాండవించు రెండు పాత్రములును (ప్రవరుఁడు, వరూధిని) పెద్దనగారి పాత్రనిర్మాణ సిద్ధికి సంభాషణ చాతుర్యమునకు, బుద్ధివిన్యాసమునకు, విరోధిరసముల సంఘర్షణకు లక్ష్యభూతములుగా నున్నవి. అట్టి శక్తితో సృజించిన పాత్రలు కావుననే ప్రవరుడు వరూధినియు నేఁటికిని సజీవులై యున్నట్లు భావుకుల మనోనయనములకు గోచరించు చున్నారు. జితేంద్రియత్వమునకు శుకమహర్షిని బేర్కొనుట మాని యాంధ్రులు మనుచరిత్ర పుట్టిన దాదిగాఁ బ్రవరునిఁ జెప్పుకొనుచున్నారు. అట్లే వలపుఁ బ్రయోగమునకు రంభను మఱచి వరూధినిని బేర్కొను చున్నారు. ఈ పాత్రముల సజీవతకును నాంధ్రుల మనః ప్రపంచమున నవి కల్పించిన పరివర్తనమునకును నిదియే తార్కాణము. తిక్కన సృజించిన భారతపురుషులకుఁ బిమ్మట నాంధ్రులతో నింత సన్నిహితత్వము గల పాత్ర సృజించిన మహాకవి లేనేలేఁడు. ఈ నిర్మాణమున కావశ్యకమైన తత్తత్పాత్రల యింగిత పరిజ్ఞానమును దదుచితమైన సంవాద సరణియు నాటకీయమైన తటస్థ పద్ధతియుఁ గృతహస్తుఁడైన పెద్దనకుఁ జక్కఁగా నలవడినవి. ఈ రెండు పాత్రలును గేవల విరుద్ధములైన రెండురసముల నాశ్రయించి యున్నవి. కవి యా రెంటియందును నే దెసకును మ్రొగ్గక, యిరువంకలను సమదృష్టినే పెట్టి యా రెండు రసములను సమానగాంభీర్యము గల ప్రవాహ ములుగనే నడిపెను. మనుచరిత్రమును జదివిన వారెవ్వరును వేశ్యయని

గాని, శ్రోత్రియునకు వ్రతభంగము చేయనెంచిన వలపుకత్తెయని కాని వరూధినిని నిరసింపరు. మీదు మిక్కిలి యామె యనురాగము విఫలమైనదని చింతించెదరు. అట్లయ్యు నామెవలలోఁ బడక ధీరుఁడై తప్పించుకొనిన ప్రవరుని దలంచి భక్తిపూర్వక నమస్కారమును గావింతురు. ఇది కవిలోని సమభావమునకు ఫలము. ఉత్తరార్ధమునఁ బద్యరచనా సౌందర్యముఁ కథాకథన చాతుర్యము నున్నను నిగరగుణములు కలవే కాని పాత్ర చిత్రణ మని చెప్పఁ దగినది లేదు. ఆకథా భాగమును నట్టిది కోరదు.

అద్వితీయ సౌందర్యమునకును, నమేయ వైరాగ్యమునకును నాటపట్టైనవాఁడు ప్రవరుఁడు. వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుఁడనియు ననారతాధ్యాపన తత్పరుఁ డనియు నాతఁడు కవిచే వర్ణింపఁబడినాఁడు. 'వాని చక్కదనము వైరాగ్యమునఁ జేసి. కాంతు నేఁయు జారకామినులకుఁ, బూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకుఁ బోలె, భోగబాహ్య మయ్యె' నని కవియే మెలమెల్లగ సచించి మున్ముందు జరుగనున్న కథాప్రణాళికకు బీజావాపము గావించినాఁడు. ప్రాతః కాలముననే వామనస్తుతి పఠన్యమున లేచి వరణాతరంగిణియం దఘమర్షణ మంత్రములు పఠించుచు మున్కలిడుట - సంధ్యా ద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని సమిత్కుశకుసుమ ఫలాదులను గొని బ్రహ్మచారులు వెంటనంటి వచ్చుచుండఁగా గృహంబునకు మరలుట, - నిత్యాగ్నిహోత్రమును, నిరతాన్న ప్రదానమును గావించుట - ప్రవరునకు దినకృత్యములు. ప్రవరుఁ డప్రతిగ్రహీత. కులశీల శమదమాదుల యందుఁ బతి యనుగుజాడలనే నడచునది యాతని యిల్లాలు. అర్ధరాత్రంబున నతిథు లేతెంచినను వలయు భోజ్యములామె యప్పాటిగాఁగ వడ్డించునఁట. ఎల్ల వేళలయందును నతిథిసేవాతత్పరుఁడై యున్న ప్రవరునింటి కొకనాఁ డొక సిద్ధుఁడు వచ్చి తీర్థయాత్రాచరణమునం దాసక్తుఁడై యున్న ప్రవరుని పాదములకు సిద్ధౌషధమొకదానినిం బూసి, యథేచ్ఛఁ జనినాఁడు. ఆ యౌషధ ప్రభావమునఁ బ్రవరుఁడు హిమవన్నగమున కేగినాఁడు. చూడవలసిన తావు లన్నియుఁ జూచియింటి కేగ నుద్దేశింపఁగా సిద్ధుఁ డొసఁగిన పాదలేపనము కరఁగిపోయినది. విచారపరీత చేతస్కుఁడైన ప్రవరుఁడు విధివశమున వరూధిని యను స్వర్వేశ్య

వసించియున్న స్థలమున కేగెను. ఇట వరూధినీ వర్ణన మత్యద్భుతముగాఁ గావింపఁబడినది. అద్వితీయ రూపలావణ్య యగు నయ్యచ్చర లేమ మకరాంక కళశాంక మనోజ్ఞమూర్తియగు ప్రవరుని నేకాంతమునఁ జూచినంతనే కామించినది. మహీసురాన్వయం బెక్కడ నీ తనూవిభవ మెక్కడ నను నాశ్చర్య మామెకుఁ గలిగినది. నునుసిగ్గు దొంతరలు క్రమ్ముకొని రాగా నొక్క పోకనునుబోదియఁ జేరి విలోకన ప్రభావీచికలఁ దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పినది.

ప్రవరుఁడు వరూధినిని సమీపించినాఁడు. మదనవేదనకు లోనయి యుత్తర పాటుతోడ తన త్రోవ కడ్డముగా నిలిచిన యయ్యంగనామణిని జూచి విభ్రాంతుఁడై యాతఁ డిట్లు పల్కినాఁడు :

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ ! యొంటిఁ జరించె దోట లే
కివ్వన భూమి భూసురుఁడ, నేఁ బ్రవరాఖ్యుఁడఁ; ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నీ నగాగ్రమునకుం జనుదెంచి, పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగదవే తెరు వెద్ది? శుభంబు నీ కగున్"

ఇది ప్రవరుని తొలిపలుకు. ఒంటిగా నివ్వనభూమిఁ జరించు నీ వెవ్వతె వని యాతని ప్రశ్న. నేను బ్రాహ్మణుఁడను. క్రొవ్వి యున్నగాగ్రమునకుఁ జనుదెంచి త్రోవ తప్పితిని. తెరు వెఱిగింపు మని ప్రార్థన. శుభంబు నీ కగు నని యాశీర్వాదము.

ఈ పద్యమున శుద్ధశ్రోత్రియునకుఁ గల నిరాడంబర చిత్తవృత్తియు, నిష్కల్మష మైన వాగ్ధోరణియు నతిమనోజ్ఞముగాఁ జిత్రింపఁబడినది. క్రొవ్వి యున్నగాగ్రమున కేతెంచితి నని తన్నుఁదాను నిందించుకొనుటయు శుద్ధ శ్రోత్రియ లక్షణమే. నిష్కపట మైన యీ ధోరణి నాలించి నిలింప వేశ్యయు నొక్కింత నవ్వినర్మ గర్భముగా నిట్లు ప్రత్యుత్తర మిచ్చినది.

"ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా

గింతియకాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచూప్పు; నీ
కింత భయంబు లేకడుగ న్గ్లిద మైతిమి మాట లేటికిన్"

శుద్ధ సత్త్వమూర్తి యగు ప్రవరున కీ సమాధానమునందలి యంత రార్థము గోచరింప లేదు. నీ వెవ్వతె వన్న ప్రశ్నకు సమాధానముగా వరూధిని యీ క్రింది ప్రత్యుత్తర మిచ్చినది.

"చిన్ని వెన్నెల గందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు;
రహిపుట్ట జంత్రగాత్రముల రాల్గరఁగించు
విమల గాంధర్వంబు విద్య మాకు;
ననవిల్తు శాస్త్రంబు మినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినది మాకు;
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకుఁ;

గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చరా చట్టుగమి రచ్చపట్టు మాకుఁ;
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర!"

ఈ యుపన్యాస మంతయుఁ దెరు వెఱుంగక, పరితపించుచున్న ప్రవరునకు వ్యర్థప్రలాపమువలెఁ దోఁచినది. కుందనమువంటి మేను మధ్యందిన మార్తాండాహతి గందిపోయెనే యని వాపోవుచు నస్మద్ గృహము పావనము చేసి బడలిక వాయఁగాఁజను మనిన వరూధినికి భక్తియ చాలును, నగర మార్గముఁజూపి పుణ్యమునఁ బొమ్మని ప్రవరుఁడు సమాధాన మిచ్చినాఁడు.

"భూసుర కైతవ కుసుమ శరాసన" యని వరూధిని చేసిన సంబోధనము నందలి భావము ప్రవరునకు రుచింప లేదు. నీవు చేసిన సపర్యలు మాకు వచ్చె. నిందుండఁగరాదు. పోవలయు నూరికి; నిప్పుడేను రాకుండ

నాకొండుమచ్చి మఱియొండునె, భక్తియ చాలు" నని మాయలేని మాటలు పల్కి గుణంపు నాయకుని దీనుఁడై ప్రార్థించినాఁడు.

> "ఏవిధి నిల్లు సేరుటకు నెద్ది యుపాయము? మీ మహత్త్వముల్
> పావనివి: వేద్యముల్; మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యముల్
> గావఁట; నాకు దల్లి! ప్రకటమ్మను గూర్పు మటన్న లేఁత న
> వ్వానన సీమఁ దోఁచ నవలా యవలోచన వాని కిట్లనున్."

ఈ సందర్భమునందుఁ బ్రవరుని యమాయకత్వమును నాతురతయుఁ బ్రస్ఫుటములై యున్నవి. "తల్లి" యన్న సంబుద్ధి వరూధినికి వజ్రపుఁబోటువలె నుండి యుండును, ఈ యమాయకునితో సరోక్తులాడుట వలనఁ బ్రయోజనము లేదని తెలిసికొని "నిక్కమును దాఁచనేల ధరణీసురనందన! యింక నీయెడ యింపు సిక్కె మనంబు నాకు" అని స్పష్టముగాఁ దనకోర్కె నెఱింగించినది. "....వ్రతులై దినములు గడపెడు విప్రులఁ జనునె కామింప మది విచారము వలదే" అని యా బ్రాహ్మణుఁ డామెకోర్కెను నిరసించి పల్కినాఁడు. ఇఁక యుక్తులపై యుక్తులు ప్రబలినవి.

"... కుంభగత ప్రదీప కళికాశ్రీ దోఁప నెందెందుఁబోకెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ 'మానందో బ్రహ్మ' యటన్న ప్రాఁజదువు నంత దృష్టి నూహింపుమా! "యని యామె కుతర్కమును గావింపఁగాఁ బ్రవరుఁడు సిగ్గును, వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు నొక చిఱునవ్వు నవ్వినాఁడఁట! ఈ యొక్క మాటలోఁ బ్రవరుని యంతర్మూర్తిని బ్రత్యక్షము గావించినాఁడు పెద్దన. "ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యొందేఁ గంటిమే" యని తిరస్కరించి. "యింక నేలా తర్కములు" అని యుదాసీనుఁడైనాఁడు ప్రవరుఁడు. "చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్" అని తుదిమాట నిష్కర్షగాఁ జెప్పినాఁడు "నా కరణముల్ దర్భలు నగ్నులున్ బ్రియములై నట్టన్యముల్ గావు "అని తన యైహికేచ్ఛా విముఖత్వమును బ్రవరుఁడు ప్రస్ఫుటముఁ గావించినాఁడు.

ఇట్లు స్థిరనిశ్చయుఁడై యున్న బ్రాహ్మణునిపైఁ, దన శృంగారాస్త్రము లేవియుఁ బనిచేయ లేవని వరూధిని గ్రహించినది. ఇంక నొక్క

యస్త్రముమాత్రమే మిగిలియున్నది. 'అనునయాలాపాతి దీనాస్యయై వెతలం బెట్టకు మింక నన్ననుచు నీవిబంధ మూడ' గౌఁగిలించినది. కాని యాయ స్త్రము గూడ నీఁట నిష్ప్రయోజనమేయైనది. "హా! శ్రీ హరీ! యని బ్రాహ్మణుఁ డోరమో మిడి తదీయాంసద్వయం బంటి పొమ్మంచుం" ద్రోచి నాఁడు. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్!" అని కవి యొక నిట్టూర్పు విడిచినాఁడు. అట్లు త్రోపువడి వరూధిని ఘనలజ్జా పరవశయైనది." వేదన నెపం బిడి కలస్వనంబున నేడ్చినది. పరాశరాదుల కామకేళీ పరతం. త్రత్వము నుదాహరించి, వారికంటె నీ మహాత్వంబు ఘనమే? యని వాదిం చినది. కాని, ఏమిప్రయోజనము? ప్రవరుఁ డిట్టి మాటలకుఁ బ్రత్యుత్తరము లిచ్చు వాఁడు కాఁడు. మీదు మిక్కిలి యవ్వనజగంధి మేని జవ్వాదిపస గదంబించు నొడలు కడిగికొని, వార్చి, ప్రవరుఁడు పరిశుద్ధుఁ డైనాఁడఁట ఇట్టిది కదా నిగ్రహము!

మనుచరిత్ర మందలి పాత్రనిర్మాణ కౌశల మంతయు నీ రెండు పాత్రల నాశ్రయించియే యున్నది. తృతీయాశ్వాసము నందలి వరూధిని చరిత్రము కడుంగడు విషాద పూరితము. ఆమె జవ్వన మడవిఁ గాచిన వెన్నెల యైనది. తన యమర్త్య భావమే తనకు రోతగాఁ దోచినది. హితుఁ డవజ్ఞ చేసినంతనే కాయము పాయఁగల మర్త్యభామినులెంత తపముచేసి జనియించిరో యని యామె నిట్టూర్పులు నిగిడ్చినది. ఈ వలపు పిచ్చిలో మాయాప్రవరుని మాయలకు లోనైనది. స్వారోచిషమను సంభ వమున కాదికారణ మైన యయ్యచ్చర పేరైనను దృతీయాశ్వాసానంతరము స్మరింపఁ బడకుండుట మఱియు శోచనీయ మైన విషయము. ఇంతకును వరూధిని వృత్తాంతము విషాదరేఖా శబలితము.

పెద్దన తన గ్రంథమునందంతటను బురుషుని యౌన్నత్యమునే చూపి, యాఁడుదాని ననదగా నిరూపించి, యామె పురుషునిఁ బ్రేమభిక్ష వేఁడు చున్నట్లు చిత్రించినాఁడు. ఈ విషయమున నీతనికిఁ బ్రతిద్వంద్వియై నిలిచి నాఁడు ముక్కు తిమ్మన మహాకవి. ఈతఁడు సృజించిన పాత్ర ఖండిత నాయిక యగు సత్యభామ. ప్రవరుఁడు వలపులకాఁణాచి యగువరూధినిని

బొమ్మంచు తిరస్కరించినాఁడు. సత్యభామ "లతాంతా యుధుఁ గన్న తండ్రి శిరసును వామపాదమునఁ దొలఁగఁ ద్రోచినది. మను చరిత్రమునఁ బురుషునకు జయము సంభవించినది. ఇఁట స్త్రీలోకము విజయ దుందుభి మ్రోగించినది. మహాకవి తిమ్మనార్యుఁడు మానక్రోధ వివశయైన సత్యభామ నొక యాటబొమ్మ వోలె నాడించినాఁడు.

మనము తొలుదొల్త సత్యభామను నగరిపొంత నొక శృంగార వనములో దర్శింతుము. దిద్ది తీర్చిన పూఁదేనియ యేటికాలువ దరినిఁ జెంగల్వ పుప్పొళ్ళు నించిన చంద్రోపలవేదిపై నాయమ తన చెలిమి కత్తియతో సరసగోష్ఠిం దేలుచు వనజాతాయతనేత్రుఁ డైన శౌరిగుణములను వర్ణించుచు గాలయాపనము చేయుచుండును. కాలయాపనము చేయుచున్న దే కాని సత్యభామ బుద్ధి మాత్రము సంశయగ్రస్తమైయున్నది. "అళికులా రావములు" గాని, "కిసలయాకుల కోకిలకాకు కాకలీ కలకల నాదములు" గాని, యాయమ మనంబున కింపు నింప లేదు. కమ్మని తమ్మి కొలంకుల నుండి వీతెంచు తెమ్మెరలును నాహ్లాదజనకములు కాకుండెను. కారణ మేమి? అంతలోనే దక్షిణాంస మాచుకనయన ప్రకంపములు సంభవించినవి. అమ్మానవతి హృదయమును నీ యపశకునములచే సంశయాకులిత మైనది. కాని, తనకుఁ గలుగఁ బోవు మహాపద యెట్టిదై యుండునో యామె నిర్ణయింప లేకుండెను. ప్రాణనాథుఁ డొండొక చపలాక్షినిఁ గూడి తన్ను నొల్లని చెయిదము లేమియైనఁ జేసి యుండునేమో యని యామెకు సంశయ ముదయించినది. ఇంతకంటె మహాపద యయ్యిందువదన కుండదు కదా!

ఇంతలోనే నెచ్చెలి వచ్చినది. కనుఁగవ నెఱసంజ వాడమగాఁ బారిజాత ప్రసూన వృత్తాంత మంతయుఁ జెప్పినది. అమరైక యోగ్యము నతి సౌకర్యము ననితర సులభము నైన యాదివ్య కుసుమమును వెన్నుఁడు రుక్మిణి కొసఁగినాఁ డనియు, నామె యాకుసుమమును గొప్పులోఁ దాల్చుటయే తడవుగా సానబట్టిన మకరాంకు శస్త్రముగతిఁ దేజరిల్లిన దనియు, నాకుసుమ ధారణమువలన నామెకు మహామహిమ వచ్చుటచే గద్దియమీఁద నెక్కి ముల్లోకములు దానె యేలుగతి నున్న దనియుఁ దోడి కామినీ

లోకము మచ్చరంబు మదిలోనఁ దొలంగి యామెను భయభక్తులతో భజించు చున్నారనియు నా వాక్యముల సారాంశము. ఇంతయే కాక సత్యభామకుఁ గోప మతిశయించుటకై యీ క్రిందిరీతి నా చెలికత్తియ వచించినది.

''ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెన్ బతిఁ గూర్చు దాన నా
యంతటి వారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్
వంతున వచ్చు సత్యగరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ!''

'మానినీ' యను సంబోధనము సాభిప్రాయము.

''ఆరణభోజను మతకము
లారుక్మిణి సటన లాముకాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబురాదు? వారిజనేత్రా!''

అగ్నికి వాయువు తోడైనది. సత్యభామ కిది సైరింపరాని యపచారము. మొదల నద్దివ్య కుసుమంబు వెన్నుఁడు రుక్మిణి కిచ్చుటయే యోర్వరాని పని. అంతతోఁ బోక తమ్ముఁ గూర్చి కలహాభోజనుఁ డాడు మాటలను గూడ శౌరిసైరించుటయా! అదియు సపత్నిముందఱ. మానమప్రతిహత వేగమున విజృంభించినది. ఈర్ష్యాసూయ లాక్రోధాగ్నికి వీవనలు వీచినవి. ఇంకే మున్నది? ఇచ్చటి సత్యభామా స్వరూపమును గవి యెంత మనోహరముగాఁ జిత్రించినాఁడో చూడుఁడు.

''అన విని వ్రేటువడ్డ యురగాంగన కైవడి నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుఁదోయి కెంపు తనచెక్కులఁ గుంకుమపత్ర భంగ సం
జనిత నవీనకాంతి వెదఁజల్లఁగ గద్గదభిన్న కంఠియై''.

అనూహ్య మగు నవమానము దుర్భర మగు నా వేదనము సత్యభామ మనస్సును మొదలంటఁ గలంచి వైచినవి. కాని, కౌతుకము మాత్రము పని

చేయుచునే యున్నది. తన్నుగూర్చి రుక్మిణీసతి యేమైన నన్నదేమో యన్న సందియ మామెను మిక్కుటముగ బాధించుచున్నది. "రుక్మిణీసతి యని సత్యభామ నోటఁ బలికించిన కవి ప్రతిభ యనన్యసామాన్యము కదా ! చెలి కత్తె చెప్పిన వాక్యము నాలించినంత మాత్రనే సత్యభామకుఁ బట్టరాని యాశ్చర్యము కల్గినది. నిజముగా నిట్టిది జరిగెనా యను సందేహము క్షణ మాత్ర మామె మనస్సునఁ బొడ సూపినది. అప్పటి యామె మనః పరివర్త నమును ముక్కుతిమ్మనార్యుఁ డీ క్రిందివిధముగ వ్యక్తము చేసి యున్నాఁడు.

"ఏ మేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాటల్ చెవియొగ్గి తా వినియెనా యా గోపికావల్లభుం
డే మే మాడెనొ రుక్మిణీ సతియు నీ వింకేటికిం దాచెదే
నీ మోమాటలు మాని నీరజముఖీ నిక్కం బెఱింగింపవే !"

"అతుల మహానుభావ మని యవ్విరిఁ దా నొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁ గాక, తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ చేసినఁ జేసెఁ గాక, యా
మతకరివేలుపుం దపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్"

ఈ పద్యములలోని ప్రతిపదము నన్వర్థ మనియే చెప్పవలెను. 'ఒక' యను పదము వలన సత్యభామ కవ్విరిపైఁ గల యలక్ష్య భావము సూచింపఁ బడినది. రుక్మిణీ యనుపేరు చెప్పక 'ప్రియము గల్గునెడ' కని చెప్పుటచే సత్య భామకు సవతియగు రుక్మిణీపైఁ గల యసూయ సూచింపఁబడినది. అప్పట్టున రుక్మిణి పే రుచ్చరించుట కూడ సత్యభామ కనిష్ట మగు కార్యమే. ఇది నారీ జనసహజ మగు గుణము. మఱియు సత్యభామవంటి మానవతికి నెంతయుఁ దగియున్నది, నన్ననుటకు బదులు మమ్మని చెప్పియుండుటచే స్వాభిమానాతి శయము సూచింపఁబడినది. తరువాత గవి సత్యభామకుఁ గల కోపకారణ మంతయు నీ క్రింది పద్యములలో వ్యక్తము చేసియున్నాఁడు.

"పలుదెఱఁగు ముళ్ళమాటలఁ
గలహామె కల్యాణ మని జగంబుల వెంటన్

మెఁసెడు మౌనికి సహజము;
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్".

"ముని యేమి సేయు? రుక్మిణి
గొనఁ గారణ మేమి? ధూర్త గోపాలుఁడు సే
సిన చెయిద మేమి చెప్పుదు?
మన మెఱియదె ప్రాణమైన మగఁ డిట్లైనన్".

కలహభోజనుఁడైన నారదుఁ డట్టిమాట లాడుటలో సత్యభామ కాశ్చర్యకరమగు నంశమేమియును లేదు. కాని యాత డట్టి మాటలను సపత్ని యెదుట నాడుచుండఁగా వల్లభుఁ డూరకుండుటయా? మగఁడే యిట్లైన నింక నానతిని మన్నించు వారెవరు? ఇంతకును మగవారందరును నట్టివారే యని యామెసిద్ధాంతము. ధూర్తగోపాలుఁ డనుటచేఁ బసుల మేపరికి నుత్తమ గుణము లుండునా యని సత్యభామ యభిప్రాయము. ఆమె తన భర్తను ప్రాణతుల్యముగఁ బ్రేమించినది. నిజ మాలోచింపఁగా ప్రాణమైన మగఁ డిట్లగుట విచారకారణమే, ఒకని దుండగ మందఱకు నుపద్రవ కారణమైనట్లు సత్యభామాక్రోధము మగజాతి నందఱను విసరికొట్టినది.

"పరికింపరు తమ జాడలు;
తరుణుల తగులములు నమ్మఁ దగఁ దంద్రు మదిన్;
శరదంబుద చలచిత్తులు
పురుషులెపో, వారి నమ్మఁ బోలునె చెలియా?"

ఇంతలో నీర్ష్యాసూయలకు జేదోడువాదోడుగా నభిమానము తలసూపినది. ఇట్టి తిరస్కృతి నందిన తానెట్లు సపత్నుల యెదుటఁ దలయెత్తి తిరుగఁ గలదు? మగఁడు తన గీచిన గీటు దాటఁడను గర్వము తన కీనాటి కడఁగి పోయిన దని సపత్నులు మనసునందైన ననుకొనరా? ఇప్పటి సత్యభామా చిత్తవృత్తి నీ క్రింది పద్యములలోఁ గడుంగడు మనోహరముగా, జిత్రించి యున్నాఁడు.

"ఇన్ని దినంబులు న్నవతు లిందఱిలోఁ గడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యా
వన్నెయు వాసియుం దఱిగి వారు ననుం దల లెత్తి చూడఁగా
నన్నల జాయలం బలుక సైతునె ప్రాణము లెంత తీపొకో!"

"నా మొగమాటకై వలసి నాటకము ల్ఘటియించి రుక్మిణీ
కామిని మీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబు దా
నేమియుఁ గాననీక యిట నిన్ని దినంబులు నన్నుఁ దేల్చె నో
తామరసాక్షి! మెచ్చవలదా మురదానవ భేది కృత్యముల్".

"ఓ చెలి! శౌరి కిచ్చెనఁట యొక్క లతాంతము దెచ్చి నారదుం;
డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్వెరి; యిట్టి మాట లా
హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణముఁ దాల్చెద మేన నింతఁగా
నోచితి; నింక నిట్టివి కనుంగొన నెమ్మెయి నున్నదాననో!"

సత్యభామకు స్వాభిమానము మెండు. నారదుఁ డొక్క లతాంతము శౌరికీయఁగా నది యాతఁడు రుక్మిణి కొసఁగినాఁడు - అను నీ వాక్యము వినియు జీవించియుండుట హేయ మని ఆమె నిశ్చయము. ఇన్ని దినములు నీపై నధికానురాగము గల కృష్ణు డింతలో నిట్లు మారుటకుఁ గారణమేమి! యని యందురా, యది వట్టి నటన. మున్నుగూడ నా రుక్మిణియే కృష్ణునకు బ్రియతమ. నాపైఁ జూపిన ప్రేమయంతయు నాధూర్తగోపాలుని కపట నాటకము. ఇది ఆమె వాదము. కష్టసుఖములు కావడికుండలు కదా! ఇంత మాత్రమునకే రుక్మిణి యంత మురియనగునా ?

"పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగఁదో
యానరకాసుర దమనుఁడు
దానెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగ దొకో!"

నరకాసుర వమనుఁ పనుటచే నరకాసుర వధయందలి సత్యభామా సాహాయ్యము సూచితము. కాని యిదియంతయు నొక్కపెట్టు. విరి ధరించిన యాభోజకన్యను సపత్ను లందఱు గారవము సుజ్జగించి భజించుట యొక్కపెట్టు. ఇంతలోఁ దనయెడఁ బతి మున్ను చూపిన ప్రేమ జ్ఞప్తికి వచ్చినది. ఇది యాడువారికి సహజ గుణము. వారే విషయమునైనను ద్రివ్వి తల కెత్తక విడువరు. మేలుఁగీడులలో నెద్ది వచ్చినను దాని పూర్వాపరము లన్నియుఁ బూసఁ గుచ్చినట్లు వారికి జ్ఞప్తికి వచ్చును. మానక్రోధ వివశయై యున్న సత్యభామకు మున్ను కృష్ణుఁడును, దానును సలిపిన విహారములు నడపిన యుత్సవములు, ననుభవించిన కేళీవినోదములు జ్ఞప్తికి వచ్చినవి. కలలోనైనను నవ్వులకైనను దనమాట నాతఁడు జవదాట వెఱచు ననియు, నెట్టి పదార్థంబునైన నామె యెదుటఁ బెట్టక మున్న యెవ్వారికి నొసంగఁ డనియుఁ, జెలులామెతో నేమి కొండెములు చెప్పిపోదురో యని వారికి లంచము లిచ్చు ననియు, దోడి చేడియలు వంతుల కామెతో నిలువఁగా నయ్యది యాతఁడు సైరింపఁజాలఁ డనియుఁ, గపట మెఱుఁగని మమతలతోఁ గలసిమెలసి యున్నినాళ్లుంటి మనియు సత్యభామ తన చెలిమికత్తె కడ వచించినది.

ముక్కు తిమ్మనార్యుఁడు సత్యభామా స్వభావోన్మీలనముఁ గావించు టలోఁ గడు జాగరూకత వహించినాఁడు. మానక్రోధవివశ యయ్యు నీర్ష్యా సూయలచేఁ గలంచఁబడియు, సత్యభామ మహాపతివ్రత. ఆమె పతినిఁ బ్రాణ తుల్యముగఁ బ్రేమించినది. తానెట్లు పతినిఁ బ్రేమించుచున్నదోఁ బతియుఁ దన్నట్లు ప్రేమింప వలయు నని యామె యాశయము. ఆమెకుఁ గల ప్రేమ ప్రభావమే యామె యీర్ష్యాసూయలకుఁ గారణము గాని, మఱెట్టి దురాలో చనలును గావు. ఆమెకుఁ బతియెడఁ గల ప్రేమను గవి యీ తీరున వ్యక్తము చేసియున్నాఁడు.

"పతి ప్రాణసదృశ బంధువు;
పతి దైవం, బేడుగడయుఁ బతి సతులకు; న
ప్పతియ కడు మేరఁ దప్పిన

గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా!"

"ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు ; మగడింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె ? యింక నేటి మాటలు సెపుమా!"

ఇంతలో సత్యభామాస్వభావోన్మీలనము నందలి యొక ప్రకరణము సమాప్తమైనది. ఇందుఁ దిమ్మనార్యుఁడు చూపిన మనోవృత్తి కౌశల మద్భుతము. సత్యభామ సుందర సుకుమార శరీర, పతివ్రతలలో నగ్రగణ్య, ప్రేమ స్వరూపిణీ. కాని యా ప్రేమ సాపేక్షము. అందువలననే యీర్ష్యాసూయలకుఁ దావల మైనది. ప్రప్రథమమునఁ దన చెలికత్తె పారిజాత కుసుమ వృత్తాంతమును జెప్పఁగనే యామె హృదయమును గ్రోధాశ్చర్యములు రెండు నొక్కసారియే పెనగొన్నవి. తన్ను నిందించుటచేఁ గ్రోధము. నిట్టిది జరిగెనా యను నాశ్చర్యము. అందులకే "ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?" యామాటల్ చెవి యొగ్గి తా వినియెనా యా గోపికా వల్లభుండు?" అని యామె ప్రశ్నించినది. ఈ క్రోధాశ్చర్య సందేహములకుఁ దో డభిమాన మవతరించినది. ఎవరికో యెదో మగఁడిచ్చినాఁ డన్నంత మాత్రమున నింతఁగా జిందులు ద్రొక్కుటకుఁ దా నేమి చులకన మానిసియా? అట్లు గాదు. అభిమాన కారణము వేఱు. మతకరి వేలుపుందపసి తమ్మఁ దలంచుటయే యపచారము. దానిని జెవియొగ్గి ప్రాణవల్లభుఁడు వినుట మహాపచారము. ఇట్లవమానితయై హేయపుం బ్రతుకు బ్రతుకుట కంటె మరణించుటయే మేలు కదా! ఇట్లు వగల మిగులఁ బొగులుచుఁ, గ్రోధాగారమున నామె ప్రవేశించినది. తొలుతఁ గ్రోధము-పిదప నాశ్చర్య సందేహములు, తుదకు దుఃఖము-సత్యభామా మనోవృత్తి పరిణామమను నందలి సోపానములు.

సత్యభామా స్వభావోన్మీలనము నందలి రెండవ యంతరు వామె క్రోధాగార ప్రవేశముతో నారంభ మగును.

"అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోప సదనంబునకున్

జనియెను లతాంగి హరిచం
దన కోటరమునకు నాగతరుణియు వోలెన్".

క్రోధ వివశయై యున్న సత్యభామ సురగాంగనతోఁ బోల్చు టెంతయు నుచిత మై మనోజ్ఞముగా నున్నది. ఇప్పట్టున నామె స్వరూపమును గవి యిట్లు వర్ణించినాఁడు.

"మాసిన చీరఁ గట్టికొని, మౌనముతోఁ నిరస్తభూషయై,
వాసెన కట్టుఁ గట్టి, నిడువాలిక గస్తురిబొట్టు వెట్టి, లోఁ
గాసిలి, చీకటింటి కడ గంకటిపై జలదాంత చంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజ విషాద వేదనన్".

"బిసరుహపత్ర లోచనకుఁ బెల్లఁగు మోహము సంఘటిల్లె, వె
క్కసమగు నెవ్వగ ల్వొడమెఁ, గంపము పుట్టెఁ, జెమర్చె మేను, మా
నసమున విన్నబాటొదవె, నాటెఁ గడుం బరితాప వేదనల్
మసకవుఁ బాము కాటుగతి మచ్చరమ న్విసమగ్గలింపఁగన్".

"వెడ వెడఁ గన్నుమూయుఁ, గనువిచ్చు, నగుం, దలయూచు, బాన్పుపై
బడు, నుసురంచు లేచుఁ; దడబాటును దత్తరముం జలంబు లో
నడరఁగ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తి హస్తగళ పద్మినియుం బలె సొంపు పెంపఱన్"

పై పద్యములలో సత్యభామా బహిరంతర్మూర్తులు వర్ణింపఁబడినవి. ఈ పద్యములలో సత్యభామను గవి మూఁడింటితో నుపమించినాఁడు. 1. హరిచందన కోటరమున కేగు నాగతరుణి. 2 జలదాంత చంద్రరేఖ. 3. మదహస్తిహస్తగత పద్మిని.

ఈ యుపమానముల వలన మన కప్పటి సత్యభామా స్వరూప స్వభావ

ములు తేఁట తెల్లములు కాఁగలవు. నాగతరుణితో నామెను సరిపోల్చుటచే నామె క్రోధ వివశయై యున్నదనియు నామె సుందర సుకుమార దేహ మాక్రోధ తాపమును సహింపలేకున్నదనియు ధ్వనించును. మఱియు నాగ తరుణి హరిచందన కోటరమునకుఁ దాపోపశమనార్థ మేగును. ఇఁట సత్య భామయుఁ దాపోపశమనార్థమే క్రోధాగారమున కేగినది. తాపశమనా ర్థమై క్రోధాగారమున కేగనేల? శైత్యోపచారములు చేసికొనరాదా యన రాదు. ఇది క్రోధతాపము కాని విరహతాపము కాదు. విరహతాపమునకే శైత్యోపచారాదులు తగును. క్రోధతాపము పత్యనునయాదులచే మాత్రమేఁ శమించును. తన్నిమిత్తము క్రోధాగార ప్రవేశము కార్యము. జలదాంత చంద్రరేఖా సాదృశ్యము వలన నామె దీనభావము ధ్వనించుచున్నది. మద హస్తిహస్తగత పద్మిని యనుటచే నామె శరీరముతోపాటు హృదయమును జిందరవందరయై చీకాకునొంది యున్నదని ధ్వనించుచున్నది. ఇట్లు తిమ్మ నార్యుఁడు సత్యభామాపాత్ర చిత్రణమునందుఁ గృతకృత్యుఁడైనాడు. సత్య భామా మానక్రోధ వివశత్వమునకుఁ బరమావధి యామె తనపతి నెడమ కాలఁ దన్నుటతోఁ గలుగుచున్నది. కేతనపటాంచల చంచలమైన తాల్మితో గృష్ణుఁడు సత్యభామా గృహమున కేతెంచుట-తాళవృంతమును గొని తన ప్రియురాలికి వీచుట - తన్నువడియు బుజ్జగించి ప్రతిమాలుకొనుట మొద లగు శ్రీకృష్ణుని చేష్టలన్నియు నానాటి పురుషుల రసికత్వమున కుదాహర ణములై యున్నవి.

భరతశాస్త్రము ననుసరించి ఖండితనాయికాపాత్రము నభినయించు నటుఁడీ కావ్యపద్యములనే మాతృకలుగాఁ బెట్టుకొని తన యవయవ విన్యా సమును దిద్దుకొనవచ్చును. సత్యభామా కలాప ప్రదర్శనమునందుఁ గూచి పూడివారు చూపున దీరహస్యమే. పెద్దనవలెఁ దిమ్మకవియుఁ బాత్రచిత్రణ మునఁ గృతహస్తుఁడైన శిల్పి. సూక్ష్మాతిసూక్ష్మ వివరణములతోఁ బాత్రల మనోధర్మములను నిదానించి చూచుటలో నొకవేళఁ బెద్దనయు నీయనకుఁ జాలకపోవచ్చును. పెద్దన కావ్యములో నాటకధర్మ ప్రాధాన్యమెక్కువ. భావానుగుణముగాఁ బదములఁ బ్రయోగించుటలో నీతఁడు మేటి యన

వచ్చును. "ముక్కు తిమ్మనార్యు ముద్దుపల్కులు" తక్కిన కవులకుఁ దక్కునవి కావు.

—ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 49; సంచిక 2, 3.
శ్రీ జయంతి రామయ్య పంతులు గారి శతవార్షిక
జన్మదినోత్సవ (18-7-1960) స్మారక సంచిక:



# ధూర్జటి యాధ్యాత్మికత

—శ్రీ బండారు తమ్మయ్య

చ॥ అతులితభక్తి వర్ధిలి. యుదంచిత సత్కవితా విభూతిమై
శతకము క్షేత్రవృత్తమును జక్కనిరీతి రచించి, వానికిన్
బతిగను గాలహస్తి శివుఁ బ్రాకటభక్తి నొసగ్చి సద్యశః
స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి ధూర్జటి సంస్మరించెదన్.

ఆంధ్రభోజుఁడని వినుతిగాంచిన శ్రీకృష్ణదేవరాయల యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజములలో ధూర్జటికవి యొక్కఁడను విశ్రుతి సుప్రసిద్ధమయి యున్నది. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గెనీ యతులిత మాధురీమహిమ?" యని కృష్ణరాయలు నిండుసభలోఁ బ్రశంసింపఁ దెనాలి రామకృష్ణుడు "హా! తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సంతత మధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటం జుమీ!" యని తన సహజ వికటరీతిని బద్యమందలి తరువాయి భాగమును బూరించె ననియుఁ బరంపరగా వినవచ్చుచున్నది. ఈ చాటువునందు రామకృష్ణుడు ధూర్జటి కారోపించిన వేశ్యాలోలత్వము కేవలము బూటకమే యని, యది యాతని సహజవికట హాస్యమునకే యాదర్శకము గాని వాస్తవికతకు నిదర్శనము కాదని ప్రాజ్ఞలోకము భావించుచునే యున్నది. ధూర్జటి కృతులలో మనకు లభ్యమయినవి శ్రీ కాళహస్తీశ్వర శతకము, కాళహస్తి మహాత్మ్యము అను ప్రబంధము రెండుమాత్రమే. వీనిలో మొదటిది యాంధ్ర మందలి శతకవాఙ్మయమునకు, రెండవది ప్రబంధ వాఙ్మయమునకు శిరోభూషణము లయి వెలయుచున్న విషయము సర్వవిఖ్యాతము. శతకము భక్తిజ్ఞాన వైరాగ్య బోధకమయి పలుతావుల భూపాలుర గూర్చిన నిరసనముల తోడను నిందలతోడను గూడి యుండుటచే నేఁటివారు కొందఱు, కృష్ణరాయలు ధూర్జటికవితను మనసార మెచ్చినవాఁడయినను వైష్ణవమతాభిమాని యవుటచే, అల్లసాని పెద్దనాదులను మన్నించినట్లు శైవ

కవి యగు ధూర్జటిని గారవింపఁడయ్యె ననియు నందుచే నాతఁడు విముఖత్వ మును, విరక్తిని జెంది కృష్ణరాయల నుద్దేశించియే తన శతకమును రాజనిం దలఁగావించి యున్నాఁడనియు నూహాములతో వ్యాయములఁబన్ని "ధూర్జటి హృదయము" అను పేరితోఁ గొన్ని పద్యముల రచించి ప్రకటించుచున్నారు. కాళహస్తీశ్వర శతకమునందలి రాజనిందలు. కవి భక్తిజ్ఞానవైరాగ్యములకుఁ ప్రాధాన్య మొసంగిన యాధ్యాత్మిక సంపన్నుఁడవుటచే సర్వ సామాన్య దృష్టితోఁ జెప్పినవే గాని. తనయెడఁ జూపిన నిరాదరణమును బురస్కరించు కొని యే యొక్క భూపాలునుద్దేశించి చెప్పినవి గావనియె నా యభిప్రా యము. పైని జెప్పిన యపోహము కృష్ణరాయలకుఁ గాని. ధూర్జటికిఁగాని యశోదాయకము కానేరదు. కృష్ణరాయలు రసజ్ఞుడైన రాజసత్తముఁడు. అతనికి మతాభిమాన పూర్వక పక్షపాతముల నారోపించుట సమంజసము గాదు. పూర్వోక్తమైన "స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీ యతులిత మాధురీమహిమ" అను ప్రశంసను కృష్ణరాయలు ధూర్జటి యెడఁగావించినట్టు లాతరువాతఁ గొలఁది కాలములో వెలసిన ధూర్జటి మనుమలు కుమార ధూర్జటి, లింగరాజకవి తమ కృతులలో గ్రంథస్థ మొన రించుటచే నది సత్య మనక తప్పదు. ధూర్జటికిఁ కృష్ణరాయల యాశ్రయమును నాదరణము నుండినను లేకున్నను, అతఁడు మహాభక్తుఁడు, విరాగియు నగు టచేఁ దన కృతుల నరాంకిత మొనర్చుట కొప్పనివాఁడు. నిక్కమైన యాతని యేలికఁ హృదయేశ్వరుఁడు శ్రీ కాళహస్తీశ్వరుఁడే. అట్టి కవి తనకుఁగాని మఱియొకనికిఁగాని కృతియిచ్చువాఁడు కాఁడని కృష్ణరాయలు నెమ్మ నమ్మున మున్మున్మున్మముగా నమ్మియే యుండును. అందుచే నాతని కా కవి యెడ విరసత కవకాశమే లేదు. కేవలము తన సహజ రసజ్ఞతా మూలము ననే యాతఁడు ధూర్జటి కవితను బ్రశంసించినది. ఇంతకు శతకకర్తయుఁగాళ హస్తి మహాత్మ్య ప్రబంధ కర్తయు భిన్నులని కొందఱు తలంచుచున్నారు. అది నిజముకాదని రెండింటిని రచించినది కృష్ణరాయల నాఁటి స్తుతమతి ధూర్జటి మహాకవియే యని నా నిండు విశ్వాసము. అట్టి నమ్మిక కలిమి నీయుభయకృతులను బురస్కరించి కొనియే కేవలము "ధూర్జటి యాధ్యా త్మికత" యను విషయమునుగూర్చి మాత్రమే నేనిప్పుడు కొంత ముచ్చటించు చున్నాను.

ధూర్జటి కవి తాను జీతబత్తెములు లేని శ్రీ కాళహస్తీశ్వరుని యాస్థాన కవినని, తన కవిత నాతనికేగాని మఱేనికి నీయనని మీఁదెత్తినను బిరుదమును ముంజేతి కంకణముగాఁ జేపట్టితి నని ప్రగల్భముగాఁ బ్రకటించి కొని యున్నాఁడు. ఈ క్రిందిపద్యములోఁ జిత్తగించునది.

"నీ నా సందొడఁబాటు మాట వినుమా! నీ చేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మది వేడ్కన్ గొల్తు; నంతస్సప
త్నానీకంబున కొప్పగింపకుము న; న్నాపాటియే చాలుఁ; దే
జీ నొల్లం, గరి నొల్ల నొల్ల సిరులన్ శ్రీ కాళహస్తీశ్వరా!"
(ప. 4.)

"నీకుం గాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁదెత్తితిన్;
జేకొంటిం బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిం; బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు; నాతనువు కీలున్ నేర్పులుంగావు; ఛీ
ఛీ కాలంబుల రీతి దప్పెదుఁ జుమీ శ్రీ కాళహస్తీశ్వరా!"
(ప. 114)

ఇట్లని యాతనికిఁ గవితాహంకృతి గలదని గాని, ఎవరును స్తుతింప నేరని పరమేశ్వరునిఁ దాను తనకవితచే మెప్పింపఁ గల ననెడి గర్వ మాతనికిఁ గలదని కాని మనము తలంపరాదు.

"జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యముల్
కలశబ్ధ్వను లంచితాంబర మలంకారంబు, దీప్తుల్ మెఱుం
గులు నైవేద్యము మాధురీ మహిమగాఁ గొల్తున్నినున్ భక్తిరం
జిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!"
(ప. 50)

అను పద్యమునఁ దన భక్తి రంజిత కవితారూపమున దివ్యార్చన గూర్చెదనని చెప్పుచు మరల నా వెనువెంటనే 'ఏ లీల న్నుతిమింపవచ్చు నుప

మోత్ప్రేక్షా ధ్వని వ్యంగ్య శబ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీ రూపముం; జూలుంజాలుఁ గవిత్వమున్ నిలుచునే సత్యంబు వర్ణించుచో; ఛీ లజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా!' (ప 51) అని వ్రాసి పరమేశ్వర నిజస్వరూప వర్ణనా విషయమునఁ గవుల స్తుతు లెట్టు లసమర్థము లగునది వివరించి యీ విషయమునఁ దన యసమర్థతను గర్వరాహిత్యమును బ్రదర్శించియే యున్నాఁడు. ఇంతకు నే ప్రయోజనము నర్థము నాపేక్షించక యూరక యా దేవదేవునికిఁ గవిత చెప్పుట తన జిహ్వకు నైసర్గిక కృత్యమని యుద్ఘాటించినాఁడు.

"ఒక యర్థంబును నిన్ను నే నడుగఁగా నూహింప నెట్లైనఁ బో
మ్ము కవిత్వంబులు నాకుఁ జెంద నివియేమో యంటినా నాదు జి
హ్వకు నైసర్గిక కృత్య మింతయ సుమీ ప్రార్థించుచో కాదు కో
రికల న్నిన్నుసు గాన నాకు వశమా శ్రీకాళహస్తీశ్వరా!"

(ప. 65)

దైనందిన జీవన విధాన మెట్లుండవలెను? సౌఖ్య మన నెట్టిది? యను విషయములఁ గూర్చి ధూర్జటి భావన:

"దినముం జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశాగ్రమకా
వన మధ్యోపల వేదికాగ్రమున నానందంబునన్ బంకజా
సననిష్ఠన్ నిను జూడఁ గన్న నదిపో సౌఖ్యంబు; లక్ష్మీ విలా
సిని మాయానటనల్ సుఖంబు లవునే శ్రీకాళహస్తీశ్వరా!"

(ప. 35)

అను పద్యమున ద్యోతక మగును. వీనిని బట్టి యాతని యైహిక వాంఛా విరక్తి, యాధ్యాత్మికాసక్తి ప్రకటితములు కాఁగలవు. రాజసేవాదికములఁ గూర్చిన నిందలు, నిరసనలకు నీ దృశంబగు నాతని యాధ్యాత్మిక దృష్టియే యుద్బోధకము గాని యేరాజుల యెడను నాతనికిఁ గల ద్వేషమందుల కెంతమాత్రము కారణము కాదనియే తలంపనగును. కాళహస్తీశ్వరశతక మందలి పద్యము లన్నియుఁ జాలవఱ కిట్టి భావననే ప్రవ్యక్తము

చేయుచుండును. సప్తసంతానములు వెలయించిన వారి సుకృతము గూడ భగవత్కైంకర్య మొనర్చిన పుణ్యాత్ముని పుణ్యమున కెనగాదని యాతని భావము.

> "తనయుం గాంచి, ధనంబు పాతి, దివిజస్థానంబు గట్టించి, వి
> ప్రున కుద్వాహము చేసి, సత్కృతికిఁ బాత్రుండై, తటాకంబు నే
> ర్పునఁ ద్రవ్వించి, వనంబు వెట్టి మననీ పోలేఁడు నీ సేవచే
> సిన పుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీ కాళహస్తీశ్వరా!"
> (ప. 1. 12.)

ఇంత నితని ప్రబంధమును బరిశీలించినను నీతని యాధ్యాత్మికత బహుముఖముల నందుఁ బరిస్ఫుట మగు చుండును. "మనాక్ కావ్యార్థ సూచన" మ్మను నాలంకారిక మత మనుసరించి కావ్యనుందలి ప్రథమ పద్యముననే కాళహస్తి శివలింగస్తుతి గావించు సందర్భమునఁ దత్సేవవలన నా క్షేత్రమునఁ దర్శించి యేయే పూర్వభక్తుల చరిత్రములఁ దాను కావ్యమున వివరింపఁ బోవునో వారినెల్ల నొక పద్యముననే మునుముంద సూచించినాడు.

> "శ్రీ విద్యానిధియై మహామహిమచేఁ జెన్నై వసిష్ఠాజలూ
> తావాతాశన సామజాటవిక గోత్రాదేవ సత్కీర రా
> జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
> ర్యా వామాంగము, దివ్యలింగము మదీయాభీష్టముల్ సల్పెడున్".

ఇంతేగాక ప్రతి యాశ్వాసారంభ పద్యమును దదాశ్వాస వర్ణిత కథా సూచితముగ రచించినాఁడు. ఈతని కాళహస్తి క్షేత్రవర్ణనము ఇతరకవుల ప్రబంధము లందలి పురవర్ణనలకు సర్వవిధముల విలక్షణముగ నుండి యాతని యాధ్యాత్మిక దృష్టికిఁ బ్రబలాదర్శకముగ నున్నది. అసలాక్షేత్రమే దక్షిణ కైలాస ప్రశస్తి గలది. కదా!

ఇంతేగాక ప్రతియాశ్వాసారంభ పద్యమును దదాశ్వాసవర్ణ తకథా సూచితముగ రచించినాఁడు. ఈతని కాళహస్తి క్షేత్రవర్ణనము ఇతర కవుల

ప్రబంధము లందలి పురవర్ణనలకు సర్వవిధముల విలక్షణముగ నుండి యాతని యాధ్యాత్మిక దృష్టికి? ప్రబలాదర్శకముగ నున్నది. అసలాక్షేత్రమే దక్షిణ కైలాస ప్రసస్తి గలదికదా!

సీ. సంసార పారదోచ్చాట నానల కీల;
కలుష సంచయ తామ్ర గంధకంబు;
కామలతామూలకందకుద్దాలంబు;
సంకల్ప పాషాణ టంకముఖము;
రాగశాలివనాంకుర కడంగరీయంబు;
శంకాకళంక భుజంగ నకులి;
నవమనోగోరాజ నాసికా రజ్జువు;
కోపనేక్షణ విశిఖోపలంబు;

గీ. దివ్యదేశిక హంసోపదిష్ట మార్గ
నిర్గుణధ్యాన సంధాన నిరుపమాన
సౌఖ్య సంపన్న సాదకజన నివాస
మమృత లింగాకరము కాళహస్తిపురము."

ఆ. 1. వ. 17.

అని కాళహస్తిపుర మమృతలింగాకర మని వర్ణించి,
"ఆడం జిత్రము వాడవాడ ఘనకుడ్యస్వర్ణ రత్నద్యుతుల్
చూడం జూడఁగ పణ్మ్ముఖీకరణ తేజోరూఢి చిత్తేక్షణ
క్రీడా దుస్తరమార్గ సౌఖ్యరసవార్ధిం దేల్చుఁ దత్పట్టణ
క్రోడక్షోణి నఁటన్న నున్న పురముల్ కొండాట కర్హంబులే"

ఆ. 1 వ. 18.

అను పద్యమున నితరపురము లేవియు సన్నుతిపాత్రములు కావని చూపినాఁడు. ముక్తిదాయకపుర మగుటచే నచ్చటి జంతు సంతతికిఁ గైవల్యమును బడయుటలో నుత్తమమధ్యమాధమస్థితులు లేవఁట! (18)

"అమితము లైన జంతువుల కక్కడ నుత్తమ మధ్యమాధ మ
త్వము లరయంగఁ గాన మపవర్గరమాసతిఁ బెండ్లియాడుచో
సమతయె గాని తత్పరము సాటిగ నన్యపురంబు లెన్నఁగా
నమరు నటన్న హస్తిమశకాంతర మింతయవాసి చూచినన్"

ఆ, 1. ప. 22.

అచ్చటి పౌరుల యంగజాగమ కళాక్రియలు గూడ నాధ్యాత్మిక విలాసములుగానే నిరూపితము లయినవి.

"ఎలదోటల్ వనముల్, వధూకుచము లద్రీంద్రంబు, లాకంటికిఁ
ఫలముల్ వాతెఱ, లంగజాగమ కళాబంధంబు లిచ్చాసనం
బులు, కోపంబునఁ బాయుటల్ తపము, సంభోగంబు కైవల్య, మం
దుల లీలారతి సుందు మానవుల; కెందుం గాన మీ చిత్రముల్"

1. 21.

చాతుర్వర్ణ్యమునకు రాజయోగైక సామ్రాజ్య తత్పరతను శ్లేషానువిపాణిత వర్ణనమున సమర్థించినాఁడు.

సీ. "నైజంబులగు నిత్య నైమిత్తికంబులు
నడపుచో బ్రహ్మార్పణంబు సేసి,
సంగరహిత బుద్ధి శాంతనవస్ఫూర్తి
వైరి వర్గంబు సంహారమాడి,
ప్రబల మహార్థ ప్రభాసమానస్థితి
కోశంబు లుండెడు కొలఁదు లరసి,
యాతపశీత వాతాదుల సమముగా
నాత్మ ప్రయత్నంబులందుఁ దలఁచి,

గీ. సంచరింతురు బ్రాహ్మణక్షత్ర వైశ్య
శూద్రు లచ్చట సంతతభద్రహృదయ

నిరుపమానంద విహారణోన్నిద్రు లగుచు
రాజయోగైక సామ్రాజ్యరతుల భక్తి"

అ. 1. ప, 23.

ఇచ్చో వారకామినీగణము యోగిజనంబులుగను, గంధగజములు అవధూత వర్గముగను నిరూపింపబడినారు.

చ, "పరిచిత బంధ నైపుణి, నపార కళానుభవ ప్రసక్తి, నా
దర సవివేకసంపద, సదా శుకవాక్య సుధానుభూతి, మో
హ రహిత వృత్తిఁ, ప్రస్ఫుర దనంగ రహస్య విచారబుద్ధి, న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్."

1. 24.

మ. "అరగంటం గనుఁగొంట మందగతిఁ, బూర్ణాహంకృతిన్, బ్రార్థనా
కరభుక్తిస్థితి, ముక్తలోక భయశంకావృత్తి, నున్మత్తన
వ్యరతి, న్సత్వ సమగ్రత, న్మృదిత పద్మాభ్యున్నతి, న్గంధ మం
ధర దంతావళి కోటి యొప్పు నవధూత ప్రక్రియం దత్పురిన్"

1. 25.

యోగులకు బాలోన్మత్త పిశాచసామ్య మనశ్రుతమే గదా! కేవల భక్తి యోగమునందేగాక యష్టాంగయోగ. సిద్ధాసన ఉద్యాన జాలంధరాదిక యోగ బంధంబులందుఁ గూడ నీతఁడు బంధుర ప్రజ్ఞగల వాఁడని తెలియుట కీతని కావ్యమునఁ బెక్కు దృష్టాంతములు గలవు. కాళహస్తి క్షేత్రమునకు నిజతపమున సువర్ణముఖరీనదిని గొనితెచ్చి యగస్త్యమహర్షి యా నదీతీరమున శివలింగ ప్రతిష్ఠ లొనర్చునపుడు కాళహస్తీశ్వరుని గూర్చి యా మునివరుని ముఖమున దండక రూపమున నీతఁడు గావించిన స్తోత్రమను (ఆ. 1. వ. 146) జిత్తగించునది. సర్వము శివమయ మను నాధ్యాత్మిక సత్యమును దృఢమ్ముగ నమ్మినవాఁ డగుటచే నీ కవివతంసుఁడు గావించు

ప్రకృతి వర్ణనములో నీతని యాధ్యాత్మికత మఱింత వెల్లివిరియు చుండును. ఉదయాద్రిపయి నుదయించు నుడు రాజబింబమును శివలింగముగా నీక్షించు నీతని వర్ణనముం జూడుఁడు :

మ. "ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్పిత సుమంబుల్ గాఁ దమోదూర సౌ
ఖ్యద మై శీతగభస్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీ దిశన్.

2. 133.

మహాశివభక్తి సంపన్నుఁ డయి యవతరింపఁ బోవు తిన్నఁడు గర్భస్థ శిశువుగా నున్నప్పు డాతని భావిభక్తి సూచకముగ నతని తల్లి తండె శరీర మున గోచరించు లక్షణముల నీతఁడిట్లు వర్ణించినాఁడు.

సీ. "భసితాంగ రాగశోభా విలాసంబుతోఁ
బ్రతివచ్చు నానన పాండుగరిమ;
కంఠ హాలాహల కాళిమచ్ఛవితోడ
నెనవచ్చు గుబ్బ చన్మొనల నలుపు;
వరశివాకృతితోడ సరివచ్చు నణుతరం
బనఁ జాలి ఘనతరం బైన నడుము;
స్వస్వరూప విచార సంప్రాప్త శాంతితో
నూర్పడు చిత్తైధమాన జడిమ

గీ. సరభసానంగ సంక్రీడ జరుగనీక
దౌహృదము గర్భమున నున్న తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁడని యపుడ తెలుపు
కరణిఁ బెంపొందె నమ్మందగామికికిని.

ఆ. 3. ప. 22

కాళహస్తీశ్వరుని సేవించి ముక్తి గాంచిన వారిలో మధురాపురీ వేశ్యామతల్లి యగు మాణిక్యవల్లి తనయ లిరువురు. వీరే కావ్యారంభ పద్యమున రాజీవాక్షీయుగమని పేర్కొనఁ బడినది. వారు బాల్యమునుండియు వారవనితా ధర్మముల నుద్బోధించు తల్లి వచనముల నెల్లఁ జెడిచెవిని బెట్టి సహజ శివభక్తి సంపన్న లవుట.

ఉ. దారువనీ మునీంద్ర కులదార భుజంగుఁడు, భక్త బల్వణ
ఝ్మారమణాంగనా మణిభుజంగుఁడు, ముక్తివధూభుజంగుఁ డి
చ్ఛారచితాంగ భూషణ భుజంగుఁడు. మాకు భుజంగుఁ డమ్మ! ని
స్సార మనుష్యమాత్రుఁడు భుజంగుఁడు గాఁ డిఁక మాట
లేటికిన్"

4. 41,

అని తమ ధృఢనిశ్చయము నామెకు విన్నవింతురు. ఈ బాలికా మణులు తమ చిన్నతనమున నుయ్యెల తొట్లకుఁ దల్లు లొనగూర్చిన మణి మయూలంకారముల వెఱఁగంది చూచునపుడు ఱెప్పలు సడల్పక తారక యోగ మార్గరతు లట్లు వానిని గన్గొన సాగి రని వర్ణించినాఁడు.

చ. "కనకపుఁ బేరు సోయగము గల్గిన ముత్తెపుఁ గ్రొత్త తొట్లలో
నునిచి యనర్ఘ రత్నముల నొప్పగు గుత్తులు మ్రోల వ్రేలఁగ
ట్టిన వెఱఁగంది ఱెప్పలు సడల్పక తారకయోగ మార్గద
ర్శన రతులట్ల కన్గొనఁగ సాగిరి కన్య లనన్య చిత్తలై."

4. 12.

వారి బాల్య విద్యాభ్యాస వర్ణనాసందర్భమునఁ గూడ నీక్రింది విధమున వారి శరీర సౌందర్యము నభివర్ణించినాఁడు.

సీ. "శివపూజనాసక్తిఁ జిన్ని చన్నుల పెక్కు
వయుఁ బ్రత్యహంబును నయము నూపఁ,

శైవాగమాంతర జ్ఞానంబుఁ దనులతా
ప్రభయు నంతంతకు నభినవముగఁ,
పార్వతీ ప్రాణేశ భక్తియుఁ గూకట్లు
వెలసి నాఁనాటికి వృద్ధిఁ బొంద,
వారకులాచార వాసనా బాల్యంబు
లోకపూఁట కొకపూఁట కుడిగిపోవ,

గీ. శాంభవం బైన తేజంబు శైశవాప
సమవయోగణ్య లావణ్య గౌరవంబు
హృదయమున నంగకంబుల నుదయ మొదవఁ
జదువ, బోవుదు రిరువురు మదవతులును. 4. 23.

ధూర్జటి కవితయందలి యాధ్యాత్మికతను దిఙ్మాత్రముగ సూచించుటయే నా ప్రస్తుతోద్యమము గాని దానిని సమగ్రముగ వివరించుట గాని, యాతని కవిత యందలి యితర సలక్షణముల విశదీకరించుట గాని కాదు. సత్కవిత్వ మభ్యసించు వారి కీతని కాళహస్తి మాహాత్మ్యము మేలుబంతి యని పండితవర్యులు బాహాటముగఁ బ్రకటించియే యున్నారు, ధూర్జటి యాధ్యాత్మికతకు మూలకారణ మాతనికిఁ గాళహస్తీశ్వరుని యెడఁగల సహజభక్తి.

శా. "దంతంబుల్ పడనప్పుడే, తనువునన్ దార్ఢ్యంబు పోనప్పుడే,
కాంతాసంఘము రోయనప్పుడె, జరాక్రాంతంబు కానప్పుడే,
వింతల్ మేన జనింపనప్పుడె, కురుల్ వెల్వెల్ల కానప్పుడే,
చింతింపన్ వలె నీ పదాంబుజములన్ శ్రీ కాళహస్తీశ్వరా!"

అని యాతఁడు లోకమును హెచ్చరించినాఁడు. అతని యుద్బోధమును గమనించి శివభక్తితో పాటు ధూర్జటి యాధ్యాత్మికతా దృష్టిని గూడఁ గొంత వఱకయిన నలవరించుకొని యాంధ్ర కవిపండితలోకము తరించుఁ గావుత మని యభిలషించుచు నీ వ్యాసమును ముగించుచున్నాను.

—ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక
సంపుటము 47 ; సంచిక 1-2,
వికారి - చైత్ర -ఆషాఢములు.

—x—

# నిగమశర్మ అక్క*

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ

ఈ చల్లనితల్లి పేరేమో తెనాలి రామకృష్ణకవి మనకుఁ దెలుపలేదు. అతనికే తెలియదేమో. వాల్మీకి అగస్త్యునికి పేరులేని యన్న నొకనిని సృజించెను. అతనికి పేరొక్కటే కాదు. మఱేదియు లేదు. ఈ యమ సృష్టి యట్టిది కాదు. రామకృష్ణుఁ డమృతములో లేఖిని నద్ది తిద్ది తీర్చి యాడించిన పుత్తడి బొమ్మ యిది. కావున పేరు లేకున్ననేమి? నిగమశర్మ వంటి పెద్ద పేరే 'నేతిబీరకాయ' కాలేదా? తెనాలివాని నిర్మాణములో పేరు పెంపుగల యే యితర వ్యక్తికిని ఈ యనామధేయకుఁ గల జీవనకళలో, నయనాణ్యములలో పదింట నొకపాలును లేదు.

ఎవఁడో యొక చిత్రకారుని వేళాకోళము చేయుటకై తాను చిత్రింపఁగలనని చెప్పి, గోడనిండ తోఁకలు వ్రాసి గుఱ్ఱము లాప్రక్కనున్నవని చెప్పి రాయలవారిని నవ్వించిన వాఁడఁట రామకృష్ణుడు! వాని కవిత్వమందేమో ఈ ధర్మము చాలఁ గానవచ్చును. అంగసృష్టి అంగిసృష్టికన్న ఎక్కువ. కాని యాయంగములే. ప్రాతఃకాలమున ప్రాకారముమీఁద నిక్కిచూచు లేఁ దీగల కొనలవలె, ప్రాణశక్తితో తకతకలాడుచుండును. సంపూర్ణ వస్తునిర్మాణమునకు అతనియందు లేనిది నేర్పుగాదు, ఓర్పు. వేళాకోళపుఁ గందువలను, పరిహాసపు పట్టులను వెదకుట యతని స్వభావము! గావున ఒక వస్తువు నాద్యంతపుష్టిగా పరీక్షించు లోపల చూపు వేరొక చోటికి పారును. మొదటిదాని యెడ శ్రద్ధ తగ్గును. పరిహాస కుశలత, తెలివి, చురుకుదనము నకు గుర్తు. అది గలచోట సామాన్యముగ సోమరితనమును, అశ్రద్ధయు నుండును. కథలలోని కొంటెభాగవతపు రామకృష్ణుఁడే కావ్యములందును కొంచెము నాగరక వేషపు నాజూకులతో ప్రతిఫలించుచున్నాఁ డనుట రసికు లందఱును గమనించిన విషయమే. ఇతని రచనలోని మాటలపోటు. నిర్లక్ష్యపు నడక, భావముల తీండ్ర - అన్నియు దాని పరిణామములే. కాని

* తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము. 3 ఆ.

కొంత శ్రద్ధవహించి పనిచేసెనా ప్రతిమ యంగములు అంగాంగములును కళకళ లాడునట్లు పట్టి ప్రదర్శించు అపూర్వ సూత్రధార విద్య ఇతనికిఁ గల దనుట కీ పేరు లేని పేరంటాలే శాశ్వత సాక్షి.

ఈమె తండ్రి సభాపతి. పేరుకుఁ దగినట్లు 'వేదముల్ వోసినగాదె. శాస్త్రములు పుట్టిన యిల్లు, కళాకలాపముల్ డాసిన రచ్చ.' పీఠికాపుర సంస్థానమున పేరెన్నిక గన్న వైదికాచారుండు అగర్భ శ్రీమంతుడుఁ. రాజాధిరాజుల మ్రొక్కులు గొన్నవాఁడు. ఆహితాగ్ని. ఇంటిలో ముప్పొద్దు భగవదారాధన. అతిథుల సమారాధన, శిష్యుల వేదముల సంతఁ శాస్త్రముల చదువు వీనికిఁదోడు వడ్డివ్యాపారము, కుడివారము మేలువారము రెండును గల సేద్యము. దానికి వలయు పశుశిశు దాసదాసీజనములు, 'రాజాలయము నకు రాకపోకలు'—వీనితో తీరిక కలిగినప్పుడు "అంగడి"కి బోయి గ్రామ కార్యము దీర్పవలసిన ధర్మాధికారము. ఇట్లితఁడు వైదిక లౌకికములు రెంటిని సమానముగా కలిపి మెటిపి కరువుపోసిన దొడ్డవిగ్రహము. చదువు. చనవు, పరువు—మూఁడును సంపాదించిన మూర్తి.

తల్లి 'అతులనిష్ఠ'గల ముసలి ముత్తయిదువ. అత్తగా రవసాన కాలమున నిచ్చిన వారి సుదర్శనపుఁబేరు అమూల్య పవిత్రాభరణముగా నెంచి పండుగవేళలఁ బెట్టుకొని తీసి దాఁచుచు, తరతరములనుండి కూడ, బెట్టగా వచ్చిన 'మూలవిత్తము' రహస్యమును బైలుపడనీక భద్రముగాఁ గాపాడుచు, వయసు ముదిరినను గొడ్డువోక బిడ్డలను కడుపునిండఁ గనుచు, ధర్మార్థములు రెంటిని సమానముగా సంసారమందు నిర్వహింపఁ గల్గిన పెద్ద ఇల్లాలు.

ఇట్టి తలిదండ్రుల కడుపునఁ బుట్టి పెరిగిన పెద్ద కూతురు మన కథానాయిక. కులాభిమానము, ధర్మార్థములందలి జాగ్రత్త, తెలివితేట, పలుకుల నయగారము, శీల నైర్మల్యము, పనిపాటలందలి దిట్టతనము. తీవ్రమైన ప్రయోజనదృష్టి—ఇవన్నియు నామెకు చిన్ననాఁటి నుండి చెప్పక చూపక వచ్చిన చిట్టలు. వ్రాఁత చదువుల సమాచారము తెలియరాదు. ప్రాయశః ఆమె వానిని నేర్వలేదు. నష్టమును అంతగా లేదు. అత్తవారిల్లు పుట్టినింటి

కై దామడల దూరము. ఈ సంసారముతో వియ్యమందిన యా సంసారపు పెద్దతన మెట్టిదో మనము కొంత యూహింపఁగలము. తమకంటె గొప్ప వారింటికే యాఁడబిడ్డనిచ్చుట కంద ఱును ప్రయత్నింతురు. ఇఁక భర్త? -- అతఁడు రామకృష్ణకవి పెద్దకుంచె నద్ది గోడపైఁ దీఁడి చిత్రించిన తోఁకలలో నొకటి. భార్య చేతితోఁ దాఁకినచోఁ గదలును. అంతే. ఇరువురికిని 'ఇంతలు అంతలు నగు సంతానము' సమృద్ధి.

తన యింటఁదాను మర్యాదగా సంసారము చేసుకొనుచున్న యామెకు పుట్టి నింటి నుండి వార్త యొకటి వచ్చి చాల మనసు నొప్పించినది. తమ్ముఁడు నిగమ శర్మ పచ్చిపోకిరీ యైపోయినాఁడు. ఆస్తియెల్ల నించు మించుగా కరఁగఁ దిన్నాఁడు. ఆచార వ్యవహారము లడుగంటినవి. మాన మర్యాదలు, చదువుసంతలు నశింప వచ్చినవి. అభక్ష్యభక్షణము, అపేయ పానము, అప్పులు, జూదము, మోసము, దొంగతికము మొదలగువానికి లోఁగి కడపటి లోఁతునకు దిగినాఁడు. కంచంత కాపురము. తలిదండ్రులు ముదుకలు. దిక్కు విచారించువారు లేరు.

ఇంటి పెద్దకూతురు తాను, నిగమఁడు తానెత్తి ముద్దాడి పెంచి పెద్ద చేసిన తమ్ముఁ గుఱ్ఱ. వానికి బుద్ధిచెప్పి త్రోవకుఁ దేలేనా యనుకొన్నది. మగనిని బిడ్డలను గట్టుకొని యొకనాఁడు బయలుదేరి పుట్టినింటికి వచ్చినది.

ఇంటిలోఁ జూడగా నన్నియు నన్ని త్రోవలై చెడి చెటాకులఁ గలసి నవి. 'సన్నాహము' అను జీవధర్మమే లేదు. ఎవరును ఏ పనికి పూనుకొను వారు గానరారైరి. తల్లిదండ్రులు చెటియొక మూల ప్రాణావశిష్టులై పగల మునిఁగి సుడివడి యున్నారు. పెరుమాళ్ళ యింటిలో బూజు నిండినది. పాత్రలు ప్రాఁచి పట్టినవి. పెద్దయిల్లుచూచి మధ్యాహ్నమునకు వచ్చు నతి థులు పాటాడించు వారు లేక వేఱు గృహస్థుల వెదకఁ బోవుచున్నారు. చిన్నపిల్లలు వేళ కన్నము, విచారించువారులేక మాసి నలఁగినారు, పాడియా వులు బందలు దొడ్లలో, బైటి తెరువులకో పాలయినవి. పనివారు మొగము జూపుట యరుదైనది. వారి జీతబత్తెము లరయువారు లేరు. పుస్తక భాండా

గారములోని తాటాకుల గ్రంథములు కొన్ని-దీపారాధన యందలి యసడ్డచేఁ గాఁబోలు—నిప్పు పాలైనవి. కొన్ని దుమ్మదిని త్రాళ్ళు దెగి చెల్లాచెదరైనవి. కొన్నిటిని ఎరవు తీసికొని పోయినవారు నిగమశర్మ పుణ్యాన మాకే దక్కెనని తామే యుంచుకొన్నారు. శిష్యుల పార ప్రవచనముల మాట చెప్పనే పనిలేదు. మడి, మట్ర, చేమ, చెట్టు - మొదలగునవి యెల్ల చేయి వేసినవారి సొత్తులైనవి. ఇన్ని యనర్థములకు మూలకారణము తమ్ముఁడింటిలో లేఁడు. ఎక్కడ నున్నాడో, ఎప్పుడు వచ్చునో, రానేరాడో తెల్పువారు లేరు.

ఇట్టి సన్నివేశమునఁ గాలుపెట్టి యామగనాలు తానును ఏడ్చువారి జతలో కన్నీరుగార్చుచు నెదచెడి కూర్చుండలేదు. తాను ధైర్యముతో నిలఁబడి యిరువది చేతులఁ బనిచేసి యిరువది కాళ్ళతోఁ దిరుగకున్న ఈ యింటికి ముక్తి లేదని యెఱిఁగెను. కాని వచ్చిన వెంటనే సవరించు ప్రయత్నములు చేయలేదు. ఆత్రపు దోష మామె యెఱుఁగును. కావున మౌనముతో 'కొన్ని దినములు గడిపినది.' ఏల? సన్నివేశము వెనకముందుల కలయజూచుటకు. కళ్ళెపు త్రాళ్ళన్నియు బిగువుగాఁ జేతులఁ బట్టుకొనుటకు, తానెంతైనను పొరుగూరిది గదా! ఆఁడ బిడ్డ గదా! ఇంత పెద్దసంసారము చెడినది చక్కఁబెట్టవలయు నన్నచో తటాలున తనమాట లెవరు విందురు? ఈ తీర్పునకు నేర్పును: ఓర్పును గావలయును. కావుననే మొగము సీంద్రించుకొని వారిని వీరిని గసరి తిట్టక. యుపదేశముల, ఉపన్యాసముల గొటవకుఁబోక, మొట్టమొదలు మూల స్తంభములవంటి ముసలి తలిదండ్రులను దేర్పవలయునని తలఁచినది. 'తీంద్ర గల వచన రచనా చమత్కారంబులు' ప్రయోగించి వారివంత కొంత దొలగించి మొగముల గెలివి గలిగించినవి. వారికి వలయు నుపచారము లెల్లఁదానే చేసినది, 'భగవదారాధనకు వలయు నేర్పాటులు చేసి జరిపించినది! తొంగి చూచి పోఁబోవు నతిథులను దయచేయుఁడని పిలిచి యాదరించి యుపచరించినది. తల్లిని రహస్యముగా నడిగి తమ్ముని చేతికి దప్పిన మూల ధనమున్న చోటు తెలిసికొని మఱింత భద్రపరచినది. నయభయములచేతను కలియఁగలవు మాటలచేతను పిల్లలను, పనివాండ్రను లోఁగఁ జేసికొన్నది. పసులకొట్టును చక్కఁబెట్టి పాడి వెలయించినది. భర్తనుబిలిచి పుస్త

కముల భాండాగారమునఁ గూర్చుండఁబెట్టి వాని దుమ్ము దులిపించి, కట్టించి, ఎరవుపోయిన చోటులు దెలిసికొని పంపి, బదనామి చేయించి, తెప్పించి, నిలువరించినది. శిష్యులు మరలవచ్చి చదువుసంతలు జరుపుకొనునట్లు ప్రోత్స హించినది. పైరు పంటలు రైతులపాలు గానీక తన కొడుకుల నప్పుడప్పుడు పంపి యుస్తువారీ చేయించి స్వాను లున్నారనిపించి హద్దుకుఁ దెచ్చినది! మెఱుఁగుఁదీగవలె నన్నిటను దానేయై పాఱాడి యిల్లు వెలిఁగించినది!

ఇట్లన్నిటను ఆమె జాణతనము సాఁగినది గాని తన చిన్న మరదఁలిని జూచినప్పు డేమి చేయవలయునో తోఁపలేదు. వయసు చిన్నది! పొంగివచ్చు యౌవనము: అరుదైన చక్కదనము. కాఁపురమునకు వచ్చిన నాఁటినుండియు మగని మొగమైనఁ జక్కఁగాఁ జూచినదో లేదో! తనవారు నావారను వారు లేరు, మీఁదు మిక్కిలి తానెంత మనసు నొచ్చి 'నలంగియు న'త్తమా మల చిత్తంబు నచ్చునట్లు భక్తి శక్తులు మెఱసి పాటులంబడు' ధర్మము కర్మముఁ గల యిల్లాలు. ఆ వేదనామూర్తి యెడ తన ధైర్యమెందుకును బనికిరాగ వదినె, యూరక "వగచి వగచి తెగచి కడుపు చుమ్మలు చుట్టి కన్నీ రుట్టిపడం బొట్టు పొరలగు చుండి"నది! అనివార్యమగు దుఃఖమునకు హార్ద మగు సహానుభూతియే ప్రతీకారము. ఇట్టి వదినెను సంపాదించుకొనఁ గల పుణ్యవతులు మరఁదం డ్రెందఱు గలరు?

ఇట్లెన్నాళ్ళు గడచెనో! ఉన్నదున్నట్టుగా 'చుక్కతెగి పడిన వడువున' ఒక్కనాఁడు తమ్ముడు వచ్చి వాలినాడు. అప్పులవారి వలె ఆకలికిని దల దాఁచుకొనుట సాధ్యము గాదుగదా! ఎన్ని పూటలనుండి పస్తుండెనో? మధ్యాహ్న భోజన పంక్తికి తండ్రి మొగము కనఁబడునని భయము. కావున మెల్లఁగ తల్లిని బిడించి 'చల్దివంటకము' దిని చప్పున తప్పించుకొని పోదమని వచ్చినాఁడు. కాలిడిన వెంటనే అక్క మొగము కనిపించినది. తప్పించుకొని పోఁగలఁడా? ఆ ప్రేమమయి చిఱునవ్వు సంకెలలను ద్రెంచుకొని ఆ మహనీయ మూర్తియెడ తనకుఁగల గౌరవ భారమును దిగఁద్రోసిపోవుటకు శక్తి యెక్కడిది? వచ్చి నమస్కరించినాఁడు. ఇతరులు పెద్దవారు తన్ను శిక్షింపగా "గడునువడి నడి కోర్చి గడిదేటి వంకపరక చాటును మాని" "రాజా

రోషు"గాఁ దిరుగ మరగినవాఁడు ఆమె యెదుర వంచిన తల యెత్తలేఁ డయ్యెను.

నమస్కరించిన తమ్ముని గౌఁగిలింపఁ బోయినది. కాని వానిని సమీపించి చూచినప్పుడు తాఁక మనసు రాలేదు. ఎక్కడ చూచినను మేని నిండ 'మదోన్మత్త మత్తకామినీ దత్తంబులగు నఖాంకంబులు' నెత్తురులు చిలుకుచుండెను. మనసునఁగాని, మేనిలోఁగాని యింతయు మైల కెన్నడును చోటీయని యామెకు వాని యట్టి శరీరము గౌఁగిలించుట యాయూరి వాడ వదినెలఁ గౌఁగిలించుటయే యగునని తోఁచెఁ గాఁబోలు! ఊరక, లోని వెగ టెల్ల నడఁచుకొని, 'సీమంతపుఁ బెండ్లికొడుకవు గమ్మని హేతుగర్భితంబుగా' ఆశీర్వదించినది. అతఁడు గుమ్మడికాయల దొంగ; గిలియున్నది. ఆ దీవనలోని భావము కనుగొన్నాఁడు. ఉపన్యాసములు, ఉపదేశములు చీవాట్లును ఈమెయు నుపక్రమించు నేమో! ఇది యెక్కడి గొడవ పోదమని యుంకించి నాఁడు. ఆమె వ్రేలును జూపకయే హస్తమునే గాదు మేనెల్లఁ దిగమ్రింగఁ గల జాణ. ఆత్రపడి వాని కసహ్యమైన భావమును సూచించి పొరపడితి నని యెఱిఁగినది. వానిది సోకోర్వని సుకుమారత్వము. ఈ త్రోవ కాదని నిర్ణ యించి 'తరంగిత వినయ సౌహార్ద మార్దవ మధురంబు లగు మాటల తేటలం బందిరి వెట్టి'నది. ఆ పందిరియే వాని పాలికి పంజర మైపోయినది. చాలనం దుకు 'నీ చిన్న మేనల్లుని జూచితివా? ఇంద' అని యిందుబింబమువంటి తన కడగొట్టు కొడుకును—ఊరక చూపలేదు—చంక కిచ్చినది. వాని మొగమున గానవచ్చిన యాఁకలి నకనకలు చూచి, వీనిఁ గట్టివేయు బ్రహ్మాస్త్ర మిదిరా యని' మీ బావబంతి నారగింతువు గాక, శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు'నని ప్రయోగించినది. ఈలోన ముఖ్యమైన వ్యక్తిని మరఁదలిని మఱచునా? ఆమెకు కనుసన్నచేసి వానికాళ్ళు గడిగించినది. ఇఁక ఇన్ని బంగారు త్రాళ్ళనుండి తప్పించుకొనుట యెట్లు? వాఁడు గ్రక్కు మిక్కనక తలంటుస్నానము, నూతన వస్త్రధారణము, వెంద్రుకల తడియార్పు, పూల ముడుపు, గంధపు మైపూఁత—మొదలగు నన్ని యుపచారములకును మేనొగ్గి నాఁడు. అపురూపముగా మగని కీ సేవలు చేయగల్గి వాని యిల్లాలు ధన్యు రాల ననుకొన్నది. ఆమె యాశలు మొలచినవి.

ఇంతలో వంట తయారైనది. దేవతలకు బోనాలు పెట్టినంత-సామాన్యముగా మెచ్చుకొను స్వభావము లేని పోరాని పెద్ద చుట్టమునకు విందులు చేసినంత-శ్రద్ధతో భయముతో అక్క తమ్మునికి పలువగల వంటలు వండినది. 'కనుగీటి నంతలోననె!' తలిదండ్రులకును భర్తకును మౌనమంత్రము వేసినది. తన బిడ్డలతోపాటు వారి పంక్తిలో తమ్మునికి చేయార తానే తృప్తిగా వడ్డించినది. వాఁడు భుజించిన పిదప-ఎంత చెడినను వైదికుల ఇంటి బిడ్డఁడుగదా-వార్చి యింటి తిన్నెపైఁ గూర్చున్నాఁడు. భార్యకు రెండవ మాఱు కనుసన్న చేయనక్కఱలేదు గదా! ఆమె వచ్చి అరుగుచెంత నిలుచుకొని తాంబూలము చుట్టి యిచ్చుచున్నది. అతని కిప్పుడు పదునాల్గు లోకములును చల్లగా సుఖముగా నిండుగడుపుతోఁగానవచ్చుచున్నవి. చీవాట్లను తిట్లను చిఱునగవుతో స్వీకరింపఁగల యుదార హృదయముతో నున్నాఁడు.

తానును ఇంతలో భుజించి వంటయింటి పనుల ముగించి వచ్చినది. పరగడుపుతో ఈ మహాకార్యము నెఱవేర్చుట తనకును కష్టము గదా! చంట వెంట సందడిచేయు సంతానము. నెమ్మదిగా అరుగు దగ్గఱ నిలిచి, చీరపేల చిట్టడవిగా నున్న వాని తలను జూచి 'సీ! ఏమిరాయిది!' యని ప్రేమ ప్రస్తావనచేసి, జుట్టుముడి విడిచి విదలించి ఈళ్ళు గ్రుక్కి, అంట్లఁ బొడిచి, గోరుముక్కల దిగదువ్వి, తూరుపెత్తి, పేల నన్నిటిని దిగిచి, ముడివేసినది. వాని మెడకు మన్ను నలఁచినది, పాణిపద్మములు గరగరగా గడుగుకొన్నది. ఆవేళకు సరిగా అద నెఱిఁగిన మరఁదలు విడెము మడిచి యిచ్చుచుండఁగా దాసి తెచ్చిపెట్టిన పీటపైఁ గుడిప్రక్క నించుక యొరగిల్లి కూర్చున్నది. ఎడమప్రక్క బిడ్డడు చను ద్రావుచున్నాఁడు. ఈ ఠీవిని భావించి "పద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలె" నున్నదన్న పోలికలో నతిశయోక్తి యేమైనఁగలదా? కావుననే యతఁడు ముక్కాఁలు మున్వీసము ఆస్తి యంతయుఁ కరఁగిపోయిన యాయింటిలోఁ గూడ-నిగమశర్మ తల్లి నడిగి కాఁబోలు-దాఁచి యుంచిన 'పసిమి పసిఁడి వీవన' తెప్పించి మరఁదలిచే వదినెకు విసరించుచున్నాఁడు! వజ్రాల వీవనతో విసరినను ఆ దివ్యమూర్తికిఁ దక్కువయే కదా!

చెప్పవలసిన మాటలు చెప్పుట కింతకంటె మంచి సమయ మేది? "ఏమి నాయనా! ఎన్నాళ్ళాయెరా మాయూరికి నీవు వచ్చి? ప్రారంభించి

యఖండముగా జరుగుచున్న వేదపాఠమునకు విఘ్నమగునని వెఱచితివికదా!" అని తిన్నగా పస మాటలతో నుపక్రమించినది. కాని ద్రౌపదివలెనే యామెయు 'రక్కసతాల్మి'తో మదిలో నణఁచి పెట్టుకొన్న యలుక యీ సన్నసన్న మెఱుఁగు మాటలతోఁ దీఱునా? 'సాలగ్రామాల గనిలో గులక రాయివలె సముద్రము వంటి యా తండ్రి కడుపున ఇట్టివాఁడ వెట్లురా పుట్టితివి!' అని యొక్క మాటుగాఁ గసరి పల్కినది. బ్రహ్మనుండి తమవఱకు మచ్చపే రెఱుఁగని బ్రాహ్మణ వంశమే! తలిదండ్రులు ముసలివారు. తమ్ములు కసుగందులు. తా నింటికి పెద్దకొడుకు. వారి గతియేమి? చేసి కొన్న యిల్లాలి దిక్కేమి? వచ్చిపోవు విద్వాంసుల మన్నించు మాట యెట్లు? ఇంటి మర్యాద కేమిత్రోవ? తన యొక్కని చెడునడవడిచే ఇంటివారందఱి శీలము పిల్లి శీలమని. చదువులు చిలుక చదువులని తోడివా రెల్ల నవ్వుచు న్నారే! "ఏల యిట్లు బేలవైతివి? అన్నా! ఏల నీ కీగుణము?" అని కడు ఁ పోపక కెరలి పల్కినది.

కాని యిది తప్పుదారి. పాపము చేయువారు తిట్లచే నెప్పుడును తమ నడత మానరు. మీఁదు మిక్కిలి తిరుగఁబడుదురు. వెనుక గురుజనము శిక్షించినప్పుడు వారి కదే మర్యాద జరిగినది. వచ్చినపని వానిని దారికిఁ దెచ్చుట కాని తన కడుపు కసితీఱ నాలుగు తిట్లు దిట్టి మరలిపోవుట గాదు. అది యుదాసీనులు అజ్ఞానులును జేయుపని; హితకాంక్షులు చేయునదిగాదు. ఆ 'కుశలాశయ' కిది తెలియకపోవునా? అలుక మగిడించి కొన్నది. స్వరము మార్చినది. సామరస్యము వెలిఁబుచ్చినది. 'భారతమునకు కర్ణునివలె నీవే యీ యింటి కాధారము, నీవు లేనిది కథ నడువదు' అని యతని పౌరుష మున కన్వయించి పురికొల్పినది 'నీవు యజ్ఞము చేయఁగా వేదికను నేనలంక రించి సుమంగలీపూజ లందుదునని గంపెఁడాసతో వేయి మందిలోఁ జెప్పి కొన్నానే! నా యాశలు త్రెంచితివే!' యని సౌభ్రాత్రమును జూపి కన్నీరు పెట్టుకొనఁ బోయినది. 'కామవికారము బలమై యుండెనేని రూప గుణ కుల శీలము గల్గు బ్రాహ్మణ కన్యలను వేయి మంది నైనను పెండ్లాడరాదా! బ్రాహ్మణ గృహస్థునికి బహుపత్నీ వ్రతము తప్పని యెవరు చెప్పగలవారు! ఈ పాడు వారకాంతల వ్యవహారము నీకెందుకు? వారి దోపిళ్ళకు మన్నీలు,

ఆఢ్యులును దట్టుకొనఁ జాలరే! ఇంక బాపనసంసారులము మన గతియేమి?’ అని తీవ్రమైన వ్యావహారిక దృష్టితో వాదించినది. “అదియుఁ బోనీ! చేత నున్న డబ్బు మాత్రము తెలివితో వెచ్చించి యూరకుంటివా! అట్లైయుండిన నాకింత దుఃఖ ముండదే! ‘ముక్కాసం బందు నఖండ సేతు వృతముల్ కాశ్మీర ఖండంపుఁ గేదారంబుల్ తెగ నమ్మితి’వే! నీకేమి భార్య లేదా? బిడ్డలు పుట్టరా? వెన్నంటి పుట్టిన తమ్ములు లేరా? ఇట్లు కులధ్వంసము చేయుదురా యెవరైన?” అని తన వారి తప్పులను క్షమించి సరిపుచ్చుకోఁ గల స్త్రీ హృదయ మార్దవములు వెలువఱచి అధర్మము చేసినను అవివేకముగా చేయరా దను సామాన్య న్యాయమును చాటిచెప్పినది. వేశ్యాజనుల వంకర టింకర లన్నియు సూదులతోఁ బొడిచినట్లు వాని గుండె కంట నొత్తి క్రుచ్చి యెత్తి పెట్టినది. కడకు వాని చేతిలో చేయివేసి ‘చేఁయి మీఁదుగా నడచిన పూర్ణకాముఁడవే! నా తమ్ముఁడవే! నీకీ బికారి తన మేల? వలదు నాయనా! ఇంకనైన వదలు తండ్రీ!’ యని దీనదీనముగా వేఁడుకొన్నది. ‘నీకుఁ గావలసెనా హరి కౌస్తుభ మైనఁ దెచ్చెద’నని ధీరధీరముగా ప్రతిజ్ఞ చేసినది! తమ్మునికిఁ దెచ్చి యీకున్నను ఆమె తానే కౌస్తుభ మై తెన్నాలి కవి మూలమున తెలుఁగువారి చేతి కబ్బినది!

ఇంతటి తెలివి తెగువలు, నగవు బిగువులు, అందచందములు కరువు పోసి తయారు చేసిన అపూర్వామృతమూర్తికి రామకృష్ణకవి దృష్టిచుక్కగా నొక మసిబొట్టు ముక్కుపైఁ బెట్టినాఁడు!

అక్క సద్బుద్ధి మాట లాదరించి నిగమశర్మ నాల్గు నాళ్ళింటిలో వివేకము దెచ్చుకొన్న వానివలె నుండి, యొకనాఁటి రాత్రి చేతికి దొరికిన యింటిసొమ్ము లెల్ల హరించి మూటగట్టుకొని పండుకొన్న ‘పడకకును జెప్పక’ పాఱిపోయెను. అప్పుడింట నందఱు నేడ్చిరి. వారితోడ నక్కయు నేడ్చినది. ఎందు కనుకొన్నారు? తమ్ముడు చెడెనే యని కాదు; ఇల్లు మునిఁగెనే యని కాదు; తన ప్రయత్నము వ్యర్థమాయనే యనియును గాదు! మఱి ‘క్రొత్తగా జేయించుకొన్న ముక్కర’ పోయెనే యని ‘దుర్వార యై’ యడలెనఁట!

పరిహాసము పవిత్ర వస్తువును గూడ గమనింప దేమో!

—భారతి.,
శ్రీముఖ. పుష్యము - జనవరి. 1934.
సంపుటము 11; సంచిక 1.

# అయ్యలరాజు కవిత్వము

— శ్రీ శతావధాని వెళ్ళవిళ్ళ వెంకటశాస్త్రి

అయ్యలరాజు కవిత్వం అంటే రామభద్రకవి కవిత్వ మన్న మాట. యీ మహాకవిని గూర్చి "రామరాజ విభూషణ రత్నఖచిత, చారుమ స్త కలాపాదిహారీ వాక్య, గౌరవము పెక్కు భంగుల గణన చేసి" అని అప్పకవి ప్రశంసించాఁడు. రామరాజభూషణుఁడంటే వసుచరిత్ర గ్రంథక ర్త అతనికిన్నీ, యితనికిన్నీ యేదో వాదం వొచ్చి అతణ్ణి అయ్యలరాజు వోడఁబుచ్చి అతని శిరస్సుమీఁద వుండే మణి భూషణాన్ని సభలో లాగినాఁడని లోకప్రవాదం వొకటి వుంది. యింకా కొందఱు మణిమయాలంకారం మీద తన్నినాఁడని చెప్పడమున్నూ వుంది. వోడిపోతే మాత్రం తన్నడ మెందు కంటూరేమో ? ఆ వాదానికి ప్రారంభంలో ఆ విధమైన పందెం పెట్టుకోవటం చేత అలా జరిగిం దనుకోవాలి. అయ్యలరాజు వోడిపోతే అతఁ డేం చేయవలసి వుండేదో ఆ తపిసీలు విన్నట్టు లేదు. యిలాటి పణాలు పెట్టుకొని సభలలో కవులు వాదించుకోవడం పూర్వకాలంలో వుందనడానికి యెన్నో గాథలు జనపరం పర చెప్పుకుంటూ వుంటుంది. "పగులఁ గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచు ఢక్క" మొదలైన గాథలు కొన్ని యథార్థాలుగానే కనపడతాయి గాని కొన్ని పుక్కిటి పురాణాలు కూడా వుంటాయి. సంస్కృత నైషధాన్ని రచించిన శ్రీహర్షుని తండ్రి శ్రీహీరుఁడికిన్నీ, మేనమామ(పేరు తెలియదు) కున్నూ వాదోపవాదాలు జరగడమున్నూ, అందులో శ్రీహీ రుఁడు వోడిపోవడమున్నూ, ఆ వాదంలో మొదట నిర్ణయించుకున్న ప్రకారం తన స్యాలకుని బంగారు పావుకోళ్ళు శ్రీహీరుఁడు తన దేవతార్చన పీఠంలో ఆసాదించి సాలగ్రామాలతోపాటు ఆరాధించవలసి రావడమున్నూ, ఆ యీ అవమానాన్ని శ్రీహర్షుఁడు తనతండ్రి జీవితాంతరం తన మేనమామని జయించి పోఁగొట్టడమున్నూ పండితులు చెప్పుకోవడం అంతా యెఱిఁగిందే. ఆ యీ గాథలలో కొన్ని నిజాలైనా, కొన్ని అబద్ధాలైనా వీట్లవల్ల తేలే సారాంశం ఆ రోజుల్లో వోడిపోయిన పండితులు తమ వోడును వొప్పుకోవ

డమే వుండేది గాని "కిందఁ బడ్డా మీఁద వాఁడనే" అని పరాక్రమించటం వుండేది కాదని తేలుతుంది. ఇంకా పూర్వకాలంలో యెవరేనా తప్పు చేస్తే ఆ తప్పును ధర్మజ్ఞులతో స్వయంగా వచ్చి చెప్పుకోవడమున్నూ, వారు విధించిన శిక్షను అనుభవించడమున్నూ. వుండేదఁట!

ఆ రోజుల్లో వుండే రాజులు క్షత్రియులు, వేదశాస్త్రానుయాయులు, పైగా వారిలో అందఱూ కాకపోయినా కొందఱేనా మహాకవులు, మహా విద్వాంసులు. ఆ యీ భాగ్యం మన దేశానికి అంతరించి యెంతోకాలం కాలేదు. సుమారు నలభై యేళ్ళు కావచ్చింది. శ్రీ విజయనగర ప్రభువు శ్రీ మదానంద గజపతి తర్క-వ్యాకరణాలలో దిగ్గజాలవంటి పండితులు వాదించుకుంటూ వుంటే మాధ్యస్థ్యం చేసి, జయాపజయాలు నిర్ణయించి జయించిన వారికి వెండిచెంబులూ, బంగారు భూషణాలూ బహుమానించడం బహుమంది యెఱిఁగిందే. యింకా యిప్పటికి అలా బహూకరింపఁబడ్డ పండితుల జాఁతు శేషం ఆ ప్రాంతంలో నిల్చివుంటే వుంటుందేమో? వారు ఉండకపోయినా ఆ పదార్థాలను అనుభవిస్తూ వున్న ఆ వంశీకులు వుంటారు. యీ మహారాజు దర్శనం మేము స్వయంగా చేసే వున్నాము. మమ్మల్ని "శ్వపుచ్ఛ మవనామితం" అనే భర్తృహరి శ్లోకంలో "స్వపుచ్ఛం" అనేచోట శేఫ పుచ్ఛ లాంగూలేషు శునః" అనే సూత్రం యెందుకు ప్రవర్తించదో చెప్పవలసిందని ప్రశ్నించినది యీ విద్వద్రాజ శిఖామణియ్యేనే, ఆ భాగ్యం మళ్ళా యెప్పుడేనా భవిష్యత్తులో పట్టితే పట్టుతుందేమో గాని ప్రస్తుతం లోపించినట్టే అని విచారిస్తూ వుండఁగా "ఫర్వాలేదు నేను వున్నాను" అని జయపుర ప్రభువు అభయహస్తం యిచ్చినట్టు ఆ యీ విద్వత్ప్రభువు చేయు చున్న పండిత కవిసత్కారాలవల్ల వెల్లడి అవుతూ వుంది. యీయన సంస్కృతాంధ్రాలలోనే కాక వారి మాతృభాష వోఢ్రంలో కూడా మంచి కవి.

విషయం విషయాంతరంలోకి దూఁకింది. అయ్యలరాజు భట్టుమూర్తితో వాదించి నెగ్గడం మనకు ప్రస్తుతం. యేదో వొక శబ్దం దగ్గిఱో, అర్థం దగ్గిఱో భట్టుమూర్తి ప్రస్తుత కవికి వోడిపోయినంతలో తక్కువవాఁడని ప్రాజ్ఞులు అనుకోరు. ఇద్దఱున్నూ మహాకవులే; పండితకవులే. యిద్దఱికీ

శ్లేషంటే యిష్టమే. కాని వసుచరిత్ర శ్లేష ప్రయత్నపూర్వకంగా సమకూర్చినట్లు వుంటుంది. ఆ కారణంచేతనే, సర్వేసర్వత్ర కాకపోయినా కొన్ని చోట్ల చదువరులకు కొంచెం విసుగు పుట్టిస్తుంది. యెప్పుడూ కవి వర్ణించే విషయం కొంత క్లుప్తం చేయడంలోనే సొగసు కనిపిస్తుంది గాని విపులం చేయడంలో సొగసంతగా వుండదు. చూడండి — మనుచరిత్రలో చాతుర్వర్ణ్యాన్ని "అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి ముదిమది దప్పిన మొదటి వేల్పు" అని యెత్తుకొని వొక్కొక్క చరణంలో వొక్కొక్క వర్ణాన్ని ముగించాఁడు. వసుచరిత్రలోనో? వొక్కొక్క వర్ణానికి వొక్కొక్క పద్యం మెప్పున విస్తరించాఁడు. వసుచరిత్రలో సప్రయత్న శ్లేషలే కాక అప్రయత్న శ్లేషలున్నూ బోలెఁడు వున్నాయి; తేలికలో ముగించిన భాగాలున్నూ వున్నాయి. వున్నప్పంటికీ ప్రతి విషయాన్నీ విపులం చేయడమే అతనికి యిష్టం. పాండిత్యంలో వసుచరిత్ర కవిని రామాభ్యుదయ కవి జయించినట్లు ప్రతీతయితే వుంది గాని రామాభ్యుదయానికి యీ కవిత్వానికి వచ్చినంత వ్యాప్తి రాలేదు. రసవంతం కాదేమో అంటే, యెంతో రసవంతంగా వుంటుంది. చూడండీ వొక పద్యం—

సీ. ఎంత గడ్డం బైన వింత లే దొన పరి
తీరుగా బవిరి దిద్దింప వచ్చు....

తే. గీ. కోరసిగ వేయు చోటనే కొమ్ము పుట్టి
చెఱిచినది గాని యెంతేనిఁ జేయవచ్చుఁ
గడపట భుజంగవేషంబు వడసినప్పు
డుండుఁబో గండుమీఱి యిమ్మొండ తపసి."

ఋష్యశృంగుణ్ణిఁ గూర్చి వేశ్యలు వేళాకోళంగా అనుకొనే మాటలు యెంత ఔచిత్య పోషకంగా, యెంత జాతీయంగా వున్నాయో చూచారా? ఆ ఘట్టంలోదే మఱో పద్యం——

ఉ. "చాయలు దేరు మంజులకుచంబులు హృద్యము లిందు ముఖ్యముల్
పాయని సౌఖ్య మీఁ గలుగు పాటిరుచుల్ దళుకొత్తు మోవి పం

ష్లే యెడ లేని ద్రవ్యము లక్షిష్టము లైనవి యిందు నందు కొ
మ్మోయి మునీంద్రచంద్ర యని యుత్పలగంధు లొసంగి రయ్యెడన్"

యీ పద్యంలో తగుమాత్రం తేలికలోనే తెలుసుకొనే శ్లేష వుంది. విశేషంగా యితఁడు శ్లేష వాడినట్టు కనపడుతుంది గాని దానికోసం ప్రయత్నించినట్టుండదు.

చ. "బలియుఁడ నీ యెడాటమునఁ బక్షినిగాఁ బ్రతిపక్షవృత్తి నీ
తల లవనీతలంబు నెడఁ దాళఫలాకృతి రాల లీలమై
జలజల డుల్తు నిల్తు నని చక్కఁ బతంగకులీను భార్య ని
ర్మలతరచర్య డించి చనుమా! మనుమా! మనుజాళి నాథమా!"

యీ మాటలు జటాయువు రావణుణ్ణిఁ గూర్చి పల్కినవి. యిందులో పతంగ శబ్దము "పతంగః పక్షి సూర్యయోః" అని వుంది కనుక పక్షికుల సంజాతుని భార్యను చెఱఁబట్టిన నిన్ను నేను పక్షినై వుండి యెట్లు పూరుకుందును అని వ్యంగ్యార్థము. అస లర్థం సూర్యవంశస్థుని భార్యను అన్నది. యింత తేలికలో వసుచరిత్ర కూడా కొన్ని శ్లేషలు వాడింది.

తే. గీ. విమల మధురమనోహరవృత్తి వెలయు
వారిఁ బొడఁగన బుధు లెంత దూర మైనఁ
బోవుదురు గాన నేను నీ పొందు దలఁచి
దవ్వనక వచ్చితి నశేష తాపశమని."

యిందులో వారిశబ్దము మాత్రమే శ్లిష్టం. వొకప్డు సంస్కృతపదం, వేఱొకప్డు అచ్చ తెలుఁగు పదం. ఈలాటి శ్లేషలు శ్లేషలే కావు. అంటే, నిఘంట్లు దగ్గిఱ పెట్టుకొని పాట్లఁ బడితేగాని పద్యార్థం తెలియకుండా చేసేవి కావన్నమాట. విజయవిలాస ప్శోకడ అంతా యీ మాదిరిదే. (1) రామరామా యటంచు నా రాజసుతుఁడు. కృష్ణకృష్ణా యటంచు నా కీరవాణి, (2) మరుఁడో యనఁగా నరుఁడుండె, (3) మలయజగంధి మండలము నేలె—ఇత్యాదులు విజయవిలాస ప్శోకడలు.

ఇతని శబ్దాలంకారాలు కూడా అప్రయత్న సిద్ధాలుగానే వుంటాయి-

క. "మీ రింద్రప్రస్థము గనినారా?
....అందంద నరుగ నరుఁ గానరుగా?"

రామాభ్యుదయంలో విశేషించి యీలాటి శబ్దపొందిక వున్నది—

"క. ........రాజిల్లుఁ జేర్చె దీప్తిన్
రాజిల్లు మణీమయాసనం బిడి కూర్మిన్,

క. ........ఇపు డ,య్యసురహితుఁ బంక్తి కంధరు
నసురహితుం జేయుదునన్.

క. పాలింపు మిజ్జగంబులఁ
బా లింపుగఁ ద్రావి చలము వాటించకు మా
పాలింటివాఁడవై రే
పా లింటికి వచ్చినప్పు డరయుము మున్మున్."

ఇందులో నాల్గో చరణంలో వున్న సొగసు కేవల స్వభావోక్తి. చంటిపిల్లలను గూర్చి "నీ పెళ్ళాం వచ్చాక మాయందు నీకు భక్తి ప్రపత్తు లుంటాయా? మేము నీకు జ్ఞాపకం వుంటామా?" అంటారు. దాన్నే కవి అనుసరించాఁడు. శబ్దాలంకారంతో పోషించాఁడు—

క. "శీతలతాన్వీత లతా
జాతలతాంతాతి సురభి జంబీర జపా
చూతలవలీ.........."

యీలాటి పదాల పొందికగల పద్యా లెక్కడవడితే అక్కడే కుప్ప తెప్పలు. యిఁక సంస్కృత సమాసా లందుకొంటేనో, నల్లేరుపై బండి.

సీ. "తాపసోత్తమ దత్త దర్భ చర్వణ మత్త
శుంభ త్కురంగికా డింభకంబు"

సంస్కృతంలో యితని కెంత స్వాతంత్ర్యం వుందో తెలుఁగులోనూ అంతే వుంది యితనికే కాదు, వెనుకటికవు లందఱికీ యీ శక్తి యిలాటిదే.

సీ. "బలుద్రాఁచు రాచకూనలు వోలె నిగనిగ
జడిగొన్న నిడుద కెంజడలు గదల"

యీ పద్యం పద్యమంతా యిదే శైలిలో నడిచింది. తత్సమ పదాలు స్వల్పంగా వున్నాయి ఒక్కొక్కచోట రెండుభాషలకూ మైత్రి కల్పుతాఁడు.
క. "నీలోపల బెగడొందకు, నీలోపలచికుర !

క. "వేదాదుల నెడఁ బాయఁడు
వేదాదుల మరగినాఁడు వీఁ డౌరా!"
యీ మాదిరి పద్యాలు పెక్కులు,

యీ పద్యద్వయంలో మొదటి దాని పుత్తరార్ధం భాగవత కవిత్వ మ్మాదిరిగా వుంటుంది.

"........వీని నేలం గూలన్
దూలింతు నొక్కకోల న
రాళతర క్రోధు సాపరాధు విరాధున్."

చ. "దొరసి ప్రభాధురంధరుఁ జతుర్దశ లోకధరున్ మహాత్ము నే
కరణిని గోసలేంద్రనుత గాంచెదకో యని, నాభిపంకజాం
తరమునఁ బెక్కు బ్రహ్మలఁ గనంగల వేల్పున కెల్లు బొడ్డు గో
సిరో యని పల్కి రర్భ్యమరుచిన్ రఘునందనుఁ జూచి
చూపఱుల్."

యీ పద్యంలో వున్న సొగసుమాదిరి సొగసులు యితని కవిత్వంలో సర్వత్రా వుంటాయి. యీ పద్యంలో తుట్టతుదను వున్న "చూపఱుల్" అనే శబ్దాన్ని (బహు మహాకవి సమ్మత మైనదాన్ని) తప్పనుకొనే వారికి యితని కవిత్వం రుచిస్తుందో లేదో గాని తక్కిన విద్వత్కవుల కితఁడు శిరోధార్యుఁడు కదా!

"అకట ! నాకిపు డొక్క వర్షాగమంబె
పెక్కు వర్షంబు లై తోఁచె."

చూచారా, యీ శ్లేష యెంత సుళువుగా నెఱవేరిందో? యిట్టి మంచి కవిత్వానికి లోకంలో వ్యాప్తి మాత్రం చాలా తక్కువగానే వుంది. ప్రాచీనపు తెలుఁగు గ్రంథాలలో నల్లా భారత భాగవత రామాయణాల తరువాత మను వసుచరిత్రలకే కనపడుతుంది ఎక్కువ వ్యాప్తి. సంస్కృతానికి పంచకావ్యాలనేవి రఘువంశ కుమారసంభవ మేఘసందేశ భారవి మాఘాలేలాగో తెలుక్కి విజయవిలాస, మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయ, ఆముక్తమాల్యదలు అలాగే యేర్పడ్డాయి. సంస్కృతంలో పంచకావ్య పఠనానంతరం "నైషధం విద్వదౌషధమ్" అని చెప్పి నైషధాన్ని పఠిస్తారు. తెలుఁగులో కూడా క్వాచిత్కంగా శ్రీనాథుని నైషధాన్ని పూర్వం చదివే వారేమో! యిప్పుడంతగా దాన్ని పాఠంగా చదువుతూ వున్నట్టు లేదు. దాన్నే కాదు, విజయవిలాసాదులకు కూడా చదివేవారు కనపడరు. విజయవిలాసానికి టీక లేదు గాని తక్కిన వాటికి సంపూర్ణవ్యాఖ్యానాలే వున్నాయి. కాని, సంస్కృతాంధ్రాలలో మంచి ప్రవేశం వుంటేనే తప్ప ఆయా గ్రంథాలు వ్యాఖ్యాన సహాయం వున్నా అవగతం కావు. వ్యాఖ్యానం చూచేటప్పటికి మూలం మఱుపు తగులుతుంది; మూలం చూచేటప్పటికి వ్యాఖ్యానం మఱుపు తగులుతుంది. సంస్కృత భాషాప్రవేశం అంతో యింతో వున్న వాళ్ళకి తప్ప మను వసు చరిత్రలు గాని, తదితరాలు గాని అవగాహన కావు. సంపూర్తిగా ఆయీ ఆంధ్రకావ్యాలు సవ్యాఖ్యానంగా పాఠం చెప్పిన గురువులు గాని, చదివిన శిష్యులుగాని మా రోజుల్లో వున్నట్టు నేను చూడలేదు. గ్రంథారంభ పద్యాలు పూర్తిచేసి కథారంభానికి వస్తే అక్కడికి అదే గొప్ప. స్వయంగా చదువుకోతగ్గ సాహిత్యజ్ఞానం వున్న వాళ్ళలో కూడా ఆ యీ గ్రంథాలు సంపూర్తిగా చదివినవాళ్ళు యెందరో వుండరు. ఆ యీ సందర్భం ముఖ్యంగా వసుచరిత్రకూ, ఆముక్తమాల్యదకూ అనువర్తిస్తుంది. యేమైనా పట్టుమని పదిపద్యాలు నోటికి రావడం ఆ యీ పుస్తకాలలోనే కాని యితర గ్రంథాలలో కనపడదు. ఆ యీ రామాభ్యుదయం లోనిదంటూ నొక పద్యమూ నోటికి వచ్చినవా రెక్కడా కనపడరు ముక్కు

తిమ్మన్నగారు వ్రాసిన పారిజాతాపహరణానికున్నంత వ్యాప్తి గాని, ధూర్జటి వ్రాసిన కాళహస్తి మహాత్మ్యానికున్నంత వ్యాప్తి గాని దీనికి వున్నట్టు లేదు, పుణ్యకథ కాదా. కవిత్వం రసవంతం కాదా, అంటే అలాటి లోపం కనపడదు.

మ. "కొడుకున్మెచ్చి దశాననుండనిలజుం గోపమ్ముతోఁ జూచి 'యే
యడవిన్ద్రిమ్మరుచుండు కోఁతివిర రారా! యెవ్వరంపంగ ని
క్కడకిన్ వచ్చితి వేల చొచ్చితివి లంకారాజధానిన్ నిజం
బడుగం జూచెద నంతయున్ దెలియ నొయ్యన్ జెప్పరా!'
నావుడున్"

యీ పద్యం పురాణపాకంలో నడిచింది. రావణుఁడు ప్రభులక్షణమంతా వుట్టిపడేటట్టు ఆంజనేయుణ్ణి ప్రశ్నిస్తున్నాఁడు. యిప్పటి కాలపు విమర్శకాభాసులు యీ పద్యంలో 'చెప్పు' (పాదరక్ష) వచ్చిందని వ్రాస్తారేమో అని భయపడవలసిందే గాని యింకెందుకూ శంకించవలసినది లేదు. గ్రంథంలో యెక్కడా చెప్పు ధాతువే ప్రయోగించకూడదనుకోవడం కన్న ప్రమాదం వుండదు. యింతటి ప్రబుద్ధులను భగవంతుఁడు అక్షరాస్యులనెందుకు చేయాలో అనుకుంటూ వుంటాను నేను. తత్తథాస్తామ్.

చ. "అనిలజుఁ డో రె! రావణుఁడ! అల్లన నేటికి బెట్టు చెప్పెదన్
విను రఘురాము దూత, నరవింద హితాత్మజుమంత్రి, నేఁ బ్రభం
జన తనుజాతుఁడన్ జనకజన్ వెదకన్ జనుదెంచి కాంచితిన్
నను హనుమంతుఁ డండ్రు భువనంబులు మాకిల నెల్ల కానలున్."

యిదిన్ని పురాణపాకపద్యమే' వొకపాక మేమిటి? స్వయంపాకం తక్కిన పాకాలన్నీ యీ అయ్యలరాజు వారి కవిత్వంలో కనపడతాయి.

ఉ. "ఎక్కడివారు మీరు జగదేక మనోహరు లుగ్రకాననం
బిక్కడికేల వచ్చితిరి? యీ జటివేషము పూననేమి? యీ
యెక్కటి జోదుబాగులు వహించితి రేల? వెలుంగఁ జేయు నల్

దిక్కులు మీ శరీర పటుదీధితి చోద్యము తెల్పఁ డిన్నిఁయున్,"

యీ పద్యాన్ని యెందుకు వుదహరించానంటే దీని రెండో చరణంలో మధ్యమ పురుషేకారానికి సంధిచేయకుండా వుండడాన్ని గూర్చి కొంచెం విచారిద్దామనియ్యేదే. అచ్చుపొరఁబాటు కాదు. ఏకదేశ పతితమున్నూ కాదు. ఎన్ని చోట్లనో యీ కవి దీన్ని విసంధిగానే వాడివున్నాఁడు. ఆ చోట్లు కొన్ని వుదాహరించి మఱీ చర్చిస్తాను.

(1) "అ. సూనులఁ జేసితివి యిట్టి సూక్తులు చాలున్."

(2) "ఏ,లా చెడుత్రోవ పట్టితివి యాయన వంశమునః.జనియించియున్

యింకా మఱికొన్ని మధ్యమపురుషేకారానికి సంధిచేయని చోట్లు చూచినట్టే జ్ఞాపకం గాని యిప్పుడు మూఁడుచోట్లు మాత్రమే కనపడ్డాయి. యీలాటివి కనపడితే యిప్పటి సంస్కర్తలు కవి యేదో తెల్వి తక్కువ పని చేసినట్టున్నూ, లేదా ప్రమాద పడినట్టున్నూ, అది క్షంతవ్యంగా చదువరులు భావించి అనుగ్రహించ వలసినట్టున్నూ కొన్ని మాటలు ఆ గ్రంథ పీఠికలో వ్రాస్తూ వుంటారు. యీలాటి కవి అసకృదా వృత్తిగా వాడిన ప్రయోగానికి అట్టి దుర్గతిని పట్టించడానికి నే నిష్టపడేది లేదు. యీ ప్రయోగం యితఁడు మాత్రమే వాడి వున్నాఁడా? కవికర్ణరసాయన గ్రంథకర్తకూడా వాడి వున్నాఁడు. భాగవతం సరేసరి. విషయమేమైనా దురవగాహంగా వుండే దేమా అంటే, కంఠికూన క్కూడా తెలిసేది. "మధ్యమ పురుషేకారమునకు సంధి నిత్యము" -పూర్వోదాహరణాలకు సంబంధించిన కవులు యీ సూత్రాన్ని కూడా అర్థంచేసుకో లేనివారా? అంతటి తప్పుమాట యే విశాల హృదయుఁడనఁ గలఁడ? అందుచేత యీ సంధ్యభావమూ శ్రవణకటువుగా వుండక పోవటంచేత యిందఱు మహాకవులు పైసూత్రాన్ని పాటించలేదనిన్నీ, ఆ కారణంచేత ప్రథమ పురుషేకారంతోపాటు దీనిక్కూడా వైకల్పికత్వం అంగీకరించి వ్యాకరణాన్ని సవరిస్తే బాగుంటుందనిన్నీ నేను చెప్తాను. ఉకారానికి సంధి మానితే వున్నంత శ్రవణకటుత్వం దీనికి కనపడటంలేదు. ప్రథమ పురుషేకారం (పలికిరి + అనఘులు = పలికిరి యనఘులు)

సంధిని పొందకపోతే యెంత శ్రుతి కటువుగా వుంటుందో, మధ్యపురుషే కారం (వచ్చితిరి + యీజడి) సంధిని పొందక పోయినా అంతే అని నాకు తోస్తుంది; అనఁగా ఉభయత్రా కూడా శ్రవణకటుత్వం లేనే లేదని నేను అనుకుంటాను. వస్తుతః సంధులు శ్రవణసుఖానికే పుట్టివుంటాయి. కాని కొన్నిచోట్ల శ్రవణసుఖం మాటలా వుండగా విపరీతార్థాన్ని తెచ్చి పెడతాయి. అలాటి చోట్ల విసంధిగానే వ్రాయడం యుక్తమని (యీ మాటను వైతండికు లంగీకరింప రని నాకు తెలుసును) నా అభిప్రాయం అలాటి స్థలాలు కొన్ని చూపుతాను. (1) నాకుఁ దనుఁజుఁ డతండు (2) నాకుఁ జారుఁ డతండు. యీలాంటి చోట్లనే సంధి విపరీతార్థక దోషాన్ని తెచ్చి పెడుతుంధి. సంధి చేసినప్పుడూ, చేయనప్పుడూ కూడా అర్థం స్ఫురించే పదాలవల్లనే యీ చిక్కు కలగడం, భవతుఁ

వొక మంచికోసం చేసే పని వేఱొక చెడుగును ఆపాదించడం సర్వా నుభవ సిద్ధమే. మధ్యమ పురుషేకారసంధి నిత్యతా విషయంలో యింకో మాట వ్రాయాలి. ఆ యీ క్రియకు రెండు రూపా లున్నాయి. యేక వచనంలోఁ (నీవు వండితివి, నీవు వండితి). ఇందులో మొదటి రూపానికి సంధిచేస్తే శ్రవణ కటువుగా వుండదు. (వండితివి + ఈవు = వండితివీవు). రెండో దానికి సంధిచేస్తే శ్రవణకటువుగానే వుంటుంది. (వండితి + ఈవు=వండితీవు, సమానాచ్చరకత్వంలోకంటె అసమానాచ్చరకత్వంలో ఈ తుట్టతుది దాని సంధి యెక్కువ కటువుగా వుంటుంది. (వండితి + అనఘుఁడవు = వండితన ఘుఁడవు). యీ కష్టసుఖాలన్నీ పరిశీలించి కవి వచన సాఁగించడం అసంభవం గాని వొక్కొక్కని నోటంట కటుత్వదోషానికి విశేషంగా తావుండదు. ఛందోమయ మైన కావ్యంలో అసలే ఆ దోషానికి అవకాశం వుండదని చెప్పడం పొసఁగదు. వచనంలో ఆయీ పీడ కవకాశం లేకుండా ధార నడిపించడానికి యేమాత్రమూ జంకవలసి వుండదు గాని కొందటి రచన వచనంలో కూడా పద్యంలోకంటే యెక్కువ పదడుగా వుంటుంది. దాని క్కారణం నిరూపించడానికి మన వశం కాదు. అది దృష్టంకాదు గనకనే దానికి అదృష్ట మని నామకరణం వచ్చింది. తత్తథాఽస్తామ్.

మధ్యమపురుషసంధి మానడం ఈ మహాకవి ప్రమాదంగా కాక బుద్ధిపూర్వకంగా అసకృదావృత్తిగా చేసివుండడంవల్ల నేమి, యితనికంటె పూర్వుఁడు పోతరాజు గారున్నూ, తరువాతి వాఁడు కవికర్ణ రసాయన కర్తైన వారున్నూ బాహాటంగా దాన్నే అనుకరించడం చేత నేమి అది దోషం కాదన్నీ యిటీవల లక్షణగ్రంథకర్తలు ఆయీ విషయం పరిశీలించక పోవటమే దోష మనిన్నీ నే నభిప్రాయపడతాను. పరిశీలించే వున్నట్టయితే వీట్లని గూర్చి హరో అచ్యుతో వ్రాయవలసి వుండేది. కూచిమంచి తిమ్మకవి బహుప్రయోగద్రష్ట కనక యీ విషయం తెలుసుకొని దీనికి తన సమ్మతిని చూపి వున్నాఁడు. తిమ్మకవి దరిమిలా వ్యాకర్త సూరిగారు తిమ్మకవి మతాన్ని పాటించకపోవటం శోచ్యం. బహులక్ష్య లక్షణవేత్త అప్పకవి ప్రథమ పురుషే కారానికిఁ గూడా వైకల్పికత్వాన్ని వొప్పక యేదో మాలు తోవను పడ్డాఁడు. ఆ పద్ధతిని భారత మంతా పొల్లు గావలసి వస్తుంది. పొరఁబడ్డ వాళ్ళూ వుంటారు, పొరఁబాట్లూ వుంటాయి. (భ్రాంతేఃపురుషధర్మత్వాత్) కాని యీ విషయంలో అప్పకవి పడ్డ పొరఁబాటు భారతం యావత్తుకూ వుద్వాసన చెప్పేదిగా పరిణమించడంచేత మిక్కిలి శోచ్యం. యిటీవల నిన్న మొన్న పిల్లారివారు దీన్ని గురించి కొంత చర్చ వ్రాసి ఆ యీ ప్రయోగాలు 'అనాకరంబులు' అంటూ తేల్చారు-గాని వారు యిన్ని ప్రయోగాలు యింతలు దిగ్దంతులు వాడివున్నారని కనిపెట్టినట్టు లేదు. కనక అవసరమైతే వ్యాకరణాలు సవరించుకోవలసినదే గాని ఆయీ ప్రయోగాలు దిద్దరానివి కావడం చేత తోసివేయఁ దగ్గవి కావని నే నభిప్రాయపడతాను చిరకాలం నాడే "విలువగల కవుల లక్ష్యమ్ములైతా మీ భార మెల్ల మోయఁగవలయుఁగా" అని నేను దేవీభాగవత పీఠికలో వ్రాసివున్నాను. నేను దీన్నిగూర్చి వుదాహరించిన మహాకవులకంటే విలువగల కవు లెక్కడ దొరుకుతారు? యిట్టి మహాకవుల లక్ష్యాలు (ప్రమాదప్రయుక్తాలు కావు; బుద్ధిపూర్వకాలు) తోసివేసి వ్రాసే వ్యాకరణాలవల్ల తేలే సారాంశం "త్రిదోషహరం తిప్పతీఁగ" అనే కథకు దీటుగా వుంటుం దని వేఱే చెప్పనక్కఱ లేదు కనక విస్తరించేది లేదు.

యింకోటికూడా దీని సజాతీయాన్ని యీ మహాకవి అసకృదావృత్తి

గానే వాడివున్నాఁడు. దాన్ని గూర్చి కూడా వుదాహరించి నా తాత్ప ర్యాన్ని కొంత వ్రాస్తాను.

(1) "బలనులపాటు చాయతలపాటును జూచిపు డడ్డపాటు"

(2) "వేలాలవలీ లతావలి కెలంకుల నుం డిటువచ్చి వచ్చి".

(3) "మోమెఱుక మానిసిఁ జేసిటఁ దెత్తు మమ్మునిన్".

ఆ యీ క్త్వార్థకేకార సంధులు కూడా బుద్ధిపూర్వకాలే గాని ప్రమాద ప్రయుక్తాలు కావు. కాని వొక విశేషం వుంది. ఇకారం పరంగా వున్నప్పుడే కాని యీ సంధిని యీ మహాకవి చేసినట్టు లేదు. విజయవిలాసకర్త అన్యత్ర కూడా "అనవలసంటి కాక" అని సంధి చేసియున్నాఁడు. బాగా పరిశీలిస్తే మాత్రం యీ సంధి వొక్క 'ఏమనందును' (అని + అందును) అనేచోట తప్ప అసమానాచ్ఛరత్వంలో హృదయంగమంగా వుండదు నామకః నిషేధం ఉందన్న మాటే కాని భారతకవులు మొదలుకొని యిటీవలి కవుల వఱకూ అంతో యింతో యీ సంధిని చేసినట్టే కనపడుతుంది. శాస్త్రంలో వున్న నిషేధం రేఫ శకట రేఫలపట్ల యెంత అమలుజరిగిందో దీనిపట్లా అంతే. శారదాబిల్లులాగ యిది యెవరినో తప్ప బాధించినట్టు లేదు. యిట్టి శాస్త్రం వున్నా వొకటే, వూడినా వొకటే, క్వాచిత్కంగా వుండవచ్చునని యిటీవల దీన్నిగూర్చి లక్షణం కూడా పుట్టింది. ఆ యీ లక్షణాన్నీ, లక్ష్యాలన్నీ వుదాహరించి కూడా కల్లూరివారు 'నిరాకరంబులు' అని తోసేశారు. ఆకర మంటే శాస్త్రం కదా! అడిదం సూరికవిగారు "ఇడఁగ వచ్చును ల్యప్పుపై నిత్యసంధి మాత్ర మొక్కొక్కచో" అన్నది శాస్త్రం కాక "క్త్వార్థేతునకు సంధి లేదు" అన్నదే శాస్త్ర మపుతుం దని చెప్పడంలో యేమి న్యాయం వుంది? కొంద ఱాలాగా, కొంద ఱీలాగా అభిప్రాయపడటం చేత 'ఉదితానుదిత హోమం' మాదిరిగా వికల్పం ఫలిత మయింది కనకనూ, స్వల్పవిషయంలో కొమ్ములు తిరిగిన మహాకవులను అనుమానించడం కంటే అవివేకం మఱోటి వుండదు కనుకనూ ఆ యీ ప్రయోగాలను ఆక్షేపించక శిరసావహించవలసిం దని నా విజ్ఞప్తి.

యింక మఱో విషయం అందుకుంటాను. (1) వారు నట్లన యాచరించిరి. (2) సీత నెక్కటి నటులన్. (3) ఒడ్డిగిల్లి నట్లనె యుండెఁ. (4) ఈ కారుమంట లిటులన్. (5) ఇట్లనె ఱొమ్ము పోటులఁ సమయున్. (6) మునీశ్వరుఁడు నట్లన వారల. (7) భాగ్యశాలి యటులం బాటిల్ల (8) అనిన నట్లన చేసె. (9) వనచరవీరుఁడా నగరి వాకిట మున్నటులన్. (10) ఇటుల నొక కొంత. (11) ఎప్పటట్లన యే నుండక—యింకా కూడా వుంటే కొన్ని వుంటాయేమో యీ (అట్లన్ ఇట్లన్) ప్రయోగాలు. యివి తప్పు లనేవారు కొంద ఱున్నారు. యిది ద్రుతాంతంగా వుండకూడదని వా రనుకుంటారు. భారతంలో మట్టుకు పూర్తిగా దిద్దేశారు. ఇతర కవుల కవిత్వాలలో మాత్రం దిద్దలేదు. అసలు దిద్దడం ఎందుకు? న చ శంకా న చోత్తరమ్. శాస్త్ర జన్య జ్ఞానమేనా వుండాలి, విశేషించిన లక్ష్యజ్ఞాన మేనా వుండాలి. ఉభయ జ్ఞానమూ వున్న వాళ్ళు బహు అరుదుగా వుంటారు గనక ఆ జ్ఞానం అందటికీ లభించదు. అందుచేతనే వేఱువేఱుగా విడదీయవలసి వచ్చింది అవి లేనివారు వ్రాసే విమర్శనాలవల్ల సామాన్యులు సంశయాత్ములు కావడం తటస్థిస్తూ వుంటుందని యీ స్వల్ప విషయాలను పెద్దచేసి వ్రాయవలసి వచ్చింది గాని లేకపోతే యివి వ్రాయ దగినంతటి అవశ్యకాలు కానేకావు.

యింక మఱోటి ప్రస్తావిస్తాను—(1) ముఖరఝురీవారి (2) నక్రూర గ్రహాణంబుగా ఝురులక్రిందన్. (3) ఝరీతరంగ ఘటలు. (4) గ్రావదరీ ఝురీపరిసరంబు. (5) తరులనీడల జాడలఁ దరుల ఝురుల. నిర్దుష్టమున్నూ నిఘంటు సిద్ధమున్నూ, మహాకవి ప్రయోగాను రూఢమున్నూ కదా యీ ఝురీశబ్దం—దీన్ని వుటంకించడం యెందుకో అని ప్రతిప్రాజ్ఞుఁడున్నూ శంకాకులుఁ డవుతాఁ డని యెఱుఁగుదును. నేఁడు యీ శబ్దం తప్పనేవారున్నారు. అంటే అంటారు గాక—యువకవులు భ్రమ పడవద్దు సుమండీ—బ్రహ్మ మొదలు పిపీలిక పర్యంతమూ 'ఝరీ' ప్రయోగం వాడి వున్నారు అని తెల్పడానికే కాని, న చ శంకా నచోత్తరమే దీని సాధుత్వం.

"నరవానరు లింక లక్ష్యమే"—యీ ప్రయోగం తప్పనుకొనే వారు

లోఁగడ వుండేవారు. అప్పుడు దీని సమర్థనం తెల్పడం జరిగింది. కాని మళ్ళా దాన్ని బలపఱిచే ప్రయోగం దొరకడం చేత వుదాహరించాను. 'లక్ష్యమే' అనకూడదనిన్నీ, 'లక్ష్యాలే' అని దిద్దాలనిన్నీ ప్రతిపక్షుల వాదం. అది శుద్ధ తప్పు. 'లక్ష్యమే' అనే ఉండాలి.

"వారి వృత్తాంత విధులు సర్వమును దెలిపి"–యిదెందుకు వుదాహరించానంటే 'విధులు' బహువచనం గదా–'సర్వము' యేకవచనంగదా— సమన్వయం యేలాగ అని శంకించి తప్పుకొనే వారున్నా నేఁడు (ప్రసిద్ధులలోనే) వున్నారు. అట్టివారు లోలోపల ఆలా అనుకుని వూరుకుంటే దానివల్ల లోకానికి నష్టి వుండదు. ఆలా వూరుకోరు, యే పత్రికకో యెక్కిస్తారు. అది యువ కవిలోకాన్ని బాధిస్తుంది కనక వ్రాయవలసి వచ్చింది. సర్వశబ్దము యేకవచనాంతంగా వుండి కూడా బహువచనార్థాన్ని యిస్తుంది. కనక యీ మహాకవి ఆలా ప్రయోగించాఁడని తెలుసుకోండి. ఆ ప్రయోగం నిర్దుష్టం. వ్రాస్తే చాలా వ్రాయాలి.

(1) చిన్నఁబోయి (2) శరాస (3) పుట్టెను జాలనరోచకంబు (4) పేదసాదల (5) ఇల్లటపల్లుని (6) ఉచ్చరింతుము (7) సంకేతరవం బొక్కటి (8) యోజింపు మనుచుఁ జెప్పిన, హజారంబునకు (9) అమ్ము గుదఁ జూచి (10) కొండవీటీపుర (11) వినుకొండ క్షితినాథు నెన్నఁదగు (12) గొబ్బూరి తిరుమల (13) గట్టు రాజల్లుఁడు. (14) పరమగురు వైన ముమ్మడి వరదాచార్యాంఘ్రి వనజ వందారుఁడ నై (15) సురటుల్ వలె (16) బ్రహ్మతన చేయు లోక ప్రపంచమునకు (17) ఎల్లి పోవలె (18) ఎక్కడెక్కడ (19) నడిపించె (20) ఇతరత్ర చింతలు (21) గాఢాంధ తమంబు (22) చంపులు చంపిరి (23) నమ్మినందుకుఁ (24) తమదు దెస.

ఆ యీ నిర్దుష్ట ప్రయోగాలన్నీ తగినంత పిండిలేని పాండిత్యంతో వ్యాఖ్యానాల కుపక్రమించే వారికి యేదో వొకవిధమైన దోషం వున్నట్టుగానే పొడ కడతాయి. మనయందు తగినంత సత్తా లేకపోవటానికి ఆ మహాకవి

వుత్తరవాది యేలా అవుతాఁడు పాఠం? ఆ యీ స్థలాలలో వుండే శంక స్వరూపం యేలా వుంటుందో, సమాధాన స్వరూపం యేలా వుంటుందో వ్యాఖ్యానించవలసి వస్తే చాలా పెరుగుతుంది. యిందులో సర్గ 21 నంబరు గుర్తు గలదాన్ని గుఱించి మాత్రం శంకించడం యుక్తం. గ్రంథకర్త వేఱొకచోట సమాసాంత ప్రత్యయ సహితంగా కూడా వాడి వున్నాఁడు. అనిత్యత్వం కవికి తెలుసును.

యీ మహాకవి అష్టదిగ్గజాలలో వాఁడు. చతుర్విధ కవితా ధురంధరుఁడు. శ్లేష చేదస్తం లేకుండా వాడతాఁడని యిదివఱకే వ్రాశాను. అంతతో తనివి దీరలేదు. "ఆసవవాంఛ వర్తిలు దురాత్ముల కెందును గీర్తి కల్గునే" యీ అర్థాంతర న్యాసలో ఆసవపదం శ్లేషించింది. ఆసవం అంటే మద్యం. రెండో అర్థం—అసువులు (ప్రాణములు) సంబంధమైన వాంఛ అని. దశరథుఁడు తన దురవస్థకు చింతపడుతూ అనే వాక్య మిది. యీ కవి సంస్కృతాంధ్రాలలో యెక్కడా దొరకఁడు మృదుమధుర పదభూయిష్ఠమై శరత్కాల గంగాప్రవాహంలా వుంటుంది ధార. యింతటి మహాకవి కవిత్వానికి లోకంలో తగినంత ప్రచారం లేకపోవడం శోచనీయం. యీక యితని కేలాటి ప్రాస యెత్తుకున్నా మంచినీళ్ళ ప్రాయంగానే వుంటుందనడానికి వుదాహరించవలసివస్తే చాలా పద్యాలు చూపాలి కనక ఆ పద్యాల మొదళ్ళు మాత్రం యెత్తి చూపుతాను—(1) దృక్త్రితయంబు. (2) హాస్త్యసురారి (3) స్వర్ఘంటాపథ సీమ.

యీలాటి ప్రాసలవల్ల కవిత్వానికి కలిగే సారస్యం లేకపోయినా కవి పాండిత్యం యెంత పాటిదో తెలుసుకోవడానికి యివి తోడ్పడతాయి. రసజ్ఞంమన్యులు కొందఱు వీట్లకే సంతోషించి ప్రధానాంశాన్ని కనిపెట్టలేకపోవడమున్నూ వుంది. తత్తథాస్తామ్.

పదముల పొందికను గూర్చి లోఁగడ కొంత వ్యాకరించే వున్నాను. యింకో పద్యం కూడా వుదాహరించి వ్యాసం ముగింపు చేస్తాను—

క. "సన్న్యాసిని వన్యాశిని

గన్యా! సీమంత వీథికా సింధూరో
పన్యాసి మృదుపదాంబుజ
ధన్యా! సితకీర్తి! భిక్ష దయసేయఁ గదే!"

యివి రావణుని మాటలు. బహుమంది కవులు రామాయణాన్ని పుణ్యాకస్తువుగా పుచ్చుకోవడం యిహపరలోక సాధక మని మాత్రమే కాదు. ఆ కథలో సర్వ రసాలకున్నూ బోలెడు అవకాశం వుంది. ఆ రసములను యీ మహాకవి చక్కఁగా చిత్రించాఁడు. కొలఁది మాత్రంగా మార్పుచేస్సి కన్నాఁడు. మొత్తంమీఁద చాలా భాగం సంగ్రహించి సుమారు 15 వందల పద్యాలలో కథ సంపూర్తిచేసి వున్నాఁడు. యిలాటి కవులు అసకృదా వృత్తిగా వాడిన పరిశుద్ధ ప్రయోగాలను వాడుకోక చాదస్తంగా వర్తించు నేఁటి కవులకన్న దైవ వంచితులంటూ వుండరు.*

—భారతి

విక్రమ - మార్గశీర్షము; డిసెంబరు 1940.
సంపుటము 17, సంచిక 12.

---

*ఇటుపైన ఈ వ్యాసమునందే శ్రీ వెంకటశాస్త్రిగారు ప్రసక్తాను వశమున ముద్దుపళని కవిత్వ విశేషములను వివరించి వ్రాసిరి. వాని నిందు గ్రహింపలేదు. వలయువారి వ్యాసశేషమును 'భారతి'లోఁ జదువుకొన ప్రార్థన—సంకలనకర్త.

# కళాపూర్ణోదయము–కథావధానకౌశలము

— శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి

సాధారణముగా మన ప్రబంధకవులు గ్రంథాదిని 'కథాక్రమం బెట్టి దనిన' అని మాత్ర ముపక్రమించుట యాచారము. కథయెత్తి చూత మన్నం బట్టుమని పది మాటలకుం జాలదు. ఏ వర్ణనమునకో రవంత సందు దొరకినం జాలును. "సూచీ ప్రవేశే ముసల ప్రవేశః"–మఱి దానిని విడువరు. ఆ వర్ణనములకును, ప్రధాన కథాంశములకును లేశమేని సంబంధ మగపడదు. కథ నుపక్రమించితి మను మాటనే విస్మరింతురు. ఇక నాయికానాయకుల సాంగోపాంగ వర్ణనమున నుపక్రమించిరా, సర్వమును మఱచి పూర్వప్రతిపాదిత మగు కథాభాగమును పాఠకులు విస్మరించునంతటి దీర్ఘప్రసంగములతోం బ్రకరణములు పెంచుట వీరి కభ్యాసము. ఇట్టి వర్ణనా బాహుళ్యము వల్లనే పెక్కు ప్రబంధములు విసువు పుట్టించుచుం బాఠకలోకము నాకర్షింపం జాలక విరళప్రచారములై కునుకుచుండుట.

కళాపూర్ణోదయమును బరికించినచో సూరకవి వర్ణన మార్గము మిక్కిలి విలక్షణముగ గోచరించును. కథాసరణి నుండి యొక్క క్షణమేనియు దృష్టిని వేఱొక వంకకు మరల్చకుండుట యాతని స్వభావము. ప్రధానేతివృత్తమునకు మూలాధార మనందగిన చతుర్ముఖాస్య చతుష్టయ ముఖచ్చుంబనాభిలాషమును – బంచమాశ్వాస విలాసఘట్టము (14వ పద్యమునం) బ్రవర్తిలిన దానిని గ్రంథావతారికలో "అనయము ప్రేమ సంధిలంగ నాస్యచతుష్టయ యౌగపద్యచుంబనకాంక్షం బోలె నిగమంబుల పేరట......" అని యిష్టదేవతా ప్రార్థనముననే యుటంకించి సూచ్యార్థ సూచనము గావించుటలోనే యాతని కథావధాన స్వరూపము పొడగట్టుచున్నది.

ఏదే నొక విషయ మతి విపులముగా వర్ణింపంబడవలసి యున్నను నొక్కొక్క యెడ నీతండు దానినట్లు వర్ణింపండు. అసలే వర్ణింపం డన్నను

ననవచ్చును. అయినను నావర్ణనీయ మగు వస్తువు విపులముగ వర్ణిత మైన స్ఫటికంబు నెన్నియో రెట్లు మనకుఁ బరిచిత మగునట్లును, నెంతో స్పష్టతర ముగ మన కది గోచరించునట్లును గథాంశముల మూలముననే యీతఁడు గావింపఁ గలఁడు. అట్లు గావించుట కీతఁడు కల్పించు సంఘటనములు రమణీయములు.

ఇఁక నెటనైన నల్పములగు వర్ణనములు చేసినను వాని నెల్ల నప్రకృత కల్పనలతో నింపక ప్రకృతకథకు సంబంధించిన యావశ్యక విషయములు కొన్నింటినందు సూచించుచు నీవర్ణన భాగములకు మిక్కిలి సార్థకతను, రమ్యతను గల్పించును.

వర్ణన భాగములందే కాక యొకకథ నుపపాదించుచు నడుమనడుమ మిక్కిలి ప్రసక్తముగా నితర కథాంశములు సంధానించుటయుఁ గలదు.

ఈ రీతిగా (1) వర్ణన కృత్యమును కథాంశములచే నిర్వర్తించుట, (2) వర్ణనములందు నయితము కథాంశములు సూచించుట. (3) ఒక కథలో నితర కథాంశములు సంధానించుట అను నీ మూఁడును నీతని క్రొత్త మార్గములు. వీనిని బట్టియే కథా విషయమున సూరకవి చూపిన యవధాన కౌశలము విశదమగును. ఇఁక నట్టి తావులు పరికింతము.

## 1. కథాంశములచే వర్ణనకృత్య నిర్వహణ :

సాధారణముగాఁ బ్రబంధములలో సూర్యోదయాస్తమయముల వర్ణనములు మాటిమాటికి మూసవు. కొంత కథ జరుగునప్పటికి సూర్యుఁ డుదయించుటయో, యస్తమించుటయో యనివార్యము గాన నట్టి సమయము సమీపించిన దనఁగనే కథా ప్రసంగము నిలిపి యా యుదయమునో, యా యస్తమయమునో యెన్నెన్నో కల్పనలతో నెంతో దీర్ఘముగా వర్ణించిన తావులు లెక్కకు మీఱంగనివి ప్రబంధములలోఁ జూపవచ్చును. కథావిచ్ఛేద హేతువు లగుట దప్ప నీ యుదయాస్తమయములకు నితివృత్తముతో నించుకయు సంబంధము గానరాదు.

కళాపూర్ణోదయ ప్రథమాశ్వాసకథ ప్రాతఃకాలమున జరిగిన దనుట కాధారములు లేవు. దీనిని బట్టి శ్రీకృష్ణుని దర్బారు ప్రత్యహమును ప్రాతఃకాలముననే జరుగుచుండెడి దని యూహింపఁ దగును. ఈ ప్రథమాశ్వాస కథ జరిగిన నాఁటి సూర్యోదయమునకును, నితివృత్తమునకును నతిగాఢ మగు సంబంధము లేదు. ఎట్లన—

ఒకప్పుడు రంభ యింద్రునితో బ్రహ్మ సందర్శనమున కేగి తన్మందిరమునఁ జిలుక యావర్తించుచున్న మణిత విశేషమును విని యున్నది. ఆ మణితము సరస్వతీ చతుర్ముఖుల శృంగార ప్రసక్తిలో సరస్వతి కంఠమునుండి వెలువడినట్లు చిలుకవల్లనే తెలిసికొన్నది. అప్పట్టున సరస్వతి గావించిన కట్టడచే నామణితము గాని, తదనుబద్ధ మగు కళాపూర్ణాది ప్రసంగములు గాని యప్రకాశ్యము లగుటచే వెలువరింపక దాఁచియుంచినది. అయినను నాకంఠస్వర మపూర్వము, శ్రవణ పేయము నగుటచే నితరులు లేకుండ నొంటరి నున్న సమయములం దా చిలుక వలెఁ దానును గొన్నిమారు లావర్తించి యుండునేమో! నేఁడు తన ప్రియునితో విమానము పయి వచ్చుచుండ నుదయకాల సూర్యబింబమును, దాని ప్రక్క నొక తెల్లని మేఘరేఖయు నామెకంటఁ బడినవి. ఏ వస్తువు లయినను జూచువారికిఁ దమతమ హృదయములలో నిరంతర సంచారముగల భావనల కనురూపముగ గోచరించుట స్వాభావికము. ఉదయసూర్యుఁడు బ్రహ్మరూపుఁ డనియు మధ్యాహ్న సూర్యుఁడు మహేశ్వరరూపుఁ డనియు, సాయం సూర్యుఁడు విష్ణురూపుఁ డనియు, నిట్లు సూర్యునికిఁ ద్రిమూర్త్యాత్మకత సుప్రసిద్ధము. దీనింబట్టి యుదయ సూర్యుని గాంచినతోడనే బ్రహ్మ యామె స్మృతికిఁ దగిలినాఁడు. ఆ సమీపమున నున్న తెల్లని మేఘరేఖ నిరంతర ప్రియసంగమ శృంగారలీలా నిమగ్నమగు నామెచిత్తమునకు సరస్వతిగా గోచరించినది. శారదాంబ తెల్లని దగుటయుఁ బ్రసిద్ధముగదా! ఆమీఁదఁ గ్రమముగా బ్రహ్మ సరస్వతుల యలనాఁటి విలాస విషయములు చిలుకవల్లఁ దాను వినినవెల్ల జ్ఞప్తికి వచ్చినవి. ఈ భావనాపరంపరల నడుమ నామె నలకూబరునితో నించుక సరసము లాడ నాతఁడు దంతక్షతి గావించుట తటస్థించినది. ఆ సందర్భమున నప్పటి కపుడే జ్ఞప్తికిఁ దగిలి యున్న యాకంఠ

స్వరమును ననాలోచితముగఁ దటాలున రవంత వెలువరించినది. అంతట నలకూబరుఁ డట్టి మణితవిశేషము నెన్నడును వినిపింప కుండుటకు నిమిత్త మడుగుటయుఁ, గళాప్రపూర్ణ ప్రసంగములు రాకుండుటకై గుప్తము గావించితి నని యామె బదులు పలుకుటయు, నింకను నీరీతిగ నెన్నియో ప్రశ్నోత్తరములు—భావికథా బీజములు, నితివృత్తైకదేశములు ననఁ దగినవి పరంపరలుగా సాగినవి.

నాఁడు వారు బయలుదేరినది సూర్యోదయ కాలమే కాకున్న యెడ నీ ప్రసంగ పరంపరకు నిసుమంతయు మూల మేర్పడి యుండదు. ఇట్టి కథా బంధము గల సూర్యోదయమే యితర కవులకు లభించి యుండునేని, దొరికినదే సందుగా నెన్ని వందల పద్యముల దొంతరలు పేర్చి యుందురో: ఇట్టి సూర్యోదయమును సూరనార్యుఁ డొక పద్యముతో నయిన వర్ణించుటకుఁ బూనుకొనఁ డయ్యె. ఇట్టి ముఖ్యాంశములు తటస్థించునెడ వానిని విపులీకరింపక సూక్ష్మ మార్గమున సూచించుచుఁ బాఠక హృదయముల కందించుట యాతని స్వభావము. కావుననే రంభానలకూబర విమానము మేఘముల మఱుఁగు వీడి నారదునికిఁ గానవచ్చిన దని చెప్పు సందర్భమున "బాలారుణ భానుబింబ ముదయాద్రి మఱుంగును బాయు చాడ్పునన్" అని యీ సూర్యోదయమును రేఖామాత్రముగ నిర్దేశించియున్నాడు. ఇట్టిదో, యింత కన్నను బ్రశంసాపాత్రమో మఱొక్క విషయము.

ప్రబంధములలో నాయికావర్ణన మెంత విపులముగఁ జేయఁబడినను నాయికను నాయకుఁడు వలచినాఁ డనుటకుఁ దప్ప మఱి యెందులకును దాని యావశ్యకత యుండదు. అనఁగా నాయికా సౌందర్యవర్ణనమునకు నితివృత్తముతో నేకీభావము శూన్య మన్నమాట. చూడఁ జూడ నాయికా నాయకుల ప్రత్యంగవర్ణన మన్ని గ్రంథములలో నించుమించు తుల్యరూపమై యుండుటం జేసి "కవులు కల్పనములకై యళీకముగా నిట్లు వర్ణించుట యాచార"మను భావము పాఠకులకు నాటుకొనును. ఇట్టి యస్వాభావిక వర్ణనములవల్ల నా యా పాత్రముల రూపరేఖ గోచరించుట మాత్రము కల్ల.

నాయికా నాయకుల సౌందర్య వర్ణనము విషయమున సూరనార్యుని పద్ధతి మిక్కిలి విభిన్నము. కలభాషిణీమణికంధరు లొకరినొకరు ప్రేమించుట మాత్ర మేతద్రూప వైభవమునకుఁ బ్రయోజన మయి యుండునెడ సూరకవి తద్వర్ణనము నుపేక్షించినచో నాతని నంతగా స్తుతింపను గాని యిచటి సందర్భ మంతమాత్రమే కాదు. ఈ నాయికా సౌందర్యమునకుఁ బ్రధాన కథతోడి సంబంధము మిక్కిలి గాఢ మనక తీఱదు. ఈమె సౌందర్య మనితర సాధారణమే కానియెడ నీ కథాభాగములో ముందు వంతులకు స్వస్తి చెప్పవలసియుండును. ఒక్క సౌందర్యమే కాక యీమె గానకళా ప్రావీణ్యాదులు కూడ నిందుఁ బ్రధాన కథాంగములు. చూడుడు :

"పదిలముగ నిర్వివక్షా
భ్యుదయ మహారాజ్యలక్ష్మి వొందున్ వశతన్
సదమల రూప సుగానా
స్పద వారవధూటి నిచట బలిగా నిడినన్"

(3.120.)

అని మృగేంద్రవాహనా శిలాశాసనము. ఇట్టి వధూటికై సామాన్య దృష్టి శ్రవణములతోఁ గాక దూరదృష్టి దూరశ్రవణములతోఁ బ్రపంచము నంతను గాలింపఁగా శాసన లక్షణములకు సర్వథా తగియున్నది కలభాషిణియే యని మణిస్తంభునికి నిర్ణయ మేర్పడినది. అట్టి నిర్ణయము లేకున్నచో నాతఁ డామె నంతటి ప్రయత్నముతో శక్తియాలయమునకుఁ గొనిపోవుటయే తటస్థింపదు. ఆలయమున కేగినచో నీమె మణికంధరు తపోవనము చేరుటగాని, యచటి రంభా నలకూబరుల తాలుమాలులుగాని, యుత్తర కథకు మూలము లగు బలివిధానాదులు గాని యెంతమాత్రమును బ్రసక్తములై యుండెడివి కావు. అనఁగాఁ గలభాషిణి సౌందర్యమును, గానకళా నైపుణియు లోకోత్తరములు గాకున్నచో నీమె ద్వారకను విడుచుటయే సంభవింపదు గాన నంతకు దాఁటి యీ కథ రేఖామాత్ర మయిన నవ్వలికి సాగియుండదన్న మాట. ఇంత గాఢతర మగు కథానుబంధముగల యీ సౌందర్యాదులను మన సూరకవి పట్టుమని పది పద్యములతో నైన వర్ణింపఁ

డయ్యె. అందులకే యీతని నంతగా స్తుతించుట. ఇట్టి విషయములకు ప్రత్యేక వర్ణన మీతనికి రుచింపకున్నను గ్రథైకదేశములును, గథా మూలములు నగు నిట్టివి యవశ్య నిరూపణీయము లగుటచేఁ బాత్ర ప్రసంగములలో నిమిడ్చి మనకు గోచరింపఁ జేయుటలో నీతని కౌశల మద్వితీయము.*

## 2. వర్ణనములందుఁ గథాంశ సూచనము :

పురవర్ణనము — ఈతఁడు ద్వారకాపుర స్వరూపము స్థూలముగా గోచరించుట కయి తద్వర్ణనము నించుక స్పృశించియున్నాఁడు. పరిశీలించినచో నందుఁ బ్రకృతాను బద్ధము లగు నంశములు పెక్కులు సూచితము లగుట పొడగట్టును. 1. రంభ కలహము. 2. అకాలసంగమము. 3. ద్వారకలోని యుపవనసమృద్ధి. 4. మణిత ప్రసంగము నను వానికీ యితివృత్తమున మిక్కిలి ప్రాముఖ్యము గలదు. ఆ ప్రాముఖ్యము నిట వివరించినచో గ్రంథ విస్తర మగును.

సముద్రవర్ణనము [చతుర్థాశ్వాసము సందర్భి] * — ఈ వర్ణనమున మనము పాటింపఁ దగిన ముఖ్యాంశములు రెండు గలవు.

(1) ఆఱవ యాశ్వాసమున నలకూబరు చరిత్రమున నాతని భార్యలు సముద్రమునఁ దిమింగలములచేఁ గ్రసింపఁబడి తిరిగి దాని శిరోరంధ్ర మార్గమున గగనమున కెగసి యొక విమానమునఁ బ్రవేశించిన కథాంశము గలదు. తిమింగల శిరోరంధ్ర వినిర్గమము తప్ప నయ్యంగనలు జీవించుటకును, దరువాతి చర్యలకును మార్గాంతరము లేదు. తిమింగిల శిరోరంధ్ర పద్ధతి సామాన్య జనానుభవమునకు గోచరింపని దగుటచేఁ దత్కల్పన మసంభావ్యముగఁ గొందఱకుఁ దోఁచునేమో యని తజ్జంతు స్వరూపమును ముందుగాఁ దెలుపుటకుఁ గావలయు నీ సముద్రవర్ణనమున నొక్క పద్యముననే కాక వరుసగా రెండింటియందుఁ దిమింగల శిరోరంధ్ర ప్రసంగమును దెచ్చియున్నాఁడు. దాని కట్టి శిరోరంధ్ర ముండుటయ కాక దానినుండి చిమ్మఁబడిన యుదక మతివేగముతో గగనమున కెగయు నను నంశము గూడ నలకూబర భార్యల విమానప్రాప్తికి నావశ్యక మై యున్నది. అట్టి వేగ

మును సయితము బోధింపఁ దలఁచియే 'చిమ్మెడు చిమ్మగ్రోవి నీరనన్' అనియు, 'భోగి యుస్సురనఁ దన పడ గెత్తెనో యనంగ' అనియు సవిశేష ముగాఁ బలుకుచున్నాఁడు.

(2) మున్ముందు మణిస్తంభునికి విపరీతరతేచ్ఛ గలుగుటయు, నా సందర్భమున నా దంపతుల స్త్రీ పురుష రూపములు సయితము వ్యత్యస్తము లగుటయుఁ, గ్రమమున వారికిఁ గళాపూర్ణుఁ డుదయించుటయు నిరూపింపఁ బడును. శక్త్యాలయమున విరక్తుఁడుగా నగపడుచున్న యీ జోగికి నొక్క మాఱుగా సంగమాభిలాషయు నందును స్త్రీత్వాభినయవాంఛయు హఠాత్తుగఁ గలిగిన వన్నచోఁ బాఠకులు విస్మయ పడుదురు. ఆకస్మికముగ మనసున కంతటి మార్పు గలుగుట సంభావ్యమా యని శంకింతురు. అట్టి శంకలకుఁ దావు లేకుండ సముద్రవర్ణన ప్రసంగమున సిద్ధుని చిత్తవికారము లకుఁ గ్రమపరిణామమును జూపుచున్నాఁడు.

తొలుత గగనవిహారాభిలాషము పొడమిన క్షణముననే యాతని మానసము వినోదములపయి నించుక వ్రాలిన దని తలంపవచ్చును. అట్టి మనసుతోఁ బ్రియురాలిని వెంటనిడుకొని గగనమునఁ బోవుచు దిగువను మహా సముద్రమును జూచుట తటస్థించెను. అమేయమగు దాని మనోజ్ఞకముచే నాతని మానసమున మఱింత యుల్లాసము జనించినది. అపుడు తిమింగిల శిరోరంధ్ర మార్గమున నిర్గమించు జలధార లగపడఁగ సముద్రుఁడు తన ప్రియురా లగు మందాకినిపైని బరిహాసమునకై చిమ్మనగ్రోవితో నీరు చిమ్ము చున్నటులు తన భార్యతోఁ బలుకుచున్నాఁడు. అనఁగా నిప్పటికి దంపతులు జలక్రీడలాడు వినోద మాతని మనసునకుఁ దాకిన దన్నమాట. క్రమముగా 'ఔర్వము పేర', 'వికచాబ్జానన' అను పద్యములలో 'ఈపయోధి సుపర్వ సింధువును గౌఁగిటఁ జేర్పఁ గడంగు కైవడిన్' అనియు, 'ఈపయోధి' 'యాచరింపఁ గడఁగున్ దివ్యాపగా శ్లేషమున్' అనియు నాతఁ డాడిన పలుకులం బట్టి యాదృశ్య మాతనికి నాలింగనాభిలాషము నొదవించె నని యూహింపఁ దగును. అనంతరము "ఉదకము గ్రోల వ్రాలెడు పయోద" మును బరికింపఁగాఁ దనప్రియురాలి పౌరుషకేళీ వినోదముపై నాతని మనము లగ్నమైనటు లూహింప వలయును.

ఇటు లీ వర్ణనమున నాతని శృంగారభావముల యుద్రేకము సోపాన క్రమమునఁ జూపఁబడిన ట్లూహింపవలయును. పయిరీతిని గంటి కగపడిన వానికెల్ల శృంగార సమన్వయము సేయుచుఁ బలికిన సరసోక్తుల ఫలితముగా 'కోమలి లజ్జావనత ముఖి' యగుటయు, నాతఁడు 'తద్విలసన జృంభిత కుసుమశర వశంవదుఁ' డగుటయుఁ దుదిపద్యమున విశదమగుచునే యున్నది. ఈ పద్యమును బట్టియే యీ తావున మణిస్తంభుని రాగాంకురమునకుఁ గమాభివృద్ధి సూచిత మగుట కవి కభిప్రేత మని దృఢముగా నిశ్చయింపఁ వచ్చును.

పై రీతిని వర్ణనములందుఁ గూడ నేమఱుపాటు లేక కథాంశములు స్రూచించుట కడుంగడు రమణీయము. ఈ యవధాన మనన్య లభ్యము. ఇఁక మూఁడవ మార్గము.

3. ఒక కథలో నితర కథాంశ సంధానము :

అచ్చటచ్చట సంధానింపఁబడిన యంశములు కొన్ని యుత్తర కథాంశోప పత్తికి సాధనము లగుటంజేసి యత్యావశ్యకము లయి యుండును. అయ్యవి సాధనములుగ నుపయోగింపఁబడిన పిమ్మటఁ గాని తొలుత వాని ప్రాముఖ్యము మనము గుర్తింపనే లేము. అవి యేవో చిల్లర విషయము లనునట్లు తొలుత మనకుఁ దోఁపించి కథ సాగినకొలఁది వాని ప్రాముఖ్యమును బయటఁబెట్టి మనలను విస్మయ పఱుచుట సూరకవి చాతుర్యము అట్టివానిఁ గొన్నిటి నిఁకఁ బరామర్శింతము.

సుముఖాసత్తి సత్యవచనత:—మృగేంద్రవాహన యొద్ద నేరీతి నయిన దేహత్యాగ మొనరించు వృద్ధులకుఁ జరమక్షణమునఁ గలిగిన కోరిక శాశ్వతముగ సిద్ధించు ననుట శాసనలిఖితము. మరణ సమయమున సుముఖాసత్తి చిత్తమునకు రవంతయు నిశ్చలత లేకపోయినది. ఆ దశలో నామె హృదయము భయభ్రాంత మై కరుణోత్తరంగిత మై కలభాషిణీ రక్షణాకులితము కావలసివచ్చినది. ఆ తొట్రుపాటులో నేదే నొక కోరికను దాను సాధించుకొనవచ్చు నను సాధనవిధానాంశ మామె చిత్తమునకుఁ దగిలియేయుండదు.

ఆ సమయమునఁ గలభాషిణిని బలియిచ్చుటకు సన్నద్ధుఁడై యున్న సిద్ధుని ఘోరకృత్యము వారింపఁబూని దేవిపై నొట్టువెట్టి 'ఈ శపథము నుల్లంఘించి నచో నీ కార్యము సిద్ధింపదు సుమీ' అని సిద్ధుని నదలించుచు 'తల్లీ! నన్ను సత్యవచనం గావింపుమీ' అని దేవిని బ్రార్థించినది. అనఁగా 'దేవీ: వీనికిఁ గార్యసిద్ధిఁ గలిగింపరాదు సుమా!' అని యింత మాత్రమే యామె ప్రార్థ నోద్దేశ్యము. ఐనను శిలాక్షరములు తప్పరాదు గావునఁ జరమకాల కాంక్షిత మగు సత్యవచనత శాశ్వతమై యామెకు సిద్ధించినది. దానిని దాను గోరి నటులు గాని, యది సిద్ధించినటులు గాని యామె యెఱుఁగనే యెఱుఁగదు. అది ప్రయత్నపూర్వక మగు కోరిక గాక తాత్కాలిక ప్రసంగ మాత్ర సంబద్ధ మగుటచే నా కోరిక విషయమును నాపిమ్మటఁ గూడ నామె యెఱుఁ గుట కవకాశము లేదు. ఆ సత్యవచనత్వ మామెకు శాశ్వత మైనట్లును, నామెకుఁ గూడ నజ్ఞాత మైనట్లును మున్ముందు (5.96) సుముఖాసత్తి మణి స్తంభుల స్త్రీ పురుషత్వ విపర్యయమునఁ దేట తెల్లమగును.

దూరము పరికించినచో నతర్కితముగా నీమెకు సిద్ధించిన యీ సత్య వచనతకు నితివృత్తమునఁ గొండంత ప్రయోజనము గలదు. ఈమె సత్య వచనయే గాకున్నచో నీ గ్రంథమున సరస్వతి అసత్యవచన కాకతీఱదు. భార్యకు గర్భము గాకుండ భర్తకు వర మిచ్చినది. సుతుఁ డుదయించునట్లు భార్యకు వర మొసఁగినది. గర్భమే లేకుండఁ బుత్రోదయము గలుగు నింద్ర జాలము సూరనార్యుఁ డెట్లు పన్నునా యని యిది తేలునంత దనుక నెంతో వేగిరపాటున నూఁగు లాడుదుము. మనకే కాదు — శ్రీశైలమున స్వభావ సిద్ధునికిని నిదే జిజ్ఞాస కలిగినది. అతఁడు సుగాత్రీ శాలీన వృత్తాంతము మణి కంధరుని వలన విని, శారదాదేవి వీరి కిచ్చిన విరుద్ధ వరము లెట్లు ఫలితము లగునో యని యొకింత చింతించి, యవి యట్లట్ల సఫలంబులు గాకమానవుగా యని సరిపెట్టుకొన్నాఁ డఁట. ఆ తావు పరికింపుఁడు (5-183). ఈ సంద ర్భమున మఱొక్కమాట మనము జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలయును.

సరస్వతీ చతుర్ముఖుల విలాస ప్రసంగమున శారదా కోపోపశాంతి కయి చతుర్ముఖుఁడు చమత్కారముగ నప్పటి తమ చర్యలనే "అనఁగా

పనఁగా నొకరా"జని కథగా గ్రుచ్చి చెప్పుచు నా రాజునకుఁ దండ్రి సుముఖాసత్తి యనియుఁ, దల్లి మణిస్తంభుఁ డనియుఁ బలికియున్నాఁడు. ఈ తారుమారు పలుకులతోనే శారద కోపము చల్లారినది. కథయంతయు ముగిసిన పిమ్మట మరలఁ దత్ప్రసంగము లేతేర నింతటితో నంతరింపక యిదంతయు భూలోకమున నిటులే జరుగఁ గల్గదని యాతఁ డని యుండెను.

"అనిన సరస్వతి యద్భుతం బంది యొక్కింత విచారించి కాంతుఁ జూచి యారాజునకు సుముఖాసత్తి యనునది తండ్రియు మఱి మణిస్తంభ నాముఁ డనువాఁడు దల్లియు నయ్యెదరే" అని యడిగినది. "అందేమి సంశయం బదియు నీదు చేష్టా విశేషంబుచేతన కాఁగలదు" అని బ్రహ్మబదులు పలికినాఁడు. ఆ తబ్బిబ్బు నీ వల్లనే జరుగునను పలుకునం దెంతో విశేషము గలదు. శారదాదేవి సుగాత్రీశాలీనులకు విరుద్ధవరము లొసఁగుట వల్లనే కదా మణిస్తంభ సుముఖాసత్తుల రూపవ్యత్యయ మావశ్యక మయినది. ఇది లేకున్న శారదా వరములు ఫలితము లగుటకు మార్గాంతరము గానరాదు. ఈ రూప వ్యత్యయమునకు సుముఖాసత్తి సత్యవచనతయే సాధన మయినది ఎటులందురా?

కొంతతడవు గగన సంచారము గావించి మణిస్తంభ సుముఖాసత్తు లొక వనము చేరినారు. అందు మణిస్తంభుఁడు "ఓ యతివ నీవు పురుషుఁడవు గమ్ము నారీత్వమును భజింతు నే" ననుచు విపరీత రతేచ్ఛతోఁ బలికెను. సుముఖాసత్తియు

"స్త్రీత్వము నీవొందుము పురు
షత్వము నేఁ దాల్తునని నిజప్రియుఁ బలికెన్
సత్వరత నట్లు వారల
స్త్రీత్వము పురుషత్వము విపరీతము లయ్యెన్".

ఈ సందర్భముననే కళాపూర్ణు, డుదయించినాఁడు. శారదావరములా సఫలము లయినవి. ఇంత ప్రయోజనము గల యీ సత్యవచనతను నెంత నిగూఢముగాఁ, బ్రసంగోచితముగా, ననాయాసముగా సంధానించి

యున్నాఁడో పరికింపుఁడు. స్త్రీపురుష రూపములు తాఱుమా అగు దాఁక, మనకేగాదు ఆ సుముఖాసత్తికిఁ గూడఁ దెలియదాయె! చాతుర్యమన్న నిటు లుండ వలయును.

కవి స్పష్టపరపకున్నను నీ సత్యవచనతా పరామర్శము గల మరికొన్ని తావులు మనము గుఱుతింప వచ్చును. మణికంధరుఁడు కలభాషిణిని బలి యిచ్చు సమయమున సుముఖాసత్తి తనకుఁ బ్రణమిల్ల వచ్చిన కలభాషిణితో "మన నెమ్మనంబుల కూర్మి యింతటన పోయెనే! మీఁదట నైన నీ పతియు నీవుఁ గోరినట్లు మమ్ముఁ గురు[4] భావంబు నడపుకొనియెదరు ..... పరమ పతి వ్రతలై వెలయుము రాజ్య[3] వైభవానుభవం బెంతే వర్తిల్లఁగ నలరుచుఁ బోవుఁడు మముఁ బోంట్ల నీవిభుండును నీవున్ .... .... [2]పెండ్లికి బోవునట్లు గన్పట్టుచు నున్నదాన వతిభవ్య వికాశము నుబ్బుచూడ నిన్నట్టిగ నెన్న దేవతవొ గాక నరాంగనవే మృగేక్షణా!" అని పలికియున్నది. ఈ పలుకులెల్లఁ దత్కాలపుఁ బ్రసంగమునకు మాత్ర మనుగతము లగుచున్నటులు గోచరించుచున్నను నివి యన్నియుఁ గథాభాగము లందు యథార్థములై ప్రవర్తిల్లుట పరికింపఁ దగును. 1. కలభాషిణి నిజమునకు నరాంగన గాక దేవలోక వాసినియగు శుకాంగన కదా! 2, ఈ బలి విధానమున శరీరము వీడిన పిదప గలభాషిణి గావింపనున్న ప్రధానకృత్యము కళాపూర్ణుని బెండ్లియాడుటయ గదా! 3. తదుపరి రాజ్యవైభవము సిద్ధంబగదా! 4. తమతోడి సంబంధ మింతటితోన యంతరింపక యనంతర జననమునఁ గళాపూర్ణ మధురలాలసలు తమకుఁ గొడుకు గోడలునై తమ్ము గురుభావమున నారాధించుటయుఁ దప్పదు కదా!

ఇటు లీమాటలు సత్యము లగునని సుముఖాసత్తికిఁ దెలియదు. కలభాషిణియు నెఱుఁగదు. చెంతనున్న మణిస్తంభ మణికంధరులును నెఱుఁగరు. కవి యొక్కఁడు మాత్ర మెఱుఁగును. పర్యవసాన మారసిన పిమ్మటఁ జదువరులు తమంతఁ దామే యెఱుఁగవలయుఁ గాని సూచనామాత్ర మయిన గావింపఁడు, అదే యాతని కున్న కొంటె తనము; ఈ రీతిగా నీతఁడు సంఘ

టించిన యంశములు పెక్కుగలవు. వానినెల్ల నిట్లు వివరించుట గ్రంథవిస్తర హేతువు. *

ఇంతదనుక మనము పరిశీలించిన యంశములఁ బట్టి కథాంశసంఘటనమున సూరనార్యుని దృష్టి యెంత సూక్ష్మమో, యెంత నిశ్చలమో తేటతెల్లము గాక మానదు. ఇంత యేల? ఈతఁడు తన పాత్రములకు నామకల్పనము చేయుటలో సయిత మిట్టి దృష్టిని విడిచి యుండలేదు. బ్రహ్మసరస్వతుల విలాసకథలోని సంజ్ఞలే కళాపూర్ణ కథలోని పాత్రముల కుండవలసిన నిర్బంధ మున్నను నాయా పాత్రముల ప్రత్యేక కథాభాగము లందలి ప్రధానాంశముల స్ఫురింపఁజేయు నామ కల్పనము చేయఁగలిగిన యీ మేధావి నెంతని పొగడఁ గలము? మణిస్తంభుఁడు సుముఖాసక్తి, కళాపూర్ణుఁడు, మధురలాలస, మదాశయుఁడు,సత్త్వదాత్ముఁడు, మున్నగు నామధేయముల సార్థకత యెట్టిదో, కథాంశ స్ఫోరకత యెట్టిదో, దానిని మనము గుఱితింతుమో లేదో యని యాయానామముల యర్థములు వివరించుటలో నాతని మెలకువ యెట్టిదో, తానే వివరించుట తగదని వానినెల్లను బాత్రములచే నిర్వచింపఁ జేసిన లాలిత్య మెట్టిదో యా నిర్వచనములు ప్రసక్తములై ప్రకరణోచితము లగునట్లు గావించిన చాతుర్య మెట్టిదో దూరముగాఁ బరికింపుఁడు. కలభాషిణి, మధురలాలస యనుపేరులు (1-129, 7-86) లలో నిర్వచింపఁబడినవి. వానిలో నింకను నర్థవిశేషము గోచరించును. చిలుకయే కలభాషిణి, యదే మధురలాలస యని యావ్యక్తుల యైక్యమును నిటఁ గూడ స్ఫురింపఁజేయ సూరకవి యుత్సహించి యుండునేమో! ముద్దుపలుకులు గలది, మధురఫలము లాసించునది యను నర్థము లాపేరులందు స్ఫురింపఁ గలవు. ఊహింపుఁడు!

కథనుబట్టి పాత్రములకు నామములు కల్పించియుండునా, విలాసకథాసిద్ధములు గావున నామములను బట్టి కథాంశములు కల్పించి యుండునా యనిపించును. కళాపూర్ణకథకు శారదావిలాసకథ మూలమని గ్రంథమునఁ దెలియున్నది. కాని తొలుతనే కళాపూర్ణకథ నల్లుకొని, యందలి యవాంతర కథాంశములకుఁ దగియుండు పేరులు పాత్రముల కమర్చుకొని యాపిమ్మట

వీని కనురూపముగ విలాస కథాభాగములు కుదుర్చుకొని యదియే మూల మని తిరుగవైచి యుండునా యని యొక సందేహము, పోనిండు. చెట్టు ముందా విత్తు ముందా యని యీ తీఅని శంకలు మన కెందులకు? అసాధారణ కథాసంవిధాన చాతురి మెఱయించినాఁడు. అద్వితీయ మగు గ్రంథ రాజము వెలయించినాఁడు, కళాపూర్ణోదయ మని నామకరణము గావించి పూర్ణ చంద్రోదయము వోలె మీదికి యాహ్లాదజనకము కాఁగలదని సూచించి నాఁడు. కవితా కళా స్వరూపము పూర్ణముగ దీనితోనే యుదయంబు గాంచిన దను భావము సయితము ప్రబంధ నామముననే పదిలపఱిచినాఁడు. తనివిదీఱఁ జదివి చదివి, "నవలలు చిన్నెలు వన్నెమీఱ, నాటకరీతులు తేట పడఁ బ్రబంధమ్ము నిబంధించి, మూఁడు శతాబ్దుల ముందటినాఁడే యిట్టి కవితాశిల్పము నెట్టు చూపఁగలిగితివోయీ!" యని సంభావించుచు సంత సించుట మన కర్తవ్యము.

శిల్పమన్నతోడనే మఱొక్కమాట జ్ఞప్తికి దగులుచున్నది. యమునా తీరమున బృందావనమున దేవాలయమునందు సుగ్రహుఁడు మణిహారము మఱచి యుండెను. ఆ మఱచుట వల్లనే యెన్నియో వింతలు, విశేషములు నుప్పతిల్లినవి: అచటి మఱపునకు నిమిత్తము యతీంద్రుని శాపము. దానికిఁ గారణము యతీంద్రుని మనోవ్యథ. దానికి నిమిత్తము సుగ్రహుని పరిహాసము, దానికి మూలము యతీంద్రుని దేవాలయ ద్వారదేశ ప్రతిమా లింగనము, దానికి హేతువు ప్రతిమారామణీయకము. ఈ రీతిని గార్యకారణ కలాపము నల్లుకొనుచుఁ, దన కథాకల్పనా కృత్యము దాను నిర్వహించు కొనుచు నా ప్రసంగమున ఏనాఁడో విరక్తుఁ డయి నారాయణ స్మరణతోఁ గాలము గడుపుచున్న యా సన్న్యాసిని సైతము ముగ్ధునిఁ గావించి కామ వికారాయత్తునిఁ జేయజాలిన యా ప్రతిమా రామణీయకము మనకుఁ దెలుపుచు భారతీయ ప్రాచీన శిల్పకళోన్నతి నెంత మెలఁకువతోఁ బరామర్శించు చున్నాఁడో పరికింపుఁడు.

"ఆ యతీశ్వరుఁ డంత నతిరమ్యమైన యా
లెప్పంపుఁ బూఁబోఁడి యొప్పుచూచి

భళిర ! శిల్పికులేంద్ర ! బ్రహ్మను మీఱి తే
పగిదిఁ జేసితిర యీ ప్రతిమ ననుచుఁ
దనమదిఁ గడుమెచ్చి తల యూఁచుచును నిట్టి
పడఁతులు గలరొకో పుడమి ననుచు
నిట్టిది సన్న్యాసి నీక్షింపఁ దగదని
మార్మోము వెట్టుచు మఱియు మఱియు
నిచ్చఁ గ్రమ్మఱఁ జూచుచు నేమి చెప్ప
నతను వికృతికి లోనయ్యె"

(8-169)

"…. …. అంత నెమ్మనమునఁ బట్టలేక ప్రతిమన్ బిగియారఁ గవుంగలించె"

(8-171)

ఇచటి యీ చర్యవలన వ్యక్త మయినటు లా ప్రతిమ చక్కఁదన మెన్ని పద్యముల వర్ణించినను గోచరించునేమో యోజింపుఁడు. రవ్వంత యవకాశములోఁ బగోతుభంగిని యథాలాభముగ భారతశిల్పను నెంతగా సంభావించినాఁడో పరిశీలింపుఁడు. ఇట్టి మెలకువ లెన్ని తావులనో యుండును. ఆ దృష్టి సర్వతోముఖము. ఔచిత్యలాలితము. కథాంశములందుఁ జెక్కు చెదరని యవధానము చూపుచు నడుమ నడుమ నిట్టి యంశములందు సయి తము సూక్ష్మదృష్టి చూపించుట యీతనికే చెల్లినది, ఒక్కటి చూడుఁడు. ఆనాఁడు ద్వారకాపరిసరమున రంభానలకూబరులు తమ విమానము నుండి నారదునిఁ గలభాషిణి యేలదోఁటలోనికి డించిన పిమ్మట నెదుటఁ గాన్పించు వాసుదేవుని ప్రాసాదరాజంబునకు రంభానలకూబరులచేఁ జేతులెత్తి మ్రొక్కిం పకుండ వారి విమానమును బోవనిచ్చినవాఁడు కాఁడు. ఎంత సూక్ష్మమున నెంతటి యౌచిత్యమును, నెట్టి స్వాభావికతను వెల్లడించినాఁడో కనుఁగొనుఁడు.

ఈ వ్యాసమునందుఁ జూపఁబడిన తావులందేకాక యితర స్థలములందును సూరనార్యుని కౌశలమును, సూక్ష్మదృష్టిని, నింకను నితర విశేషములను సవిమర్శముగాఁ బరికించి యీ కవితల్లజుని ప్రతిభా వైభవమును సితోధికముగా బయలు పఱుపఁ జాలినయెడ మనము కృతజ్ఞుల మగుదుము. అతఁడు కృతార్థుఁ డగును.

—భారతి
వృష, మాఘము, ఫిబ్రవరి, 1942.
సంపుటము 19; సంచిక 2.

—X—

* ఇట్టి చుక్కలున్న చోటులందు వ్యాసమును సంక్షేపించుటకై కొంత భాగము వదలుట యైనది. సంకలన కర్త.

# వసుచరిత్రలోని వైచిత్రి

—శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

వసుచరిత్రము ఆంధ్రమున నొక విలక్షణమైన కావ్యము. ఆంధ్ర కావ్యములలో దానికి ప్రత్యేక స్థానమున్నది. రామరాజభూషణుఁడు దానిని వ్రాసిన నాటనుండి సంస్కృత కవుల కాలిసత కొంత తుంటుపడె ననియే చెప్పవలెను. శబ్దశాసనుఁడు భాషాంతరీకరణముతోనే యాంధ్రమునకు శ్రీకారము చుట్టినాఁడు. నాటనుండి కవులందఱు 'యద్యదాచరతి శ్రేష్ఠః' యని యా మార్గముననే యనుసరించిరి. కొందఱు గీర్వాణమునుండి కథలు దీసి కొని 'తమది కొంత, తాళ్ళపాకవారిది కొంతగా' రచన సాగించిరి. ఈ పద్ధతులలో తెలుఁగువారి సొమ్మంతయుఁ దమనుండి యెఱవు దీసికొన్నదే గదా యను భావము సంస్కృత కవులలో నాటుకొని పోయెను. ఉభయ భాషలలోని తళుకు మెఱుగులను దఱచి చూచిన యుద్దండుఁడు కవిసార్వభౌముఁడు. అంతటి వానితోగూడ సంస్కృత పండితులు "నీడు, ము, వు, లు" నీవు దీసికొని మానైపథమును మాకి "మ్మన్నారఁట!" ఆంధ్ర భాషామయమైన కావ్యము — అయోమయ విభూషణ మను తలఁపు నాటి ప్రతి గీర్వాణ కవికి నుండినదే, ఒకసారి పెద్దనామాత్యుల కడ నీ ప్రస్తావనయే రాగా = వారు "సంస్కృతారణ్య సంచార విద్వన్మత్తేభ శృంఖలం" అని బదులిచ్చి యా పండితుని ముఖభంగ మొనర్చిరఁట! ఈ లొసఁగులలో సిద్ధికారము న్యాయముగ పెద్దనల కంటె — భట్టుమూర్తి కెక్కువ యేమో నని నా తలఁపు. వసుచరిత్ర దల యెత్తుటతోఁ — దెనుఁగువారికిఁ గొంత యాశ్వాసము గలిగినది. తమ గొప్పలు చెప్పి కొనుట వదలిపెట్టి, సంస్కృత కవులు దానిని శ్రవ్యకావ్యముగను. దృశ్యకావ్యముగను ననువదించుకొనిరి. ఆనందగజపతి వంటి రసిక ప్రభువుల కొలువుకూటములలో పండితుల ప్రజ్ఞకది నికషోపల మయ్యెను. ప్రఖ్యాత కవి పండితుఁడు అప్పయ దీక్షితుల శిష్యుఁడు కాళహస్తికవి వసుచరిత్రమును శ్రవ్యకావ్యముగ ననువదించి

నాఁడు. 'పేకినూరె' యను కవి-దానినే నాటకముగ వెలయించెను. పైరెండును సంస్కృతమున సాగిన యనువాదములు. వసుచరిత్ర సౌభాగ్య మంతటితో నాగలేదు. 'అంబలత్తాడు మయ్యూర్' అను తమిళకవి దానిని తమిళమున ననువదించినాఁడు. లక్ష్మీశుఁడు గన్నడమున శ్రేష్ఠుఁడైన కవి. అతఁడు జైమినీ భారతమును రచించెను. దాని నిండ వసుచరిత్ర ఛాయ లున్నవి.

ప్రాచీన కావ్యములలో వసుచరిత్ర కున్నన్ని వ్యాఖ్యలు మరి దేనికిని లేవు. శిష్టు కృష్ణమూర్తిగారు సంగీత సాహిత్యములయం దసాధారణమైన ప్రజ్ఞ గలవారు. వసుచరిత్రకు వారి దొక వ్యాఖ్య యున్నది. దానిలో, వసుచరిత్రలోని యేయే పద్యము నేయే రాగమునఁ బాడవలెనో, సంప్రదాయమును సంతరించి, వారు చెప్పిరి. కాని, యా వ్యాఖ్య నేటికిని ముద్రింపఁ బడలేదు. ముద్రింపఁబడునన్న యాశయునులేదు. మొన్న మొన్నటి వఱకు ముఖ్యముగ రాయలసీమలో, భిన్నరాగములలో, వసుచరిత్రలోని పద్యములను పట్పదుల వలె, ఏలల వలెఁ బాడుట వాడుకలో నుండెను. తక్కిన యన్ని సుగుణములవలెనే, నేటికీ పద్ధతియు నంతరించింది. 'లలనాజనాపాంగ' యను పద్యమును ఎవరో వీణపై వాయింపఁగా దాను విన్నట్లు వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు నాతో నొకసారి యన్నారు. రామరాజభూషణుఁడు — సంగీత సాహిత్యముల లోతులు దడవి చూచిన యదృష్టశాలి. అతఁ డక్కడక్కడ దన కావ్యమున వెల్లడించిన సంగీతశాస్త్ర రహస్యములే యా విషయమును స్పష్టము సేయును. ఇప్పుడు ప్రచారమున నున్న వీణె రామరాజ భూషణుఁ డేర్పాటు చేసినదే. అంతకుఁ బూర్వ ముండిన వీణె యిప్పటివలె లేదు. దాని సారెల నొక్కొక్క రాగమునకుఁ దగినట్లు మర్చికొనవలసి యుండెను. ఒక రాగమునకు గుదిర్చిన సారెలట్లే యుండినచో వేరొక రాగము వాయించుటకు సాధ్యమయ్యెడిది కాదు. ఈ విషయమును వసుచరిత్రలోఁ బెద్దన స్పష్టముగఁ జెప్పినాఁడు ఆ పద్య మిది :

శా. "వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకుఁ
మేళం బైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడు ప్రభాతాయాత వాతాహతా

లోల త్తంత్రుల మేళవింప గదవే లోలాక్షి దేశాక్షికిన్."

మనుచరిత్రము. 3.57

నాటకరాగమునకు మేళగించిన మెట్ల మేళగింపు దేశాక్షికిఁ బనికి రాదఁట. దానికిఁ దంత్రులను వేఱుగాఁ గుదుర్పవలయును. నేటి వీణ యట్టిది గాదు. సారెలకు నియమితమైన స్థానము నేర్పాటు లేర్పాటు చేయఁబడినవి. శ్రుతిఁ గుదిర్చి యేరాగమైనను, సరకట్లను మార్పకయే వాయింపవచ్చును. ఈ యమరిక నమరించినది – రామరాజభూషణుఁడే. "సంగీత కళారహస్య నిధి" యని యాతని బిరుదు. ఇఁకను 'భట్టుమూర్తి' సంగీతమునకుఁ జేసిన సేవ యెంత లుప్తమైపోయెనో ! నాటి కవులు కావ్యార్థవివేచనాపద్ధతులు మాత్రమే గాదు. ఇతర కళలను గూడ ముఖ్యముగ సంగీతమును వారు సాధించుచుండిరి. రాజులు సంగీత సాహిత్య కోవిదులు. అందుకుఁ దగినట్లే కవుల కరాంగుళులును వీణెలపై వింత సొబగులు వోయెడివి. దీనితోపాటు శిల్పము, నాట్యము గూడ వారి 'సాము గరిడీ' లు. అందులోను – రామరాజభూషణుఁడు – తన యభిమానమును సంగీతమునందే ఎక్కువగ నుంచి కొన్నట్లున్నది.

వసుచరిత్రమున సంగీత రహస్యముల నెన్నిటినో రామరాజభూషణుఁడు వెల్లడించె నంటిమి. ఆ వెల్లడించుటలోఁ గూడ నెంతయో చమత్కారముగఁ జెప్పెను. చమత్కృతి యతని కొక ప్రత్యేకగుణము. అది లేనిది శోభ యుండదని యాతని సిద్ధాంతము. చమత్కారము మాత్రమే చాలదు. అది 'రసోదంచితము' ను గావలెను. కనుకనే 'సకలకళా సంసేవ్యంబగు నొక మహా కావ్యంబు రసోదంచిత చమత్క్రియా కల్పనా కల్పభవ్యంబుగా' సంతరింపఁ బూనినాఁడు.

శబ్దార్థ చమత్కారములకు – ముఖ్యముగా శబ్ద చమత్కారములకు వసు చరిత్రము పుట్టవంటిది. ప్రతి పద్యమందును – ఈ గుణము 'నేనున్నా' నను, దానికిఁ దగినట్లు – అనేక నిఘంటువు లాతని జిహ్వాగ్రమున నాట్యమాడు చుండినవి. ఇంతటి శబ్ద చిత్రములు గల కావ్య మింకొకటి మనకు

గానరాదు. తరువాతివా రెందరో యతని ననుకరింపఁ జూచిరి. కాని, వారి ప్రయత్నములు రక్తికి రాలేదు. ప్రధానముగ రామరాజభూషణుఁ డాదరించినది శ్లేష యున్నట్లే తోపదు. ప్రకృతార్థమున కేమైన యడ్డు దగిలిన గదా మనకు దాని జోలి? అట్టిది మందునకైన నాతనియందు గానరాదు. పైఁగా నొక్కొక్కచోట - శ్లేష యున్నదేమో నని పనిగట్టికొని వెదుకవలసి యుండును. దాని నింత సహజసుందరముగఁ బోషించిన వాఁ డాంధ్రసాహిత్యమున మరి యొక్కఁడు లేఁడు క్రింది పద్యము బరికింపుఁడు :

"భావం బెక్కడ లేక వృత్తి నియమాపాయంబు జింతింప కెం
దే వర్తించి, పదార్థ వంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవి ప్రణీతకృతి సామాన్యాకృతిం బూని, పై
పై వన్నె ల్పచరింప దానిఁ దిలకింపం బోదు ధీరోత్తముల్".

వేశ్య కెట్టి యవగుణము లుండునో, గుకవి ప్రణీతకృతికి గూడ నట్టివే యుండునట! ఇందలి శ్లేష చాల సుందరమైంది. పద్యమును జదువు నప్పుడు మనకు శ్లేష యున్న దను భావమే తట్టదు. కారణము అందలి పద సామగ్రి శ్లేషకై వెదకి తెచ్చినది గాదు. 'రసపారవశ్యమున శయ్యకుఁ దనంతఁ దా వచ్చిన నాయిక వలె" తనంతఁ దా వచ్చి కుదురుకొన్నది.

సంస్కృతమున భట్టబాణుల పలుకబడి యింతింతగాదు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అని పండితు లాయనకు బ్రహ్మరథమును బట్టిరి. అతఁడు దడవి చూడని విషయమే లేదు. వాగ్దేవి యా మనస్విని వలచినది. అతని కనుసన్నల నాడినది. అతని తరువాత సంస్కృతమున నంతటివాఁడు పుట్టలేదు అట్లే, తెలుఁగునకు భట్టుమూర్తి, భాషతో నాతఁ డాడినది యాట- పాడినది పాట, అతని నోట నేమాట వెడలినను — నందొక శ్లేష — యొక వైచిత్రి నవ్వుచుండును. ఈ పద్యమును దిలకింపుఁడు !

మ. "అరిగాఁ బంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళ వై
ఖరి సూపం బికజాత మాత్మరవభంగ వ్యాకులం బై వనీ
ధర నాలంబిత పల్లవవ్రత విధుల్ దాల్పం దదీయధ్వనిన్

సరిగా గైకొనియెన్ వసంతము మహా సంపూర్ణ భావోన్నతిన్."

శిశిర వసంతముల సంధికాలము వచ్చినది. అప్పుడు యువతులు హిందోళ రాగము నాలపించిరి ఆ రాగమునకుఁ బంచమస్వరము వర్జ్యము పికములకుఁ బంచమస్వరమే ప్రాణము. అది లేని హిందోళ వాని చెవులకు హోశైనది. ఎటులైనను-నాజవ్వనుల సంగీతములో-దాము స్థానము సంపాదించుకొనవలె నను కొన్నవి. అడవులలోఁ జిగుళ్ళుమేయుచు వ్రతముపట్టినవి వాని తపస్సు పండినట్లు వసంతము వచ్చెను. ఇక నే మున్నది ? కలకంఠ నాదములతో కకుబంతములు మాఱు మ్రోగినవి, కలకంఠులు వల్లకులు మేళవించి-వసంతరాగము నాలపించిరి. ఆ రాగము-పికధ్వనిని గూడ-దనలోఁ గలిపికొని-తన యుదారతను బ్రకటించెనఁట! వసంతము షాడవ రాగము. కాని, రామరాజభూషణుని మతమున నది సంపూర్ణ రాగమే మో! సంగీత కళారహస్యనిధి సిద్ధాంతము నందుకొనియే తరువాత విద్వాంసులు-"చ్యుతపంచమము" దానిలో నుపయోగించిరి. ఇక్కడ కవి సూచించిన సంగీత సంప్రదాయ మట్లుండఁగా- "అరిగా-సరిగా" నన్నపదములలో-మరి కొంత చమత్కార మున్నది. ఆ స్త్రీలు-పంచమము "సరిగా"సేవగించిరఁట! అనఁగా-శత్రువుగా నన్నయర్థము స్పష్టమే. ఋషభస్వర వర్జ్యముగా ననియు నర్థాంతరము. హిందోళమునందు - పంచమముతోఁ బాటు ఋషభమును వర్జ్యమే. వసంతము పంచమమును "సరిగా" స్వీకరించెను. అనఁగా-నారోహణమున షడ్జ-ఋషభ- గాంధార యుక్తముగా ననుట ! ఇది రామరాజ భూషణుఁడు జూపిన చమత్కారము.

ఒక్కొక్క-చోట దా నుపయోగించు మాటలలో- నేదో నిగూఢ మగు భావమును శోదిగి-యా మాటల కెక్కడనో సంబంధము నాతఁడు గల్పించును. పాఠకుల కందేదో యర్థము దాగి యున్నట్లు స్ఫూర్తికె రాదు. తఱచి తఱచి లోతునకుఁ బోయినఁ గాని-దాని గుట్టు తెలియదు. మచ్చున కొకటి పరికింతము.

వసురాజు కోలాహల పర్వతమునకు-విహారింపఁ బోయినాఁడు. ఆ గిరికందరము నుండి మధురగానము వినవచ్చినది. అంత కమ్మగా నా కొండ

కోసలోఁ బాడుచున్న యువతు లెవ్వరో- తెలిసికొని రమ్మని - నర్మసచివునిఁ బంపినాఁడు. వాఁడా జవ్వను లున్నచోటికిఁ బోయి- పొదల మాటున నిలిచి చూచెను. గిరిక వీణ వాయించుచున్నది. ఆమె "ప్రచుర తానామృతముల మూర్ఛనలచే"—"నచేతనంబులు చేతన రీతి దనర, చేతనంబు లచేతన భాతి నొనర" వల్లకిని ప్రయోగించుచున్నది. తానామృతములచే- నచేతనములు చేతనము లగుటలో నౌచిత్య మున్నది. అట్లే మూర్ఛనలచే చేతనంబు లచేతనము లగుట యందును. ఆ యలివేణి లావణ్యమును జూచిన నర్మసచివుఁడు—

సీ. "తన కప్పునెఱికొప్పునని బూని గౌరీన
మాఖ్య మించ జనించినట్టి యార్య
తన చాపలము చూపులనెఁ జూపి సిరులెల్ల
కడఁ జల్ల వచ్చిన కమలపాణి
తన పాండిమము నవ్వులనె యుంచి గాంధర్వ
మవనికిఁ దెచ్చిన యంచయాన
తన యదృశ్యత నడుమునఁ దాల్చి సాంగయై
మొనసిన యతను సమ్మోహ విద్య

గీ. గావలయు నీవెలఁది దీనికాంతి గుణక
లాభి రూప్యము లెఱిఁగించి యా మహేశు
నా నగోద్ధారకుని నా ప్రజాధినాథు
నా జగన్మోహనుని దెత్తు ననుచుఁ జనియె,"

గిరిక నాసచివుఁడు పార్వతీ, లక్ష్మీ, సరస్వతులతోఁ బోల్చినాఁడు. చాలని దానికి మీనకేతనుని సమ్మోహవిద్యతోను. అట్లే వసురాజును ముమ్మూర్తులుగను మన్మథునిగను - రూపించి కొన్నాడు. ఈ సుందరి కాయందకాఁడు దగినవాఁడనియు- నిశ్చయించుకొన్నాఁడు. వసురాజు కడకుఁబోయి—

ఉ. "స్వైరవిహార ధీర లగు సారసలోచన లున్నచోటికిన్
భోరున లాతివారు జొరఁ బూనినచో రసభంగ మంచు నేఁ

జేరక పువ్వుదీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్"

అని తాను వారిని జూచినతీరు వివరించినాఁడు. పై పద్యమున రెండు చిత్రము లున్నవి. సారసలోచనలు స్వైరముగ విహరించు చోటికి లాతివారు పోయిన రసభంగ మగునఁట! ఇది పైకిఁ దోచునర్థము. "సారసలోచనలు" అను పదమున "రస" భంగము - అనఁగా- రసశబ్దము లోపించిన- 'సాలోచనల' ని మిగులును. కుసుమ పేశలము లైన వారి చిత్తముల నాలోచనలు వోసి యెలయించుట పాడిగాదని పొదల చాటున నాతఁడు నిలిచినాఁడు. ఇఁక ఒక చిత్రమున్నది. అదియే మనకుఁ బ్రధానమైనది. నర్మసచివుఁడు- 'నవాంబురుహాంబక!' యని వసురాజును సంబోధించినాడు. అంత పొడవైన విశేషణమునకు సార్థక్యము నిరూపింపవలెను. 'క్రొత్త తామరలవంటికన్నులు గలవాఁడా?' అని దాని యర్థము కాని-కవి యభిప్రాయ మంతటితో విశ్రాంతము కాదు. గిరికను నర్మసచివుడు నాలుగు రీతులుగ రూపించిన పద్యమునందు వసురాజును గూడ - నాలుగు రీతుల నిరూపించి నాఁడు, ఆ రూపణము నాలుగు విశేషణములతో జరిగినది! ఈ పద్యమం దొక్క దాని తోనే యా నాలుగర్థములను జెప్పి, యా పద్యముతోఁ బొత్తుఁ గలిపినాఁడు "అంబురుట్" శబ్దమున 'కగ్ని' యని యర్థము. అగ్ని నేత్రుఁడు శివుఁడుఁ అర్క కాతఁడు దగును. అంబురుహాంబకుఁ. డనఁగా పుండరీకాక్షుఁడు. ఇది విష్ణువునందు రూఢము. కమలపాణికిఁ బుండరీకాక్షుఁడు దగినవాఁడే, గిరిక హంసయాన. వసురాజు అంబురుహము "ఉత్పత్తి స్థానముగఁ" గలవాఁడు. అనఁగా బ్రహ్మ, మన్మథున కంబురుహము పంచబాణములలోఁ జేరినది. ఇది యా పద్యములోని యాశ్చర్యకర మైన ప్రతిభ. 'రూపు' పెండ్లికాని బాలికలు ధరించెడు నొక యాభరణ విశేషమని రాయలసీమలోని పెద్ద లందరు. ఇట్టి సాభిప్రాయములైన విశేషణములలో - నాతఁ డింతటి భావమును దాచి యుంచును. పై నుదహరించిన రెండు పద్యములకును నడుమ నిరువదియేడు పద్యములు నడచినవి. ఇరువది యెనిమిదవ పద్యమున మరలఁ దనచూపు వెనుకకు మలపినాఁడు. అతని కావ్యము నిండ మన కిట్టివి గానవచ్చును.

కన్నడరాయఁ డాంధ్ర కవితా పితామహుల కందలముఁ బట్టు నాటికి భట్టుమూర్తి చిన్నవాఁడు. పెద్దనకుఁ బట్టిన యీ యదృష్టమును దలఁచి పైకి ఎంత సంతసించినను లోలోన. గొంత యసూయయు నాతనిలోఁ దావు చేసికొని యుండును. దానితో పెద్దనపై భట్టుమూర్తికి స్పర్ధ గూడ నేర్పడి నది. అట్లగుటలో వింతలేదు. తప్పు గూడలేదు. పెద్దనకంటెఁ దా నేమిటఁ దక్కువ? కొంత నెమ్మదిగ నాలోచించినచో-నతని కన్న తనదే పై చేయిలే ఇట్టి తలపు లతని యెడఁదలో దప్పక భాసించియుండును. అందుకే యతఁడు దన గ్రంథములో చాలచోట్ల పెద్ద నామాత్యులను నవరించుటకు వలెఁ బ్రయత్నించును. మనుచరిత్రలోని "అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనచేవ"- యను పలుకుబడి ప్రసిద్ధమే, దానిని పెద్దనామాత్యులు- అరుణాస్పదపుర విషయమున వాడిరి, అచట నా ప్రయోగము లాక్షణికము, దానినిగమనించి భట్టుమూర్తి యిట్లు వ్రాసినాఁడు'

క. "స్వామీ ! యేమని పొగడెద
మామనికిన్ మనికి యైన యారామమునన్
గామ నిశితాస్త్రములు ద
త్కోమలతర లతలు చిగురు కొమ్మల చేవల్."

ఆ గురుకొమ్మ లుద్యానవనమునందే యుండును. "చిగురు కొమ్మ చేవ గలవిగా నుండఁగా నితరము లేమని చెమ్మపలె" నని ధ్వని. పెద్దనామాత్యులు మను చరిత్రము మూఁడవ యాశ్వాసమున "తామరతంపరై ప్రియులు దారు విహారము సల్పుచోట" (3-29)- నని "తామర తంపర" శబ్దమును బ్రయోగించిరి. "ఎక్కువగా" నని యీ శబ్దమున కర్థము, భట్టుమూర్తి యీ పద్యమును గ్రహించి, యిట్లు వాడినాఁడు.

సీ. "తన యిల్లు తామర తంపరై మొనయ సం
పన్న లినాక్షి కాపున్నచోటు"

(3. 155)

—"తామరతంపర" యను శబ్దము - తామర అల్లుకొనుటలో పుట్టినది. తరువాత నాపదము భాషలో "దండిగా" నను నర్థమునఁ బ్రయుక్తమయ్యెను. ఆ పదముయొక్క మూలమును స్పృశించి, దాని నా విషయమునకే వాడుట భట్టుమూర్తి చూపిన మెలకువ.

పెద్దనలు "ఆనందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువ" న్నమాటను వాడిన సందర్భము సాహితీపరు లెఱిఁగినదే. ఆ యభిరుచిని నిరసించుచున్నానివలె భట్టుమూర్తి యీ పద్య మల్లినాఁడు.

క. వీనుల విందై యమృతపు
సోనల పొందై యమంద సుమచల దళినీ
గానము క్రందై యాస్వన
మానంద బ్రహ్మమైన నధిపతి పలికెన్."

(2. 14)

రతీవిషయము కంటెను—నాదానుభవమునం దానందబ్రహ్మ సాక్షాత్కారము రసికమైన యనుభవము. కాని, పెద్దనామాత్యుల పద్య మెంతో తార్కికముగా నున్నది. ఆ పద్యమిది.

శా. "ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రత న్నిర్వృతిన్
జెందుం గుంభగత ప్రదీప కళికా శ్రీదోప నెందెందు బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా!"

(2. 62)

ఆనందమును భౌతిక సుఖమున కన్వయించినను బ్రహ్మానందానుభవ లక్షణములు గొన్ని వారచ్చట సమన్వయించినారు. ఈ పద్యమును జూచి భట్టుమూర్తి పెద్దనామాత్యులు చెప్పక విడిచిన కొఱతను పూరించుచు

వ్యాఖ్యానించుచున్న వానివలె గిరికావసురాజుల ప్రణయసుఖము నిట్లు వర్ణించెను.

శా. "భూనాథాగ్రణికి న్వధూమణికి సంభోగాంత సౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబు దెల్పె ననవద్యంబై యవేద్యాంతరం
బై నిర్లేప కలాప మై క్రమవిముక్తానేక బంధాను సం
ధానం బై యపునర్భవ ప్రభవ ఖేదం బై విజృంభించుచున్."

రతిసుఖము బ్రహ్మానంద సామ్యము నెట్లు పొందినదో భట్టుమూర్తి శ్లేష సహాయముతో ప్రౌఢముగ నిరూపించినాఁడు. పైఁగా నీ రెండు పద్యములును – శార్దూలములే యగుట రసికులు గమనింపఁ దగినది, పెద్దనామాత్యుల పద్యమును జూచియే దీనిని రామరాజభూషణుఁడు వ్రాసెననుట కిది యొక స్ఫోరకము. పెద్దన పద్యములో 'కుంభగతప్రదీప కళికా శ్రీ' యను సమాస మున్నది. భట్టుమూర్తి దృష్టిలో నది యచ్చట సరిగాఁ బొదిగినట్లు లేదు. దానిని గూడ చక్కఁగా వాడి చూపవలె ననుకొన్నాఁడు. అందుకై యాతఁ డీ పద్య మల్లెను.

గీ. "కుంభగత దీప శోభానికుంభ లీల
కుంభకుచ మేన చూడ్కు లాగుబ్బుగొనఁగఁ
గాంచు విభుఁ డంగనా ప్రసంగంబుకతన
మంత్రివరు నెట్టకేలకు మరలి చూచి."

(2. 77)

వసురాజు చూపులు కుంభకుచ యైన గిరికాదేవి పైఁ బడినవి, అతని చూడ్కులు దీపములవలె – గిరికాదేవి స్తనములు కుంభములవలె నున్న వవి భట్టుమూర్తి భావము. ఈ దృష్టి వసుచరిత్రలో నెక్కడ బట్టినను కనిపించును. కనుగలిగి చూడవలెనంతే.

శ్లేషను వాడుటలో భట్టుమూర్తి కున్న శక్తి మఱెవ్వరికిని లేదు. అతఁ డా విద్యలో నెన్నియో చమత్కారములు సేయును. కోలాహలపర్వ

తము నాతఁడు వర్ణించినాఁడు. ఆ పద్యమిది :

సీ. ''సుమనోధివాస భాసుర శిఖోన్నతి వాఁడు
ఘనసార తిలక వాసనల వాఁడు
ఘనసంకుమద సాంద్ర గండభాగమువాఁడు
నవపద్మరాగ దంతములవాఁడు
కలితోప కంఠ నక్షత్రమాలికల వాఁడు
హారి చందన చ్ఛాయ నమరువాఁడు
తపనీయ మేఖలాధాళధళ్యము వాఁడు
మణిపాద వలయ ధామంబు వాఁడు

గీ. నర్ఘ్యరత్నావళీ విచిత్రాంబరాలి
రామశృంగారములవాఁడు హైమగర్భ
గేహమున కేగువాఁడు కోలాహలాఖ్యుఁ
డక ధరాధీశుఁ డెదురయ్యె సువిద కపుడు."

ఇందులో పర్వతార్థము ప్రకృతముఁ కాని, యీ పద్యము నడచిన శైలిలో కోలాహలుని పరమైన యర్థము వెదకికొనవలసి యున్నది. ఇది. యాతఁడు శ్లేషలోఁ జూపిన చిత్రము. ఇట్టి వెన్నమో యుదాహరింప వచ్చును.

భట్టుమూర్తికిఁగల సంగీతాభినివేశమును సూచించు పద్యము లడుగడుగునను నందికొన్నట్లు వసుచరిత్రము నిండనున్నవి. గ్రంథ మంతయు నా విషయమున కుదాహరణమే. మరియొక్క పద్యము మచ్చునకుఁ జూపుదును

మ, "ఇది సంధింపఁగ వేళయందు వసురాజేంద్రుండు నీరంధ్ర నీ
రదవార ప్రతిసీర వెల్వడిన తారాభర్త లీలన్ లతా
చ్ఛద పంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగిరుతి వందిమాగధ కథా మాధుర్యమున్ దెల్పగన్".

(3. 45)

ఉపమాన మూలమున మహాకవి నాటక సంప్రదాయమును పొందించి నాఁడు, వసుచరిత్రమున నున్నన్ని నాటక లక్షణములు - ఇతర ప్రబంధములలోఁ గానరావు. అది విషయాంతరము' ఇందులోని 'సారంగరాగభ్రమన్మద భృంగీరుతి' యను విశేషణ మిప్పుడు మనకుఁ బ్రధానము. మగతుమ్మెదల యందలి యనురాగముచే మ్రోయుచున్న భృంగీగణ మని దానికి వ్యాఖ్యానము. సారంగరాగముతో మ్రోయుచున్న యాఁడుతుమ్మెదల మ్రోత యని యర్థాంతరము. ఆఁడుతుమ్మెదల ఝుంకార మిచ్చట సారంగరాగముతోఁ బోల్పఁ బడినది. తుమ్మెదల ఝుంకారమునకు సారంగరాగముతోఁ గల సాదృశ్యము రసికులకుఁ దెలిసిన విషయమే. ఆనాఁడు వందిమాగధులు రాజును బొగడుట కారంభించినపుడు సారంగ రాగముతోనే మొదలు పెట్టుచుండిరేమో!

స్త్రీలకు సంగీతము, పురుషులకు సాహిత్యము తగిన విద్య లని భట్టుమూర్తి భావించెనేమో! అందుకే యాతఁడు స్త్రీలను గూర్చి చెప్పునపు డంతయు రాగములను ధ్వనింపఁ జేయుచుఁ బోవును. శుక్తిమతి నాతఁడు కల్యాణి (5. 24) యని సంబోధించినాఁడు, అతని కీ యభిప్రాయ మున్న దను విషయము మనకీ క్రింది పద్యమున స్పష్టముగాఁ దెలియును.

"సతి సాహిత్య రహస్య మీశువలనన్ సాధించి, తోడ్తోన త
త్ప్రతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతులప్రౌఢిన్ ధ్వనివ్యక్తి ద
చ్ఛ్రుతికిం జొన్పుచు లోచనాంజన రసప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచు బ్రత్యలంకరణ మౌఖర్యంబు దీపింపఁగన్."

(6-94)

గిరికాదేవి రతిమర్మములను వసురాజుతో సాధించి యతుల ప్రౌఢితో ప్రత్యుపదేశ మిచ్చిన దఁట ! సాహిత్యముయొక్క రహస్యమనియు నర్థాంతరము. భట్టుమూర్తి సృష్టించిన యధిష్ఠాన పురమందలి శాలి పాలికలుగూడ 'జగదభివంద్యగానము' ను నేర్చిన వారే.

ఇట్లు వసుచరిత్రలోని విశేషములు తోడుకొలంది వచ్చుచునే యుండును. 'సాహిత్య సమాలోచనామృత' మన్నమాట వసుచరిత్రలో సార్ధక మైనంత మరి యే ప్రబంధనమునను కాదేమో యని నా యూహ !

—భారతి. ఏప్రిల్ : 1958

సంపుటము 35 : సంచిక 4.



# దక్షిణ దేశమందలి ఆంధ్ర వాఙ్మయము

—శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

క్రీ. శ. 1400 తరువాతి నుండి తురుష్కులయు, గజపతులయు నలజడి యంధ్రదేశము నత్యధికముగ నలముకొన్నది. 1430 ప్రాంతపు టలజడిని చూడలేక తాళ్ళపాక యన్నమాచార్యు డిట్లు సంకీర్తన రూపమున విలపించినాడు.

[అన్నమాచార్యుల ఆధ్యాత్మ కీర్తనములు—373 రేకు 1వ పాట]
రామప్రియ

పల్లవి : తతి గాని యీపాటు దైవమా విచారించవే
కతలాఁ జెప్ప నేఁడు కలికాల మహిమా.

చరణములు : తుటుములై భూసురుల తుండెములు మొండెములు
నిటువలె భూతములు యెట్టు మోఁచెనో
అటు బాలుల రొదలు ఆకాశ మెట్లోరిచెనో
కటకటా యిట్లాయఁ గలికాల మహిమా॥ 1

అంగలార్చే కామినుల యంగభంగపు దోఁపు
లింగితాన మింట సూర్యుఁడెట్టు చూచెనో
పొంగు నానాజాతి చేతి భువన మెట్లానెనో
కంగిలోక మిట్లాయఁ గలికాల మహిమా॥ 2

అరుదు గోహత్యలు సేయఁగ దూడ లంగలార్వంగ
సరి ధర్మదేవ తెట్టు సమ్మతించెనో
పరధన చూరకెట్టు పట్టాయెనో లక్ష్మి
కరుణ యెం దడఁగెనో కలికాల మహిమా ॥ 3

దేవాలయాలు నానాదేశము లెల్లాఁ జొచ్చి
దేవఁగా నెట్లుండిరో దేవతలు
తావు లేలే రాజులకు దయ గొంత పుట్టదాయ
కావరమే ఘనమాయఁ గలికాల మహిమా ॥ 4

నిరపరాధులఁ జంపి నెత్తురు వారించఁగాను
తెరల కెట్లుండిరో దిక్పాలులు
విరసవర్తను లుండే విపరీతకాలమున
గురువాలుం గపటాలె కలికాల మహిమా ॥ 5

ఉపమించి దంపతులు వొకరొకరినిం జూడ
చపలదుఃఖములతో నమయగాను
తపములు జపములు ధర్మము లెం దణఁగెనో
కపురుంబాపాలు నిండె కలికాల మహిమా॥ 6

తలలు వట్టీడువఁ గాను తల్లులు బిడ్డల వేయ
తల పెట్టుండెనో యంతర్యామికి
మలసి ముక్కులు గోయ మరుఁడెట్టు వోరిచెనో
కలకలే ఘనమాయఁ గలికాల మహిమా॥ 7

దీనతలోఁ బడి గుండెదిగు లసురుసురులు
వాని నెట్లు లోఁ గొనెనో వాయుదేవుండు
గూను వంచి తల్లి మాడఁ గొడుకుఁ గుత్తికఁ గోయఁ
గానంబడె నింతేసి కలికాల మహిమా॥ 8

పలుమారు నమ్మించి ప్రాణములు గొనగాను
యిలం దమలోఁ బ్రాణా లెట్లుండెనో
నెలవై శ్రీవెంకటేశ నీవే యెరుంగుదువు
కలుషమేఘుని మాయఁ గలికాల మహిమా॥ 9

క్రీ. 1500 నుండి 1565 దాక అష్టదిగ్రాయ భయంకరు డయిన

కృష్ణదేవరాయడు మొదలగు రాజులు దక్షిణాపథమును సురక్షితపరిచి భాగ్యలక్ష్మిని, సాహిత్య సరస్వతిని చాలగ సంవర్ధిల్ల జేసిరి గాని విద్యానగర వినాశము తరువాత ఆంధ్రరాజ్యలక్ష్మి, ఆంధ్ర సాహిత్య సరస్వతి, దక్షిణదేశమును, అనఁగా అరవదేశము నధికముగ నాశ్రయింప వలసెను. కారణ మాదేశము రాజోపప్లవము, దౌర్భాగ్యము, లేక రాజన్వంతముగా నుండుటయే. తంజావూరిలో చెవ్వప్పనాయకాదులు, మధురలో నాగమ నాయకాదులు, పుదుకోటలో కోటవారు, రాజ్యము లేలుచు ఆంధ్ర దేశమున నుండి కవులను, గాయకులను, గాయనులను, అభినేత్రులను, శిల్పకారులను, వ్రాయస గాండ్రను, ఇంకను రాజ్యాంగమునకు వలసిన విద్యా వ్యవహార, వినోద, ముఖ్య తంత్రముల వారి నెల్లను వెంటగొని పోయిరి. అరవదేశమున విఖ్యాతులుగ నున్న విద్వాంసులను, గాయనులను, వ్యవహార దక్షులను, సంపూర్ణముగ దమకు సహాయపరచుకొని సర్వసామగ్ర్యముతో రాజ్యరక్షణము గావించిరి

తొలుత చాళుక్య రాజ్యమునను, తర్వాత కాకతీయ రాజ్యమునను, సంప్రదాయ పరంపరాగతము లగుచుండు గ్రంథసంచయమును గూడఁ దమతో వారా రాజ్యములకుఁ గొనిపోయిరి. అట్లు కొనిపోయిన గ్రంథ సంచయము తంజావూర మహనీయముగఁ బెంపొందినది. ద్రవిడదేశమున నెలకొన్న నాయకరాజులు తమపాలన తంత్రమును తమ పూర్వులు కృష్ణ దేవరాయాదులు నిర్వహించిన తీరుననే నిర్వహించిరి. శ్రీకృష్ణదేవరాయాదులు తమ పూర్వపు సంగమ వంశపు రాజుల తీరును. వారు తమ పూర్వపు కాకతీయుల తీరును, వారు తమ పూర్వపు చాళుక్యుల తీరును ననువర్తించి రాజ్యతంత్రముల సాగించిరి. విద్యానగరమున నుండి తంజావూరికిఁ జేరిన గ్రంథములలో నట్టి రాజ్యపరంపరాయాతము లనేకము లున్నవి. చాళుక్యుల యభిలషితార్థ చింతామణి, సంగీత చూడామణులు, సామ్రాజ్యలక్ష్మీ పీఠికా తంత్రము మొదలగు గ్రంథము లీ రాజ్య పారంపర్య సంప్రదాయములను వెల్లడించునవిగా గుర్తింప నగుచున్నవి. ప్రధానముగ పై మూఁడు గ్రంథములు శ్రీకృష్ణరాయల రాజ్యనీతి, రాజ్యతంత్ర విధానములకును, అట్లే తంజావూరి రాజుల రాజ్యతంత్ర రాజ్యనీతి విధానములకును సరిపోలునవిగా

నిరూపిణ కెక్కుచున్నవి. రాయవాచకమునను, ఆముక్తమాల్యదలోను ఉన్న రాజనీతి విషయములు చాల సామ్రాజ్యలక్ష్మీ పీఠికా తంత్రమునను, అఖిల షితార్థ చింతామణిలోను ఉన్నవి. రాయవాచకమున కృష్ణరాయల దిన చర్యాది విధానమునే తంజావూరి రాజులును పాటించిరి. నేటికిని మైసూరు రాజ్య మా విధానమును గొంత పాటించుచున్నది. తంజావూరిలో నాట్య శాలాది నిర్మాణములు అఖిలషితార్థ చింతామణి, రాజ్యలక్ష్మీ పీఠికా తంత్రాది గ్రంథోక్తరీతుల ననువర్తించుచున్నవి. ఆ యా విషయముల నెల్ల సరిపోల్చి చూపుటకు ప్రత్యేక పరిశీలనము చాల గావలెను.

తంజావూరిలో చెవ్వప్ప నాయకుఁడు, అచ్యుతప్ప నాయకుఁడు, ప్రధానముగ రాజ్యపాలన స్వాస్థ్యములయం దధికముగా నాదరముచూపిరి. కాని రఘునాథ, విజయరాఘవ నాయకులు క్రీ. శ 1650 ప్రాంతముల నుండి రాజ్యవైభవానుభవములతో పాటు దేవాలయాది నిర్మాణములు, తదుత్సవాది విశేషములు, సంస్కృతాంధ్ర ద్రవిడరచన ప్రోత్సాహములు, తత్కవి సత్కారములు, సంగీత వినోదములు, నాట్యవినోదములు, అందు నధికముగ నాంధ్రకవితా గాన నాట్య వినోదములు గలవారై యఖండా నంద మనుభవించి, ప్రజాసామాన్యమును గూడా ననుభవింపఁ జేసిరి ఏవంవిధ వినోదమునఁ, బాల్గొనువారికి నిరంతరాన్నదాన సత్రములను వెల యించిరి. ఆ నా డాంధ్రదేశమునుండి సత్కారముఁ బడయుట కెందఱో తంజాపుర్యాది స్థలముల కరిగి, రాజాదరము పడసి యక్కడనే నెలకొని పోయిరి. వారు రచించిన గ్రంథము లనేకము లున్నవి. ఆ యా కవుల గ్రంథముల జాబితాల నిక్కడ ప్రకటించుట నాపనికాదు. అది సుందరమును గాదు. లభించిన అన్ని గ్రంథములను గూర్చి విమర్శను వెలయించుటయు నల్పవ్యవధిలో నంత సుకరము గాదు.

తంజావూరి గ్రంథములలో విశిష్టయోగ్యత గల గ్రంథములఁ గొన్నిం టిని గూర్చి మాత్రమే, విశేషాంశములనే, క్రొత్తవానినే ఇక్కడ వివరింపఁ బూనితిని.

తంజావూరిలో రఘునాథనాయని విద్యావినోదము భోజమహారాజు విద్యావినోదమును, కృష్ణదేవరాయని విద్యావినోదమును దలపించునంతటిది.

స్వయము రఘునాథరాయఁడు భోజునంత మహావిద్వాంసుఁడు. అతని కుమారుఁడు విజయరాఘవ నాయకుఁడు మహారసికుఁడు, కవి, మహాదాత, గాయకుడు, పరమవైష్ణవుఁడు.

రాజసభలో నారితేరిన కవి చౌడప్ప రఘునాథరాయని రాజసభలో—

"నేరుతు నని మాటాడను
వారిజభవు నంతవాని వశమా తంజా
వూరి రఘునాథరాయని
గారి సభను గుందవరపుఁ గవి చౌడప్పా!"

[యని కీర్తించెను. సుప్రసిద్ధ పదకర్త యగు క్షేత్రయ్య—]

"తరుచు దామె వత్తు రర్థులు
క్రమ మెఱిఁగిన దాతకడకు; రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్రు రఘునాథనృపా!"

అనెను ఈతఁడు విజయరాఘవనాయని రసికతను మెచ్చి యాతనిపైఁ గొన్ని పదముల రచించెను. అవి శృంగార రసగుళికలు.

రఘునాథ నాయకుఁడు సంస్కృతమున గూడ గొప్ప విద్వాంసుఁడు. యజ్ఞ నారాయణ దీక్షితునంత వానికి కావ్యాలంకృతి నాటకాది సాహిత్య విద్యలో గురుత్వము నెఱపినవాఁడు; అనేకులచే సంస్కృత గ్రంథముల కృతు లందినవాఁడు. తన చరిత్రమునే అనేకులు, ఒకరే అనేక విధముల రచింపఁగా విని తనిసినవాఁడు నయినను దాను కవీశ్వరుఁ డయి సంస్కృతమున కంటె తెలుఁగుననే పలు గ్రంథములను రచించెను. అందు రామాయణ భాగము. వాల్మీకి చరిత్ర ముద్రితము లయి యున్నవి.

రఘునాథరాయఁడు సంగీతమున గొప్ప విద్వాంసుఁ డగుటచే నందుఁ గూడ గొప్ప గ్రంథము రచించెను; రచింపించెను. రఘునాథనాయని సంగీత సుధ, వెంకటమఖి చతుర్దండి ప్రకాశిక నాటి సంగీత గ్రంథములు.

రఘునాథనాయని నాటి గ్రంథము లెల్ల సంస్కృతాంధ్రములలో శాశ్వత ప్రతిష్ఠఁ గాంచఁ దగినవే కాని తేలికపాటి రచనవి గావు.

ఆంధ్రమునఁ జేమకూర వెంకటకవి గ్రంథములు సర్వసహృదయ విదితములే కదా ! అతఁడు—

"తా రసపుష్టి మైఁ బ్రతిపదంబును జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవము గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీర గతిన్ రచించి మహి మించినచో నిఁక నన్యు లెవ్వ ర
య్యా ! రఘునాథభూప రసికాగ్రణికిం జెవిసోఁకఁ జెప్పఁగాన్

అన్నాఁడు. రఘునాథరాయఁడు కృతిగొన్న గ్రంథములలో 'నైషధ పారిజాతీయ' మొక్కటి. తద్గ్రంథకర్త కృష్ణాధ్వరి సంస్కృతాంధ్రములలో గొప్పకవి. ఆంధ్రమున కంటె సంస్కృతమున మఱీ గొప్పకవి. రఘునాథ రాయల పేర నాతఁడు సంస్కృతమున నైదు గ్రంథముల రచించినాఁడు.

"నవరస '(శ్రీ) రఘునాథ భూపాలీయ'
నామ భామాభీష్ట నాయకుండు
సరస 'నైషధపారిజాత' కావ్యాయ కావ్య
వర్యాస్వయంవర వల్లభుండు
కల్యాణ 'కౌముదీ కందర్ప' నాటక
కన్యోద్వహన బద్ధ కంకణుండు
అమరుకాహంకార హారి భంగీక శృం
గార సంజీవనీ కాముకుండు

తాళ చింతామణీ వధూ తత్పరుండు
మంచి జామాత రఘునాథ మనుజనేత :
తెలియ (తెలుఁగు?) నైషధ పారిజాతీయ కృతియు
నేవు రక్కల చెల్లెలై హెచ్చు ననుచు.

"పర దోషాఽపర యోషా
పర భాషా రహితభూమి పాలక ఋషికిన్
మరు దుర్వీధర దర్వీ
కర గుర్వీడ్య ప్రతాప ఘన శేముషికిన్."

"వాణీ నిపుణసభాంత
ర్వాణి హితసువస్తు మహితవదాన్యక యు
క్పాణికిఁ బరగిరి, బిరుద కృ
పాణికి రఘునాథ భూమిపాలాగ్రణికిన్."

అంకిత మిచ్చినాఁడు. వర్ణ్యవస్తువు మంచి దైనపుడు కవి యెట్టివాఁ డయినను వర్ణనము ప్రశస్తముగానే యుండు ననుటకు రఘునాథరాయనిఁ గూర్చి వర్ణనలు చేసిన సంస్కృతాంధ్ర కవుల రచన లన్నియు సాక్షులే. విజయవిలాస కథారచనమొక పెడ. దాని కృత్యవతరణిక యొక పెడగాఁ ద్రాసులోఁ దులఁదూఁపఁ దగిన యోగ్యత కలది రఘునాథరాయ వర్ణన.

కృష్ణాధ్వరి రఘునాథరాయని గూర్చి చెప్పిన పద్యముల నుదాహరింపక విడనాడఁ జాలను.

"నైషధ పారిజాతహరణ ద్వికథార్థ సమర్థన ధ్వని
శ్లేషగతి ప్రబంధము రచించిన, మా రఘునాథ శౌరి సం
తోషము నందునన్ కణకతో దశదిగ్జయశోభితద్యశో
భూషణ మైన యీకృతికిఁ బూనితిఁ బ్రౌఢి నిరూఢి చెందగాన్".

"ఫణితి ఫణీంద్రులార రసభావవశంపద భావనా ఘనం
ఘణిత మదుక్తి ధోరణులు గల్గిన తప్పులు దిద్దరయ్య! త
ద్గుణ మగుణంబు, దూషణ మదూషణ మౌ ననువారు గాక త
ద్గుణమ గుణంబు, దూషణము దూషణ మౌ ననువార లాప్తులే?".

"ఆలంకారిక హర్షమత్కృతి వరం బాజాన సారస్వత
శ్రీలుం డౌ రఘునాథ శౌరిఁ గని హర్షింపంగ నన్యుల్ వృథా

స్థూలం భావుకు లైన కొందఱు దృఢసూ్యతోష్ఠతా సూచితో
వాలంభు ల్గనటున్న నేమి కుహనా హల్లోహలుల్ లోహలుల్".

"ఆజిజితారికోటి నతి నన్వహ మన్న సువర్ణదాన సం
పూజిత విప్రకోటి నుతిఁ బొందుచు నార్గురు చక్రవర్తులన్
రాజులఁ జేయునట్టి రఘునాథ నృపాలుఁడె చక్రవర్తి యా
నీజగమందు నేడు మొదలిర్వది యిద్దఱు రాజు లెన్నఁగన్".

"ఆయతకీర్తి ధౌత హరి దంచలుఁ డంజన లక్షణాభి ధో
పాయ దృఢప్రయోగ పరిపాటిఁ గృతుల్ రఘునాథభోజ భూ
నాయకుఁ డందుఁగాక విగుణస్ఫుట దోషములౌ ఘుణాక్షర
న్యాయజడ ప్రబంధముల నందు మనం గలనైన సందునే:".

"స్వయముక్తాత్మకృతి స్తుతుల్ జడులు భాషామంజరిన్ లింగ ని
ర్ణయమున్ గొంత సమాసచక్రము, క్రియల్ నైఘంటు కాఖ్యల్ నిర
న్వయతం గూర్చి కవిత్వ మంచు సభలన్ వర్ణింప విద్వత్కవి
ప్రియ మౌ నాపద వాక్యమాన సువచశ్శ్రీమత్కృతుల్ దక్కఁగాన్".

కావ్యములలో నాశ్వాసాద్యంత పద్యము లున్నవి వానిని బాఠకులు. శ్రోతలు నంతఁగాఁ బాటించి చదువుట, వినుట యుండదు. ఈ గ్రంథమున నా కవిచవి గొల్పుచుఁ జదువను, వినిపింపను సముత్సాహ మిచ్చుచుండును

కృష్ణాధ్వరి రచించిన రఘునాథ భూపాలీయాది గ్రంథము లయిదును సంస్కృత గ్రంథములు. అందు రఘునాథభూపాలీయ మలంకార శాస్త్ర గ్రంథము, దాని వ్యాఖ్యాన మొక యతీశ్వరుఁ డానాడే రచించినాఁడు. కడమ గ్రంథము లిప్పుడు గానరావు. సంస్కృతమున గొప్ప గ్రంథకర్త యగు కృష్ణాధ్వరి రఘునాథ రాయఁడాంధ్ర కవిత నధికముగా నభిమానించు నని యాతని వినోద పఱచుటకై పరమోత్సుకతతోఁ బ్రయత్నించి యతి ప్రౌఢముగా నాంధ్ర కవితారచన నలవఱచుకొని యీ గ్రంథము రచించి నాఁడు. నైషధపారిజాతీయ మాముక్త మాల్యద రచనమును దలపించుచు గాఢ ప్రౌఢ శబ్దార్థ శ్లేషాలంకార చిత్రితమై యొప్పారుచున్నది. రాఘవ

పాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము లీ గ్రంథమునకు మేలుబంతులే యయినను నా గ్రంథముల నీతఁడు గ్రంథరచనోపక్రమమున మాత్రమే యనుకరించె ననవచ్చును. కవి తానే దీనిని వ్యాఖ్యానించి యుండిన బాగుగా నుండెడిది. పెక్కేండ్లకు ముందే యథామాతృకముగా దీని ప్రతి వ్రాయించుకొని సవ్యాఖ్యానముగాఁ బ్రకటింప నుత్సాహపడితిని గాని పెక్కుచోట్ల శ్లేష చమత్కృతి దుర్గ్రహముగాఁ నుండుటచే నింతదాక దానిని ముగింపఁ జాలకుంటిని. కుదిరినంత వఱకయిన లఘుటీక గూర్చి ప్రకటింపవలెను. దీనిని బ్రకటించుటలో కృష్ణాధ్వరి మీది గౌరవము గాని. అముద్రిత గ్రంథ ప్రకటనము మీది యౌత్సుక్యము గాని కారణములు గావు. మహనీయుఁడైన రఘునాథరాయల మీది యాదరమే యేతద్గ్రంథ ప్రకటనమునకు నన్ను ఉత్సాహపఱచుచున్నది.

ఈతని గ్రంథములోని రచనా చమత్కారములు గొన్ని చూపుదును. కథారంభ పద్యము—

"బలభద్ర స్థితి వైరివర్గము నడంపన్ సత్యభామాదు లు
జ్జ్వల సామ్రాజ్యధురార్థ్వతం దెలుపఁగా శౌర్యాఖ్యచే మాగధా
దు లుదీర్ణానత వర్ణితం జెలఁగ సంతోషశ్రిత శ్రీకుఁ డౌ
నలభూమీపతి గారవించె మహినిన్ న్యాయంబునన్ రుక్మిణిన్."

ఇందు నాల్గవ చరణమున రెండర్థములకు పరిపడునట్లు నల-అల. 'న్యా' యతి కలదు. జలభద్ర, సత్యభామాదులు, శౌర్యాఖ్య, మాగధాదులుదీర్ణానత వర్ణతన్, ఔ నలభూమీపతి. మహినిన్ రుక్మిణిన్ — పదములు రెండర్థములకుఁ గుదురువడునవి.

"ఆకార నున్న మణిగిరి
రాకన్నెల చూచుసొంపు రా, భీమజన
వ్యాకుల నప్పురిఁ బుణ్య
శ్లోకుఁడు గనె భావికుశలచూచి శకునుఁడై."

"పాద మూనినచోట బగడాల ధగధగ
లింపారఁ బుటికిల నింపవచ్చు
కేలు సోకిన చోటఁ గెంపుల చకచకల్
సొంపార గంపలఁ నింపవచ్చు
అంగ మంటిన చోట నపరంజి ధళ ధళల్
పొంగార గాదెలఁ బోయవచ్చు
నిక్కిచూచిన చోట నీలాల నిగనిగల్
నిండార గణజాల నింపవచ్చు

నాత్మభూయత్న రుచిత మోహారి విభవ
పూర ఘాటోప మేజాడఁ బొగడువాఁడ
నింద్రజాలంబొ మాయయో యెఱుఁగ నైనఁ
జూడఁ గలుగుట మామక సుకృత ఫలము."

*   *   *   *

"వచ్చినాఁ డమ్మ నీ వాంఛితాఖిల పూర్తి
వైభవంబున దేవ వల్లభుండు
చనుదెంచె నమ్మ నీ సౌభాగ్య మలరింప
వర తేజమున హవ్యవాహనుండు
వేంచేసె నమ్మ నీ వేడుక లీడేర
దాక్షిణ్య వర్తన ధర్మరాజు
ప్రాపించె నమ్మ నీ భాగ్యంబు ఫలియింప
రత్న సంపద సింధురాజటంచు

వలపు దెలియంగ సమరశంఖములు దెలుప
విప్రవరసూక్తి విధృత జీవిత ఫలంబు
న్యాయవర్తన మహిమన్ననల విధుండు
హరి దయావహమూర్తిగా కన్యఁ డగునె ?".

రఘునాథరాయని కుమారుఁడు విజయరాఘవనాయఁడు చాల రసికుఁడు. సంగీత సాహిత్య కవితాగాన నాట్యనాటక వినోదపరాయణుఁ డగుటే

కాక వైష్ణవ మతైకాభిమానమహితుఁడై విష్ణ్వాలయములకే విశేషవైభవము గల్పించుచు, వెలుఁగొందెను. ఆతని కాలమున నాంధ్ర కవితారచన శృంగార రసైక మయమై, తేలికదనముతో తియ్యఁదనము గలదై పామర రంజకమై పలుచబడినది. గుజలీ పుస్తకములలో పెద్దిదాసు చరిత్ర మని యొక లఘు గ్రంథము ముద్రితమై దొరకుచున్నది. అందు కథానాయకుఁడు పెద్దిదాసు; విజయరాఘవ నాయకుని నాటివాఁడు అతఁడు మహాభక్తుఁడు విజయరాఘవ నాయకుఁడాతని గేలిచేసి యాతని వేషమును గాడిదకుఁ గల్పించి యూరేగించి యవమానపఱిచెనఁట : ఆ భక్తుని సంకీర్తనములును, రాయని యవకరపు జెద్దమును నాలఘుకృతిలోఁ గాననగును. భక్తు నొకని నట్లు పరిహాసించుట చేతనే యాతని రాజ్య మంతరించె నని కూడ నందున్నట్టున్నది. అందెంత సత్యము గలదో కాని యాతఁడు సంగీత సాహిత్యాది లోలుఁడగుట తథ్యము. ఆతని నాటి కృతులు చాల యక్షగానములు. రఘునాథనాయని చరిత్రము నాతఁడు ద్విపద కావ్యముగా రచించినాఁడు. ఇప్పటి కించుమించుగా నలుబదియేండ్లకు ముందు నే నాయా గ్రంథము లెల్లను బరిశీలించి ముఖ్యాంశములు వ్రాసికొని వచ్చితిని. రఘునాథరాయ చరిత్ర మందలి తంజావూరి రాచనగరి వర్ణనాదులఁబట్టి యాయారాజ సభాది స్థానములను గుర్తించి, యప్పు డక్కడి పండితులకుఁ బ్రజలకు వాని నెఱుకపఱిచి వచ్చితిని. తంజావూరి యాంధ్ర రాజుల చరిత్రమనిపుస్తకముగా నాయా విషయముల సంగ్రహమును బ్రకటించితిని. అప్పటి సేకరణములోని విశేషములనే యిందు వెల్లడించుచున్నాను. విజయరాఘవ నాయని నాటి యక్షగానములలో రచనా చమత్కృతులు కొన్ని :

విజయరాఘవు పట్టంపు కవియైన కామర్సు వెంకటపతి సోమయాజి విజయరాఘవ చంద్రికా విహారమున—

**చోళదేశ వర్ణన :—**

"కవు లెంతురు చోళ దేశము, దివ్య - కావేరీ వారి ప్రకాశము;
నవరత్నము లున్న కోశము, సుర-నాయక రాజ్య సంకాశము;
చెఱకు రాజనంపు బైరులు, కావు - సేమము గలిగిన యూరులు;

తిరముగాఁ బ్రవహించు నీటులు, చోళ - దేశంబున వెయ్యేఱులు;
ఆ రాజ్యరమకు మంజీరము, అల్ల- అమరావతి కన్న సారము
భూరమణీ మణిహారము, తంజ - పురము సంపదల కొటారము.
నవరత్నంబుల పేటలు, దివ్య- నారికేళంబుల తోటలు.
సవరణ సేసిన కోటలు, వీట సరసులు నూఱూఱు కోటులు
వలరాయని మీది యేలలు, చాల-వర్ణింప నేర్చిన బాలలు
విలసిల్లు నాటకశాలలు, అందు - వింతవింతలు కృష్ణలీలలు
పరులను గెల్చిన పౌజులు, మెచ్చ-పాలింతురు దినరాజులు
సరిలేని విద్యా భోజులు, వీట - నడిసన్న రాజాధిరాజులు.

ఆ రాజధానికి రాజై రాజిల్లు రాజచంద్రుని నాతని పట్టంపుగవి యేమని కొనియాడుచున్నాఁడు—

"శ్రీరామగోపాల సేవచేఁ జాల - బేరు గాంచిన ఱేడు బిరుదు మన్నీడు
లక్షణాన్వితుఁడు కళావతీ సుతుఁడు - దాక్షిణ్యశాలి యుత్తమ రాజమౌళి
రణముల జగజెట్టి రఘునాధుపట్టి. గుణరత్నముల దీవి గురుజన సేవి
బహుదాన పరుఁడు భూపాల శేఖరుఁడు-సహజకీర్తిస్ఫూర్తి సర్వజ్ఞమూర్తి
రతులకు రతిరాజు రాజులరాజు- వితరణగుణహారి విభవజంభారి
జగదుపకారి వైష్ణవమతోద్ధారి - తగవుల వీడు చింతామణి జోడు
నీతికి మాంధాత నియమ సంధాత - జాతి వార్తల మేటి శౌర్య కిరీటి
సరసుండు నెఱజాణ చక్కనివాఁడు - పరమ వైష్ణవులచే పట్టుకుంచంబు
బాహు విక్రమశాలి భరత కోవిదుఁడు - సాహిత్యభోజుండు సంగీత వేది
కోరినవారికిఁ గొంగుబంగారు- చేరువమేరు వాశ్రితవర్గమునకు
పేదలపాలింటి పెన్నిధానంబు — వేదకోవిదులకు వెలలేని సొమ్ము
పలికి బొంకనిరాజు పరమవివేకి - నిలుకడ గలవాఁడు నిత్యాన్నదాత
పట్టభద్రుండు కృపాసముద్రుండు - చుట్టల సురభి రాజుల మేలుబంతి
వరసరణాగత వజ్రపంజరుఁడు- నరులపాలింటి పున్నమ చందమామ
ఏకవీరుండు జగదేక వదాన్యుఁ- డాకారమన్మథుండ సమసాహసుఁడు
మానినీ నూతన మకర కేతనుఁడు- భానుసమానుండు పరతత్త్వవేది

అనుమానమున దేలి యావనమాలి- చనవరి యిల్లాలి చనుబాలు గ్రోలి
పెరిగిన యన్న గోభిలమౌని కన్న- పరతత్త్వరుచి గన్న పాయంపు మిన్న
విజయరాఘవశాలి విద్యావిహారి - భుజబల కంసారి పూర్ణ సంహారి
అన్నిట నవధాని యారాజధాని - మన్ననతో నేలు మహి మేలుమేలు.

[విజయరాఘవనాయకుని విప్రనారాయణ చరిత్రమున పదము]

"హరిభక్తి దప్పింతునా నాపై - ననురక్తి రప్పింతునా
పరమపావనుఁ డీ బాపఁడు నినుజూచి — పడసేవాఁడు గాడే ఓ చెల్లె,
విటునిగా నడిపింతునా దాసరి. నటనలు విడిపింతునా
కటకట నీకింత గర్వమేలె వీ, డటువంటి వాఁడు గాఁడె, ఓ చెల్లె.
గీతము వినిపింతునా మరునికై, జీతము కెనయింతునా
నాతిరో హరికీర్తనకు జొక్కువాఁడు, నీ గీతమునకు దక్కునా, ఒ చెలి.
అడపము గట్టింతునా వానిచే, మడుపులు చుట్టింతునా
గడిదేరి పలికేవు కైంకర్యపరుఁడు నీ- కడపము గట్టునట్టే. ఓ చెల్లె.

[పదం, కాంభోజరాగం, అటతాళం]

"చదివేది దివ్య ప్రబంధము మాకు, సైపదు సంసారబంధము
ఎదనుండు హరిభక్తి గంధము, యోగీంద్రులతోనే సంబంధము
మాతో మీకేమి మాటలు, విన - జాతిగాదు మీ పాటలు
భవనంబులు పర్ణశాలలు. మా- పాటలు హరి మీది యేలలు
తగిలియుందురు ముక్తి బాలలు, మా- దాపురములు హరిలీలలు
మేమున్న యూరు శ్రీ ద్వారకా, ముక్తి- కామిని పైనె మా కోరికె
స్వామిభక్తి మాకు చేరిక, వో- కోమలి నీవిక వూరకే పోవే
ఆలుబిడ్డల పొందుకోరము, మేము- కోరేది హరిభక్తి సారము
నీలవర్ణుని గొల్చు వారము, మీ- యాలాపములు విననేరము
పరమాన్నములు కాయగూరలు, మా—పరిధానములు నార చీరలు
సరిపోవు మీకు మా మేరలు, మా- సంగడివాండ్రు పకీరులు

* * * *

"శంపాలతలు నటింపఁగ
తుంపురులై చినుకులగుచు దోరణ లగుచున్
చంపకగంధి చలింపఁగ
నంపా జాలంపువాన లప్పుడు గురిసెన్"

*        *        *        *

"తాటోటు బాపన దాసరి నీవు—తోటకనుల్ సేసి తొడుసెల్ల మాని
వోరి మాయింటి కెందుండి వచ్చితివి—వూరకె నాకిడ్డ యోజలు చెడిచి"

*        *        *        *

"తిరుమణి యేమి నీ తిరుచూర్ణ మేమి—కరమున శంఖచక్రంబులి వేమి
దాసరితన మేమి తావడా లేమి—నీ సరివారెల్ల నిను జూచి నవ్వ
జడియక రావణ సన్యాసి వగుచు—నడచుచున్నావు వైష్ణవుఁడవా నీవు"

(పదం - కాంభోజి - అటతాళం)

"ద్రావిడ వేదము చదివినవాడనే—ధవళాక్షి నీవు నన్నేలవే
ద్రావిడవేదము చదివినవారు కం—దర్పుని వేదము విందురా
అంగన, మన్నారు తళిగె ప్రసాదమై—పొంగలి చవిగొన్న వాఁడనే
పొంగలి చవిగొన్న వానికి వల—యెంగిలి చవి మనసాయనా
ఆరామ కైంకర్య మాచరించి మ—న్నారుని గొలిచిన వాఁడనే
ఆరామ కైంకర్య మాచరించు వాని—కీరామ కైంకర్య మేలయా
చెలువ మన్నరు పాదతులసీ దళములు—శిరసున ధరియించువాఁడనే
తులసీదళములు ధరియించువానికి—తొలుకటి ముడిపువ్వు లేలయా"

(పదం, శంకరాభరణం)

"అయ్యయ్యో నిను నమ్మవచ్చునా, ఇట్లైతే దైవము మెచ్చునా
నీయందు వేఱు లేనైతిగా, నేను—నిను నమ్మి యిటు బేలైతిగా
బాస లిచ్చి తప్పనంటివి, నా—భావ మెల్ల జూచి గొంటివి
ఆపజూపి వద్ద నుంటివి, ఇంత—దోస మేల కట్టుకొంటివి

జెల్లించి యెడబాయ నంటివి, అట్టు-తల్లి మాటలే వింటివి
తెల్లనివెల్లా పాలౌనా, ఇట్లు-కల్లలాడితే మేలౌనా"

* * * *

పై విధమున విజయరాఘవనాయని రచనలు నాటి కవయిత్రులయు కవులయు రచనలు, పలుపోంకము, సౌలభ్యము, మృదుపాకము, గల వయి నను పరువము దప్పిన పచ్చి శృంగారముతో గోవాళ్ళను ద్రోవ తప్పించు నవిగా నున్నవి. యక్షగానములే యందనేకములు. తంజావూరి నాటకశాలలో నా యక్షగానములను బిరుదుపాత్ర నభినయించువారు. విజయరాఘవనాయ నిగా రాయా బిరుదుపాత్రలకు శారదాధ్వజాదు లొసఁగి సత్కరించుచుండు వారు. అంతా ఆటలమయము, పాటలమయముగా విజయరాఘవనాయని గోష్ఠి విరాజిల్లినది. నాయక రాజుల తర్వాత వచ్చిన మహారాష్ట్ర రాజులు గూడ నీ యక్షగాన వినోదములలో దేలుచుండువా రనుటకు వారి నాళ్ళలోఁ గూడ వెలసిన యక్షగానము లనేకములు తార్కాణ.

రఘునాథరాయలవారి నాటి రచనలే తంజావూరి రచనలలో ప్రశస్త మయినవి. రఘునాథరాయలు, చేమకూరి వెంకట కవి, కట్టా వరదరాజు, ముకుందయోగి, కృష్ణాధ్వరి, చెంగల్వకాళయ, చల్లపల్లి రంగన్న, వెంకటా చల విలాసకర్త మొదలగు వారి రచనలు తంజాపురాంధ్ర రచనలలో మెచ్చఁదగినవి.

అన్నింటిలోను, కట్టా వరదరాజు ద్విపదరామాయణము ముద్రితమై ముందర వెలయఁ దగినది. అతని శ్రీరంగమహాత్మ్య మొక్కటే ముద్రిత మయినది. పరమ భాగవత చరిత్రము సమగ్రముగా దొరుకకున్నను ముద్రింపఁ దగినదే.

కవిత లంటే విసుగుపుట్టే-కాలమున శృంగార రచనల
దవిలి యేదే వ్రాయబోతే-తారుమారు లవుఁ
అవకతవకల నౌ నికేమో-అవును, గావున రసిక యువకులు
సవరణలతో సయిరణలలో-జదువుకొనవలయున్.

—భారతి
రజతోత్సవ సంచిక
సర్వధారి-పుష్యము; 1949, జనవరి.
సంపుటము 26, సంచిక 1.

# విజయవిలాస వ్యాఖ్యాన విధానము

—శ్రీ తాపి ధర్మారావు

తెనుఁగు పదముల నల్లనల్లన కూర్చియు, విరిచియు సల్లలితము లగు నర్థవిశేషంబులఁ బాఠకుల కుల్లాసము గల్పించు నేర్పు చేమకూర వేంకటరాజ కవివర్యున కలవడినట్టుల నింకొక్క యాంధ్ర కవిశిఖామణి కలవడ లేదని విమర్శక వరేణ్యు లందఱు నంగీకరించియే యున్నారు. శబ్ద తత్త్వ పరిజ్ఞానము, శ్లేషరచనా నైపుణియుఁ, గలిగిన యాంధ్ర కవి శిరోమణులలో ననేకు లీయంశమునఁ జేమకూర వానికి వెనుకఁబడ వలసిన వారలే యనుట యతిశయోక్తి కానేరదు. కందుకూరు వీరేశలింగము పంతులుగారీకవినిఁ గూర్చి వ్రాయుచు "నచ్చ తెనుఁగు పదములను పొందికగఁ గూర్చి కవనము చెప్పనేర్పీకవికి కుదిరినట్లు మఱియొక కవికి కుదిరెనదని చెప్ప వలను పడదు. పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకుఁ దరువాత విజయవిలాసమే సర్వవిధములచేతను తెలుఁగులో శ్లాఘ్యకావ్యముగ నున్నది. జాతీయాది చమత్కృతిని బట్టి విజయవిలాసమే శ్లాఘ్యతర మయినదని యనేకు లభిప్రాయ పడుచున్నారు" అని ప్రస్తుతించిరి. ఈ పల్కుల యం దెంతయేని సత్యమున్నదనియు, మనోహరంబులగు నీతని పోకడలు మఱియొక్కనికి రాఁజాలవనియుఁ జేమకూర కవిత్వ రుచినిఁ జిత్తగించిన వారి కందఱికినిఁ దెలియ గలదు. చూడుఁడు :

"అరచంద మామ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్;
బరువంపు మొల్ల మొగ్గల
దొరగాఁ బల్కుదురు బల్కుదురు జవ్వనికిన్.

అచ్చ తెలుఁగు పద్దెమున నా మాటల విఱుచు విధాన మెంత హృదయంగమము. ఈ కవియే సారంగధర యందు చెప్పినట్లు "వాక్యము లెల్ల

వేఱె యర్థముగా నేర్పున విఱిచి మాటలా” డుట యం దీతఁ డాఱితేఱిన జాణ. కావుననే సుభద్రా సఖీజనులు వివాహ సమయంబున

“మంచి మగఁడు వలయు నంచుఁ గోరుచునుండ
మంచి మగఁడు గల్గె మఘవ సుతుఁడు;
మన సుభద్ర సుకృతమహిమ యేమన వచ్చు!
మనసు భద్ర మయ్యె మనకు నెల్ల”

యని తమలోఁ దా మానందించి యాంధ్ర పాఠక లోకమునఁ కెల్ల నానందమును గూర్పఁ జాలిరి. మాటలు మన కవి యెదుటఁ బడినప్పుడు తమంతఁ దాము విఱిగి వివిధ సమ్మేళనంబుల నాతనికిఁ గాన్పించు చుండు ననుట యొప్పు. అబ్బురంబగు నిట్టి సుగుణంబు తన కున్నను వేంకటరాజకవి యౌచితికి దవ్వుగఁ బోవువాఁడు గాఁడు. పదము విఱిగినది గదా యని పరుగువాఱి ప్రకృతమును బరిత్యజించువాఁడును గాఁడు. అక్షర సమ్మేళ నాంతరము లెన్ని కంటికిఁ గట్టినట్టు లుండినను వర్ణనావసర యోగ్యత నిసు మంత యయిన విస్మరింపఁడు కావుననే యీ విఱుపులు నీ కూర్పులును మంతుకెక్కి సహృదయుల మన్ననలను గాంచుచున్నవి.

అట్టి విఱుపులలో నెన్నికఁ గనఁ దగిన యీ క్రింది పద్యము, విజయ విలాస ప్రబంధ మొక్కసారి యయినఁ బఠించు భాగ్య మబ్బిన వారి కందఱి కిని గంఠగతముగ నుండక మానదు.

“కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కుల టెక్కువాఁడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాఁ గొను మోవి మెఱుంగువాఁడు స
త్యమ్ముగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించు వాఁ
డమ్మకచెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్”

ఉలూచి గంగానదీపులిన స్థలంబున నర్జునునిఁ గాంచి తనలో విత ర్కించు కొనుచు నా విద్వచ్చు నిట్లు మెచ్చుకొనినది. ఈ పద్యము నందలి ప్రథమ చతుర్థ పాదారంభములను బట్టి మాఁచినఁ జేమకూర వాని కీపద్య రచనా సమయంబున నల్లసాని పెద్దనామాత్యుని

"కమ్మని కుందనంబు కసుగందని మే, నెలతేఁటి దాఁటులన్
బమ్మెర వోవఁ దోలు తెగబారెడు వెంట్రుక, లిందుబింబమున్
గిమ్మన నీదు మోము, గిరిక్రేపులు పాపులు, కౌను గానరా
దమ్మకచెల్ల ! వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్"

అను పద్యము స్మరణయం దుండిన నుండనోపును కాని, 'అమ్మకచెల్ల' యను నాశ్చర్యార్థకము కంటఁబడినంత, నయ్యది రెండు తునియలలు 'యమ్మకచెల్లదు' అను వింతమేళనమునకుఁ గవి కవకాశము నొసఁగె ననుట లెస్స. ఈ విఱువుం గాంచియే యపారముగా నానందించిన నారవేకులు గలరు. ఒక పద్యమున కిట్టి చమత్కార మొకటి యుండినఁ జాలదా యని సంతసించు వారునుం గలరు. కాని. మన కవి యర్థవిశేషంబుల నలంతులఁ దనియు నట్టివాఁడు వాఁడు గాఁడని పాఠకమహాశయు లిప్పటికే గుర్తించి యుందురు. అట్టి యీ కవి సందు దొరికినదిగదా యని యీ విఱువు నందలి చమత్కారమును జూపి, యంత మాత్రమునఁ దృప్తి నందునా యను సందేహము గలుగక మానదు. పదములకు వశంవదుఁడై ప్రకృతమును విడిచి ప్రక్కలకుఁ బాఱునట్టి కవి ప్రశంసాపాత్రుఁడు గానేరఁడు గదా! అట్టియెడ నాతఁ డధమ కవులలోఁ జేరఁ దగిన వాఁడ యగును. కావున యాథార్థ్యము నెఱుఁగ వలయు ననిన నీ పద్యము పించుక పరిశీలింప వలయును.

పద్య పాఠ గ్రహణమునందు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రి గారును, తిరుపతి వేంకటేశ్వర కవివర్యులును బయినిఁ జూపిన పాఠమునే గ్రహించిరి. జూలూరు అప్పయ్య పంతులు గారు,

"సత్యమ్ముగ రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించి నాఁ
డమ్మకచెల్ల ! నా హృదయ మమ్మక చెల్లదు వీని కెయ్యెడన్."

అని యుత్తరార్థమును భిన్నముగఁ బఠించిరి. నోరి గురులింగశాస్త్రి గారును గొంచెము భేధముతోడ జూలూరి వారి పాఠమునే యంగీకరించిరి.

వ్యాఖ్యాన విమర్శమున కనువు గలుగుటకు జూలూరి వారి వ్యాఖ్యా

నను వేంకటరాయశాస్త్రి గారి వ్యాఖ్యానము నిందు నివేదించు చున్నాఁడను. జూలూరి వారి వ్యాఖ్యానమున

"కమ్మని జాళువాను = చక్కని మేల్మి బంగారమును, ఒరయగల్గిన చెక్కుల టెక్కువాడు = రాపాడడమునకు తగినటువంటి చెక్కులయొక్క సొగసుగల వాడున్నూ, చొక్కమ్మగు = పరిశుద్ధమయినటువంటిన్ని, జాతి = కృత్రిమము గానటువంటిన్ని, కెంపు = పద్మరాగమణిని, వెలగా గొను = కొనివేయజాలి నటువంటి అనగా తన అధికారనులో వుండగలిగి నటువంటి మోవి మెరుంగువాడు = అధరోష్ఠము యొక్క కాంతి గలిగిన వాడున్నూ సత్యమ్ముగ = నిజముగాను, రూప సంపద = చక్కదనము యొక్క సమృద్ధి, చేతను. ధనాధిపసూనుని = దనాధిప-కుబేరునియొక్క సూనుని-కుమారుడైన నలకూబరుని ధిక్కరించినాడు = తిరస్కరించినాడు, అమ్మకచెల్ల = అమ్మనే చెల్ల అనగా భళా యనుట, నా హృదయము = నా మనస్సు: వీనికి = యీ యర్జునునికి' అమ్మకచెల్లదు = అమ్మివేస్తేనే గాని వొప్పదు: యెయ్యెడన్ = యే స్థలమందున్నూ—" అని కలదు.

ఇంక వేదము వేంకటరాయశాస్త్రిగా రన్ననో, యీ పద్యమునకు వ్యాఖ్యాన రూపముగ నిట్లు వ్రాసిరి, "కమ్మని జాళువాన్ = చక్కని మేల్మి బంగారమును, ఒరయఁగల్గిన = రాపాడ గలిగినట్టి, చెక్కుల టెక్కువాడు— చెక్కిళ్ళ యందము గలవాఁడు, చొక్కపుమ్ = పరిశుద్ధము, జాతికెంపున్ = పద్మరాగమాణిక్యమును, వెలగాన్ = (తనకు.... అనఁగా మోవికి) మూల్యముగా, మోవి = పెదవి; ధనాధిప సూనునిన్ = నలకూబరుని, రూపసంపదన్ = రూపముతోఁ గూడుకొన్న సంపద చేతను—అనఁగా రూపముచేతను, ధనముచేతను, ధిక్కరించువాఁడు = తిరస్కరించుచున్నాఁడు; నా హృదయము = నా మనస్సును; అమ్మకచెల్లదు = అమ్మివేయకతప్పదు; అమ్మకచెల్ల = ఆశ్చర్యము."

పై వ్యాఖ్యానములను బరిశీలించినచో నీ పద్యమునకుఁ బూర్వవ్యాఖ్యాతలందఱు నీ క్రింది రీతి తాత్పర్యము నూహించియుందు రనుట స్పష్టమగును.

"చక్కని మేల్మి బంగారమును రాపాడఁగలిగినట్టి చెక్కిళ్ళ యందము గలవాఁడును, పరిశుద్ధ మగు పద్మరాగమును దనకు మూల్యముగాఁ గొనఁ గలిగిన పెదవి మెఱుఁగు గలవాఁడును, రూపముతోఁగూడుకొన్న సంపదచేత (లేక. చక్కదనము యొక్క సమృద్ధిచేత) నలకూబరుని ధిక్కరించువాఁడును నగు నీతని (అర్జునుని) కీ స్థలమందు నా మనస్సును విక్రయింపక తప్పదు; బళా!" అని యులూచి తలంచె ననియే వా రూహించి యుందురు. ఇందు మేల్మి బంగారమును రాపాడఁ గలిగినట్టి యనుటలో నా ద్వితీయకు సమ న్వయ మెట్టుల గురుదునో? బంగారముతో రాపాడఁ గలిగినట్టి యను భావమా? ఎట్లయినను వర్ణిత మగు చెక్కిళ్ళ గుణ మెయ్యది? అను ప్రశ్నలు కలుగును. పద్మరాగమును దనకు (మోవికి) మూల్యముగాఁ గొనఁగలిగిన మోవి యన నర్థమేమి? ఈ తావున జూలూరు అప్పయ్యగా రని నట్టుల పద్మ రాగమణిని కొనివేయఁ గలిగిన మోవి యనుటయే సమంజసముగ నుండునా? అను సందేహములు రెండవ వర్ణనయందుఁ బొడకట్టును. ఇంక మూఁడవ వర్ణనయందు వేంకటరాయశాస్త్రిగా రంగీకరించిన "సత్యమ్మగురూపసంపద" యను పాఠమందలి "సత్యమ్మగు" అను పదమున కర్థము నొసఁగకుండుట చేత నిజమగు రూపసంపద యనిగాని, శాశ్వతమగు రూప సంపద యనిగాని యర్థము చెప్పవలసి వచ్చునా ? అట్లయిన నీ పదములవలనఁ గలిగిన ప్రయో జన మేమి? కాక, యిద్ది 'ప్రాసకోస ముంచిన కూసుమాట" యే యగునా "సత్యమ్మగ" నను పాఠ మింతకన్న నన్వయ సౌలభ్యముగలిగి యుండునా? యను ప్రశ్నలు పరంపర వచ్చుచుండును,

మొదటి మూఁడు చరణములయందుఁ గల ప్రక్రమమును బట్టియు, నుపమాన నిరాకరణ వాచకములను బట్టియుఁ జూచినచో నర్జునుఁడు రూప సంపద యందు నలకూబరుని కన్న మిన్న యనియు. నాతని మోవిజాతి కెంపు కంటె నెట్టనయి మెఱుఁ గెక్కి యున్నదనియు, నాతని చెక్కిళ్ళు కమ్మని జాళువాకన్న పసిమి మిగిలి ప్రకాశించుచున్న వనియు నులూచి గ్రహించి "ఆహా! యీతని కిచ్చట నేను నా హృదయము నమ్మక తప్పదు" అని నిశ్చయించుకొనెనని పై వ్యాఖ్యాత లుద్దేశించిరనుట ప్రస్ఫుటము గదా! వేఱెట్టి ప్రతిబంధకము లేకున్నను బయినిఁగల మూఁడు చరణముల యందలి

వర్ణన నాలుగవ పాదమునఁ గల నిశ్చయమున కెట్లు దారినిఁ గలుగఁజేసెను? ఈ నిశ్చయమునందు తన హృదయము నమ్మ తలంపేల యులూచికిఁగలుగ వలయును ? "వీని కియ్యేడన్" అనునంతటి యగత్య మేమి సమకూరెను ? అని శంకింపక తీఱదుగదా! అయిన నిట్టి శంకలవంక నాపూర్వ వ్యాఖ్యాతలు పోరైరి. పద్యమును బఠించుచుఁ దుది చరణము కడకు వచ్చి, "అమ్మకచెల్ల నా హృదయ మమ్మక చెల్లదు వీని కియ్యేడన్" అని చదివినంత 'నయ్యారే! మాట విఱుచునే' ట్లని యానందించి, యంతటితో నీపద్య గుణదోష విచార మును వ్యాఖ్యాతలును, పాఠకులును ద్యజించి రనియే యనవలయును. పెండ్లి కొడుకుగ నలంకృతుఁ డయిన యర్జునుని యందముంగాంచి సుభద్రా సఖులాశ్చర్యమున.

"ఓ మగువలార. మును విన
మా? మన్మథు సతని మేనమామన్ మధునిన్"

అని యనిన యప్పుడు సుప్రసిద్ధ సుందరాకారులగు మన్మథుని వసంతు నిఁజెప్పుచు నీ మాటల విఱుపుతోఁ జమత్కారము జూపెనుగాన సంతసించి తిమి. ఆ యెడ నెట్టి యాక్షేపణయు నుండఁ జాలదు. కాని. మనపద్యమునం దమ్మక మేల యావశ్యక మయ్యెనో చూపకున్న నీ పదచ్ఛేద చమత్కార మంతయు విరసమగును గదా !

ఇచ్చట నొకమాట చెప్పఁదగును. జూలూరివారు, వేంకటరాయశాస్త్రి గారు నొసఁగిన వ్యాఖ్యానమున సంతృప్తి నంది యెట్టి శంకకును బాల్పడని వారనేకులుందు రనుట నిక్కము. అది యట్టులగుట మన విమర్శనారాహిత్య మనుటకన్న గవి చమత్కారాధిక్య మనుటయే మేలు. చేమకూరవాఁడు పండిత పామరుల నొక్క రీతిని రంజించు నేర్పుఁ గలిగి 'ప్రసన్న గంభీర గతిన్ రచించు' సామర్థ్యము గలవాఁడు గాని సామాన్యుఁడు గాఁడు ఎంత యాఁకటి కంత యాహార మిడు నీవి ద్రమానుఁ బోలినవాఁడు.

ఇంక పదచ్ఛేద చమత్కారను నారయుదము గాక ! ఈ విమర్శన మునకు బూర్వోక్తము లగు ప్రశ్నములు చాల నుపకరించును. అందు

మొదటిది: "కమ్మని జాళువా దొరయఁ గల్గిన చెక్కుల టెక్కువాఁడు" అను వర్ణనను గుఱించి, చక్కని మేల్మి బంగారముతో (తో?) రాపాడఁ గలిగినట్టి చెక్కిళ్ళ యందము గలవాఁడనికదా! యర్థము దోఁచెడిని. అనఁగా నర్జునుని చెక్కిళ్ళు పదియార్వన్నె పసిండి చాయ గలిగి యున్నదని యూహ్య మగును. కాని. యిట్లు వర్ణించుటకు మహాప్రతిబంధక మొక్కటి గలదు. అర్జునుఁడు విజయవిలాస కావ్యము నందు-తక్కిన కావ్యముల యందును గూడ కృష్ణవర్ణము గలవాఁడు. అర్జున నామధేయమున కాధార భూత మగు 'దుర్లభమగు నవదాతవర్ణము' పాండవమధ్య యోధాగ్రణి వర్ణనల యందు చాల మృగ్యము ఈ గ్రంథరాజమునం దీతఁడు 'కమ్మని కుందనంబు కసుకందని మేను' గలవాఁడు గాని. 'ఆరకూటచ్ఛాయ నవఘళించు' శరీరము గలవాఁడు గాని కాఁడు. ఉలూచి నాఁడాగాంగ సైకతమునఁ గాంచిన యాతఁడు "కలకఁ నగుచుండెడి సవ్యసాచి, నింద్రోపలరోచిఁ జూచి, తల యూచి, యులూచి రసోచితంబుగన్" అను పద్యమును బట్టి 'ఇంద్రోపలరోచి' యింద్ర నీలమణుల కాంతివంటి దేహచ్ఛాయ గల క్రీడియే గాని. 'మెఱుఁగు బంగరు చాయ మించు దేహమువాఁడు' కాఁడు. ఆవల యతివేషమున నున్న కిరీటితో ముచ్చటించుచు సుభద్ర వర్ణించిన యర్జునుఁడును.

"ఎగుబుజంబులవాఁడు' మృగరాజు మధ్యంబుఁ
బుడికి పుచ్చికొను నెన్నడుము వాఁడు,
నెఱి వెండ్రుకల వాఁడు, నీలంపు నికరంపు
మెఱుఁగు చామనచాయ మేనివాఁడు."

చామనచాయ యన శ్యామలచ్ఛాయ యని సహృదయు లెఱుంగు నదియ, కావునఁ జేమకూర వేంకటరాజకవి యర్జునుఁడు నల్లనివాఁడే యను టకు సందేహము లేదు. ఇట్లనేక స్థలంబుల నల్లనివానిగ భావించి వర్ణించిన యాతఁడు మన పద్యమునందు స్వర్ణ వర్ణునిగ నభివర్ణించె ననుట సాహసము గాక మానదు. 'భక్తి విశ్వాసంబుల్ నీ సొమ్ము' లన శ్రద్ధాభక్తులకుఁ బేరుఁ

గాంచిన వేంకటరా జిట్టి యనౌచిత్యమునకుఁ జాల్పడె నని నిర్ధారణ చేయు టకుఁ బూర్వ మెంతయేని యోజింపవలయును గదా!

అట్లయినచో నీ 'కమ్మని జాళువా' గతి యేమి కావలయును? ఒక్కించుక పరికింపుఁడు : పూర్వ వ్యాఖ్యాత లందఱును జాళువాకును, చెక్కులకును వర్ణసాదృశ్య మున్నయదిగాఁ దలంచి ప్రమాదమునకు లోనయిరి. ఒరయు ధాతువు సకర్మకము, రాచు, పరీక్షించు లోనగు నర్థములఁ గలయది. దాని నకర్మక క్రియగా భావించి 'రాపాడు' నను నర్థమును జెప్పిరి. కావుననే 'చక్కని మేల్మి బంగారమును' అను ద్వితీయార్థము పొసఁగక వారు తృతీయార్థము (బంగారముతో) నూహించిరా యను సందేహమునకుఁ గారణము కలిగెను. ఇప్పు డీ సకర్మక క్రియార్థమునే చెప్పినచో, 'కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కుల చెక్కువాఁడు' అనఁ 'ప్రశస్తమగు జాళువాదేశపు బంగారిమును (పదియాఱువన్నె పసిండిని) రాచుటకు సమర్థమయిన చెక్కిళ్ళ యందము గలవాఁడు" అని యగును. బంగారమును రాచునది (ఒరవెట్టునది) యొరగల్లు లేక నికషోపలము. ఇయ్యది నల్లనయి చాల నునుపుఁ గలిగి నిగనిగలాడునది యని యందఱు నెఱుంగునదియ, నైగనిగ్ధ్యముతోడి నల్లని చెక్కిళ్ళు జాళువాదేశపు బంగారమును రాచుటకుఁ దగిన యొరగండ్ల వలె నున్నవని వర్ణనము. ఈ యర్థము వలన నర్జున దేహచ్ఛాయా వివాద మంతరించును, ఒరయు ధాతువునకుఁ బండిత కవి సమ్మతమగు సకర్మ కార్థము పొసఁగును. కమ్మని జాళువాక అను ద్వితీయకు తృతీయార్థము జెప్పికొను కష్టము తప్పును.

"(చొ)క్కమ్మగు జాతికెంపువెలగాఁ గొను మోవి మెఱుంగువాఁడు" అను ద్వితీయవర్ణన యందు 'వెలగాఁగొను' అను స్థలమునఁ బండితులు గొంత వాఖ్యానాపేక్షను గనఁబఱిచిరి. చూడుడు: జూలూరివారు 'వెలగాఁగొను_కొని వేయఁజాలు నటువంటి అనఁగా, తన అధికారములో వుండఁగలిగి నటువంటి' యని ప్రత్యేక వివరణమును వ్రాసిరి. ఇంక వేంకటరాయశాస్త్రిగారన్ననో, 'వెలగాన్ =(తనకు....అనగా మోవికి) మూల్యముగా' నని కుండలీకరణ రూపమున నొక వివరణము నొసంగిరి. ఇట్లీ వర్తనయం దింత

ప్రత్యేక వివరణములకుఁ బూనుట యర్థ (లేక, యన్వయ) సౌలభ్యము గాన రామిం జేసి యనియే గదా యూహింపవలయును. జూలూరివారి విధమున 'నర్జునుని మోవి జాతి కెంపును కొని తనకు లోబడిన దానినిగ నుంచికొనఁ జాలిఁ యున్నది'-యని తెలియఁగలదు. కాని. వేంకటరాయశాస్త్రిగారి యర్థ మింకను క్లిష్టముగనే యున్నదనక తప్పదు. అంగడియందు మనము తీసికొను వస్తువు కొఱకు మనమిచ్చు ధనమునకు మూల్యమని యందుము. వస్త్రము నకు మూల్యము పదిరూక లన నన్ని వేళ మెట్టిదో తెలియునుగదా! ఇంక 'పద్మరాగ మాణిక్యమును తనకు (అనగా మోవికి) మూల్యముగాఁ దీసికొనఁ గలుగు మోవి మెఱుంగువాఁడు' అనిన మోవి తాను జాతికెంపు అను మూల్యమున కమ్ముడువోవునని భావము తేలును. ఇందాధిక్య ముపమానము నందు (జాతికెంపునందు) నిల్చును, తక్కిన రెండు చరణముల యందును గుణాధిక్య ముపమేయములఁ గలదు. కావున నీ యర్థమున రెండవ చరణము నందు ప్రక్రమభంగము పాటిల్లును. కావున 'వెలగాన్' అనిన 'మూల్య నిర్ణయము కాఁగా' నని యర్థము జెప్పికొనవలయును.

ఈ వర్ణనయం దింకొక్క చమత్కారము నారయుట యుదావ హాముగ నుండఁగలదు. చేమకూర వేంకట కవి సాధారణముగ కెంపు గుణము నుగ్గడించునప్పుడు వెల యను పదమును ప్రయోగించుచుండును. సాభిప్రాయపదములతో నలరారుచు సహృదయాహ్లాదకరముగ నుండు సీస పద్యమున నింద్రప్రస్థపురంబు నందలి విటులు వారకాంతా గుణగణములను వర్ణించు పట్టున "........వెలలేని పొందిక విడివడ మెఱయు నీ. కెంపుల శోగడల కీరవాణి" యని వర్ణించెను. (ఈ సీసపద్యము నందుఁ గూడ వేంకట కవి పదప్రయోగ సౌష్టవమును. రత్నగుణ పరిజ్ఞానమును నెంతయేని యుండుట నిట నా నివేదనమున కడ్డంకి యగుచున్నయది.) ఈ పద్యము నందును గెంపు వెలలేనిదై పొందికయందు (కట్టడపుఁ బనితనమునందు) విడి (ఎఱ్ఱఁదనము) వ్యాపించునట్లుగాఁ బ్రకాశించుచున్నది. ఈ 'వెలలేని' యను టకు అమూల్యం మనునర్థము కీరవాణి వేశ్యాపరముగఁ జెప్పుదుము గాన, 'కెంపు' పదార్థమున నర్థాంతరము నారయవలయును. అట్టులనే మన పద్యమునందును 'జాతికెంపు వెలఁగా గొను'ట సంప్రాప్తించినది. 'వెల'

యనునది వెల్ల యొక్క రూపాంతరము. ఈయది యామ్రేడితంబున వెలవెల యను రూపమున సుప్రసిద్ధము. తెలవెల యను రూపాంతరములు సాధారణముగ నామ్రేడితముననే కాననగుచున్నవి. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు 'తెల'కు రూపాంతర మనియు, నామ్రేడితముప తెలతెల అని ప్రయుక్త మనియు వివరణము వ్రాసి, 'వెల' రూపమున కట్టి వివరణము నొసంగరైరి. ఈయది ప్రమాదమే కావలయును, ఏల యనిన వారే 'వెల వెల పదమున వెల + వెల అని విభజనను జూపిరి, కావున 'తెల' వలెనే 'వెల' రూపమును గూడ వీరంగీకరించిరి, ఈ వెల-తెల్ల అను నర్థము వేంకటకవి దృష్టిని గల దనుటకు నిదర్శనము లింకను జూపఁగలవు. ఆ యర్థము నను సంధించి యీ చరణమునకు "చొక్కమ్మగు - దోషరహితమై పరిశుద్ధమైన, జాతికెంపున్-పద్మరాగ మను జాతినామమునఁ బరగు (సింహళదేశజము) రక్తవర్ణముగల కెంపును, వెలఁగాన్-తెల్లగా, అనఁగా, చాలినంత యెఱ్ఱఁదనము లేని యట్లుగా, కొను-పరిగణించు, మోవి మెఱుంగువాఁడు" అని యూహింపఁ దగును.

తక్కుం గల సంశయములను గూడ నిట్టులనే యూరయఁదగు నని విడిచి, నాలుగవ చరణము నందలి పదవిభజన చమత్కారము నించుక నివేదించును చేమకూరకవి కడుంగడు శ్రద్ధాళువు. సందు దొరికివది కదాయని మందెమేలములకుఁ బూనువాఁడు గాఁడని యంగీకరించితిమిగదా! కావునఁ బై పాదములలోఁ జాలినంత సందర్భమును గల్పింపకయే యీపాదమునం దమ్మకమునకు దిగడని నా విశ్వాశము. ఆ విశ్వాసముతోడఁ బద్యమును బరిశీలింప మొదటి చరణమునందు బంగారము నొరయఁ గల్గుట కలదు. ఒరయుట యనఁ బరీక్షించుటయు గూడ గాన నీ చరణమునందు స్వర్ణపరీక్ష యున్నది. రెండవ చరణమునందు జాతికెంపు 'వెలఁగాఁ గొనుట యను' మూల్య నిర్ణయము కలదు, ఇది రత్నపరీక్ష. మూఁడవ చరణమున 'రూప సంపద' గల యాతఁ డున్నవాఁడు. జాతరూపము, రౌప్యము లోనగు పదములను బట్టియు 'రూప' 'రూప్య' యను నాణెములకుఁగల సంస్కృత పదములను బట్టియుఁ జూడ నిచ్చటఁ గొంత ధనము గలవాఁడును గలదు. కవి

కీ చరణమునఁ గల ధనదృష్టియే ధనాధిపసూను నుపమానముగఁ దీసికొని వచ్చెను.

పాఠకమహాశయులారా! మన కడ విక్రయమునకొక కొక రత్నాభరణ మున్న దని భావించినచో దాని విక్రయమునకు మనము చూడఁదగిన విషయ ములు మూఁడుకదా! మొదట' నగయందుఁ గల బంగారు వన్నెను, ధరను నిర్ణయించుట దీనికై స్వర్ణపరీక్షకుఁడు బంగారము నొరగంటిపై గీటుపెట్టి యిన్ని వన్నెల బంగార మనియు, నింతదర గల బంగార మనియు నిర్ణ యించి, 'ఉల్లాకు' నొసఁగును. ఇంతవఱకుఁ గేవల స్వర్ణవిషయము. తరువాత నాయాభరణము నందలి మాణిక్యముల వెల నిర్ణయము గావలయును. నీనిర్ణ రత్నపరీక్ష వలయు: అయ్యదియే రెండవ చరణమునందలి విషయము. స్వర్ణ పరీక్షయు, మాణిక్యపరీక్షయు నైన యనంతరము క్రయకుని (కొనువానిని) నెమకవలయును. అప్పుడు గాని విక్రయ కార్యము పరిసమాప్తి నందదుక్కి మన కవి కాలమునాటికిఁ గల విపణి ప్రవర్తన మిట్టిదియ. ఈ మూఁడం. ములను : అనగా మనకడనున్న యమూల్య మాణిక్యాభరణమునందలి పపిండి పసఁదనంబు నెఱుంగఁ గలవాఁడును, నందలి కెంపుల సొంపును గుర్తింపఁ గలవాఁడును, నెంత విలువ యయినను నర్హ మని తోచిన నీయఁ జాలినంత ధనము కలవాఁడును, ఒక్కచోటనే, ఒక్కవ్యక్తియందే లభించిన యెడల నాయుత్త మాభరణము నాచోటనే, యాతనికే యమ్మి వేయుదుము గదా! లేకయున్న నింకొకచోట నియ్యది చెల్లునా! గుణగణముల నెఱుంగఁ జాలి యర్హమూల్యము నొసఁగఁగల యైశ్వర్యమున్న వానికన్న మిన్నయగు క్రయకుఁ డెవ్వనికి నెప్పుడును లభింపఁ జాలఁడు. కావుననే యా చక్కని వెలగల రత్నాభరణము నాతనికే యా క్షణముననే యమ్మి వైతుము. ఈ పద్యమునం దులూచీహృదయ విక్రయమునకుఁ గూడ నట్టి పరిస్థితులే యేర్పడెను.

ఈ చెక్కుల టెక్కువాఁడు (అందము లగు చెక్కిళ్ళు గలవాఁడు) జాళువా నొరయఁ గల్గినవాఁడు.

ఈ మోవి మెఱుంగువాఁడు (మెఱుఁగు గల మోవిగల యర్జునుఁడు).

జాతి కెంపులకు (జాత్యేకవచనము) మూల్య నిర్ణయము నొనరింప సమర్థుఁడు,

ఈ సుందరాకారుఁడు అర్థపతి కుమారుని సైతము తిరస్కరింప జాలి నంత ధనము కలవాఁడు. (అర్థపతివలె తన ధనము నంతటిని నొక మూల నుంచి ప్రాణమిత్రునికి సైతము బిక్షాటనము మాన్పజాలనివాఁడు గాఁడు, సాధారణ ధనిక పుత్రులవలె విచ్చలవిడిగ వెచ్చించి కలాదృష్టిని జీవనమున గడుపువాఁడు. ఇట్టి గుణత్రయము గలవాఁడు కావుననే అమ్మకచెల్ల (ఎంతయానందము !) నా హృదయమమ్మక చెల్లదు వీని కీయెడన్.

ఉలూచి విక్రయింప నున్నది తన హృదయము. పై వివరణమునుబట్టి చూడ నా హృదయము అపరిమిత మూల్యమునకుఁ బాత్రమగు పద్మరాగ ఖచిత స్వర్ణ విభూష యని ధ్వనింపక మానదు ఎంత యుత్తమ మగు ధ్వని యిట్టి యుత్తమ ధ్వనుల నెన్నిటినేని గలగియున్న విజయ విలాస కావ్య ముత్తమ కావ్య వతంసము గాకుండునే ! అనురాగభరితంబగు హృదయమును బద్మరాగ మణిమయాభరణముగఁ గవి యూహించుట యాతని ప్రతిభావ మును వేయినోళ్ళం జాటుచున్నది. హృదయాకార వర్ణనముల నెఱింగిన వారు దీని కానందింపకపోరు. నిష్కల్మషమగు తన హృదయమునందలి గుణగణము లను బాగుగ గుర్తించి వానికిఁ దగిన యట్టి ప్రత్యనురాగ మూల్యము నొసంగఁగల యాతఁ డొక్క తన్వంగికిఁ జిక్కెనేని యాతని కాతుణంబున నాయంగన తన హృదయము నర్పింపక మిన్నకుండునా, ఉలూచి తన హృదయము నమ్ముటయా యని కొందఱు స్థూలదృష్టి నారసి హాహాకార ములకుఁ బూనుదురు. కన్యాజన వరగ్రహణంబు నిక్కమగ నమ్ముటయే: కాని యే మూల్యమునకు ? అనంత మతి పవిత్ర మనుదిన ప్రవర్ధమాన మగు ప్రత్యనురాగ మూల్యమునకు మానవులు విక్రీతులగుచున్నారు. భగవంతుఁడు గూడ నట్టి ప్రణయమూల్యమునకు విక్రీతుఁ డగునని గదా యుదారాశయు లుపదేశింతురు ! కావున నీ విషయమున నివ్వెఱ నందఁబనిలేదు. ఉలూచియుఁ దన హృదయము నర్పణచేసి. యాతని హృదయమును కైవశ మొనరించి కొనును. ఇంతకన్న నన్యోన్య ప్రేమ యేమి యుండును ?

'అమ్మక చెల్ల' యను దానఁబడ విభజనప్రౌఢి నింత సందర్భ శుద్ధి తోడఁ బ్రయోగించి, కావ్యమునకు జీవం బనఁ బరగు ధ్వనిని పోషించి, తన కావ్యమునకు నులూచీపాత్రకు నొక్కరీతి నౌన్నత్యమునుగూర్చిన మన చేమ కూరవానికిఁ జేమోడ్పు లనఁ జెల్లదే!*

—భారతి
ఆంగీరస. జ్యేష్ఠము. జూన్. 1932.
సంపుటము 9: సంఖ్య 6,



'*విజయ విలాస వ్యాఖ్యాన విధాన' మను పేర భారతిలో వెలువడిన శ్రీ తాపీ ధర్మారావుగారి వ్యాస పరంపరలో నిది నాల్గవది.—సంకలనకర్త

# క్షేత్రయ్య పదకవిత

—శ్రీ పి. గణపతిశాస్త్రి

ఇటీవల క్షేత్రయ్య, సారంగపాణి మొదలయిన పదకర్తలను గురించీ, వారి పదరచనా పద్ధతిని గురించీ పత్రికల్లో చాలా వాదోపవాదాలు చెలరేగాయి. కొందరు విమర్శకులీ జాతి రచయిత లందర్నీ కలియగట్టి వీరందరు కేవలం అసభ్య పద రచనలు చేశారని అనేక విధాల దోషారోపణలు చేశారు. మరి కొందరు వీరంతటి ఉత్తమ రచయితలు లేరని వీరిని ఆకాశానికి ఎత్తేశాసు,

ఈ దోషారోపణలధాటీ క్షేత్రయ్యమీద, అతని పదరచనమీద మరింత తీవ్రంగా సాగింది. ఈ విషయాలకు సంబంధించిన వాదోపవాదాలు తీవ్రమైన అభిని వేశాహంకారాలతో సాగి ఉండడంవల్లను. కొంతమంది ప్రసిద్ధులలోనే ఈ విషయంలో తీవ్రమయిన భేదాభిప్రాయా లేర్పడి ఉండడం వల్లను, ముఖ్యంగాను ఈ వ్యాసంలో క్షేత్రజ్ఞుని పద రచనలను గురించిన దోషారోపణల ఔచిత్యా నౌచిత్యాలను గురించి కొంచెం వివరించి వ్రాస్తాను,

**దోషారోపణలు:—**

పై విమర్శకులు క్షేత్రయ్య పదాలు చాలా అసభ్యంగా ఉన్నాయనీ, పదాల చివర కేవలం 'మువ్వగోపాల' అనే మకుటం మాత్రం చేర్చి, ఇతడు మొవ్వ గ్రామానికి సమీపంలో ఉన్న సానెంపాడు వేశ్యలపై తనలో ఉబికిన లంపటత్వం మాత్రమే వ్యక్తీకరించాడనీ, మరి మధురభక్తి అనేది ఇతని పదకవితలో ఏకోశాన్నా కనబడటం లేదనీ, తన సమానకాలీను లయిన రాజుల లాలసా సంతృప్తికోసమే ఇతడీ పదరచన కుపక్రమించాడనీ, కనక ఇతని పదాలన్నీ కేవలం 'చెత్త' కింద జమకట్టి వెయ్యాలనీ, వీటికి సాహిత్తీ గౌరవమే లేదనీ-ఇలాగ అనేక విధాల దోషారోపణలు చేశారు.

ఈ విషయాలమీద ఇంతగా వాద ప్రతివాద ధూళి రేగిన తరువాత మన భాషలో బయలుదేరిన పదాల రచనా సంప్రదాయము, మధుర భక్తి సంప్రదాయము, తత్స్వరూపము, ఈ మార్గంలో క్షేత్రయ్య అవలంబించిన రచనా పద్ధతి మొదలైన విషయాలన్నీ సాంప్రదాయిక దృష్టితోను, అధునా తన దృష్టితోను పరిశీలించిన తరువాతనే క్షేత్రయ్య పదకవిత అంతరువు, గుణదోషాలు మొదలైన విషయాలను గురించి చర్చించి ఒక నిర్ణయానికి రావడం న్యాయ్యము.

ఇటీవలి విమర్శకులు పదకర్త లందరినీ ఒకే వర్గం క్రింద జమకట్టి చాలా తీవ్రమయిన దోషారోపణలు చేశారు. గాని ఈ సందర్భంలో ఒక విష యం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి.

నిజానికి అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతయ్య మొద లయిన పదకర్త లందరు ఒకే కాలానికి గాని, తరహాకు గాని చెందినవారు కారు.

వీరిలో ప్రతి రచయితకు ప్రత్యేక వ్యక్తిత్వము, రచనా పద్ధతి, విశిష్ట మైన అంతరువు ఉన్నాయి, ఆయా రచయితల రచనా వైఖరినిబట్టి, వీరిలో కొందరు ఉత్తము లనీ, మరి కొందరు కొంచెం తక్కువ అంతరువుకు చెందిన వారనీ ఇలాగ ఆయా రచయితల తారతమ్య భావాలు తేల్చుకోవాలి.

**పదకవిత:-**

మన భాషలో పదకవిత ప్రత్యేక శాఖగా పేర్కొనదగిన గేయ వాఙ్మయంగా ప్రసిద్ధి పొందింది. దీనిలో సంగీత సాహిత్యాలు రెండు సమాన స్థాయిలో నడుస్తూంటాయి అంతే కాదు. ఈ జాతి రచనలలో సంగీత సాహి త్యాలు రెండు పరస్పరాచ్ఛాదన సంభవించకుండా విజృంభిస్తూ క్రమంగా అర్ధ నారీశ్వరమూర్తివలె ప్రత్యేక వ్యక్తిత్వంతోను, సౌందర్యంతోను భాసి స్తాయి. పదరచనలో కనిపించే ప్రత్యేక లక్షణాలలో ఇది చాలా ముఖ్య మయినది.

త్యాగరాజాదులు రచించిన కృతులలో చాలా వాటిలో సంగీతాని కున్నంత ప్రాముఖ్యం సాహిత్యానికి కనబడదు. ఈ జాతి కృతులలో సంగీత

భావమే సాహిత్యంలోని పదాలకు జీవంపోసి ప్రాణప్రతిష్ఠ చేస్తుంది. ఉదాహరణకు త్యాగరాజు దేవమనోహరి రాగంలో రచించిన "రామా ఇక నన్ను బ్రోవ, రాదా! దయలేదా?" అనే కృతి తీసుకుందాము. కేవలం సాహిత్య దృష్టితో పరిశీలించినపుడు ఈ కృతి పల్లవి పదాలలో రసస్ఫోరకమైన శక్తి ఏమీ కనబడదు. కాని, దేవమనోహరి రాగంతో వీటిని రంగరించినపు డీ పల్లవి పదాలు జీవ చైతన్యంతో నృత్యంచేస్తూ శ్రోతల హృదయా లుర్రూత లూగిస్తాయి. ఇక్కడ సంగీతానికి వచ్చినంత ప్రాధాన్యం సాహిత్యానికి రాలేదు. ఇలాంటిచోట్ల సంగీతమే సాహిత్యాని కుజ్జీవక మౌతుంది.

రామదాసు మొదలయినవారు రచించిన కీర్తనలలో చాలా వాటిలో సంగీతానికి సాహిత్యాని కున్నంత ప్రాధాన్యం కనబడదు. ఉదాహరణకు ఈ క్రింది కీర్తన భాగం తీసుకుందాము.

> "ఏ తీరుగ నను దయజూచెదవో- ఇనవంశోత్తమ రామా !
> నా తరమా భవసాగర మీదను-నళినదళేక్షణ రామా !
> కారుణ్యాలయ భక్తవరద ! నను-కన్నది కానుపు రామా?"

దీనిలో సంగీతం ఛాయామాత్రంగానే ప్రయత్నించి ఈ కీర్తన పదాలన్నీ పొడుగిస్తూ, అర్థభావాదులన్నీ అలక్ష్యంచేస్తే తప్ప-రాగాలాపన కిక్కడ అవకాశమే లేదు.

ఇక ఉత్తమమైన పదరచనలో సంగీత సాహిత్యాలు రెండూ సమాన స్థాయిలో నడుస్తూ పరస్పరోజ్జీవకములై మేళవించి ఒక వినూతనమైన ప్రత్యేక స్వరూపంతో భాసిస్తాయి. ఈ క్రింది క్షేత్రయ్య పదం దీనికి ఉదాహరణగా స్వీకరింప వచ్చును.

సావేరి — ఆది

( స్వీయ — సఖిశిక్ష )

పల్లవి: తాళి మొక్కరి కైన వద్దా ! ఓ చెలియరో
అనుపల్లవి: లోలాక్షీ ; మువ్వగోపాలునికి నీకు మాటలైతే : ॥తాళి॥

1. వాడలుగ నీ వలుగ వశమె? మీకై తిరుగు
లాడి చాలు నన్న ట్లున్నది; యెవరు మెత్తురే:
కూడక మీరిన ట్లున్నది - నే జెల్ల మీకు -
కోపము ముక్కు నున్నది చెలియరో: ॥తాళి॥

2. చలమున వాఁ డోక డంటే సైగగా నూర కుండక
చెలియరో! యిదేటి కోపము? చెల్లునే మీ తోడ
చెలిమి చేసిన పాపము! ఎందుకె మీకు
వలువని మనస్తాపము? చెలియరో! ॥తాళి॥

3. ఎలమి పాలు నీరువలె కలిసి యుండ మువ్వగోపాలునితో—
చెలియరో యీ చల మేటికి? ఇటువంటి గుణము
చెల్లునే నీవంటి మేటికి? వివేక మింత
వలువదా! లెస్సాయెను నేటికి ఓ చెలియా! ॥తాళి

మన పదరచనా సంప్రదాయము:-

ఆంధ్రభాషలో పదరచన అన్నమాచార్యునితోను, తద్వంశీయులైన తాళ్ళపాక కవులతోను బాగా విస్తృతమై ఒక స్వతంత్ర గేయశాఖగా స్థిర పడిపోయింది. క్షేత్రజ్ఞుని కాలానికి 'పద' మనే మాట మధురభక్తి, శృంగారము కలిసిన ఒక జాతి గేయరచనగా ప్రసిద్ధి కెక్కినట్లు కనబడుతుంది. అన్నమాచార్యుని పదాలు, తదితర తాళ్ళపాక కవుల పదాలు పరిశీలిస్తే ఆ కాలంలో పదాలు కేవలం శృంగారపరంగానే గాక ఆధ్యాత్మికంగా రచించే సంప్రదాయం కూడా ఉన్నట్లు కనిపిస్తున్నది.

అన్నమాచార్యుఁడు తాళ్ళపాక కవులలోనే కాక ఇంతవరకు మనకు పదకర్తలుగా ప్రసిద్ధులైన పురందరిలోను ప్రథముడు. ఇతడు క్రీ.శ.1408లో జన్మించి 1503లో పరమపదించాడు. అంటే ఇంచుమించుగా 15వ శతాబ్ది ప్రథమార్ధం నాటికే మన పదరచన స్థిరంగా నెలకొన్నదని నిశ్చయించ వచ్చును. అన్నమాచార్యుని కాలానికే పదరచన స్థిరపడినదంటే — అంతకు

చాలా కాలానికి పూర్వమే పదరచన, తత్సంప్రదాయము మనదేశంలో ప్రారంభమై ఉండాలి.

క్షేత్రజ్ఞుడు 17వ శతాబ్ది ప్రథమ భాగంలోనివాడు. ఇందుచేత ఇతని పదరచన ఆ సమీపంలోనే ప్రారంభమైఉండాలి. దీనినిబట్టి క్షేత్రయ్యకు సుమారు రెండు శతాబ్దాల పూర్వంనించీ మనదేశంలో పదరచన ప్రారంభించి ఉండవచ్చునని నిశ్చయించవచ్చును. ఏతావతా—క్షేత్రయ్యకు సుమారు రెండు శతాబ్దాల నించీ దేశంలో పదరచనా సంప్రదాయం నెలకొన్నదనీ, అది అన్నమాచార్యునితో స్థిరరూపం ధరించినదనీ, ప్రస్తుతం మనకు లభిస్తున్న ప్రమాణాలను బట్టి నిర్ధారణ చెయ్యవచ్చును.

అన్నమాచార్యునితోను, తద్వంశీయులతోను ప్రారంభించిన పదరచన క్షేత్రయ్య కాలము నాటికి బాగా పరిణత మై పరిపూర్ణస్థితికి వచ్చింది. ఈ పరిణతి పరిశీలనకుపూర్వం అన్నమాచార్యుల కాలంనాటి పదకవితా స్వరూప స్వభావా లెలాగ ఉన్నాయో పరిశీలిద్దాము.

**తాళ్ళపాక కవుల శృంగార కీర్తనలు:-**

తాళ్ళపాక అన్నమాచార్యుడు, తద్వంశీయులైన పెద తిరుమలాచార్యుడు, తిరుమలాచార్యుడు తాము వ్రాసిన మధురభక్తి స్ఫోరకములైన రచనలకు శృంగార కీర్తన లని పేరుపెట్టారు. ఇవన్నీ వేంకటేశ్వర నామాంకితంగానే రచించారు. తాళ్ళపాక కవులు తమ శృంగార కీర్తనలలో స్వాధీనపతిక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత, ఖండిత మొదలైన నాయికల మనోభావాలన్నీ సూక్ష్ములైన భంగిమలతోను, వైవిధ్యాలతోను అనేక విధాలుగా వర్ణించారు. ఇంకా కొన్ని కొన్ని చోట్ల వేంకటేశ్వరునికీ, శ్రీకృష్ణునికీ అభేదాధ్యవసాయం చేసి శ్రీకృష్ణుని బాల్యచేష్టలు, శృంగార చేష్టలు మొదలైనవన్నీ వేంకటేశ్వర నామాంకితంగానే రచించారు. ఇవి గాక వేంకటేశ్వరుని మేలుకొలుపులు, పవళింపు సేవలు ఇంకా వివిధములైన భోగాలు, వాటి వర్ణనలు ఈ కీర్తనలలో ఎక్కువగా కన్పిస్తాయి.

వీరి పదాలలో సాంప్రదాయకంగా వచ్చే అష్టవిధ నాయికలే గాక, భోగకాంతలు, పరకీయలు, చెంచెతలు, బోయస్త్రీలు మొదలైనవారుకూడా

వేంకటేశ్వరుని నాయిక లౌతారు. అయితే తాళ్ళపాక కవుల కీర్తనలలో ఇలాంటి అసాంప్రదాయికాలైన నాయికా మనోభావ వర్ణనలు స్వల్పంగానే కనిపిస్తున్నాయి.

సాంప్రదాయకంగా వచ్చే స్వాధీనపతి కాది నాయికలు, వాటి మనో భావ వర్ణనలు తాళ్ళపాక కవుల కీర్తనలలో ప్రధానంగా ఉన్నాయని అనుకున్నాము. ఈ విషయంలో ఈ కవులలో కనిపించే విస్తృతి, వైవిధ్యము క్షేత్రయ్యలో ఇంకా ఒక అంతరువు దాకా పైకి వెళ్ళిపోయాయి. క్షేత్రయ్య అంతటితో ఊరుకోక నాయికా మనోభావ వైవిధ్య ప్రదర్శనా లలో అవధులకు వెళ్ళిపోయాడు.

వరాళిరాగంలో రచించిన ఈ క్రింది గీతంలోని విరహోత్కంఠితాభి వర్ణనము అన్నమయ్య రచనలోని ఉదాత్తఫణితికి ఉదాహరణగా ఇవ్వ వచ్చును.

నీకు వలచిన సతికి నెగులు గలదా మీద
నీ కరుణ మరవ కింతియ చాలును;
నీవంటి చతురునకు నిక్కంబుగా వలచి
జీవంబు విడిచినా సేగి గలదా ?
భావముల నిను దలచి పడతి యిట్లాయె నని
ఆవేళ నను దలచు మంతె చాలు !
తగిలి నిను బాసి సంతాప దావాగ్ని నిటు
నొగిలినా నా కెందు నొప్పి గలదా !
వగ మీర మరుని పూబాణముల దెగిన—పొం
దుగ నప్పు డైన వగతువుగా ! నీవు !
కూరుముల నిటు నిన్ను గూడిన లతాంగి కై
వేఱ ఇక మరుచేతి వెరపు గలదా !
సారమతి వెంకటేశ్వర నన్ను నలయించి
యీ రీతి నైన జన విత్తుగా నీవు.

క్షేత్రజ్ఞునికి రెండు శతాబ్దాల పూర్వం బయలు దేరిన అన్నమయ్య రచనలలోనే క్షేత్రజ్ఞుని రచనా ఫణితికి పునాదులు పడి ఉన్నాయి.

ఇక క్షేత్రయ్య రచనలలోను అన్నమయ్య రచనలలోను గల ప్రత్యేక గుణగణాలు పరిశీలించే ముందు ఈ పదరచయిత లవలంబించిన మధురభక్తి సంప్రదాయాన్ని గురించీ, ఈ భక్తిమార్గంలో వీ రవలంబించిన మార్గాలను గురించీ కొంచెం పరిశీలన అవసరం.

భక్తి సంప్రదాయం :-

మనదేశంలో చిరకాలం నించీ భక్తిమార్గం ఈశ్వరారాధన సాక్షాత్కృతులకు సాధనంగా ఉన్న విషయం సామాన్యంగా అందరికీ తెలిసినదే. అయితే ఈ భక్తి సాధనలలో అనేక మార్గాలున్నాయి. ఆయా సాధకుల స్వభావాలను బట్టి ఆయా మార్గభేదా లేర్పడుతూంటాయి. ఈశ్వరుని జగన్మాతగా గాని, జగత్పితగా గాని, మిత్రాది భావనలతో గాని, ఇంకా పురాణ ప్రసిద్ధులైన రామకృష్ణాద్యవతార రూపంలో గాని అర్చించే సంప్రదాయాలు, మార్గాలు మనకు సర్వసాధారణ మైనవే. ఇంకా పరమేశ్వరుని ప్రియతమ భావనతోను, ప్రేయసీ భావనతోను, అర్చించే సంప్రదాయం కూడా మనకు అనుశ్రుతంగా వస్తున్నదే. మీరాబాయి, చండీదాసు, కబీరు, మొదలైన భక్తుల చరిత్ర లాయా భక్తి వైవిధ్యాలకు లక్ష్యాలుగా కనిపిస్తున్నాయి.

మధురభక్తి :-

ఈశ్వరుని ప్రేయసీ రూపంలో గాని, ప్రియతమ రూపంలో గాని అర్చించే మార్గమే మధురభక్తి మార్గమని ప్రసిద్ధి పొందింది. భాగవత ప్రసిద్ధమైన గోపికల భక్తిమార్గ మీ భక్తి మార్గమే. జయదేవుని గీతగోవింద కావ్యము కూడా ఇలాంటి మధురభక్తి మార్గానికి సంబంధించినదే. జయదేవుడీ కావ్యంలో రాధాకృష్ణుల ప్రణయం మధురమార్గ లక్ష్యంగా ప్రదర్శించాడు. ఇంకా ఔత్తరాహులైన మీరాబాయి, చండీదాసు మొదలైన భక్తుల చరిత్రలలోను, వారు రచించిన గేయాలలోను ఈ మధురభక్తి ప్రస్ఫుటంగా వెల్లివిరిసిందే. నారదభక్తి సూత్రాలలో "యథా వ్రజగోపికానాం" అనే సూత్రంలో గోపికాంభక్తి ఈ విధమైన భక్తికి తార్కాణంగా ఉదాహరించబడినది. ఈ విధంగా మధురభక్తి శాస్త్రప్రసిద్ధమై మన ప్రాచీన భక్తి సంప్ర

చాయంలో సుస్థిరంగా నెలకొన్నది. ఈ సంప్రదాయమే ఆయా కవుల కావ్యాలలోను, గేయాది రచనలలోను అనేక విధాలుగా అభివ్యక్తి పొందింది.

## మధురభక్తి వర్ణనం :-

భక్తిమార్గమనే సరికే అది సంపూర్ణ మయిన సగుణారాధనగా మారి పోతుంది. జ్ఞానమార్గంలో కేవలము అనిర్వచనీయము, అవాఙ్మానస గోచరము, అయిన ధ్యేయవస్తు వీ భక్తి మార్గంలో మానవ హృదయానికి అతి సన్నిహిత మై చేదోడు వాదోడుగా నిలిచి, నెచ్చెలి, జనని మొదలైన సన్నిహితాత్మీయ బంధు స్వరూపం ధరిస్తున్నది. ఇక ప్రేయసీ భావనలో గాని, ప్రియతమ భావనలోగాని, రాధికా గోపికాది భావనలోగాని, ఈశ్వరారాధనం జరిగినపుడు భక్తునికి ఆయా భావాలకు అనుకూల మైన మానసిక పరిస్థితి ఏర్పడటం సహజం. కావ్యాలలోగాని, పదాలలోగాని ఈ పరిస్థితి అభివ్యక్త మైనపుడు భక్తుని మానవ సహజమైన భావావేశం అభివ్యక్తమౌతుంది.

అలాగ కాకుండా - భక్తుని భావనలో మానవ సహజస్థితి లోపించి నపుడాతనిలో ఉద్భవించిన కవిత నీరసమై వట్టి శుష్కవేదాంత పదాలతో దొర్లించిన తత్త్వాల ధోరణిలోకి దిగి ఊరుకుంటుంది అయితే - ఇక లౌకిక శృంగార కవితకు, మధురభక్తి కవితకు భేదమే ఉండదని భావించ కూడదు. ఉదాత్త భావపూరితమై దివ్యత్వం ధ్వనింపజేస్తూ మానవాత్మను భక్తి శిఖరంపై ప్రతిష్ఠింపజేయ గలిగినది మధురభక్తి కవిత అనీ. తద్భిన్నమైనది కేవలశృంగార కవిత అనీ ప్రత్యేకంగా నిర్దేశించ వచ్చును, ఆయా వరిసర వర్ణనలనుబట్టి విభావానుభావాది భేదాలనుబట్టి కూడా ఇది మధురభక్తి అనీ, ఇది లౌకిక శృంగార మనీ వేరువేరుగా నిర్ధారణ చెయ్యవచ్చును.

## అన్నమయ్య - క్షేత్రయ్య:-

క్షేత్రయ్య పదరచన కుపక్రమించే సరికి అంతకు పూర్వం నించీ భారతదేశంలో అనుశ్రుతంగా వస్తున్న భక్తి సంప్రదాయాలు. ఆంధ్ర

దేశంలో అంతకుపూర్వం రెండు శతాబ్దాల నించీ వ్యాప్తిలో ఉన్న అన్నమాచార్యాది తాళ్ళపాక కవుల మధురభక్తి మయము లైన శృంగార కీర్తనలు, వాటి రచనా సంప్రదాయాలు క్షుణ్ణంగా అవగాహన చేసుకొని ఉండవచ్చును.

క్షేత్రయ్యను అన్నమయ్యతో సరిపోల్చి చూచినపుడు పరస్పరము వీరికి పోలికలే గాక కొన్ని ప్రత్యేక గుణాలు కూడా విస్పష్టంగా కనిపిస్తాయి అన్నమయ్య కూడా క్షేత్రయ్య మాదిరిగానే అసంఖ్యాకంగా పదాలు రచించిన వాడే గాని ఇతని పదాలలో సంగీత ప్రస్తారానికి అంత ఎక్కువ అవకాశం కనబడదు. ఆయన పదాలన్ని చాలావరకు పరిమితమాత్రానుబద్ధములైన పదచ్ఛందస్సుల లాగే భాసిస్తాయి

క్షేత్రయ్య పదాలలో సంగీతం సాహిత్యాన్ని గాని, సాహిత్యం సంగీతాన్ని గాని అచ్ఛాదించకుండా రెండు రెండు రెక్కల్లాగ విడివడి శ్రోతలకు ఆనందాకాశం అవధులలోకి ఆకర్షించుకు పోతాయి. నిజానికి సంగీత సాహిత్యాల కలయిక క్షేత్రయ్యలో అమరినంతి మనోహరంగా మరి తదితర పదకర్త లెవరిలోను జరుగలేదు. ఈ విధమైన పదరచనా పటిమ వల్లనే నేటికి ఇతడొక సుప్రసిద్ధ దాక్షిణాత్య సంగీత వాగ్గేయకారుడుగా ప్రశంసింపబడుతున్నాడు. గానాభినయాను రూపమైన పదరచనా శిల్పం ఇతనిలో సంపూర్ణ పరిణతి చెందినదని ప్రఖ్యాత సంగీతవేత్త లందరు ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. నిజానికి అన్నమాచార్యునితో నలెత్తిన పదరచన క్షేత్రయ్యలో సంపూర్ణంగా పరిణతమై భాసించింది.

క్షేత్రయ్యలో వచ్చినంతి పరిణతిగాని. పరిపూర్ణతగాని, ఆ తరువాతి పద రచయితలలో కనిపించడంలేదు. మొత్తంమీద క్షేత్రయ్య తరువాత బయలుదేరిన పద రచయితలలో ఉదాత్తత, పరిణతి, క్రమక్రమంగా క్షీణించి పోయాయని చెప్పవచ్చును.

ఇక వస్తు స్వీకరణ వైవిధ్య దృష్ట్యా చూచినా అన్నమాచార్యుని కంటె క్షేత్రయ్యలోనే ఎక్కువ వైవిధ్యం కనిపిస్తుంది. అన్నమాచార్యుని

లోనే అక్కడక్కడ పరకీయలు, భోగకాంతలు, చెంచెతలు, బోయ స్త్రీలు మొదలయిన నాయికలు ప్రవేశిస్తున్నారు. అన్నమాచార్యులీ విధమైనవారిని వెంకటేశ్వరుని నాయికలుగా వర్ణించడం కేవలం అసభ్యధోరణి అని స్థూల దృష్ట్యా పరిశీలించిన విమర్శకులకెవరికైనా తోచవచ్చును, కాని, అది సరి అయిన విమర్శక దృష్టికాదు. నాయికా స్వభావం ఎటువంటిదైనా– ఆమె పరమేశ్వరారాధనకు – ఆత్మార్పణకు అర్హురాలనేదృష్టితోనే అన్నమాచార్యులీ విధమయిన మార్గం అవలంబించి, సూక్ష్మమయిన వాస్తవిక (Odjective) దృష్టితో ఆయా నాయికా చిత్రణ కుపక్రమించాడు.

క్షేత్రయ్య దగ్గరకు వచ్చేసరికి ఈ పద్ధతి ఇంకా కొంచెం విశృంఖలంగా సాగింది. ఇతడు సాంప్రదాయికంగా వచ్చే అష్టవిధ శృంగార నాయికల వివిధ మనోభావాలే గాక భోగకాంతలు, పరకీయలు మొదలైన నాయికల మనోభావాభివర్ణనలలో అవధులకు వెళ్ళిపోయాడు. ఇంకా అక్కడక్కడ అంతగా ఉత్తమ ప్రకృతులుగాని నాయికల స్వభావాభివర్ణనలు కూడా చేర్చాడు. ఇంతగా సాగిన ఇతని నాయికా వైవిధ్య వర్ణన పరిశీలించిన తరువాత మరి ఈ విషయంలో ఇతడభివర్ణించిన నాయికా భావం ఏదైనా ఉన్నదా ? అని ఆశ్చర్యం కలుగుతుంది

ఇంకా ఆ యా పదాలలో ఆ యా నాయికల స్వభావాల ననుసరించి సక్రుత్తుగా నేటి అభిరుచికి కొంచెం మోటుగా కనిపించేధోరణిలో పదరచన సాగించాడు. అయితే ఇలాంటి వర్ణన లన్నీ వాస్తవిక (Objective) దృష్టితోను, నాయికా వైవిధ్య ప్రదర్శన దృష్టితోను చేసినవన్న విషయం చాలా జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. ఆయా నాయికల స్వభావాభివర్ణనలలోను, సూక్ష్మమయిన వైవిధ్య ప్రదర్శనంలోను, సంగీత సాహిత్య సమ్మేళనంలోను, పదరచనా శిల్పంలోను ఇతడు ప్రదర్శించిన నిరుపమాన శక్తికి క్రింది పదము ఉదాహరణముగా చాలు ననుకుంటాను.

యదుకుల కాంభోజి–ఆది

(స్వీయ, మధ్య, ప్రేమగర్విత)

పల్లవి: ఎంత చక్కనివాడే! నాసామి వీ
డెంత చక్కని వాడే!

అనుపల్లవి! ఇంతి మువ్వ గోపాలుడు-సంతతము-నామదికి-
సంతోషము చేసునే!

1. మొలక నవ్వులవాడె-ముద్దు మాటల వాడె
తళుకారు చెక్కు టద్దములవాడే
తలిరాకు జిగి దెగడదగు మోవి గలవాడె
తెలిదమ్మి రేకు కన్నుల నమరు వాడే

2. చిరుత ప్రాయమువాడె-చెలువొందు విదియ చం
దురు గేరు నొసలిచే మెరయు వాడే
చెరుకు విల్తునిగన్న దొరవలె నున్నాడే
మెరుగు చామనచాయ మే నమరు వాడే.

3. పొదలు కెందామరల - పెంపొదవు పదములవాడే
కొదమ సింగపు నడుము కొమ రమరు వాడే
మదకరి కరముల మరువు చేతుల వాడే
నుదతి! మువ్వ గోపాలు డెంత సొగసు గలవాడే!

**మధురభక్తి— అన్నమాచార్య క్షేత్రజ్ఞులు:—**

అన్నమాచార్య క్షేత్రజ్ఞు లిరువురును మధురభక్తి సంప్రదాయంలోనే పద రచన చేసినా ఇద్దరిలోను, తారతమ్యా లెంచవలసి వచ్చినప్పుడు-క్షేత్రయ్య కంటె అన్నమయ్యలోనే మధురభక్తిభావం ఒక చూపువాసి ఎక్కువగా ఉన్నట్లు కనబడుతుంది. దీనివల్ల అన్నమయ్యలో క్షేత్రయ్యకంటె ఒక చూపువాసి ఉదాత్తత కనబడుతున్నది. క్షేత్రయ్య స్వీకరించిన వైవిధ్యం వల్ల ఇతనిలో అది అక్కడక్కడ సకృత్తుగా ఒక చూపువాసి తగ్గినట్లు కన బడుతున్నది. వాస్తవంగా ఇద్దరిలోను కనిపించే విభేదం ఇంతే!

## స్థూల విమర్శకులు :-

ఇటీవల స్థూల విమర్శకులు కొందరు ఆంధ్రదేశీయమైన పద రచనా సంప్రదాయము మధురభక్తి. ఆ భక్తి వ్యక్తిలో వచ్చే ప్రత్యేకత మొదలైన విషయాలేవీ తిన్నగా అవగాహన చేసుకోకుండా కేవలం స్థూలదృష్టితో క్షేత్రజ్ఞుడు మొదలైనవారి పదాలు చదివి, క్షేత్రయ్య పదరచన మీద బాధ్యతా విరహితమైన విమర్శనలు చేశారు. అంతటితో ఊరుకోక ఇంతటి ఉత్తమ పదకర్తమీద అసభ్యత్వాది నిందారోపణలు కూడా చేశారు. ఈ విమర్శకులు క్షేత్రజ్ఞుని పదరచనా కాలము ఆనాటి పదరచనా సంప్రదాయాలు, వీటి విషయంలో అవలంబించవలసిన చారిత్రక దృక్పథము మొదలైన విషయాలన్ని పూర్తిగా విస్మరించినట్లు కనబడుతున్నది.

## అసభ్యత్వారోపణ:-

ఈ రోజుల్లో మనం పెద్దన వంటి ప్రబంధకాలపు కవిని పరిశీలించవలసినప్పుడాకాలపు కవితా సంప్రదాయాలు, చారిత్రక పరిస్థితులు, ఆయా కవుల ప్రత్యేక స్వభావాలు, వారివారి తరతమ భావాలు మొదలైన విషయాలన్నీ జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాము. అంతేగాని కేవలం స్థూలదృష్టి అవలంబించి, ఆపామాషీగా ఆకాలపు రచనలన్నీ పట్టి అసభ్యరచనలని గానీ, పనికిమాలిన చెత్త రచనలని గాని, కొట్టి పారవెయ్యటం లేదు! ఉదాహరణకు పెద్దన మనుచరిత్రే తీసుకుందాము. ఆ కాలపు కవితా సంప్రదాయాలను బట్టి పెద్దన తన మనుచరిత్రలో పురవర్ణన, గజాశ్వాది వర్ణనలు, విరహవర్ణన, సంభోగ వర్ణన, అవయవ వర్ణనలు మొదలైనవన్నీ ప్రవేశపెట్టాడు. ఈనాటి కవులుగాని, విమర్శకులుగాని, ఇలాంటి విషయాలాధునిక కావ్యాలలో ఆవశ్యకాలని అనుకోరు. మన దృష్టికానాటి విరహాది వర్ణనలు కొన్ని మోటుగా గూడా కనిపించవచ్చును. అంతమాత్రంచేత పెద్దన అసభ్య వర్ణనలు చేశాడని మన మతనిని దుయ్యబట్టడం లేదు.

నిజానికి పెద్దన చేసిన సంభోగాది వర్ణనలు మాత్రమే ఉదాహరించి పట్టి స్థూలదృష్టితో ఇత డసభ్య ధోరణిలోకి దిగిపోయా డనటం కూడా

తేలికే. స్థూలంగా చూస్తే ఈ వాదం చాల సబబైనదే అని అంతగా లోతులు తెలియని పాఠకులు ఎవరైనా అంగీకరిస్తారు. క్షేత్రయ్యను విమర్శించిన స్థూలవిమర్శకులు కూడా సరిగా ఈ పద్ధతే అవలబించారు. ఈనాఁడు పెద్దన ఉత్తమకవి యని సమర్థించడం హాస్యాస్పద మైనట్లుగానే క్షేత్రయ్య ఉత్తమపద రచయిత అనీ, ఇతనిలో అసభ్యత లేదనీ సమర్థించడం కూడా అలాగ చర్విత చర్వణమైన హాస్యాస్పదమైన విషయమే!

ప్రబంధకవులలో ఉత్తములలోనే తారతమ్యాలున్నాయి. ఎంత నిశిత పరిశీలన చేసినా ఈనాడు పెద్దనను మనమొక అత్యుత్తమ ప్రబంధ కవిగా గౌరవిస్తున్నాము. పెద్దనాది కవులలో ఉన్నట్టుగానే అన్నమాచార్యాది పదరచయితలలో తారతమ్యా లున్నాయి. అన్నమాచార్యులించుమించుగా ఈ ప్రబంధ యుగానికి చెందినవాడే. ఆకాలపు అభిరుచిని బట్టిగాని, నిశితమైన ఈ కాలపు అభిరుచిని బట్టిగాని చూస్తే ఇతనిలో అసభ్యత ఎక్కడా గోచరించదు. ఈ వ్యాసంలో ఉదాహరించిన క్షేత్రయ్య పదమును బట్టి అన్నమాచార్యుని రచనలలోను క్షేత్రయ్య రచనలలోను గల సంప్రదాయ సామ్యాలు పదరచనారీతులు, తారతమ్యాలు పాఠకులకు సులభంగానే స్ఫురిస్తాయి.

క్షేత్రయ్య అన్నమాచార్యునికి రెండు శతాబ్దాల అనంతరం ఉద్భవించినాడు, ఇతనిలో రెండు శతాబ్దాల పదరచనా పరిణతివల్ల వచ్చిన చూపువాసి శృంగార వర్ణనాధిక్యం మాత్రం కనిపిస్తుంది. అంతేగాని ఇటీవలి విమర్శకులు స్థూలదృష్టితో ప్రదర్శించినంత అసభ్యత ఎక్కడా ఇతని రచనలలో కనపడదు.

అయితే ఈ విమర్శకులు క్షేత్రయ్య నాయికా వైవిధ్య ప్రదర్శనంకోసం సకృత్తుగా అక్కడక్కడ రచించినవి అనుదాత్త నాయికా పరమైన పదాలు కొన్ని చదివి, సరియైన వాస్తవిక దృక్పథంతో అవి అవగాహన చేసుకోలేక ఇటువంటి విమర్శనకు ఉపక్రమింతురని తోస్తుంది.

అంగ ప్రత్యంగ వర్ణనలు చేసినంతమాత్రాన రచయిత మీద అసభ్య తారోపణ చెయ్యడానికి వీలులేదు. ఆ రచయిత ఆ విషయంలో ఆవలంబించిన ఉదాత్తానుదాత్త దృక్పథాలను బట్టి మాత్రమే సభ్యతాసభ్యతలు నిర్ణయించాలి. క్షేత్రయ్య రచనలు వాస్తవిక దృక్పథంతో పరిశీలించిన వారికి క్షేత్రయ్య నాయికా స్వభావ వర్ణనలలో ఎక్కడా అసభ్యత స్ఫురించదు. పైగా సూక్ష్మమైన ఈతని స్వభావ పరిశీలనలు పాఠకులలో ఆశ్చర్య గౌరవా లినుమడింప చేస్తాయి.

ఆధునిక దృష్టి :

క్షేత్రయ్యపదా లీకాలంలో కులీన బాలికల గానాభినయాల కనర్హమైన వని ఇంకొక విమర్శ వచ్చింది. నిజానికి క్షేత్రయ్యలో ఇలాంటి పదాల సంఖ్య చాలా స్వల్పం. అదిన్నిగాక ఇది సాహిత్య విమర్శనకు సంబంధించిన సమస్య కానేకాదు. సుప్రసిద్ధులైన పెద్దనాదుల కావ్యాల భాగాలన్నీ బాలబాలికల పఠనపాఠాలకు తగినవి కావు. మనం ఆకావ్యాలలో సముచితములైన భాగాలే నేడు పాఠ్యభాగాలుగా నిర్ణయిస్తున్నాము. ఇది కేవలం బాలబాలికల విద్యావిధానానికి సంబంధించిన సమస్య.

క్షేత్రయ్య రచనలలో సకృత్తుగా అక్కడక్కడ కనిపించే కొన్ని పదాలు పరిహరిస్తే అవి నేటి బాలికల గానాభినయాలకు కూడా సముచితమైనవే. సకృత్తుగా కనిపించే కొన్నిపదాలు మాత్రం ఉదాహరించి క్షేత్రజ్ఞుని పదరచన అంతా చెత్తకింద జమకట్టడం సమ్యగ్దృష్టి లేని విమర్శకులు చేసేపని కింద జమకట్టాలి.

సుప్రసిద్ధులైన తమిళ విమర్శకులు నేటివరకు క్షేత్రజ్ఞుని నొక ఉత్తమ వాగ్గేయకారకుడుగా గౌరవించి. ఇతని పదాలు విరివిగా బాలికల నృత్యగానాల కుపయోగిస్తున్నారు. మరి ఆదేమి దురదృష్టమోగాని ఆంధ్రదేశంలో కొందరు విమర్శకు లిటీవల ఇతనిమీద, ఇతని పదరచనమీద లేనిపోని దోషారోపణల కుపక్రమించారు.

ఇతని కేర్పడిన క్షేత్రజ్ఞ నామధేయాన్నిబట్టి చూస్తే, ఇతడు తీర్థయాత్రా పరుడైన ఒక భక్తుడై ఉండవచ్చు నని చెప్పవచ్చు. ఇత డనేక క్షేత్రాలు దర్శించి, ఆయా దేవతలమీద పదరచన చేశాడనీ, కనక నే ఇతనికి క్షేత్రజ్ఞ నామధేయం ఏర్పడిన దనీ చెబుతున్నారు. ఆయా దేవతలమీద ఇతడు రచించిన పదాలనుబట్టి ఈ ఊహ సమంజసమైనది కావచ్చును.

అయితే క్షేత్రయ్య పదాలు ప్రకటించిన శ్రీ విస్సా అప్పారావుగారు తమ గ్రంథపీఠికలో క్షేత్రయ్య నిజనామధేయము మొవ్వ వరదయ్య అనీ, మొవ్వ గ్రామానికి సమీపంగా సానెంపాడు వేశ్యల సాహచర్యం కొంత యితని పదరచనకు ప్రోద్బలం కలిగించి ఉండవచ్చునని వ్రాశారు. పేరును బట్టి చూస్తే ఇతడు తీర్థ యాత్రాపరుడైన భక్తుడని అంటే అనవచ్చును గానీ, ఈ వేశ్యాసాహచర్యానికి మాత్రం ఇతని రచనలో ఎక్కువ తార్కాణం కనబడదు. ఇది కేవలం మొవ్వ గ్రామ పరిసరాలనుబట్టి వారు చేసిన ఊహాగానం మాత్రమే. మధురభక్తి ధోరణిలో పదరచన చేసినంత మాత్రాన ఈ విధమైన వేశ్యాసాహచర్యం కల్పించటం సముచితం కాదు. కేవలం రచనలనుబట్టి ఇలాంటి ఊహాగానాలు ప్రారంభిస్తే అన్నమాచార్యాది తాళ్ళపాక కవులకు కూడా ఇలాంటి తతంగాలు కల్పించవలసివస్తుంది. అన్నమాచార్యాది తాళ్ళపాక కవులందరు ఉత్తమ భక్తులుగా నేటికీ గౌరవింపబడుతున్నారు. అందుచేత అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గాని, తగినన్ని సాక్ష్యాలు దొరికి నంతాక ఇలాంటి విషయాలలో కేవలం తటస్థ భావం అవలంబించడమే న్యాయ్యము.

శ్రీ అప్పారావుగారు క్షేత్రయ్య యెడల భక్తి గౌరవాలతోనే ఇలాంటి ఊహాగానాలు చేశారు గాని. ఇటీవలి విమర్శకులీ ఊహాగానాలు పట్టుకొని క్షేత్రయ్య మీద, అతని పదరచనమీద అన్యాయమైన విమర్శలోకి దిగి ఉండడం వల్ల ఈ విషయంలో ఇంతగా వ్రాయవలసిన అవసరం కలిగింది.

క్షేత్రయ్య చరిత్రను గూర్చి, అతని పదాలను గూర్చి, ఇంకా నిశితమైన పరిశోధన జరుగవలసిన అవసరం ఎంతేనా ఉన్నది. క్షేత్రయ్య రచించిన పదాలన్నీ లభించినట్లు కనబడదు. అతడు కొన్ని వేలవరకు పదాలు రచించి ఉండవచ్చు నని విజ్ఞు లభిప్రాయపడుతున్నారు కాని, మన కింతవరకు లభించిన పదాలు కొన్ని వందలు మాత్రమే కొంత నిశితపరిశోధన జరిగినమీద క్షేత్రయ్య చరిత్రను గురించి, పదాలు గురించి కొన్ని కొత్తవిషయాలు బయట పడవచ్చును. ప్రస్తుతము క్షేత్రయ్య పేరుతో ప్రకటింపబడిన పదాలలో కొన్ని కొన్ని ప్రక్షిప్తా లుండినా ఉండవచ్చును.

సంగీత సాహిత్యాభిజ్ఞు లీ విషయంలో ఇంకా నిశితపరిశోధనలు జరిపి, విస్మృతప్రాయమైన క్షేత్రయ్య పదాలు వునరుద్ధరించగల రనీ, ఆంధ్ర దేశంలో కూడా క్షేత్రయ్య కవితపై సముచిత మైన దృక్పథం ఏర్పడగల దనీ తద్వారా మన దేశంలో క్షేత్రయ్య పదాలకు సముచిత మైన గౌరవాదరాలు లభించగల వనీ, క్షేత్రజ్ఞుని పదకవిత నృత్యగానాలతో విలసిల్లగల దనీ ఆశిస్తున్నాను.

—భారతి

విజయ, శ్రావణము, ఆగష్టు, 1953.
సంపుటము 30; సంచిక 8.

—X—

# సీతమ్మ శోకము - పాపరాజు

—శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

ఆ తమసా తీరమున దినమణి దివ్యతేజఃపుంజము వెల్లివిరిసి వెలుఁగు మధ్యాహ్నకాలమున పాపమే నిషాదుఁడు జక్కవకవ నేయ నమకట్టేనో గాని ఆ పుణ్యక్షణమున, ఆ సువర్ణక్షణమున ఆది కోకిల కన్నెఱ్ఱఁజేసి తియ్యని గొంతు కదపి 'కూ!' యని గద్గదించినది. ఆ కూఁతకు వాక్పతి తాళపువేఁత దొరికినది. దాని కనంత కల్యాణగుణాభిరాముఁ డగు శ్రీరామచంద్రుని శుభచరిత్రము కేలూఁతయైనది. ఆ యనంతమధుర గానము ముల్లోకములను ముమ్మరించి, భోరున నేటికి మ్రోతవెట్టు.

మొదటి కోయిల 'కూకూ'లు మేలు బంతులు కుమార కలకంఠములు గొంతు సవరించి హావణించి, తీర్చి దిద్ది మించి పాడుకొన్నవి. భవభూతికి శ్రీమద్రామాయణపు రుచి తగిలినది. రెండు నాటకములుగా మనసువడి వ్రాసికొన్నాఁడు. కాని "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే".

పాపరాజు పసికట్టినాఁడు. పరమ పురుషుని యుత్తర కథ పసందు పాడుకొన్నాఁడు. భవభూతి యభిమానించిన పాత్ర శ్రీరామచంద్రుఁడు పాపరాజు భక్తితోఁ బోషించుకొనిన పాత్ర సీతమ్మ. "హృదయంత్వేవ జానాతి ప్రీతి యోగం పరస్పరం" అని రాముఁడై యన్న భవభూతి హృదయమును దెలిసికొని సీతమ్మయై పాపరాజు "భావ మెప్పుడు దనమూర్తిఁ జాయ దనుము" అనినాఁడు.

కంకంటి పాపరాజు నుత్తర రామాయణమున నొక రసవద్ఘట్టను సీతమ్మ శోకము. భవభూతి యెట్టి యనుభూతితోఁ దన యుత్తర రామ చరితపుఁ దృతీయాంకమును వ్రాసెనో యట్టి రసవన్నిష్ఠలోఁ బాపరాజు

జానకీశోక ఘట్టమును విరచించెను. భవభూతి యుత్తరరామ చరితమునఁ బుటపాక ప్రతీకాశమగు వియోగబాధచే క్రుమ్మిపోవుచున్న శ్రీరామచంద్రుని దుఃఖాక్రందనములకు జవాబుగాఁ బాపరాజు సీతమ్మ పవిత్ర మధుర స్నిగ్ధహృదయమును జూపినాఁడు. నే నీ ఘట్టమును జదువునప్పుడు హృదయము దుఃఖాభుగ్న మైనది. కన్నులు చెమ్మగిలినవి ఏదియో మధురిమ స్ఫురించి ముగ్ధునిఁ జేయును. "ఏకస్స్వాదు నభుంజీత" కనుక పాఠకులకుఁ గొంత చవిచూపఁ దలఁచితిని.

చిత్రకారుఁడు గీసిన గీతలో జీవరేఖ యంతర్వాహినిగా ప్రవహించును. వస్తువును భావించుటలోను, అవస్థను గని పెట్టుటలోను, ఔచిత్యమును గమనించుటలోను రసానుభూతిలోఁ దొప్పదోఁగి పోవుటలోను గవితో సమానముగ జిత్రకారుఁ డావేదకుఁడును. కాని, చిత్రకారుని కుంచియకంటెఁ గవికలమున విశిష్ట రచన కలదు, చిత్రమున మూగిసోయగము గలదు. కవి గీతమునఁ జిత్రకారుని చిత్రణా సౌష్ఠవమును, గాయకుని రాగ మాధుర్యమును నెలకొనుటయే గాక కావ్యోతనిబద్ధ తత్తత్పాత్రలు తమ యపూర్వ సూత్రధార కౌశలమున రసమూర్తులై వారివారి యవస్థలలో మనలను గూడ నాకర్షించుకొని, తత్తద్రసాలంబనములలో మనలను గూడ జోడించి చొక్కింతురు.

పాపరాజు హృదయము రసభరితమైయున్నది. ఈ శోకఘట్టమునునటించుటకు దానె యీ భూమికను ధరించుకొని రంగమున కురికి యుండును! ఎంతనిష్ఠతో, ఎంత యనుభూతితో, ఎంతవస్తుతత్త్వజ్ఞతతో నీపాత్రనాయత్తపరచి నాఁడోగదా కవిచంద్రుఁడు : "ఆ కృశాంగి మఱలఁ గన్నుఁదామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడు నశ్రుధారా ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలు వార జాళువా మెఱుంగు పయ్యెద మీఁదికి దిగజారి యుత్తుంగతర స్తనకనక కలశంబులు నిండుకొన మెండుకొను నిట్టూర్పు సెకలం దగిలి చిగురు వాతెఱ తుకతుక సుడుక నుడుగణంబుల బెడంగు నడంగఁ ద్రొక్కు చేర్చుక్క తెరల తరళతర చికుర నికరంబు లళిక ఫలకంబు పయిం జెఱలాడ తురిమిన విరుల సరులతో నొఱలి కొప్పు పెన్నెఱు లంసభాగంబునం బొలలిపడ జదువుఁ జెమ్మ

టలు గ్రమ్ముకొని నెమ్మేను గడగడ వడంక కడంకదక్కి చిన్ని మొగంబు విన్నఁదనంబున కిమ్ముఁజూప పరితాప దవానలంబునం బడి పురపురబొక్కుచు దాల్మిఁ దూలి స్రుక్కుచు, లేచి కూర్చుండి, శోకరసం బాకారంబుఁ దాల్చిన చందంబున చిత్రరూపంబు గాత్రంబు గైకొన్న చెన్నున, సాధ్వసంబు సాధ్వి యైన కరణిం, గరుణంబు కరణంబు నొందిన తెఱంగున నుఱక వెక్కి వెక్కి యేడ్చుచు నేడుపు విడిచి, మౌనంబుఁబూనుచు, మౌనంబు మాని దనలోఁ దా నగుచు, నగవుడిగి తల యూఁచుచుఁ, దల యూపుట విడిచి ముక్కుపై వ్రేలు గీల్కొలుపుచు, జాలిఁగొని, హాహాకారంబులు సలుసుచున్న "సీతమ్మను జూచిన నే సహృదయుని గుండె కంపించి నీరుకాక మానును? కవిచంద్రుఁడు కన్నులుమూసి, కాంతారాంతరమునఁ గటకటంబడుచున్న సాధ్వీమతల్లి కష్ట దుర్దశను దన యద్వితీయ భావనాశక్తి వలనఁ గని పెట్టినాఁడు. చూచిన హృదయము కరుణాప్లావిత మైనది. రసవీచికాపటలిఁ మూఁగి. తోఁడి జొగి పోయినాఁడు; రసానుభవ మైనది. ఇఁక దనకావ్య ప్రసక్తికై కలము చేకొని నాఁడు. పదములను బ్రయోగించి పలుకుబడి ననుసరించి, పరస్పరోప సంధాన సౌష్ఠవము నుపలక్షించి సీతమ్మ నెంత స్వభావ సుందరముగఁ జిత్రించినాఁడో చూడుఁడు. అంతశోక దీనదశయందును సహజగంభీరశీల యగు సీతమ్మ దుఃఖావేగ మాపుకొని ప్రోల భయవిషాద సంచలిత గాత్రుఁడై.

"మితిలేని యీ మిడిమేలంపు మెకములు
సకియల బలగమే జనని నీకు ?
పరికింపరావి యీ బలుమలల్ నవరత్న
మయచంద్ర శాలలే మాత నీకు !"

"పతిఁ బాయఁజేసి నిన్నొంటి డించిన పాపాత్ముఁడ"నని వాపోవు మఱందితో
"అడలకు మన్న ! నీకు వసుధాధిపునానతి దాటవచ్చునే
యిడుమలఁ జెందుమంచు విధి యీ దర నన్ను సృజించియుండఁగాఁ
గడవఁగ నెవ్వరోపుదురు ?"

అని గుండె రాయిచేసికొని, యూరటఁ బల్కు విచక్షణత, ఓరిమి,

ఆయనకుఁ గాక యేరికిఁ జెల్లును? ఆ సాధ్వి యున్నత హృదయమును గురు తించి, పలికించుటకుఁ బాపరాజునకుఁ గాక యేరికి సాధ్యము ?

వాల్మీకి మునీంద్రుని యుత్తర కాండలో నింత రసస్ఫూర్తి నెలకొన లేదు. ఆ తపస్వి యీ పట్టును సవితాదృష్టితోఁ గాక కథా దృష్టితోమాత్రమే రచించెఁ గావలయుఁ జూడుఁడు :

"తదేత జాహ్నవీతీరే బ్రహ్మర్షీణాం తపోవనం
పుణ్యం చ రమణీయం చ మా విషాదం కృథాః శుభే.
రాజ్ఞో దశరథ స్యేష్టః వాల్మీకి ర్మునిపుంగవః".. ...
"ఉపవాసపరై కాగ్రా వస త్వం జనకాత్మజే
పతివ్రతాత్వ మాస్థాయ రామం కృత్వా సదా హృది"

లక్ష్మణుఁడు సీతమ్మ నడవిలో డించి రావలసి వచ్చినపుడు అతనికిఁ దన జీవితముపై రోఁత, ధేనువును వత్స విడువలేనట్లు పవిత్ర మాతృ ప్రేమా మృతమును గోల్పోవునప్పటి బేలతనవు టుమ్మలిక, దుఃఖోన్మాదను సహజ ములు. సీతమ్మను జూచినంతనే గుండె చెదరిపోయి కన్నీరు వరదవాఱఁ గాళ్ళను జుట్టుకొనుటకు మారుగా 'నిది యందమైన జాహ్నవీతీర తపోవనము నీ వేమియు విచారింపకుము' ఇది మా తండ్రిగారి మిత్రుని యాశ్రమము పతివ్రతవై యుపవాసములు చేయుచు నెల్లపుడు రాముని ధ్యానింపుము' అని ఎవడు చెప్పును ? ఈ రచన యస్వాభావికము. పై నుదాహరించిన పాపరాజు రచన స్వాభావికము.

రామచంద్రుని ప్రతి ధమనిలోను సీతా ప్రేమకూలముద్రుజమై ప్రవ హించుచున్నది. ఆఖాత సీతా హృదయమునఁ బవిత్రప్రణయ మధువు నిండి నిబిడీకృతమైనది. ఆ ప్రేయోమూర్తుల ప్రేమ అగమ్యము, అసాధారణము "హృదయంత్వేవ జానాతి" అట్టి ప్రేమైక జీవికి లక్ష్మణుని యుపదేశముద్ర యేమి ? పాపరాజు లక్ష్మణుఁడు.

"జననీ ! నీవు మహా పతివ్రతవు; నీ సౌశీల్య మిల్లాంద్ర కె
ల్లను మేల్బంతి; రఘూద్వహాంఘ్రి యుగళీలగ్నాత్మవై యుండుమీ
యని నే నెవ్వఁడ విన్నవింప ?"

అని యుచితముగా మనవిచేసికొన్నాఁడు. తిక్కనార్యుఁడును నిప్పట్టున నీరసముగనే చెప్పియున్నాఁడు.

క. "ఆశ్రమ మల్లదె మునిచర
ణాశ్రయవు నిరస్తశోక వై యుండు జగ
ద్విశ్రుతి యగు నీ పతియును
నాశ్రమ రహితుండ యింక నని పల్కుటయున్"

(నిర్వచనోత్తర రామాయణము)

ప్రాణపతి నెడబాసిపోయి మిన్ను మన్నుగానక నేక ధారగా నేడ్చు సీతమ్మతో 'నిరస్తశోక వై యుండు' మని యెంత జాలిమాలి పలికినాఁడో యీ లక్ష్మణుఁడు! ఇంక నీ సీతమ్మ జవాబు చూడుఁడు.

క. "అగుఁగాక యట్ల చేసెద,
జగతీపతి పనుపుఁ జేసి చను నీవును, నీ
తెగువ రఘుపతికి నీకుం
దగవఁట, యే ననెడి దేమి?"

అని నిస్స్నేహముగఁ దెగువమైఁ బలికినది. సీతమ్మ యట్లెన్నటికినిఁ బలుకఁ జాలదు.

"అడలకు మన్న! నీకు వసుధాధిపునానతి దాఁటవచ్చునే,
యిడుమలఁ జెందు మంచువిధి యీ ధర నన్ను సృజించియుండఁగా
గడవఁగ నెవ్వ రోపుదురు?"

అనియే యనఁ జాలును! సాధ్వీరత్నములకుఁ బ్రాణపతి వియోగము కంటె దుర్భరతాపము, దురంతవేదన వేఱొకటుండదు. ఇట్టి కష్టస్థితికిఁ దొలిపుట్టువునఁ బ్రేమపాశ బద్ధ లగు దంపతుల నెడఁబాపిన ఘోరకిల్బిషమే కతమని వారి యెడంద తల్లడ పడును. ఇంకెట్టి మహాపాతకమును నిట్లు చేసియుండు నని వారు నమ్మరు. ఇంకెట్టి పాపఫలము నైనను వారు సంతోష ముతో, నిర్భరానందముతో ననుభవింప సిద్ధముగా నుందురు.

సీతమ్మ కట్టి యూహయే పొడకట్టినది. పూర్వపు కాఅడవివాసము ప్రాణపతితోఁ బరమ సంతోష మనిపించినది. ఇప్పటి ఈ రమణీయ జాహ్నవీ పరిసర పవిత్ర తపో వనవాసము 'మేనఁ బ్రాణములు ధరింప' నీయని దైనది.

చ. "ఎడపక పూర్వ జన్మమున నే మిథునంబులఁ బాయఁ జేసి వా
రడలఁగ నవ్వు చుండితినొ? ఆయుఘ మూరకపోనె? నాఁడు కా
అడవుల రామపాదజలజాప్తి వసించితి ; నేఁడు నాథు పొం
దెడసి యనాథనై యిచటనే గతిమేన ధరింతుఁ బ్రాణముల్ ?"

**తపోధన కవియు.**

"కిం ను పాపం కృతం పూర్వం కో వా దారైః వియోజితః....
పురాహ మాశ్రమే వాసం రామపాదానువర్తినీ,
అనురుధ్యాపి సౌమిత్రే దుఃఖే చ పరివర్తినీ,
సా కథం హ్యాశ్రమే సౌమ్య వత్స్యామి విజనీకృతా."

అని చెప్పెను ఇఁకఁ దిక్కనార్యుఁడు

"ఇడుములు పొందగఁ బుట్టిన
యొడ లిది యిటు లోపుఁగాక! యొద్దులు నాచేఁ
బడిరి తొలు భవమునం ది
ప్పుడు తత్ఫల మందకున్న పోవునె నాకున్"—

అని.

"మామికేయం త నూ ర్నూనం, సృష్టా దుఃఖాయ లక్ష్మణ"

అను మాటలతో నందుకొని కుదించి కుంటువఱచినాఁడు.

సీతమ్మ వెనుకటి జీవితమును దలఁచుకొనినది. పూర్వ భర్తృవాల్లభ్యమును భావించుకొని కుంగిపోయినది. గుండె వ్రయ్యలై పోవ దేమని యడుగుచున్నది.

గీ. "ఏను సాధ్వి ననుచు నెల్ల వారలు నన్ను
సన్నుతింతు రనుచు సంతసింతుఁ

గాని నడుమ నిట్టి కటికనిందలు పుట్టి
యడవిఁ ద్రోఁయు రాముఁ డనుచు నెఱుఁగ"

చ. "కటకట లక్ష్మణా! పిడుగు కంబెను బెట్టిద మైన మాట నేఁ
డిటు వినియుండియున్ బగుల దింతలు నింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీ కటికభావముతో నసువుల్ ధరించి యి
య్యటవిని యింక నే వలన నాపద లొందఁ నున్న దాననో!"

తన ప్రేమ మూర్తిని, హృదయపతిని తలంచుకొనునరికి హృదయము పరవశ మైనది. ప్రేమోన్మాద మెత్తినది

పదునాలు గేఁడు లేడుగడయైఁ దాసుఁడై, భక్తుఁడై తమ్ము నెడఁ బాయక పుత్రునివలె మెలంగిన సౌమిత్రి పై నమ్మకము లేక

"కళవళ మంది తెల్పితివొ? కాక పరాకునఁదప్ప వింటివో,
కల నయినన్ రఘూద్వహుఁడు కానలలో ననుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ మతిభ్రమ మైనదొ?
అనినది, కొంతవడికి తెలివి తెచ్చికొని, "హా సహింపు మి ప్పలుక
లెఱుంగ కంటి వెతపాటిలె నీ కొక భ్రాంతి యన్న దే?" అన్నది.

క్రమముగా సీతమ్మకుఁ బ్రళయము క్రమ్మిన ట్లయినది ఏ నరలోకమునకో యీడ్చుకొని పోవుచున్న ట్లయినది. తమ యనంత ప్రణయ ప్రబంధ రసవద్ఘట్టము నిరాశ్వాసాంత మాయెనని పాప మాపువుబోఁడ వేగిరించినది. పొంగిపోవుచున్న బెంగతో

"ఎన్నఁటికిన్ రఘూద్వహుని నేనును నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁగల్గడొకో? కల్గక యుండినఁ బ్రాణ మేలపో-దన్న"
అని బేలగా జగన్మాత ప్రశ్నించుచున్నది. ఆ దురంత వేదన భరింపఁ జాలక వెఱ్ఱి నిస్పృహతో "నాదుమే నున్నది: చెంత గంగమడు గున్నది; యైనటు లయ్యెడుందుదిన్" అనుచున్నది. వాల్మీకి ప్రేమోన్మాదమును చిత్రింపలేదు. "అద్యైవ సౌమిత్రే, జీవితం జాహ్నవీ జలే త్యజేయం"

అని వదలివేసినాఁడు. కవిరాజగు పాపరాజు "చెంత గంగ మడుగున్నది" అని కావ్యజీవితమును గమనించినాఁడు.

ఇప్పట్టున నిర్వచనోత్తర రామాయణమున "జాహ్నవీ సలిల సేచన మూర్ధ్వగతి ప్రదంబు" అని యన్న వాక్యము సరసముగ లేదు. సీతమ్మకుఁ గావలసినది శ్రీరామ ప్రేమామృతము. ఆ యమృతము నాస్వాదించుచుఁ గాఱడవులనైన హాయిగాఁ గడుపఁ గలదు. కాని ఆ ప్రేమమూర్తి లేని స్వర్గరాజ్యమునైన సేవగించుకొనును. ఎన్నఁటికైన రఘూద్వహుని నీమె కనుంగొనఁ గల్గుచో నీ భయంకర ప్రదేశముననె నిద్రాహారములు మాని నిరీక్షింపఁగలదు. "చూడ గల్గదో కో?" అప్పుడు రాముని౯ జూడని యావేదమును భరింపలేక ప్రాణోత్క్రమణోపాయముగ గంగమడుగును జూడఁ దలఁచునుగాని ముముక్షువై యూర్ధ్వగతి ప్రతిగ్రహణమునకుఁ గాదు. పాపరాజీపద్యమును (ఎన్నటికీ అనునది) పాపరాజై వ్రాయలేదు. సీతమ్మయై ప్రేమోన్మత్తుడై విలపించినాఁడు. ప్రేమైక జీవికి ప్రేమయే భోజనము, ప్రేమయే వస్త్రము, ప్రేమయే దివ్యసౌధము, దాని తోడనే సీతమ్మ యశోకవనమును గల్పించుకొనినది. ప్రతిపాదప చ్ఛాయను, అస్నిగ్ధ మోహన జలధరమూర్తి చిరునవ్వుఁ జిలుకుచు మ్రోల నిలుచును. కనుకనే యాదుర్భర వియోగమును తృణప్రాయముగ సహించినది. కాన, యీ నిరవధి ప్రళయమున నిలువఁజాల నని బేలయై వాపోవుచున్నది.

చ. "పతి మతినెంచె నేమొ తనుఁ బాసి యశోకవనంబు లోపలన్
బ్రతుకదె పెక్కునాః కృపచుఁ గ్రమ్మఱఁ దాఁ జను దెంచు శత్రునిన్
హతునిగఁ జేయనేలు నను నాశగదా బ్రదికించె నాఁటి కా
గతి నిఁక నేమియాసఁ గొని కాయము నిల్పుదు తెల్పు లక్ష్మణా !"

క్రమముపా హృదయ ముద్రిక్తమైనది. సింహావలోకనమునఁ బౌర జాన పదులు పొడకట్టిరి. యెద రవుల్కొని పోయినది. కన్నుల ముంచు కోపము వచ్చినను జిగురు వాతెఅ యెత్తి మందలింపని దయామయ స్వాంత, "ఎఱుఁగని మూఢులాడుకొను నెగ్గులకున్ భయమంది"న కఱకుఁదనమునకు

గ్గించుచు, "ఆ కరుణ యా ప్రసన్నత. యా కూరిమి యా గారవమున్. గారుత్స్థుడు మఱచెంగదా" యనుచున్నది.

అమ్మా! మరువలేదు. మరువలేదు, ఆపురుషోత్తము నొక్కసారి కన్గొనుము. "న న్వకరుణే వై దేహి! క్వాసి ప్రియే! దేవీ ప్రసీద! ప్రసీద! న మా మేవం విధం నిత్యక్తు మర్హసి... ...సౌమిత్రేరపి పత్రిణా మవిషయే తత్ర ప్రియే క్వాసి మే. హా హా దేవి స్ఫుటతి హృదయం". అయ్యో! చూచితివా?

"ఆకర్ణాయతనేత్ర మై మణిమయోచ్య త్కుండల ద్వంద్వ శో
భాకీర్ణాంచిత గల్ల మై సురదనం బై సుందర భ్రూయుతం
బై కమ్స్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీరాము మోము"

నీకొఱ కెట్లు పరిపాండుదుగ్ధల మై పోయినదో! అమ్మా! డగ్గుత్తికతో నేమనుచున్నావు?

"వనమున కేల వచ్చితిని వల్లభునిం బెడఁబాసి యొంటిగా
నని మునిపత్ను లెల్ల గుమిగూడి యడుగఁ. ధృతిమాలివారి కే
మని వివరింతు? నింత విపదంబుధి నేకరణిం దరింతు? నే
యనువున నీప్రతిక్షణమహాయుగముల్ క్రమియింతుల క్ష్మణా"

ఎంత వెఱ్ఱిపడుచున్నావు, "జననీ! నీవు మహాపతివ్రతవు నీ సౌశీల్య మిల్లాంధ్ర కెల్లను మేల్బంతి" యని వారెఱుంగుదురు. నీ యంఘ్రి కమల రజోలేశములఁ గన్నుల నద్దుకొందురు.

* * * *

ఈ మహాకవింగూర్చి యొక గ్రంథము వ్రాయవచ్చును. ముఖ్యముగా నాకు నచ్చిన దీయన యద్వితీయ భావనాశక్తి, దానికిఁ దగిన పదముల నాణెము. రసబంధుర కవిత్వ మీయన సొమ్ము. ఏక సందర్భమును గూర్చి వ్రాయునపుడు నిష్పాక్షికముగా వ్రాయఁ దలంచుటచే నిందలి నిరసనాభాసములకు వేఱూహించుట తప్పు.

నాగపూడి కుప్పుస్వామయ్యగారు నిర్వచనోత్తర రామాయణపీఠికలో "వ్రతానా ముత్తమం వ్రతమ్" అన్నట్లే వ్రాసినారు కాని యిటక పుస్తకముల సోడింపరైరి. ఇది సారస్వత వికాసమునకుఁ ద్రోవకా దని నా తలంపు సుధీవర మిత్రు లిట్టి సంయోజక పరిశీలనలఁ గావించిన నాంధ్ర సారస్వతము నకు మంచి మేలు చేసినవార లగుదురు.

—భారతి

అంగిరస- భాద్రపదము: సెప్టెంబరు. 1932
సంపుటము 9; సంచిక 9.



# పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము

— శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి

1923 డిసెంబరు మాసాంతములో కాకినాడ కాంగ్రెసు జరుగుతూన్నప్పుడనుకుంటాను, బసవరాజు అప్పారావు చేతిలో భారతి మొదటి సంచిక చూశాను. చూసిన తక్షణం ఎవరెవరి పద్యాలు దానిలో పడ్డాయా అని పేజీలు ఆత్రంగా తిరగేశాను. 'కన్నీరు' అనే నా పద్యం దానిలో పడ్డట్టు జ్ఞాపకం. అప్పటికప్పుడే మా సాహితి, శారద వస్తున్నా భారతి లాగ నిగనిగలతోను, నిండుతనంతోను ఏదీ రాలేదు. అందుచేతనే భారతిని అంత ఉత్సాహంతో అందుకున్నాను. ఇక నాడు మొదలుకొని ఈ రోజు దాకా నిరాఘాటంగా, హుందాగా వెలువడుతూ వస్తూ ఉన్న పత్రిక భారతి ఒకటే. అంతేకాక తరతరాల వారివీ, రకరకాల వారివీ కావ్యాలకి సమానాదరాలు చూపుతూ వస్తున్న పత్రిక కూడా భారతే.

## 2

దాదాపు 1923 మొదలుకొని నేటిదాకా పాతిక సంవత్సరాలు కదా! ఈ పాతిక సంవత్సరాల ఆంధ్ర కవిత్వం స్థితిగతులెలా ఉన్నాయో వ్రాయాలంటే చాలా చిక్కులున్నాయి. చిక్కులంటే చిక్కులా! నాకు మరీ గడ్డుగా కనిపించి కలం కదపనీయనంత గట్టివి.

నేనూ ఈ శకంలో వాణ్ణే అయెను! మరి కొద్దో గొప్పో నేనూ కొంత సందడి చేసిన వాణ్ణే అయెను! ఏది వ్రాసినా సహేతుకంగా ఉండాలి; సరసంగా ఉండాలి; సంక్షిప్తంగా ఉంటూ సమగ్రంగా ఉండాలి; స్వంత ఇష్టాలూ, అయిష్టాలూ రాకుండా, స్వంత నగారా మ్రోతలు రాకుండా, సాక్షీ చెప్పినట్టు మహాతటస్థంగా ఉండాలి. ఏ విధంగా చూసినా అలాగ చెప్పడానికి ఇప్పుడున్న వాళ్లెవరూ కావలసినంత దూరంగా లేరనిపిస్తుంది. కనుక నేనూ అలాగ చెప్పలేను.

మరొక ఇబ్బంది ఉంది. ఇప్పటి ఆంధ్ర కవిత్వానికున్నంత వైవిధ్యము సంపద, మరి ఏ ఇతర రాష్ట్రి కవిత్వానికీ లేవని నా గట్టి నమ్మకం. అసలు తెలుగునాటి సాహిత్య కేదారంలో కవిత్వపు పంట ఎప్పుడూ ఎక్కువే. ఆంధ్ర దేశంలో ప్రతి రెండోవ్యక్తి కవిలాగ కనబడుతున్నాడని ఒక ప్రఖ్యాత వంగ కవి అన్నట్లు వింటున్నాము. ఇది పరిహాసానికి అన్న పలుకైనా పరమార్థం లాగే తోస్తుంది. ఇంతకీ ఈ మాట వంగజాతిని గురించి కూడా అన వచ్చును. కవులూ, కవిరాజులూ అక్కడా ఇక్కడా కూడా ఎక్కువే. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిల వద్ద బయలుదేరి, వెంకట పార్వతీశ్వర్లు, రాయప్రోలు సుబ్బారావు అబ్బూరి రామకృష్ణరావు మొదలైన కవుల దగ్గిర ఆగి, విశ్వనాథ సత్యనారాయణ, పింగళి కాటూరి కవులు, నాయని, నండూరి సుబ్బారావులు, శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, కవికొండల వెంకటరావు, మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి చౌదరి వంటి మధ్యతరం కవులను పలకరిస్తూ, మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, పిలకా గణపతిశాస్త్రి, సంపత్, హనుమ దింద్రకంటి కవులు, పఠాభి, ఆరుద్ర వంటి అతి నవ్యులదాకా నా మనస్సు ఉత్సాహంతో ఉరకలు వేస్తూ వచ్చేసరికి, నేడు మన యెదుట ఉండి సాహిత్య క్షేత్రంలో యథాశక్తి కృషి చేస్తున్న కవులు నూరుగురైనా నా యెదుట మెరుపుల్లా కనిపించారు. నాకు కొంత ఆనందమూ, గర్వమూ కూడా కలిగాయి. కనుపర్తి అబ్బయ్య చెప్పినట్లు "చతుర కవిత్వ తత్త్వ పటు సంపద యొక్కరి సొమ్ముగాదు, భారతి దయ సౌధవార్ధి, కవిరాజుల మానసముల్ ఘటంబు, లాయతము కొలంది లబ్ధమగు నయ్యమృతంబు".

వీరందరూ కాక నిన్న మొన్నటి దాకా నవ్యసాహిత్యక్షేత్రంలో కృషి చేసి కీర్తిశేషులైపోయిన గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, కీర్తిశేషుఁడనలేక పోతున్నాను గాని మా కొడవటిగంటి వెంకటసుబ్బయ్య, కొడాలి సుబ్బారావు, కొంపెల్ల జనార్దనరావు, త్రిపురనేని రామస్వామి చౌదరి, తుమ్మలపల్లి వెంకటరత్నము, పెనుమర్తి వెంకటరత్నము, దువ్వూరి రామిరెడ్డి మొదలైన దిట్టలు ఈ శకంలోనివారే. ఇంత కవిత్వ సమృద్ధితో

నిండివున్న పాతిక సంవత్సరాల కవిత్వ చరిత్ర స్పష్టంగా ఎదటపరచటం పెద్ద ఇబ్బందే.

ఇంకొక రకం కష్టం ఉంది: ఇప్పుడు పరుగెత్తేటంత త్వరగా ఇదివర కెప్పుడూ కాలం మన దేశంలో పరుగెత్తలేదు. నా చిన్నతనంలోనే ఎంత మందంగా నానుస్తూ నడిచేది! సమాజమూ, వ్యక్తి జీవితమూ, వాటి అన్యోన్య సంబంధమూ, సమస్యలూ, వడిదుడుకులూ ఇప్పటి మోస్తరుగా అప్పుడు ఉండేవా! అప్పటి జమీందారుని విష్ణుమూర్తి అనేసెయ్యవచ్చు. అధమపక్షం అభినవభోజుడనో, అధునాతన కృష్ణరాయలనో అనవచ్చు; అప్పటి కవి అగ్రకులం వాణ్ణనీ, "వెలనాటి వాడ, కవితకు వెలనాటిని" వాడననీ చెప్పుకోవచ్చు. అలాగ చెప్పుకుంటే అందరమూ "ఓహోహో: భేష్! శా" ననవచ్చు కూడా, ఆస్తి విషయం, ఆస్తిక్య విషయం, మతం విషయం, మంచి చెడ్డల విషయం, కుల విషయం, కొద్ది గొప్పల విషయం తెలుగు వాడికి సంబంధించిన అన్ని విషయాలలోను. ఈ 'ఔను కా' దనడాలు, ఈ ఆందోళనలూ ఆవేశాలూ. ఇవన్నీ అప్పుడేవీ? వీరేశలింగం చేతి దెబ్బలకు ఆంధ్ర జాతి నిద్రలో నుంచి కాస్త ఒత్తిగిల్లి, ఒళ్ళు విరుచు కొని, కళ్ళు నులుముకొని, అప్పుడే ఆవులించి లేచి కూర్చున్న రోజులవి. ఇప్పుడు వచ్చిన ఇబ్బంది ఏమిటంటే, అప్పటినుంచి నేటివరకు. మూడుతరాల వారూ ఒక్కసారే సమాజంలో ఇప్పుడు వేంచేసి యున్నారు; సాహిత్య క్షేత్రంలో కృషి చేస్తూనూ ఉన్నారు. ఇంకొక చిత్రం: రెండుమూడు తరాల ప్రభావాలు కొంతకొంతగా ఒక్కర్లోనే ఉన్నవారూ ఇప్పుడు ఉన్నారు. ప్రత్యేకంగా ఏదో ఒక సాహిత్య ధోరణి మాత్రమే ప్రశస్త మైనదంటూ మిగతావాటని చిన్నచూపు చూసేవారు మూడు తరాల్లోనూ ఉన్నారు.

కాని సమాజం జీవనది అయితే సాహిత్యమూ జీవనదే. మూడుతరాల వారినీ అసలు సాహిత్యగుణమనే జలసూత్రం బంధించి, ఏక కుటుంబంలోనికి తీసుకొని వస్తున్నది. అప్పటప్పటి కాలపరిస్థితులను అనుసరించి, ఆయా ఉద్యమాల పలుకుబడిని బట్టి కొన్ని కొన్ని కొత్త పాత సంస్కృతుల ప్రభావా

లను బట్టి, తమ తమ ప్రత్యేక ప్రతిభలనుబట్టి కవుల దృక్పథాలు మారవచ్చు కనుక కావ్య వస్తువులు మారవచ్చు. కనుక కంఠధ్వనులూ, శైలులూ మారవచ్చు. కాని పట్టిచూస్తే కవిత్వమంతాఒక్కటే కాదూ! ఈ ధీమాతోటే ఎన్ని ఇబ్బందులున్నా నవ్యాంధ్రకవిత్వాన్ని గూర్చి ఈ శాస్త్రా వ్రాస్తున్నాను.

## 3

ఈ నవయుగంలో భారత జాతినీ, కనుక ఆంధ్రజాతినీ ఊగించిన ఉద్యమాలు ఏవేవి ఆంధ్రకవిత్వాన్ని కూడా ఆవహించాయో కొంత చెప్పాలి. నిజానికి ఈ యుగంలో వివిధ భారత రాష్ట్రీయ సాహిత్యాలు, ఒకే ఒకరకపు ఉద్యమాల ప్రభావాలలో పడినట్లు కనబడతాయి. ఒకే రకపు ధోరణులు వాటిలో కనబడతాయి. కనుక ఈ ఉద్యమాలు ఏటు వంటివో తెలుసుకుంటే నవ్యాంధ్ర కవిత్వ లక్షణాలూ తెలిసిపోతాయి.

మొదటిది కాల్పనికోద్యమము (Romantic movement) జాతికి మృత స్థితివంటి నిద్రావస్థ ఒకటి వస్తుంది. అది పోగానే జాతి మేలు కొంటుంది. అంటే తిరిగి పుడుతుంది అనేక ప్రభావాలవల్ల ఈ ప్రబోధం కలగవచ్చు. ఈ ప్రబోధం వచ్చిన తరువాత బాల్యయౌవనాద్యవస్థల వంటివి జాతి జీవితంలో అన్ని కార్య రంగాలలోను గోచరిస్తాయి. కనుక సాహిత్యంలోనున్నూ, యౌవనదశలో ఉన్న వ్యక్తి తనంతవాడు లేనట్లున్నూ తన అనుభవ మంత అమూల్య మైనది లేనట్లున్నూ లోకరంగంలో తానే నాయకుడైనట్లున్నూ అనుకుంటాడు. సాక్షిగా, తటస్థుడుగా ఈ లోకాన్ని చూడలేడు. దానిలో పడి కష్టసుఖాలు తీవ్రంగా అనుభవించడమే అతని పని, అతనెక్కువగా హృదయ వాది. అనుభవం వైపు మొగ్గినంత ఆలోచన వైపు మొగ్గడు. ఈ అవస్థలో ఉన్నజాతి కూడా తనంతగొప్పదీ లోకం లేనిదీ లేదనుకుంటుంది. ఈ ఆత్మపరత — "తన" తనం నాటి సాహిత్యంలో

ఇక యౌవనాంగణంలో అడుగు పెట్టిన వ్యక్తిలో అద్భుత పూర్ణమైన ఒక దృష్టికూడా ఉంటుంది. అది వరకు అతిసామాన్యంగా కనబడిన ప్రతి వస్తువూ ప్రతిసంఘటనా, క్రొత్త క్రొత్తగా, గొప్పగొప్పగా గోచరిస్తాయి. "దాక్కొని ఉండి, దారిపక్క నిరుక్కొని" ఉండే గడ్డిపూవుకి నక్షత్రాని కిచ్చే దివ్యగౌరవ మిస్తాడు. జలతారు అంచునీలి చీరని మెరపుతోటి మేఘ మంటాడు, "ఈ నా శరీరమందివతళించిన గాలి" లో హోమ ధూమ సౌరభాలకోసం నాసాపుటాలు బిగబడతాడు. "ఈ నాతనూపూర్ణమైన ఆకాశం" లో క్రతుధ్వనులకోసం చెవు లొగ్గుతాడు. అప్పుడతని చేతికి, వ్రాతకి సమ్యమం ఉండదు. ఆవేశానికి అడ్డకట్ట ఉండదు. కంఠానికి గడియ పడదు. "భావనాబల మున్నది; ప్రకృతి యున్నది; ఇష్టముండిన పదముల కేమి కొరత?" అంటాడు. వాగుతో, వాహినితో కలసి కిన్నెరసానిపాట పాడేస్తాడు. "న న్నెవ్వ రాపలే రీవేళ" అనీ, "ఇంటింట పెడతారు యెంకి నీ పేరు" అనీ. "నా యిచ్చయే గాక నాకేటి వెరపు" అనీ, అంటాడు. అతన్ని ఏవో లక్ష్యాలు కూడా ఆకర్షిస్తాయి. అప్పుడతనికి ధ్రువతార దూరంగా ఉన్నదని అనుపించదు; అందే మ్రానిపండులాగ అనిపిస్తుంది. తన మనస్సును దానికి తగిలించి నమ్మకంగా ప్రయాణం సాగించేస్తానంటాడు. అతనిలో సాహసమూ, విజిగీషా కూడా ఉంటాయి. కొత్త అనుభవాలకి స్వాగతం ఇవ్వడానికి, కొత్త మార్గాల్లో పడిపోవడానికీ, కొత్త ప్రయోగాలు చెయ్య డానికీ భయపడదు.

యౌవనంలో కవిత్వలావణ్యం ఎక్కువ దొరుకుతుంది. ముదిరి పరువమైన వయస్సులో సాహిత్య సందేశం ఎక్కువ దొరుకుతుంది. అందు చేతనే కవి పెరిగి, ముదిరి "జీవన గంగా హారితతటమ్మున" నిశ్చల నిశితమైన దృష్టులు సారిస్తూ కూర్చున్నపుడే రూపకంవంటి సాహిత్యం సృష్టించ గలడు. ఇక పైన చెప్పినట్లు కాల్పనికోద్యమానికి చెప్పిన గుణాలన్నీ-అనగా కాల్పనిక వేగం, లక్ష్యావేశం, విశృంఖలత, విజిగీష, సాహసం, అద్భుతపూర్ణమైన మనస్థితి చాలవరకు నవ్యాంధ్రకవు లందరిలోనూ కనబడతాయి.

## 4

నవయుగ భారతంలో పుట్టిన మరిరెండు ఉద్యమాల ప్రభావం కూడా నవ్యాంధ్ర కవులపై ప్రసరించింది. దాదాపు నూటపాతిక సంవత్సరాల క్రితం రామమోహనరాయలతో పుట్టిన మానవోద్యమం ఒకటి. దాదాపు ఆ రోజుల్లోనే రూసో మొదలైనవారి ప్రభావంవల్ల పాశ్చాత్య లోకంలో ఇటువంటి ఉద్యమమే పుట్టింది. ఇది ప్రతిమానవుని శిరస్సుమీదా మకుటం పెడతానంటుంది. మానవులందరికీ కూడా సామ్యమూ, స్వామ్యమూ ఉండాలంటుందీ ఉద్యమం. దీనివల్ల ఎల్లయెల్లలూ, అన్ని అంతరాలూ చెరిగిపోతాయి. జగత్తులో మానవుణ్ణి మించినదేదీ దీనికిలేదు. పూర్వ భారతీయ విజ్ఞాన సంస్కృతుల్ని నిరసించదిది. ఎటొచ్చి తూచి తూచి, సహేతుకంగా విమర్శించి, దేశకాల పరిస్థితుల్నిబట్టి గ్రహిస్తానంటుంది. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల్నీ అంతే. ఈ జగత్తు. మానవుడు. వాని అనుభవాలు, అన్నీ గట్టిపరమార్థాలనే శాస్త్రీయ దృక్పథం, వాస్తవికత కూడా ఈ ఉద్యమల ఋణాలే. "అసీమమైన ఈ సృష్టిలో తూర్పేది! పడమ రేది? అని ఒక హృదయం, రెండు స్పందాలు, అనిన్నీ "నా జాతి మానవజాతి" (His caste is human kind) అనిన్నీ, "బ్రతుకుతే స్వతంత్రుణ్ణై బ్రతుకుతాను, లేకపోతే ఉండను" (I will be free, or not be at all). అనిన్నీ, రాగల ప్రతి మానవుడూ చాట తాడని ఈ ఉద్యమం అంటుంది. ఈ ఉద్యమం విజాతీయంగా కనబడినా అలాంటిది కాదు. ప్రతివ్యక్తికీ, ప్రతిజాతికీ కూడా వారివారి విశిష్టత చెడకుండా ఈ ఉద్యమం స్వాతంత్ర్యం కోరుతుంది. ప్రతివ్యక్తికి స్వాతంత్ర్య వికాసాలు ఉంటేనే, జాతి సర్వాంగ సుందరం అయి ముందుకు నిడుస్తుందని, ప్రతిజాతికి స్వాతంత్ర్య వికాసాలు ఉంటేనే ఈ మానవ లోకంలో సమృద్ధీ, శాంతీ సుఖమూ ఉంటా యనీ, ఈ ఉద్యమం అంటుంది.

ఈ ఉద్యమం ఆంధ్రదేశంలో ప్రవేశపెట్టి ప్రబలంచేసినవాడు ప్రవక్త వీరేశలింగం.

ఈ ఉద్యమంలో మళ్ళీ రెండు దశాలు (stages) ఉన్నాయి: ప్రారంభం నుంచీ దాదాపు గాంధీ యుగం దాకా ఒకటి; గాంధీ యుగారంభం నుంచి మరొకటి. మొదటి యుగంలో విద్యార్థులైన వారి మీదనే ఈ ఉద్యమ ప్రభావం ప్రసరించింది. చుట్టూ ఉన్న సమాజమూ, దానిలో పేరుకుపోయిన విశ్వాసాలు, కరుడు కట్టుకు పోయిన ఆచారాలు, వాటిని ప్రతిఘటించి ఒక్కొక్క వ్యక్తి నలిగిపోవడమూ-ఇవే వారికి మొదట కనిపడ్డాయి. కనక ప్రత్యేక వ్యక్తి స్వాతంత్ర్యమూ, వాని కష్ట సుఖాలు-వీటి కోసమే ఆ ఉద్యమం మొదట సాగింది. ఈ శకంలో భారత సాహిత్య సీమలో హిమాలయ శిఖరంలాగ ఆకాశంలోనికి పొడుచుకొని పైకిలేచి ఉద్యమానికి ఉత్తమోత్తమ ప్రతినిధిగా కనపడే వాడు రవీంద్రుడు. వ్యావహారిక భాషా వాదం ద్వారా గిడుగు రామమూర్తి పంతులున్నూ, కావ్యాల ద్వారా గురజాడ అప్పారావున్నూ ఈ ఉద్యమం ఆంధ్ర సాహిత్యంలో పవేశ పెట్టారు.

ఈ ఉద్యమం రెండోతరం గాంధీతో ప్రారంభమయింది. అదివరకు పండిత పరిషత్తులలోనూ ప్రాసాదాలలోనూ ఉండిపోయిన మానవ స్వామ్య సామ్యాలు ఇప్పుడు విపణులలోకి, వీధులలోకీ, గుడిసెలలోకీ వొచ్చుకొనిపోతున్నాయి. అంతేగాక అదివరకు ప్రత్యేక వ్యక్తి స్వాతంత్ర్య వికాసాదుల కోశం కృషిచేసిన మహోద్యమం ఇప్పుడు సమష్టి మానవ శ్రేయస్సు కోసం ఆందోళన మొదలు పెట్టింది. వివాహము, విద్య, మతము వంటి సమస్యలకన్న కూడా ఆకలి, దారిద్ర్యమువంటి సమస్య రోజూ ప్రతి జీవితాన్నీ ఎక్కువ తీవ్రంగా దగ్గరగా పలకరించే అతివాస్తవిక సమస్య అంటుంది ఈ ఉద్యమం. దీనివల్ల మానవునికి ఏకత్వము,అన్యోన్య బాంధవ్యము, సమష్టిత్వము బాగా స్ఫురించి, దృఢపడతాయి అంటుందీ ఉద్యమం, నాటి మానవోద్యమాన్ని ఈ విధంగా నల ఖైకోట్ల లోను నవప్రపంచ శక్తుల సహాయంతో చాలవరకు నాటినవాడు గాంధీ. గాంధీయే కొంత వరకు కొత్త మానవుడు. సామాన్యశక్తి సామర్థ్యాలు, సామాన్య జీవితాన్ని స్ఫురింపజేసే కూడూ, గుడ్డా, కుటీరవాసమూ, జీర్ణ శరీరమూ-ఈ గాంధీ ప్రభువులూ, ప్రబలులూ పండితులూ చూస్తూండగా ప్రథమ పీఠం మీదికి ఏనాడైతే ఎక్కి కూర్చు

న్నాడో అనాడే ప్రతి సామాన్య మానవుడూ జగత్తంత ఆధిక్యత మీద అధిరోహించి ఉంటున్నాడు. ఇదివరకు సామాన్య లోకం కోసం మాహాత్మ్యం అవతరించేది. ఇప్పుడు సామాన్య లోకం మాహాత్మ్యం దగ్గరకి అధిరోహిస్తుంది. మానవోద్యమానికి సంబంధించిన ఈ రెండో పర్వంలో భారత సాహిత్య లోకంలో టాగూరు వంటి ఉన్నతు డింకా రాలేదు. దీనికి కారణాలు ఇవి అయి ఉండవచ్చు: లేక వీటిలో ఏదైనా ఒకటయి ఉండవచ్చు. ఇది వరకు ఒక్కొక్క వ్యక్తి ప్రతిభ పర్వత శిఖరంలాగ పైకి పెరిగేది. ఇప్పుడు అడ్డంగా పైరుపొలంలాగ పరుచుకుంటుంది. దానికి ఔన్నత్యము, గాఢత్వము గుణాలు, దీనికి వైశాల్యము, వైవిధ్యము, వేగము, వేడి గుణాలు.

రెండు—యౌవన దశలో నుంచి జాతి పెరగటంవల్ల కవిత్వ యుగంలో నుంచే నాటకాల యుగంలోనికి సాహిత్యం ప్రవేశిస్తుందేమో: నాటకంలాగ మరి ఏ ఇతర సాహిత్యరూపమూ, సమాజ జీవితంతో పడుగుపేక లాగ పెనవేసుకొనిపోలేదు. నాటక రచయిత మహాసృష్టి వాస్తవికుడు. ఇప్పుడు మన దేశంలో సమాజ రూపం స్ఫుటంగా ఏర్పడుతూ, కొంతకొంత స్పష్టంగా కనిపిస్తుంది.

మూడు—మనదేశంలో కవికి సమష్టి ప్రజాజగత్తు దూరదూరాల నుంచి 'మరో ప్రపంచం'లాగే కనబడుతుంది గాని సన్నిహితమైన ఆప్తానుభూతిలాగ పలకరించడం లేదేమో! కొంతవరకు ద్రష్ట అయిన కవి అంచులు చూస్తున్నాడు. కాని అందులోవాడు కాలేదు. కవిత్వానికి కొంత ఆత్మీయత ఆత్మపరీత కావాలేమో! ఆ క్రొత్త సమాజం సుస్థిరంగా ప్రతిష్ఠింపబడ్డాక రవీంద్రుని మించిన కవులే రావచ్చును.

5

ఈ మానవోద్యమం గాక నవభారతంలో ఈ యుగంలో మరో మహోద్యమం బ్రహ్మాండంగా విజృంభించింది. హైందవ జాతీయోద్యమం ఇది. దయానంద రామకృష్ణ వివేకానందులతో ఉజ్జ్వలంగా ప్రారంభమై లోకమాన్యునితో ఉన్నత శిఖరాలందుకుంది. చిరదాస్య నిద్రనుంచి మేల్కొన్న భారతీయునిదృష్టి ఒక్కసారి పూర్వకాలాలలోకి చొచ్చుకొని పోయింది. అఖి

మానంవల్ల, ఆత్మవిశ్వాసంవల్ల ఈ దృష్టి మరీ నిశితమై ధగధగా తొందర తొందరగా మెరసిపోతూ పరుగులెత్తింది. కవికి ఆత్మీయానుభవం కలిగించి నంత ఆవేశమూ, వేడీ ఈ జాతీయోద్యమం కలగించింది; ఎంతో అ స్తంగా అయిపోయాయి మన పూర్వగాథలు, విజ్ఞానసంస్కృతులున్నూ, ఏ లోపమూ లేక సమగ్ర సుందరంగా శాశ్వత సత్యాలుగా కనపడ్డాయవి. "ప్రాత కొత్తల మేలికలయిక" అని అనడంకన్న "ప్రాతవాటికన్న నీవు పొడిచే దేముంది? వాటిని మళ్ళీ శుభ్రపరచి సుస్థాపితం చేసికొమ్మం"టుంది ఈ ఉద్యమం.

ఈ ఉద్యమానికి ఉత్తమ ప్రతినిధులు వంగసాహిత్య క్షేత్రంలో బంకించంద్ర ద్విజేంద్రలాల్ రాయలు: ఈ ఉద్యమానికి చెందిన నవ్యాంధ్ర కవిత్వ క్షేత్రంలో ఉన్నత శిఖరంగా సాక్షాత్కరించేవాడు విశ్వనాథ సత్యనారాయణ.

## 6

కాల్పనికోద్యమ ప్రభావం ఈ యుగంలో కవులందరి మీదా ప్రసరించింది. మిగిలిన ఉద్యమాలలో కొందరిమీద ఒక ఉద్యమ ప్రభావం, మరి కొందరి మీద మరొక ఉద్యమ ప్రభావం ఎక్కువగా ప్రసరించాయి.

ఆ రోజుల్లోనే కొందరు మహావ్యక్తులైన గురుదేవులు తెలుగునాటి సాహితీపరుల మనోమందిరాల తలుపులూ, కిటికీలూ ఒక్కసారి తెరచి వెలుగులూ, గాలులూ లోపల ప్రవేశ పెట్టారు. మొదట బందరులో, తరువాత కాకినాడలో వెంకటరత్నం నాయుడుగారి ద్వారా - వారిని భక్తి శ్రద్ధలతో స్మరిస్తూ శిరస్సు వంచుకుంటున్నాను - మానవోద్యమమూ, దానికి సంబంధించిన ఉన్నతోజ్జ్వలములైన లక్ష్యాలూ, ఉర్దూ పారశీ కాంగ్ల సాహిత్యాల ఘనతా, లావణ్యమూ వారి శిష్యులకు పరిచయమయింది. రాజమహేంద్రవరంలో కూర్మి వంటి ప్రతిభాశాలి కవికొండల వెంకట్రావు, అడివి బాపిరాజు వంటి కవులను తనచుట్టూ చేరదీసుకొని అటు వర్డ్సు వర్తు వంటి కవుల కావ్యాలూ, ఇటు పైరుచేలూ, ఓడరేవులూ, పల్లెటూళ్ళ పరిసరాలూ, పుంతలూ, వాటిలో జనమూ చూపించేదు. మరి బందరులో

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారున్నచోట కవిత్వవు తిరునాళ్ళే. తిరుపతి వెంకటేశ్వరులు కవిత్వాన్ని ఒక ఉద్యమం చేశారు. సామంతుల ఆస్థానాల లోనే గాక సామాన్య సదస్సులలో కూడా వారు కవితోత్సవాలు కావించే వారు. శాస్త్ర చదువుకొని కంఠం విప్పుతున్న ప్రతి కవినోటా ఆ కవులితర కవులతో కావించిన సాహిత్య సమరాల గాథలు ప్రతిధ్వనించేవి; వారి విజిగీష వీనిని కూడా వేడెక్కించేది. తెనుగుతనము, కవితా దీక్ష, కల్పనా సమృద్ధి వారినుంచే వారి శిష్యులకు వచ్చి ఉండాలి. విశ్వనాథ సత్యనారాయణ, పింగళి కాటూరి కవులు, త్రిపుర్నేని రామస్వామి చౌదరి, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి వారి శిష్యులలో కొందరు.

ఇక్కడ మరొక మాట హైందవ జాతీయోద్యమం మన తెలుగు నాటిలో కృష్ణా గుంటూరు మండలాలలో ఆంధ్రోద్యమ రూపాన ఎక్కువగా విజృంభించింది. జాతి గౌరవాన్ని గూర్చి కావ్యాలల్లిన కవులందరూ దాదాపు అక్కడివారే.

## 7

భారతి పుట్టక పూర్వము, మా సాహితి రాకపూర్వము. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక, ఆంధ్రభారతి, ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వము, అనసూయ, శారద మొదలగు పత్రికలలో కొందరు కవుల కావ్యాలు వెర్రి ఆవేశంతో యువ కవులము కొందరము చదువుకొనే వారము. నాకు బాగా జ్ఞాపకం, 1914-16 సంవత్సరాలలో నేనూ, మా నండూరి సుబ్బారావూ నాయుడుగారి చరణ సన్నిధిని ఉన్నప్పుడు, బసవరాజు అప్పారావు వచ్చి గురజాడ వారి కావ్యాలూ, తన సెలయేటి గానమూ, అహరహమూ ఆలపిస్తూ ఉండేవాడు. అతడు అమర దూతగా మాకు కనబడేవాడు. మేము ఆ కావ్యాలన్నీ కంఠస్థం చేశాము. అంతలో మాతో చింతాదీక్షితులూ, వేదుల సత్యనారాయణ శాస్త్రి కూడా కలిశారు. దీక్షితులు గారికి గురజాడ కవి దేవుడు. వేదులకి రాయప్రోలు కవి కులగురువు. రాయప్రోలు

పత్రికల నుంచి చదివేవారం. అప్పటికే అబ్బూరి రామకృష్ణారావు గారి 'మల్లికాంబ' ఊహాగానంలోని కొన్ని పద్యాలు మా అందుబాటులోకి వచ్చి మమ్మల్ని అమితంగా ఆకర్షించాయి. ఏమి రోజులవి!

1921లోనో, 1922లోనో ఒకనాడు సాయంకాలం చామర్లకోట రైల్వే ప్లాటుఫారం మీద నేను నిలబడి ఉండగా, కొన్ని [illegible] మా నండూరి కనబడ్డాడు. అప్పుడు ముసురు కూడా పట్టి, 'పాటుపోటుగా' చినుకులు పడుతున్నాయి. "శాస్త్రి విను"మని సుబ్బారావు గొంతు సవరించాడు. ఎంత బాగా పాడాడు సుబ్బారావు! ఇద్దరమూ ఆ ప్లాటుఫారం మీద కూర్చున్నాం. 'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అనే [illegible] తాను వ్రాసిన నాలుగు పాటలూ పాడాడు. నేనూ విని [illegible] "[illegible] ఆకునై" అనే నా కృష్ణపక్షంలో మొదటి పద్యం, "[illegible]" చదివాను. మా బసవరాజు వింటే బాగుండునని ఇద్దరమూ అనుకున్నాం. మరికొద్ది రోజుల్లో కాకినాడలో రోజూ సాయంకాలం [illegible] చిన్న సమావేశాలూ, సభాపతి బసవరాజు సుబ్బారావుగారు, నండూరి, నేనూ, చింతా వారూ, పాటిబండ అప్పారావూ, బసవరాజూ, నేనూ మా పద్యాలూ, గురజాడ, రాయప్రోలు ప్రభృతుల పద్యాలూ [illegible], వాటిమీద విమర్శనలు సాగుతుంటే మాకు తెలియకుండానే [illegible] రాత్రులయేవి.

అలాగే అక్కడ గుంటూరు, తెనాలి ప్రాంతాలలో శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య ప్రభృతులు [illegible] కలుసుకుంటాను. మరి బందరులో విశ్వనాథ సత్యనారాయణ, [illegible] సుబ్బారావు, పింగళి కాటూరి కవులు, అడవి బాపిరాజు, [illegible] యులు ఆంధ్రజాతీయ కళాశాలలోనూ అవసరాలా సమావేశమయే [illegible] కుంటాను.

మరి ఒకటి రెండేళ్ళకి దాదాపు అందరమూ సాహితీ సమితిలో సహధర్ములైన సహోదరుల కూటంగా [illegible]యాం, అయితే ఇక్కడ ఒక్క మాట చెప్పాలి.

1923కి పూర్వమే మావంటి వారిని ఆకర్షించిన కవులలో ఒక్క గురజాడ అప్పారావు తప్ప మిగిలినవారందరూ 1923 తరువాత కూడా సాహిత్య రంగంలో కృషి చేసినవారు కనుక ఈ పాతిక సంవత్సరాల ఆంధ్ర కవిత్వ చరిత్రలో కూడా వారుండనే ఉన్నారు. వారిని 1923కి పూర్వులుగా భావించడానికి వీలులేదు. వారినిగూర్చి ముందు కొన్ని మాటలు.

## 8

గురజాడ అప్పారావు 1915లో చనిపోయినా, 1915 తరువాతనే జీవించడం ప్రారంభించాడు. ఆయన బిల్హణీయమూ, నీలగిరి పాటలూ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో పడ్డాయని జ్ఞాపకం. 'లవణరాజు కల', 'కన్యక' 'పూర్ణమ్మ' మొదలైన కావ్యాలు బందరు నుంచి వెలువడే ఆంధ్ర భారతి నుంచి కాబోలు చదివాము. కాల్పనికోద్యమంలో ఉన్న ఉత్తమ లక్షణాలన్నీ స్వచ్ఛమూ, నిసర్గ సుందరమూ అయిన ఆయన వాణిలో కనబడతాయి. సామాన్యుల గాథలూ, సామాన్యుల కంఠే మాటలూ కావ్య ప్రపంచంలోనికి ప్రవేశపెట్టడం ఆయన గొప్పతనం. ఆ "ముత్యాలసరం" కూడా అలాగే అమరింది! ఆ ఛందస్సు తెలుగువాడి కష్టసుఖాలూ, కథలూ ఎంత బాగా చెప్తుతుంది! "పాటలాఘరి చెట్ల చేమలకై పాటపాడితే తోట మానుకొని ఆగ చంద్రుడు తాను చెవి యొగ్గడమూ", "మంచి చెడ్డలు రెండే కులములు; మంచి అన్నది మాల అయితే మాలనే నౌదున్" అని చాటడమూ, "వెలుగుదు కూర్చుని నవ్వే వేళల పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒకసారి తలచి" కన్నీరొలికించడమూ, "పెరిగి విరిగితి విరిగి పెరిగితి" అని [illegible] కష్ట సుఖాలు వలపోసుకొని వాపోవడమూ, "ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని ప్రేమికుడు కావడమూ — ఇవన్నీ ఆ కొత్త రోజుల్లో యువకుల హృదయాలకు ఆనంద పథాలు తొడిగి, గూటిదాటి యెరుగని వాళ్ళకి కొండంత జీవితాకాశాన్ని చూపెట్టాయి. వీరి రచనలన్నింటిలోనూ ప్రతిబింబంగా మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది. దేశభక్తి అనే కావ్యంలో కూడా జాతీయోద్యమపు దేశభక్తి స్ఫురించదు.

"విశ్వగాన వియత్తరంగిణి
భంగముల సుప్లాంగు నాతని గీతశీకరముల్"

అని ఆవేశంతో అతని కావ్యాలను గూర్చి నాటి యువకవి అంటాడు. ప్రబోధకావ్యము, ఆత్మపరకావ్యము, ప్రేమచేతము, కథాకావ్యము-అన్నీ తరువాతి తరం వారికి మచ్చున కందించినట్లు ఆయన వ్రాశారు.

1923కి పూర్వం సాహిత్య లోకంలో వేంకటపార్వతీశ్వరులది కూడా గట్టి ప్రభావమే వీరి కావ్యాలకు తురాయివంటిది 'ఏకాంత సేవ'. తెల్ల వారగట్ట పెళ్ళి వారిని లేపే మనోహరమైన సన్నాయి పాటలాగ నవయుగా రంభంలో వీరి కావ్యగానం వినిపించేది. భాషలోనూ, ఊహాలలోనూ, ఆవేశాలలోనూ పూర్ణ సంప్రదాయాలను గౌరవిస్తూ ఉత్తమ వంగవాఙ్మయం ద్వారా వచ్చిన వైష్ణవ సాహిత్య ప్రభావాల్ని స్వీకరించి, వీరు కావ్య రచనలో కొత్తదనం చూపించేరు. వీరి ఏకాంత సేవ - 1922లో పుస్తక రూపాన వెలువడినది-యువకవి మాటల్లో ఎంతో అప్యాయంగా ఆలపించుకునే వారం. 1923 తరువాత వీరి కావ్యాలన్నీ సంపుటాలుగా వెలువడ్డాయి. వీరి మధురఖండకావ్యం కనపడని పత్రిక కొంతకాలం వుండేది కాదు. వీరు గీత పద్యానికీ, మంజరికీ మంచి పలుకుబడి సంపాదించిపెట్టారు.

1923కి పూర్వమే రాయప్రోలు సుబ్బారావు ఖండకావ్యాలతో కూడా మాకు స్నేహం ఏర్పడింది వీరి 'తెనుగుతోట', 'కష్టకమల', 'స్వప్నకుమారం', 'స్నేహలత', 'తృణకంకణము', తరువాత 'జడ కుచ్చులు', 'ఆంధ్రావళి', తరువాత 'మధు కలశము'-ఇవన్నీ అప్పటప్పటి యువ కవుల్ని ఆకర్షించినంత అమితంగా మరేవీ ఆకర్షించలేదు. వాటిని కంఠస్థం చేసి, గొంతెత్తి ఆలపించినంత అప్యాయంగా మరే కావ్యాల్ని అప్పటి యువ కవులు ఆలపించలేదు. ఆయన మాటల కూర్పులూ, వృత్తాల నడకలూ-వీటి ప్రభావం అప్పటి నవరచనలు చాలావాట్లలో కనపడతాయి ఆంధ్రజాతి పూర్వౌన్నత్యము, తరువాత తెనుగు పడుచుల ప్రణయములు, నగలు, నోములు, ముగ్ధ క్రీడలు. చైత్రాషాఢాలు మొదలైన కాలాల ప్రకృతి విలాసాలు- ఇవన్నీ వీరి కావ్యవస్తువులు, కాల్పనికోద్యమ లక్షణాలు సముచితమూ, సరసమూ అయిన ధోరణిలో వీరి కావ్యాలలో కనబడతాయి పాత మాటలే కొత్త వన్నెచిన్నెలూ, వాసనలూ పూసుకొని. వింతవింతలై.

కొత్త పుంతలలో కూడి కొత్త మూర్తులను (images) కడుతూ, తెలుగు నాటిలోన ఒక తరగతివారెరిగున్న అరటి తోటలనూ, పొలాల త్రోవలనూ, వాటి నడుమ నిట్టూరుస్తూ తిరిగే క్రొత్త ప్రాయపు వారినీ, పచ్చి బాలెంత లనూ, పేరంటాళ్ళనూ, పాడి ఆవులనూ ఎంత సొగసుగానైనా ఈయన ప్రదర్శిస్తాడు.

"ఉత్కళాశానితంబంబు లొత్తి హత్తిన ఆంధ్రుల యశోదుకూల సితాంచలములు" చూసిన జాతీయోద్యమంలో ప్రారంభించి, రవీంద్రుని యొద్ద గురుకులవాసం చేసి ఆయన ప్రభావాన్నీ, తరువాత వైష్ణవ సాహిత్య ప్రభావాన్ని ఈయన స్వీకరించాడు. ఈయన కావ్యాలు మన మనస్సుల్ని ఒడిసి బిగబట్టుకొని ఉద్వేగంతో ఉరకలెత్తవు : మానవ ప్రకృతి లోని గొప్పలోతుల్నీ, పెద్ద ఎత్తుల్నీ చూపెట్టవు : హాయిగా ఒయారంగా ఆరామాల్లో విహారం చేయిస్తాయి. ఈయన కావ్యాలతో కాల్పనికోద్యమం అంగణంలో నుంచి ముంగిలి దాకా జరుగుతుంది.

ఇక్కడే అబ్బూరి రామకృష్ణరావుని గూర్చి చెప్పాలి. ఇతనిదొక ప్రత్యేక కంఠరవమే కాని ప్రతిధ్వని కాదు. సొగసుగా సంస్కృతంగా ఉంటూ నవ్యంగానూ ఉంటుంది ఇతని వాణి. కొత్త ఛందస్సులను నేడుపు దనంగా వాడాడు. "నీటుల యులివుల్ శ్రవోయుగళిలో కఠినమ్ముగ మ్రోగు"నసే మల్లిక గాథా. "కాపుపాట", "అప్రాప్త మనోహారిణి", "తిక్కన్న". "పృథివీ ప్రశంస"– ఇవన్నీ పదే పదే పఠిస్తూ ఒక పంక్తి అయినా వదలుకోలేని మేలిమి బంగారు ముద్ద ఈయన కావ్యం అనుకునే వారం.

1923 తరువాతనే ఎక్కువ వ్రాసినా, అంతకు పూర్వమే నావంటి కవుల్ని కొందర్ని బసవరాజు అమితంగా ఆకర్షించాడు. బసవరాజంత సూటిగా, తీక్షణంగా తన కష్టసుఖాలను కావ్యాల్లో వెళ్ళబోసుకున్న నవ కవి మరొకడు లేడు. అంతరంగ స్నేహితుడూ, తానూ ఏకాంతంగా కూర్చున్నప్పుడు దాపరికం లేని అమాయకత్వపు తొందరలో హృదయ

భావాలు దాచుకోలేకున్నట్లు పాటలో, పద్యంలో ఇతడు చెప్పుకునేవాడు. ఆ పాటలూ, పద్యాలూ, నిట్టూర్పులు జీవిత సర్వస్వములో నుంచి దొలిచి బయలుకుంటూ వచ్చినవి. అలాగ చెప్పుకుందుకే అసలు ఇతని కావ్యరచన "Relief which a timely utterance gives" అన్న దానికోసం! ఆ చెప్పుకోవడపు తొందరలో భావానికీ, భాషకీ చోటియ్యక, అవి లేనిలోపాలను పాటకే కనబడనీయక, పేలవమైన మాటలతోనైనా నగ్నంగా అనెయ్యడానికి భయపడే వాడు కాడు. ఇతని కావ్యాల వల్ల సహకవిత్వానికి మరీ నష్టం వచ్చింది; అస్వాభావికమైన గేయకావ్యానికి మరింత స్ఫుటమైన ఆకారం వచ్చింది. ఆ రోజుల్లో చిన్నవాళ్ళు ఉత్సాహంతో బసవరాజు కావ్యాలు పాడుకునే వాళ్లో! మరెందరు సాటి యువకులు చదువుకుని సంతృప్తి చెందేవారో!



1925కి మా సాహితీ సమితికి నిండు రూపం వచ్చింది. సాహితీసమితి నవ్యకవిత్వాన్ని ఒక ఉద్యమంగా చేసింది. అంతకుముందే అప్పటి కవులం చాలా మంది ఒకర్ని ఒకరు కలుసుకోక పోయినా, సాహితి మొదలైన పత్రికల్లో పద్య ఖండకావ్యాలు చదువుకుని ఎప్పటినుంచో ఎరిగున్న దగ్గర చుట్టాలులాగ అనుకునే వాళ్ళం. కాని ఎలాంటి మధుర గాఢమైన బంధం మమ్మల్ని అందర్నీ చుట్టి పెనవేసి పట్టుకున్నది! ఒకరికొకరం మా కావ్యాలను గూర్చి, కష్టసుఖాల్ని గూర్చి ఉత్తరాలు వ్రాసుకునేవాళ్ళం. 'అన్యోన్యం మెచ్చుకునే సంఘం ఇది' అని కొందరు మమ్మల్ని అనేవారేమో! కాని ఆ మాట అన్యాయం. అప్పుడు అమాయకపు ప్రాయం మాది. కీర్తి కాముకమూ, స్వార్థమూ, అహంకారమూ మా మనస్సుల్ని కలుషితం చెయ్యలేదప్పుడు. అసలు యువ ప్రకృతుల్లో మాలిన్యం తక్కువ. గడసరి దాంభికాలు లేని రోజులవి. జీవితానుభవాలు ఒకటే రకంవి; రచనల్లో నవలావణ్యమూ కనబడేది; హృదయాలు ఒకదానికొకటి ఎదురయి పెంచ్చరించుకునే సరికొత్త ప్రభాతసమయం అది! అందుచేత సాహితీ సమితి వంటి అన్నదమ్ముల కూటం ఏర్పడింది. ఏమో, నాకు మాత్రం సమితి వారూ, సాటి కవులూ, సాహితీ పరులందరూ ఎప్పటికీ రక్తబంధువులకన్నా ప్రియులు!

1923 నాకూ గొప్ప సంవత్సరమే. ఆ యేడు నా స్కూలు మేస్టరీ ఉద్యోగం నా అదృష్టం వల్ల పోయింది. రాజమహేంద్రవరంలో వాకీంద్ర నాథ చటోపాధ్యాయులు కావ్య పఠనం చేస్తూంటే విన్నాను. అప్పటి వరకూ వచ్చిన నవ్యాంధ్ర కవుల పద్యాలెన్నో నాకు కంఠస్థాలు. నేనెందుకు అలాగ తిరుగుతూ నాలుగు చోట్లా చదవకూడదు? అప్పటికి మా వెంకట సుబ్బయ్య "సంధ్యారాగం" వచ్చింది. విశ్వనాథ 'ఆంధ్రప్రశస్తి' వచ్చింది. పింగళి కాటూరుల 'తొలకరి', నోరి 'సీమాలికా' వచ్చాయి. ఇదివరకు వచ్చిన కవుల పద్యాలు ఉండనే ఉన్నాయి. శారద, భారతి, సాహితుల్లో పడ్డ కొత్త పద్యాలున్నాయి. వీటిలో కొన్ని ఏరి ఒక కావ్య సంధా, పథకం ఏర్పరిచాను. 'సంధ్యారాగం'లోని 'అనురాగమను కెనువకీ' అన్న స్వాగతంతో ప్రారంభించి, 'తొలకరి'లోని 'కవితా సామగ్రి' తర వాటి చదివి, మిగిలిన కావ్యాలు వరసగా చదివేవాణ్ణి. చదివేవాణ్ణమిటి పాడే వాణ్ణి! 'యెంకి పాటలే' పాడేవాణ్ణి. వాటి నావేశంలో పాడుతున్నప్పుడు విని 'యెంకిపాటలే' రచన నాకు కల్పించి, తగని గౌరవం నాకు ఇచ్చిన వాళ్ళు ఉన్నారు.

బసవరాజు, విశ్వనాథ, నండూరుల్ని తలుచుకుంటే ఏమి పాపాలో అనిపిస్తుంది ఇప్పుడు! ఆవేశమో, ఆయా కావ్యాలంటే నాకున్న అకలంక మైన అనురాగమో నాటి నా పద్య పఠనానికి కొంత ఆకర్షణ కూడా ఇచ్చి ఉండాలి! లేకపోతే ఎన్ని సంవత్సరాలో ఎన్ని సభల్లోనో ఎందుకు చదివి స్తారు? మొట్టమొదటి నా కావ్య పఠనం దామెర్ల రామారావు గారి యింట చిన్న సభలో అనుకుంటాను. ఆయనకీ, ఆయన అన్నగారికీ నా పద్యాలన్నా, నా చదవటమన్నా చాలా యిష్టం. తరువాత దాదాపు పదేండ్ల పాటు పద్యాలు చదువుతూ దేశమంతా తిరిగాను. ఓ: ఏమి తిరగటం అప్పుడు నాకు నిత్యమూ కవితోత్సవం కావాలి. ఇదంతా ఎందుకు చెవుతున్నానంటే నవ్యకవిత్వం ఒక తీవ్రోద్యమమయి నిలవడానికి ఈ నా కృషి కొంతవరకయినా కారణమని ఇప్పుడింత దూరాన్నుంచి అనుకుంటే మన్నించండి.

1923లోనో పిఠాపురం నుంచే బయలుదేరి, త్రోవలో నూజివీడులో నండూర సుబ్బారావుని చూసి, అక్కడ నుంచి తెనాలి వెళ్ళి వఝ్ఝల బాబూరావు వీరరాఘవస్వాముల్ని చూసి, గుంటూరు శివశంకరశాస్త్రిగారి కోసం వెళ్ళాను "హృదయేశ్వరి" తయారవుతున్న రోజులవి. అక్కడ "నోరి" ని చూసాను. అందరమూ కలిసి, త్రోవలో బెజవాడలో "సాహితి" ని సంపాదిస్తున్న కొడాలి ఆంజనేయుల్ని కలుసుకొని, బందరువెళ్ళి అక్కడ కల్యాణ మండపం లాగ కలకల లాడుతూ వున్న జాతీయకళాశాలలో విశ్వనాథ, అడవి మొదలైన కవుల్ని, రామ కోటీశ్వరరావు గారినీ కలుసుకున్నాము. వీరందరూ "సాహితీ సమితి".

కవిమిత్రుల నందరినీ చూసి రావడం వల్ల నాకు కొంత ధైర్యమూ బరమూ వచ్చాయి. వసంత వాడలో వేలూరి శివరామ శాస్త్రి గారికి "ఆకులో ఆకునై" అన్న నా పాటను వినిపించాను, బందరులో "అబ్బ!" నా ఖండ కావ్యాల్ని విశ్వనాథ బాగా మెచ్చుకున్నాడు. ఇటు విజయనగరం పర్లాకిమిడిలో గిడుగు రామమూర్తి పంతులుగారిని కలుసుకొని మా కావ్యాలన్ని వినిపించాలని నా సంకల్పం, నాకు బాగా జ్ఞాపకం, కొత్తగా పెంచిన నా గిరిజాలని లాలిస్తు వారు నాతో మాట్లాడుతూ మా పద్యాలు వినడం ఈ గిరిజాలు ఎన్ని కష్టాలు తెచ్చి పెట్టాయి నవకవి ! కేశసంపదకీ కవిత్వశ్రీకీ నిజానికి సంబంధం ఏముంది ! మరి సమితి వారందరూ గిరిజాలు ! పెంచనూ లేదు, పెంచిన వారయినా కుటిల శిరోజ పాశాలలో సాహిత్య లోకాన్ని బంధించి జయించాలని అనుకోను లేదు. బాగుంటా యని పెంచిన గిరిజాలు ! అంతే ! తరువాత లోకం ఒత్తిడివల్లో, విరక్తివల్లో మా వాళ్ళు అందరూ తీశేశారు ; నాకు ఇంకా ఉన్నాయి. నవ్యకవిత్వానికీ గిరిజాల ఈ సంబంధం కల్పించడం, నవ్యకవిత్వ ప్రతినిధిగా సభల్లో కనపడుతూ వస్తూన్న నన్ను తెనుగు వారు చూస్తూ ఉండడంవల్ల కొంతవరకున్నూ తరువాత మా తరువాతి యువకవులు మరికొందరు అక్కడా అక్కడా వాటిని పెంచడం వల్ల కొంతవరకూన్నూ అనునుంటాను.

రామమూర్తి పంతులుగారి మెప్పు నాకు పెద్ద ఆలంబ మయింది. "కృష్ణ పక్షం" ప్రచురించాను, స్ఫుటంగా నా మనుస్సులో నాటుకొని

పోయిన మరి రెండు మూడు ఘట్టాలు ఉన్నాయి. 1925లో నేమో అక్కిరాజు ఉమాకాంతంగారు వ్రాసిన "నేటికాలపు కవిత్వము" అనే గ్రంథం వచ్చింది. అశనిపాతమంత తీవ్ర ధాటితో వచ్చిందది కాలం తెచ్చిందది ? ఎప్పుడైతే నిజమైన ఒక ఉద్యమం బయలు దేరిందో అప్పుడే దాని గుణ దోష విమర్శనా వస్తుంది : ఆయన తీవ్ర విమర్శ నుంచి నా వంటి కవులు నేర్చుకోవలసినది లేకపోనూ లేదు, కాని, కొంత ఆర్ద్రదృష్టితో కవితా హృదయముతో ఆ విమర్శన సాగితే నేటికాలపు కవిత్వంలో వాద ప్రతిపాదనమూ. కవిత్వగుణమూ గ్రహించి ఉండేవారు. ఊపిరాడనీయనంత కోపంతో ఆ గ్రంథం దాడిచేసినట్లనిపించింది. నా వంటివారికి.... వారికి జవాబు వ్రాద్దామా అన్నారు కొందరు మిత్రులు. ఏమి జవాబు మేము వ్రాయగలం ? క్రొత్త పద్యాలు వ్రాయడమే జవాబని పించింది. వ్రాయకుండా ఎలా గుండగలం ? ఈ సంకల్పం 1925లో మనస్సులో గట్టి పడింది.

"కృష్ణపక్షము" ప్రచురించాక మదరాసు వచ్చాను. అక్కడ నండూరి సుబ్బారావు "యెంకి పాటలు" లా కాలేజీలో చదువుతూ అచ్చు వేయిస్తున్నాడు. బసవరాజు "ఆంధ్రపత్రిక" లో ఉన్నాడు [illegible] ఉన్నాడు. రోజూ కలుసుకుని పద్యాలు పాటలూ చదువుకునే వాళ్ళం. ఆ సమావేశాల ఫలితం, కొత్త ఉత్సాహంతో ఇంకా కావ్యాలు వ్రాయడమే 1925 డిశంబరులో నేను ఎన్నడూ మరచిపోలేని సమావేశం మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి యింట జరిగింది. విశ్వనాథ సత్యనారాయణ అడివి బాపిరాజు, నండూరి, రామకోటీశ్వరరావు గారూ, బాపిరాజు సుబ్బారావు గారూ, నేనూ రెండు మూడు రోజులు మల్లంపల్లి వారి యింట్లో కలుసుకునేవారం. కావ్యపఠనం సాగేది. ఒక సాయంకాలం విశ్వనాథ "అనార్కలి" నాటకం చదవటం ఇంకా జ్ఞాపకం, తరువాత కొందరం ఉమాకాంతం గారిని చూశాము కూడా.

1925లోనే నాకు హరీంద్రనాథునితో మైత్రి లభించింది. ఇద్దరమూ బెంగుళూరు వెళ్ళడమూ. అక్కడ నా పద్యాలు కొన్ని ఆంగ్లంలోనికి అతడు అనువదించడమూ జరిగింది.

1925 లోనే "సఖి" అంటే సాహితీసమితి పత్రిక బయలు వెడలింది అదికాక, తరవాత మా విశ్వనాథ 1927 లో సంపాదించిన "జయంతి" తరువాత కొంపెల్ల జనార్దనరావు నడిపించిన "ఉదయిని" పాటిబండ మాధవ శర్మ "వీణ" ముద్దుకృష్ణ "జ్వాల" నవ్యసాహిత్యం కోసమే పుట్టాయి.

1927 డిశంబరులో మరొక చిన్న సాహిత్యోద్యమం అత్యుత్సాహంతో మదరాసులో జరిగింది. రామకోటీశ్వరరావుగారి "త్రివేణి" బయలు వెడలిన రోజున వారి యింట్లో మల్లంపల్లి విశ్వనాథ "ఆంధ్రప్రశస్తి అంకిత మియ్య డమూ మే మందరమూ సమావేశమయి ఆనంద వివశుల మవడమూ జరిగింది.

ఇదంతా బొత్తిగా స్వంతఘోషగా కనపడ్డా నిజానికి అలాగ కాదు. ఏక సంఘంగా ఏర్పడడం దానికోసం పత్రికలు ప్రచురించడం, సమావేశాలు కావడం, పర్యటన చేస్తూ ప్రచారం ఇన్నీ కలిసి నవ్యకవిత్వాని - నవ్యసాహి త్యాని ఒక ఉద్యమంగా ఎలాగ చేశాయో తెలియ జేస్తాయి కనుక ఇదంతా వ్రాశాను.

## 10

ఇక్కడ మరి నాలుగు మాటలు, పూర్వగాథల్ని ఇలాగ నెమరు వేసు కోవడంలో కొందరు ప్రియతములు ఇప్పుడీ కళ్ళకి కనపడకుండా లోకా వరణం దాటిపోయిన వాళ్లు. నా మనస్సుని పట్టుకుని ఎంత దుఃఖమూ వేదనా అయినా కలిగిస్తున్నారు. వెంకటసుబ్బయ్య, బసవరాజు, జనార్దన రావు మరి కనపడరు ! కొడాలి సుబ్బా రావు, పెనుమత్రి వెంకటరత్నం వెళ్ళి పొయారు, రామిరెడ్డి వెళ్ళి పోయాడు. కొత్త యుగపు తీవ్రావేశా లతో, అనుభూతులతో క్రిక్కిరిసి పోయిన ముప్పై నలభై యేళ్ళ వీళ్ళ జీవితాలు నలిగి నశించి పోయాయేమో అనిపిస్తుంది. ఎవరుపోయినా మే మెప్పుడూ ఏడుగురమే అన్న ఆంగ్ల కావ్యంలో లాగా అమర జీవులైన వాళ్ళ తో కలిసి మేమందరమూ ఎప్పుడూ ఉండనే ఉన్నాము.

ఇక్కడ కవులు కొందర్ని గూర్చి వ్రాస్తాను, మంచి శక్తి సామర్థ్యాలు ఉన్న మరికొందరు వదిలేస్తే వారి కవిత్వమంటే నాకు గౌరవం లేదని కాదు

ఈ రచన సాగించే ధోరణిలో ఆయా ఉద్యమాలకి ప్రతినిధులుగా కనుపించే కొందర్ని గూర్చే వ్రాయగలను గాని ఇంత చిన్న అవధిలో కవులందరిని ఎలాగ ఇమడ్చగలను ?

రాయప్రోలు తొలి కావ్యాలలో మధురంగా వినబడిన ప్రాచ్యాంధ్ర గాథలు మరీ గాఢోజ్జ్వలంగా విశ్వనాథ 'ఆంధ్రపౌరుషము' 'ఆంధ్ర ప్రశస్తి' మొదలైన కావ్యాల్లో ప్రత్యక్షమౌతాయి, ఇతని ధోరణిలోనే కొడాలి సుబ్బారావు తీవ్రావేశంతో 'హంపీక్షేత్రము' మొదలైన కావ్యాలలోనూ ఆంధ్రలోకాన్ని అమితంగా ఆకర్షించిన జాషువా కవి కావ్యాలలో, మరి కొందరి కవుల కావ్యాలలోను జాతీన దేశగౌరవము చక్కని పెద్ద వలె నన్న ప్రబోధ వేగము బాగా స్ఫురిస్తుంది. ఆత్మపరంగా 'గిరికుమారుని ప్రేమ గీతాలు' మొదలైన కావ్యాలు విశ్వనాథ వ్రాశాడు. 'కిన్నెరసాని పాట' 'కోకిలమ్మ పెళ్ళి', అనార్కలీ' నాటకంలో కొన్ని పద్యాలు ఇవన్నీ ఇతని గేయకావ్యాలు (**Lyrics**). 'ఆంధ్ర ప్రశస్తి' లో 'మాధవవర్మ' వంటి కథాకావ్యాలు (**Narrative Poems**) ఉన్నాయి. 'ఋతు సంహారం' వంటి వస్తుపరమైన కావ్యాలు వ్రాశాడు. ఇతను శతకం వ్రాశాడు : 'ఉదాహరణం' వ్రాశాడు. ఇప్పుడు 'రామాయణ కల్పవృక్షము' అనే మహాకావ్యం వ్రాస్తున్నాడు. ఇతనిది 'గాఢప్రతిభ' — మహాకావ్య "ఘటనా ఘటనా పటిష్ఠ" మైనది, ఇతనిలో తెలుగుతనం ఎక్కువ సాహసమూ పిడివాదమూ అమితం. ఎట్టి వస్తువునైన కావ్యవస్తువుగా తీసుకుంటుకు జంకడు : ఎట్టి మాటనయినా కావ్యభాషలో పొదగటానికి వెనుదీయడు. కల్పనాదీక్ష, ఏకాగ్రత భావనాసమృద్ధి — ఈ గుణాలు కలిగి అవిశ్రాంతంగా కావ్యసృష్టి చేస్తాడితను, హైందవ జాతీయోద్యమం ఇతని కావ్యాల్లో ఉజ్జ్వలంగా సాక్షాత్కరిస్తుంది. తరతరాల హైందవ విజ్ఞాన సంస్కృతులను నేటి ఆంధ్ర లోకంలో పునఃప్రతిష్ఠ చేయాలనే ప్రయోజన మపేక్షించి ఇతడు కావ్యరచన కావిస్తున్నట్లు కనబడుతుంది.

అటు నెల్లూరిలో దువ్వూరి రామిరెడ్డి ఈ యుగంలో ప్రత్యేకంగా కనబడతాడు. ఇతనిది గొప్ప సంస్కారము; సమగ్రసుందరమూ, నిర్మ

లమూ అయినది. ఇతని స్వభావములాగే నిర్దుష్టమూ, స్వచ్ఛ మోహనమూ ఇతని వాణి. మొదట 'జలదాంగన', 'కృషీవలుడు' వంటి కావ్యాలలో, తరువాత 'పానశాల' మొదలైన కావ్యాలలో ఇతని నవ్యతా, ప్రతిభా బాగా స్ఫురిస్తాయి.

ఈ యుగంలోనే అటు రాజమహేంద్రవరంలో కవికొండల వెంకట రావుది వింతగొంతు. ఇతడు కర్షకుని వద్ద ఆగడు ; 'కూలి అన్నల' దాకా పోతాడు రామిరెడ్డిది సంస్కృతమైన వాక్కు ; కవికొండల వాణి మహా విశృంఖలంగా, చిత్రంగా రకరకాల ఛందస్సులతో 'దాక్కొని ఇరుక్కొని' నడచి పోతుంది. ఓడరేవులూ, సరంగులూ, 'ఉత్తరాలా సంచి నెత్తిపెట్టుక పోవు' వాళ్ళూ - ఇట్టి సామాన్య జనానికి ఇంతగా సన్నిహితుడైన తెలుగు కవి ఈ యుగంలో మరెవ్వడూ లేడు. ఇతని మీద, అడివి బాపిరాజు మీద కూల్డ్రి ద్వారా వర్డ్సువర్తు వంటి ఆంగ్ల కవుల పలుకుబడి ప్రసరించి ఉంటుంది. బాపిరాజు 'గంగిరెద్దు', 'పట్టిసం' 'గోదావరి'లో ఆ ప్రభావం కనబడుతుంది; ఇంత అనుభవానికి ఇతని హృదయం కదులుతుంది; తీర్చి దిద్దిన భాషలో ఆ అనుభవాన్ని పొగడటానికి కావలసినంత స్తిమితం ఇవ్వక ఇతని భావన పరుగెత్తుతుంది.

బందరులో పింగళి కాటూరి కవుల 'తొలకరి'లో కొంత జాతీయో ద్యమ ప్రభావం కనబడినా 'సౌందరనందం' లోనూ, తరువాత కాటూరి 'పౌలస్త్యహృదయము', 'గుడిగంటల' లోనూ, మానవోద్యమ వికాసం బాగా స్ఫురిస్తుంది. పూర్వాంధ్ర మహాకావ్యాలన్నీ మనస్సులో ఇంకగా ఇంకగా తయారయిన శిల్పమూ, బాణీ వీళ్ళది. శాంతసుందరంగా, గంభీరంగా, నుహా హుందాగా నడుస్తాయి వీరి భావనా, పద్యమూ కూడా, వ్యక్తిపరమైన ప్రేమ సంఘాన్ని ఉజ్జీవింప జేసే కరుణగా ఎలాగ మారిందో 'సౌందరనందము'లో వర్ణిస్తారు. దీనిలో గాంధీయుగ ప్రభావం కనిపిస్తుంది. 'ఆకుల్ రాలని పూలు వాడని వసంతారామం' లాగా ఉంటుంది వీళ్ళ కావ్యం.

స్వామి శివశంకరశాస్త్రిలు (పూర్వాశ్రమంలో ప్రియతములైన మా అన్న గారు) తమ గ్రంథాల ద్వారానే కాక సాహితీ సమితి ద్వారా కూడా నవ్యకవిత్వానికీ, సాహిత్యానికీ గొప్ప పటిమ ఇచ్చారు. వీరు మహా వ్యక్తి; వీరే ఒక సంస్థ, ఎన్ని భాషలో వీరెరుగుదురు; ఎన్ని సాహిత్య హృదయాల లోతులో తరచి చూచారు. కాని సంస్కృత వాఙ్మయమంటే మోజు యెక్కువ. వీరి హృదయం యెంత ఆర్ద్రమూ, అకలంకమూ కాకపోతే, వీరి ప్రతిభ ఎంత గాఢమూ నిశితమూ కాకపోతే, చిత్ర చిత్ర ప్రకృతులు గల కవుల నందరిని ఒక్క కూటంలో అంతకాలం గూర్చి ఉంచ గలరు! వీరి 'హృదయేశ్వరి' ఆత్మపరమైన కావ్యాల సంపుటి. తీవ్రానుభ వాలలో వేగిపోయే హృదయం వాటిలో వేడివేడిగా ఎంతయినా కనబడు తుంది. వీరి అనుభవాలు కొత్తవి; కావ్యరూపాలు కొత్తవి. వీరు కల్పించే చిత్రాలూ, అలంకారాలూ ప్రాత సంప్రదాయాలకి దగ్గరగా ఉన్నట్లనిపిస్తాయి; వీరి భాషమీద కూడా సంస్కృత ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. వీరి పద్యం నిదానంగా, గంభీరంగా నడుస్తుంది, ఎక్కువ వేగమూ, ఆవేశమూ 'పెద్దమనిషి తరహా' కాదన్నట్లు, వీరి 'దివ్యలోకము' వంటివి మహామంచి కావ్యాలు. వీరి 'మేడూరివారి కోడలు' మంచి కథా కావ్యం. వీరు పద్య రూపకాలు వ్రాయడంలో మార్గదర్శి వీరి కవిత్వ ప్రభావం నోరి నరసింహశాస్త్రి మీద ఎక్కువగా ప్రసరించింది. చిన్నతనంలో నోరి ఆత్మపరమైన చక్కని పద్యాలు వ్రాశాడు. ఇప్పుడు 'దేవీభాగవతము' మహా కావ్యంగా రచిస్తున్నాడు. ఇతనిది గట్టి దీక్ష, సంస్కృతీ, వైదుష్యమున్నూ.

ఇంక, మా తరంవారై, దాదాపు ఒకేరకం అనుభవాల్ని ఆత్మ పరమైన కావ్యాలలో చెప్పుకున్న కవులు నలుగుర్ని గూర్చి కొంచెం చెప్పా లనుకుంటున్నాను. వీళ్ళు నాయని సుబ్బారావు, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, కృష్ణశాస్త్రి—అంటే నేను.

నాయని సుబ్బారావు కూడా కవిత్వం చెప్పవలసి చెప్పాడు - బసవ రాజులాగ, హృదయభారం విడబోసుకుందుకు! ఆ రోజుల్లో ఆ కావ్యరచనే లేకపోతే అతని జీవితం ఎంత బరువుగా అయిపోయేదో! ఎటొచ్చీ 'నాయని'

వ్రాసినదంతా బంగారం, హృదయావేశమూ, భావనా, భాషా అన్నీ ఒకదానికొకటి పెనవేసుకొనిపోయి, కావ్యరూపాన కనబడితేనే గాని మనిషి లాగ కష్టసుఖాలు చెప్పుకోలేవు కనుక అలాగ కలిసిపోతాయనిపిస్తుంది. నండూరి 'యెంకిపాటలూ' అంతే ! ఇవికూడా సంసారి ఆత్మానుభవాలే చెపుతాయి; 'యెంకి నాయుడు బావల' గొంతుల్లో నుంచి మొదటా, తరువాత నండూరి గొంతులో నుంచిన్నీ ! ఇతని రచన అంతా కవిత్వపు ముద్ద. మాటలు ఎంత తక్కువగా వాడతాడు ! కాని ఎంత జిగి తగిలించి ప్రౌఢమైన శిల్పం చూపిస్తాడు ! ఇతనిమాట కిటికీలాగ, తోట, ఏరూ, ఆకాశమూ, నడుమ ఒకరివైపు ఒకరు తిరిగి నిట్టూరుస్తూ నిలబడ్డ ఇద్దరు ప్రేమికుల్నీ అంతరాల్లో నుంచి ఎలాగ చూపిస్తుంది ! 'వెంకి' అనక 'యెంకి' అనడం వల్ల ఒక వింత ఆకర్షణ వచ్చింది కాని భాష కూడా నండూరిదే. మరి కవిత్వపు లావణ్యాలూ, లోతులూ వేదులకు తెలిసినంత మరెవ్వరికీ తెలుసునా అని ఆలోచిస్తున్నాను. పాతమాటలే సరికొత్తవై పోయి. పాతవృత్తాలలోనే పడి, ఒయారంగానూ, ఓరగానూ, ఉద్వేగంతోనూ, ఉల్లాసంతోనూ ఊగుతూ ఊగుతూ ఇదివరకెరగని వనిపిస్తాయి. మరివాటిలో వేదనా భావనా కలిసిపోయి, దేని ప్రాబల్యమూ ఎక్కువ కాకుండా, ఉత్తమ కావ్యమయి ఊరుకుంటాయి. 'దీపావళి' రోజుల్లో వేదుల ఎలాగ ప్రవాసి లాగా ఉండేవాడో నేనెరుగుదును.

వీరు ముగ్గురి కవిత్వంలో మానవ హృదయం గొప్ప యెత్తులూ, లోతులూ అందుకుందని నా అభిప్రాయం.

ఇక మిగిలింది నేను. దేవులపల్లి కృష్ణశాస్త్రిని, పిఠాపురం దగ్గిర కూచిమంచి తిమ్మకవి చంద్రంపాలెం మా ఊరు. తండ్రీ, పెద్దతండ్రీ మంచి పండితకవులని ఆ రోజుల్లో పేరు పొందారు. ఆ పితృదేవుల్ని ప్రతి నిత్యమూ స్మరించు కుంటూంటాను. మొదట పిఠాపుర సంస్థానానికి సన్నిహితుణ్ణవటం చేత, జీవితంలో భోగమూ బద్ధకమూ ఎక్కువై కృషి తక్కువ, ఇంటివద్ద అహారహాలు పూర్వకావ్య గోష్ఠి జరుగుతుండేది. కాకినాడలో వెంకటరత్నం నాయుడుగారి శిష్యుణ్ణయి మత సంఘ సంస్కరణోద్యమాల ప్రభావంలో పూర్తిగా పడ్డాను : ఆంగ్ల సాహిత్యంతోనూ,

సూఫీ వంగ వైష్ణవ సాహిత్యాలతోనూ నా గురుదేవుల నాకు కొంచెం పరిచయం

తరువాత హరిజనోద్యమం లోనూ, కళావంతుల వివాహోద్యమం లోనూ మా ఊళ్ళో కొంత తిరిగాను. కొన్ని సంవత్సరాల పాటు నన్ను బంధువులూ, బ్రాహ్మణులూ బహిష్కరించారు. నా జీవితంలో అతి తీవ్ర మైన వేదనా, ఆవేశమూ కలిగించే గొప్ప అనుభావాలు కొన్ని వచ్చాయి. ఉద్యోగం ఎవరయినా ఇచ్చినా అది ఉంచుకునే గుణంలేక. నవ్య కవిత్వం మొదలైన వాటి మీద ప్రసంగాలిస్తూ కొంత తిరిగాను.

'కృష్ణపక్షము', 'ప్రవాసము' కొన్ని గేయాలు సంపుటులూ అచ్చయిన నా కావ్యాలు వాటి ప్రభావమూ, ముద్రా 1925 తర్వాత నా తరువాతి కవులు చాలమంది మీద కొన్ని యేళ్ళపాటు ఉందని అంటారు, కొంత కాలం నా మీద ప్రసరించిన దూషణ భూషణలు నవ్య కవుల్లో మరెవ్వరి మీదా పడలేదు. నన్ను సాటివాడుగా వారందరూ ఆదరించడమే నా జీవితానికంతకీ వరం.

## 11

ఈ నవ్యకవితోద్యమం అంటే 1925 తరువాత ఎక్కువగా విజృంభించిన ఆత్మపర మైన కవిత్వానికి చెందినదని కొందరంటారు. నా అభిప్రాయం ప్రకారం ఈ కవిత్వం గోపురం పునాది గురజాడ వారే వేశారని, 'పెరిగి విరిగిన' వంటి కావ్యంలో ; దానిమీద రాయప్రోలూ, బసవరాజూ కొంత నిర్మాణం సాగించారు, నాయని ప్రభృతులు శిఖరం కట్టారు. కాని మా కాలపు కవులందరూ ఆత్మ పరమైన కవిత్వం కొంచెమయినా వ్రాశారు. మిగిలిన కాల్పనికోద్యమ (Romanticism) ప్రభావాలు కవులందరి మీద ప్రసరించాయి. అసలు కొంత కాల్పనిక ఆవేశం లేకపోతే కవిత్వమే రాదని నా నమ్మకం.

కాని అది హద్దు మీరితే అగమ్యగోచర మవడమూ, ఆవిరి అవడమూ ఉన్నది. నిజానికి ఏ ఉద్యమం ముదిరినాఏదో దుర్గుణం వస్తుంది. సాంస్కృతికత

నిగిగస్తాయి; మనకు అనుభవం స్ఫురింపజేస్తాయి. ఈ కావ్యం మంచిగానం చేసేదని చేస్తుందని నానమ్మకం. నవ సాంఘిక విధానము సుస్థిరంగా రష్యాలో ప్రతిష్ఠింప బడింది. కనుక ఇప్పుడు ఆదేశంలో భావకావ్య రచనని ప్రోత్సహిస్తున్నా రని వింటున్నాం.

ఇక్కడ ఒక్కమాట: మాతరం కవులలోనూ, తరువాతి నవకవుల లోనూ ఏ ఒకరిద్దరో తప్ప మిగిలిన అందరూ అవిశ్రాంతంగా కావ్యసృష్టి [illegible] [illegible] వహిస్తున్నారు. విశ్వనాథ ఆ ఒకరిద్దరిలో వాడు. అతనికి కవిత్వమూ, బ్రతుకూ, ఒకటే అయిపోయాయి; ఇతనిది గొప్ప దీక్ష. ఇక మిగిలిన కవుల కవిత్వంలోనే ఉందేమో ఎక్కువ రాయకపోయే గుణం: కాని యౌవనంలో ఆత్మపరమైన కవిత్వం చెప్పిన రవీంద్రుని వంటి వాడు ఒక్కనాడైనా కలం దించక కావ్యసృజన చేస్తూనే ఉండలేదా?

కవిత్వ రచన కూడా తపస్సు. కవి ముదిరాక వ్రాసే కావ్య రూపమూ, గుణమూ మారవచ్చును గాని కావ్యకల్పన మానగూడదు. ఇలాగ మానడానికి కారణాలు అనేకం ఉండవచ్చు; కాని ఒకటి ముఖ్యం నా మనస్సుకి తోచింది ఇక్కడ చెప్తాను. ఆ కొత్తరోజుల్లో, మేలుకొన్న కొత్త సమాజంలో, తనకు లభించిన ఏ ఒకటి రెండు అనుభవాలనో, కష్ట సుఖాలనో తన దివ్యకావ్యాలల్లో పెట్టాడు. తరువాత అహంకారంవల్లనో అశ్రద్ధ వల్లనో ఆ అనుభూతుల్నే కౌగిలించుకొని, చుట్టూ ఆవరణ కట్టి కూర్చున్నాడు.

ఇంతలో అటని నాటి మానవోద్యమపు రూపు మారింది ఈ మార్పు కూడా తానూ కొంతవరకు తన కావ్యాలద్వారా తెచ్చి పెట్టినదే. నాటి సమాజం పెరిగింది. చైతన్య భాండారమై అనంత జీవంతో చలించిపోయే నవసమాజంతో కూడా నడుస్తూ వస్తూ స్నేహం చేస్తూ జీవిస్తే కొత్త అనుభవాలూ వస్తాయి; కొత్త వాక్యాలు వస్తాయనుకుంటాను.ఎటొచ్చీ ఆ కావ్య రూపాలు మారవచ్చు. కథలు రావచ్చు! నాటకాలు రావచ్చు. ఆ కావ్యాల్లో వెనకటి లావణ్యం లేకపోవచ్చు; మహత్తర సందేశం వుండవచ్చు జీవిత యాత్రలో ఒక్కచోట ఆగిపోవటానికి ఎవరికయినా అవకాశం ఉంది కాని

కవికి ఆ అవకాశమూ, అధికారమూ కూడా లేవు. ఈ సమాజం మనది; దానితో మనం మారాలి; దానిని మార్చాలి.

## 12

నవ్య కవితోద్యమంలో మా తరువాత వచ్చిన కవుల్ని గూర్చి కొంత వ్రాస్తాను. వీరిలో కూడా కొందర్ని వదిలేస్తున్నాను. ఏం చెయ్యను?

విశ్వభారతిలో గురుకులవాసం చేసి కొత్తగా తెలుగునాటిలో అడుగుపెట్టిన మల్లవరపు విశ్వేశ్వరరావుకి స్వచ్ఛమయిన మంచి భావనా బలం ఉంది.

'ఏనాడు', 'గడ్డిపూవు', 'సింగారము' మొదలైన కృతులలో భాషా నడకా, భావనా ఎంత ముగ్ధమోహనంగా నయినా ఉంటాయి. తరువాత 'కల్యాణకింకిణి'లో మరికొంత పెరిగి ఆత్మపరమైన కావ్యాలు వ్రాశాడు; గేయాలు మహబాగా వ్రాస్తాడు. కవిత్వ గుణాల్నిబట్టి ఇతను మా తరానికి దగ్గర. పిలకా గణపతిశాస్త్రి కూడా అంతే. సంస్కృతాంధ్ర సాహిత్యాలతో మంచి పరిచయం ఇతనికి. తరువాత ఆంగ్ల సాహిత్యంతో కూడా. అసలు కవి కనుక, కొత్త గాలుల్ని తెలియకుండానే పీల్చి, గీర్వాణ పాఠశాలల్లో చదువుతున్న రోజుల్లోనే, నవ్యకవితోద్యమంలో పడ్డాడు. ఇతనిది మంచిభావన; మాటలతో మంచి చిత్రాలు పట్టగలడు; ఆ మాటలూ వాటి కూర్పులూ వృత్తాల నడకలూ మనోహరంగా ఉంటాయి. వేడివేడి అనుభవాలకి ఎదురుచూచే కవిహృదయం ఇతనిది. 'రత్నోపహారం', 'రుద్రుడు-ప్రేమద్వర'లో ఇతనిశక్తి బాగా కనబడుతుంది. హనుమదింద్ర గంటి కూడా గీర్వాణపాఠశాల నుండి వచ్చినవాడే. కవిత్వపు లోతులు ఇతడు సమగ్రంగానూ, సూక్ష్మంగానూ గ్రహిస్తాడు. ఇతను వ్రాసినకొద్ది ఖండకావ్యాల్లో మంచి కవిత్వసంపద ఉంది. 'గోదావరి' ప్రశస్తమైన కావ్యం; ఇతని వాణిలో పదునూ, అందమూ కూడా ఉన్నాయి. బాల గంగాధర తిలక్ వీరికన్న బాగా చిన్నవాడు; ఇతని రచనల్లో కొత్తదనమూ సోయగమూ కూడా ఉన్నాయి. 'సంపత్' మంచి దిట్ట. ఇతని చదువూ, సంస్కృతి సమగ్రమైనవీ, నిండైనవీ. అన్ని రకాల కవిత్వాలూ బాగా ఎరిగున్నవాడు. రకరకాల ఛందస్సులలో రకరకాల ఖండకావ్యాలు

వ్రాశాడు. పాత ధోరణులన్నీ జీర్ణించుకుని కొత్త పోకడలలో హాయి ఒప్పించగలిగినాడు.

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి కూడా గీర్వాణ కళాశాల నుంచి వచ్చినవాడే. కవిత్వమూ, సాహిత్యమూ అంటే ప్రాణమిచ్చే మనిషి. పూర్వాంధ్ర కావ్యాలతోనే కాక, గురజాడ నుంచి నేటి కవి దాకా అందరి కావ్యాలతోనూ ఇతనికి అమిత స్నేహం. 'పేరడీ' అనే కావ్యరచనలలో ఇతనికి అసాధారణ ప్రజ్ఞ ఉంది. ఒక్కొక్క కవినీ, ఒక్కొక్క కవి ప్రత్యేక ధోరణి పట్టుకుని, దానిని కొంత హాస్యం చేస్తూ, ఆ కవి అనిపించేటట్లుగానే కావ్యం వ్రాస్తే 'పేరడీ' అవుతుంది. ఇది తెలియకుండా చేసే అనుకరణం కాదు; తెలిసి తెలిసి అనురాగంతోనే చేసే హాస్యం. రాయప్రోలు విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల కావ్యాలకి జలసూత్రం అద్భుతమైన పేరడీలు వ్రాశాడు.

శ్రీరంగం శ్రీనివాసరావు- అంటే శ్రీశ్రీ-తో మానవోద్యమంలో రెండోతరం పొలిమేరల దగ్గరికి నవ్య కవిత్వం వస్తుంది. ఇతని మొదటి రచనలలో-ప్రభవ- అనే కావ్యసంపుటిలో-తన వెనుకటి కవుల ప్రభావాలూ ధోరణులూ కనపడతాయి. కాని వాటిలో ఒక ప్రతిభాశాలి ప్రత్యేకత కూడా గోచరిస్తుంది. అంతలో ఇతనికి మరొక మానవ లోకపు టంచులు దూరాన్నుంచి కనపడతాయి; ప్రజాపద ధ్వనులు వినపడతాయి. తక్షణం ఇతని కావ్యవస్తువులూ, వాటితో కంఠధ్వనీ, బాణీ మారతాయి. శరీరమంతా ఒక ఆవరణలో నిలబడగా శిరస్సు చాపి మరొక ఆవరణలోనికి చూస్తున్నట్లుంటాడితను. ఇతని ఆవేశం కాల్పనికోద్యమానిదే; భాష కూడా అంతవరకు కావ్యభాషగా వస్తున్నదే; కాని దానితోనే కొత్త కాహళులవీ దుందుభులవీ మ్రోతలు మ్రోగిస్తాడు, నవకవిత్వావరణలో మరొక కవితోద్యమానికి ప్రతినిధిగా నిలబడ్డాడు. ఇతని అనుయాయులు అనేకులు. ఇతడు శబ్దాల మీదా, చందస్సుల మీదా అమోఘమైన అధికారం చెలాయిస్తాడు. ఆంధ్రాంగ్ల సాహిత్యాలతో అతిగాఢమైన స్నేహం ఇతనికి.

'పఠాభి' పూర్తిగా నవ్యుడు. 'ఫిడేలు రాగాల డజను' లో వచన మనే దుడ్డు కర్రతో 'పద్యాల నడుములు విరగ' గొడతాడు. ఇతని అతి నవ్యత

వచన కావ్య రచనలోనే కాక పూర్తిగా నేటి నగరవాసుల అనుభూతులని కావ్యజగత్తులోనికి తీసుకొని రావడంలోనూ గోచరిస్తుంది. ఈ కావ్యాల్లో ఈ నాగరక వాసనలు ఎంతో అద్భుతంగా నయినా స్ఫురిస్తాయి. ఇతనిది మంచి భావన కూడా; పట్టణపుటాకాశంలో చంద్రుణ్ణి వర్ణించేటప్పుడు, నగర శృంగాటకంలో నిలబడ్డ పోలీసు జవానుని వర్ణించేటప్పుడూ ఈ శక్తి కనపడుతుంది. ఇతను ప్రాత ఛందస్సుల్నే వింతధోరణిలో నడపడిగా తరవాతి కావ్యాల్లో ఉపయోగించాడు.

శ్రీశ్రీతో ప్రారంభమైన ఉద్యమం అభ్యుదయ రచయితల ఉద్యమంగా దేశంలో 1945 ప్రాంతాలని పెరిగింది. ఈ ఉద్యమావేశంలో బుర్రకథలూ, పాటలూ వ్రాసేవా రనేకులు వచ్చినా, ఏ యిద్దరు ముగ్గురో తప్ప కవులు రాలేదు. వీరిలో 'ఆరుద్ర' ఒకడు. ఇతను పూర్తిగా కొత్త ఆవరణలో నిలబడ్డవాడు. చురుకైన భావన ఉన్నది ఇతనికి. 'మొయిద్యోయ్, మొయిద్యోయ్' వంటి మంచి గేయ కావ్యాలు చాలా వ్రాస్తున్నాడు. కవిత్వ రహస్యం తెలిసినవాడు; కనుక కావ్య నిర్మాణానికి అవసరమైన శిల్పం వదులుకోని నడవడి. మరి అనిసెట్టి, గంగినేని వెంకటరెడ్డి మొదలైన కవులు కూడా ఈ ఉద్యమంలోని వారే.

## 13

ఒక దారినిబట్టి పోతే, ఇదీ పాతిక సంవత్సరాల నవ్యాంధ్ర కవిత్వ చరిత్ర. మొదట నే ననుకున్న చిక్కులన్నీ నన్నెదుర్కొన్నాయి. కొంత వరకు నన్ను లొంగదీశాయేమో కూడా. ఇది చరిత్ర, విమర్శ, ఏదీ కాకుండా పోయిందేమో! కాని ఎక్కువగా నాకు బాధ కలిగించే దొకటి ఉంది. ప్రబలులూ, సమర్థులూ అయిన కొందరు కవుల ప్రతిభావ్యాప్తు లెటువంటివో వ్రాయనే లేకపోయాను. ఈ రచనలో కొందరి పేర్లు రాకపోవటం, కొందరిని గూర్చి విపులంగా వ్రాయలేకపోవడము వారికి లోపం కాదు. కాని నా మనస్సుని మాత్రం కలత పెడుతుంది. అయినా నేను నడచిన త్రోవ వేరు; అలాగ నడుస్తుంటే ముందుకు తీసుకొని వచ్చి నన్ను పలికించిన వారినిగూర్చే ఇక్కడ వ్రాశాను. ఈ రచన నేను చేయవలసినది కాదు.

ఏర్పరుస్తాడు. మరికొంత వరకయినా భవిష్యత్తులోనికి జూచి "మన కడపల గమ్యస్థానం అదీ" అని నిర్ణయించి చూపిస్తాడు. అనంతయాత్రా మార్గం మీద జనం యాత్రికకోటి దానికి పెత్తందారు, నాయకుడు కవి !

ప్రజల్లో మునువున్నట్లు మూగవాళ్ళు నిదురపోతులూ లేరు. ఆనాడు నేను నవప్రభాత ప్రాంగణంలో నిలబడి, "నేను మానవుణ్ణి కనుక నాకు స్వాతంత్ర్యానందాలు కావాలి, ఇవి నా కష్ట సుఖాలు వినండి" అన్నాను. ఈ నాడు మూలమూలాలలా నిండుకొని ముదిరిన వెలుగులతో నిలబడి "అబ్బ ఎందరున్నారో మానవులు ! ఎందరో ! వీరందరూ ఒకటే ! నాకు కావలసి నన్నీ వీరందరికి కావాలి" అనాలి నేను.

సమాజానికి దూరమై కొందరు కవులం నిర్జీవరచనలు చేస్తాం. పాండిత్యమూ ధీశక్తీ, ఉజ్జ్ఞా ప్రకటించడానికి కొందరం దుర్జ్ఞేయులం అవుతాం అవేవీ బొత్తుగా లేక కొందరం పట్టి తుక్కూ గూగరా గడ్డీ కుంటీ రచనలను విరజిమ్ముతాం కొందరం కేవలమూ చమత్కారం, చురుకుదనం చూపించి మిరుమిట్లు గొలపబోయి వికాసమూ, ఆనందమూ ఇవ్వలేక పోతాం కొందరం 'ప్రజలు ప్రజలు' అంటూనే ప్రజాలోకానికి దూరంగా ఉంటూ, దాని స్వరూపమూ, సంప్రదాయమూ. కష్టసుఖాలు దాని జీవద్భాషా గ్రహింపలేక విజాతీయ సమాజంలో నుంచీ, విజాతీయ కంఠాలలో నుంచి వచ్చిన రచనలను మన కంఠద్వారాల నుంచి వదులుతాం. కొందరం కేవలమూ కొత్తదనం చూపించి ప్రముఖులు కావడానికి ఉత్త ఓటిబొమ్మల చుట్టూ కొత్త దుస్తులు అతుకుతాం.

కాని మనలో కొందరు గొప్ప కవిబ్రహ్మలూ ఉన్నారు జీవవంత మైన సృష్టి చేసినవారూ, చేయగలవారూనూ ! వీరందరూ, వెంకటశాస్త్రి మొదలుకొని అతి నవ్యుని దాకా ఒకమహాపరిషత్తులో సమావేశమయి, కవి ప్రాజాపత్యము స్థిరపరుస్తే బాగుండును. అమహాసమ్మేళనంలో నుంచి

జగత్ర్పంత మానవాలయం కట్టగల ఏ తెనుగు నాటి వ్యాసుడు పుట్టుకొని వస్తాడో ! అంతవరకూ నవ్యకవితోద్యమం సాగ వలసిందే !

—భారతి.

రజతోత్సవ సంచిక

సర్వధారి–పుష్యము. జనవరి, 1949

సంపుటము 26 : సంచిక 1.

# యెంకిపాటల గాలిదుమారము

—శ్రీ బసవరాజు వేంకటప్పారావు

యెంకి పాటలు యే రోజున కవి సంకల్పగర్భాన పడ్డవో కాని పుట్టిన నాటి నుండీ బాలగ్రహాలు, బాలారిష్టాలు అడుగడుగున వెంటాడుతునే వున్నవి. వెనుకటికి నక్క 'పుట్టి మూడు వారాలు కాలేదు గాని ఇంత గాలి దుమారం ఎన్నడూ ఎరగనన్న'ట్లవుతున్నది. వ్రాసిన పాటలు కొద్ది అయినా వాద ప్రతివాదాలు పత్రికల నిండా గాదెడు మోతబరువు లవుతున్నవి. విషయము తెలుసుకొని వ్రాసే దానికన్న ఎవరి స్వంత సిద్ధాంతాల ఖాతాలు వారు యెంకిపాటలను జమకట్టడమో ఖర్చు వ్రాసుకోవడమో జరుగుతున్నది. ఈ గాలి దుమారమువల్ల వారికే దుమ్ము పడుతున్నదే గాని సత్యమేమి గోచరించుటలేదు. గ్రామ్యవాదులు ఎంకిని దేవతగాను, గ్రాంథికవాదులు దానినే బ్రహ్మరాక్షసి గాను వర్ణించి అనేక రకాల వికారాలు పొందుతున్నారు. దుమారము ఇంకా నోట్లోను ముక్కులోను కొట్టుకుంటూనే వున్నది. కాని కొంచెం ప్రాణాయామం చేసి యోగదృష్టిలో 'సత్యం యేమిటం' అని చూసేవాడికి యీ ఆందోళనమంతా కల్పితమనీ కృత్రిమమనీ అనవసరమనీ స్పష్టము కాక మానదు.

నేను తనకు గురువునని చెప్పుకోవడము మా వాడికి (యెంకిపాటల కర్తయగు చి. నండూరి వేంకటసుబ్బారావు) కొంత సరదా. గురుత్వానికి రెండు మూడర్థాలున్నవి. వయస్సున పెద్దలైన వారిని గురుజనులంటారు; విద్యా బుద్ధులు నేర్పిన వారిని గురువు అంటారు. గురుత్వము మాంద్యమునకు కూడా పర్యాయపదముగా వైద్యులు వాడుతుంటారు. కాబట్టి యే కారణమును బట్టి గురుత్వమును నా కాపాదింపబూనినాడో! మెచ్చుకొన్నప్పుడు ఆధిక్య సూచక మగు గురుత్వము, మెచ్చనప్పుడు మాంద్య సూచక మగు గురుత్వము నా కాపాదింపబడునేమో! పూర్వ మొక గడుసు వాడు "నలుగురూ సుబ్బక్క మొగుడు సుబ్బక్క మొగు డంటే కాబోలు

ననుకొని సుబ్బక్క మొగుణ్ణన్నాను. కాకపోతే నా గంతా బొంతా నాకు పారేయండి పోతా" నన్నట్లు నేనూ వీలుగా నున్నంతవరకు సుబ్బారావు గురువునే అనుకొని శిష్యవాత్సల్యముతో "యెంకిపాటల"ను గూర్చి చిర స్నేహం లబ్ధ మయిన విషయ పరిజ్ఞానముతో విమర్శిస్తాను. అది మా వాడికి గాని అభిమానులకు గాని కంటకింపుగా వుంటే నా గురుత్వానికి పావుటావు దాఖలుచేసి నా స్వంత జవాబుదారిమీదనే జవాబు చెపుతాను,

ఈ మధ్య వచ్చిన తామర తంపరలో బయటపడ్డట్టు యెంకి సువర్ణ యుగములోను పుట్టలేదు. లోహమండూరాల యుగములోనూ పుట్టలేదు; పాషాణ యుగములోను పుట్టలేదు. 20 వ శతాబ్దములో 1918 వ సంవత్సరములో తిరువళిక్కేణి శివరామన్ వీధిలో పుట్టింది; ఎనిమిదేండ్లు వచ్చి ఇప్పటికి వయస్య అయింది. కాబట్టే పెళ్ళి పేరాల కీచులాటలు జాస్తి అవుతున్నవి. అప్పటికే గ్రామ్య గ్రాంథిక వాదాల దుమారము కొట్టికొట్టి గురజాడ అప్పారాయ కవి శేఖరుల మృతితో కొంతవరకు శాంతించి పోయింది. అప్పటికే గురజాడ అప్పారాయ కవి శేఖరులు నవీన ఫక్కీని ముత్యాల సరాలను తేట తెలుగు మాటలలో కొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మగా గుచ్చి ఆంధ్రకవితా లలామ మెడలో అలంకరించి పోయినాడు. ఆయన పద్ధతినే అనుసరింతా మని నేనూ, నా మిత్రులు వింజమూరి రంగాచారి, అధికార్ల సూర్యనారాయణగార్లూ కొంత పెనుగులాడుతూ వుండేవాళ్ళము. మరొక పక్క నుంచి రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరు రామకృష్ణారావు, వేంకట పార్వతీశ్వరాది కవివరులు ప్రాచీనాధునాతన కవిత్వపథములకు రాకపోక లనువగుటకు వంతెనలు కట్టటం ప్రారంభించారు. ఇంకొక వైపు నుండి పూర్వ పండితులు వాల్మీకి రామాయణాలు, సంస్కృత పురాణాలు, నాటకాలు, ప్రబంధాలు శరపరంపరగా కురిపించారు. నాలుగో వేపునుండి పల్లూరి జగన్నాథరావుగారి కోడిపాటలు, గొల్లపాటలు, విస్కీ పాటలు, హుషారైనవి, చల్ మోహనరంగా పాటలూ సముద్రతరంగాల లాగున ముంచుకొనివచ్చి కాలేజి 'కారిడార్ల' నిండ బొబ్బరిల్లి పోతూ వుండేవి,

మనవాడికి జనవశీకరణము చేసుకొనగల సంగీత చాతుర్య ముండడము వల్లను, కాకీనాడలో కొంతకాలము విద్యాభ్యాసము చేసినందువల్లను, వల్లూరు జగన్నాథరాయాదుల పాటలను తోడి విద్యార్థులకు కాలేజి కారిడార్లలోను, సముద్రపు టొడ్డునా, ఇతరత్రాను పాడి వినిపించి వారి నానందింపచేసి వారి మెప్పు పొందుతూ వుండటం నిత్యకృత్యంగా వుండేది, సంగీతమా సద్యఃఫలము : పాటలా Ballads ఇక విద్యార్థులు పరవశులు కావడాని కభ్యంతర మేమిటి ? కాని పెంపుడు పిల్లలతో మా వాడికి తృప్తి కలుగలేదు. కావ్య సంతానము కనవలెనని సరదా ఆదుర్దా లెక్కువయినవి. అప్పుడప్పుడూ నా మీద చిరాకు కలిగినప్పుడు వ్రాసిన సూటిపోటిపద్యాలూ అధికార్ల కవితో కూడా పార్థసారధి మీద వ్రాసిన జంట పద్యాలూ మినహాయిస్తే "గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ" అన్నది మొట్టమొదట వ్రాసినది. దీని భావమేమో తిరుమలేశుడికే యెరుక, నాకు, మా అధికార కవికి ఒక రకంగా అర్థమైనది. ఇంకొక మిత్రుడికి ఈ మధ్య దీనిలోనే సరస్వతీ సాంత్వనము గోచరించింది, కాని అప్పటికి కవి కూడ దీని సంగతి సందర్భాలు గమనించినట్లు కనిపించలేదు. ఏదో కథ చెప్తూ వచ్చేవాడు. అప్పటికి యెంకికి నామరూపాలు యేర్పడలేదు. ఈ మధ్య పాటలన్నీ కలగాపులగపు సమన్వయంచేసి యెంకిని పతివ్రతనుగా చూపించటానికి ఈ పాటను సరస్వతీ సాంత్వనముగా అన్వయించటానికి చూచారుగాని అది అభూతకల్పన. పునాది లేని ఆకాశసౌధము. తరువాత వ్రాసినది నాయుడు బావపాటేనని నాకు జ్ఞాపకము. ఆ పాటలో

"సరుకు లేమి కావలె సంతన పిల్లా"
"నే నురుకుతార ఇంటికాసి నాయుడుబావా"

అనే చరణ ముండేది. అది నా కెంతో కర్ణకఠోరంగా వుండేది. కానీ అందరూ విని సెబాసంటూనే వుండే వాళ్ళు. కాని పోనుపోను ఆ చరణం మా వాడికి బాగుండలేదు కాబోలును. "నీవు మరమ మిడిసి మనసియ్యి నాయుడు బావా !"యని మార్చి కొంత సాధువు చేసినాడు. అప్పటికి కూడ యెంకికి నామకరణము కాలేదు.

యెంకి పేరు మొట్టమొదట "జాముకేతిరి యేళ" అను పాటలోనే కనిపించింది. అప్పటి రూపంలో ఆ పాట "వొయ్యారి నా గుండు నా యెంకే" అని తూరుపు కాపువాళ్ళ భాష కనురూపంగా ప్రయోగములు చేశాడు కవి. కాని ఆ శబ్ద ధ్వని బాగుండకపోవటంచేత "వొయ్యారమొలికించు నా యెంకి" అని దిద్ది విమర్శనమును కొంతవరకు మన్నించినందుకు సంతోషించవలసిందే. అదేమి కర్మమో గాని నాకీ పాట నాటినుండి నేటివరకు రుచించలేదు. పండిత ప్రకాండులు చాలామంది దీనిని మెచ్చుకొన్నారట. కాని ఇందు భావసౌందర్యమేమో నాకు గోచరించుట లేదు. చీకటిలో నుండి వచ్చిన పండితులకొక్కమారు కన్నులు మిరుమిట్లు గలిగినవో, లేక నా కందరాని నిగూఢసారస్యమిందేమైనా వున్నదో ! అటు తరువాత ఆ యేడే "యెంకి ముచ్చట్లు" "యెంకితో తిరుపతి" "యేటిదరి నా యెంకి" "యేడుంటివే యెంకి?" అనే పాటలుకూడా బయలుపడ్డవి.

ఈ పాటలను గూర్చి అప్పుడు నేను మా వాడికి చెప్పిన అభిప్రాయమే ఈ నాటికి కూడా స్థిరంగా నా మనసులో పాతుకొనిపోయింది. నేను ఈ యేలపాటల సుద్ధరింతామని బులపాటము పడ్డవాళ్ళలో వొకడినేగాని దీనికి గల ప్రధానమైన అభ్యంతర మేమిటంటే పాటకపు జనుల జీవితంలో లీనమైతేనే తప్ప సరియైన యేలపాటలు వ్రాయలేము. నా "నల్లసరుకులో నా జెములేదా" అనే పాట చాలామంది మెచ్చుకొన్నా నాకు దానిమీద అభిమానం తక్కువ. పాటక జనుల జీవితంలో లీనము కాకుండా పైపైన దేవులాడినంత మాత్రానే విశేష ప్రయోజనముండదు. అట్లా లీనమై పోవడానికి మనకు సిసలాం సంబంధమైన అహంకారము యావత్తూ పటాపంచలు కావలసి వుంటుంది. చేలో పనిపాటలు చేస్తూ వ్రాసిన రాబర్టుబరన్ (Robert Burn) యేల పాటలకు టెన్నిసన్ వ్రాసిన (Tennyson) North English Balladsకూ సారస్యమందునా, గాంభీర్యమందునా హస్తిమశకాంతరము గలదు. బరన్స్ పాటలు ప్రాణము కలవి; హృదయపుటను చాచుకొని వచ్చినవి; పుట్టురత్నాల వంటివి. టెన్నిసను వ్రాసిన నార్తు ఇంగ్లీషు బాలడ్సు జనుల మాట యాస, యధారూపముగా ప్రదర్శించుచున్నప్పటికీ జీవములేక, భావోద్వేగము లేక కృత్రిమరత్నములవలె

ఉన్నవి. ఇల్లెటూరి ప్రజల జీవితమునే కవితావస్తువుచేయ వలెనని పెనుగు లాడిన వర్డ్సువర్తు (Wordsworth) అంత వాడే, ఆ పద్ధతిలో సరియైన కవితాసృష్టి చేయలేక వారి జీవితములకు వ్యాఖ్యానము చేయడముతోడనే తృప్తి చెందినాడు. కవితాసృష్టి కవికి పరకాయప్రవేశశక్తి లేనిది అలవడదు. అట్టిశక్తి లేని కవిత వ్యాఖ్యాన ప్రాయముగానే ఉంటుంది. అందుకనే కవి స్వకీయభావములను వర్ణించుటయే వీలయిన కార్యము; నేలమీద సాము వంటిది. కవి స్వకీయ భావములను విసర్జించి ఇతర జనుల భావములను వెల్లడించ యత్నించడము నేలవిడిచి సాముచేయుటయు వంటిది. అట్టి సాము ఇంద్ర జాలికులుగాని చేయలేరు. ఈ సంగతులన్నీ గమనించే నేను మావాడితో "ఒరే, నీవీ పద్ధతి విడిచిపెట్టి నీ హృదయంలో వుండే భావాలనే వర్ణించటం మంచిది. లేకపోతే పాటక జనుల జీవితములో యింకా లోతుగా దిగి వాళ్ళలో ఒకడివైపోయి వాళ్ళ జీవితమును కావ్యములో సృష్టించవలె కాని ఊరికె పైపై శృంగారపు దేవులాటలతో తృప్తి బొందబోకు మని హితోపదేశము చేశాను. ఏవేళ హితోపదేశము చేశానో గాని అప్పటికి కాస్త గునిసినా తరువాత కొన్నాళ్ళు అటూ ఇటూయని కొట్టుకలాడి చిట్టచివరకు (Lyrical Ballads) సిద్ధాంతము లేవదీసి, పాటల సమర్థన ప్రారంభించాడు. Lyrical Ballads తత్వము Eurasian తత్వముతో సమాన ప్రతిపత్తి గలదే. పోనుపోను యెంకిపాటలలో వర్ణనము లైన విషయములు తన స్వకీయ జీవితానుభవములే ననీ, ఎంకి నాయుడుబావలు కేవలము కాపువాండ్రు కారనీ, తన Lyrical feelings స్వకీయ భావ పరంపరల ballad సాంప్రదాయమున కనుగుణముగా రచించుచుంటి ననీ, అందుకని తన పాటలు lyrics కాని ballads గాని గాక lyrical ballads అనునొక నవీన కావ్యధోరణి యని వాదించేవాడు. దానికి జవాబుగా "తమ్ముడా, నీ హృదయములోని నీ భావాలూ, నీ జీవితములోని అనుభవాలూ వర్ణించటానికి నీకు కాపువాళ్ళ భాష యెందుకురా! శుద్ధమైన గ్రాంథిక బాషలో గాని, అది నియమ శృంఖలాబద్ధమైన కారణం వల్ల ఉపయోగకరం కాకపోతే బ్రాహ్మణగ్రామ్యంలో గాని వ్రాయరాదా? బ్రాహ్మణ దంపతులు తమ శృంగార భావాలు కాపువాళ్ళ యాస మాంట

లతో వర్ణించటం అంత స్వారస్యంగా వుండకపోవటమే కాక Literary insincerityగా కూడ పరిణమిస్తుంది" అని నేను సమాధానం చెప్పినాను. ఆ సమాధానానికి అప్పుడు విరుగుడు సూచించ లేకపోయిన యీ మధ్య కాన్ఫరెన్సులూ, పత్రికలూ, కాన్సర్టులూ మొదలైన వాటివల్ల ప్రచార మెక్కువైనకొద్ది అసలు కాపువాళ్ళ భాషొక్కటే తెలుగనిన్నీ, మిగిలిన దంతా సంస్కృత సంబంధమైనందువల్ల తెలుగు గాదనీ అందుకనే స్వకీయ భావాలను అసలు తెలుగైన కాపువాళ్ళ తెలుగులో వ్రాస్తున్నాననే విపరీత వాదములోకి దిగి తీవ్ర విమర్శనకు గురి అవుతున్నాడు. భావానికీ భాషకూ అవినాభావసంబంధము. భాషభావానికి తొడుగూ కాదు. అలంకారమూ కాదు. భావమే భాష, భాషే భావము. అందుకని ఉత్తమ జాతుల భావములు ఉత్తమ జాతులలో వ్యవహారమందున్న భాషలో వెలువడవవి. కాని తదితర జాతులతో వ్యవహారమందున్న భాషలో వెలువడవు. తక్కువ జాతులవారు తమ భావములను ఉత్తమ జాతుల వ్యవహార భాషలో ప్రకటింపబోతే వెనుకటికి "పీట వడ్డించండి చెంబు వడ్డించండి" అని పలికిన పల్లెటూరి కాపువాని కథలా గవుతుంది. ఔచిత్యానికి కావ్యములో నిసర్గమైన స్థానమున్నది. ఔచిత్యము తప్పితే రసాభాసము తటస్థించి తీరుతుంది. కాబట్టి యే భావానికి తగిన భాష నాయాయట్లు వాడినవాడే సుకవి. అట్లు వాడని యెడల కవిత్వమునకు సాంకర్యదోషము వాటిల్లుతుంది. ఇక కాపు వాళ్ళ తెలుగే అసలైన తెలుగనీ తదితరులది గాదనీ అనటం కుతర్కం. అసలు కావ్య భాష వ్యవహార భాషను యథారూపముగా అనుకరించవలె ననటం సబబు గాదు. కావ్యానికి పరమావధి సృష్టి గాని సృష్టియొక్క అనుకరణంగాదు. కాబట్టి కవిబ్రహ్మ తాను సృష్టించు ప్రాంతాల స్వభావమున కనువయిన భాషనే ప్రయోగిస్తాడు. ప్రయోగిస్తాడేమిటి? అట్టి భాషలోనే ఆ సృష్టి బయటికి వస్తుంది. తిక్కన కవిబ్రహ్మ రచించిన మహాభారతమును అప్పలమ్మ యీస తెలుగులో వ్రాయటానికి సాధ్యమా? మానవ బుద్ధి కందినంతవరకూ సాధ్యము కాదు. తిక్కన వ్రాసిన తెలుగు తెలుగు కాదనగలమా? పిచ్చివాడుగాని అట్లనడు. తెలుగు గ్రంథమనేది యేదయినా వుందంటే తిక్కన భారతమే. అందులో కొంత సంస్కృతముకూడా చొప్పించలేదా తిక్కనంటే,

తెలుగులో ఆ భావాలు లేకపోవటం వల్లనే అసలు తెలుగు ఆ భావాలను చాలినంత శక్తిలో ప్రకటించలేని సిట్లనే తిక్కన సంస్కృతము శరణుజొచ్చి నాడు. తెలుగు తెలుగంటే యేమి ? అచ్చతెలుగే అయితే నూటికితొంబది మందికి పైగా తెలియనే తెలియదు లేకపోతే తత్సమభూయిష్టమైన సంస్కృత భాషా ప్రతిబింబమా ? అదే అయితే అసలు సంస్కృతమే చదువ వచ్చునే; యీ ప్రతి బింబాన్ని ఆశ్రయించటం ఎందుకు ? అది కాకపోతే కేవలం పామరులు, అనగా విద్యాగంధం యేమీలేని పాటకజనులు వాడే భాషా? అలాగంటే అపరిమితమైన, చిక్కు సంభవిస్తుంది. విజయనగరము, బొబ్బిలి ప్రాంతాల అప్పలమ్మ యాసకు, పల్నాటి సీమలోని పుల్లారెడ్డి యాసకు, హైద్రాబాదు ప్రాంతాల రామకోటిరెడ్డి యాసకు, బళ్ళారి ప్రాంతాల ఓబశెశప్పయాసకు, నెల్లూరు చిత్తూరు ప్రాంతాల చెంగన్న యాసకు యెంతో భేదము కలదు. ఇందు కుదాహరణాలు; చంద్రశేఖర శతకము, కలువాయి శతకము, భాషీయ దండకము, సారంగపాణి పద ములు మొదలైన వాటిలో వున్న గ్రామ్య భాషలు. వాటిని ఆ ప్రాంతాల నివాసుల సహాయం లేనిదే అర్థం చేసుకోవటం దుర్ఘటన. అప్పలమ్మ యాస తెలుగు గతి గూడా అంతే. కారణము యేమిటంటారా ? పాటక జనుల భావాలు పరిమిత వ్యాప్తి అతిశయించాలంటే విద్యావాసన యలవరచు కొన్న ఉన్నత జాతుల సాహచర్యమే ముఖ్యసాధనము. ఉన్నత జాతుల వారు సంస్కృత విద్యాభ్యాసం వల్ల భావ సంపద విశేషంగా సంపాదించి ఇతరులకు పంచిపెట్టుతూ వుంటారు. ఇట్టి నూతన భావలాంఛనాలైన పదములన్ని విద్యాగంధము లేని వాళ్ళ నోటబడి అపభ్రంశములైపోయి గుర్తింపరాని స్థితిలో వుంటవి. అంత యెందుకు? బ్రాహ్మణస్త్రీలు సంస్కృత శబ్దాలను ఎంత అపభ్రంశముగా వుచ్చరిస్తారో ! కారణం విద్యావాసన లేకపోవటమే. కాబట్టి ఈ అపభ్రంశాలే తెలుగుభాష యని గాని తెలుగు కవే జీవమని కాని వాదించటం తప్పు. కాబట్టే శిష్టజన వ్యవహారములోవున్న భాషమాత్రమే సామాన్యముగా కావ్యాలలో ప్రయోగార్హమని గిడుగు రామ మూర్తి పంతులుగారి వంటి గడ్డు గ్రామ్యవాదులు గూడా అంగీకరించవలసి వచ్చింది. శిష్టజన వ్యవహారములో నున్నంతవరకు నానుడిని ప్రాచీనకవులు

విసర్జించవలేదు. "రోసిరోసి గసని, ఘాటీ చూడని, రోళ్ళా రోకళ్ళా, తిత్తొల్చి", మొదలైన ప్రయోగాలెన్నో ప్రాచీనకవులు వాడి యీ విషయాని కొక మార్గం యేర్పరిచారు. అపభ్రంశమూ పాత్రౌచిత్యమూ ఒకే నేతలో వుండాలి. సగం సాలినేతా, సగం మాలనేతా వుంటే రససాంకర్యమూ, రసాభాసము తప్పవు. సామాన్యముగా తెలుగుభాషలో సిద్ధముగా వుండే భావాలకు జనులలో వ్యవహారంలో వుండే మాటలనే వాడవలెను. అట్టి మాటలకు ప్రసిద్ధి యెక్కువైన కారణమువల్ల రసపోషణ శక్తి ఎక్కువగా వుంటుంది. ఇక సంస్కృత సంబంధమైన మాటలను విద్యాగంధము గల కులీనులు యే ప్రకారముగా ఉచ్చరించి ప్రయోగిస్తారో ఆ ప్రకారమే ప్రయోగించటం మంచిది. కాబట్టి కేవలం కాపువాళ్ళ తెలుగు కానేరదని చూపించాను. ఇక గ్రామ్య మేది, అనే విషయము తేలవలసివుంది. చిన్నయ్య సూరి సూత్రాల ప్రకారం వ్రాసిందే గ్రాంథికభాష అనే వాదానికి ముసలి తనం వచ్చింది. కాబట్టి దానితో పెనుగులాడ నవసరంలేదు. ఇప్పుడు వాడుక భాష అంటే ఏమిటా అన్న మీమాంసే బలవత్తరముగా వుంది. ఇప్పటి వాడుక భాషాభిమానులు "వచ్చాయి, పోయాయి, కామాను, మూశాడు, నాకాసి" మొదలైన ప్రయోగాలతో కూడుకొన్న యాసతెలుగే వాడుక తెలుగనీ యే మాత్రము సలక్షణమైన ప్రయోగమున్నా అట్టి తెలుగు 'పాత గ్రాంథిక' తెలుగనీ అందుకని నవీన కవిత్వమున ప్రయోగార్హము గాదనీ, పట్టుపట్టి పండితులతో కొట్లాటలకు దిగుతున్నారు. పండితులు ఆత్మరక్షణ కోసమై "వాడుక భాషా వాదులు" భాషను తగులబెట్టి బూడిదచేసి తూరుపార బట్టుతున్నారని చెడతిట్టుతున్నారు. ఈ రెండు దుర్వాదాలకీ మధ్య వుంది అసలైన నిజము. అదే మంటారా వినండి! శబ్దములు ప్రసిద్ధంగా వున్నంత వరకూ అది వ్యవహారభాషే ననీ నా మతము. ఎక్కడిపాత నిఘంటువులలో నుంచి అనుదపు దీపము సహాయ్యముతో వెదికి వెదికి తెచ్చిన మూడు నూరాల మాటలు గల బూజుపట్టిన భాష గ్రాంథిక భాష కానేరదు. అది పనికిమాలిన నీరస భాష. అందుకని వ్యవహారమందున్న పదజాలముతో కూడుకొన్నదే గ్రాంథిక భాష కావలెను. అట్టిదే ఇంగ్లీషులో (Kings English) అంటారు. కాని ఆంధ్రసామ్రాజ్యము తాతలనాడే అంతరించి

పోయినందున అట్టి (**Kings Telugu**) మనకు సంక్రమించే అదృష్టము మాసి పోయింది. కాని రాజులూ రాజ్యాలు పోయినా విద్యమాత్రము మన్నులో గలిసిపోలేదు. మొత్తము మీద బ్రాహ్మణుల చలవవల్ల యే తాటాకు పుస్తకాల్లోనూ, యే దేవతార్చన పెట్టెల్లోనో, యేకుల్లాయి గుడ్డల మూటల్లోనో ఆంధ్ర విజ్ఞానము అంతరించకుండా పరంపరగా వస్తునేవుంది. అట్టి విజ్ఞానము గురుముఖతా నిన్న మొన్నటిదాకా మన పెద్దలు చదువుకుంటూనే వుండే వాళ్ళు. నేటికి మన అక్షరాభ్యాసం (**A, B, C, D**) లతో చేసే దుర్గతి వచ్చింది. కాబట్టి మన ప్రాచీన విజ్ఞానాన్ని చూస్తే హేళన, నిరాదరణ, తిరస్కారము కలుగుతున్నవి. న్యాయానికి మనకు అసలైన తెలుగు చదువుకొన్న శిష్టులు వ్యవహరించే తెలుగులోనే దొరుకుతున్నది. శిష్టులలో కూడా ప్రాంతీయమైన యాస యేదైనా వుంటే ఆ యాస తీసేస్తే మిగలేదే సరియైన వాడుక తెలుగు. అది పూర్ణముగా గ్రంథములలో ఉపయోగించదగినది.

ఇక శబ్దరూపాల సంగతి కొంచెము విచారించితే గాని వ్యవహారము కొనముట్టదు. శబ్దరూపాన్ని నిర్ణయించేవి పాత్రౌచితి, వృత్తరూపము, కావ్య రూపమునున్నూ. ఇద్దరు బ్రాహ్మణులు మాట్లాడుకొనే సందర్భములో," యేం బోయి యెంకడు మామా యేడ కెల్లొతుండావ్" అనటం అసభ్యం, రసాభాస మూను, అట్లే సంస్కారుల నోట వ్యాకరణ యుక్తములైన ప్రయోగాలు పలికించుటయును. ఇక సంస్కృత వృత్తరూపాలు వాడేటప్పట్ల వ్యాకరణ సిద్ధ ప్రయోగాలే యెక్కువగా పొందుతవి గాని యాసతెలుగు పొందదు. కాని కవితలలో జనవ్యవహారంలో వున్న శబ్దరూపాలే ఎక్కువగా ఒదిగి అంద మొప్పుతవి. ఇక కావ్యరూపము సర్వజనాదర పాత్రము కాదగిన శాస్త్రమో, పురాణమో, మహాకావ్యమో అయినప్పుడు అట్టి కావ్యగౌరవానికి వ్యాకరణ శుద్ధమైన రూపాలు సరిపోతవి గాని నేటి మనవాడుక తెలుగు రూపాలు పేలవమై పట్టిస్తవి. ఇవి అభిరుచికి సంబంధించిన విషయాలు గనుక రసజ్ఞులే వీని విలువను గ్రహించి నిర్ణయించగలరు. కవి తనయిచ్ఛవచ్చిన పాత్రను సృష్టించవచ్చును. తన ఇచ్ఛవచ్చిన వృత్తరూపముతో ఇచ్ఛవచ్చిన కావ్య రూపమును రచించవచ్చును. అంతవరకు కవి నిరంకుశుడే. కాని ఒకసారి యేపద్ధంథా యేర్పరుచుకొన్న తరువాత ఆ పంథా విడిచిపెట్టి చెడతిరుగుడు

తిరగరాదు. Hamlet లో Shakespeare "There seems to be a method even in madnes" అని చెప్పినట్టుగా వెఱ్ఱివెంగళాయికు కూడా వేదాంత ధోరణి ప్రత్యేకమైనది వున్నదని అందుకనే "అన్న మైతే నేమిరా, సున్న మైతే నేమిరా" అన్న పిచ్చివాడు పాడు పొట్టకు అన్నమే వేతా మంటాడు గాని సున్నమే వేతా మని సుతరామూ అనడుగదా. కాబట్టి కవి తన యిచ్ఛ వచ్చిన కావ్యగ్రంథా యేర్పరచుకొని ప్రసిద్ధమైన శబ్దజాలమును ప్రయోగిస్తున్నంత వరకూ, నీతికి నిలబడినంత వరకూ అతను వ దేభాష గ్రాంథిక భాషే. వ్యాకరణయుక్తమైనా సరే కాకపోయినాసరే గ్రాంధిక భాషే. ఈ రీతిగానే కవితానేర్పరచుకొన్న కావ్యగ్రంథను ప్రసిద్ధములై వ్యాకరణ యుక్తములైన ప్రయోగాల ద్వారా అనుసరిస్తుంటే అది కూడా వాడుక భాషే. వ్యాకరణ యుక్తమైనంత మాత్రాన పానబూజు తెలుగు కాలేదు. నవీన కవి కంఠీరవులకు ప్రయోగాన్వమును కాలేదు. కాబట్టి ఈ సంగతి తెలిసిన వాళ్ళకు అంగుళము అంగుళానికి అగపై తొమ్మిది వ్యాకరణ దోషాలు వెదికే పండితుల శుష్కవాదాలు, గడ్డిపరకకు తుది మొదలెరుగని వాళ్ళు సైతము "కోవిధిః కోనిషేధః; నిరంకుశాః కవయః" అనే పెద్దపెద్ద వాక్యాలు పట్టుకొని ప్రజ్ఞలకై పెనుగులాడే నవీనకవుల అరాచకమూ, అపమార్గము ననుసరించటం వల్లనే వృద్ధిపొంది వాఙ్మయ వినాశకరము లౌతున్నవని సహృదయులు గ్రహింపకపోరు. నిజంగా ఆలోచించి చూస్తే గ్రాంథిక భాషా, వాడుక భాషా రెండూ వకటే. వాటికి వైరుధ్యము లేదు. ఎవళ్ళ బంజాలు వాళప్పుడుకొని నమ తమ గొప్పలు చెప్పుకోవటానికే కొట్లాట చేస్తున్నారు గాని రసిక దృష్టితో విమర్శించేవారికి పాత్రౌచితి, వృత్తౌచితి, కావ్యౌచితి, తప్పనంత వరకూ, ప్రయోగాలు ప్రసిద్ధములైనంత వరకూ వ్యాకరణ యుక్తమైన తెలుగుకూ, శిష్టజన వ్యవహారములో వుండే తెలుగుకూ తారతమ్యము గాని, విరోధము గాని ఎంత మాత్రమూ లేదని స్పష్టమౌతుంది.

కాబట్టి పై విషయాలననుసరించి "యెంకి" ఎవతో, దాని కుల గోత్రాందు లెట్టివో, దాని గుణగణాలెట్టివో, దాని సరససల్లాపాలు ప్రణయ గాథలు ఎంతవరకు రసౌచిత్యముగా వర్ణింపబడినవో, విమర్శించ

దలచినాను. సాధ్యమైనంత వరకు నిష్పక్షపాతముగానే విమర్శించటానికి ప్రయత్నిస్తాను.

మొట్టమొదట "యెంకి" కులగోత్రాలు విచారించవలసి వున్నది. ఎంకి కాపు పడుచనీ, నాయుడుబావను పెళ్ళాడిందనీ, వాళ్ళకి వ్యవసాయమే వృత్తి అనీ, వారి విచిత్ర దాంపత్య కథా కల్పనమే యెంకి పాటలలోని కావ్యవస్తువనీ, అసహాయోద్యమ వ్యవసాయులైన Non-Cooperative agriculturist దశిక సూర్యప్రకాశరావుగారు స్వర్ణాక్షరాలతో వ్యాసం వ్రాసి ఖ్యాతికి సమర్పించారు. ఆంధ్ర కార్లైల్ (Carlyle), ఆంధ్ర రస్కిన్ (Ruskin), ఆంధ్ర విజ్ఞాన (Encyclopaedia) పురాణ కర్తలు పురాణం సూర్యనారాయణ నిఖిల పురాణ వేదాంత వ్యాఖ్యాన వైఖరీ సమేత వాద ప్రతివాద తీవ్రంగా పరామర్శ చేసి యెంకి నాయుడుబావలు దేవతలని యెంకి పాటలు వైష్ణవ మత బోధన గీతాలనీ, వేదాలూ, ఉపనిషత్తులూ, బ్రహ్మసూత్రాలూ, ఓమర్ ఖయ్యాం, బజానువం కోరంకి పాటలు మొదలైన పాటన్నింటినీ ఎంకి పాటలతో బంధ సమన్వయంచేసి భూమ్యాకాశాలు కప్పేటట్లు తాండవం మొదలుపెట్టినారు.

ఇక పూర్వాచార పరాయణులైన పోస్ట్ మాస్టర్ గారు యెంకి నాయుడుబావలు సంకర దంపతులనీ, నాయుడుబావ మాత్రము పండితుడైనా భ్రమసి నీచభాషలో తన శృంగార సల్లాపాలు సాగిస్తూ భ్రష్టుడైనాడని, ఇట్టి శృంగార మసభ్యమనీ, అవినీతి కరమనీ, ఆంధ్ర భాషా ద్రోహమనీ "లపి గ్రావారోదితీ"ని మించారు. నాలుగో పేష్ నుండి ఆదినారాయణశాస్త్రి గారు ఎంకి నాయుడు బావలు సాక్షాత్ శృంగార రసాధిష్టాన దేవతలగు రతీ మన్మథులేననీ; శృంగార యొక్క యెంకి నాయుడు బావలు ముట్టిచూచినారని కళాస్థానాదుల లక్షణాల సార్థ ల్యంగాచేసి ఘంటాపథంగా మారుమోగించారు. ఉద్ధృతికి నుండి మరి

ప్రశంసలో విశదంగా విమర్శిస్తాను. మొట్టమొదట యెంకిని కాపుదాన్నిగానే వర్ణించాడు. నాయుడుబావ యెంకికి మగడా కాడా యన్న సంగతి యెంకి గుణగణాల ప్రశంసలో చెబుతాను. ఇప్పటికి వారు మొట్టమొదట భార్యాభర్తలుగా సంకల్పింపబడలేదనీ సూచించి అనంతర కథాక్రమం ఎత్తుకొంటాను. కొన్నాళ్ళు పోయేసరికి ఆంధ్ర కావ్య జగత్తులో అభిరుచులు మారజొచ్చినవి. ఎవరి ప్రియురాండ్రను గూర్చి వారు అన్యాపదేశంగా మారు పేర్లతో పద్యాలు పాటలు వ్రాయటం, స్వకీయ ప్రణయోదంతాలు గనపంపంగా వర్ణించటం బాగా ఆచారం అయిపోయింది. దానితో మావాడికి అల్లాంటి సరదాయే కలిగింది, "ఎంకిసూపు" "ఎంకి యసం" అనే పాటలతో ప్రారంభమయిన ఈ పద్ధతి నేటి వరకూ కవి పట్టుకొని వస్తూనే వున్నాడు. అందుకనే ఇటీవల రచించిన పాటలు కాపుపడుచు గాదకన్న కులీనయైన "ఉత్తమా యిల్లాలి" నుద్దేశించి వ్రాసినట్లుగానే కనిపిస్తున్నవి. అయితే యీ కులీన పేరు గాడా ఎంకి అనే ఎందుకు పెట్టినాడయ్యా కవి అనే ప్రశ్న కలుగుతుంది. అందులోనే వుంది గోసాయిచిట్కా, యెంకి పేరు కొన్నాళ్ళు జనంలో అల్లుకు పోయింది. బాగానే విద్యార్థులు మొదలైన సహృదయులను ఆకర్షించింది. పోనీ ఆ పేరే వుండనీ అనుకొని ఆ పేరుతోనే పాటలు యథాప్రకారంగానే తూరుపు కాపువాళ్ళ యీసలోనే వ్రాయటం సాగించాడు. "What is in a name?" అనలేదా Shakespeare? అయితే మా నాగేశ్వరరావు పంతులుగారినే ఇప్పుడు అమృతాంజనం పేరు తీసివేసి ఆ మందునే ఇంకో పేరుతో అంపి విరివిగా అమ్మకం చేయుమనండి. ఎన్నటికీ చేయరు. ఎందుకనీ ? అది business secret. ఒక పేరులో వున్న అదృష్టరేఖ మరొక పేరులో వుండదు. Poetical business లోను అంతే! ఎంకి పేరుకుండే theatrical glamOur మరో పేరు కుంటుందా ? అందులో ballad ప్రపంచంలో శకాలు మారుతూ వుంటవి. వీధి భాగవతాల్లో కేతిగాడు బంగారక్కలది సామ్రాజ్యం. యేలపాటల్లో కొన్నాళ్ళు, మేనత్త మేనల్లుళ్ళు చంద్రమ్మ వెంకయ్యలదీ. కొన్నాళ్ళు నారాయణమ్మ బంగారుసామలదీ, కొన్నాళ్ళు అప్పనాతనామనాలది. మావాడి Lyrical Ballads ప్రపంచంలో యెంకి నాయుడుబావలది సామ్రాజ్యం. ఒక్క పెట్టున సామ్రాజ్యం వదలటం సామాన్యుల తరమా ? అందుకనే ఆ పేరు మార్చటానికి తగినంత చురుకు

గాని, సాహసంగాని, అవసరంగాని కలగనందున Statusque నిలువుదామని ఆ పేరు వుంచేశాడు. కాని ఆ యెంకికీ క్రొత్త యెంకికీ చాల భేదం వున్నది. అది రసికులు పరిశీలించకపోరు. పరిశీలించి కూడా ఏమో ఇద్దరూ స్త్రీజాతిలో చేరిన వాళ్ళుకదా ఫరవాలేదని సరిపుచ్చుకుంటే వాదే లేదు. సరిపుచ్చుకో లేనివాళ్ళకే ఈ రొట్టెకాడ కిచకిచలన్నీ, అయితే కులీన నాయికానాయకులు హీనగ్రామ్యములో శృంగార సల్లాపాలు చేస్తూవుంటే ఎబ్బెట్టుగా వుండదా ? తప్పకుండా వుంటుంది. అందువల్లనే భాషలో గూడా మిశ్రమము వుంది. పొక్కులూరు లక్ష్మీనారాయణగారి వాదంలో ఇంతవరకు సత్యము వుంది. కాని ఆ సత్యమే వారు కొంచెము పరుషముగా చెప్పటంవల్ల ప్రతివాది భయంకరుల విద్యుశ్శాపాలకూ, వచన శాపాలకూ గురికావలసి వచ్చింది. యెంకి నాయుడుబావలు అనేక స్థలాలలో వ్యాకరణయుక్తమైన ప్రయోగాలూ చేస్తుంటారు. ఒలికించు, అనిపించు, తిట్టు, అంటి, సుకములు, దూరాన నారాజు కేరాయి డానో ! యీరోజు నారాతి లేరాలపాలో, ఈసుడు, వత్తును, పదములు ఇసి౽ె, నేలాగు, పలికి, మొదలైన వ్యాకరణయుక్తమైన ప్రయోగాలు కేవలపు కాపు దంపతుల నోట సామాన్యముగా వస్తవని నేనూహించలేను. కాపువాళ్ళు వ్యాకరణ ప్రయోగాలతో మాట్లాడితే పూర్వపు ప్రబంధ కవులు సమాస భూయిష్ఠమైన సంస్కృత జటిలాంధ్రములో కవిత్వం వ్రాసారంటే తప్పేమిటి ? గ్రాంధిక భాషావాదుల దోషమేమిటి ? 'అల్లె' ఉపమానార్థంలో తూర్పుకాపులలో తక్కువగా ప్రయోగింపబడుతుంది లాఅనేశబ్దమే ఎక్కువవాడుకలో వుంటుందీసందర్భంలో, రకరకాల వాడుక భాషాపదములుమిశ్రమముచేయబడివున్నవి మొత్తముమీద తూర్పుకాపువాళ్ళ యాసే యెక్కువగావున్నది. కానీపాటలలోవున్నభావాలు, అందులోఈమధ్య మానాడు వ్రాసినపాటలలో ఉన్నభావాలు చాలా సున్నితములుగానుసంస్కారులకే సహజనులుగాను ఉన్నవి. అందుకనే ఈ మధ్య వ్రాసిన పాటలలోని యాసను పూర్తిగా మార్చివేసి ఉన్నదున్నట్లుగా గ్రాంధికంగా వ్రాసినా యేమీ అర్థ భేదం కాని రసభేదం కాని కలుగడములేదు. దానినిబట్టి ఈ మధ్యవ్రాసిన పాటలలోని తూరుపుకు తెలుగుక చాలినంత inevitability లేదనీ అది కృతక భాష యని, ప్రజారంజనకోసం అవలంబింప బడింది దనీ స్పష్టమవుతుంది. ఈ విషయములో వారి అన్నగారున్నూ, కృతిభర్తయున్నూ

బావలు భార్యాభర్తలని నే నంగీకరింపను. "గుండె గొంతుకలోన కొట్లాడు తాది" అన్న పాటలో నాయికను నాయకుడు విటకాడులాగున అనుసరిస్తున్నట్లున్నదే కాని కుపితయైన భార్యను భర్త అనునయిస్తున్నట్లు లేదు. వంకర చూపులు, కన్ను గిలిగింతలు, బులిపింతలు, యిలుదాటి పోవటాలు, ఇసిగి కొట్టటాలు, అగ్గిమాడటాలు సంసార స్త్రీలకు ఉచితములైన లక్షణాలు కావు. మందో మాకో యెట్టి మరిగించిందనే అనుమానము సామాన్యముగా భార్యలపట్లగాక ఉంపుడుకత్తెలూ, వ్యభిచారిణులూ మొదలైన వారి పట్లనే కలుగుతుంది. ఈ అనుమానము "వాన లచ్చిమి" అనే పాటలో మరంత బలమౌతున్నది. నిజమైన సంసార స్త్రీయే అయితే చేలో పనిపాటలు చేయటానికి పోయి రాత్రి అక్కడే పరుండనెంచిన భర్తతో రతిసౌఖ్య మనుభవించటానికి 'జాము రేతిరి యేళ జడుపు గిడుపూ మాని సెట్టు పుట్టా దాటి' రావలసిన మేమిటి? యెంకి నాయుడుబావల నివాసము చేలోనేనా లేకపోతే ఇల్లూ వాకిలి వుందా? యెంకి ఎక్కడ నుంచి వస్తున్నది? రాత్రివేళ వొంటరిగా రావలసిన మేమిటి? శృంగార వాసన యేమాత్రమున్నా యెంకి అభిసారిక అనే భావము ఈ పాటలో తప్పక స్ఫురింపక మానదు, సంసార స్త్రీ అయితే నిత్యమూ భర్తతో సుఖము ననుభవించే వీలుకలదిగదా! చంద్రుణ్ని సూర్యుణ్ని పెట్టవలసిన అవసర మేమిటి? నీలిచీర నీటుగా కట్టడం అప్పటికే ఆచారమై పోయింది. దానికేం లెండి. తెల్లవారింది మొదలు రాత్రి వరకూ ఒకరి మొగ మింకొకరు చూచుకొనే భార్యాభర్తలకేనా అంతకాలుకదపలేక పోవటాలూ, కొంగ సర్దె పోవటాలూ, "నిన్న కులికి నీళ్ళకుండ మీద బడ్డాను మొన్న కులికి మొగుడు మీద బడ్డాను; నిత్యం కులికేవాళ్ళు ఎట్లా కులుకుతారోనే పాపమ్మా" అన్నదాని మౌగ్ధ్యములాగున్నది మన యెంకిమౌగ్ధ్యము యెంకి పరకీయయే యనీ అభిసారికే అని తెలుసుకోటానికి రెండు పాటలే చాలినా ఇంకా మిగిలిన పాటల్లో కూడా చూపిస్తాను బలవత్తరమైన నిదర్శనాలు. "ఎంకి వచ్చె" ట్టనే పాట చిత్తగించ దగును. "దొడ్డితోవ కల్లె తొంగి సూడంగానె తోటకాడే వుండు తొరగొస్త నంటాది"; "కోడి కూసేతలికి కొంప సెల్లాలి నీ కోసమే చెపుతాను కొంప మొద్దంటాది"! "ఎంత సేపున్నాను యిడిసి పెట్టాలేవు సిగువోళ్ళలో మనకి తలవంపు లంటాది" ఇవి సంసార

స్త్రీ భర్తతో అనే సల్లాపాలేనా ; కోపం కల్గా ఉంటుందే ; ఎవడి కోపకు? తగువోళ్ళలో తలవంపులెందుకనో? పోనీ "రావోద్దొ" అన్న పాటచిత్తగించండి! భార్యాభర్తలే అయితే అడువుల్లోను; గిట్లలోను, పుట్టలెక్కి. వళ్ళిదుకొని ఒకరినొకరు అనుసరించవలసిన పని ఏమీ లేదే: అందులో నేలో సుఖముగా కాపురము చేస్తూ వున్న కాపుదంపతుల జీవితానికి అది అసహజమే; అందులో మరి నాయకుడే అనుసరిస్తున్నాడంటే నాయిక పరారీ అయిపోయినదన్న సంశయము కూడా కలుగుతుందే? నాయకుడు నాయికకు కల్లకపటము నారోపిస్తున్నాడే! ఏం చేస్తున్నదో నాయిక అని ఈశ్వరుణ్ని అడుగవలసిన అవస్థకు నాయకుడు పాలుపడ్డాడంటే ఇదంతా దాంపత్యక్రమము, తత్రాపి కాపువాండ్ర దాంపత్యక్రమం, స్వర్ణయుగపు దాంపత్యక్రమము, అనటానికి ఆధారము అత్యల్పాల్పముకదా ! "కటిగ్గుండెల నాయెంకి" అనే పాటలో అనుకూలుడైన నాయకుడు పట్టులాగు కోట్టడుతూ నాయిక క్షేమానికై దేవుడికి దణ్ణాలు పెడుతూ వుంటే నాయిక ఇరుగమ్మలక్కలతో యిక సక్కెములాడటం, వొన్నె చీరెలు గట్టి వోసుగా తిరగటం, అమ్మలక్కల తోటిసెమ్మ సెకాడటం, చీకుచింతా లేక పోకిల్లై పండుకోవటం నాయికా నాయకుల దాంపత్యానుకూల్యమును పోషిస్తున్నదా? యెంకి కోపాలు వచ్చినప్పుడల్లా ఏ దేశమో లేచిపోతూ వుంటే నాయకుడు వెదుకుస్తూ నిలలో బాన్ని దర్శించి సంతృప్తి గనటమా? పింగబాలస్యమే!

పై పాటలలో వర్ణింపబడిన నాయికకు నాయకుడు కావలసినే వుండి అతని మాటే వింటూ, ఆతడు మగమ మిడిసి మసిస్తే చాలు అనుదు సిద్ధాక సల్లగుంటే సాలు, అతని నీడలోనే మేడకట్టి కాపురం చేయవలెనని సంకల్పించుకొన్న సత్తెకాలపు యెంకికీ ఎంత తేడా వున్నది? ఈ యెంకి గృహిణి; అందుకనే నాయకుని వియోగము సహించలేదు. నాయకుడు అన్నరోజుకు రాక మాట తప్పినప్పుడే నీళ్ళు తెచ్చేటప్పుడూ, అద్దములో చూస్తున్నప్పుడూ, చల్లని వెన్నెల్లో చాపేసి కూర్చున్నప్పుడు, నాయకుడు తనవద్దనే వున్నట్లు భావించి వికారము పొందుతుంది. భర్త్ర సీత్తైన వాండు సమ్మి నన భాగధేయము ఎట్లాగుంటుందో అని పరిపరి విధాలా విచారం చేస్తూ వుంటుంది. ఏటి నురగల చూసి నాయకుడు అనుకూలుడే అనుకుంటుంది. చంద్రవంక పోగానే నాయకుడు తిరిగి వస్తాడనుకుంటుంది. ఈ యెంకే దూరాన వనరాజు

కేరాయి డౌనో ఈ రోజు తనరాత లేరాల పాలో అని గుబులు బిగులు పడు తుంది. చీమ చిటుక్కు మన్నా, ఆవు లంబా యన్నా, తులిసెమ్మ వొరిగినా, తొలిపూస పెరిగినా యేదో భయపడి భర్త క్షేమముగూర్చి భయపడే ఉత్తమ యిల్లాలు: అందుకనే చాటునుండి భర్త క్షేమలాభాలు విచారిస్తుంటుంది. కాని సభల్లో కెక్కటానికి జంకుతుంది. ముందువెనక జన్మల సంగతులు నాయకుడు జ్ఞప్తికి తెస్తే సిగ్గుపడటం, తెల్లతెలపోవటం, కంటనీరెట్టటం ఈ యెంకి అమాయకత్వాన్ని తెలియచేస్తున్నవి. ఎప్పుడూ నాయకుని గురించే తలపోత. ఈ యెంకికి చుక్కతోనే కొండ లెక్కొత్తున్న నాయకుడికోసమై ఉత్కంఠతతో ఎదురుచూస్తుంటుంది. ఈ యెంకికే చంకలో నెక్కి సంబ్రాలుపడే పిల్లోడు పుట్టింది. ఈ యెంకినే కొద్దిలో వరహాల కొడుకు నెత్తే వని నాయకుడు మాగుపేసముతో ఆశీర్వదించింది. ఈ యెంకితోనే తిరపతి, భద్రాది మొదలైన తీర్థాలు నాయకుడు సేవించింది. ఈ యెంకీ ఆ యెంకీ ఒకటి అనటము కుక్కను గోవనటము. నక్కను సామజ మనటము వంటిది అవుతుంది. ఈ యెంకి "ఇయం గేహే లక్ష్మీ రియ మమృత వర్తి ర్నయనయోః" అన్న భవభూతి వాక్యానికి ప్రమాణముగా ఉన్నదగిన యిల్లాలు. మొదటి యెంకి పడుచుగనపు చాపల్యానికి వశుడైన నాయకుని విసికించి ఉసురోసుకొన్న అభిసారిక. ఏ యెంకి సొంపు ఆ యెంకిదే అని నేను అంగీకరిస్తాను. కాని ఇద్దరూ ఒక యెంకే నని అంగీకరించను, ఇద్దరు యెంకు లుద్భవించటానికి కారణము పైనే మనవిచేసాను. మొదటి యెంకి అసలు తూరుపు కాపువాళ్ళ యెంకి, రెండవ యెంకి పేరుకు మాత్రమే యెంకి. నిజానికి కెవరో రసికు లూహించుకోవలసి వుంటారు. మొదటి యెంకినోట తూరుపుకాపువాళ్ళ యాసతెలుగొప్పింది గాని రెండవ యెంకి (యిల్లాలెంకి అంటా నీ రెండవ యెంకిని) నోట బాగా ఒప్పలేదు. ఇల్లా లెంకికి చాలేలా మాలేలా? చిన్నతన మేలా సిగ్గేలా? తనస్వంత భాషలోనే ఔచిత్యమైన ఫణితిలోనే మాట్లాడవచ్చునే! ఈ విషయములో కవి బుద్ధిపూర్వకమైన theatrial glamour కాశపడి యిల్లాలెంకికి అన్యాయం చేశాడు. లేక యిల్లాలెంకికి ఘోషా యేమైనా కల్పించే వుద్దేశంతో ఈ కృత్రిమ నామరూపాలు తాకించి మరుగుపరచ బూనాడా యేమో! కవి ఇద్దరు యెంకులను తాను నాయికలనుగా వర్ణించి

రూపాలతో నిజవేష భాషాదులతో యథేష్టముగా తెల్లవాడి బావుటా యెగురుతున్నంతవరకూ తిరగవచ్చునే ; భయ మెందుకు ? "Come out and" "bask in the open sunshine of God's love" "Truth is beauty, beauty truth, that is all ye know and need to know on eaith" "సత్య మేవ జయతే నానృతం" ఇల్లా లెంకి నాయుడుబావలు పుత్రపౌత్రాభివృద్ధి గాంచి, ఆయురారోగ్యవంతులై వర్ధిల్లెదరుగాక.

ఎంకి పాటల వృత్త ధోరణిని గూర్చి ఒకటి రెండు మాటలు చెప్ప వలసివున్నది. పాటలలో చాలా భాగము ద్విపదమాత్రకగాను వునాదిగాను కలిగిన ఛందోరీతులలో రచింపబడినది. సామాన్యపు యేలపాటలు గానధోరణి కాదు; యెంకి పాటల గానధోరణి. ఇందు సంగీత చాతుర్య మెక్కువున్నది, విజాతీయమైన గానధోరణి కూడా చాలా వున్నది. పామరులైన కాపువాళ్ళ పాటల ధోరణి కాక రాగాలాపన మొదలైన సంగీతపు తళుకులతో కూడు కున్న గానఫణితి. ఈ విషయము కవి తన పాటలు పాడుతూ వుండగా విన్న వాళ్ళకు సుస్పష్టము. యెంకి పాటల గానరీతులలో చాల సౌకుమార్య మున్నది. కాని అప్పుడప్పుడు కొద్దిగా కాపువాళ్ళ మోటుతనం కనపడీ కనపడకుండా వుండేటట్లు పాడుతాడు. మా యెంకి పాటల కర్త. యెంకి పాటలు కేవలము ఆకాశం నుండి ఊడిపడ్డవనీ అపూర్వములనీ నేను అంగీక రించకపోయినా ఈ కాలములో బయలు వెడలుతున్న డొంక తిరుగుడు కవిత్వాలకన్నా చాలా సరసంగా వున్నవి. పూర్వపు గానఫణితులే కాలాను గుణమైన మార్పు జెంది యీ రూపంగా వస్తున్నవని. వీటివల్ల ఉత్తరోత్తరా భాషకు మేలే కలుగుతుందని నా నమ్మకము. తాత్కాలికపు ఉద్రేకాలవల్ల వింత సమర్థనాలు వింత ఖండనాలు బయలుదేరుతున్నా నిలిచేవి పాటలేగాని విమర్శనాలు కావు. విమర్శనాలలో వుండే వైపరీత్యాలు చూపించి యెంత వరకు గుణమో నిరూపించటమే ఈ వ్యాసకర్త యొక్క సంకల్పము. అది యెంతవరకు నెరవేరిందో రసికులే నిర్ణయించగలరు. అభిసారి కయిన తూరుపువాళ్ళ యెంకికి నాకూ యేమీ విరోధాలు కాని వైమనస్యాలూ లేవు కాని దాని నిజస్వరూపం రసికులకు వ్యక్తంచేసి ఇల్లా లెంకి యొక్క

గుణగణాలు ఇనుమిక్కిలిగా ప్రదర్శించటమే నా ఆశయము. ఈ పాటలలో మిత్రులూ, సహృదయులూ, విమర్శకులూ మొదలైనవారు సూచించి కావించిన మార్పు లెన్నో వున్నవి. వాటిని గూర్చి వ్రాయుటం కొంతవరకు **Breach of trust** అని వదలివేసినాను. వయస్సులో కాస్త పెద్దవాడిని గనుక మా వాడి పట్ల చిరంజీవి శబ్దమును ఏకవచనమును ఉపయోగించాను. అది వాడికే శుభకరము. ఇక వ్యాసములో నామిత్రులలో కొందరి వాక్యాలు విమర్శించే పట్ల కొంత చనువుగా వ్రాశాను. అందుకు నా మిత్రులు కినియక **sporting spirit** లో వాటిని అంగీకరింతురుగాక అని ప్రార్థన. పెద్దలయిన వారి వాక్యముల విమర్శించు పట్ల కూడా చమత్కారమే అగ్రించినానుగాని అపహాస్యము కాదని మనవి. ఇల్లాలెంకి పాటలు సవదలి. నిజమునకు మూల రూపముతో వెలువడవలెను. అల్లా వెలువడకపోతే అభినవ తెనాలి రామలింగడు "నాజూకు లేదయా నందూరి సుబ్బయా" అని గేలిచేస్తాడు.

—ఆంధ్రపత్రిక
సంవత్సరాది సంచిక
అక్షయ — 1926 సం. మార్చి నెల 15 వ తేదీ.

# నేటి తెలుగు కవిత : కొత్త పోకడలు

—శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

౧

రష్యన్ వైమానికుల నిర్విరామ గమనం, పిక్కార్డ్ మహాకాశ యాత్ర, ఐన్‌స్టైన్ రెలెటివిటీ సిద్ధాంతం, ఫ్రాయిడ్ మనస్తత్వ పరిశోధనలు గాంధి అహింస, స్పెయిన్‌లో, చీనాలో స్వాతంత్ర్య సమరం— ఆధునిక జీవితం ఎన్ని దిక్కుల నుండి ముసురుకొని వస్తున్నది! నీ మెదడు కేంద్రంగా వివిధ పరిధులలో విస్తరిల్లిన సుడులు కావూ ఇవి? నీటిలో విసరిన రాయి చుట్టూ వలయాలుగా బయలుదేరే కెరటాలు. ఇదే ఆవర్తం (Vortex). శిల్పంలో ఇటువంటి సుడిగుండాలను స్ఫురింప జెయ్యడమే ఆవర్తనాదం (Vorticism).

కళాప్రపంచంలో ఇటువంటి విప్లవాన్నే ఇటలీనుండి సీనార్ మారినెట్టి (Signor F. T. Marinetti), భావికళ (Futurism) అనే పేరుతో బోధించాడు. అవి యూరప్‌లో మహాసంగ్రామం తీవ్రంగా సాగుతున్న రోజులు. దేశదేశాల మధ్య చెలరేగిన ద్వేషాగ్నికి పవిత్రమైన వస్తు వేదీ కనిపించలేదు. గ్రంథాలయాలు, వైద్యశాలలు, విజ్ఞానపరిశోధనాలయాలు, చిత్ర వస్తు శాలలు, మానవ నాగరికతా చిహ్నాలన్నీ ఈ దావానలంలో దగ్ధపటలం అయి పోతున్నవి మారినెట్టి సాహిత్యాన్ని నాశనం చెయ్యడానికి నిశ్చయించాడు. ఈ శిథిలాల నుండి నూతన శిల్పం బయలు దేరుతుం దనీ, అదే భావికళ (Futurist art) అనీ ఉద్ఘాటించాడు. ఇత డా దినాలలో ప్రకటించిన కరపత్రాలు, చేసిన ఉపన్యాసాలు లెక్కకు మిక్కిలిగా ఉంటాయి. ఐతిహాసికులను, ప్రేమగీత రచయితలను, విశ్వవిద్యాలయ పండితులను, విమర్శకులను, వ్యాకరణాలను, నిఘంటువులను, నాటక శాలలను, శిల్పాలయాలను నిర్మూలించ మన్నాడు. లెంపకాయలను, పిల్లిమొగ్గలను ప్రశంసించాడు. నూతన

సృష్టి చెయ్యడానికి నూతన విధానం కావాలి. యంత్రాల నుండి, చలన చిత్రాల నుండి, వార్తా పత్రికల శీర్షికల నుండి, కావ్యవస్తువులను స్వీకరించ మన్నాడు. ధ్వనులే సంగీతం, మాటలే కవిత్వం, రంగులే శిల్పచిత్రాలు అన్నాడు. ఇతడు వ్రాసిన "ట్రిపోలీ యుద్ధం" కేవలం ధ్వన్యనుకరణలలో నిండి ఉంటుంది.

ఈ సమయంలోనే ఫ్రాన్సులో క్యూబిజం (Cubism), జర్మనీలో ఎక్స్ప్రెషనిజం (Expressionism), అమెరికాలో ఇమేజిజం (Imagism) బయలుదేరాయి. భూగోళం మూల మూలల నుండి ఉద్యమాలు, కార్యక్రమాలు, ప్రయోగాలు చెలరేగినవి. మోటర్ కారు, గ్రామఫోను, సినీమా, రేడియో, వాయువిమానం వంటి నవీన యంత్రాల యుగం - క్యూబిజం, ఫ్యూచరిజం, ఎక్స్ప్రెషనిజం వంటి ఉద్యమాలను ప్రసవించింది.

అనేక విధాల క్షణక్షణ పరిణామం పొందుతున్న ప్రపంచానికి కళాశాలురే పురోగమాలు. వీరి దూరదృష్టిలో ప్రజ్వరిల్లిన ఆదర్శలోకమే కాల క్రమాన భౌతిక లోకంలో రూపు కడుతుంది, నిజమైన తిరుగుబాటు కళా ప్రపంచంలోనే వస్తుంది. రాజకీయవాదులు తర్వాత వీటినే ప్రచారం చేసి నూతనరాజ్యం స్థాపించా మంటారు.

సంప్రదాయాలను ధ్వంస చేయడం కళాశాలికొక క్రీడ కాదు. ఎంతో అవసరం కలిగింది, వీటి వినాశనం వల్లనే లోకాన్ని ముందుకు తీసుకువెళ్ళ వలసి ఉంటుం దన్నప్పుడే అత డిందు కుద్యమిస్తాడు. తన ప్రజ్ఞాతిశయం వల్ల నూతన సంప్రదాయాలను విధిస్తాడు.

క్యూబిస్టు చిత్రకారులు సంప్రదాయాలు ధ్వంసించడంలోని రహస్యం ఇదే: సమకాలికుల అభిరుచుల మీద తిరుగుబాటు లేవనెత్తి గమ బాహ్యేంద్రియాలకు, అంతరింద్రియాలకు గోచరించిన పరమ సత్యాలను అపూర్వ పద్ధతులలో ప్రదర్శించారు. క్యూబిజం సాహిత్యం లోనికి కూడా ప్రవేశించి రచనా విధానాలను సమూలంగా ఉద్రూత లూపివేసింది. ఈ రచయితలు అన్వయం, అలంకారం, వ్యాకరణం, ఛందస్సు అన్నిటినీ అధిగమించి క్రొత్తక్రొత్త గమనాలు, లయలు, సంగతులు నిరూపించారు.

యుద్ధం రోజులలోనూ, యుద్ధం గడచిన క్రొత్త దినాలలోను బయలు దేరిన ఉద్యమం డాడాయిజమ్ (Dadaism). ఇది కేవలం విధ్వంసనమే, నిరసనమే. నిరాకరణమే పనిగా కలది. ఏది వ్రాసినా నిష్ఫలం అనీ, మాటలకు అర్థం లేదనీ, ఏ మాటనైనా, ఏ అర్థంలో నైనా ఉపయోగించవచ్చు ననీ ఈ వర్గం వారు బోధిస్తారు. ఏదో ఒక అక్షరం తీసుకొని దానితో ప్రారంభించే మాటలతో ఒక రంగవల్లిక తయారు చెయ్యడం, ఒక్కొక్క మాట నుండి ఎన్నోవిధాల ఎన్నో అర్థాలు సాధించడం, వార్తాపత్రికలలో మాటలు కత్తిరించి తిరిగి వాటిని ఇష్టం వచ్చిన క్రమంలో పేర్చి పద్యం అల్లడం: సాహిత్యంలో అరాజకత్వానికీ అది పరమావధి అనవచ్చును.

ఈ యువకోద్యమాన్ని ఫ్రాన్సులోని పెద్దలలో ప్రముఖు లనేకులు ఆదరించారు. కరడు గట్టిన అలవాట్లను కరగగొట్టే మందుగాను, కవితా సామాగ్రిని పరుకొనడానికి శిల్పికి దొరికిన నూతన స్వాతంత్ర్యంగాను దీనిని అంగీకరించారు.

కాని సంహారమే ప్రధానంగా గల డాడా. నూతన సృష్టి ఏదీ చెయ్య లేక పోయింది. ఇది అంతరించిపోతూన్న సమయంలో దీనిలో నుండి క్రమశిక్షణతో సుతీక్షణ తేజస్సుతో బయలుదేరిన మహోద్యమమే సర్రియలిజం. డాడా వల్ల విడుదలపొందిన పదజాలం ఈ ఉద్యమంలో మళ్ళీ ప్రాణప్రతిష్ఠ పొందినది, దీనికి తోడు ఫ్రాయిడ్ సాగించిన మనస్తత్వ పరిశోధనలు సర్రియలిజముకు అమూల్యమైన తోడ్పాటు కలిగించాయి; ఈ ఉద్యమ ప్రవక్త ఆంద్రే బ్రెటన్ (Andre Breton) మనో విజ్ఞానంలో కృషిచేసిఉండడం ఒక విశేషం ఇతని రచనలు, వివరణలు, వ్యాఖ్యానాలవల్ల సర్రియలిజమ్ అమోఘబలం సంపాదించింది. అపస్మారక మనస్సు నుండి స్వప్నలోక రహస్యాలను సంగ్రహించడానికి చేసే ప్రయత్నమని సర్రియలిజమును నిర్వచించవచ్చును. ఒక్క కవిత్వంలోనే కాదు శిల్పం, చిత్రలేఖనం, చలన చిత్రాలు, జీవిత వ్యాపారా లన్నింటిలోను దీనిని వర్తింపజేయవచ్చును. దాలీ (Dali) బొమ్మలు, ఎల్వార్ (Elvard) గీతాలు, మాన్ రే (Man Ray) ఫోటో

గ్రాపులు, బ్యూన్వెల్ (Bunvel) చలన చిత్రాలు. అంద్రే బ్రెటన్ విమర్శలు కవనం ఈ ఉద్యమానికి శేఖర మైనవి.

కాని దీని నొక "విదేశ సరుకు"గా పరిగణించి తిరస్కరించడానికి వీలులేదు. రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళా ప్రపంచంలో సర్‌రియలిజమ్ (Surrealism) అట్టి దని చెప్పాలి. ఇది ప్రపంచ మంతటా అనేక శాఖోపశాఖలతో వర్ధిల్లుతున్నది. 1924లో మొట్టమొదట ప్రారంభ మయినప్పటి నుండి ఇది నేటి దాకా అవ్యాహతంగా సాగిపోతున్నది.

౨

నేను వివిధ దేశాల సాహిత్యక్షేత్రాలలో విజృంభిస్తూన్న ఇన్నియిన్ని నవీనోద్యమాలు, ఇన్ని యిన్ని భావపరిణామాలు భారతదేశంలోను, ఆంధ్ర భూమిలోను తమ ప్రతిధ్వనులను ప్రసరిస్తున్నవి.

ఆధుని కాంధ్ర కవుల రచనలను సరిగా అర్థం చేసుకోవడానికి వాటి వెనుక బాసటగా నిలిచిన ఇతర దేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాల జీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వ మేదో, కేవలం నిర్జీవ శుష్కానుకరణం ఏదో గుర్తించాలి.

ఒకటి మాత్రం నిశ్చయం. నేటి కవులు అసమగ్రత వల్ల పూర్వ సంప్రదాయాలను నిరసించలేదు. ఒక అశాంతి, అసంతృప్తి ప్రబలి అంచులను దాటే ప్రయత్నాలతో నానాముఖాల వీరు పరుగెత్తుతున్నారు. తాము నిరాకరించి వెనుక వదలిన సంప్రదాయాల నిజస్థితిని, అంతస్తత్వం వీరికి తెలియనిదికాదు. వాడుకభాష బోధించిన గిడుగు రామమూర్తి పండితుని కంటె గ్రాంథికాంధ్రాన్ని చులకితం చేసుకొన్నవారు లేరు. ముందు కాలపు అవసరాలను గుర్తించి ఇతడు, శృంఖలాలను తెగగొట్టి వేశాడు. ఆ మార్గం నుండి గురజాడ అప్పారావు ప్రవేశించి వాడుకభాషకు కావ్య గౌరవం ఆపాదించాడు. ఆధునికోద్యమానికి మూలవిరాట్టుగా ఇతనికి నవీన కవులు నివాళి ఇస్తారు. గద్యంలో ఇతని నాయకత్వం అందుకొని అనేకులు ప్రథమ

శ్రేణిలోనికి రాగల గ్రంథాలు ప్రాశాదు కాని వద్యంలో వాడుక భాష విజృంభించడానికి ఒక పురుషాంతరం పట్టింది. ఈ లోపున అచంచలంగా వాడుక భాషలో కవనం చెప్పినవాడు బసవరాజు అప్పారావు మాత్రమే. ఈ శ్రేణిలోనికే యెంకి పాటలు కూడా వస్తాయి, కాని యెంకి పాటల చుట్టూ సాహిత్యం ఏదీ పెరగలేదు. అందుకు కారణం సంఘంలో రావలసిన తిరుగు బాటు ఇంకా రాకపోవటమే.

ఇప్పుడిప్పుడు నవీనులు గ్రాంధికాంధ్రం వదలి వాడుకభాష స్వీకరించినట్లే పురాతన ఛందస్సులు వదలి ముత్యాలసరాలు, దండలు, మొదలైన గేయచ్ఛందస్సులలో రచనలు సాగిస్తున్నారు. గేయాలలోనే వాడుక భాష జీవితానికి సన్నిహితంగా వచ్చి ప్రాచీనరీతులలోని కృత్రిమత్వాన్ని సమయించి నవీనరీతుల స్వచ్ఛంద గమనాలను ప్రదర్శిస్తున్నది.

అక్కరలు, ద్విపదలు, ముత్యాలసరాలు మాత్రమే గాక భుజంగ ప్రయాతం వంటి వృత్తాన్ని 20 ఏండ్ల క్రితమే అబ్బూరి రామకృష్ణరావు గారు తమ ఊహాగానంలో ఉపయోగించారు. అంతేకాక ఆయన ఆ ఛందస్సులో స్వతంత్రించి నాలుగుకంటె ఎక్కువ పాదాలను రెండేసి పాదాలకే ప్రాసలనూ పాటించి దీని గేయ గుణం ఇనుమడింప జేశాడు. ఇది ఊహా గానంలోని "సాధుగీతి".

లతాంతాళి రాగంబులన్ బాడు వేటుల్
వసంతము కాంతి ప్రవాహమ్ము లందున్
నిసర్గాప్త శోభా వినీతిం బ్రియ మ్మై
కనుల్గట్టు చందాన కాన్పించు పూవుల్
కనుంగొన్నచో వేడి కన్నీళ్ళు రాలున్.
అలంకారము ల్లేని ఆ పూలముగ్ధో
క్తులన్ లీనమై పోయెదో సాధుగీతీ!

గేయాలలో మహాకావ్య లక్షణాలు చూపించినవారు విశ్వనాథ (కిన్నెరసాని పాటలు), నండూరి (యెంకిపాటలు), కవికొండల (శివరాత్రి

ప్రభు), కృష్ణశాస్త్రి, (ఏ గేయమైనా సరే), గీతపద్యం మీద సంపూర్ణ ప్రభుత్వం గల కృష్ణశాస్త్రి ఇటీవల వాడుకభాషలో ఈ ఛందస్సును అత్యద్భుతంగా మలచి చూపించారు.

బసవరాజు అప్పారావు గేయాలు ఏ సాహిత్యానికైనా శిరోధార్యమైనవి. ఇటీవలకొన్ని టాకీలద్వారా వీటికి ప్రచారం వచ్చి ప్రజాబాహుళ్యం అంతటిలోకీ వ్యాపించి, నిజమైన కవిత్వం ప్రజాహృదయంలోనికి సూటిగా ఏవిధంగా చొరబడగలదో విశదం చేశారు.

దువ్వూరి రామిరెడ్డిగారు ఆధునికోద్యమంలో గుడిప్రక్కను నిలుస్తారేమో గాని వీరు రససంపన్నమైన గేయాలు రచించి నిగిసత్వమైన కళాభిరుచి ప్రదర్శించారు; వీరి భావప్రౌఢత్వం చదివినవారు మరచిపోలేరు. చదవనివారు చదివి తీరాలి,

జీవనగంగా పావనతటంబున
చింతావటతరుమూలమునన్
ఏల యధోముఖివై గడతెంచెద
విచ్ఛిద యౌవన వనులన్.

అని ఇది ప్రారంభ మవుతుంది.

గ్రాంథిక భాషను విసర్జించినట్లే ఈ గేయాలను కూడా మన కవులు పరిత్యజిస్తారో? సాహిత్య పరిణామం గుర్తిస్తే ఇందుకు ఎంతో కాలం పట్టదని చెప్పవచ్చును. వచన పదాలలోనికి ఒక్క సుద్దుకృష్ణ మాత్రమే సాహసించాడు. అడివి బాపిరాజుగారు సాహసించలేము సందేహిస్తున్నారు. మల్లవరపు విశ్వేశ్వరరావు "స్త్రీ" అనే కావ్యంలోను. "చెప్పండి జవాబు" లోను వచనపు విరుపులతో రసవత్కావ్యం ఎలా సృష్టించ వచ్చునో ప్రదర్శించాడు.

నిస్సందేహంగా ఇకముందు పది సంవత్సరాలూ వచన గేయ కాలలో క్రొత్త పరిశోధనలకు వినియుక్తం కాబోతున్నవి. జ్వాల, ఉదయిని వంటి పత్రికలు (ఇవి ఆగిపోవడం తాత్కాలికమే అని ఆశించాలి) ఇట్టి అన్వేషణ లకు కర్మాగారాలుగా పనిచేశాయి. ఖండాంతర కవులు ఈ మార్గంలో పోయిన పోకడలు మొట్టమొదట వివరించాను. ఈ కార్యబాధ్యత వహించిన కవులు అక్కడక్కడ మాత్రమే తెలుగు దేశంలో కనబడుతున్నారు. దుర దృష్ట వశాత్తు వీరిని నిరోధిస్తూ బలిష్ఠమైన ఛాందసాలు పనిచేస్తున్నవి నవ్య సాహిత్యంలోని మితవాద సంస్థలను గూడ సహించలేని హ్రస్వదృష్టులు అనేకులు కనబడుతున్నారు తీవ్రవాదులు ఏకీభవించటం లేదన్నమాట కూడా వాస్తవమే. భావకవులలో అతివాదాభిప్రాయాలతో సానుభూతి కలవా రందరూ ఈ క్రొత్తవాహినులకు తమ బలం ఇచ్చి శ్రేణి తీసుస్తారని ఆశించ వచ్చును.

వచనగీతం అంటే చేతికి వచ్చిన వ్రాత కాదు. వ్యర్థపదాలు లేకుండా వచనం రాయడమే ఎంతో చిక్కు, అటువంటి అప్పుడు సమగ్ర సౌందర్యం గల వచన గీతం వ్రాయడం మరీ కష్టం. పద్యరచనలో ఛందస్సూత్రాలు కవులను కాపాడి నడిపిస్తాయి. వచనగీతంలో బైటినుండి ఇట్టి సహాయం రాదు. కవి తన అంతర్జగత్తులో నుండి మాత్రమే వల్లికలు కల్పించు కోవాలి. వచనగీతం తనరూపం తానే నిరూపించుకుంటుంది. అయితే దీని ప్రాశస్త్యం నిర్ణయించడానికి ఉపయోగించవలసిన ప్రమాణాలేవి? స్థూలదృష్టికి ఇట్టివేవీ లేవని తోచవచ్చును. కాని ఇవి కూడా సంగీత ప్రధానమైనవే. ప్రాచీన ఛందస్సులలో ప్రాచీన సంగీతం గోచరించినట్లే నవీనకల్పనలలో నవీన శ్రావ్యతలు గోచరిస్తాయి. క్రొత్తసంగీతం లోహ విహంగాల, పారిశ్రామిక యంత్రాల, ధూమనౌకల, విద్యుచ్ఛకటాల వివిధ విచిత్ర ఘోషలలో నుండి బయలుదేరుతున్నట్లే నవీనగీతాలు కవి యొక్క రసాత్మ నుండి అనేక ధోరణులలో ప్రవహిస్తాయి. ఇందుకు కారణం ఈ కాలపు పారిశ్రామిక యుగధర్మమే. వీటివల్లనే క్రొత్త

కవిత్వం ప్రోక్తమవుతుంది. వచన గీతానికి ప్రాణప్రదమైన లక్షణం గనున వైవిధ్యం. ఇది సంభాషణలోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణ విశేషాల మీద ఆధారపడి ఉంటుంది. శైలికి, రీతికి. సంబంధించిన సమస్యలెన్నో దీనినుండి బయలుదేరుతాయి. ఒక్కొక్క కవి తన సామర్థ్యంతో ఒక్కొక్క ప్రత్యేక గుణం ప్రదర్శిస్తాడు.

ఇంతవరకు నేడు నవకవిత బహిరాకృతి మాత్రమే చర్చించాను. ఇకమీద నేటికవులు స్వీకరించిన కావ్య వస్తువులను గురించి కొంత చెప్పవలసి యున్నది. నవీన కవుల దృక్పథం విస్తరిల్లిందని అన్నాను. వీరు ఆకాశం లోనికి వెళ్ళి నక్షత్రపథాల్లో విహరించి నక్షత్ర భూమికి కూడ చేరువగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటి కోణాలలోనికి కాంతికిరణాలు పంపిస్తు న్నారు. నగర జీవితం, పారిశ్రామిక పరిస్థితుల హృదయ విదారక దృశ్యాలు, పతనోన్ముఖమైన ప్రాత సంఘపు వికరస్వరూపం, తమ కావ్య వస్తువులుగా చేసుకొన్నారు. ఈ మార్గంలో వీరికి రష్యన్ ఫ్యూచరిజమ్ (**Russian Futurism**) ఆదర్శమవుతున్నది. మాయకోవస్కీ (**Mayakovsky**), పాస్టెర్నాక్ (**Pasternak**) మొదలైన కవుల రచనలు పీడిత లోకంలో వీరికి సానుక్రోశం కలిగించాయి. కుబేరవైభవం ప్రక్కనే కుచేల దారిద్ర్యం కనబడటానికి వీరు నిర్ఘాంత పోతున్నారు. ఒక్కసారి తనచుట్టూ చూస్తే సంఘదూషితులైన ప్రవాస జీవితులు, దరిద్ర భిక్షువులు, జీవనోపాధికి శరీర కష్టం తప్ప వేరే ఆధారం లేని కష్టజీవులు కానవస్తున్నారు. తమ కవితలో వారి దారుణ దృశ్యాలు ప్రదర్శించి లోకం కళ్ళు తెరవటానికి నేటి కవులు యత్నిస్తున్నారు.

కాని ఈ వివిధ విభ్రమాలకు కళవళపాటు పొంది ఈ పాత కాలపు వ్యక్తి ఇదంతా తన కర్థం కాదంటాడు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. ఆధునికత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థం కాలేదన్న మాట, ఇతడు కళ్ళు మూసుకున్నాడు. వెనుకబడి పోయాడు ! అసలితని ప్రపంచమే శిథిలమైపోయింది. ఇతనిని ఉన్న చోటనే వదలిపెట్టి నూతన

జీవితం హుటాహుటిగా తరుముకు వస్తున్నది. నవకవులు దీనినే ఆహ్వానిస్తున్నారు, దీనినే ఆరాధిస్తున్నారు.

[రేడియో ప్రసంగము]

—భారతి
బహుధాన్య—మాఘమాసము
1939, ఫిబ్రవరి.
సంపుటము 16, సంఖ్య 2.

స్వత సమావేశాలను నిషేధించి ఆంధ్రభాషా వికాసమునకు అడ్డుపడలేదు. రాజకీయాలతో ప్రమేయములేని వీరేశలింగ ప్రభృతుల నిరంతరకృషికి నిరోధములు కలుగలేదు. హైదరాబాదు రాష్ట్ర ప్రత్యేక పరిస్థితుల ననుసరించి ఆంధ్ర గ్రంథ పఠనాసక్తిని విద్యావంతులలో నిలిపిపోషించుటయే యొక ఘనకార్యమైనది. ఆంధ్రసారస్వత సంస్కృతుల వికాసమునకు అభివృద్ధికి యీ ఘనకార్య సాధనయే ప్రథమ సోపాన మైనది. ఈ దృక్పథముతోనే యీ ప్రాంతమందలి తెలుగుభాషా వికాసమును మనము అవలోకించవలసి యుండును.

అంగ్ల భాషా సంపర్కము లేని ఉర్దూభాషా ప్రభావమును గూడ మనము గమనించవలసియున్నది. హైదరాబాదులో ఉర్దూభాష రాజభాషయై, విశ్వవిద్యాలయ బోధనాభాషయై, విద్యాధిక ప్రపంచమున గణుతికెక్కినది. నలుగురు పెద్దలొకచోట సమావేశమైనచో వారి నాలుకలమీద ఉర్దూ సరస్వతియే నాట్యమాడినది. సంస్కృతాంధ్రములందు పాండిత్యము కలిగి, పల్లెటూళ్ళలో నివసించుచు, అధునాతన ప్రపంచమునకు దూరముగా నుండి, రాజాదరణ లేక, గ్రాసవాసోదైన్యమున కృశించుచుండిన పండిత బృందము మొదటివర్గము. కొలదియో, గొప్పయో పరిచయము ఉర్దూ, పార్సీ భాషలతో కలిగి లౌకిక ప్రపంచమున వ్యవహర్తలైన ఆస్తిపరులు రెండవ వర్గము. ఆంగ్ల భాషలతో యీ రెండు వర్గాలకు కూడ సంబంధము అల్పమే. అందుచేత తెలంగాణములోని ఆంధ్రభాషపైన ఆంగ్లభాషా ప్రభావము ఆలస్యముగా పడినదని చెప్పవలసి యున్నది. ఉర్దూభాష మరియు ఆంగ్ల భాషా ప్రభావాలు పూర్తిగా భిన్నమైనవి. ఆంగ్లభాషతో పోల్చినప్పుడు ఉర్దూ ప్రాయము కడుకొద్దిది. ఉర్దూభాష ప్రత్యేకత శృంగారము మరియు సూఫీ తత్త్వము. ఆంగ్లభాష ప్రపంచ విజ్ఞానమునకు ప్రాచ్య సాహిత్యమునకు ఆటపట్టు. ఉర్దూ అప్పుడప్పుడే పరిపాలకుల భాష యగుటకు ప్రాకులాడు స్థితిలో నుండెను. ఆంగ్లభాష సకల ప్రపంచమునకు వ్యవహార యోగ్యమై, వాడుకలోనికి వచ్చి యుండెను. కావుననే ఇండియా యూనియనులో ఆంగ్లభాష వలె హైదరాబాదులో ఉర్దూభాష పాఠకులను ఉత్తేజితులను జేసి, ఆంధ్రమహారాష్ట్ర కర్ణాటక వాఙ్మయములందు చెప్పదగిన

పరిణామాలను కలుగజేయలేక పోయినది. కావున హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్ర భాషా వికాసము పూర్వవాఙ్మయ పఠనము మీదనే యెక్కువ ఆధారపడవలసి వచ్చినది. భావకవిత్వపు వెల్లువ మరియు నవలారచన వ్యాసంగ ప్రవాహము తెలంగాణ క్షేత్రమున తక్కువగా పొంగిపొరలినట్లు కనపడుచున్నది. హైద్రాబాదులో ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము ముఖ్యముగా నాలుగు మార్గముల జరిగినట్లు స్పష్టము కాగలదు. ఒకటి చరిత్ర పరిశోధన, రెండవది విజ్ఞాన వాఙ్మయ నిర్మాణము, మూడవది కథానికా రచన, నాలుగవది ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య జరిగిన సంఘర్షణచే ప్రేరితమైన కవితా రచన.

తెలంగాణమున ఆంధ్రభాషా వికాసమునకు తోడ్పడిన సంస్థానాధీశ్వరులను ఈ సందర్భమున ప్రశంసింపవలసి యున్నది. ప్రభుత్వ విధానము ప్రజల భాషల అభివృద్ధికి ప్రతికూలముగా నున్న సందర్భమున నిజామునకు సామంతులై యున్నప్పటికిని గద్వాల, అమరచింత మొదలైన సంస్థానాధీశ్వరులు తెలుగు కవులను ఆదరించి,పోషించినారు. ఆధునిక యుగనిర్మాతలైన శ్రీ తిరుపతి వేంకట కవుల వంటివారు తమ సారస్వత జైత్రయాత్రల సందర్భమున యీ సంస్థానాలకు అరుగుదెంచి సన్మానములను పొందినట్లు నానారాజ సందర్శనము తెలుపుచున్నది. ఈ సంస్థానాలు మినుకు మినుకుమని తెలుగు భాషాదీపములు వెలుగుచున్న ప్రమిదలలో కొంత చమురు పోసి, ఆరిపోకుండునట్లు కాపాడిన గౌరవము సంపాదించుకొనినవి.

హైద్రాబాదు రాష్ట్రమున ఆంధ్ర సారస్వత వికాసానికి వెలుగుగల దారిని జూపిన విజ్ఞాని, ధన్యజీవి స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశమున విద్యాభ్యాసముచేసి, మహారాష్ట్ర భాషలో ప్రావీణ్యము గడించి, అక్కడ జరుగుచున్న వాఙ్మయ కృషిని అవగాహన చేసికొనిన ఆంగ్ల విద్యాధికులు. లక్ష్మణరావుగారు హైదరాబాదులోని ప్రత్యేక పరిస్థితులను పరిశీలించి, వాఙ్మయ వికాసానికి మూడు ముఖ్యమైన మార్గములను జూపించినారు. ఒకటి గ్రంథాలయోద్యమము. ఊరూర గ్రంథాలయాలను స్థాపించి నిరక్షరాస్యత అజ్ఞానములందు

మునిగియున్న ప్రజలకు విజ్ఞానము ప్రసాదించి, మన సాహిత్యపు రుచులను ప్రజలకు తెలియజేయవలసిన ఆవశ్యకతను గ్రహించి లక్ష్మణరావుగారు ఈ ఉద్యమానికి బలమైన పునాదులు వేసిరి. స్వయముగా హైదరాబాదులో కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము. హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషా నిలయములను స్థాపించిరి. తరువాత తెలంగాణాలో అనేక గ్రంథాలయాలు అవతరించి సభలు మరియు సమావేశాల ద్వారా మంచి చైతన్యము కలుగజేసి; అనేక యువ రచయితల భావనా శక్తికి దోహదము గావించి అమోఘమైన సేవ జేసినవి. చరిత్ర, విజ్ఞానము లక్ష్మణరావు గారు అభిమానించిన వాఙ్మయ విశేషములు, ఈ రెండు మార్గముల రచనలు గావించవలసిన ఆవశ్యకతను లక్ష్మణరావుగారు తెలంగాణ ఆంధ్రులకు తెలియజేసినారు. లక్ష్మణరావుగారి విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి హైదరాబాదు జన్మస్థానము. చరిత్ర పరిశోధనమున వారి అనుచరులకు ఏకలవ్య శిష్యులకు హైదరాబాదు ఆటపట్టైనది. ఈ ముప్పది సంవత్సరాల కాలమున ప్రకటితమైన గ్రంథజాలమును పరిశీలించినచో వానిమీద విజ్ఞానము మరియు చరిత్రలయొక్క ప్రబల ప్రభావము మనకు వెల్లడి కాగలదు. లక్ష్మణరావు గారిచే స్థాపితమై, వారి యనంతరము వారి స్మారకార్థము లక్ష్మణరాయ పరిశోధక మండలి యను నామకరణము పొందిన పరిశోధనాసంస్థ ఆంధ్రదేశ చరిత్రలో అజ్ఞాతముగా నున్న సత్యములను వెల్లడి చేయగల అనేక శాసనాలను వ్యయప్రయాసల కోర్చి, తిరిగి, పరిశీలించి, సేకరించి, పరిశోధించి, తెలంగాణ శాసనములను సంపుటముగా ప్రకటించినది. ఇంకను ఈ మండలి వద్ద ప్రకటించవలసిన శాసనము లెన్నియో కలవు. ఇది ఆంధ్రదేశ మంతయును గర్వించదగిన కృషి; ఆంధ్రభాషా వికాసమునకు అత్యంత ఉపయుక్తమైన సేవ

విజ్ఞాన చంద్రికా గ్రంథమండలియు తత్ప్రకటనలు అనేక ఇతర గ్రంథ మాలల అవతరణకు కారణభూతమైనవి. గోలకొండ, కిన్నెర, దివ్యవాణీ సుకృతి ప్రాసాదము. మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగకవి కంఠాభరణ కృషి ప్రచారిణి, శివధర్మ, విజ్ఞాన ప్రచారిణి, వేంకటేశ్వర. కావ్యమాల గ్రంథమాలలను ఈ సందర్భమున

పేర్కొనవలసి యున్నది అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి గ్రంథమాలలు కొద్ది వెలలో ప్రజలకు అవసరమైన విజ్ఞానమును ప్రసాదించు ఉత్తమ వచన గ్రంథములను ప్రకటించినవి. సాధన సమితి ఆంగ్ల విద్యా భూషితులైన యువకులు స్థాపించి నిర్వహించు సంస్థ. ఇందులో కథకులు అధిక సంఖ్యాకులు, ఈ సమితి తెలంగాణ రచయితల ఖండకావ్యములను, కథానికలను విరివిగా ప్రకటించి ప్రశంసనీయముగా భాషాసేవ జేయుచున్నది.'యువకులు నిర్వహించుచున్న మరొక సంస్థ యగు 'సాహితీ మేఖల' యొక్క ఆశయము కవితారచన, కావ్యప్రచారము ఇందులో కవులు అధిక సంఖ్యాకులు; నూతన భావాలతోపాటు యీ కవులు ప్రబంధపక్వతలో కూడిన శైలిని అలవరచు కొనినారు. ఈ యెడ్డాణములో పొదిగిన రత్నములు కొన్ని నిజముగా సానలుదీరియున్నవి. ఈ దశాబ్దములోనే అవతరించిన ఆంధ్ర చంద్రికా గ్రంథమాల, మరియు విజ్ఞానవర్ధనీ పరిషత్తులు సరిగా విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ఆశయాలతోనే కృషిచేయుచు. వివిధ విజ్ఞాన శాఖలకు సంబంధించిన మంచి గ్రంథములను ప్రకటించుచున్నవి. అభ్యుదయ యువకవులు సారథ్యము వహించుచున్న తెలంగాణ రచయితల సంఘము చేయుచున్న కృషి గూడ ఈ సందర్భమున ప్రస్తుతించ దగియున్నది,

భాషా వికాసమునకు పత్రికల ద్వారా జరిగిన కృషిని ప్రత్యేకముగా పేర్కొనవలసియున్నది. ఇండియా యూనియన్‌లోని పత్రికల కున్న స్వాతంత్ర్యములో నూరవభాగ మైనను హైదరాబాదు పత్రికలకులేకపోవుట జగత్ప్రసిద్ధమైన సత్యము, హైదరాబాదులోని రచయితలకు తగినంత ప్రచారము కలుగకపోవుటకును, ఇతరాంధ్ర దేశరచయితలతో వారికి పరిచయము కలుగక పోవుటకును, పత్రికా స్వాతంత్ర్యము లేకపోవుట యొక ముఖ్య కారణమని చెప్పవచ్చును. అయినప్పటికిని తీవ్ర ప్రతిబంధకాలను అధిగమించి కొంత కాలమైనను సేవజేసిన పత్రికలు కొన్ని కలవు. వీని పూర్వసంపుటాలను పరిశీలించినచో కథకులకు, కవులకు. వ్యాసకర్తలకు విమర్శకులకు. పరిశోధకులకు, నాటికా రచయితలకు, ప్రోత్సాహము నిచ్చి, యీ పత్రికలు భాషా వికాసమునకు తోడ్పడినట్లు విశదము కాగలదు. ఈ పత్రికల కృషి ఫలితముగా ఉన్నతవిద్య నభ్యసించిన యువకులు నూతనరీతుల భాషాసేవకు బద్ధ

కంకణులైరి, వీరిలో సకలాంధ్ర ప్రశస్తి గాంచిన కథకులు, రచయితలు క్రమముగా సిద్ధమైనారు. గోలుకొండ, తెనుగు పత్రిక, నీలగిరి, సుజాత, శోభ, భాగ్యనగర్, సారథి, ఆంధ్రాభ్యుదయము మొదలైన పత్రికలలో ప్రకటితమైన వాఙ్మయము హైదరాబాదులో జరిగిన భాషా వికాసమునకు మంచి నిదర్శనము. ఈ కాలమున ఆంగ్లభాషా పరిచయముతోపాటు ఆంధ్ర భాషలో ప్రావీణ్యము సంపాదించిన యువకులు ముందంజవేసి కథలు, గేయాలు, వ్యాసాలు మొదలైనవి వ్యావహారిక భాషలో రచింపసాగిరి, హైద్రాబాదు పోలీసు నాజీశక్తుల నగ్ననృత్యము,రజాకార్ల రాక్షస కృత్యములు, నిజాము నిరంకుశ చర్యలు, వీనిపైన తిరుగుబాటు యువకుల గేయాలలోను రచనలలోను శక్తివంతమైన శైలిలో వ్యక్తీకరించుటజరిగినది. సజీవమైన భాషలో కండగల కవిత్వ మీ సంఘర్షణ సాహిత్యమున సమృద్ధిగా అవతరించినది. ఈ రచనల సమీక్షకొరకు ఒక ప్రత్యేక వ్యాసమే వ్రాయవలసి యున్నది. ఇందుతోపాటు ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణము నందంతటను శాఖోపశాఖలతో విస్తరించి, వయోజనులకు రాత్రి పాఠశాలలను నిర్వహించి, పరీక్షలను నిర్వహించి, మన భాషలోని మంచి పుస్తకములను ప్రజా సామాన్యముచే పఠింపజేసి, స్వయముగా ప్రజలకు అవసరమైన విజ్ఞాన ప్రదములగు ఉత్తమ గ్రంథములను ప్రకటించి, దేశములో ఒక మంచి సాహిత్య వాతావరణము కలుగజేసి, రచనాశక్తికి సర్వవిధముల దోహద మొసగుచున్నది.

ఈ విధముగా హైద్రాబాదులో రచనావ్యాసంగము, ఆంధ్రభాషా వికాసము ఒక విశిష్టమైన ఫక్కిని జరిగినది. పరిశోధన, విజ్ఞానము, కథానిక, సంఘర్షణ యుగమునకు సంబంధించిన అభ్యుదయ కవిత్వము, తెలంగాణ రచనలలో ప్రధాన స్థానము నాక్రమించు చున్నవి. ఆంధ్రభాషకు, ఆంధ్ర సంస్కృతికి కృత్రిమమైన సరిహద్దులు పొలిమేరలు కల్పించుటకు వీలులేదు. అట్టి ప్రయత్నాలు నెరవేరగల అవకాశాలు అవతరించినవి. సమగ్రాంధ్ర దృక్పథముతో సాహిత్య కృషి జరుగవలసి యున్నది. అట్లు జరుగుచున్నది కూడ. కృష్ణా గోదావరీ తుంగభద్రలు సకలాంధ్రులకు సమష్టి స్వత్వము. నన్నయ, తిక్కన, పోతన మొదలగు మహాకవులు వివిధ ప్రాంతాలలో అవత

రించి ఆంధ్రభాషను ఆరాధించి నప్పటికని ఆంధ్రజాతి కంతకును వారు సమానముగా గౌరవపాత్రులై యున్నారు. వారి కృషి సకల ప్రాంతము లందలి ఆంధ్రభాష యొక్క అభ్యుదయమునకు మార్గదర్శకమైనది. ఈనాడు తెలంగాణము, రాయలసీమ, సర్కారు జిల్లాలలో జరిగిన సాహిత్యకృషిని అందరము కలిసి సమీక్షించుకొని ముందుకు అడుగువేయవలసి యున్నది.

—ఆంధ్రపత్రిక

విజయ సంవత్సరాది సంచిక, (1953-54)

సంచిక. 44.

# కవిత్వంలో క్రొత్తరీతులు—వచనములాంటి పద్యాలు

—శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు

'వచనంలాంటి పద్యా లేమిటి' అని ముందరే విరుస్తా రని నాకు తెలుసు. అటువంటివి లేకపోలే దని రుజువుపరిచేందుకు నేటికాలపు కవీశ్వరులలో వయోవృద్ధు లైన శ్రీ వేంకట పార్వతీశ్వరుల పద్యం ఒకటి ఉదాహరిస్తాను, చూడండి. వీరు 'కవిరాజహంస' లనీ, 'మధుర కవు' లనీ బిరుదు వహించినవారు. అయినా యిది వారే వ్రాశారు సుమండీ:

"రజనియా—నేజేయు ప్రార్థనను పెడచెవిం బెట్టి వెడలిపోయినది;
దీప కళికలా—సదమల కాంతుల దొరగి, వెల్ల మొగముతో గనబడు
చున్నవి;
మందిర మన్ననో—చెన్ను దొరగి చిన్నవోయిన వగను దోచు
చున్నది;
చూడ, నాకన్నులలోనె బళ్ళున తెల్ల వారి పోయినది;
నీవు దరిసెన మ్మిడియకే నేడు తలగిపోయితివి గదా!
తలుపులు తీసిన వటులే నిరర్గళంబు లై, యుండ ని, మ్మైన నేమి?
కనులు మూసి, నిను మదిలోఁ గాంతును ప్రభు!"

పైన ఉదాహరించినది సీసపద్యం. ఇది శుద్ధ వచనంలా ఉంది. గణవిభజన చేసి చూస్తే ఛందో లక్షణాలు నిర్దుష్టంగా ఉంటాయి. ఇది వచనంలాంటి పద్యం. ఇల్లాంటివి కాకుండా కేవలం 'వచన పద్య' మని ఇంకొకటి కూడా వుంది. అది ఒకటి ఉదాహరిస్తాను చూడండి.

"నాకు విచిత్రం బగు భావాలు కలవు.
నా కన్నులందున తెలిసోకపులు మయిప్రకాసోకపు లున్నవి.

నాయీ వచనపద్యా లనే దుడ్డుకర్రలతో పద్యాల నడుముల్
విరగ దంతాను.
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను;
ఇంగ్లీషుభాషా భాండారంలోనించి బందిపోటుంజేసి కావల్సిన
మాటల్ను దోస్తాను.
నా యిష్టం వచ్చినట్లు చేస్తాను
అనుసరిస్తాను నవీన పంథా....”

ఇది ‘పఠాభి’ అనే ఒక యువకవి వ్రాసిన ‘ఫిడేలు రాగాలు’ అనే పుస్తకంలోని మొదటి పద్యం. ఇది ఇందాకటి ఉదాహరణలాగ సీసపద్యం కాదు; మరి ఏ ఇతర ఛందస్సుకీ లొంగదు. ఇది శుద్ధ వచనం; అయినా ఇది ఒక పద్యం. రచయిత దీనిని ‘వచన పద్యం’ అని పిలుచుకున్నాడుగదా! ఈ కవి ఇల్లాంటి పద్యాలతో ఒక పుస్తకమంతా వ్రాసి ప్రకటించాడు. ఈ రచనలను ఆధునిక కవులు నవీన వైచిత్రితో కూడిన కావ్యసంపుటిగా ఆమోదించి వున్నారు. వచన రచయితలు ఈ ‘ఫిడేలు రాగాల’ ను వచన సాహిత్యంగా స్వీకరిస్తున్నామని చేయి చాపలేదు. కవులే వీటిని తమ సొరుగులోకి తీసుకున్నారు, అంచేత ఇవి కూడా పద్యాలే అని ధ్రువపడింది. ఇవి వచనం లాంటి పద్యాలే కాకుండా కేవలం వచన పద్యాలే అని కూడా అంగీకరించక తప్పదు.

దీనిని బట్టి ఛందోబద్ధమైన పద్యాలు వచనంలా వ్రాయాలంటే వ్రాయ వచ్చుననీ, ఛందోబద్ధం కాని శుద్ధ వచన పద్యాలు అనేవి కూడా ఉన్నాయనీ స్పష్టపడుతున్నది.

ఇందాకటి శ్రీ వేంకట పార్వతీశ్వరుల సీసపద్యంలో ఛందో లక్షణ లోపం గాని, రచనా సౌలభ్యలోపం గాని ఉందని అనడానికివీలులేదు. వారి పద్యం చేతకాని కుంటి నడక పద్యంకాదు. ఛందోలక్షణాలన్ని చేతికింద బంట్లుగా లొంగతీసుకున్న సిద్ధహస్తం అక్కడ గోచరిస్తూనే ఉంది. పైగా వారు తమ ఇతర కావ్యాలలో లయానిత్యమైన శ్రావ్య సీసాలు విరచించి

నట్లు చేసు వేరుగా చెప్పనవసరములేదు. అయినా ఒక సందర్భంలో వచనం లాగు ఛందస్సును నడిపించడం ఒకానొక విశిష్ట కౌశలంగా, అపూర్వ వైచిత్రిగా వారికి ఉపకరించింది. దేవునితో భక్తుడు ముఖాముఖని మాట్లాడు తున్న సంతృప్తి పొందే నిమిత్తం వారు ఈ వచన శైలి అవలంబించారు. అంటే కవిభావం యొక్క అభివ్యక్తతకు కవి వచనాన్ని అనుకరించడం వల్ల కూడా ఒక వైచిత్రిని సాధించగలడని తెలుస్తుంది. ఛందస్సు యొక్క సహజమైన నడకను అనుసరించడం ఏ రీతిగా ఒక కౌశల్యాన్ని తెలుపుతుందో అల్లాగే వచన స్వరూపాన్ని అనుకరించడం కూడా కవిత్వ రచనకి ఒక అలంకారంగా ఉపకరిస్తుందని రుజువవుతున్నది.

కవి తన భావాలను వ్యక్తం చేసే భాష కొన్ని కొలతలకి లోబడితే అది ఛందోబద్ధం అవుతోంది. ఆ కొలతల యొక్క పద్ధతులు ఒక్కొక్క ఛందస్సులో ఒక్కొక్క రూపంలో స్థిరపడిపోయి ఉంటాయి. ఒక్కొక్క ఛందస్సు ఒక్కొక్క ముగ్గులాంటి అల్లిక. శ్రీ వేంకట పార్వతీశ్వరుల సీస పద్యంలో ఆ అల్లికను త్రెంచి వేయకుండానే వచనాన్ని అనుకరించారు. పఠాభిగారి వచన పద్యంలోని అల్లిక స్థిరపడిపోయింది కాకుండా, స్వతంత్రంగా, ఏ వాక్యంలో ఏ కొంత అవసరమైతే అది ప్రయోగించుకుంటూ నడిచింది. అందువల్ల వారి రచనలో అల్లిక అసలు ఉన్నదా లేదా అనే అనుమానం కూడా కలుగుతుంది. అలవాటైతే, అందులోనూ కొన్ని గమనాలూ, కొన్ని శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ, కూడా మన కాళ్ళకు బంధం వేసి నిలబెట్టి కవిత్వభాషలో మాట్లాడుతాయి.

'మెరీనా' అనే పఠాభిగారి వచనపద్యంలో చివరిభాగం పరిశీలిద్దాం. మద్రాసు సముద్రతీరాన చీకటిపడిన తర్వాత నడిచే అవినీతిపరుల చర్యలను వర్ణిస్తూ వ్రాసిన ఆ వచన పద్యంలో పాదాలలో వుండే నడకలు గమనించండి

"రంగుల నలుసులు గల నల్ల తారులాగా"

"ఒకింత నే పగునరికి"

"శరీరాన్ని సవారి కిచ్చే జవరాళ్ళు"

"ఆంగ్లో ఇండియన్ అభాగినులు"
"అటూ యిటూ తటపటాయించుచున్న మర్యాదస్తుల మంద"
"ప్రకటించు చున్నవి తరంగాలు"

అన్నప్పుడు మొదటి సంయుక్తాక్షరంలోని రకారమూ, 'తరంగాలు' లోని రకారమూ ఒక యతికాని యతిని కల్పించు కుంటున్నాయి. 'బిగ్గరగా తమ యసమ్మతిని' అన్నప్పుడు కలిగే యమకం స్పష్టం. "గాలి ఏడుస్తూంది" అని లీలగా తేల్చి వేయడంలో జాలిపుట్టించే గుణం ఉంది.

"రగులుతున్నవి గగనంలోన....
భువి గార్చిన కన్నీటి చుక్కల్లాగ....
తారకలు"

ఇందులో 'గ' కారాల ఆవృత్తి జాలినీ, 'ర' కారంతో ప్రారంభమై అంత్యపదంలో తిరిగి దూరంగా పరుష మైన 'ర' కారం వెయ్యడం వల్ల కత్తి నూరినట్లు ధ్వనించి 'క' కారాల చేరికవల్ల బీభత్స తనోత్పాదకంగా పరిణమిస్తున్నది.

"కానీ మనుజుని మనస్సులో
రేగు తున్నవి రకరకాల కోరికలు"

ఈ తుది వాక్యంలో 'న' కారాల తంత్రీ నిస్వనం వల్ల నిస్పృహ జనించి, 'రకరకాల కోరికలు' అన్న చివరి భాగంలో మూడు హ్రస్వాక్షరాల వెంబడినే ఒక దీర్ఘాక్షరం, మరొక దీర్ఘాక్షరం వెంబడినే మూడు హ్రస్వాక్షరాలూ పేర్చి తద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసాల సాదృశ్యం చేకూర్చి నిజంగా నిట్టూర్పుతో పద్యం ముగించాడు కవి. ఇక్కడ తన నిస్పృహాపూర్వమైన నిట్టూర్పును పైన చెప్పిన అక్షరాల రంగవల్లికలో చిత్రించి, చదివే వాగు కూడా తెలియకుండానే కవిత్వ భావానికి అనువుగా నిట్టూర్పు విడిచే లాగ చేశాడు. ఇది ఛందస్సు కాకపోవచ్చు గాని, ఒక విశిష్ట మైన రచనా వైచిత్రి అని మాత్రం అంగీకరించక తప్పదు.

మొట్టమొదట మన ముదాహరించిన (శ్రీ) వేంకట పార్వతీశ్వర కవుల సీస పద్యం తన ఛందస్సు యొక్క సంకెళ్ళు దాచుకొని, స్వతంత్ర్యాన్ని నటించింది. (యువకవి అయిన పఠాభిగారి వచన పద్యం కేవలం స్వతంత్రంగా పుట్టి అడుగడుగునా అవసరమైన ప్రుుగ్గులు మాత్రం పెట్టుకుంటూ, కవి తానుభవం మనస్సుకు చెప్పిన గమనాన్ని స్వతస్సిద్ధంగా కాగితం మీద పెట్టింది. అయితే పఠాభిగారి పద్యంలో గమనపు సొగసులు తోసుకువచ్చి సగర్వంగా కనిపించవు. అడకువగానూ, అమాయకంగానూ తమ పని తాము చేసి ఊరుకుంటాయి.

కాని వచన పద్యాలు వ్రాసిన యువకులంతా ఇల్లా మర్యాదగా ఊరుకునే వారు కాదు. 'నయాగరా' అనే ఒక పుస్తకంలో రామదాసు అనే యువకవి వచన పద్యాన్ని నయాగరా జలపాతంలా నడిపించాడు. ఈ పద్యం నడక మాత్రాబద్ధ ఛందస్సులకు దగ్గర దగ్గరగా పోతూ పోతూ వెంట వెంటనే విడిపోయి స్వతంత్ర మార్గాన్ని సర్పంలా పరుగిడుతుంది.

"చరిత్రలో తిరిగిన మరణపు
తిరగట్లో
బియ్యపు గింజల్లా
నలిగి నలిగి
మండిన గుండెల్లో
కండలు ఎర్రని జండాలై
ఎగిరిన ఏ రోజున !

బాడుగ బండికి కట్టిన ఎద్దుల
మెడ పట్టెడ
గంటల గణగణలో
నినదించిన కంఠాలే

నిప్పుల రణ శంఖాలై
పగిలిన వీ రోజున !

*  *  *  *

జగత్తు ఒక సోల్జెర్ అడుగై
కదనానికి
కదలిం దీ రోజున !"

ఇల్లా పోయి పోయి ఇంకా ఎమంటాడు కవి :

"గట్టర్లలో అట్టడుగున
సోషిల్లిన దీనులార !

మరచక్రం తిప్పి తిప్పి
అరిగిన కేతులార !

మీ ఘర్మజలం అఖండ గోదావరిగా
పొంగిం దీ రోజున !

పురోగమించిన మీరే
తిరోగమించిన జెర్లీ !

భవిష్యత్తు మిమ్మల్నే
స్వయంవరం చేస్తున్నది !

మీ మెళ్ళో పూలమాల వేస్తున్నది !

మీ కళ్యాణానికి రణ ధనుస్సు
విరిగిం దీ రోజున !"

జర్మనీ రణ ధనుస్సు విరిగి రష్యాను విజయలక్ష్మి వరించిన ముహూర్తాన్ని కవి ఇంత ఆవేశ పూరితంగా ఈ వచన పద్యంలో వర్ణింప గలిగాడు.

శివ ధనుస్సు విరిచి శ్రీరాముడు సీతాకళ్యాణానికి సిద్ధుడైనప్పుడు వాల్మీకి కూడా రామాయణంలో ఇంత ఆవేశం చూపాడో లేదో! ఈ రచన స్వతంత్రంగా కాకుండా కేవలం మాత్రాబద్ధమై నడిస్తే శ్రీ. శ్రీ. గారి కొన్ని గేయాలలాగా ఒకే కొలతని చేంతాడులా నడిచేవి. ఇందులో పాదాలు అసమానమైనవిగా ఉండడం వల్ల విసిగించవలసినంత విసిగించకుండా నడవ గలిగా యనుకుంటాను. అయితే, ఈ పద్యంలో కవిని ఉద్రిక్తం చేసిన ఆశా భావం భారతదేశ వాసులకు సమకాలికంగా వాస్తవికానుభవం కాకపోవటం వల్ల రచనా విధానంలోని ఆర్భాటం అతిశయోక్తిగా గోచరిస్తుంది.

వచన పద్యాలలో కరుణరసం ఎంతటి తన్మయత్వాన్ని జనింప జేయ గలదో చూసేందుకు తిలక్ అనే మరొక యువకవి వ్రాసిన 'ముసలివాడు' అనే పద్యంలో భాగం ఉదాహరిస్తాను,

"కనుగూడులు నల్లనయి
పెను మ్రోడులు చల్లనయి
కీలు కీలుని బాధగా
నాడి నాడులు లాగగా
చలిగాలి చూరిలో కసరినటు
చలిచీమ మట్టిలో దొలిచినటు
వచ్చినది. మూగినది. ముసిరినది
ముసలితనము
ముసలివాణ్ణి, నాయనలారా,
ముసలివాణ్ణి.
పై కప్పు వంగిన డు
పాడిల్లువలె నిలిచి
వీధిపోయే వింత వింతల
చూసి, రోసి,
బ్రతుకొక్క ఆరిన వత్తి కొడిలా తలచి,
మిథ్యలా కలచి

గతించిన జితించిన
బ్రతుకులోనికి
చూసి, రోసి,
బ్రతుకొక్క ఆరిన వత్తికొడిలా తలచి,
మిథ్యలా కలచి
పెదవి సందుల వెగటు నవ్వును బిగబట్టి
కర్ర నానుకు సాగిపోయి
ఎముకల గూడుని
ముసలివాణ్ణి, నాయనలారా!
ముసలివాణ్ణి.
ఒకనాడు నే ప్రొఫెసర్ని
సామ్య వాదిని
గ్రంథకర్తని
అప్పుడు భవిష్యత్తు రంగు రంగుల వల
ఈనాడు గుండెలలో మెదిలే పీడకల,
నేడు కనుల సందుల నిరాశ,
మసిమసిగ సాగిపోయే
ముసలివాణ్ణి, నాయనలారా!
ముసలివాణ్ణి.

ఇలా ఈ పద్యం సోలుతూ, తూలుతూ, కాలు తడబడుతూ కర్ర పుచ్చుకు తొట్రుపాటుతో నడిచే ముసలివాని లాగే సాగిసాగి—

"చివరకు, చివరకు, అక్కడికే, అక్కడికే.
అది జీవిత పరమ సత్యం,
అది నాగరికత గమ్యస్థానం,
అది చరిత్రల సారాంశం.
అక్కడ చీకటిలో తరుగని చీకటి
దట్టపు చీకటి. సుడి తిరిగే చీకటి
పాములు బుసకొట్టే చీకటి

అక్కడికే అక్కడకే వెళ్ళబోయే
ముసలివాణ్ణి, నాయనలారా.
ముసలివాణ్ణి !"

అని ముగుస్తుంది.

ఇంతవరకు వచనం లాంటి పద్యాలు, వచన పద్యాలు కూడా ఆధునిక ఆంధ్ర సాహిత్యరంగంలో ఉన్నాయని రూఢి చేశాం కనుక, అట్టి సాహిత్యం యొక్క సార్థకత, పుట్టుపూర్వోత్తరాలూ, వాటివాటి స్వభావం మొదలైన విషయాలను గురించిన సమాలోచన క్లుప్తంగా చేయడం అవసరం.

తన రచనకి 'వచన పద్యం' అని నామధేయం చేసుకున్న పఠాభికవి తన మొదటి పద్యంలోనే 'ఇంగ్లీషు భాషాభాండారంలో బందిపోటు' చేస్తానని చాటి చెప్పుకున్నాడు. దీనిని బట్టి ఈ రీతి స్వతంత్ర పద్య రచనకి ఆంగ్ల సాహిత్య ప్రభావం మూలకందమై ఉంటుందని మనం ఊహించుకోవడంలో పొరపాటు ఉండదు.

ఆంగ్ల సాహిత్యంలో 'నవ్యరీతులు' అనే గ్రంథంలో శ్రీ అమియ చక్రవర్తిగారు నేటికాలపు ఆంగ్ల సాహిత్యంలో "Free Verse"—అంటే స్వతంత్ర ఛ్ఛందం చాలా విరివిగా ప్రయోగంలో వుందని చెపుతున్నారు. ఆంగ్లంలో ఈ విధానానికి ప్రాతిపదిక మిల్టన్, షేక్స్పియర్లు వ్రాసిన **Blank Verse** లోనూ, అంతకు పూర్వపు **Anglo-Saxon** సాహిత్యంలోనూ కూడా కనిపిస్తాయని అచ్చటి విమర్శకులు చెపుతున్నారట

ఒక ఆంగ్ల విమర్శ గ్రంథంలో ఆధునికుల స్వతంత్ర గమనాలను గురించి వివరిస్తూ ఇలా అన్నారు : "నీరసించిన కవిత్వ రచనా విధానాలకి చేతికర్ర తీసేసి తిరిగి స్వతంత్ర గమనం అలవరచి పునరుజ్జీవనం కలిగించడానికి ఈ విధమైన ఆధునిక రచనాపద్ధతి ఉపకరిస్తుంది.

రైమ్, మీటర్ మొదలైన ఛందో నియమాలు సాధారణంగా నిర్జీవమయిన కవిత్వాన్ని నిలబెట్టేందుకు ఉపకరిస్తాయన్నమాట నిజమే

అయినా, ఏ నియమమూ లేకుండా ఉత్తభావోద్రేకంతో నిండిన రచన— స్వతంత్ర రచన అయినా, అస్వతంత్ర రచన అయినా సరే—మంచి రచన కాజాలదు. స్వతంత్ర పద్యాలను పరిశీలించి చూస్తే వాటి గమన సౌందర్య ఛందోలక్షణాలను కేవలం తిరస్కరించడం మీద ఆధారపడదనీ, ఛందస్సులకు మూలకందమైన సూత్రాలలో వినూతనమైన ప్రస్తారాలను సమ్మేళనం చేయడం వల్ల ఏర్పడుతుందనీ తెలుస్తుంది,

కవిత్వంలో ఈ మార్పు ఆధునికత్వానికి ఒక చిహ్నంగా ఏర్పడిపోతోంది. ఆంగ్ల కవిత్వంలో నేటి కాలపు రచయితలు ఛందస్సులు బాగా నడుపగలవారైనా గానీ ఇలాంటి స్వతంత్ర చ్ఛందోరచన సర్వసాధారణంగా సాగిస్తున్నారు. మన తెలుగు కవిత్వంలో కూడా, ముఖ్యంగా 1930 సంవత్సరం తర్వాత గమనిస్తే ఇట్టి స్వతంత్ర రచన రానురాను పరిపాటి అయిపోయింది. ఇవ్వాళ యువకవులూ; నవకవులూ చాలా మట్టుకు ఈ రీతి వచన వర్ధ్యలే సృష్టిస్తున్నారు. క్రొత్త కవులలో మన పూర్వపు ఛందస్సులు తరుచుగా వ్రాసేవారు తక్కువ.

సాహితీ సమితి తొలిరోజులలో వృత్తాలు, గీతాలు బాగా ప్రయోగించారు. మిగతా తెలుగు ఛందస్సులు విరివిగా వినియోగించుకోలేదు. అంతే కాక అనేక విధాలైన గేయాలు అంటే మాత్రాబద్ధమైన చందాలు సృష్టించారు. ఛందోరహితంగా వ్రాయాలని ఆ రోజులలో కుతూహలంలేదు, తరువాతి తరం కవులు గణబద్ధమైన ఛందాలని వాడడం తగ్గించారు. మాత్రాబద్ధమైన నడకలలో కేవలం క్రమపద్ధతిని వ్రాయడం మాని, ఆ నడకలలో అనేక విధములైన తారుమారులు కూడిక తీసివేతలూ కల్పించుకున్నారు. భావోద్రేకం యొక్క అవసరాన్ని బట్టి నెమ్మదిగా నడపడం వేగంగా నడపడం గాని ఒక నడక చేయవలసిన పని అయిపోగానే మరొక గమనం ఎత్తుకోవడం. అందువల్ల పద్యం పూర్తి అయ్యేసరికి అనేక మాత్రా ఛందాల చాయలు తోపించడం గాని, ఇల్లాంటి కిటుకులు చాలా రకాలవి తమ రచనలలో ప్రతిబింబింప జేస్తూ వచ్చారు. ఇంతకన్నా ముఖ్యమైన

అంశం ఏమిటంటే, వీరి భాష యొక్క నుడికారం మాట్లాడుకొనే భాష యొక్క నుడికారానికి ఉచ్చారణకి, చేరికగా ఉండటం. ఈ మార్పులన్నీ తెలిసీ తెలియకుండానూ కూడా యువకవుల రచనలలో ద్యోతక మౌతున్నాయి, ఏ గమనమూ లేని వచన రచనగా దీనిని పరిగణించేందుకు వీలు లేదు. ఇందులో ఇంద్రధనుస్సులాగా అనేకరంగులు అనేక గమనాలు, అనేక అలంకారాలు, అనేక ఆలోచనలు, లోతు, వైశాల్యం, ఉద్రేకం మొదలైన గుణాలన్నీ కనిపిస్తాయి.

ఆంగ్ల కవిత్వంలో ఈ మార్పులను సమర్థిస్తూ విమర్శకులు ఇలా అన్నారు; సాంఘిక జీవితం యొక్క గమనం మారి, పరిసర పరిస్థితులు అనుకోని విధంగా వేగంగా మారిపోతూ ఉన్నప్పుడు మన అభివ్యక్తతకు ఆధారమైన భాషలోను, రచనా విధానంలోను కూడా నూతనమైన పరివర్తన కలుగుతుంది."

ఆధునిక యుగంలో సాహసం ప్రధానగుణం. మనం మార్పులకి వశం అవుతూ ఉన్నాం. మన మార్పులని అభిలషించి, ఆహ్వానిస్తూ కూడా ఉన్నాం. ఒక క్రొత్త విషయం తెలియగానే ఒకసారి విశ్వాసం వొదిలి పెడుతున్నాం. క్రొత్త పరిసరాలూ, క్రొత్త అనుభవాలూ ఏర్పడగానే పాతమాటలూ, పాత ఛందాలూ, వాటిని వ్యక్త పరచటానికి చాలనట్లు తెలుసుకుంటాము. సంఘ జీవితంలో క్రొత్త నిర్మాణ విధానం అన్వేషించి, వాటి ప్రయోజనాలని ప్రయోగం ద్వారా రుజువు చేస్తున్నారు.

పతనమైన ఆంధ్ర సాహిత్యాభిరుచిని ఆదర్శప్రాయం చేయాలని ఆధునికులలో మొదటి తరంలోని కవులు ప్రయత్నించి అభిరుచినీ, అనుభూతినీ ఒక స్వప్నలోకంలోకి తీసుకుపోయారు. ఆంగ్లసాహిత్యంలోనూ మొదటి ప్రపంచయుద్ధానికి క్రితం ఇలాగే జరిగింది. అప్పటి కవుల ఆదర్శప్రాయమైన ఒక దంత హర్మ్యాగ్రాన్ని కవితని బంధించారని నేటి ఆంగ్ల విమర్శకులు వర్ణిస్తారు. ఇప్పటి తెలుగు యువకవులు మన తొలిజాము స్వప్నాను భూతిని భూతలానికి దింపాలని యత్నిస్తున్నారు. కవిత్వాన్ని గగనలోకంలో కాకుండా వాస్తవమైన ప్రజాజీవితంలోనూ ప్రజల హృదయావేశాలలోనూ

నడివీధిలోనూ రాజకీయ సాంఘిక పరిసరాలలోనూ దర్శించేందుకు ప్రయత్ని స్తున్నాను. ఇప్పుడు ప్రజానీకం యొక్క జీవితం ఎక్కువ ప్రబుద్ధమై మెల కువగా వుంది. ప్రబుద్ధ జీవితంయొక్క మెలకువ లన్నీ కవిత్వ రచనలో ప్రతిబింబించాలంటే మన కావ్య సాహిత్యంలో ప్రచారంలో ఉన్న అయిదారు ఛందస్సులూ సరిపోవడంలేదు. పైగా అవి అతగడ ముూలేదు, అందువల్ల స్వతంత్రించి విషయభావాలకు అనుగుణమైన క్రొత్త గమనాలు కనిపెట్టుకు నవకవులు సంపూర్ణ వ్యక్తతకు మార్గాలు నిర్మించుకుంటున్నారు,

ఇది సామాన్యప్రజలకు కవిత్వాన్ని చేరువచేసే మార్గమే కాకుండా నూతన ఛందోరీతుల సృష్టికావడానికి గూడా ఈ ప్రయత్నాలన్నీ సహాక రిస్తాయి, ప్రతి నవకవీ వ్రాసే వచనపద్యంలోనూ కొన్ని కొన్ని నూతన ఛందో గమనాల యొక్క బీజాలు ఇమిడి ఉన్నాయని నా నమ్మకం. ఈ నూతన ఛందస్సులకోసం జరిగే అజ్ఞాతాన్వేషణ ఆయా రతయితల రచనల లోనే ప్రతిబింబిస్తూ వుంది, శ్రీ పద్మరాజుగారు "చీకటి"ని గురించి వ్రాసిన వచన పద్యంలో—

"జీవి జీవికీ వెనుకనున్న భావం
రూపొందిన ఏకైక రావం
అనుష్టుప్ ఛందమే-
వ్రాయని పద్యమైంది
నా జాగృతిలో"—అన్నారు.

ఆ 'వ్రాయని పద్యాన్ని' వారు వ్రాయడానికి పూనుకొనే టప్పటికి ఈ వచన పద్యం పుట్టింది, ఇది వారి కవిహృదయం యొక్క అభివ్యక్తత ఒక సోపానంగా ఉపకరించింది.

తిలక్ అన్నాడు ఒక వచన పద్యంలో—

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసిన
దయా పారావతాలు

నా అక్షరాలు ప్రజాశక్తి వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు"

వీరి వచన పద్యం అయినా, వీరి అక్షరాల పొందికలో దయా కరుణా, విజయోత్సాహం, అందం సమ్మిళితమైనా యనే ధీమాతో పలుకుతున్నా డీ కవి. శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు 'మహాకవి ఆశ్చర్య' అని ఒక వచన రచన చేశారు. ఆ రచనలో ఇమిడిన భావవైచిత్రి వల్లా, శైలీ వైచిత్రి వల్లా అది పద్యంలాంటి వచనం అయిపోయింది. దానిని కూడా నేను వచన పద్యం అని పిలుస్తాను. ఆ రచనలో చివరని వారు నేను ఇంతవరకు చెపుతూన్న సమర్థనల నన్నిటినీ క్రోడీకరించి కవిత్వ భాషలో చెప్పేశారు. చూడండి: "....ఛందస్సు (గాయత్రి సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అలే జరుగుతుంది. విధానంలో వికారం, మాత్రలు మింగడం నాకు చేత కాదు. అల్లికరంగవల్లి. అంకెలు మన సంకెళ్ళు. అడగవయ్యా. అర్థశాస్త్ర పండితుణ్ణి పర్వతం పండి బద్దలవుతోంది. లావా ... దేవీ ....

అన్నిటిలో అందం వుంది. అర్థం వుంది. కావలసినన్ని ఉపమానాలకి అక్కరలేనన్ని ఉపమేయాలు, ఎక్కడో పోలిక దొరుకుతుంది, ఎక్కడో చేతులు కలుస్తాయి, స్నేహం చేపడుతుంది, ఇంద్రనీల మణులను కరగించి ఎవరో సముద్రాన్ని సృష్టించారన్నారే, ఆ మాట రుజువు చెయ్యగలవా ? కార్మిక ఘర్మ కఠోర దారతలో కడలికి రూపం కలిగిందని నేనంటేనా కోపం. అదో దృక్పథం. అదో చిత్తవృత్తి. ఆ స్థితిలో అన్నీ క్షమిస్తావు. అన్నీ రుచిస్తాయి,

దృక్కోణం.

స్వప్నాలను కోస్తున్నాడు శస్త్రవైద్యుడు...... లలో మేఘాలలో .... యలలో, లోయలలో ఉన్నవి ఉంటాయి, పోయినవి పోతాయి, నీ కెందుకు బాధ ? బా....ధ....బా....అబ్బా....బా....బా....బా....బా....బాం....బాం ....బాం....బాంబు!"

ఈ శ్రీశ్రీగారి వచనంలో నేటి ప్రపంచంలోని ప్రసవవేదన, నేటి కవితా రీతులలోని ప్రసవవేదన, ధ్వన్యనుకరణంతో సహా బాంబులా బద్ధ యింది, ఈ వచనం వచనపద్య చమత్కారానికి ఒక అంచు, నూతన ఛందో నిర్మాణానికి ఒక ప్రాతిపదిక, నవ కవుల స్వతంత్ర స్వప్నాలకీ, స్వతంత్ర చ్ఛందాలకీ జటిలమైన భాషలోచెప్పే స్పష్టమైన ఒక సమర్థన,

పఠాభిగారి 'ఫిడేలురాగా'లనే వచనపద్య సంపుటానికి శ్రీశ్రీగారు వ్రాసిన పరిచయ వాక్యాలలో ఈ అభిప్రాయాలే మామూలు వచనంలో విమర్శకుడుగా మాట్లాడుతూ చెప్పారు, ఆ ముక్కలతో ముగిస్తాను, 'ఛందస్సుల చండ శాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది, కవి హృదయంలోని రాగాలాపన ఎట్టి తీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి. లయగ్రాహిలో వసంతవర్ణన, మహా స్రగ్ధరలో యుద్ధగీతం ఒకప్పుడుబాగానే నడిచాయి, నవ కవికి అనుకరణ అసహ్యం, క్రొత్తశక్తులు క్రొత్తరూపంలో సాక్షాత్కరించాలి."

ఈ క్రొత్తరూపమే ప్రస్తుతం మనం ఉదాహరించిన వచన పద్య విధానం అని నా మనవి,

[ఇటీవల మద్రాసు రేడియో కేంద్రమున నొసగిన ప్రసంగమునకు విపులీకరణము——మ,వి,రా,]

—భారతి,

వ్యయ, పుష్యము – జనవరి, 1947

సంపుటము 24 : సంచిక 1,

# సాహిత్య భవితవ్యం

—శ్రీ జి. వి. కృష్ణరావు

న సంసారస్య నిర్వాణాత్ కించి దస్తి విశేషణం
న నిర్వాణస్య సంసారాత్ కించి దస్తి విశేషణమ్॥
నిర్వాణస్య యా కోటిః కోటిః సంసరణస్య చ
న తయో రంతరం కించి త్సు సూక్ష్మమపి

—మూల మాధ్యమక కారికలు.

'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్' అని భర్తృహరి కాబోలు అన్నాడు. ఈ వాక్యం కొన్ని సంవత్సరాల క్రిందట విడ్డూరంగా కనిపించింది. "ప్రజాస్వామిక రాజ్యాలలో వ్యక్తులకు రాజ్యాలు లభించవు. కాని మంత్రిపదవులు, శాసన సభాసభ్యత్వాలు, రాయబారుల పదవులు, ఇంకా ఇతర పదవులు కోరుకోవచ్చును; లభించనూ వచ్చును. కాని, అవి అక్కరలేదు. కవిత్వం ఒకటి ఉంటే చాలు ననుకోవడ మేమిటి? ఇది ఆలోచించి అంటున్న మాటేనా?" అనినాడు అనిపించింది. ఏ కొలదిమంది మాత్రమో తక్క- తక్కిన సమాజమంతా నేడు ఇలాగే భావిస్తున్నది.

ఇంతకూ కవిత్వానికి గాని, మరితర లలిత కళలకు గాని ఇంత ఉత్తమ స్థానం ఇవ్వవచ్చునా? ఇవ్వవచ్చునంటే ఎందుకు ఇవ్వాలి? 'చాలుం జాలు గవిత్వముల్ నుడువుచో సత్యంబు సాధింతురా?' అని మరొక కవి ప్రశ్నిస్తున్నాడు. ఈ వాక్యం భర్తృహరి తాత్పర్యాన్ని అనుగమిస్తున్నదా ఖండిస్తున్నాదా?

కవిత్వ మంటే ఏమో చెప్పుకొనక యీ ప్రశ్నలకు సరియైన సమాధానం పొందలేము. మరి కవితా నిర్వచనానికి ప్రయత్నించటమంటే మహాకూపంలో పడటమే. అత్యంత ప్రాచీనకాలం నుంచి నేటివరకూ ఎందరో మనీషులు కవిత్వాన్ని ఎన్నో విధాల నిర్వచిస్తూ వచ్చారు. అవి సంవాదకమై అందరికీ ఆమోదనీయమైన నిర్వచనం కనిపించటం లేదు. ఒక వేళ ఆలాంటిది ఉన్నదేమో తెలియదు. కాని, కవిత్వం విన్నప్పుడు గుర్తించ వచ్చు ననుకొంటాను.

'ఇంతకూ కవిత్వాన్ని గుర్తించే మార్గాలేమిటి? అంత రాత్మయేమైనా చెబుతుందా? ఏమని చెబుతుంది? ఆ రహస్యం కొంచెం మాకు గూడ చెప్పండి' అని అనవచ్చును. ఎవరు ఎలా వెక్కిరించినా ఏది కాదో చెప్ప వలసింది హృదయమే. అయితే ఎవరి హృదయం చెప్పాలి? నా హృద యమా, మీ హృదయమా, సమాజహృదయమా?

నా హృదయం మీకుగాని, మీ హృదయం నాకుగాని, సమాజ హృదయం తనకు ప్రమాణంకాని అన్య హృదయం కాదు. ప్రత్యయనేయ బుద్ధులు పొందేది శాస్త్రార్థమైతే కావచ్చును గాని, కావ్యానుభూతి మాత్రం కాదు.

సరే కవిత్వ విషయంలో హృదయం ఏమి చెబుతుంది? శబ్దపూర్వక మైన రచన విన్నప్పుడు గాని, చదివినప్పుడు గాని సమాధ్యవస్థ ఏర్పడాలి ఆ సమాధ్యవస్థ కల్పించిన రచన కవిత్వ మౌతుంది. కల్పించదో, కవిత్వం కాదు. ఇప్పుడు సమాధ్యవస్థ అంటే ఏమో నిర్వచిస్తేనే కాని తాత్పర్యం బోధపడదు.

గ్రహణము, గ్రాహ్యము, గ్రహీత అన్న భేదాలు పోయి గ్రహణం మాత్రం మిగిలిఉన్న స్థితిని సమాధి అంటారు. ఇలా అనగానే ఏదో మాటల గారడీ ప్రారంభమైనట్లు కనిపిస్తుంది. దృష్టాంతం చెప్పుకొంటే ఈ చిక్కు తొలగుతుంది.

'ఒకసారి ద్రోణుడు తన శిష్యుల అస్త్రవిద్యా కౌశలం తేల్చుకొన గోరి పిట్ట బొమ్మను చెట్టుకొమ్మకు గట్టి ధర్మరాజాదులను బిలిచి—"మీరు ఆ పిట్టపై గురి పెట్టుకుని సిద్ధంగా ఉండండి; నేను చెప్పినప్పుడు కొట్టండి' అని హెచ్చరించాడట. అంత అందరూ విండ్లెక్కు పెట్టుకొని సిద్ధంగా ఉన్నారట. అప్పుడు ద్రోణుడు ధర్మరాజును సంబోధించి 'పిట్ట తల కనబడు తున్నదా?' అని ప్రశ్నించాడట. 'ఆఁ కనిపిస్తున్నదండీ'. – 'మరి నేనో?' – 'ఆఁ' –' మరి నీ తమ్ములు?' – 'ఆఁ –' వెంటనే ఆచార్యుడు అర్జునుని

సంబోధించి — 'పిట్ట తల కనబడుతున్నదా ? అని అడిగాడుట. ఆతడు అవునన్నాడట. 'మరి నేనో ?' అని ప్రశ్నించగా 'లే' దని ఆ శిష్యుడు చెప్పాడట, అర్జునునకు అప్పుడు ఏర్పడిన దానిని సమాధ్యవస్థ అంటారు.

ఇలాంటి సమాధ్యవస్థల కల్పిస్తున్నదానిని కవిత్వమని చెప్పుకో వచ్చును. అంటే పాఠకుడు బాహ్య ప్రపంచం మరచిపోయి రచనలో నిమగ్నుడు కావాలి. ఇలా అన్నప్పుడు ఒక ప్రశ్న అంకురించవచ్చును. లెక్కలు చేసుకొనే విద్యార్థి, శాస్త్రవిషయం గాఢంగా ఆలోచించే శాస్త్రకారుడు, పనిలో నిమగ్నుడైన శ్రామికుడు బాహ్యప్రపంచాన్ని మరచిపో తున్నారు. వారికి కల్పిస్తున్నవి కూడకవిత్వమవుతవా ?

కావు — అవి బాహ్య ప్రపంచాన్ని మాత్రమే మరపిస్తున్నవి కాని, సమస్య ఒకటున్నది. నేను ఉన్నాను, చేస్తున్నాను అన్న వాటిని మరపించటం లేదు. గ్రహణ గ్రాహ్య గ్రహీతృభేదం ఉంటున్నది.

కొన్ని సందర్భాలలో నేను అన్న జ్ఞానం లోపించ వచ్చును. తన్ను తాను మరచిపోయి ఒక విషయాన్ని గూర్చి ఆలోచించవచ్చును. అప్పుడు గూడ గ్రహణము గ్రాహ్యము అన్నవి రెండూ ఉంటున్నవి. కవిత్వ మని చెప్పబడే రచన చదువుతున్నప్పుడు పాఠకుడు తన్ను తాను మరచిపోతాడు. ఆ స్థితిలో తన సంగతి స్ఫురించదు. ఆరోగ్యవంతునకు శ్వాస ప్రశ్వాసాలు గమనంలో ఉంటవా ? కావ్యపఠనంలో గూడ అంతే. కావ్యార్థం మాత్రమే పాఠకుని మనో ముకురంలో భాసిస్తుంది.

అలా భాసిస్తున్నప్పుడు పాణినీయ ధ్వన్యాలోకాదులు పాటింపబడు తున్నవని కాని, ఉల్లంఘింపబడుతున్నవని గాని, కాళిదాసాదులు అనుకరింప బడుతున్నారని కాని తోచదు. గుణదోషాలు గూడ ప్రత్యేకంగా కనిపించవు. ఆసక్తులమై ఒక పుస్తకం చదువుతున్నప్పుడు అల్పమైన అక్షర స్ఖాలిత్యాన్ని గమనించము. అది జి. పి. బాడిలో అచ్చయిందో, ఇ. బి. బాడిలో

అచ్చయిందో, పాయింట్ టైపులో అచ్చయిందో అన్న విషయం స్ఫురించదు. ఇలాంటివే కావ్యానుభవ అనపేక్షకాలైన గుణదోషాలు.

ఆ భాసించే అర్థము ఏమిటి ? అది ప్రత్యక్షాది ప్రమాణసిద్ధమైన జ్ఞానం కాదు. రజ్జుసర్ప భ్రాంతి వంటి భ్రాంతి కాదు. ఒక్కొక్కప్పుడు ఇదా అదా అన్న సంశయం కలుగుతుంది. సాహిత్యానుభూతి అలాంటి సంశయ ప్రతీతి కాదు. స్వప్నంలో గజ తురగాదులను చూస్తాము. కావ్యంలో భావింపబడుతున్న అర్థం అలాంటిది కాదు' కనుకనే ప్రాచీనులు కావ్యమందు ఆస్వాదింపబడే అర్థం లౌకిక పదార్థ వ్యతిరిక్త మనీ, అది అనుకార ప్రతిబింబ ఆలేఖ్య సాదృశ్య ఆరోప అధ్యవసాయ ఉత్ప్రేక్షా స్వప్నమాయా ఇంద్రజాలాది విలక్షణ మనీ పాఠకునకు కలుగుతున్న అనుభవం సమ్యక్ జ్ఞాన భ్రాంతి సంశయ అనవధారణ అనధ్యవసాయ విజ్ఞానభిన్న వృత్తాంతాస్వాదన రూపసంవేదన మనీ అన్నారు.

ఇలాంటి అనుభవమే కాక రామాయణం, భారతం, షేక్స్పియర్ నాటకాలవంటి రచనలు మరికొంత విశేషానుభవం కలిగిస్తున్నవి. వానిని పూర్తిగా చదివేటప్పటికి పాఠకుడు ఆయా పాత్రలందు తన్మయీభావ స్థానీయావస్థ పొందటమే కాక విషయరహితమైన స్థితి పొందుతున్నాడు. ఆ స్థితి ఆర్య నాగార్జునుడు పేర్కొన్నట్లు చతుష్కోటి సదసదుభయానుభయాంశాలు, వినిర్ముక్తం, అందు ఏ దృష్టి ఉండదు. అదే నిర్వాణం. అట్టి స్థితి కేవలం కరుణం వల్లనో శాంతం వల్లనో మాత్రమే ప్రాప్య మేమో ననిపిస్తున్నది. కనుకనే కరుణం ఒక్కటే రసమని భవభూతి, శాంతమే మహారసమని అభినవగుప్తుడు పేర్కొన్నారు. వీ రిరువురకంటె అత్యంత ప్రాచీనుడైన నాగార్జునుడు కావ్యతత్త్వాన్ని ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ప్రవచించకపోయినా సర్వోపశమాన్ని ఉపదేశించటం వల్ల అతని మతంలో శాంతమే రసరాట్టని చెప్పుకోవచ్చును. కావ్యంవల్ల పొందబడుతున్న ఈ స్థితి సుషుప్తి, అపస్మారం, మదిరాపాన వైవశ్యం, మున్నైనన వాటికంటె ఎలా విశిష్టమని అనిపించ వచ్చును. సుషుప్త్యాద్యవస్థలలో పంచేంద్రియ

వ్యాపారం ప్రవర్తిల్లదు. కావ్యాస్వాదన కాలంలో జ్ఞానేంద్రియాలు జాగరూకాలై ఉండవి. చతురతుర సంయోగాదులు సాగుతుంటవి. అనౌచిత్యం అసంభావ్యత పొడకట్టగానే మనసు ఎదురుతిరిగి బాహ్య జగత్తులో వచ్చి పడుతుంది. కనుక కావ్యానుభూతికి సుషుప్త్యాదులకూ పోలిక లేదు.

ఇంతకూ ఇలాంటి కావ్యానుభవం దేనికి ? కూడు పెడుతుందా ? గుడ్డ ఇస్తుందా ? జాతిని వీర్యవంతం చేస్తుందా ?

కావ్యానుభూతి అలౌకికం. ఇలాంటి అనుభవం శాస్త్రాల వల్ల గాని. ఇతురసాస్వాదన వంటి భౌతిక భోగాలవల్ల గాని. లభించదు. ఈ అనుభవం అనన్యం. శాస్త్రాదులు అసంవృతిని (infinity) ఆమోదిస్తవి. కాని, ఆ అసంవృతి స్వరూపం అవి బోధపరచలేవు. కావ్యం అలా కాక పాఠకుణ్ణి మూర్త ప్రపంచం నుంచి అమూర్త ప్రపంచానికీ, అమూర్త ప్రపంచం నుంచి అసంవృతికీ చేరవేస్తుంది, అలా చేరవేయబడుతున్నప్పుడు పాఠకుడు పొందే ఆనందం ఇష్టార్థ ప్రాప్తివల్ల కలుగును. విమానంలో ఎక్కి తిరిగితే రాదు. చంద్రమండలంలో మొదటిసారిగా అడుగుమోపినా పొడమదు. సహృదయుడు పొందే ఆ అనుభవం అనుభవైకవేద్యం.

భోజ్య పదార్థాలకు ఉప్పు రుచి కల్పిస్తున్నట్లే మానవ జీవితానికి లలిత కళలే అర్థం, విలువ కల్పిస్తున్నవి. కసాయి వృత్తి యందు సాధారణంగా మనకు జుగుప్స కలుగుతుంది. ఆ కసాయి వృత్తి పాటించిన ధర్మవ్యాధునికి లోకపూజ్యత సంప్రాప్తించింది. వ్యాసభారతి లేకపోతే అది సాధ్యపడేదా ? అలాగే దొంగలను, దొంగతనాన్ని మనం క్షమించము. డాస్టవోస్కీ ఆనెస్ట్ తీఫ్ అన్న కథ వ్రాసి ఆ పశ్చాత్తాపరునికి మనచేత అశ్రుతర్పణం విడిపించాడు. లేడీ మాక్బెత్ అన్న కథతో మరొక రష్యా రచయిత దారుణబంధకిపై మన కరుణావృష్టి కురిపించాడు. మన దేశంలోని సామాన్య ప్రజానీకాని కున్న విలువలన్నీ రామాయణాలవల్ల కలిగినవే. శాస్త్రం వస్తువుల ప్రయోజనం నిర్ణయిస్తే, కవిత్వాది లలితకళలు వాటికి విలువలను కల్పించి వ్యవస్థీకరిస్తున్నవి.

కావ్యం పాఠకునకు తన్మయీభావం కలిగిస్తున్నది. కనుక, అది అతని సంకుచిత దృష్టిని పటాపంచలు చేసి మనోవైశద్యం కల్పించి, పశుత్వం దగ్గర నుంచి పశుపతిత్వం దాక సానుభూతితో గ్రహింపజేస్తున్నది. తన మూల సిద్ధాంతాలకు విరుద్ధాలైనప్పుడు ప్రియురాలి యుపదేశాలనైనా పాఠకుడు ప్రియతర వచనాలతో తప్పుకొని పోవచ్చును. కాని కావ్యమందట్లు గాదు కావ్యార్థమే హృదయమై పోతుంది. నాగార్జునుని పరిభాషలో చెప్ప వలసివస్తే సంసారానికి మూలభూతమైన దృష్టి సమూలం నశించకపోయినా శిథిల మవుతుంది. ఈ ప్రమాదం గుర్తించి ప్లేటో తన దృష్టి కనుగుణంగా వ్రాయని కవులను తన ఆదర్శ రాజ్యం నుంచి బహిష్కరిస్తానన్నాడు. మన అదృష్టం బాగుండి అతనికి ఆ అధికారం సంక్రమించ లేదు. నియంతృక రాజ్యాధినేతలు లలిత కళల కున్న యీ శక్తిని గుర్తించి వాటిని అనుశాసిస్తు న్నారు. దీనివలన లలితకళా ఖండాలు లోపించి వాటి ఆభాసాలు మాత్రమే అచటి ప్రజలకు లభిస్తున్నవి.

పురుషార్థాల పార్యంతిక ఫలం ఆనందమే కదా! ఆ ఆనందాన్ని సాహిత్యం అప్పటి కప్పుడే సహృదయునకు అందిస్తున్న దని అభినవగుప్తుని ఆభాషణం. అలా కాదు, కావ్యం ఉపదేశమే ఇవ్వాలనట మంటే అమృతం అక్కరలేదు, మకరందమే కావాలని కోరటమేకదా!

ఈ సందర్భంలో మమ్మటుడు జ్ఞప్తికి రాకమానడు.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే."

అని ఆయన అన్నాడు. కీర్తి, అర్థసిద్ధి, వ్యవహారజ్ఞానము, అమంగళ పరిహారణము కవిత్వ ప్రయోజనా లని అందలి అభిమానం కొలదీ ఆయన పేర్కొన్నాడు. కాని వాస్తవానికి ఇవి నైకాంతికాలు. కవులకు మార్గాలు చూపిన మహాకవులు నామరూపాలు లేకుండ నశించినట్లు చరిత్రనుబట్టి అను మానించవలసి వస్తున్నది. హోమరు భిక్షాటనం చేసి జీవించినట్లు ప్లేటో చెబుతు న్నాడు. వ్యవహారజ్ఞానం, శివేతరక్షతి శాస్త్రాలవల్లనూ సిద్ధిస్తవి. కనుక

ఆయన పేర్కొన్న ప్రయోజనాలలో అసందిగ్ధమైనది సద్యఃపరనిర్వృతి ఒక్కటే.

మరొక విశేషం—ఏ శాస్త్రానికైనా ఏ విద్యకైనా మూలం భావన. ఈ భావనను వర్ధిల్లజేసేవి స్వప్నాలు, కవిత్వాది లలిత కళలు మాత్రమే ఇంతకూ కవిత్వాది లలిత కళల వల్ల అలౌకిక అసంవృత్త్యనుభవం, జీవితానికి అర్థం, తృప్తి శైథిల్యం, సహానుభవం, సద్యఃపరనిర్వృతి, భావుకత లభిస్తవి.

ఇంతవరకూ సిద్ధాంతాన్ని బట్టి నిష్పన్నమైన కావ్యస్వరూపం చెప్పుకొన్నాము. కాని సిద్ధాంతానికీ, ఆచరణకూ తేడా ఎప్పుడూ ఉంటుంది. త్రిభుజంలోని మూడు కోణాల మొత్తం 180 డిగ్రీలు ఉండాలి. కాని కొలిచి చూచినప్పుడు కొంత వ్యత్యాసం కనిపించటం విద్యార్థుల కనుభవ సిద్ధమే. అలాగే కవిత్వ విషయంలో గూడ.

మనస్సు లక్క వంటిది. లక్కకు ఘనత్వము, శైథిల్యం, ద్రవము అని మూడు అవస్థ లున్నవి. ఘనత్వావస్థలో లక్క ఏ ముద్రనూ స్వీకరించదు. శైథిల్యావస్థలో వేసిన ముద్రను స్వీకరిస్తుంది. కాని, గట్టి ఒరపిడి కలిగితే ఆ ముద్ర నిలువదు. ద్రవావస్థలో మరొక ద్రవ్య కణం అందులో పడి ఘనీభవించినప్పుడు ఆ కణం రాపిడికి రాలక అందే నిలిచి పోతుంది.

మనస్సుకు గూడ ఈ అవస్థలు చెప్పుకోవచ్చును. కొన్ని రచనలను కబుర్లు విన్నట్లు వింటాము. శబ్దాలంకార ప్రధానమైన పద్య కవిత్వం, ఆమూలాగ్రం చదివించటం ఒక్కటే. విశేషంగా గలిగిన కథలు, నవలలు నాటకాలు, ఈ కోవలో చేరుతవి. కొన్ని రచనలు చదువుతున్నప్పుడు మనశ్శైథిల్యం కలుగుతుంది, ఈ స్థితిలో బాహ్య ప్రపంచం మరచిపోతాము, కాని తన్మయీ భావం కలుగదు. అహంతకు ద్రుతి ఉండదు. వర్ణక కవిత తెలుగు ప్రబంధాలు (తన్మయీ భావం కలిగించే ఘట్టాలు వినా), పా నాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపక చదివించే కథలు, నవలలు,

నాటకాలు, ఈకోవకు చెందుతవి. ఈమాట కొందరికి కోపకారణం కావచ్చును. కాని ఎవరి అనుభవాన్ని వారు పరిశీలించుకొని పఠన సమయంలో అహంత లయించినదో లేదో గుర్తుకు తెచ్చుకోవాలి. తన్మయులై వర్ణనీయార్థంలో కరిగిపోయామనుకొంటే ఈ పైని చెప్పినది అయథార్థమే.

ఇంక మూడవజాతి రచనలు సమాధ్యవస్థను కల్పించి అహంతను లయింపజేసి తమ పాత్రలలోనో, సన్నివేశాలలోనో, వర్ణనీయార్థాలలోనో దాదాపు మిళితం చేసివేస్తవి. ఈ స్థితిలో మనస్సు పూర్తిగా కరగిపోయిన లక్కవలె రచనా ప్రతిపాద్యాలైన అర్థాలన్నిటినీ తనలో లీనంచేసుకొంటుంది. ఇలా లీనమైపోయిన అర్థాలు ఆమరణం మనసులో నిలచిపోతవి. ఉత్తర కాలంలో తిరిగి ద్రవత్వం పొందినప్పుడు గూడ వెనుకటివాటిని కోల్పోక క్రొత్తవాటిని గ్రహిస్తుంది. ప్రాత వాటితో క్రొత్తవాటిని చేర్చుకొని పరిపుష్టి పొందుతుంది. ఈ స్థితిని కల్పించే రచనలకు లక్ష్యాలుగా కాళిదాసుని కావ్యాలు, సంస్కృత నాటకాలు, టాల్‌స్టాయి, డాస్టవోస్కీ, చెకోవ్, టాగూరుల ఉత్తమ కథలు, వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు, ఇబ్సన్, యు. జి. ఒనీల్, సింజ్, ఒకేసీల రూపకాలు పేర్కొనవచ్చును.

ఇక నాలవజాతి రచనలు సబీజ సమాజవ్యవస్థ కల్పించి క్రమక్రమంగా నిర్బీజ సమాధ్యవస్థకు కొనిపోతవి. ఈ రచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి కట్టకడపట విషయరహితమైన సమాధ్యవస్థ కల్పిస్తవి. సంస్కృతంలో భారత భాగవత రామాయణాలు, తెలుగులో భారతం, ఇంగ్లీషులో షేక్స్‌పియర్ విషాదాంత నాటకాలు, ముఖ్యంగా హేంలెట్,—కాఫ్‌కా వ్రాసిన ట్రయల్, కాజిల్ అన్న రచనలు ఈ కోవకు చెందుతవి. ఈ జాతి రచనలు ఉత్తమోత్తమాలు.

మొత్తం మీద సాహిత్యంగా పరిగణింప దలచిన రచనలను నాలుగు తరగతులుగా విభజించవచ్చును. మనఃకాఠిన్యం సడల్పక అసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు. మనఃశైథిల్యం మాత్రమే కల్పించేవి మధ్యమాలు, చిత్తద్రుతి కలిగించి తన్మయీభావ మాపాదించేవి ఉత్తమాలు. నిర్బీజ సమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు.

ఈ విభాగం సామాజికుల హృదయస్పందనంపై ఆధారపడుతున్నది. మరి యీ హృదయాలు మనస్సులు ఒకే స్థాయిలో ఉండవు. కొందరి మనస్సులు సుశ్లక్ష్ణాలు, మరికొందరివి యీషచ్ఛ్లథాలు యీషద్ద్రవాలు, వేరొక కొందరివి దుశ్శ్లథాలు, దుర్ద్రవాలు. దీనికి తోడు ఆగంతుకాలైన ఆదివ్యాధులు, కఠోరదృష్టులు, విక్లిష్టాలు, స్వాభావిక మానసిక స్వాస్థ్యమును చెరిచి కావ్యార్థాలను యథాతథం గ్రహించనీయవు. ఈ చిక్కులన్నీ పరిహరించటంకోసమే 'యేషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభావయోగ్యతాతే సహృదయ సంవాద భాజః సహృదయాః' అని అభినవగుప్తుడు నిర్వచించాడు. ఈ నిరుక్తిలోని కావ్యశబ్దాన్ని కొందరు సంస్కృత కావ్యానికి పరిమితం చేయాలంటారు. వీరు—"గుణాః ప్రమాణం నదిశాం విభాగః" అన్న సూక్తిని విస్మరించి సంవృతిని వరిస్తున్నారు. కనుక అభినవగుప్తుని నిర్వచనం యథాతథం గ్రాహ్యం.

ఈ సందర్భంలో మరొక అంశం సంస్మరణీయం. మానవుని మనస్సు కొంతవరకు అతని వయస్సుమీద ఆధారపడుతున్నది. బాల్యంలో వీరాద్భుతాలు రుచించినంతగా శృంగారాదులు రుచింపవు. యౌవనంలో శృంగారాదులు మరులు కొలిపినంతగా అద్భుతాదులు మరులుకొలుంపవు. కౌమారంలో కరుణాదులు నచ్చినంతగా ఇతరాలు నచ్చవు. వార్ధక్యంలో శాంతాదులు హత్తినట్లు శృంగారాదులు హత్తవు.

ఇంతవరకు పేర్కొన్న అంశాలను గమనించినప్పుడు రచనలలోని ఉత్తమోత్తమాది భేదాలను అసందిగ్ధంగా సర్వజన సమాదరణీయంగా నిర్ణయించటం దుష్కర మని బోధపడకమానదు. వ్యవస్థాభిలాషియైన సహృదయుడు రచనలలోని తారతమ్యాలను నిర్ణయించుకొనేటప్పుడు తన వయస్సును, అభిమతాలను స్మరించి, వాటికి విపరీతాలై ఇంతకు పూర్వం పేర్కొన్న అవస్థలలో కలుగుతున్న వాటినిబట్టి ఆయా కోవలకు చెందిన కృతులుగా పరిగణించవలసి ఉంటుంది. వయస్సు ముస్నగువానికి అనుగుణా

తైన రచనల విషయంలో పాఠకుడు తన నిర్ణయాన్ని ప్రామాణికంగా భావించుకోకపోవటం మేలు, దీనివలన ప్రమాదానికి తావుండదు.

విశిష్ట అనుభవ నిష్పాదకమైన సాహిత్య ప్రపంచానికీ, లౌకిక ప్రపంచానికీ సంబంధం ఏమిటి ? లౌకిక ప్రపంచవాసియైన కవి అలౌకిక అనుభవ ప్రతిపాదకమైన సాహిత్య సంసారానికి ఎలా ప్రజాపతి అవుతున్నాడు?

సాహిత్యం శబ్దరూపి. శబ్దాలు, అర్థాలు లౌకికాలు. వీటి గుణ దోషాలు లౌకికాలు. రసదోషాలు కూడ లౌకికాలే. కనుక సాహిత్యం గూడ లౌకికం కావాలి. ఇలా అన్నప్పుడు కొన్ని సందేహాలు కలుగక మానవు. కవిత్వంలో రెక్కల గుర్రాలు, చల్లని నిప్పులు, పగటి వెన్నెలలు మున్నైనవి ఉంటవి. లోకంలో కనిపించే కార్యకారణ భావం కావ్యలోకంలో కనిపించదు. లోకంలోని వస్తువులు సుఖమో, దుఃఖమో కలిగిస్తుంటే కావ్యంలోని అర్థాలు ఆనందం మాత్రమే కలిగిస్తున్నవి. కనుక సాహిత్యం లౌకికమెలా అవుతుంది ?

స్వప్నంలో ఈ విశేషాలు కనిపిస్తున్నవి. అయితే ఎల్ల స్వప్నాలు ఆనంద ప్రదాలు కావు కాని కదాచిత్కంగానైనా ఆనందప్రద స్వప్నాలు కలుగకపోవటం లేదు. ఇలాంటి స్వప్నం కూడ అలౌకికం కావాలి కాని స్వప్నం కూడ లౌకికమే. సాపేక్షాలు లేదా హేతుప్రత్యయ సంజాతాలన్నీ లౌకికాలే. జాగ్రదవస్థ లేక నిద్ర, నిద్ర లేక స్వప్నం ఉండవు. వాస్తవానికి జాగ్రదవస్థలో ప్రాప్తించిన అర్థాలే సంస్కార *ప్రాజ్ఞ సాగరనిలో (Unconcious) నిలిచిఉండి నిద్రితుని తీరని కోరికలచే ప్రేరితాలై తైజసుని

* జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః స్థూలభుగ్వైశ్వానరః. స్వప్నస్థానోఽంతః ప్రజ్ఞః ప్రవివిక్తభుక్తైజసః—యత్ర సుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం సుషుప్తస్థానం ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్చేతోముఖః ప్రాజ్ఞః—

(Preconcious) శాసనాన్నిబట్టి వ్యత్యయంపొంది స్వప్నంలో గోచరిస్తున్నవి. అంతేకాని, ఆ భావం నుంచి ఉత్పన్నం కావటం లేదు. కనుకనే యోగదర్శనం స్వప్నాన్ని భావిత స్మర్తవ్యంగా పరిగణిస్తున్నది.

కనుక స్వప్నంవలెనే కావ్యమూ లౌకికమే. లౌకికమైన కావ్యం అలౌకికమైనఅనుభూతిని ఎలా కలిగిస్తున్నది. ఈ ప్రశ్న కార్యకారణ భావం వలెనే అత్యంత క్లిష్టం, వివాదాస్పదం, బీజంవలని అంకురసిద్ధి అనుభవ ప్రసిద్ధం. అలాగే కావ్యపఠనం వలన అలౌకికానుభవం కూడా.

అయితే కావ్యావిర్భావానికీ. స్వప్నోద్భవానికీ కొంత సాదృశ్యంకనిపిస్తున్నది. అదూరవర్తి అయిన (స్వప్నానికి క్రిందటి పగటివేళగాని మూడు నాలుగు రోజులలోపల గాని జరిగిన) జాగ్రదవస్థాంతర సన్నివేశం అవలంబనంగా గొని స్వాపి అవాప్తకామం ప్రాజ్ఞ నిలీన సంస్కారాలలో తనకు అనుకూలమైన వాటిని మేలుకొలిపి వైశ్వానరునకు (Conscious) అవిరుద్ధమైన చతుర్విధాభినయం. పట్టించి, తైజసుని సమక్షంలో నాటకమాడిస్తుంది. ఈ నాటకానికి తీరనికోరిక కవీ, సూత్రధారుడూ అవుతున్నాడు. కోరికకు ఇష్టమైన సంస్కారాలు నటులు. ప్రాజ్ఞతైజసులు సామాజికులు. ఈ నాటక ప్రయోగంతో సంతృప్తి పొందుతున్నది ప్రాజ్ఞ తైజసులు మాత్రమే. మాండూక్యం ప్రాజ్ఞునకు దీనితో సంబంధం లేదని చెబుతున్నది, ఫ్రాయిడ్ ఉన్న దంటాడు. ప్రాజ్ఞునకు సంబంధం ఉన్నదా లేదా అన్న విషయం మనకు ముఖ్యంకాదు. వైశ్వానరునకు మాత్రం ఇందు కర్తృత్వం కాని, భోక్తృత్వం కాని లేదు. ఇది అటు మాండూక్యానికీ ఇటు ఫ్రాయిడ్‌కు సమ్మతమే. ఈ హేతువు వలన మందవేదనాలైన స్వప్నాలు వైశ్వానరుని ధారణలో నిలువవు. తీవ్రవేదనాలైన స్వప్నాలు వైశ్వానరునకు గుర్తుంటవి. స్వప్నాలు తీవ్రతర వేదనాలైనప్పుడు అతడు మేల్కొంటున్నాడు. వైశ్వానరునకు గుర్తున్న స్వప్నాలు అర్థరహితంగా విచిత్రంగా కనిపిస్తవి. సంగ్రహంగా చెప్పాలంటే స్వప్నాలు ప్రాయికంగా తీవ్రతమవేదనాలు కావు. పై జాగ్రదవస్థా బాధితాలు

అవుతున్నవి. వాటిలో సాధారణీకృతి ఉండదు. స్వాపి కోరుకొన్నప్పుడు కోరుకొన్న తీరున కోరుకొన్న స్వప్నాలు పొందలేడు. అంటే స్వప్నాలు స్వాపి ఇచ్ఛానువర్తులు కావు. వాటిని అతడు శాసించలేడు. అతడు వలదనుకొన్నా స్వప్నాలు రావచ్చు.

ఇక కావ్యావిర్భూతి—జీవితంలో విన్న విశేషం కాని, కన్న విశేషం గాని రచయితను ఆకర్షిస్తుంది. ఒక్కొక్కప్పుడు అది అతనిని కలవరపెట్ట వచ్చును. అలాంటి విశేషాన్ని రచయిత విడువక మననం చేస్తాడు. ఆ మననంతో. ఒక విధమైన దృష్టి భావతీవ్రత రచయితలో బయలుదేరుతుంది. దృష్టి ప్రబలమై విస్పష్టమైనకొలది ప్రాజ్ఞభూమిలో భావనలు మొలకెత్తుతవి. ఇలా బయలుదేరుతున్న భావనాంకురాలను వైశ్వానరగత ఔచిత్యానౌచిత్య జ్ఞానం, గుణదోష వివేచనా శక్తి పరిశీలిస్తూ అనర్థాలను సమయించి తక్కిన వానికి బలం సమకూరుస్తుంది. దీనితో భావతీవ్రత అధికమవుతుంది. అంటే తాపకశక్తి పెరుగుతుంది. తపనం అతిశయించిన కొలది జంతుసదృశమైన మనస్సు క్రమంగా కాఠిన్యం కోల్పోయి శిథిలమై ద్రవించిపోతుంది. ఈ క్రమంలోనే అహంత శిథిలమై ద్రవించగా వర్ణనీయార్థం విస్పష్టతరమైన చితీకృతి పొందుతుంది. అంటే మథితపయోధి నుంచి లోకోత్తర వస్తువు లుద్భవించి దేవదానవులను అద్భుతానందాలలో ముంచినట్లు మథిత ప్రాజ్ఞ సముద్భూత వర్ణనీయార్థాలు లోకోత్తరాలై భావిస్తూ ప్రాజ్ఞ తైజస వైశ్వానరులను ఆనందపరవశులను చేస్తవి. సంగీత లయతాళ నృత్తవశగతుడైన నటుడు మౌళిస్థకుంభ పరిరక్షణలో. ప్రోలుమాలనట్లు రచయిత ఆ స్థితిలో రచనా క్రియను మానడు. తనకు కలుగుతున్న అనుభవాన్ని అతడు వ్రాస్తాడు. అయితే రచయిత ఎప్పుడు వ్రాస్తాడు ? అనుభవం కలిగిన తరువాత దానిని గ్రంథస్థం చేస్తాడా ? లేక అనుభవిస్తూ గ్రంథస్థం చేస్తాడా? కాక రచనకు ఉపక్రమించిన తరువాత ఆ అనుభవమే రచనను నడుపుకొని పోతుందా ?

ఈ ప్రశ్నలకు ఇదమిత్థమని సమాధానం చెప్పలేము. ఇవి రచయిత స్వభావంమీద రచనమీద ఆధారపడుతవి. ధారణ కలిగిన రచయిత తన

కృతి చిన్నదైనప్పుడు ముందు ఆ అనుభవం పొంది ఉత్తర కాలంలో దా-
గ్రంథస్థం కావించ వచ్చును. లేదా కృతి పరిమాణంతో నిమిత్తం
అనుభవం పొందుతూ రచన సాగించవచ్చును—కాక మనస్సులో జరుగవ-
వ్యాపారమంతా కాగితంమీదనే సాగించవచ్చును.

రచయిత కావిస్తున్న యీ సృష్టికీ, స్వాపి పొందుతున్న స్వప్నా-
కొన్ని సాధర్మ్యాలు, మరికొన్ని వైధర్మ్యాలు ఉన్నవి. కావ్యార్థా-
స్వప్నార్థాలు జాగ్రదవస్థాంతర అర్థాల మీద ఆధారపడుతున్నవి. జా-
దవస్థ, లోకమూ లేక కవిత్వమూ లేదు. స్వప్నమూ లేదు. ఈ రె-
యందునూ బాహ్యజగత్తూ వస్తృత మౌతున్నది. కావ్య స్వప్నార్థా-
రెండూ విచిత్రాలు, లౌకిక ధర్మాతిక్రమాలు, ప్రమాతకు పా-
కారకాలు. ఈ రెంటి ఆవిర్భూతికీ మూలం ప్రాజ్ఞుడే. ఒకసారి పొం-
కళను యథాతథంగా స్వాపి వేరొకసారి పొందలేడు. అలాగే రచ-
ఒకసారి సృష్టించిన అనవధారిత కృతిని వేరొకసారి యథాతథంగా సృష్టి-
లేడు. కాకున్న ఆ తాత్పర్యంతో వేరొక కృతిని సృష్టించవచ్చును.

ఇక వైధర్మ్యాలు—స్వాపి తన తీరని కోరికలకు దాసుడై క-
క్రంటున్నాడు. కవి నిజ ద్రవణీయ దృష్టి ప్రచోదితుడై రచన సా-
న్నాడు. స్వాపికి కల అనివార్యం. అందలి వేదనలూ అనివార్యా-
కృతిసముద్భూతి అట్టిది కాదు. రచయితకు ఇష్టం లేనప్పుడు అతని సం-
వికల్పాల మీదనే ఆధారపడుతున్నది. కనుకనే 'అపారే కావ్యసంసారే
రేవ ప్రజాపతిః యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే' అని ప్రా-
నులు చెప్పాన్నారు. స్వప్నం వైయష్టికం దురవబోధం, మా-
జాగ్రదవస్థా బాధితం, కావ్యార్థం విశ్వజనీనం, సుజ్ఞానం అర్థవంతం, జా-
దవస్థాబాధితం. స్వప్నం కుంభగత నశ్వరదీపమైతే, కావ్యం స్నే-
స్నిగ్ధ వర్తులను వెలిగించే బాహ్యరత్న దీపం.

కవి శ్రుత దృష్టార్థ ప్రబద్ధుడై ద్రవణీయ నవ్య నవ్య దృష్టితో సమా-
వస్థ పొంది కృతి నిర్మిస్తున్నాడు. కావ్యార్థం ప్రాజ్ఞునిలో నుండి బయ-

చేరి తైజస వైశ్వానర గత సంస్కార పరిష్కృతమై పరిపూర్ణ రూపం పొందుతున్నది. కవి తన రచనలోని వైశ్వానర గత సంస్కార పరిష్కృతాంశం మాత్రమే వివరించగలడు గాని ప్రాజ్ఞ సముద్భూతాంశం వివరించలేడు, అంటే ప్రతిభా సముత్పన్నాంశం వివరించలేడు. దానిని మరొకనికి నేర్పనూ లేడు. ఛందో వ్యాకరణాలంకారాది శాస్త్రాలు గూడ ఇక్కడ తమ అశక్తనుఅంగీకరించక తప్పదు. 'రాజన్ భోజనం దేహి' అన్న నీరసవాక్యాన్ని ఏ శాస్త్రం కవిత్వంగా మారుస్తుంది ? ఒక్క కవి హృదయం మాత్రమే ఆ పనిచేయ గలదు. అయితే కవులందరు ఒకే తీరున దానిని కవిత్వంగా మార్చలేరు. కవిత్వీకృతి భిన్నత్వం పొందుతుంది.

ఇక లోకానికీ, కవిత్వానికీ కవికీ, లోకానికీ ఉన్న సంబంధము పరిశీలనార్హం. లోకానికి ఆద్యంతాలున్నట్లు గోచరించవు. విశ్వంయొక్క గమ్యం కాని విశ్వగత విషయ సంఖ్యా ప్రయోజనాలు కాని బోధపడవు. ఈ విషయాన్ని విజ్ఞాన శాస్త్రాలన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నవి. తత్త్వశాస్త్రాలలోని కొన్ని మతాలు దీనిని అంగీకరించక పోవచ్చును. అయితే ఇవి నాగార్జునుడు, శంకరుడు, కాంటుమున్నైనవారి ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. ఏది ఎలా ఉన్నా ఆకాశాన ఎన్ని నక్షత్రాలున్నవో, ఎందుకున్నవో ఎవరు చెబుతారు ? అగ్నికి ఔష్ణ్యం, జలానికి శైత్యం, పృథ్వికి గంధవత్వం. శిఖలకు ఊర్ధ్వ ప్రసారణం దేనికి అంటే సమాధానం దొరకదు. ఆయా గుణకర్మలు వానికి స్వాభావికాలని సరిపెట్టుకోవాలి. ఇలాంటి లోకం కార్య కారణబద్ధమై అభిన్న వ్యక్తుల అభిన్న ప్రవృత్తులకు హేతు వవుతున్నది. సాహిత్య సంసారం అపారమే కాని ఏకకావ్య ప్రతిపాదిత ప్రపంచం ఆదిమధ్యాంత సహితం—అందలి సన్నివేశాలు, పాత్రలు, పరిమితాలు, స్వప్రయోజనాలు. లౌకిక నియతి, కార్యకారణ భావం, కావ్యంలో ఉల్లంఘితాలవుతాయి. నదీ ప్రవాహంలో తామర బంటవి. అగ్నులు చందన శీతలా లవుతాయి, శిలలు ద్రవిస్తాయి. చెట్లు అశ్రుపాతం కావిస్తాయి. సహృదయులు విభిన్న ప్రవృత్తులయినా కావ్యం నియతంగా ఆనందం కలిగిస్తున్నది.

లోకానికీ, సాహిత్యానికీ, ఇన్ని వ్యత్యాసా లున్నా లోకం కావ్యానికి మూలమౌతున్నది. సూర్యకిరణం స్ఫటిక విశ్లేషితమై వర్ణసప్తకాన్ని ప్రసరిస్తున్నదిగదా, ఇక కవికీ లోకానికీ ఉన్న సంబంధ — లోకానుభవ సంపత్తివల్ల కవికి రాగాది రంజిత ద్రవణీయ దృష్టి ఏర్పడుతుద్ని. శ్రుత దృష్టి లౌకికార్థంవల్ల యీ దృష్టి ప్రబుద్ధమై కవికి సమాధ్యవస్థ కల్పిస్తున్నది, ఈ యవస్థలో అతని దృష్టి ప్రాజ్ఞనిరీన లౌకికానుభూతులకు ఆత్మానుగుణ దేశకాల పాత్రాదికముతో బాటు అది మధ్యాంతాలు కల్పించి కవిచే వాటిని ఆస్వాదింపజేస్తూ కృతిని రచింపజేస్తుంది, ఇలా శబ్దనిబద్ధమైన కృతి లౌకికం. ఆస్వాదనలో మాత్రమే ఇది ప్రాచీనులు పేర్కొన్నట్లు అలౌకికం. *

అనుభవసంపన్నుడైనా కవి ద్రవణీయ దృష్టి విరహితుడై సమాధ్యవస్థ పొందక కావ్యం నిర్మించలేడు. ఇందులో ఏది లోపించినా కావ్యత్వం లోపించకతప్పదు. పరినిష్ఠిత సమచిత్తులు లోకాన్ని ఆనందమయంగాదర్శించి పరవశులు కావచ్చును. కాని, అలాంటివారు కావ్యనిర్మాతలు కాలేరు గాఢదృష్టి కలితులు కర్మణ్యులు అవుతారే కాని తన్మయీభావం పొందలేరు తన్మయీ భావ యోగ్యత లేకపోవటంవల్ల వీరు కృతి నిర్మించినా అది శుష్కకాష్ఠం అవుతుందికాని కావ్యం కాదు. కావ్యాస్వాదనకు దృష్టి అక్కరలేదు కాని తన్మయీ భావయోగ్యత మాత్రం అవసరం.

ఆధివ్యాధి పీడితులు, క్షుత్పిపాసార్దితులు అయినవారు యోగానికి వలెనే కావ్య నిర్మాణాస్వాదనలకుఅనర్హులు, అశక్తులు. ఈ పరిశీలననుబట్టి సాహిత్య భవితవ్యాన్ని గూర్చి ఏమి చెప్పుకోవాలి ?

కావ్యావిర్భూతికి సమాహిత ద్రవణీయదృష్టి ఆవశ్యకం. కావ్యాస్వాదనకు పాఠకునియందు తన్మయీభావ యోగ్యతాస్తిత్వం ముఖ్యం. ప్రకృతి స్థితిగతులు వీటికి ఎంతవరకు పోషకంగా ఉన్నాయి ?

---

కావ్యార్థ నిష్ఠా రత్యాద్యాః స్థాయినః సంతి లౌకికాః,
దద్బోద్ధృ నిష్ఠా స్త్వపరే తత్సమా అప్యలౌకికాః
భక్తిరసాయనం—తృ. ఉ. 4.

1914 నుండి ఇంతవరకూ వాటిల్లిన ప్రపంచ యుద్ధద్వితయంవల్ల ప్రపంచ మేధావుల విశ్వాసాలు, ఆదర్శాలు, లక్ష్యాలు బదాబదలై అనవస్థితి పొందాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో విశ్వాసం ఉండేది. అణవాయుధాలు వచ్చిన వెనుక ఆ విశ్వాసం సడలిపోయింది. సాయుధ సంఘర్షణ పరిహరించ గలిగిన విశ్వకల్యాణ ప్రదలక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంత వరకూ వారికి ఒక విస్పష్టదృష్టి ఏర్పడలేదు. విస్పష్టదృష్టి లేనప్పుడు రచన ఎలా వెలువడుతుంది ? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది ?

వెనుకబడిన దేశాలకు ఈ చిక్కు లేకపోవచ్చును. అచటి రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, ప్రాచీన జాతీయ వ్యవస్థా సముద్ధరణం లోనో వ్యవస్థిత దృష్టి ఉండి ఉండవచ్చును. నిజానికి అలాగే ఉన్నది. కాని, ఆ దృష్టి ఆ ప్రాంతీయులకు నచ్చవచ్చునేమో, కాని అది విశ్వజనీం కానోల్లదు. కనుక ఆట్టి రచనలు విశ్వజనాదృతి పొందజాలవు. నిజానికి ఆ కృతులు ఆయా దేశపు ఎల్లలు దాటి అవతలికి పోవు, దీనినిబట్టి అగ్రగామి దేశాలలో గాని, ఉత్తమ కృతులు వెలువడటానికి బొత్తిగా అవకాశాలు లేవని భావించరాదు. సత్కావ్యావిర్భూతికి అవకాశాలు తక్కువని చెప్పటమే ప్రకృత తాత్పర్యం.

ఇక రెండవ అంశం – కావ్యత్వం ఆస్వాదనలోగాని నిరూఢం కాదు. నేటి ప్రజలకు భౌతిక భోగాలలో ఉన్న ఆసక్తి మరిదేనిలోనూ లేదు. ప్రభుత్వాలు గూడ తమ ప్రజలు సగటున తల ఒకటికి వాడుకొన గలుగుతున్న విద్యుచ్ఛక్తి, వస్త్రాలు, ఆహారపదార్థాలు, మందులు, కార్లు, నివేశన ప్రదేశాలు, రేడియోలు మున్నుగాగల వస్తువుల పరిమాణాలను బట్టి తాము సాధించిన అభ్యుదయాన్ని నిర్ణయిస్తున్నవి. బాధా విమోచన మేదైనా సేవ్యమే ననీ పరమౌషధమనీ రోగి భావిస్తున్నట్లే అధికారమో, ఐశ్వర్యమో తత్సాధనమో అనుగ్రహించే దేదైనా అభిలషణీయ మని ఈనాడు సామాన్య ప్రజానీకమంతా భావిస్తున్నది, ఇప్పటి జీవిత వ్యవసకూడా ఐశ్వర్య అధికారరూప

సద్యఃఫల మివ్వని కర్మను పూర్తిగా త్రోసివేస్తున్నది. కావ్యంవల్ల గాని తక్కిన లలితకళా ఖండాలవల్ల గాని లోకోత్తరానుభూతి కలుగుతున్నదే కాని లౌకికమైన సద్యఃఫలం మరొకటి కలగటం లేదు. కనుక భౌతిక భోగ లాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూరమౌతున్నది.

భౌతిక భోగాలు పరమార్థాలైనప్పుడు తృష్ణ పెచ్చుపెరగక తప్పదు. దాని వలన వ్యగ్రత, సంశయం, ఆందోళన, భీతి కలుగుతున్నవి. వీటివల్ల మైత్రి కరుణ తరిగిపోతున్నది. ఈ లోపంవల్ల పాఠకులు కావ్యపఠన కాలంలో పొందవలసిన సమాధ్యవస్థ పొందలేకపోతున్నారు. ఈ దుస్థితికి రాజకీయ పక్షాభినివేశాలు అపూర్వ దోహదం కల్పిస్తున్నవి. వివిధ దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు అవతరించిన తరువాత మత సాంఘిక సాంస్కృతిక రంగాలు స్వాతంత్ర్యం కోల్పోయాయి. తమ పక్షాలను బలపరచుకోవడానికి కమ్యూనిస్టు పార్టీలు విజ్ఞానశాస్త్రాల తత్త్వం నుంచి లలితకళల తత్త్వందాకా నిర్వచిస్తూ తదనుగుణంగా ఉన్నవే యోగ్యాలనీ, విరుద్ధాలనీ అభ్యుదయ నిరోధకాలనీ ప్రచారం ప్రారంభించాయి. ఆ పక్షాలను చూచి తక్కిన రాజకీయ పక్షాలు గూడ తమ తమ ఆశయాలకు అనుగుణమైన దురభిమానాలు రేకెత్తిస్తున్నవి. దీని మూలాన ప్రజలలో సహనం, తన్మయీభావ యోగ్యత క్షీణిస్తున్నది. ప్రాచీనులు జర్మనీమాంసకారులను సభాంతర స్తంభకుడ్య సదృశులనీ, రసాస్వాదనకు అయోగ్యులనీ అన్నారు. ఇవాళ అలాంటి వారు రాజకీయపక్ష దురావేశపరులంటే అతిశయోక్తి కాదేమో.

రాజకీయ పక్షాలకు నేడు రాజ్యం కూడ తోడవుతున్నది. అంతర్గత శాంతి, న్యాయ సంరక్షణమూ, విదేశదండయాత్రా ప్రమాద నిరోధమూ మాత్రమే తన కర్తవ్యమని 19 వ శతాబ్దాంతం వరకూ భావిస్తూవచ్చిన రాజ్యం 20 వ శతాబ్ది ప్రథమపాద అంతిమభాగం నుంచి వివిధ రంగాలలో విశేషాధికారాలను స్వాయత్తం చేసుకొని విశ్వరూప ప్రదర్శనం ప్రారంభించింది. అమెరికా (యు.ఎస్.ఎ) వంటి రాజ్యం కూడ సాంస్కృతిక రంగంలో ప్రవేశించి తన విధానానికి సమ్మతాలైన కృతులనే ఇతర దేశాలలో ప్రచా

రము చేస్తున్నది. ఇక కమ్యూనిస్టు రాజ్యాలు నిర్వహిస్తున్న పాత్ర చెప్ప నక్కరలేదు. ఆ దేశాలలో ప్రభుత్వానికి వంతపాడే కృతులే ప్రచురణభాగ్యం పొందుతున్నవి. ఆ ప్రభుత్వాలు రచయితలను లలితకళా స్రష్టలనూ పూర్తిగా అనుశాసిస్తున్నవి. ఆ అనుశాసనాన్ని ఉల్లంఘించిన కృతులు అణచివేయబడు తున్నవి. ఎదురు తిరిగిన రచయితలు కారాగారాలకు వెళ్ళక తప్పటం లేదు. భావ స్వాతంత్ర్యము లేనిచోట ఉత్తమ కృతులు ఎలా వెలువడుతవి? విప్లవా నికి పూర్వం తన సాహిత్యంతో ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన రష్యా ఆ విప్లవా నంతరం చెప్పుకోదగిన కృతులను ఉత్పాదించలేకపోయింది,

ప్రజాస్వామిక రాజ్యమైన భారతదేశంలో గూడ ప్రభుత్వం రాష్ట్ర స్థాయిలోను, అఖిలభారత స్థాయిలోను అకాడమీలను నియమించి తన అధికా రాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది. కొన్ని రాష్ట్రాలు పాఠ్యగ్రంథాలను గూడ తామే ప్రకటిస్తూ ప్రాథమిక విద్యనుంచి ఉన్నత విద్య వరకూ గల చదువు సంధ్యలను గుప్పిటబిగించుకొన్నవి. విశ్వవిద్యాలయాలు కూడ మరెంతోకాలం స్వతంత్రంగా ఉండవు. అయితే కమ్యూనిస్టు రాజ్యాలలో ఉన్న కఠిన శాస నాలు ఇంతవరకూ లేకపోవటం ఒక్కటే అభినంద్యం. ఇక మన అకాడమీలచే సమాదృతి పొందుతున్న కావ్యాల విశిష్టత ఎవరికి వారే ఊహించుకో వచ్చును. ముంజేతి కంకణం ఉండగా అద్దం దేనికి ?

ఇంతకు ముందే పేర్కొన్న వాటికంటె ప్రబలమైన విశేషం మరొకటి ఉన్నది. ఉత్తమ కృతుల ఆవిర్భూతికి సమాజంలో కొంత నిలకడ అవసరం. సాంకేతిక విద్యా విజృంభణంతో మున్నెన్నడూ ఊహించనంత త్వరితంగా ఏ ఒక దేశమందో కాక ప్రపంచమందంతటా విపరీత పరిణామాలు వస్తున్నవి. వెనుకటి సామాజిక వ్యవస్థలన్నీ బదాబదలయ్యాయి, నిన్నటి స్థితిగతులు నేడు లేవు. నేడున్నవి రేపుండవు. ఈ పరిణామం అంతంతకూ తీవ్రతరం, శీఘ్రతరం అవుతోంది. భౌతిక సుఖాలాలసుడైన మానవుడు ఈ విపరీతత్వరిత పరిణామాలకు స్వాగతం చెబుతాడే గాని శ్రేయోదాయకాలు కావని నిరోధం కల్పించగలడా ? మన దేశం శాంతిని కాంక్షించి పైనిక వ్యయం

తగ్గించుకొని తాను కోరుకొన్న మార్గాన జీవించటానికి యత్నించింది. కాని చైనా తన సైన్యాలను పంపి దురాక్రమణ జరిపింది. దీనితో ఆత్మరక్షణ కోసం మన దేశం సైన్యాన్ని పెంచుకోవలసివచ్చింది, అత్యాయిక స్థితిని ప్రకటించి చైనా అనుసరించిన మార్గాలే అనుసరించి యుద్ధ సన్నద్ధం కావలసి వస్తున్నది. స్వాతంత్ర్యం కాపాడుకో దలచిన దేశాలకు సాంకేతిక విద్యా బలిష్ఠ రాజ్యాల ప్రమాదం నుంచి రక్షించుకోవాలంటే ఆ సాంకేతిక విద్యాభివృద్ధి కంటె గత్యంతరం ఉన్నదా ? ఏది ఎట్లా ఉన్నా ప్రపంచవ్యాప్తంగా విపరీత పరిణామం మహాప్రవాహం వలె వచ్చిపడుతున్నప్పుడు ఏకైకంగా వ్యక్తులుగాని, రాజ్యాంగం గాని దానిని నిరోధించటం అసంభవంగా కనిపిస్తున్నది.

స్థితిగతులు ఇంత త్వరితంగా మారుతున్నప్పుడు రచయితకు గాని, పాఠకునకు గాని విస్పష్టదృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా ? ఈ ఇరుపక్షాలు విభ్రాంతులై ప్రతిదీ తాత్కాలికమని వాభావించవా? ఇంతమాత్రాన లలితకళాసృష్టి మొదలంట స్తంభించిపోతుందని చెప్పలేను. చెప్పరాదు. కాని జీవితం నిలకడలేక త్వరితగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోను తక్కిన లలితకళలలోను వస్తవి. సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాద శక్తి నూడ సన్నగిల్లక తప్పదు. వెనుకటిలోవలె నవ్యగ్రంథులు ఇకమీదట మూడు కాలాల పాటు నిలవటం అసంభవంగా కనిపిస్తున్నది. ఇంతకు మున్ను సమాదృతాలైన కృతులనే అయినట్లు, కానట్లు విశ్వవిద్యాలయాలు ఆదరించ వచ్చును. క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం నిలిచి ఆమీద విస్మృతిపథంలో లీనమైపోతవి. ఈ రచనలయందలి వస్తుశిల్పాలు కూడ పత్రికా వార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికా రచనమే (Journalism) సాహిత్యంగా చెలామణి అవుతుంది, ఈ లక్షణాలు ఇప్పుడే కొంతవరకు గోచరిస్తున్నవి,

—భారతి

ఫిబ్రవరి 1964

సంపుటము 41 ; సంచిక 2.